I

# ఉన్నవ వారి జీవితంలో కొన్ని ఘట్టాలు

జ. 4-12-1877 లో గుంటూరుజిల్లా, సత్తెనపల్లి తాలూకా, వేములూరుపాడులో జన్మించారు. వేములూరిపాడు, అమీనాబాదులలో ప్రాథమిక విద్య.

1892 : లక్ష్మీబాయమ్మతో అమీనాబాదులో వివాహం.

1897 : గుంటూరులో మెట్రిక్యులేషన్ పరీక్ష.

1900 : గుంటూరులో యంగ్‌మెన్స్ లిటరరీ అసోసియేషన్ స్థాపన: ఉపాధ్యాయ వృత్తి.

1902 : గుంటూరులో వితంతు శరణాలయ స్థాపన: వీరేశలింగం అధ్యక్షతన తొలి వితంతు వివాహం జరిపించుట.

1903 : గుంటూరులో న్యాయవాద వృత్తి.

1906 : రాజమండ్రిలో టీచరు ట్రైనింగ్ కాలేజీలో శిక్షణ: వీరేశలింగం వితంతు శరణాలయం పర్యవేక్షణ.

1908 : ర్యాలి కంపెనీలో ఉద్యోగం.

1912 : పూనాలో కార్వే మహిళా విద్యాలయం సందర్శన.

1913 : శ్రీ జొన్నవిత్తుల గురునాథంతో కలసి విశాలాంధ్ర మేప్ తయారుచేయుట: బాపట్లలో ప్రథమాంధ్ర మహాసభ ఆహ్వాన సంఘ కార్యదర్శిత్వం: 1916 వరకు ఐర్లాండు, డబ్లిన్‌లో బారిష్టరు చదువు.

**1917 :** మద్రాసు హైకోర్టులో న్యాయవాద వృత్తి; ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి ద్వయంలో ఒకరిగా ఎన్నిక.

**1922 :** గుంటూరు పత్రిక సంపాదకత్వం; పల్నాడు పుల్లరి సత్యాగ్రహం నాయకత్వం; మాలపల్లి రచన; రాయవేలూరు జైలు; విడుదల తరువాత శారదా నికేతన్ స్థాపన.

**1922-23 :** 'మాలపల్లి' రెండు భాగాలుగా బెల్లంకొండ రాఘవరావుగారిచే ముద్రింపబడుట; మద్రాసు గవర్నమెంటు 'మాలపల్లి' రెండు భాగాలపై నిషేధం; కాంగ్రెస్ స్వరాజ్య పార్టీలో చేరిక.

**1926 :** మద్రాసు శాసనమండలిలో శ్రీ కాశేశ్వరరావుగారిచే 'మాలపల్లి' నిషేధంపై చర్చ.

**1928 :** కొన్ని మార్పులతో 'మాలపల్లి' ప్రచురణకు అనుమతి.

**1931 :** ఉప్పు సత్యాగ్రహంలో జైలు శిక్ష.

**1935 :** మద్రాసు గవర్నమెంటు ఆంధ్ర విశ్వవిద్యాలయం వారిచే 'మాలపల్లి' ప్రచురణ, పాఠ్యగ్రంథంగా ఎంపిక.

**1936 :** మద్రాసు గవర్నమెంటు 'మాలపల్లి'పై రెండోసారి నిషేధం, పాఠ్యగ్రంథంగా తొలగింపు.

**1937 :** సి. రాజగోపాలచారి మద్రాస్ ప్రధానిగా తొలి కాంగ్రెస్ మంత్రి వర్గం చేత నిషేధ పుటుత్తరువులు రద్దు.

**1942-43 :** క్విట్ ఇండియా ఉద్యమములో జైలు శిక్ష.

**1956 :** లక్ష్మీబాయమ్మగారు మరణం.

**25-9-1958** శ్రీ లక్ష్మీనారాయణగారు నిర్యాణం.

# తొలిపలుకు

శ్రీ మహాభారత సాహిత్యేతిహాసములు మానవధర్మపరిణామము నందు దివ్యపర్వములు. కర్మపరాయణమైన ప్రవృత్తి ధర్మపరమై జ్ఞానపరిణామమును పొందుట పురుషార్థము. విశ్వసాహిత్యము, పురుషార్థసిద్ధికి సాధనము గాగల విధమును, కావ్యకళాదిరూపములను, మహాత్ముల స్వానుభవము విశదముచేయు చున్నది. వేదవ్యాసుడు సనాతన సంస్కృత సాహిత్యమును మహాభారతకావ్య రూపముననూ, ధర్మార్థకామమోక్షములకు, కర్మధర్మబ్రహ్మజిజ్ఞాసారాధన పరమైన, మానవధర్మ పరిణామసాధనముల ననుగ్రహించెను. ధర్మపరిణామమునకు ప్రవృత్తి నివృత్తి యోగారూఢములైన భారతసంగ్రామము లనవరతము సంభవములు. ధర్మసంగ్రామములు కురుక్షేత్రము లందువలెను సామాన్య సంసార గృహక్షేత్రములందును మానవధర్మ పరిణామమునకు సంభవములు. ఆది పర్వములు మహాకావ్య కళా విషయములందువలెను సామాన్య కావ్య కళా విషయములందును మానవధర్మ పరిణామమునకు సాధనములు. మహాభారతేతి హాసములందువలెను సామాన్యేతి హాసములందును శ్రీకృష్ణార్జునులు, ధర్మరాజ దుర్యోధనులు, కర్ణార్జునులు, సంజయ ధృతరాష్ట్రులు, భీష్మద్రోణులు, అశ్వ త్థామాభిమన్యులు, కుంతీగాంధారులు. ద్రౌపదీ సుభద్రలు, విదుర దుశ్శాసనులు, భీమ కీచకాదులు మానవధర్మ పరిణామమున కనంతములైన నామరూపములను సంభవించుచుందురు.

## తిక్కన భారతాంధ్ర సాహిత్యము

మహాకవులు స్వాత్మానుభవసిద్ధమైన సాహిత్యమును ధర్మార్థ కామ మోక్షపరమైన మానవధర్మ పరిణామమునకు సంధాన సంయోగములను జేయు టకు సమర్థులు. ఆదియుగమునందు వేదవ్యాసుడు సంస్కృత భారత కావ్య రూపమునను నిర్మించిన మానవధర్మ పరిణామము, కాలాంతరమునందు తిక్కన సోమయాజి ఆంధ్రమహాభారత కావ్యరూపమునను, ఆంధ్రత్వమునకు నిర్మిం చుట ఆంధ్ర సాహిత్యేతి హాసములందు దివ్యపర్వము. కైలాసగిరి గంగా యమునా కురుక్షేత్రవిలాస విలసితమైన భారత సాహిత్యము, తిక్కన రచన లందు శ్రీగిరి కృష్ణవేణీ గౌతమీ భద్రగిరి పినాకినీ వేంకటగిరి విలాస విలసిత మైన తెలుగు పరిణామమును పొందిన విధమున కాంధ్ర మహాభారతము నిదర్శ నము. ఆంధ్రావనియందు పర్యాప్తములయిన వైదిక జైన బౌద్ధశైవ వైష్ణవాది మత సంస్కారములు, భాషాప్రవృత్తులు, కావ్యరచనలు. ప్రజాజీవన విలాస

ములు, తిక్కనార్యుని కావ్యరచనా దీక్షావిధియం దాంధ్ర సంస్కారమ్ము బొంది, ప్రజాజీవన వాహినులను వికసింప జేసినవి. తిక్కన మహాభారతమ్ము నందలి భావములు, రచనలు, వృత్తులు, హృదయము తెనుగు సాహిత్య స్వరూప స్వభావములను పరిస్ఫుటము చేసినవి. తిక్కనభారత రచనకు కా... మృత సాధ్యమైన ఆత్మానందము, తెలుగు సాహిత్యము, ఆంధ్రావనిమోదము, భవ్యపురుషార్థము, విశ్వకళ్యాణము పరమార్థములు. ఆంధ్ర సాహిత్య హృదయ మైన—భేదములేని భక్తి, నిర్మలవృత్తి, తేటతెనుగు, జ్ఞానవైరాగ్యములు, భక్తిపారవశ్యము—తెలుగు సాహిత్యపరిణామమునుపొందిన విధమును గతించిన ౭౦౦ ఏండ్ల ఆంధ్ర వాఙ్మయ చరిత్రము వెల్లడి చేయుచున్నది. వర్తమాన కాలమునందును గత కాలమునందువలెను తెనుగు సాహిత్యము మానవధర్మ పరిణామమునకు సాధనమగుట తెనుగు సాహిత్యమునకు పరమార్థము.

## మాలపల్లి

శ్రీయుత ఉన్నవ లక్ష్మీనారాయణగారి మాలపల్లి తెలుగు సాహిత్యము మానవధర్మ పరిణామమునకు సాధనముగాగల విధమును హృద్యముగా నిరూపించుచున్నది. ఆంధ్ర సాహిత్య పరిణామమునందు మాలపల్లి నిరుపమా మైన గ్రంథము. సంగ విజయము మాలపల్లికి నామాంతరము. రెండు పేరులం దే పేరు సార్థకమైనను నీ గ్రంథము ధర్మపరిణామ నిర్ణయములం దొక మహా భారతము. రామదాసాశ్రమమైన మాలపల్లి ధర్మ సంరంభమునకు క్షేత్ర సంగదాసు సంకల్పితమైన శ్రీరామ మందిరము ధర్మసంస్థాపనాలయము. పరస్పరాశ్రయము లయిన సమర పరిత్యాగములు ధర్మపరిణామమునకు సాధన ములు. ప్రపంచావృతమైన రాజకీయ మత సాంఘికార్థికాది పరివర్తన పరిజ్ఞాన మునకు సాహిత్యము పరమార్థ సాధనము. మాటలు, భావములు, పదార్థములు, వృత్తులు, రసములు, శబ్దార్థాలంకారములు, కావ్యములు సాహిత్యాంగములైనను పరిపూర్ణమైన సాహిత్యము గావు. సాహిత్య పరిణామము పూర్ణయోగసాధ్యమైన ప్రజాజీవన పరిణామమునకు ప్రతిబింబము.

మానవ స్వాతంత్ర్య ధర్మ సంరంభమునందు సకలార్థసిద్ధికిని సాహిత్య మాధారము. పురాణ నవీన సాహిత్య సంరంభమునందు సాహిత్యోపాసనము దురారాధ్యము. ప్రజాజీవన వాహినులు కూలంకషముగను ప్రవహించునప్పుడు సాహిత్య రచనలందు పురాణ నవీనాచరణములను నిర్ణయించుట యసంభవము. వర్తమాన నవజీవనోదయ సమయమునందు నవీన మార్గములు సందియములకు మూలము లగుచున్నవి. సర్వతోముఖమైన మానవ స్వాతంత్ర్య ధర్మావతరణ మునకు స్వతంత్రసాహిత్యము మూలాధారము. వర్తమాన కాలము స...

౯జీవన వికాసమున కాధారములైన వర్ణాశ్రమ ధర్మములు, సాంఘికాచార వ్యవస్థలు, రాజ్యాంగములు, మత విశ్వాసములు, వృత్తులు, ధనార్జన విధానములు, ధర్మసాధనములు, సాహిత్య రచనలు మొదలగు సకల వ్యవస్థలును ...లములై పునర్నిర్మాణము నపేక్షించుచున్న విధమును ప్రపంచావృతమైన మహా పరివర్తనము విశదము చేయుచున్నది. ఉన్నవ లక్ష్మీనారాయణగారు మాలపల్లియందు సంకల్పించిన నవజీవన నిర్మాణ విధానము లాంధ్ర సాహిత్య సంస్కారమునందు నూతనాధ్యాయములు. తిక్కన సంకల్పించిన భారతాంధ్ర సాహిత్య మాంధ్రసాహిత్య పరిణామమును పొందుటకు గత కాలమునందు సంభవించిన ఘటనాఘటనములకు మూలస్కంధము. లక్ష్మీనారాయణగారు సంకల్పించిన మాలపల్లి ఆంధ్ర సాహిత్య ఘటనాఘటనముల పరిణామమునకు నిదర్శనము. ఒక సందర్భమునను రామదాసు చేసిన ఆత్మవిచార మాంధ్ర సాహిత్య పరిణామమునందు మనోహర దృశ్యము.

"......ఆ నగిరిగహ్వర వినిర్గతమై కృష్ణాలహరి వొకచోట రాళ్ళపై నెక్కుతుంది. ఒక స్థలమున కారడవిలో విటపివారముచే నాచ్ఛాదితమై దుమూత లాడుతుంది. ఒక కెలంకున సన్నగిలి చిన్న బాలికవలె ...ల్లాడుతుంది. ఒక తావున మడుగుగట్టి నిర్వేగమై నిలిచిపోతుంది. ఒక తెన్నను రౌద్రరూపిణియై పొంగి పొరలి వెల్లువలై సృష్టిసంహారం గావి...ది. ఒక పరుపున బంధింపబడి మందగామినియై ఆంధ్ర మాతృస్వరూపం ...ఆంధ్రలోకమునకు జీవనములు వర్షించి సర్వకళా ప్రదాయినియై, అంతర్థానము నొందింది. ఇవియన్నీ కృష్ణామాయి యొక్క విలాసము లయినట్లు యీ బ్రహ్మాండములన్నీ ఆ ప్రేమా సముద్రుని యొక్క లీలలే. కృష్ణుని బాలలీలలచే యశోద ముఖమున తాండవమాడిన ఆనందమే మహిష ముఖమున అవతరించింది. ఈ పటమునందలి కృష్ణుని ముఖస్మేరలేశమే వెంకటదాసు యొక్క చిరునవ్వు. ఇవి రెండూ దాసుకూ గేదెకూ తరుణోపాయము లనడానికి సందేహం లేదు."

## ఆంధ్ర సాహిత్యము

ఆంధ్ర సాహిత్య ప్రవాహము చిరకాలమునుండియును సజీవముగ ...ముగను ప్రవహించుచు నాంధ్రాభ్యుదయమున కుపచరించినది. ...త ప్రాకృత దేశ్యవాహినుల సంయోగ సాహచర్యము లాంధ్ర సాహి... హృదయామృతమును సహజముగను ప్రవహింప జేసినవి. సంస్కృత సాహిత్యము దేశ్య సాహిత్యాభివృద్ధికి ప్రతిబంధకముగ నేర్పడినను కాలక్రమమునన ...శ్య సాహిత్యమునందు లీనమై తెలుగు సాహిత్యాభ్యుదయమునకు

వినియోగపడినది. సంస్కృత పాండిత్యము దేశ్య పాండిత్య పరిణామము పొందినది. సంస్కృత వేదాంత సూత్రములు తెలుగు కీర్తనల పరిణామము పొందినవి. వైదిక కర్మకాండ వేదాంతభక్తి పరిణామమును పొందినది. రామానుజ బసవేశ్వరాదుల భక్తి మార్గము ప్రజాజీవనమునందు లీనమైనది. భక్తులన్ని కులములందును ప్రపత్తిని బగసిరి. సంస్కృత స్తోత్రములు తెలుగు పాటల పరిణామమును పొందినవి. వేదాంతజ్ఞాన మన్ని కులములవారికిని సమానస్వత్వ మయినది. తేట తెనుగున విజ్ఞానోపార్జనము జనసామాన్యమునకు సాధ్యమైనది. మహమ్మదీయ బ్రిటీషు ప్రభుత్వ విధానములును, ఉర్దూ ఆంగ్లభాషలును ఆరంభమునందు ప్రతికూలములైనను కాలక్రమమున నాంధ్ర సాహిత్యాభ్యుదయమునకు సాధనములైనవి. సజీవమైన ప్రజా సాహిత్యము నిర్జీవమైన పురాణ సాహిత్యము నావరించి వికసించుట ప్రకృతి ధర్మము. రాజులు మారినను, రాజ్యములు పోయినను, మతము లంతరించినను, గ్రామసీమలందు ప్రజా సాహిత్య జీవనము, నిమ్నోన్నతములకు పాలైనను, వికాసవంత మగుచున్న విధమును మాలపల్లి సరసముగను వర్ణించుచున్నది.

మంగళాపురము మానవధర్మ మంగళాపురము. రామదాసు, మహలక్ష్మమ్మ, లక్ష్మమ్మ, రామానాయుడు, సంగదాసు, వెంకటదాసు, జోతి, అప్పాదాసు, చౌదరయ్య, వెంకటయ్య, కమల, మోహనరావు, పంతులు, పౌలు, ఫాదరీలు, మానవధర్మ నిర్వాహకులు.

మానవుల మహత్త్వమునకు త్యాగవైరాగ్యములు, గుణశీలములు, ప్రేమ నిగ్రహములు, భక్తిశ్రద్ధలు మూలము లనియును భోగభాగ్యములు, కుల సంపదలు, ప్రజ్ఞాపాండిత్యములు, దంభాహంకారములు మూలములు కావనియును సనాతనధర్మేతిహాసములవలెను మాలపల్లి ధర్మేతిహాసమును విశదము చేయుచున్నది. కర్మయోగము భక్తి యోగారూఢమై మానవధర్మ పరిణామమునకు సాధనమయినది. శైవ వైష్ణవ భక్త బృందావనములందు జంగమదాసరులకు సాయుజ్యము సాధ్యమైనది. భాగవత భక్తావరణములందు జంగమదాసరులకు గురుపదములు సాధ్యములయినవి. మాలపల్లి భాగవత భక్తిపరాయణమైన మానవధర్మ పరిణామమునకు మనోహరమైన దృశ్యము.

## రా మ దా సు

రామదాసుని యుదంతము మహాభారతమునందలి ధర్మవ్యాధేతిహాసమును స్మరింప జేయుచున్నది. రామదాసు మాలపల్లికి, సంగవిజయంకు హృదయము; మాలదాసరి కులమువాడు; కష్టసుఖములందు సమత్వానుభవముగల స్థితప్రజ్ఞుడు; రాజయోగి; శ్రీరామభక్తుడు; కర్మయోగి; వేదాంతి; సంగవిజయమునకు సక-

సందర్భములందును ధర్మసాధకుడు. రాముడా ననుభవించిన దుఃఖపరంపరలు రాగద్వేషములను, మమకారాహంకారములను, మానాభిమానములను జయించి ఆత్మవిజయమునకు సాధనములయినవి. రామదాసునకు యావదాస్తి పోవుట, సంగదాసు బలవన్మరణము, జెయిలు సెటిల్మెంటులందు నిర్బంధములు, జోతి అప్పాదాసుల సహగమనము, భార్యా మరణము, పీతికట్టలు, నిర్బంధ దండనములు, కర్మయోగసాధ్యమయిన ఆత్మోద్ధరణమునకు వినియోగపడినవి. నిష్కామకర్మ యోగాభ్యాసము రామదాసునకు "అంతా రామమయమె, అసహ్యించుకోవలసిందేమీ లేదు" అనే ధర్మమును సుబోధకము చేసినది. రామదాసు విజయకళాశాలలో కులపతియై, యోగీంద్రుడై బ్రహ్మైక్యమును బొందిన విధము సకల మానవులకును పురుషార్థమున కాదర్శప్రాయముగ నున్నది. సంగదాసుని ఆత్మత్యాగము విజయకళాశాల స్థాపనమును, రామదాసు యోగమును, దాన ధర్మములను, ధర్మవిజయమును సాధ్యము చేసినది.

## శ్రీరామకృష్ణులు

ఆదికావ్యమయిన రామాయణ మితరదేశభాషా సాహిత్యముల వికాసమునకువలెను ఆంధ్ర సాహిత్య వికాసమునకును విశేషముగను వినియోగపడినది. సీతారాముల దివ్యచరిత్రములు, శ్రీరాముని శౌర్య గాంభీర్యములు, వాల్మీకి కవనము భారతీయ సాహిత్యమునం దగ్రస్థానమును వహించినవి. శ్రీరామాలయములు పట్టణములందును, గ్రామములందును, మాలపల్లెలందును వెలసి శ్రీరామ తారక మంత్రము సకల జనులకును తారకమంత్రమైనది. శ్రీ రామ భజనలు, భజన మందిరములు సకల జనులకును సులభమయిన తరుణోపాయము లయినవి. వైదిక పండితుల కనంతమయిన కర్మకాండయును, సంపన్నుల కాడంబరములయిన శివకేశవాలయములును తరుణోపాయములయినను సామాన్యులకు శక్తి సంకల్పాను రూపములుగను కల్పితములైన శ్రీరామనిలయములు ప్రత్యక్ష తరణోపాయము లగుచున్నవి. రామదాసు లన్నికులములందును గలరు. శ్రీరాము డాంధ్రదేశమున కిష్టదేవతయని రామనామములు, రామభజనలు, రామాలయములు, రామకోటులు, సీతారామ కళ్యాణములు వెల్లడి చేయుచున్నవి. రామాయణ పరమయిన రామభక్తి భారత భాగవత పరమయిన శ్రీకృష్ణ భక్తి పరిణామమును పొందుట మానవధర్మ పరిణామమునం దఖండమయిన భాగవత తత్త్వాధ్యాయము. రామాయణమునందు సాపేక్షమయిన రామభక్తి భాగవతమునందు నిరపేక్షమయిన శ్రీకృష్ణభక్తి పరిణామమును పొందినది. భగవంతుని లీలావిలాసములు సృష్టిలయములందును, త్యాగభోగములందును భక్తిద్వేషములందును సందర్శనీయమయిన తత్త్వార్థమును భాగవత తత్త్వార్థము విశదము

చేయుచున్నది. లక్ష్మీనారాయణగారు మాలపల్లియందు “భారతకృష్ణుడు - భాగవత కృష్ణుడు” అను శీర్షిక క్రింద వర్ణించిన జోతి అప్పాదాసుల ప్రేమాధ్యాయము భాగవతతత్త్వార్థమును వివరించుచున్నది.

“భాగవతాది గ్రంథములలో కొందరు దైహిక మానసికానందములని భేదం గల్పించ ప్రయత్నంచేశారు. శ్రీకృష్ణునికైశోరమూ, అస్ఖలితబ్రహ్మచర్యమూ ఊతగా గొని దైహిక సంబంధ మసాధ్యమని నిరూపించారు. గ్రంథకర్తలు విశ్వప్రయత్నాలు చేసి శ్రీకృష్ణుని ప్రేమను భావనా ప్రపంచములో ప్రవాసం చేయించడానికి ప్రయత్నం చేశారు. నీళ్ళు పల్లానికి పారినట్లు, పావురం గూటి కురికినట్లు కవులం గికురించి భావప్రపంచ బంధాలను ద్రెవ్వి ధూర్త గోపాలుడు గోపకన్యలతో సైయాటలాడాడు. దైహికమానసిక ఆనందముల కభేదం నిరూపించాడు. శ్రీరాముడు తన విశ్వమయత్వం మరిచాడు. తాను విశ్వరూపుడను భావము విడుచుటచేత తన్ను గామించిన ఋషుల నానందింప జేయలేకపోయినాడు. స్వ పరకాంతా భేదం తెచ్చి పెట్టుకున్నాడు. మనుష్యవేషం ధరించి బాగా అభినయించాడు. కాని కృష్ణుడు విశ్వమయుడు. సర్వసంగ పరిత్యాగినులైన గోపికలను తనతోడి దైహిక మానసిక సాంగత్యములచేత ముక్తలను జేశాడు.



శ్రీకృష్ణుని కసాధ్యమేమీలేదు. మనము ప్రేమించినా ప్రేమించకపోయినా తన విధిగా చరాచరములైన సర్వభూతకోటులను ప్రేమిస్తాడు. గడ్డిమొలకనూ, పిపీలికమునూ, బ్రహ్మనూ, సమానమైన జాగ్రత్తతోనే పెంచుతాడు. ప్రేమించడమే అతని స్వభావం. ఆ విధంగానే గోపికలనూ నిన్నూ నన్నూ ప్రేమించగలడు. మనమూ ఆయనను సాకారునిగానూ, నిరాకారునిగానూ ప్రేమించగలం. కొందరు రాధాలోలునిగాను, మరికొందరు గోపీకాజారునిగాను ప్రేమిస్తారు. కొందరి మనస్సులు వేణుగోపాలునియందు తగుల్కొంటవి. సంగభావ రాసమండలములోని గోపికాంగనమై మాధవుల మధ్యవర్తియై ప్రేమించాడు. మరియు—



ఇట్లు మానసికంగా ప్రేమించుటలో యేమీ అసాధ్యం లేదు. మానవులు భౌతిక సౌఖ్యము లొసంగుటలో శక్తి తారతమ్యా న్ననుసరించి పరిమితమేర్పడవచ్చును గాని అపర్యాప్తమైన మానసికానంద మిచ్చుటకు ప్రతిబంధకా లుండవు.



అణువు మొదలుకొని మహత్తత్త్వం వరకూ వర్తులాకారములే. చలనం వర్తులంగానే వుంటుంది. బ్రహ్మాండానికంతా యెక్కడనో కేంద్రస్థానముంది. ప్రతి రేణువూ, సమస్త జీవరాసులూ కేంద్రాన్ని ఆధారం చేసుకొని సంచరిస్తుంటవి. మహత్తత్త్వానికి వొక్కటే కేంద్రం. బీజరూపాన వున్న విశ్వకుండలి సృష్టి వికసించినప్పుడు కోట్లకొలది భిన్న కేంద్రములు గల వ్యక్తులుగా పరివ్యక్తమవుతుంది. పరివ్యక్తమైన సృష్టి తిరిగీ సంకుచితమై అవ్యక్త ప్రకృతి అవుతుంది. సృష్టియొక్క సంకోచ వికాసాలు అనంతంగా జరుగుతుంటవి. వ్యక్తి కేంద్రాలు మహాకేంద్రంతో యేకత్వ మొందినప్పుడే ఐక్యసంధాన మవుతుంది. గోపిక లందరూ శ్రీకృష్ణుని ప్రేమించి యేక కేంద్రగతులయినారు. భక్తులందరూ శ్రీకృష్ణునితో కేంద్రైక్యమును పొందుతారు. బ్రహ్మాండ మంతటా ప్రకాశించే మండలా లన్నీ యేక కేంద్రగతము లైనప్పుడు సృష్టి మేళవించి వుంటుంది. ఆ మహాశక్తులు వొండొంటిని ప్రతిఘటింపకయే మేళవించి ఆనందమును కలుగజేస్తవి. పండువెన్నెల సృష్టిని మేళవింప జేస్తున్నది. జోతీ అప్పాదాసులు అన్యోన్య సంభాషణాకర్షణచిత్తులై కొంతవడి విశ్వాన్ని మరిచారు. సుధాకరుడు వారి హృదయాలను మేళవింపజేశాడు. ఉభయులూ యేకకేంద్రగతులైనారు. అప్పాదాసు ప్రేమచే వుత్తరంగితము లవుతున్న భావనాతరంగములలో వోలలాడుతున్నాడు. ప్రేమ మోక్షమును సమకూర్చింది.



జోతీ! నిన్ను ప్రేమించాను. నా ప్రేమసౌరభం బ్రహ్మాండమంతటనూ గుప్పించి తావులు వెదజల్లుతున్నది. ఆనందగీతమై అంతటా రమిస్తున్నది. ఆ సౌరభమూ గానమాధుర్యమూ నా హృదయానికి గోచరిస్తున్నవి. నా ప్రేమ పండువెన్నెలలో వ్యాపించివున్నది. పుష్పములలో వ్యక్తమై ప్రసరిస్తున్నది. నదీప్రవాహముల చిరుతరగలతో గుసగుస లాడుతున్నది. నా రాధవైన నీయందు విలీనమై నిలిచింది.

భక్తిప్రేమలు ఇంద్రియాతీతమైన ఆత్మార్థపరాయణమైనపుడు నిరతిశయాత్మానందానుభవమును ప్రతిపాదించిన భాగవతార్థమును మాలపల్లి సందర్భానుసారముగను ప్రతిపాదించుచున్నది. పురుషార్థసాధనములైన అర్థకామములు సంస్కారసంకల్పానురూపముగను ధర్మాధర్మ పరిణామమును పొందగల విధమునకు మాలపల్లి వ్యాఖ్యానముగ నున్నది. అర్థము ధర్మాత్ముల హస్తములందు దానధర్మములకును లోభులహస్తములందు పరపీడనమునకును వినియోగపడుచున్నది. చౌదరయ్యగారి క్రోధలోభము లాత్మనాశనమునకును రామానాయుడు వెంకటయ్యగారి దానధర్మములు ధర్మవిజయమునకును వినియోగ

పడినవి. కమల మోహనరావుల మోహము దుర్విపాకమును పొందినది. కమల మోహము సాహూ ప్రేమవిలాసములందు శ్రీకృష్ణలీలావిలాస పరిణామమును పొందినది. ప్రేమవిలాసములైన బాలకృష్ణలీలలు ధర్మప్రతిబద్ధములైన ప్రేష్మ తరంగములందు కామమోహము లంతరంగములం దంతరించగలవిధమును మాలపల్లి దృశ్యములు వ్యక్తముచేయుచున్నవి.

గ్రంథమంతయును బహువిధములైన ఆఖ్యానోపాఖ్యానములతో నిండి పండిత పామరజనాదరణయోగ్యముగ నున్నది. మాలపల్లియందు వర్ణించిన సెటిల్‌మెంట్లు, జైళ్ళు, కోర్టులు, బడులు, పోలీసు, ఖద్దరు, సహాయనిరాకరణము, ధర్మదోపిడులు, స్వరాజ్యము, పనిపాటులు, అహింసాధర్మము మొదలగు విషయములకు సంబంధించిన ఆఖ్యానోపాఖ్యానముల మూలమున మాలపల్లి ఒక మహాభారత మయినది. ఈవిషయముల పరిశీలనము జ్ఞానదాయకము. మాలపల్లి యందలి ప్రతిపుటయందును, భాషయందును, భావములయందును, రచనయందును, నవజీవనోద్యమములు గోచరమగుచున్నవి. చదివినకొలదియును పాఠకులు నవజీవన సాహిత్యప్రభావమును గ్రహింపగలరు.

## వాడుక భాష

లక్ష్మీనారాయణగారు మాలపల్లిని వాడుకభాషలో రచించడానికి పూను కొన్నట్లు 'పరిచయం' లో వ్రాసియుండిరి. వాడుకభాషకును, వ్రాతభాషకును గలసంబంధము సాపేక్షముగాని నిరపేక్షముగాదు. నేటివాడుకభాష రేపటి గ్రాంధికభాష యగుటయును, నేటి గ్రాంథికభాష కాలక్రమమున వాడుకలో నుండక మృతభాష యగుటయును సామాన్యవిషయము. సజీవమయిన ప్రజా సంఘమందు వాడుకభాష నిరంతరము గ్రాంధికభాషారూపమును పొందుచు సాహిత్యపరివర్తనము గలుగుచున్నది. భావవ్యాపనముతో భాషావ్యాపనమును అవసరమగుచున్నది. ఆంధ్రసాహిత్యసంస్కారమును పొందినమాట లన్నియును భావప్రకటనమునకు ప్రయోగ యోగ్యము లగుచున్నవి. లక్ష్మీనారాయణగారు వాడుకభాషయందు గ్రంథమును వ్రాయుటకు ప్రయత్నించినను నసాధ్యమైనవిధము గ్రంథములోనిభాగములు వెల్లడిచేయుచున్నవి. జను లుపయోగించెడి మాటలు సంస్కృతములైనను, ప్రాకృతములైనను, దేశ్యములైనను, అన్యదేశ్యములైనను సాహిత్యాభ్యుదయమునకు ప్రయోగయోగ్యములు. లక్ష్మీనారాయణ గారే "భాషయొక్క ప్రస్తుతస్థితిలో వాడుకభాషలో వ్రాయడంకంటే గ్రాంధికభాషలో వ్రాయడమే సులభంగా కనుపడింది. కాని అలవాటే దీనికి కారణము. జాతీయతెనుగుభాషలో పూర్ణమయిన పరిచయం లేకపోవడము రెండోకారణము" అని వ్రాసిరి. కాని భావప్రకటనమునకు తగిన తెలుగుజాతీయ

పద్యములు భాషలో లేకపోవడమే సంస్కృతపదములను వాడుటకు కారణమని గ్రంథావలోకనము వెల్లడిచేయుచున్నది. గ్రంథకర్తలు వాడుకభాషలో వ్రాసినను గ్రాంథికభాషలో వ్రాసినను భాషాతత్త్వము ప్రజాచైతన్యము నిరర్థకమయిన పద జాలము నంతరింపజేయుచు సార్థకములైన పదప్రయోగములను రక్షింపగలవు. నిర్మాణదక్షులైన కవులహస్తములందు సామాన్యప్రజా సాహిత్యమంతయును గ్రాంథికపరిణామమును పొందగలవిధమును వాఙ్మయచరిత్రలు విశదముచేయు చున్నవి. లక్ష్మీనారాయణగారి మాలపల్లియును నీ గౌరవమునకు పాత్రముగ నున్నది.

మాలపల్లియందు సాంఘిక రాజకీయార్థిక పరివర్తనములు రసవంతముగ వర్ణింపబడినవి. తక్కెళ్ళ జగ్గడి నాయకత్వమున నడచిన ధర్మదోపిళ్ళ యుదంతము సాంఘిక పరివర్తనమునందు నూతనాధ్యాయము. జగ్గన్న యను చరులు పాడెడి పాటలు గంభీరముగ సాంఘికార్థిక పరివర్తనావసరమును వెల్లడి చేయుచున్నవి.

రామరామ శ్రీరామా రామా - రామా రఘురామా
తక్కెళ్ళ జగ్గని ధర్మబోధలు - తలపున నిలపండి
ఆదికాలమున అందరు జనులు - అన్నదమ్ములండి
నదులు వనంబులు నానా మృగములు - నాల్గుసంద్రములును
కొండలు వండలు జలములు పొలములు - గుంటలు సెలయేళ్ళు
కాయలు పండ్లు పాడిపంటలు - ఘనమయినా యిండ్లు
అంతరువులా భేదము లేక - అందరి సొమ్మండి
కుడవాగట్టా వొకరికి బెట్టా - కొదవే లేదండి
నా నీ భేదము లేక లోకము - నడుస్తువుండేది
మనసులోపలా చీకుచింతలు - మందుకైన లేవు

♦ ♦ ♦ ♦

ఐకమత్యమే అన్ని పనులకు - ఆధారము సుండి
శ్రేణులుగట్టి సమ్మెగట్టితే - చెల్లును మీ మాట
కొట్టావద్దు తిట్టావద్దు - కోర్కెలు నిడిపేరున్
అసహాయయోగము తరుణము చూచి - అవలంబించండి
దానికి మిగిలిన మంత్ర తంత్రములు - ధరలో లేవండి

శంకలు దక్కి మీర లెల్లరు - శపథము చేయండి
సమతాధర్మం ప్రపంచమందున - స్థాపింతురుగాని
కృతయుగధర్మం లోకమంతటా - కుదుటబెట్టగలరు
రామరామ శ్రీరామా రామా రామా - రామా రఘురామా.

పాటయందలి భావముల సంభవాసంభవము లెటులున్నను జిజ్ఞాసువులకు విచారయోగ్యములుగ నున్నవి.

## శైలి

ఆంధ్రసాహిత్య హృదయపరిణామమును గ్రహించుటకు మాలపల్లి యుత్తమకావ్యము గ్రంథమునందలి ఆఖ్యానోపాఖ్యానములు, విమర్శనలు, వర్ణనలు, సిద్ధాంతములు గ్రంథము నొక పురాణమును చేసినవి. కావ్యములందు పద్యములకు గల గౌరవము గద్యములకు లేదు. ప్రాచీన మార్గమునకు గల యాదరణము నవీనమార్గములకు దుర్లభము. గ్రాంథిక భాషకు గల ప్రతిష్ఠ వాడుకభాషకులేదు. ప్రజాశక్తి, ప్రజాజీవనము సర్వతోముఖమయిన సాహిత్య వికాసమునకు మూలములు. కవులు ప్రజాజీవనశక్తులను సాహిత్యవికాసమునకు వినియోగించి ప్రజలకు వరణీయులగుదురు అనంతమయిన ఆంధ్రసాహిత్య పరిణామమును కావ్యరూపముననను ప్రత్యక్షము చేసిన లక్ష్మీనారాయణగారి ప్రతిభ ప్రశంసనీయము. భారతీయాంధ్ర సాహిత్యమాంధ్రహృదయ స్వరూప స్వభావములను నిరూపించగల విధమును మాలపల్లి సంభావించుచున్నది. ప్రజాదరణమును బడసిన తత్త్వములు, కీర్తనలు మానవధర్మ పరిణామమునకును తెనుగు మాధుర్యమున నిదర్శనములు. తెనుగు మాటలు, తెనుగు దేశము, తెనుగు సాహిత్యము, తెనుగు హృదయము, తెనుగు సంకల్పము మాలపల్లి కనిర్వచనీయమయిన ప్రతిభను సమకూర్చినవి.

"రసాత్మకమైన వాక్యము కావ్య"మను నిర్వచనము మాలపల్లికి సార్థకముగ నున్నది. మాలపల్లికి రూపము గద్యమైనను హృదయము కావ్యాత్మమైన రసవిలాసములు. తెనుగు మాటల యింపు సొంపులు, అందచందములు గ్రంథమునం దంతటను గోచరము లగుచున్నవి. తెనుగుమాటల సరళ ప్రవాహమానందమును గలుగజేయుచున్నది. గ్రంథమునం దుపయోగించిన భాష వాడుక భాష యైనను గ్రాంథికభాషా సంస్కారమును బడసినది. విభక్తులు, ప్రత్యయములు, సంధులు, పొందికలు నవీనముగ గనుపడినను సులభముగ బోధ్యమగుచున్నది. లక్ష్మీనారాయణగా రుపయోగించిన లోకోక్తులు, జాతీయములు,

వర్ణనాది విశేషములు గ్రంథమునకు వ్యక్తిత్వమును గలుగజేసినవి. సందర్భాను సారముగను నుదాహృతములైన వాక్యములు గంభీరసరళ మధురశైలికి నిదర్శనములు.

మాలపల్లి నవరసభరితమై రసానందముతో తాండవమాడుచున్నది. జగ్గన్న యనుచరులు వీరహనుమంత విజయధ్వానములతో చూపిన సాహస పరాక్రమములు భయసంభ్రమోత్సాహములను గలుగజేయుచున్నవి. జెయిళ్ళు, సెటిల్‌మెంటులు బీభత్సమును ప్రదర్శించుచున్నవి. దీనుల కరుణారసము వివిధ సందర్భములందును విషాదమును గలుగజేయుచున్నది. ప్రేమపరమైన శృంగార రసము సర్వత్ర ప్రత్యక్షమగుచు పరమానందమును గలుగజేయుచున్నది. రాధా కృష్ణుడు, మురళీకృష్ణుడు, గోపాలకృష్ణుడు శృంగారప్రేమ రసావేశమును గలుగజేయగల విధమును సరసవర్ణనలు హృద్గతము చేయుచున్నవి. కమల-మోహనురావుల మోహావేశము శృంగారరసభరితమై మోహావేశమును గలుగజేయుచున్నది. జోతి-అప్పాదాసుల శృంగార ప్రేమావేశసహగమనములు ప్రేమ తరంగములందు దివ్యదృశ్యములు. వాడుకభాషయందు నవరసభరితమైన కావ్యమును రచించిన లక్ష్మీనారాయణగారు ధన్యులు. సందర్భానుసారముగను చేసిన వర్ణనలు, బోధలు, వ్యాఖ్యానములు జ్ఞానదాయకములైనను కావ్యరసాను సంధానమునకు ప్రతిబంధకములై కావ్యము పురాణపరిణామమును బొందినది.

## కావ్యాశయము

కావ్యరచనయందు లక్ష్మీనారాయణగారి సంకల్పము కావ్యాంతమునందు "శాంతి" "కార్యక్రమం" అధ్యాయములందు సూచించినటు లూహింపదగును. కావ్యప్రయోజనము మానవధర్మపరాయణమైనను ధర్మవిజయము, స్వరాజ్య స్థాపనము, తన్మూలమునను ధర్మవిద్య, గ్రంథాలయాలు, మద్యపానము, ఫ్యాక్టరీలు, కార్మికులు, ఖద్దరు, ఇండ్లు, దరఖాస్తులు, సెటిల్మెంట్లు మొదలగు విషయములకు సంబంధించిన చట్టములను చేసి పరిపాలన విధానము నంతయును దేశభాషయందు నడుపుట, ప్రజాసామాన్యమునకు రాజ్యాంగములను నిర్వహించుట కధికార మేర్పడినపుడు ప్రజాక్షేమము, సాహిత్యాభ్యుదయము, విజ్ఞానవ్యాపనము, కార్యనిర్వాహకత్వము సులభసాధ్యములు. సర్వసమత్వము స్వరాజ్యమునకు కీలకము, పురుషార్థము. ధర్మమోక్షములను సమకూర్చుట కర్థకామములు నిష్కామకర్మయోగపరములు కావలయును. త్యాగము సాధ్యము కాని మానవులు ధర్మారాధనమునైనను చేయుట వివేకము. అర్థకామములు పర మార్థమునకువలెను పరమానర్థములకును వినియోగపడగల విధము మాలపల్లి చిత్రవిచిత్ర విధములను సువ్యక్తము చేయుచున్నది.

హిందూస్థానముయొక్క ప్రాచీనవిజ్ఞానమూ, ఆధునికశాస్త్రపరిజ్ఞానమూ, వారి బుద్ధికుశలతా, సౌజన్యమూ, అనంతములైన ఖనిజములూ, సమృద్ధమయిన పాడీపంటా మొదలయినవన్నీ భారతీయులకు బ్రిటీషురాజ్యములోనే గాక ప్రపంచమంతటిలోనూ అగ్రస్థానము తెచ్చినవి. హిందూస్థానమూ, చైనా, జపానురాజ్యములూ మైత్రిగలిగి ప్రపంచమున ప్రాముఖ్యత నహించినవి. ప్రపంచవ్యవహార నిర్ణయములకూ, విజ్ఞానమునకూ కేంద్రస్థానము పడమటినుండి తూర్పుకు జాగింది.

మానవస్వాతంత్ర్య ధర్మపరిణామములు సాధ్యమగుటకు జాతీయసాహిత్యాంగము లన్నియును పరివర్తనమును పొందవలసిన విధమును మాలపల్లియందు సూచించిన చట్టములు విశదము చేయుచున్నవి.

శ్రీయుత ఉన్నవలక్ష్మినారాయణగారు సుప్రసిద్ధాంధ్రనాయకులు, సంస్కర్తలు, సాహిత్యవిశారదులు, కార్యశూరులు. శారదానికేతనము, మాలపల్లి లక్ష్మినారాయణగారి మానవధర్మపరాయణత్వమునకు నిదర్శనములు. ప్రభుత్వము చేసిన నిషేధమే మాలపల్లికి ప్రఖ్యాతిని గలుగజేసినది. అందరకును తెలిసిన గ్రంథమును, గ్రంథకర్తను తెలుపుటకు పూనుకొనుట నిరర్థకము. మాలపల్లికి తొలిపలుకును వ్రాయబూనుకొనుట కానిపని. అఖండమైన తెనుగు సాహిత్యమును, అనంతమైన మానవధర్మపరిణామమును, అపారమైన భాగవత భక్తిపరిణామమును సాంగోపాంగముగను, రసవంతముగను బోధించెడి గ్రంథమునందలి విశేషములను వివరించుట యసాధ్యమైన కార్యము. శ్రీయుత లక్ష్మినారాయణగారు నాకీ గౌరవము నంటగట్టినందులకు కృతజ్ఞుడను. సాహిత్యోపాసకులు, ధర్మాత్ములు, తత్త్వజ్ఞులు, భక్తులు మాలపల్లిని చదివి మననముచేసి లక్ష్మినారాయణగారి సంకల్పమును, స్వీయసంకల్పమును సార్థకము చేయుదురుగాత! ఈ యమూల్యగ్రంథమును ఆంధ్రగ్రంథమాలయందు ౨౭-వ కుసుమముగను జేర్చుటకు శ్రీ లక్ష్మినారాయణగా రంగీకరించినందులకు వారికి కృతజ్ఞులము.

## పరమార్థము

మానవులకు జీవయాత్రకు పరమార్థము నిరతిశయానందమయమైన మోక్షము. కైవల్యము పర్యాప్తమైన దేశకాలపాత్రాధారమునను గాకను అపర్యాప్తమైన ఆత్మత్వముననె సాధ్యము. హిందూమతపరిణామమునందు వేదాంతపరమైన ఆత్మజ్ఞానము పురుషార్థము. బ్రహ్మత్వము పిపీలికాదిబ్రహ్మపర్యంతముగల జీవజాలముల కాత్మానందానుభవము పరమార్థము. ధర్మసాధనమునకాధారమైనదేహము కర్మయోగబద్ధము, కర్మయోగాభ్యాసము జ్ఞానయోగసాధనమయిన విధమును రామదాసుని యోగారూఢత్వము విస్పష్టము చేయుచున్నది.

కర్మయోగము, కర్మసన్న్యాసము సాపేక్షములు. యోగారూఢముగాని ఫలాపేక్ష గల కర్మ కర్మానురూపమైనఫలమును గలుగజేయుట ప్రకృతి ధర్మము. యోగారూఢమైన నిష్కామకర్మ పరమార్థమైన ఆత్మానంద సాధనము. ప్రేమతరంగములందు కర్మయోగము త్యాగారాధ్యమై నిష్కామ మగు చున్నది. నిష్కామప్రేమ త్యాగపరమై సర్వాత్మత్వసందర్శనమును సాధ్యము చేయుచున్నది. నిష్కామప్రేమపరాయణమైన సర్వాత్మత్వసందర్శనఫల మైన జ్ఞానయోగము భాగవతభక్తిపరిణామమును బొంద మానవులకు తరణోపాయము సులభసాధ్యము చేయుచున్నది. రామదాసు చేతలును మాటలును భాగవతభక్తిని పరిస్ఫుటము చేయుచున్నవి.

"భక్తి అంటే ప్రేమ అని, జ్ఞానం సర్వోత్కృష్టమయిన ప్రేమకు సాధనమని, జ్ఞానం కుదరనిదీ సార్వజనికప్రేమ గలుగదనీ, పూవు సౌరభము, పండు మాధుర్యము యిచ్చినట్టే ప్రేమ జ్ఞానానికి ఫలమని, ప్రేమగలిగినప్పుడే ఫలాపేక్షరహితమయిన లోకసేవ సాధ్యమవుతుందని, ప్రతిఫలం కోరనిది ప్రేమే నని తేలిక మాటలతో ప్రేమతత్త్వం వుపదేశించాడు."

కర్మయోగము జ్ఞానయోగమునకును, జ్ఞానయోగము ప్రేమయోగము లన న్యమైన భాగవతభక్తియోగమునకు సోపానములు. సంగదాసుని ఆత్మత్యాగము, జోతి అప్పాసుల ప్రేమలీలలు, రామానాయుడు వెంకటయ్యగార్ల కర్మయోగము భాగవతభక్తిని బోధించుచున్నవి. శ్రీకృష్ణలీలావిలాసవిలసితమైన విశ్వాధారమైన భాగవతభక్తి సకలజనులకును జాతి మత కులభేదరహితమైన భాగవత బృందా వనమునందు తరణోపాయము. భారతీయ వేదాంత విజ్ఞానసారమైన విశేష ధర్మోపదేశముతో శ్రీ లక్ష్మీనారాయణగారు మాలపల్లి కథ నుపసంహారము చేయుట సర్వోత్తమముగ నున్నది.

"భక్తుల జన్మనిరూపణము భాగవతాపచారము భక్తు డేకులమువా డని విచారించు బ్రాహ్మణుడు అర్చావతారముల (విగ్రహముల) లోహాదికమును స్మరించువానివలె వెంటనే పతితుడై ఛండాలత్వమును నరకమును బొందును. జ్ఞానానుష్ఠానములు లేకున్నను భాగవత సంబంధమే మోక్షము నియ్యగలదు. జ్ఞానానుష్ఠానములీ అపచారమునుండి రక్షింపజాలవు. భగవత్సంబంధమునకు జన్మవృత్తాదినియమములు లేవు. భగవత్సంబంధమునకు యోగ్యతగలుగుటకు జన్మాభిమానము పోవలయును. వేదాధ్యయనముద్వారా భగవల్లాభమునకు హేతువగుటనుబట్టి బ్రాహ్మణ్యము ఆదరణీయమగును. కాని ఈ బ్రాహ్మణ్యము నేను ఎక్కువవాడ నను అహంభావమునకు హేతువయినచో అది

త్యాజ్యము. జన్మవృత్తములయొక్క ఉత్కర్షాపకర్షములు భగవల్లాభమునకు హేతువులుగావు. కాని జాత్యాదికృత అహంకారమునకు హేతువగుటచే సవర్ణులు భగవంతునకు దూరమగుచున్నారు. కడజాతివారికి మే మెక్కువను అభిమానముండదు గనుక వారికి ముక్తి సమీపము. సవర్ణులకు అహంకారము ఆజన్మసిద్ధము. కడజాతికి అనహంకారము జన్మసిద్ధము."

శ్రీ భగవద్గీతోపదేశమునకు మూలపల్లియును పైవాక్యములును టీకా వ్యాఖ్యానములు.

శ్లో. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః

యువ సం. శ్రావణ }
౨. ౫ బుధవారము. }

కా. నా గే శ్వ ర రా వు.

# మాలపల్లి

## ౧

### చేను

ఆ సంవత్సరం శ్రావణ భాద్రపద మాసములలో వర్షము లమితంగా గురిసినా శరదృతువు ప్రవేశించగనే కొంచెం వెనుకాడి మబ్బునిర్మలంగా వున్నది. మిట్టమధ్యాహ్నం సూర్యబింబానికి అప్పుడప్పుడు చిరుమబ్బు లడ్డంవస్తున్నా మొయిలు విడచిన శోభనే కిరణాలు తీక్షణములై పొలాలలో పనిచేసే శ్రామికులకు చిరుచెమటలు కమ్ముతున్నవి. ఊరిపడమటి రేగటిచేలో దుక్కి దున్నుతున్న రామదాసు ఆకసంవంక జూచి, వేళ మిగిలిం దని, చాలు జొన్న చేనుగట్టువరకూ దున్ని అరక విడిచి యెద్దులకు గుంటలోవున్న కుంటలో నీళ్ళుపెట్టి గట్టునవున్న తుమ్మమ్రాకుకు కట్టివేశాడు. అంతట జొన్నచేలో వేసిన మంచె దగ్గరకు బోయి అచ్చటవున్న కొడవలి తీసికొని నిలువున కంకులు గిల్లిన యెర్ర జొన్న పట్టెలో సందెడు పచ్చిచొప్ప కోసి యెద్దులకు మేత వేశాడు. ఒక క్షణం అటూ యిటూ చూచి ఇంకా రాలేదే మాబ్బా అని కుంట గట్టెక్కి వూరివైపు చూచాడు. ఎవ్వరూ వచ్చే జాడ కనబడలేదు. కొంతసేపు పరకాయించి చూశాడు. ఎవరో కొండల సందునుంచి దుత్త నెత్తిన బెట్టుకొని వస్తున్నట్లు కనపడ్డది. 'మనవాండ్లే కావచ్చును. సరే, ఎందుకూ——పిల్ల పరుగు పరుగున రయిలుకట్ట దగ్గరకు వస్తూవున్నది. తల్లి రాక, పిల్లను పంపింది యెందుకో. ఆవిడ పరగటి చేనికి పిల్లవాండ్లకు అన్నం తీసుకొని పోయిందిగాబోలె. రయిలుకట్ట దాటి రావాలెగా' ఈ మాట లనుకొంటుండగా పడమట నుంచి రయిలువచ్చే వేళ యుందని రామదాసుకు, తటాలున జ్ఞాపకం వచ్చింది. తన చత్వారపు కండ్లను పెగిల్చిచూచి 'అదిగో రస్తామీదుగా పరుగెడుతున్నది. రయిలు రానేవచ్చిం'దని గుండెలు తటతటమని

కొట్టుకొనగా తన కొమార్తె వచ్చే దారివంక జూచి పిల్లకాయిలు కట్టదిగి పదిమూళ్లురావడం కనిపెట్టి దిగులుదీరి కొంతదూరం వచ్చేవరకూ నిదానించి చూచి స్థిమితపడి నిలుచున్నాడు. ఎద్దులు అరమోడ్పుకన్నులతో అప్యాయంగా పచ్చిదంటు నములుతున్నవి. రామదాసు యెద్దులవంక చూచి వీపునా వెనుకా వున్న దద్దుర్లనూ ముల్లుపోట్లనూ నిమిరి అత్తికి కొంచెం పేడరాచి కుచ్చులు సవరించి 'ఎద్దుల కెండ తగులుతున్నది. ఇంకా ఒకటి రెండేండ్లకుగాని తుమ్మపీకె యెక్కరా'దని అనుకొంటూ జొన్నచేనిగట్టువైపుకు పోయి నిలుచున్నాడు. నైఋత్యని పడమటగాలి తోలుతున్నది. జొన్నపైరు గాలికి కెరటాలుగట్టి వుయ్యాల లూగుతున్నది. బంగారపు రాగిరేకల గుత్తులవలె సొంపు గులుకుతూ కంకులు పచ్చని సుంకు పోసుకుంటున్నవి. పురుషసృష్టియొక్క ఆప నలవి కాని సంభ్రమమును దెలుపుతూ పుప్పొడి విచ్చలవిడిగా వాయు పథమున విహరిస్తున్నది. రామదాసు పరువాని కాసన్నమై వున్న పైరును చూచుకొని తనకు కలిగిన హృదయానందమును వికసించివున్న తన తెలివిగన్నుల వెలిబుచ్చుతున్నాడు. రామదాసు కొంచెం పొడగరి. కలగలపులుగ నెరిసిన మీసములు పెదవులపై గుబురుకొనివున్నవి. స్వచ్ఛమైన గాలీ, తగినంత దేహపరిశ్రమా, పండనై వున్న పైరూ, ముప్పిరికొని రామదాసున కొకింత వుల్లాసం గల్పించినవి. తక్కిన తలంపులన్నీ మరచి యేకరీతిగా పైరు వంకజూస్తూ 'పిల్లల అదృష్టంవల్ల ఒక్క వారం రోజులపాటు యెండా గాలీ కొట్టి తూర్పు సాగకుండా వుంటే యెంత లేదన్నా రెండుపుట్లు గింజలు రాలకమానవు. దంటు బాగా గంటగట్టి లేట బుట్టి జములు కంకులు సయితం యీనింది. కొంత జల్లి విత్తనం పడ్డదిగాని అంతా ముద్దవిత్తన మయినట్లయితే యింకొక్క యేదుమ్ముపైన అనేదే. కాని మనకు ప్రాప్తం యెంతో అంత. ఇంతకూ తూర్పుగాలి సాగకుండా వుండాలి. ఇవ్వేళ యెండ చిటచిట లాడుతున్నది, ఈ వుబ్బకు సగం కంకి గింజపోసు

కుంటుంది. వెనుక జిక్కిన జాషూబోడూ గూడా పండితేనేగాని పోలివుండదు. ముందు మొక్క వచ్చిన యే పదికర్రలో పండితే యేమి ప్రయోజనం? అందరూ బాగుంటేనే బాగు. ఇదిగో! ఈ కంకి చూడు. ఎట్లా గింజపట్టిందో. గిలేపండిన' దని శంకించి చూస్తుండగా జోతియొక్క కాళ్ళచప్పుడు వినపడ్డది. రాముదాసు కంకి విడవంగనే అది పురవడిగాపోయి ప్రక్క కర్రకు తగిలేవరకు రెండవకర్ర యింకా ముదరక పాలవుబ్బగా వుండడంచేత తాకుడుకు సుంకు రాలిందేమోనని పరీక్షించి చిరునవ్వుతో బిడ్డవంక చూచి దాని తలపైనవున్న ముత్త దించుకొని యెండలో రావడంచేత మొగాన జారుతున్న చెమటబొట్లు తుడిచి చెదిరిన ముంగురులు సవరించి ప్రేమ దళుకొత్తు ముఖవైఖరితో, 'అమ్మా! యివ్వాళ్ళ నీవు వచ్చావేమి? మీ అమ్మ ఎక్కడికి పోయిం' దని అడిగాడు. జోతి గోముగా పెరిగినపిల్ల. యిద్దరు మొగపిల్లల తర్వాత కలగడంచేత యింట్లోవాండ్లందరూ గారాబంతో చూస్తున్నారు. మాలకులమైనా, జోతి తండ్రివలె నల్లటిదిగాదు. తల్లినిబోలి కొంచెం చామనచాయకలది; సన్న కమ్మివేసి నేయించిన ముతకచీర గట్టుకొని మేనత్తపట్టించిన అద్దాలరవిక తొడుక్కొన్నది. ఎండలో తళతళ మెరసే అద్దపు బిళ్ళల తెలికాంతులు మెడలో కొండిబెట్టి గుచ్చికట్టిన బేడకాసులయొక్కయూ వెండికంటెయొక్కయూ తెలుపు సమ్మిళితమై వొప్పుతున్నది. కుడిముక్కునవున్న యెఱ్ఱ రాళ్ళ దోసకాడ తీరైన కనిముక్కులతో పొందిక గలిగివున్నది. మెడలోవున్న వెండినక్కల నీలిబొందును పమిటమీదికి తీసుకొని ముంజేతులు కొంచెం పైకెత్తి ఎడమకాలు ఎత్తివెచి, ముద్దు మాటలతో, 'అయ్యోయి! అమ్మ అన్నకు బువ్వపట్టుకపోయింది. ఆడనే - తనకు పనివున్నదంట. నన్నేమో నీకు బువ్వయిచ్చి నాను కావలసినన్ని తియ్యదోసకాయలుకోసి తెచ్చుకోమన్నది. నే కోసుకుండేదా?'

రా : పొయ్యేటప్పుడు కోసుకుందువుగానిలే. చూడు, రైలు వచ్చేవేళ అయిందిగదా. యింతఆలస్యంగా వచ్చావేమి?

నీవు పట్టాలమీద వుండగనే రైలుపొగ కనబడ్డదే. నీకు రైలు బండి కనబడలేదా?

జో : నేనే, యెటూ చూడకుండా తొందరగావచ్చి రైలు కట్టెక్కేవరకు—పో—దూరాన్నించి రైలు వస్తూవున్నది. అది చూచి భయపడి ఒక్క వురుకు తీశా.

రా : అమ్మో! బిడ్డకు ఎంతగండం తప్పింది యివ్వాళ (అని చేతితో తలపై నిమిరి) యిక ముందెప్పుడువచ్చినా రైలు కట్టెకకముందు అటూయిటూచూచి రైలు రాని సమయంలో పట్టాలుదాటు. సరేనా?

జో : అట్లాగేకాని—అయ్యో, నాకు వూచబియ్యమే.

రా : నేను అన్నందిని కొట్టిపెడతాగాని నీవిట్ల కూర్చో. అన్నం తింటావా?

జో : వద్దు.

రా : అయితే, ఈతియ్య దోసకాయ తింటూకూర్చో—అనిచెప్పి దుత్తపైనవున్న చిన్న మూటవిప్పి జొన్నన్నంలో చింత చిగురుపప్పు కలుపుకొని తింటుండగా,

జో : అయ్యో! పప్పులోవేసిన వుల్లిపాయముక్క నాకు పరియ్యవే?

రా : ఇదిగో, రా—అని, రెండుమూడు ముక్కలేరి చేతి కిచ్చి తాను కూరాన్నం దిని దుత్తలో కలిపిపోసిన మజ్జిగన్నం దాగి చేతులూ దుత్తాకడిగి, గుడ్డ వుసిమి దుత్తలో వేసి వాక లేత కంకికోసి వూచబియ్యముగొట్టి వూది బొంతులేరి కాసిని జోతి చేతిలో పోసి తక్కినవి పమిటకొంగున కట్టాడు.

జో : చేతిలోవితిని మూటగట్టినవి యింటికి తీసుకొని పోయి పిసికిళ్ళు చేసుకుంటా. దోసకాయలేవి?

రా : దోసకాయంటా: కూర్చో,

జో : నాకు రెండు, అమ్మ కొకటి, అన్నలకు చెరొకటి, బుల్లివాడికొకటి కోసకరా.

రా : బుల్లి వాడు దోసకాయలు తింటాడా ?

జో : పోసి. అదికూడా అమ్మే తింటుంది. వాడికి పాలి చ్చేది అమ్మేగా.

రా : నాకొక్క కాయైన లేదుగదా? నీకు రెండెందు కమ్మా ?

జో : నీ విక్కడ తినకండావ స్తే నీకుగూడ వొకటి కోస కరా. నా రెండో కాయ బావకిస్తా.

రా : సరే. యిదిగో కాయలు. దుత్తలో వేశా. ఇదెత్తు కొని సరీగా యింటికి పో. మీ అమ్మను దోసకాయ పచ్చడి చేయమను.

జో : ఆఁ. అబ్బా! యేమయ్యా నీఆశ! నేను కాయలు తినవద్దూ!

అని జోతి దుత్త ఎడమ బుజముమీద పెట్టుకొని చిన్న పమిట వీపున వ్రేలాడుతుండగా, చెయ్యి రొండినబెట్టి, చిటుకుచిటుకున అడుగులు పెడుతూ దుక్కికడ్డంగా డొంకకు పోతున్నది. రామ దాసు వోరగంటితో జోతినిచూచి 'లేతకాళ్ళు, దుంపలు గుచ్చు కుంటవేమో. చిన్న చెప్పులైనా చేయిస్తే బాగుండును,' అను కొంటూ దుక్కిదాటి డొంకలోకిపోయి పక్కనున్న జొన్న చేను చాటుకు పొయ్యేవరకూచూచి యెద్దుల దగ్గిరకు పోయినాడు. పొద్దు వాటవాలింది. యెద్దులు కడుపునిండా మేసి అలుపు తీర్చుకొన్నవి. యెల్లెద్దు పడుకొని నెమరువేస్తున్నది. ఫుల్లది బడిదంట్లు వదిలివేసి వొగుడాకు లేరుకొనితింటూ యెందుకో చిరచిరలాడుతున్నది. యెల్లది స్వాభావికంగా శాంతంకలది. ఫుల్లది కొంచెం కసురు బోతు. రామదాసు యేదో ఆలాపనగా ఎద్దులనువిప్పి తీసికొనిపోయి ఫుల్లదానిని వలపలనూ, యెల్లదానిని దాపలనూగట్టి పగ్గాలు మేడికి

చుట్టి, ఎడమచేతితో మేడిపట్టుకొని కుడిచేతితో అర్ అని ఫుల్లె ద్దును అదిలించాడు. యెద్దులు లాగడానికి ప్రయత్నించినవిగాని పట్టుపట్టక తికుగుడుబడి నిలబడ్డవి. రామదాసు కొంచెం పరికించి తానుచేసిన తప్పును గ్రహించి యెన్నడులేని పొరబాటు వచ్చిన దేమిరా, ఇది వ్యవసాయానికి ఏం వండ సూచించునో అని సందే హించుతూ, యెద్దులను మార్చికట్టి అరకసాగించాడు. పడమర నాలుగు గడియలకల్లా దుక్కి పూర్తిచేసి 'యిప్పటికి దుక్కి నాలుగుచాళ్లు పూర్తి అయినది, ఒక్కసారి గుంటకయీడ్చి చాళ్లదోలి అట్టేపెడితే పదునుగాంగనే మిరపమొక్కలు నాట వచ్చు' నని అనుకొంటూ అరకను తోలుకొనివచ్చి కుంటదగ్గర నిలిపి కుంటలో దాచివుంచిన పంటితో మిరపమళ్ళకు నీళ్లుజల్లి కొంచెం ఆయాసపడి 'పొద్దుగూకులూ అరకదున్ని మళ్ళకు నీళ్లు కూడ నేనే చల్లబోతే శానా కష్టంగావున్నది. పెద్దపిల్లవాడు ఎన్నటికని తంటాలు పడతాడు. సంగణ్ణి జీతానికి మాన్పించి యింట్లోనే వుండమంటే బాగుండు' నని అనుకొంటూ మోపెడు పచ్చిదంటుకోసి మోపుగట్టి తలమీద పెట్టుకొని అరక దోలుకొని యింటికి వచ్చాడు.

## ౨

## దొడ్డి

రామదాసు అరక దోలుకొని పల్లెకు వచ్చేటప్పటికి సాయంకాల మయింది. ఇంటికి దక్షిణంగావున్న పశువుల దొడ్డి దగ్గర అరక నిలిపి తలుపు నెట్టుకొని లోపలికి బోయి చొప్పమోపు లోపల పడవేసి మరలవచ్చి యెద్దులను విప్పి లోపలికి తోలుకొని వచ్చేటప్పటికి ఉలవలు రుబ్బుతున్న పసులకాపరి అప్పాదాసు సగం వులవలపిండి తెచ్చి రాతిగాబులో కలుపుతున్నాడు. ఎద్దులు వులవకుడితి తాగి తృప్తిపడి నీరుడు జేసినతోడనే వాటిని గాటి దగ్గర కట్టివేసి జీతగాడు చొప్పదొడ్డినుంచి కట్టుకొని వచ్చిన వరిగచెత్త గాటిలోవేసి అరకసామాను తెచ్చి కొట్టంలో పెట్టాడు.

రా : అప్పుడూ ! సుబ్బిశం గాంగనే చొప్ప నరుకుతావా?

అ : అట్లాగె నరుకుతా.

రా : బావ యింకా పొలమునుంచి రాలేదా ?

అ : వచ్చి నీళ్లు తెస్తున్నాడు.

రా : నీళ్ళు తేవడం ఇంకా కాలా ?

అ : అప్పుడేనా ! ఊరచెరువు మాలరేవు దగ్గరనుంచి యిక్కడికి మన పశమటి చేనంత దూరముంది. రెండుగావళ్లు తెచ్చి రాతిగాబులో పోశాడు. ఇంకా మట్టిగాబూ మూడు బానలూ వట్టివే వున్నవి.

రా : పొద్దుగూకుతున్నదే ! ఎప్పుడు నీళ్ళయ్యేది. సబ్బిశం యింకా యెంతసేపు పట్టేను ?

అ : కావచ్చింది. పత్తిగింజలు రెండువాయిలు రుబ్బా. కాసిని పత్తిగింజలు మిగిలితే మళ్ళీ పోసివేశా. బద్ది కదులుతూ వుంది. గానిగె తిప్పుతుంటే గతుక్కుమంటున్నది, అయింది. ఇగ తీస్తున్నా—నని గబగబ గానిగె నాలుగుచుట్లు తిప్పి పైకితీసి పిండి కుండలోకి తోడి రోలు కడుగుతున్నాడు.

రా : నీవు పయటన్నం తిన్నావా ?

అ : ఆ-అత్త తెచ్చెగా ?

రా : చొప్ప నేనైనా నరుకుతాను. చిన్న బుంగలు కావట్లో వేసుకొని బావతోపాటు నీవూ రెండు కావిళ్ళందుకో.

అప్పాదాసు పదునాలుగు సంవత్సరముల ప్రాయపువాడు. ఇంకా పోకులు తెలియవు. శరీరం అడుగు భాగమునకంటె పై భాగం కురచగా వున్నది. సడ్డి లేకపోయినా నడుము కొంచెం వెనుకకు వంగి శరీరమునకు పటుత్వమిచ్చింది. ప్రతిపనీ వొకరిచేత చెప్పించుకొనకనే తానే యోచించుకొని వొళ్లువంచి పని చేయగలవాడు. బాగా చదువుకొన్నాడు. రామదాసింట్లో జీతానికి కుదిరిన తరువాతనే చదువు మొదలుబెట్టి రామదాసుయొక్క శ్రద్ధ

వల్ల కొంత సాహిత్యం కూడా కుదుర్చుకొన్నాడు. తోటి జీత గాండ్లకంటే రెండు వరహాల యెక్కువ జీతం ఏర్పాటుచేసి అన్న వస్త్రాలు రామదాసే జరుపుతున్నాడు. రోటిదగ్గర మదురు గోడ వంకెకు తగిలించివున్న పైబట్ట తీసి తలకు చుట్టుకొని చిన్న బుంగలు కావట్లో వేసి కావటిచేర్లు బద్దకు వొకచుట్టు చుట్టి తనకు మోయినుగా కురచ చేసుకొంటున్నాడు. రామదాసు చిన్న గొడ్డలి తెచ్చి చొప్ప నరుకుతున్నాడు. ఇంతలో వెంకటదాసు తలుపు నెట్టుకొని బారుటంగలు వేస్తూ కావటి వూపుకు జతగా వుఱ్ఱూతలూగుతూ కావడి దింపి రెండు బుంగలూ రెండు చేతులా పట్టుకొని యినుప కాడలవంటి చేనరములు కండెలు గట్టిన దండల పైకుబక అలకనగా యెత్తి గాబులో కుమ్మరించి ఖాళీ బుంగలు మట్లలో వేశాడు. చొప్ప నరకడం నిలిపి తనవైపు తిరిగిన తండ్రితో 'చొప్పకూడా నీవు నరక్కపోతే మేము నరకలేకపోయి నాములే' అని కొంచెం పెద్దగా అడిగాడు.

రా : చొప్ప నరకడ మెంతపనిగాని - యింకా యెన్ని కావిళ్ళు పడతవి ?

వెం : ఎన్ని పట్టకేమి ? రెండు కావిళ్ళు ఇప్పుడు ఆడ పశువులు తాగడానికి కావలెనా ? అయిదు కావిళ్ళు రెండు గాబుల్లోనూ మూడు కావిళ్ళు బానల్లోనూ పడతవి.

రా : సరేకాని; అప్పుడూ నీవూ కావిళ్లు వేసుకొని వొక జత తెచ్చి యీ పూట గడిపి రెండోజత యింటిదగ్గర దింపండి. ఉలవపిండీ పత్తివిత్తుల తొక్కూ సగం యీ పూట వేసి పొద్దుటికి తక్కిన సగం వుంచండి. తెల్లవారుజామున మనమిద్దరమూ కావిళ్లు వేసుకొన్నామంటే తెల్లవారేవరకు అన్నీ బర్తీ చేయవచ్చు.

వెం : ఆఁ. మోకాళ్ళ కలకలతో తెల్లవారుజామున వూర చెరువునుంచి కావిళ్ళు మోస్తావు. అప్పడిని నీళ్ళకు అలవాచ్చ వలసిందే. మధ్యాహ్నం మన ఆవుపెయ్య కట్టింది.

రా : అట్లాగా. గేడిపెయ్యేనా ?

వెం : కాదు, బట్టది. ఆగేడిది నక్కురుబోయినట్టు అట్లా వున్నదేమి?

రా : నక్కురు బోవడంగాదు. దానిచారే అంత. వొక్క నెలపాటు తియ్యకుండా అంటిపట్టి రోజుకు చారెడు వుప్పు నీళ్లల్లో కలిపి తాగించు. యెట్లా కట్టదో చూస్తాను!

ఇంతలో అప్పాదాసు కావట్లో చిన్న బుంగలు వేసుకొని చేర్లు కురచన జేసుకున్నాడు. వొంకెన తగిలించివున్న వుత్తరీయం చుంగు విడిచి తలకు చుట్టుకొని కావిడి బుజంమీద పెట్టుకొన బోయేవరకు కొత్తచేత నవ్వువచ్చింది. ఆవరణమంతా తనను చూచి నవ్వుతున్నట్టె అతనికి కనపడ్డది. కుచ్చిళ్లు పక్కకులాగి యెడమకాలిమీది చెంగుదోపుకొని బావ యెట్లా నడుస్తున్నాడో చూస్తూ వెనకడితే పోతున్నాడు.

రా : ఆవుదూడలను రెంటిని పాలకు విడుస్తా? మీరు వచ్చేటప్పుడు కట్టివేసి రాండి, లేకపోతే ఏధిన బడతవి.

వెం : అన్నీ చేస్తాం పోవే, నీ వింటికి.

కప్పర చీకటి ప్రారంభించింది. దూడల అంబారవములు విని ఆవులు మిట్టిచూపును చూస్తూ కట్టుమట్టున గిరగిర తిరుగు చున్నవి. 'దూడలను విడిచేవేళయింది. ఆవులకింకా నీళ్ళు అందకపోయెనని' అనుకొంటూ రామదాసు చొప్ప నరుకు తున్నాడు. నరకడమయిన తరువాత ఆడ పశువులకు కొద్దిగా మేతవేసి మిగిలినది కొట్టంలో అరుగుమీద యెండుమేత పక్కన బొత్తిపెట్టుతుండగా వాకిటి దగ్గిర చప్పుడయింది.

రా : ఎవరది?

కొత్తమనిషి : (తలుపు నెట్టుకొని కొంచెం తలవంచి గడప దాటి లోపలికివచ్చి)—యేమన్నా నేను సుబ్బలక్ష్మిని.

రా : ఏవమ్మా! ఇటు వచ్చావు?

సు : లోపలికి తిరిగిన మడిమెలతో చాచి కొంచం అడ్డదుగులువేస్తూ బిగుతయిన పూర్ణిలపట్టెడను యెడమచేతి వేలితో సవరించుకొంటూ—చూడన్నా ! వాడి చెయిబడ. మునసబుగారి బసివిరెడ్డి కఱ్ఱతీసుకొని యెట్లా కొట్టాడో, అని యెడమచేతిమీదికి జారవున్న పమిటకొంగును పైకిలాగి శుష్కించి తోళ్లువేలాడే రవికెలేని దండచేతిమీద కట్టిన కదుమును చూపించినది.

రా : ఎందుకట్లా కొట్టాడు ?

సు : వట్టి అభాండం వేశాడు. నేను గరువులకుపోయి గడ్డి కోసుకొని మూటెత్తుకొని సావరాలమీదిగా వస్తూవుంటే తానెక్కడనుంచో బూతులు తిట్టుకుంటూ మా చేలన్నీ నీకు మాన్యాలయిపోయినవా, అని కఱ్ఱతో మూట కిందబడనెట్టి యీ దెబ్బ కొట్టాడు. చెయి యెత్తనీయడం లేదు. అది కాదయ్యా, నేను గరువులకుపోయి గడ్డి దెచ్చుకొంటున్నాను. కావలిస్తే మూటవిప్పి చూడండి. వట్టిగురుగాకూ మదనాకూ తప్ప మరేమైనా వుందేమో. ఇట్లాంటిగడ్డి మీ చేలో వొక్క పోచ చూపించండి. పయటివేళ బోయి వొక్కొక్క పోచ-చొప్పున దుక్కలలో పీక్కొని వస్తున్నాను. అనేవరకు 'దుక్కల్లో పీకావో దిక్కులేనివాండ్ల చేలల్లో దొంగిలావో యెవరు చెప్పగలరు ? పొద్దు కూకంగానే మాచేలగట్లు మీకు రహదారులయినవి. మనిషంటే గట్టునపోయేదీ లేకపోతే కంకీ కాయా తెంపేది. యింకొకతడవ మా చేనిగట్టున పోయినావా అంటే నీ గేడికాళ్లు విరగ్గొడతాను. యెత్తుకో ! మూటెత్తుకో. మా కొట్టంలో వేసిపో' మ్మని రెండోసారి కఱ్ఱతో యీడ్చి కొట్టేవరకు వెండిగాజులు రెండూ యెట్లా మెలిదిరిగిపోయినవో చూడు.

రా : మాల మాదిగలంటే అంతచౌక ?

సు : మొన్న మట్టసానికి సామినేడివారి చేనుకాడ నడిడొంకలో చిప్పెరనట్టుంటే దోక్కొంటున్నా; వాండ్లకోడలు నానా మాటలసి అట్లా పారపెట్టనీయక పోయింది. పొద్దు కూకిం

దాక తిరిగి వంచెనుగడ్డితో వచ్చా. ఆసాములు యింత కట్టైనా కంపనా కాలకపోతే యెట్లా గబ్బా! యీ అలగాజనం బతికేది. యేకాడికో పోకడ పెట్టవలసిందే తప్ప యీ బత్తెను యిక భరించలేను.

రా : దాన్నమ్మి యెట్లా బతుకులావు. అట్లాగ తంటాలు పడుతుండు. కాకపోతేనుట్టుకు యెండిపోవచ్చిన గొడ్డును యిప్పుడు యెవరు కొంటారు.

సు : ఏమి తంటాలు పడతానో అబ్బా. గడ్డిగుడ్డా లిక్క. ఆ బసవయ్యే వూడబెరుక్కున్నాడు. అవయినా యియ్యమను.

రా : పొద్దున చూతాం పద.

సు : గేదె పొలంబోయి వచ్చినప్పటినుంచి నిలువున కట్టివేసి వున్నది. అందులో అది మలపగొడ్డు. కాస్త మలుమ్కైనా వేయకపోతే ఆ గుక్కెడూ రాల్చదు. అందుకోసమని యిట్లా వచ్చా.

రా : రెండు యెండుకట్టలూ కాస్త పచ్చిదంటూ తీసుకో. ఇదుగో మాట, నీవు మళ్ళీ పొగాకు వేసుకొంటూ వున్నావు. సంగడుచూస్తే చీవాట్లు పెడతాడు.

సు : 'నీ యింటికి రావడానికి నాకదే భయమయ్యా, మొన్న అట్లాగే నలుసంత నోట్లో అనుకొన్నా, వాడెట్లాగో కనిపెట్టి నన్ను ఆటలు బట్టించాడు. నేను యిక యెప్పుడూ వేసుకోనని చెప్పా. ఇప్పుడొక కాడతుంపి నోట్లో వేసుకొన్నా. నోటి తుత్తరమీాద సంగతే మరచిపోయినా. ఇక వేసుకొంటే చెడ్డవా' ట్టని నోటిలో పొగాకువుమ్మి చొప్ప కుడిసందిట పట్టుకొని చింపిరితలను యెడమచేతితో గోకుకొంటూ వాకిటిదగ్గిర కొంచెం వంగి వెళ్ళిపోయింది.

రామదాసు ఆవరణం పారజూచి చొప్ప దొడ్డివాకిటికి అడ్డంగా పెండెం కదియలాగి బిసికొయ్య తగిలించి వుత్తరీయం దులుపుకొంటూ వీధితలుపు గొళ్లెంవేసి యింటికి వెళ్ళిపోయినాడు.

## 3

### ఇల్లు

రామదాసు మాలదాసరి కులస్థుడు. పూర్వం శ్రీమద్రామానుజులు మహాకృపాళులై పండితపామరులగు సహాజనులందరికి తరుణోపాయంగా భక్తి ప్రధానమయిన వైష్ణవమతం స్థాపించి మతవ్యాప్తికై డెబ్బయిరెండుపీఠము లేర్పరచి పరమపదించారు. ఆంధ్రదేశంలో అద్దంకి పీఠం మిక్కిలి ప్రసిద్ధివడసి తెంగలశాఖకు చెందివున్నది. తెలుగుదేశమున వైష్ణవమతప్రచారం విశేషంగా సాగుతున్న రోజులలో తన్నిమిత్తమై దేశమంతటా ప్రచారక సంఘము లేర్పరచబడ్డవి. త్రైవర్ణికులకు ఆంధ్ర ద్రవిడశాఖలకు చెందిన బ్రాహ్మణులే గురువులుగా వుండిరి. శూద్రులకూ బ్రాహ్మణవైష్ణవులే బోధించుతుండేవారు. యాజనాధికారం అన్నివర్ణములకూ యియ్యవలెననే సమబుద్ధితో ప్రచారకులసంఖ్య చాలకనో హీనజాతులయొక్క సంస్పర్శము నిచ్ఛగింపకనో లేక నాలుగైదు వర్ణములవారు బ్రాహ్మణాధికారమును తిరస్కరించి తమ కేల యాజనాధికార ముండకూడదను స్వతంత్రభావమును వ్యక్తీకరించడంవల్లనో శూద్రులలో చాత్తాదులనూ (సాతానులు) పంచములలో దాసరులనూ మతబోధకులుగ నేర్పాటుజేశారు. ఈ ప్రచారకసంఘములన్నీ కలిసి దేహమనోరోగముల రెంటికి చికిత్సచేస్తూ మతబోధకులు లౌకికవిద్యనూ వైద్యమునూ సమ్మిళితంజేసి చెంచులూ యేనాదులూ పంచములూ మొదలయిన సమస్త జాతులనూ వైష్ణవమతంవంక దిప్ప గలిగినవి. ఇందుచేత నాకాలమున సంఘనిర్మాణమునకై అనేకులు మహాప్రయత్నం చేసినట్లు స్పష్టమౌతున్నది. ఇట్టి ప్రయత్నములనే శైవమతప్రచారకులూ చేసినట్లు కనబడుతున్నది. ఇటీవల రాజసన్మానం లేకపోవడంచేత మతప్రచారక ప్రయత్నములే ఆగిపోయి పూర్వపు కట్టుబడులన్నీ శిథిలమై యేది యెందు కేర్పడ్డదో గుర్తించడానికి సైతమూ వీలులేకుండా జాడలు మరుగైపోయినవి. చాత్తాదుల

లోనూ మాలదాసర్లలోనూ వైద్యమూ, కొంచెం అక్షరజ్ఞానమూ, జ్యోతిషమూ, అపరకర్మలలో యాజకత్వమూ యిప్పటికి నిలిచి వుండి పూర్వపుపద్ధతులు యిట్టివై వుండవచ్చునని సూచిస్తున్నవి. చాత్తాదులలోనూ, జంగములలోనూ యిప్పటికీ గొప్ప పండితు లున్నారు. కొన్ని ప్రదేశములలో జంగములు బ్రాహ్మణులను గురుపీఠమునుండి చాలవరకు తొలగించి వారిస్థాన మాక్రమించారు. ఈ మహాప్రయత్నములు పూర్ణంగా కొనసాగే వున్నట్లయితే మన సంఘములోని వర్ణభేదములు చాలవరకు అంతరించి యిప్పటి దౌర్బల్యస్థితి రాకపోయేదే.

రామదాసుయొక్క పూర్వీకులు వైష్ణవమతబోధకులై వారి వంశంవారు యిప్పటికీ నిలువుబొట్లు పెట్టుకొంటున్నారు. మూడుతరములనుండీ వీరు జ్ఞానమార్గంలో ప్రవేశించి అచల బోధను స్వీకరించారు. అప్పటినుండి సర్వసమత్వాభిప్రాయములూ స్వాతంత్ర్యబుద్ధీ, సంఘసేవాపేక్షా, శౌచమూ, పారమార్థికచింతా వారి కుటుంబంలో తిరిగి తలయెత్తినవి. రామదాసు గురువువల్ల కారణం పొందినప్పటినుంచీ ఐహికవిషయములయెడల కొంత విముఖత యేర్పడ్డప్పటికి సంసారం దిద్దుకొనే దక్షత గలిగి చేతి కక్కరకు వచ్చిన పిల్లవాండ్లు లేకపోవడంచేత సంసారమంతా యీదడం యాతనగా వుండేదిగాని నాలుగుసంవత్సరములనుంచీ పెద్దకొడుకు వెంకటదాసు వ్యవసాయపు పనులలో ఆరితేరి ప్రతి పనీ తండ్రి కడ్డంవచ్చి చేసుకొని పోతూవున్న తరువాత రామ దాసుకు చాలా విశ్రాంతి కలిగింది. వెనుకటి అలవాటుచేత చేసేచేయి వూరుకోక యేదో వొకపని అతుకుతున్నా అతడు విశేషకాలం మతవిషయములలోనే యిప్పుడు గడుపుతూవున్నాడు. రెండవ పిల్లవాడు యింటిపనులలో దిగకపోవడంచేత పెద్దపిల్ల వాడికి సీలుకానప్పుడు యెప్పుడైనా అరకకు పోతూవున్నా సాధారణంగా వెంకటదాసు తండ్రిని పొలంపని చేయనిచ్చేవాడు [illegible]

పోయినా పదిడబ్బులు యిచ్చి పుచ్చుకొంటూ వొక అరక వ్యవసాయమూ, నాలుగైదు ఆడపశువులూ పెట్టుకొని యీవేళ పోయిమీదికి లేమా అని అనుకోకుండా కాలం వెళ్ళబుచ్చు కుంటూవచ్చారు. పూర్వార్జితపు ఆస్తిలో తూర్పు పొలమున అయిదెకరముల మాగాణీ, దక్షిణపొలిమేర దగ్గర ఆరుయెకరముల సాగుభూమీ, మిద్దెయింట్లూ మాత్రం నిలిచివున్నవి. రామదాసు తండ్రి వుత్తరంగా వూరి నానుకొనివున్న నాలుగెకరముల పాటి చేను పశువులపోడుకు ఆగలేక పదిహేను సంవత్సరముల క్రిందట మంచి ధరవచ్చినప్పుడు ఆ వూరి షావుకారు నల్లమోతు చౌదరమ్మకు విక్రయించి పడమటిపొలమున పదియెకరములు సుక్షేత్రంవంటి రేగటిచేను సంపాదించాడు. అప్పటినుంచీ అరకకు వోపినంతపొల మేర్పడ్డది. రామదాసు హయాంలో సావరంలో వాగు పారుతూండే రెండెకరముల పడమటి పంపును బీటికింద వదలి కాడిగట్టున వున్న కర్ణంగారి రెండెకరముల బీటినీ వేలంలో కొని తన బీటిలో కలుపుకొన్నాడు. ఇప్పటి పశుల దొడ్డికూడా రామదాసే సంపాదించాడు. పశువుల కొట్టం యింట్లో వుంటే అనారోగ్యమని రామదాసు రెండవ కుఱ్ఱవాడు పట్టుపట్టి గడచిన యెండాకాలంలో కొత్తదొడ్లో రెండవ కొట్టం వేయించాడు. ఇంటిముందరి మెరాబాలో వొకటీ, రెండు పాడి గొడ్లు తప్ప తక్కినవాటిని కొత్త దొడ్లోనే కట్టివేస్తున్నారు.

రామదాసు యింటిది తూర్పు వాకిలి. అతడు వీథి తలుపు నెట్టుకొని లోపలికి బోయి గొళ్ళెంవేసి ఆవరణములో నాలుగడుగులు వేసేటప్పటికి జోతి, అమ్మా! అయ్య వచ్చాడని చెప్పుతూ యెదురుగా పరువెత్తివచ్చి చేయి పట్టుకుని లాగి అమ్మకు సగం దోసకాయలు పచ్చడి నూరేటందుకు ఇచ్చానని చెప్పగా నీవు మంచి అమ్మనమ్మా అని తండ్రి లాలించేవరకు కొండెక్కినంత సంతోషపడ్డది. ఆవరణంలో వాల్చివున్న మంచముమీద తండ్రి కూర్చొంగనే అతని నలుముకొని వొడిలో కూర్చొని నేను పూచ

బియ్యం పిసికిళ్లు చేసుకొని తిన్నామూ, ఎవండ్లమూ యిన్నయినా పెట్టలేమూ అని దీర్ఘాలు తీస్తూ చెప్పింది.

రా : ఎవ్వరికి పెట్టకుండా అట్లా తినవచ్చా?

జో : తినకూడదమ్మా—ఈ తడవ తెచ్చుకొంటే పెడతాలే!

ఇంతలో మాలక్ష్మి పసికట్టు వేసుకొని కుడిచేతితో తోడుబాలూ ఎడమచేతితో యెత్తుపీటా తీసుకొని మందగమనంతో పొడుపు గొండపై వుదయించే పూర్ణచంద్రుని కిరణజాలము నెనురొక్కని తన చిరునవ్వుచే యెగతాళిచేస్తూ మంచం సమీపించి తన భర్త మిక్కిలి డస్సివుండడం చూచి 'అమ్మాయీ! మీ అయ్యమీద పడబోకు. అబ్బాయి ముసుగు వేసుకొంటాడేమో మంచముమీద కూర్చొని చూస్తూవుండు. లే, మాటవిని' అని అన్నది.

జోతి లేచి పసుగెత్తుకొంటూ బోయి పంచాదిలో దక్షిణపు పక్కన వేసివున్న పిల్లవాడి మంచంమీద కూర్చుండి వాడితో ఊఁ కొడుతున్నది. మాలక్ష్మి దూడను విడిచి పాలు చేపగానే కట్టివేసి గేదెను వెన్ను చరిచి యెత్తు పీటమీద కూర్చొని రెండు చేతులతో పాలు పిండ నారంభించింది.

రాకాచంద్రుడు మాలక్ష్మి మోముచందురుడు అపహసించడంచేత చిన్నబోయి మిన్ను కెగబ్రాకుతున్నాడు. రామదాసు వుత్తరీయమును జుట్టి తలక్రింద బెట్టుకొని చేతులు పట్టెలపై వైచి కాళ్లుజాచి అరమోడ్పు గన్నులతో చంద్రబింబము నాస్వాదించుతూ క్షణంలో అంతర్ముఖుడు కాగా పొత్తిళ్ళలో బాలుని ఊఁకారములూ పాలధారల జుంజుంరవములూ దహరాకాశమునను మహదాకాశముననూ విలీనమై వున్న నాదబ్రహ్మముతో నను సంధించి అన్ని ఓంకారమున నేకీభవించినవి. నాడు పీరయ్య యోగివరేంద్రుని కరుణచే త్రివేణీ సంగమమున కవలసహస్రార కమలమున బట్టబయలై వున్న పండు వెన్నెట లభించిన ముక్తికాంతా సందర్శన సంజాత నిర్మలానంద ఝురీనిమగ్నుడై వాడ

లెరుంగక యోగ సిద్ధింజెంది, సప్తద్వీపాంతరవర్తులై నవరత్న ఖచిత సింహాసనారూఢులై మణిస్థగితభర్మకిరీటధారులైన చక్రవర్తులకు అనుభవింపరాని మహదానందమును దేహం వొరుసుకొనిపోవు నులకమంచమున నుయ్యాలలూగే మాలదాసరి చూరగొంటున్నాడు. ఆకసము నిర్మలంగా వున్నది. మలయసమీరములు మాంద్యమును పొందినవి. గగనలక్ష్మి వేయి కనురిక్కలతో తనివోవక పరిశీలిస్తున్నది. మిద్దె పంచలోని దీపకళిక నిశ్చంచలమై వున్నది. చందురుడు పరుగిడ నొల్లక తిరిగి తిరిగి సంచరిస్తున్నాడు. విరాట్పురుషుడు తన వేడి కంటిని మరుగుపరచి కలువకంటిని విపులీకరించి కడగంటి కిరణములతో చుంబిస్తున్నాడు. మాలక్ష్మి దూడను పాలకు విడచి దుత్తను ఒకచేత బెట్టుకొని మెత్తుపీట రెండవచేత బెట్టుకొని లోపలికరిగి పాలు దాలిమీద పెట్టి పొంతకుండలలోని నీళ్ళు పట్టిచూచి స్నానం చేస్తే బడలిక తీరుతుందని భర్త దగ్గరకు వచ్చి లేపబోయి అప్పటి యాతని మహదావస్థను గ్రహించి కన్నుల బాష్పములురాల తన పూర్వపుణ్య వశమున యీ పుణ్యపురుషుని చెట్టబట్టుటచేగదా తన కిట్టి యద్భుత దృశ్యములు అప్పుడప్పుడు లభిస్తున్నవని ఆనందించి మెల్లగా కాళ్ళవైపుకుబోయి ప్రేమాతిరేకమున తన పమిటె కొంగుచే నాతని పాదములు విసిరి వాటికి తగలకుండ ముమ్మారు నమస్కరించి బాలుని కడకుబోయి 'అహమ్మాయీ మీ అయ్యకు కూరుకు పట్టింది. ఇక్కడ అరవవద్దు. పద'మని పొత్తిలి గుడ్డలతో బాలుని చేతులలో బెట్టుకొని తూర్పింటిలో పంచముకడనున్న మెత్తుపీటపై దీపమునకు సమీపమున కూర్చుండి బాలుని వొంటికీ మాడుకూ ఆముదము రాచి పాలు గుడుపుతూ తానిప్పుడే చూచివచ్చిన అద్భుత దృశ్యం మరల మనస్సునకు రాగా ఆ దృశ్యం యొక్క సూక్ష్మరూపమే తన యెదుట పాలుగుడుస్తున్నదని గోచరించి అదివరకు తన మనస్సునావరించివున్న ప్రేమ భక్తి వాత్సల్యంగా పరిణమింపగా ఆనందంగా తియ్యని పాలు

తాగుతూ సౌలభ్యవశమున బాలుడై తల్లివంక జూచు విశ్వ
స్వరూపమును విదలక వీక్షించి మైమరచి వున్నది.

జ్యోతి పచ్చడికీయగా మిగిలిన దోసకాయలను ముక్కలు గోసి అందరూ వచ్చిన తరువాత పంచుకొని తిందామని దాచి వుంచి అన్నలు వచ్చే వేళయిందని ముక్కలు దెచ్చి చేటలో బోసి దీపము యెదుట బెట్టుకొని కుప్పలు బెట్టుతూ మొదటికుప్ప నాదీ రెండవది బావదీ మూడవది అమ్మదీ అని వరుసగా అందరి కుప్పలూ పెడుతూ కూర్చున్నది.

౪

కుటుంబము :

మహాలక్ష్మి పిల్లవాడిని నిద్రబుచ్చి వసారాలోకి వచ్చేటప్పటికి రామదాసులేచి మంచముమీద కూర్చున్నాడు. మాయ తిరిగి అతని నావరించింది.

మా : నీవు లేచి స్నానం జేస్తే యింతలోకి పిల్లవాండ్లు వస్తారుగా. మళ్ళీ పొద్దుపోతుంది.

రా : అట్లాగే. నీళ్ళుంట్రోడు.

మా: సందున చేస్తావా యిక్కడికి తోడకవచ్చేదా ?.

రా: తోడకరా. చెంబుతో కాసిని నీళ్ళట్లెయ్యి.

రామదాసు తలుపుతీసుకొని వీధిలోకివచ్చాడు. నెలరెండు బార లెక్కింది. ఎదురుగా తూర్పుకనుమలవరుస వెన్నెట్లో నల్లగా నిగనిగలాడుతున్నది. ఈవరుసలో నూడిబోడు బొల్లుమోర రాయుడికొండ ఖిల్లాకొండ అనే మూడుశిఖరములు ఆకాశమును నిక్కి చూస్తున్నవి. దక్షిణాన కోసెడుదూరంలో యింకొకతిప్ప వున్నది. మాలపల్లెకు వాయవ్యాన మాదిగపల్లె, దానికి వుత్తరాన ఫర్లాంగుమారములో మాలకొండ కమ్ముకొని వున్నవి. రామదాసింటికి పడమర యిరవైగజములలో పూర

గొండా. యీ రెండింటికిమధ్య మంగళాపురమునుండి పడమటి పొలమునకుపోయే డొంకావున్నవి. వూరికి తూర్పుదక్షిణాలరాస్తా, దానికానుకొని వూర చెరువూ, వాటినడుమ శివాలయమూ, దానికి తూర్పున పంటకాలువా, దానిగట్టున అమ్మవారి కొండా వున్నవి. పెద్దకాలువ కనుమలను తూర్పుగా పోతుంది. గ్రామానికి యీశాన్యమునా నైరుతీమూలా రెండురైలుస్టేషన్లున్నవి.

రామదాసుయిల్లు యెదురుబడి రెండేసి మూలములమిద్దె. యింటికి తూర్పునా దక్షిణానా పెంకుటివసారాలూ యింటిముందు ఖాళీస్థలమూ వీధికానుకొని దక్షిణపు గోడమీద రెండుమూలముల వూరి కొట్టమూవున్నవి. యింటికి పడమర విశాలమయిన దొడ్డీ దక్షిణమున పశువులదొడ్డీ వీటిచుట్టూ పెంకుటి మదురుపోసిన ప్రహరీగోడాకలవు. పడమటపోయే డొంకలోకి యింటిదొడ్డికీ-పశువుల దొడ్డికీ దడ్డివాకిళ్లున్నవి. తూర్పున సింహద్వారములూ వాటికెదురుగా ఖాళీ పోరంబోకులూ వున్నవి. డొంకలోనుంచి యింటికి వుత్తరంగా ఒకవీధివొచ్చి పోరంబోకులో కలుస్తుంది. రామదాసు తండ్రి నలభై సంవత్సరములకింద యీ పోరంబోకులో నాటిన వేపచెట్టు పెద్దమానైంది. దానిమొదట అరుగువేసి పైన వీరబ్రహ్మంగారి కావిజండా యెత్తారు. యీచెట్టుకింద శ్రీ రామమందిరమూ గంథాలయమూ కట్టించడానికి స్థలం నిమిత్తం రామదాసురెండో కుమారుడు దరఖాస్తుపెట్టాడు. యింకా మంజూరుకాలేదు. పడమటిల్లు రెండుగదులుగా అరగోడబెట్టి విభజించారు. తూర్పింటిలో గదులులేవు. కాని ఆగ్నేయమున గదిపారున పెద్ద అరుగు వేసి వాటికి రెండుపక్కలా తూర్పు వసారాలోకి కొత్తగా రెండు కిటికీలు పెట్టించారు. తూర్పింటిలోనుంచి దక్షిణపు వసారాలోకి దానిలోనుంచి పడమట దొడ్డిలోకీ వాకిళ్ళున్నవి. దక్షిణ వసారాలో వంటచేసుకొంటారు. తూర్పింటిలో వుత్తరపుదరిన గడవంచీ వొట్టాకు మండే, పెట్టె, కొట్టంలో మిరపకాయలబోరెంలూ గింజలుగాదె పెట్టారు. వుత్తరపు గోడవెంబడి వున్న మూడుపాతళ్ళకుగాను వొకదాంట్లో వడ్లు నిలవున్నవి.

రామదాసు బయటపని దీర్చుకొని వాకిటిదగ్గరకు వచ్చే వరకు వెంకటదాసూ అప్పాదాసూ కావిళ్ళు వేసుకొని పేరెములు తీస్తూ కేకిసలు కొడుతూవస్తున్నారు.

రా: ఆఁ, మెల్లగారాండి బుంగలు పోగొట్టేరు.

అప్పాదాసు కావటియొక్క వెనుకమట్టు మండిగానికి తగిలిందిగానీ బుంగ పోలేదు.

రా: అడుగులో హంసపాదు పెట్టేవురా.

అ: ఇంతమాత్రానికేనా.

రా: అప్పడూ! నీ కావిడిక్కడ దింపు. చన్నీళ్ళకుంటవి. యింతఆలస్యము జేశారేమి?

అ: బానలూ తొట్లూ అన్నీ నింపేశాం.

రా: ఆఁ. అట్లా రొప్పుతున్నావేమి?

అ: బావ నన్ను బహుతిప్పలు పెట్టాడు. ఆయన యెన్ని కావిళ్ళు తెచ్చాడో నేనూ అన్ని తెచ్చా. వచ్చేటప్పుడూ పోయేటప్పుడూకూడా ఒకటేవురకడం.

రా: పెద్దబ్బాయ్ యెందుకురా పాపం చిన్నవాణ్ణి తిప్పలు పెట్టడం?

వెం: (అప్పడి వంకచూచి) - చిన్నవాడివా? గార గసి కాలె వున్నావు.

మా: మీరిద్దరూ యిట్లారండి. పొంతకుండలు వాకిట్లోకి పట్టుక వస్తురుగాని.

వెం: ఇద్దరేసి పట్టాలనా. రారా చెరివొకటి పట్టుకవస్తాం.

మా: అయ్యో వాడొక్కడా! నడుమునొప్పి పట్టేను. మీ పంతాలు సరే కాని నా పొంతకుండలు భద్రం.

జోతి రెండు చెంబులు పట్టుకొని వచ్చింది. ముగ్గురూ నీళ్ళు పోసుకొంటున్నారు. మాలక్ష్మి భర్తకూ కొడుక్కూ వీపు

తోముతుంటే జోతి నేను బావకు వీపు తోముతానని నడుము దగ్గర సన్ననై బుజముల దగ్గర విశాలమైన వీపుతోమింది.

స్నానమైన తరువాత వుతికిన పంచలు కట్టుకొని అందరూ యింట్లోకి పోయినారు.

వంటవసారాలో ఆగ్నేయాన పొయిలు పెట్టారు. పడమటి భాగంలో రామదాసుకు పళ్ళెమూ తక్కినవాండ్లకు కంచాలూ పెట్టి అన్నం వడ్డించి దానిమీద గోంగూరవేసి యిదిగో మీ అమ్మాయి తెచ్చిన దోసకాయల పచ్చడని తలాకాసిని పచ్చడి బద్దలువేసి సాయంత్రం వేసే మామూలు ప్రకారం అందరికీ నెయ్యి వేసింది.

జోతి : అమ్మా యిటురా మాట (చెవిలో) అందరికీ నా దోసకాయ ముక్కలు పెట్టవూ?

మా : ఇప్పుడు కాదు. అన్నం తిన్నతరువాత.

జోతి : అందాకా చెప్పవద్దు.

రా : ఏమిటా రహస్యం.

జోతి : వొట్టు. చెప్పేవు!

మా : చెప్పనులే; మీ కెందుకూ మాసంగతి.

రా : చెప్పకపోతే మానెలే.

జోతి : చూడమ్మా యీ మొద్దుకంచం నాకు కదలదు. బుల్లికంచం కొనిపెట్ట మంటేనూ.

మా : ఈ తడవ కంచరవాండ్లు వస్తే కొందాంలే.

జోతి : అయ్యోయ్. అమ్మే - నాకే - పయిటాల - రోజూ - ఆ బియ్యపు అన్నమే - పెట్టమంటే - పెట్టదు.

మా : ఏమే అమ్మా, సుకరాలు పోతావు, ఈ పూట వండింది నీకు చద్దెన్నానికి మిగిల్చి పెడుతూనేవుంటిని. ఎటువచ్చి నీవు మధ్యాహ్నమేగా జొన్నన్నం తినేది. కాకపోతేమట్టుకు పండిన గింజలు పారబోసుకుంటారూ?

వెం : మూడు పూటలూ వరెన్నందింటే వ్యవసాయం చేసినట్టే. తూర్పున అసలు మెట్టేలేదు. వాండ్లకేమి వ్యవసాయముంది ? నాట్లువేయడమూ నురుచుకోనడమూ; మనుష్యులు పూదపాట్లలూ వాండ్లూ వుంటారు.

మా : మధ్యాహ్నం మీకు అన్నం దీసుకొనిరావడానికి నానాటికి యిబ్బందీ అయింది. మీ రిద్దరూ చెరొకకోనకూ పోతిరి. నేను యింట్లో వుంటే బయటికీ బయటికిపోతే యింట్లోకీ లేదామె. అఖరుకు పెట్టిపున్నన్న మేనత్తను బతిమలాడి పిల్లవాడి దగ్గర కూర్చోబెట్టి అదరాబదరా లగువులుతీసి వచ్చేవరకు పిల్లవాడు చేతుల్లో నిలవకుండా యేడుస్తున్నాడు. అసలావిడకు పిల్లవాణ్ణి పట్టుకోనే చేతకాదు.

వెం : అసలు పుట్టుకుంకామె

మా : నిరుడు యీ రోజుల్లో ముసలమ్మ బాగా వోపిగ్గానే తిరుగుతున్నది. ఏదీ ఆమె మంచానబడి వడసారం ఆరు నెలలు కూడా కాలేదు. ఆమె రోజులు వెళ్ళబుచ్చుకొని పోయింది మహారాజు. ఎప్పుడూ గడిచినరోజులే మంచివి.

రా : కాలం వచ్చినపుడు పోక మన కిబ్బందని మాను కొంటుందా. రేపు మన కాలమువస్తే మనముమాత్రం బోమా. పిల్లలు నా దార్లంటే వదిలిపెట్టి వూరుకుంటాడా.

జోతి : అమ్మో! రేపెక్కడకే అయ్యో, నీవు పోవడం.

అ : (పగలబడి నవ్వుతున్నాడు.)

వెం : ఎక్కడకా ? దేవుడిదగ్గరకు.

జోతి – దేవుడు తన దగ్గరకు మిమ్మలను రానిస్తాడా ?

మా : ఆ; ఆ. దేవుడు రానిస్తాడు.

జోతి : ఇక్కడికి దేవుడిగుడిలోకి మనలను రానీయరేమి?

మా : రానీయకపోతే వాండ్లే చెడ్డారులే ! మీ అన్న మనకు దేవుడిగుడి కట్టిస్తున్నాడుగా.

జోతి : మన గుడిలోకి వస్తాడా దేవుడు ?

మా : ఆహా యెవరు కట్టించుకొన్నా వస్తాడు. ఆయన కంటు లేదు.

రా : పెద్దదేవుడు మనలోనే వుంటే యీ రాతిదేవుళ్ళెందుకు ? రాళ్ళు దేవుళ్లయితే రాసులు మింగవా అన్నాడు.

వెం : నీదంతా అద్వయితం. అంతా నీ అంతవాడ్లయితే దేవుడిగుళ్లక్కరలేదు. మేమంతా ముక్కులు పట్టుకొని కూర్చుంటామా యేమి ?

రా : ఎందుకు కూర్చోగూడదు ?

వెం : బువ్వక్కరలా యిగను.

రా : పెట్టివుంటే అదేవస్తుంది.

వెం : చాకిరి చేసుకుంటేవస్తుంది.

రా : చాకిరి చేసుకొన్నా రానిరోజులు వస్తవోయ్. అప్పుడు మన తెలువులేమీ అక్కరకురావు. లక్ష్మి యెటువంటిదంటే తాటికాయల్లో నీళ్ళు చూడరాదూ. అవ్వేవస్తవి అవ్వే యెండిపోతవి.

. "సిరి దా వచ్చిన వచ్చును; సలలితముగ నారికేళ సలిలము
భంగిన్. సిరి దాఁబోయిన బోవును, కరిమ్రింగిన వెలగ
పండు క్రమమున సుమతీ,"

జ్యోతి : అమ్మా మొద్దుకంచాన గుజ్జుతీసుకుంటే రానే రాదు.

మా : అమ్మాయీ! నీకు పొద్దుగూకులూ గునుపేనేమే !

జ్యోతి: చూడమ్మా నాచేతిన యెంతగుజ్జతుక్కున్నదో. గీస్తే అట్లాగే వుంది. ఎప్పుడమ్మా చిన్నకంచం గొనిపెట్టడం ?

మా : నీవు యేపట్టుపడితే అదేపట్టు. కొనిపెడతానంటిగా.

మాలక్ష్మి చల్లపోస్తూ వుప్పువడ్డిస్తున్నది.

వెం : అయ్యకు కాస్త పెరుగు వేయరాదూ ?

మా : అందరికీ వే స్తేనేగాని ఆయన వేయించుకోడట.

వెం : అందరూ పెరుగుతాగవలెనంటే నాలుగుబర్లపాడి కావాలె.

మా : సరేనాయనా యీ వొక్కబత్తైతోనే తెమలడం లేదు, రెండోబత్తైకూడా యీనితే యెట్లాగా అని చూస్తున్నా. నీచెల్లెలు రోజూ మూటెడు గడ్డి తెస్తుందేమో యేదో వొక మాటచెపితే.

రా : ఆమె వున్నబత్తైనే అమ్మేతాననంటున్నది. గడ్డి కూడా దొరక్క.

మా : మనచేలల్లోనే తెమ్మనేది. ఆసాములుపుట్టనిస్తారూ! గడ్డి యెండిపోయినా మాబాగేకాని నూలవాండ్లు కాలుపెట్ట కూడదు.

రా : కనుక్కో ఏమంటుందో.

మా : ఇప్పటికీ వున్నగొడ్లను సగరొప్పుకుంటే చాల్లే. ఈ యేడు మాపెద్దబ్బాయి పెండ్లైకోడలు వస్తే అప్పటికిచూచు కొందాం.

వెంకటదాసు తలవంచి ముసి ముసి నవ్వులు నవ్వుతూ వూరుకొన్నాడు. అందరూ భోజనంచేసి దొడ్లో చేతులు కడుక్కొని తూర్పింట్లోకి పోతున్నారు. మాలక్ష్మి భోజనానికికూచ్చున్నది.

జ్యోతి : (రహస్యంగా) ముక్కలుపెట్టవద్దూ.

మా : అమ్మాయి తియ్యదోసముక్కలు పెట్టుతుందట, తీసు కోండి. పెట్టేదాకా నిలవడంలేదు.

రా : ఇందాకటి రహస్య మదేనా?

అ : యిటదే యిటదే అని ఒకకుప్ప తీసుకున్నాడు.

జోతి అందరికీ తక్కినవిపంచి పెట్టింది. రామదాసు ముక్క లుతింటూ దస్తరం దీసుకొని వసారాలో దీపందగ్గరకు పోతూ వుండగా—

వెం : ఈయేడు పొగత్రోట మానుకుండే టల్లేనా ?

రా : సంగడు అందరిచేత పొగాకు మాన్పిస్తుంటే మనము పొగాకు పండించడమా. సావరాల్లో తాటిచెట్లు గీత కియ్యాసనాన్నాడట.

వెం : ఈ వున్న వొట్టాకయినా యేకాడికో పోకడపెట్టుకుంటే మంచిది. వాడుయిదంతా తగలబెడతా నంటాడేమో. ఎంతహీనమైనా వందరూపాయల సొమ్ము.

రా : అంతమాత్రపు వాడుకూడాను.

వెం : రేపుపొద్దున బేరమిచ్చి తోలిపెడతా.

రా : నీయిష్టం - యింటిమట్లో వొకబొక్కు లేదేమిరా ?

వెం : లేకేమవుతుంది ? బాగా చూడు.

రా : చూశా. వెంగమ్మగారి రాజయోగసారమూ, శేషాచల నాయుడు గారి పరమపదమార్గమూ, సిద్ధప్పగారి తత్వాలూ, కోటయ్యగారి గురుకీర్తనలూ, శివరామ భాగవతుల వారి తత్వకందార్థాలూ, పీరయ్యగారి యేలలూ, సీతారామాంజనేయమూ, బుచ్చయ్యగారి సాధన చతుష్టయమూ-అంతే. శ్రీరామ శాస్త్రులవారి భక్తియోగం లేదు. అది నాపారాయణ గ్రంథం.

మా : లోపలనించి - పొద్దున సంగడూ మరొకాయనా వచ్చి వొక పుస్తకం తీసుకొని పోయినారు. రెండో ఆయన యెవరో తుంగదుర్తి బుచ్చయ్యగారట. మన అయ్యగారూ వారూ గురుపుత్రులుటే ?

రా : బుచ్చయ్యగారా ! మన యింట్లో అడుగుపెట్టారా! యెంత సుదినం. అయ్యో నేనింట్లో లేకపోతినే అప్పుడు. ఆయన మహా తపశ్శాలి. యెన్నాళ్ళనుంచో దర్శనం చేయవలె నను కొంటున్నా. వారు యెక్కడ దిగారో ?

మా : ఎక్కడ దిగిందీ నాకు తెలియదు. రేపల్లా వుంటారట.

రా : అయితే సరే. పొద్దున దర్శనం చేయవచ్చు.

వెంకటదాసూ అప్పాదాసూ దుప్పట్లు తీసుకొని కొత్త దొడ్లో పడుకొనేటందుకు పసారాలోకి వచ్చారు. వెంకటదాసు మనస్సు మండె వేసిన వొట్లాకుమీదికి పోయింది. మళ్ళీ మలుపు కొన్నాడు. అన్ని పనులకంటే ముందు పొద్దున పొగాకు అమ్మి వేయవలెనని అనుకొంటూ యిద్దరూ బయలుదేరారు.

అ : బావా! అదిగో బర్రె యీనుతూవున్నది.

వెం : నిజమే. బర్రె యీనబడ్డది.

జోతి : ఆ మాటలు విని పరుగెత్తివచ్చి చూచి-అమ్మా, మనబర్రె యీనుతున్నదే.

మాలక్ష్మి త్వరగా చెయి కడుక్కొని నాకిట్లోకి వచ్చింది.

జోతి : అమ్మా, మనకు చిన్న బుజ్జాయి పుడుతుంది గావాలె.

మా : పుడుతున్నది.

వెం : మనం పోదాం రారా.

అ : ఇవ్వేళ యిక్కడే పడుకొంటా. తెల్లవారుజామున లేచి పనికోసం వస్తాలే.

వెం : ఇక్కడేమి చేస్తావు ? బర్రెకు నడుములుపడతావా ?

అ : నీవు పట్టు.

రా : పెద్దవాండ్లను మళ్ళీ అంటార్రా ?

వెం : సరే, నేబోయి హాయిగా పడుకొంటా.

౫

బ ట్టె

రా : బర్రె లేవకుండా వున్నది. కొంచెం లుగ చెడ్డట్టు కనబడుతున్నది.

మా : లుగ చెడడమంటే వొంటి గొడ్డుకున్న పోషణ నాలుగు గొడ్లల్లో అమురుతుందా. అందులో యీతలు ముదిరిన గొడ్డు.

రా : కాస్త పచ్చిమేత వేస్తే యిప్పుడు?

మా : ఇప్పుడు మేత తింటుందా? నారాయణమూర్తి బెట్టిన ఆ నాలుగు ఘడియలూ గడవాలె. పాపం దానికి కష్ట సమయంగదా!

జోతి : అమ్మోయి! బత్తె నాలుక వెళ్ళబెట్టుతున్న దే.

అ : అదిగో! వుచ్చబుడ్డ పడిపోయింది.

మా: ఇక అట్టే సేపు పట్టదు.

జోతి : రెండుకాళ్ళతో దణ్ణం పెడుతున్నట్టుగా వున్న దేమే.

మా : నారాయణమూర్తి! ఈ మాయ ప్రపంచంలో యెందుకు పుట్టిస్తున్నావురా అని దణ్ణం పెడుతుందట.

రా : భూమిమీద పడేవరకూ జంతువుకు పూర్వజ్ఞాన ముంటుందని రాజయోగసారంలో చెప్పారు. అదిగో కలిలో ప్రవే శించింది.

జోతి : అదిగో దూడవచ్చింది.

బత్తె చటుక్కునలేచి గిఱ్ఱునతిరిగి తనజన్మ సార్థకమైనట్లు కండ్లనానందం వెలిబుచ్చుతూ బిడ్డను చూచి వాయికెలు కొట్టుతూ వొంటినున్న మురికంతా నాకడం ఆరంభించింది.

మా : దాని ముక్కులా కండ్లా మష్టుతుడవండి.

రా : ఎవ్వరూ తుడవక్కరలేదు. తల్లే తుడుస్తున్నది.

మా : ముక్కులు వూపిరాడవు. తుడిచి గట్టెలు గిల్లండి. మొగదూడే; మీ మాగాని దున్నుతుంది.

రా : ముక్కులు పిండి గట్టెలు గిల్లబోగా బర్రె బుస్సు మన్నది. దానిని గదిమి గట్టెలు గిల్లి పొట్టమీద పెడితే తల్లి తిని వేసింది. దూడ వొక్కమాటు చిన్నగా అరిచి కాళ్లు ముడుచు కొని మెల్లగా లేచి తొట్రుపాటుతో తప్పటడుగులు వేసి పొదుగు వంకకు పోయింది.

మా : ఓసి నీకడుపుడక, అప్పుడే నీ కడుపులో యెలుకలు తోడుతున్నవటే! నోటి కందించండి.

రా : దానిని పొదుగుదగ్గరకు యెవరు పంపించారో వారే కుడుపుతారు. మీరు తొందరపడడమెందుకు ? చూస్తూవుండండి.

దూడ మెల్లగా పొదుగులో మూతిబెట్టి అటూ యిటూ నెట్టి నోటిలో చన్ను యిరికించుకొని చప్పరించడ మారంభించింది.

రా : సరేనా.

మా : సరిగా కేముంది. జంతువు పుట్టించే అందుకామె.

రా : అన్నమయకోశాన్ని పోషిస్తేగా ప్రాణమయ మనోమయ విజ్ఞానమయకోశాలు అందులో నిలువబడేది ?

జోతి : అమ్మా, జున్నుబాలు తాగే దెప్పుడే ?

మా : ఈపూటవి ముఱ్ఱుబాలు పిండి కుడితిలో బోసి పొద్దుటివి జున్ను చేసుకోవచ్చు.

రా: మాయపడేవరకు యెట్లైనా వొకగంటసేపు పడుతుంది. దానికి మానెడు గింజలు పెట్టి కాస్త వరిగడ్డి వెయ్యి. పుంజుకొని మాయవేస్తుంది.

మా : అప్పడూ ! గడవంచిమీద తట్టలోని మానెడు సజ్జలు చేటలో పోసుకురా.

అప్పడు సజ్జలచేట ముందర పెట్టంగనే బర్రె దాణా తిని వొళ్ళు విదిలించి వరిగడ్డి మేస్తూవున్నది. దూడ కాసినిపాలు తాగి అటూఇటూ రెండడుగులు వేయబోగా తల్లి దూరంగా పోనీయలేదు. నాలుగునిముషములలో దూడ కిందబడుకొని కనుమూయ నారంభించింది. బర్రె దూడను మూచూచి సమీపాన పడుకొన్నది.

అ : మామా, రేపు వూళ్ళో గొడ్లను చెరువులో నడిగడ్డకు తోలుతారట. నీరు దీసింది.

రా : ఈయేడు గడ్డి బాగాబట్టిందా.

అ : మోకాలెత్తు పెరిగింది. పెదనడిగడ్డన అంతా తుంగ బట్టింది. కాని చినడిగడ్డన దోమకాలూ చెంగలీ కలగలుపులుగా పెరిగింది.

రా : అయితే బాగా పదిహేనురోజులు మేయవచ్చు. తుమ్మకాయ యెద్దులకు పదిరోజులు సరిపోతుంది. ఫుల్ల రెంత?

అ : యెంత; ముష్టిది. బర్రెకు అర్ధా, ఆవుకు పావలా. పుల్లరిఖరీదు వొక్కరోజు మేతకే యీయవచ్చు.

రా : రేపు ఆడగొడ్లన్నింటిని తోలకపో. పుల్లరి రేపే యియ్యవలెనా?

అ : మనగొడ్లకు తరువాత యిస్తామంటే వూరుకొంటారు. రేపు వూరికే లెక్కవ్రాసుకొంటారు.

మా : అడుగో పిల్లవాడు లేచినట్లున్నాడు. మామా అల్లుడు మాత్రసానిపని చేయండి. నే బోయి పడుకొంటా. పద పిల్లా పడుకుందువుగాని బుజ్జామ పుట్టిందిగా.

జోతికి కూరికెపాట్లు వస్తున్నవి. లేచి వొళ్లువిరిచి బుజ్జామను వొక్కమాటు ముద్దుపెట్టుకున్నది.

జోతి : అమ్మా, దీన్ని లోపల కట్టివేయవద్దటే.

మా : నిన్ను మీఅమ్మదగ్గర లేకుండా బయట కట్టివేయ మంటావా?

జోతి : ఊఁ పోమ్మా.

మా : రాత్రి చినుకులేమి రావులే. కాస్త మర్లు అణిగిన దాక దానెమ్మదగ్గర పడుకోనియ్యి. ఇప్పుడే తీసుకపోతే తల్లి అరు స్తుంది.

అ : అత్తా, రేపు నాకు పెసగన్నం గట్టాలే.

మా : అట్లాగేలే. యేమికథ?

అ : రేపు వూళ్ళో గొడ్లవాళ్ళంతా కుషామత్తుగా ఆడు కుంటారు.

రామదాసుకూ అప్పాదాసుకూ పక్కలువేసి మాలక్ష్మి, జోతి లోపలికిపోయి పడుకొన్నారు.

అప్పుడు తనమంచమున కానుకొని గొంతుగూర్చొని కొంచంసేపు బర్రెవంక చూచి మోకాళ్ళమీద ముంజేతులు

అడ్డంగాపెట్టుకుని వాటిమీద తసమొగ మానించి తాను పొద్దున పెరుగన్నం కట్టుకొని నడిగడ్డకు పోవడమూ అక్కడ పిల్లలతో ఆడుకోవడమూ చెర్లో యీతకొట్టడమూ తలపోసుకొంటున్నాడు.

రామదాసుకు బుచ్చయ్యగారు తలంపుకు వచ్చారు. కొంచెము దీపం దగ్గరకు జరిగి దస్త్రంలోవున్న గురుకీర్తనలు తీసుకొని నాలుగుకీర్తనలు కూనరాగములుతీస్తూచదువుకొన్నాడు. ఇంతలో బత్తిలేచిన చప్పుడయింది. రామదాసు బత్తివంక చూచి పుస్తకం మూసి, "అరే అప్పుడూ మూయవేస్తున్నట. తింటుం దేమో మూతిమీద కొట్టు" అని చేతులోవున్న కట్టెతో పేడ పళ్ళికెలోకి మావినెట్టుకొని దూరంగా బోర్లించి చేతులు కడు క్కొని పీఠితలుపు గొళ్ళెంవేసి యిక పడుకోరా పొద్దుపోయిందని అప్పడితో చెప్పి తన మంచముమీద పడుకొన్నాడు.

అప్పడికి వెంటనే నిద్రపట్టింది. రామదాసుకు యేమో ఆలా పనగా వుండి కాసేపు లేచి కూర్చున్నాడు. మనస్సు ఆలోచన సముద్రంలో సుడిగుండమువలె గిరగిర తిరుగుతున్నది. తలంపులు వొకదానివెంబడి వొకటి తరంగములవలె వస్తున్నవి. అరేదాని కేమి తెలుసు, పశువని అనుకొంటాము. దానికి హృదయంలో తన బిడ్డమీద యెంత ప్రేమవున్నది. "మరులు కాస్త అణిగిన దాకా" అని ఆబిడన్నది. అబ్బా యేమి మర్లు! అయితే అవికూడా అణిగిపోతవిగాంపలె. మొదట వున్న మర్లు యెందుకు తరువాత వుండవు? దూడ పెద్దదైతే తల్లీ పిల్ల సంబంధం అవి అసలే మరచిపోతవి. ఈ సంబంధమునే పుత్రేషణ మంటారు. దారేషణం పశువులలో తక్కువగా వున్నదనుకొంటాను. నిజంగా పశువులలో స్త్రీ పురుషసంబంధమును వ్యసనమే అనడానికి వీలులేదు. ఋతు కాలంలో తప్ప ఒకదానిమొఖ మొకటి చూడవు. తల్లి పెండ్లి మాట యెత్తంగనే వెంకటదాసు యెంత ఆనందపడ్డాడు! ముఖం కళకళలాడింది. మొన్నటిదాక యేమి యెరగనట్లు వుండేవాడు. ఋతువు వచ్చేవరకు ప్రతిదీ అట్లా మారిపోతుంది గాంవాంలె. ఏదో వొక అద్భుతమైన రసప్రవాహం పొంగివచ్చినట్లు కనబడ్డది. ఇవి

వ్యసనాలనీ తుచ్ఛసుఖాలనీ కొందరంటారు. నాకు కనబడ్డ యీ రెండు దృశ్యములూ వట్టి యీషణములేనా, మాయాకల్పితములా. మాయంటే అనేక అర్ధములు కావచ్చు. దానికేమి. ప్రేమాస్వరూపుడయిన భగవంతునియొక్క ప్రేమే అనేక రూపములుగా పరిణామిస్తుందని సంగడంటాడు. అయితేయివికూడా భగవంతునివలె శాశ్వతములు కావాలె. మాయమట్టుకు శాశ్వతమయినది కాదా. యివి దుష్టములనీ త్యాజ్యములనీ బోధిస్తారే. ఈ బోధల ప్రకారం యశోదాగోపికలయొక్క ప్రేమనుకూడా యీషణము లనవలసివస్తుంది. అవి యీషణములయితే వారికి మోక్షసాధనము లెట్లాయినవి ? పైగా క్రోధంకూడా మోక్షసాధనమన్నారు. మొత్తంమీద చూస్తే ఐహికం ఆముష్మికానికి మెట్టులాగ కనబడుతుంది. ఈ మెట్టును వుపయోగించుకోవడంలో వుంది. నిచ్చెన స్వర్గానికీ వేయవచ్చు, నరకానికీ వేయవచ్చు. పైకిపోయే మెట్లు స్వర్గానికీ దిగఁవురుపోయే మెట్లు నరకానికీ దారితీస్తవి. సృష్టిలోవుండే అంతస్తులనుబట్టి చూస్తే మనుష్యులము చాలా యెక్కవచ్చాము. వీటిని పూర్తిగా యీషణము లనడంకంటె, మోక్షసాధనము లనడమే బాగుంది. ఈపసు వీయీతకు వొకమెట్టు పైకెక్కిందనుకొంటాను. వెంకటదాసూ తాను పొందిన ఆనందంవల్ల వొకమెట్టు యెక్కినట్టే భావిస్తాను. అందుకనే రాజయోగం సర్వోత్కృష్టమన్నారు. రాజయోగమంటే నిచ్చెనవేసుకుని మేడెక్కినట్టు. మనుష్యులకు యెగిరి మేడెక్కడం దుస్సాధ్యం.

పూర్వ సంస్కారంవల్ల సంగడికి అన్నీ మంచిదారులున్నవి. వాడికింకా పణుకుచిక్కినట్టులేదు. కాస్త చేయందించేవాడు లేకపోతే దార్లు తొలుగుతవి. బుచ్చయ్యగా రనుగ్రహిస్తే బాగుండు. సంగడు హెచ్చరించేవుంటాడు. పొద్దున ఆయనతో అనిచూతాం. యేమంటారో.

రామదాసు కీ తలంపులన్నీ అప్రయత్నంగా వచ్చినవి. ప్రారంభంలో వీనిని తొలగింపవలెనని ప్రయత్నం జేశాడు. చేత

కాలేదు. తరువాత ఆ ప్రయత్నమే మరచిపోయి ఆలోచనాప్రవాహంలో పడ్డాడు. మైళ్ళకొలది కొట్టుకొని పోయినాడు. ఇప్పుడు తిరిగి స్ఫురణకువచ్చింది. బలవంతంగా నిలవదొక్కుకొన్నాడు. ప్రవాహంలో నిలువరించలేకపోయినాడు. కట్ట తెంచుకొన్న ప్రవాహంవలె మనసు పరుగెత్తుతున్నది. చిత్తమును నిరోధింపవలెనని పునఃప్రయత్నం జరిగినా సాధ్యంగాలేదు. ఆలానము విరుచుకొని పరుగెత్తు మదపుటేనుగువలె విహరిస్తున్నది. గురువాక్యం తలంచుకొన్నాడు, స్మరించాడు. సాయంతన మంతసులువుగా నలవడిన యేకాగ్రత మరల కుదరలేదు. నీటి పొనలవలె పుట్టి మానసక్షేత్రము నార్ద్రముగ చేసే చింతనామృత ముబికిరాలేదు. జలలు తిరిగిపోయిన బావివలె మానసం శూన్యమైంది. మరచిన వేణుగానసరళిని మనస్సునకు దెచ్చుకొన ప్రయత్నించి విఫలమనోరథమయిన గోపిక చందమున నిగమమహాటవిలో సంచరించి పరబ్రహ్మముగానని ఛాందసునిమాడ్కి ఖేదమనస్కుడై నిట్టూర్పుల నిగుడ్చుతూ కనుల నశ్రుకణము లురులనిలిచి వాక్కుక్షణ మూరకున్నాడు. మనస్సునకేదో అకాత్తుగా స్ఫురించింది. చూడ్కులు గొడుగుబల్లపై ప్రసరించినవి. తలపై నెమిలిపురిం జెవురుకొని కందామరలు అరమోడ్పుజెంద వెడదలై కడుంగడు నిడుదలై లావణ్య ముఖసరోవరమున తేలియాడ నెన్నుదుటిపై కస్తూరి తిలకమును దులకించే ముంగురులు చెర్లాటలాడ సొబగు దళుకొత్తే చిరునవ్వు తేలికాంతులను లలితకపోలములపై ప్రసరింప మొగము నోరగా నుంచి పగడంపుజిగి నెగజిమ్మ బింబాధరములపై కడాని వంశలతం జొనిపి నెత్తావి వెదజల్లు ముఖకమల సమీరంబులచే పిల్లనగ్రోవి నూదుతూ చిగురుటాకులరవళి నువ్వెత్తుగొనని వేలుగొనలు వేణురంధ్రములపై బరపుతూ వైజయంతీ లతాశోభితమై బంగారు చిరుగజ్జియలు కిణికిణి రవంబులతో హేమపీతాంబరాలంకృతమైన జఘనంబుననూ ముల్లోకపావనము లయిన వ్యత్యస్తాంఘ్రికమలములనూ తాండవమాడ త్రిభంగి లలితంబై నీలమేఘశ్యామంబై భువనమోహనంబైన శ్రీకృష్ణాఖ్య పరబ్రహ్మము

నడుమనిలువ ఆ జవ్వనంపు మొలక బొచ్చెములేక అచ్చుబడి అచ్చెరువుగ అందరి కన్నిరూపులై కాలుమువ్వపై హత్తికొను క్రొొక్కారు మెరుంగులంబోలు గోపకన్యాసహస్రములతో కేలం గేలుగీలించి అంగనపొంత మాధవుడూ ఆతనిచెంత నంగనగా నల్లకలువలూ హేమ కమలములూ కలిపికుచ్చిన దండయొక్క రవళి యువఘుళింప శృంగార భావభరితంబై నవరస పోషితంబై ఘుల్లుకంకణాకలితంబై మండలభ్రమణము గావించు రసమండలము మనోనయనామృతంగా చిత్రింపబడిన నొక్కచిత్రపటముం గని నిశ్చేష్టుడై చిత్తవృత్తులు నశింప సంకల్పరహితమైన మనస్సుతో వూరకున్నాడు. పటమును కొంతవడి చూచి తలవూచి "అవున వును. ఈ దృశ్యమూ భగవంతుని ప్రేమయొక్క విలాసమే. ఇక్కడ యీవిధంగా వ్యక్తమైనది. అస్తగిరిగహ్వర వినిర్గతమై కృష్ణాలహరి వొకచోట రాళ్ళపై నెక్కి దుముకుతుంది. ఒక స్థలమున కారడవిలో విటపివారముచే నాచ్ఛాదితమై దాగుడుమూతలాడుతుంది. వొక కెలంకున సన్నగిలి చిన్నబాలికవలె చెర్లాడుతుంది. వొకతావున మడుగుగట్టి నిర్వేగమై నిలిచిపోతుంది. వొక తేవను రౌద్రరూపిణియై పొంగి పొరలి వెల్లువలై సృష్టిసంహారం గావిస్తుంది. వొక పరుపున బంధింపబడిన మందగామినియై ఆంధ్ర మాతృస్వరూపం దాల్చి ఆంధ్రలోకమునకు జీవనములు వర్షించి సర్వకళా ప్రదాయినియై అంతర్ధానము నొందింది. యివియన్నీ కృష్ణామాయియొక్క విలాసము లయినట్లు ఈబ్రహ్మాండములన్నీ ఆ ప్రేమాసముద్రునియొక్క లీలలే. కృష్ణుని బాలలీలలచే యశోద ముఖమున తాండవమాడిన ఆనందమే మహిమముఖమున అవతరించింది. ఈ పటమునందలి కృష్ణుని ముఖస్మేరలేశమే వెంకటదాసుయొక్క చిరునవ్వు. ఇవి రెండూ దాసుకూ గేదెకూ తరుణోపాయము లనడానికి సందేహంలేదు" అని నిశ్చయించుకొని నయన గోచర మవుతున్న మోహనరూపము తన హృదయ వేదనను శమింపజేయగా దానికి మరిమరి నమస్కరించి తనమంచంపై పరుండి నిద్రబోయినాడు.

౬

## గొడ్ల కాపరులు

మహాలక్ష్మి చీకటితో లేచి అవసరాలు తీర్చుకొని మొగం కడుక్కొని అప్పడిని లేపి కొట్టం దగ్గరకు బంపి దక్షిణవసారాలో చల్ల చేయడానికి ప్రయత్నం చేస్తున్నది. జోతి ఆ చప్పుడువిని లేచి తన కళాయిగిన్నె తీసికొని చద్దెన్నంలోకి గట్టిపెరుగు దాంట్లో వేయించుకొని నంచుకోడానికి మీగడ పెట్టించుకొని తల్లి చల్ల చేస్తుంటే చూస్తూ కూర్చున్నది. రామదాసు కవ్వపు చప్పుడు విని లేచి పాడిగొడ్లకు మేతవేసి నీళ్ళు తీసుకొని బయటకు పోయి నాడు.

కవ్వపుచప్పుళ్లు వినబడుతున్నవి. రాత్రి చేనికికావలిపోయిన కుఱ్ఱవా డెవడో గొంతెత్తి శ్రావ్యంగా పాడుతున్నాడు. కిఱ్ఱు కిఱ్ఱు మను కావిటి శబ్దములతో జనులు నీళ్ళు మోస్తున్నారు. తూర్పు రేఖలు తెల్లవారుతున్నవి. మాల మాదిగ పల్లెల చుట్టూ పారవేయబడ్డ యెముకలనుండీ, పశు కళేబరాలను కోసినస్థలము లలో విడువబడ్డ మురికినుండీ, తోళ్ళూరడానికి నానవేసే గాబుల నుండీ, దండెములమీద ఆరవేసిన కుళ్ళుమాంసము వరుగునుండీ, గ్గాలు బయలుదేరి నలుదిక్కులా వ్యాపిస్తున్నది. ఈ గబ్బుకు చిన్నప్పటినుండీ అలవాటుబడ్డ రామదాసుకుకూడా కష్టంగా వున్నది. "ఇందుకోసమే కాంవాంలె మనవాండ్లను ఊళ్ళో ఉండ వద్దన్నారు. ఈ చండాలమువల్లనే వీండ్లకు చండాలులని పేరు వచ్చివుంటుంది. వీండ్లు చాలామంది నీళ్ళుపోసుకోరు. శౌచపద్ధతే యెరుగరు. ఇంతకూ దరిద్రమే మొదటికారణం, అజ్ఞానం రెండ వది. సంగడు వీళ్ళందరికీ బళ్లు పెట్టించి చదువూ వృత్తులూ నేర్పించాలంటాడు. దీనికి డబ్బూ, మనిషిచట్టమూ రెండూ కావాలె. ఇది క్రమంగా జరగవలసినపని. దూకమంటే అయ్యేపని కాదు; అన్నిటికీ శ్రీకృష్ణుడే వున్నాడు" అని అనుకొంటూ యింటికి వచ్చాడు.

మాలక్ష్మి పిల్లవాడికి వుగ్గుపోసి వొంటికి చమురురాచి పాలిచ్చింది. వేన్నీళ్ళతో బర్రెను కడిగి వెల్లిపాయలు వేసి కాచిన ఆముదం రాచింది. పొద్దుటి అన్నానికి వెసరు పొయ్యిమీద పెట్టి బర్రెకు కుడితిపోసి పాలుతీస్తున్నది.

రా:- పండ్లుతోముకుంటూ—జున్నుబాలన్నీ మన కేనా? యెవరికైనా పోస్తావా?

మా:- ఈ పూట యెవరికీ పోయదలచుకోలేదు. యియ్యేవల సినవాండ్లకు తలా కాసిని సాయంత్రం యిత్తామనుకొన్నా. మీ చెల్లెలికి యీపూట పంపుదామనుకొన్నాగాని యేమో యింటికైన పెద్దాడపడుచని యీపూట అన్నానికి యిక్కడికే రమ్మన్నా.

రా:- నీవు వొకరిచేత చెప్పించుకుండేదానివా? శాణావు.

మా:- మనుష్యులు ఎటువాలుబడితే అటు మాట్లాడుతుంటారు.

రా:- నీవు చాలా మంచిదానివిలే. యెప్పుడూ వొక్క వాలునే మాట్లాడుతుంటావు. సరే కాని నేను స్నానంచేసి బుచ్చయ్యగారిని చూడబోవాలె.

మా:- చెయ్యి. నీళ్ళు కాగేవున్నవి.

వెంకటదాసూ, అప్పడూ కొట్టంలో పనిపూర్తిచేసుకొని నీళ్ళకావిళ్ళు తెచ్చి యింట్లో దింపారు.

రా:- నాకు యివ్వేళ సెలవు. అయ్యవారిని చూడబోతా. నీకీరోజు పనెక్కడ?

వెం:- ఈవేళ పనే తక్కువలే? సావరాలకు అరక వేసుకొని పోతా.

రా:- పత్తి బాగా కమ్ముకొన్నదా?

వెం:- పలచనే అంటున్నారు. పంటమోయిను పైరున్నది అది పండితే చాలులే.

మా:- అత్తను పిలిచిరావే. జున్నుబాలు తాగుదాం. అదిగో! నూరేండ్లు నీ కాయువు అనుకొంటుండంగనే వచ్చావు.

సుబ్బలక్ష్మి :- ఎందుకమ్మా నాకు నూరేండ్లు! మా అప్పడు వొక యింటివాడైతే చూసిపోదామని వుంది—

అప్పుడు చిరునవ్వు నవ్వాడు. రామదాసది చూచి తెల్ల బోయినాడు. ఈ రెండు సంగతులు యితరు లెవ్వరూ గమనించ లేదు.

వూళ్ళో అంతా మేనకోడలే వుందికదా అంటున్నారు.

జోతి:- పో, యేమిటమ్మా నీవెప్పుడూనూ.

మా:- ఈ పిల్ల పెళ్ళి చేసుకోకుండా వూరుకుంటుంది గాంవాంలె.

జోతి:- పో! అని తల్లిని కొట్టబోయింది.

రామదాసు కీదృశ్యం అర్థంకాలేదు.

అందరూ జున్నుబాలుతాగారు. మాలక్ష్మి పచ్చివాళ్ళని రుచిచూచి వూరుకున్నది.

సు:- ఏమి వదినా! నీవు తాగలేదు. మేము పెళ్ళిపోయిన తరువాత తాగుతావా?

మా:- ఆం. దాచుకొన్నా. ఆడబిడ్డవు యిక్కడ వుండి కోడలుదాన్ని తాగనిస్తావమ్మా?

సు:- అవును ఆడబిడ్డ అర్థమగడన్నారు.

మా:- అర్థేమి కర్మం. పూర్తిగానే ఆయెను.

వెంకటదాసు అన్నంతిని కోటేరువేసుకొని పొలం బోయి నాడు. రామదాసు పులికాపుచేసుకొని సంగణ్ణి చూచి వారం రోజు లయిందంటూ వూళ్ళోకి పోయినాడు.

అయిదారుగడియలపొద్దెక్కింది. అప్పుడు అన్నందిన్నాడు. తల్లి తల దువ్వుతున్నది.

సు:- మా అప్పడు ఏమీ సొగసు లెరగడమ్మా. యీ కాలపు పిల్లలు గిరజాలనీ, పాయిలనీ, పంచామలనీ వుంచుకుం టారు. మావాడు చిన్నప్పుడు పెట్టించిన జుట్టూ, జులపాలూ తప్ప

యేమీ యెరగడు. వట్టి పిచ్చినాయన. యిటువంటి పోకిళ్ళ కల్లా వెంకటదాసున్నాడు.

మా:- ఆ యీడు వచ్చేటప్పటికి నీకొడు కెటువంటివాడవు తాడో లే. నిజానికి యెవరైనా మా సంగడి తరువాతవాండ్లే. చూచుకుంటే వ్యవసాయపు పని చూచుకొంటాడు. అదితప్పితే వాడి పుస్తకాలేమో చదువులేమో మీటింగులేమో తప్ప రెండో గొడవ యెరుగడు. మేము చెప్పించిన చదువుకూడా విశేషంలేదు. తనంతటతానే ప్రభున్నుడైనాడు.

సు:- సంగడు దేవుడువంటివాడు. బంగారానికి వెలిగారం తోడయినట్టు చౌదరయ్యగారి కొడుకు జతయినాడు. పొరుగూళ్ళుపోతే యిద్దరూ కలిసే తింటారుట. చౌదరయ్యకు ఇదంతా యిష్టంలేదుటగాని వీడు చాలించుకుంటే వ్యవసాయం సాగదని భయపడి వూరుకుంటాడుట.

మా:- చూడని సంగతులు మనకెందుకు? వాండ్లతో దింటే మనకేమయిన వొరుగుతుందా? అందాకా యెందుకు? మనలో మనకు కుదిరిందీ? మనము దాసర్లంగదా తక్కిన మాల యిండ్ల పిల్లను నీ కొడుక్కు చేసుకో.

సు:- చేసుకుంటే తప్పేమీ లేదుగాని మనము మాలల్లో బ్రాహ్మలంట.

మా:- కానీఅనే సందేహపుమాట వొకటి అన్నావుగదా; అందరూ అట్లా అనుకోరాదా. తప్పా వొక్క కులపువాళ్ళ దగ్గర వున్నదనడానికి వీలులేదు. తీగె లాగితే అంతా కదులుతుంది యేమోయ్! నీకు గొడ్లకు వేళయింది. కబుర్లువింటూ మీఅమ్మ వొళ్ళో కూర్చున్నావు.

అప్పుడు లేచి పెరుగన్నం మూట తీసికొని గోచిగుడ్డ నడుముకు చుట్టుకొంటున్నాడు.

మా:- ఏమబ్బాయ్? గోచిగుడ్డ తీసుక పోతున్నావు, చెరువులో యీదడానికా! నాకు తెలియదు. మీ అమ్మ యిష్టం, నీ యిష్టం.

సు:- నాయనా యీ దేవమ్మ? వుప్పెనో వూదరో అని వొకనలుసును పెట్టుకొని తంటాలు బడుతున్నా.

అ:- ఈదడానికిగాదే, గొడ్లు నీళ్ళల్లో దిగిదే తోలకరావడానికి.

మా:- నీవన్నీ మయిదులు. మధ్యాహ్నము మీ అమ్మ అటువచ్చి చూస్తుంది.

అ:- చూడమను.

అప్పుడు అన్నపుమూట కఱ్ఱకు తగిలించుకొని యింట్లో కట్టివేసిన రెండు గేదెలను తోలుకొని పశువులదొడ్డికి వెళ్ళాడు. గొడ్లను విడిచేవేళ మిగిలింది, అప్పుడిసి చూడంగనే పశువులు కూనశబ్దంతో అరచినవి. ఆవులు తలుగు విప్పే అవకాశం లేకుండా ఆత్రపడ్డవి. ఊళ్ళో పశువులు కొన్ని అదివరకే నడిగడ్డ చేరినవి. మరికొందరు తోలుకొనిపోతున్నారు. కొన్ని పశువులు పొడుచుకొంటున్నవి. అప్పడు తనగొడ్లను తోలాడు. కొందరు కోమటి స్త్రీలు తట్ట పట్టుకొని అదిగో కడి, ఇదిగో చిదప, అని గొడ్లు దొక్కేదికూడా కానకుండా పరుగెత్తుతున్నారు. వొకతె తాను ముందు చూశాననీ, మరియొకతె తాను కాలు దోశాననీ పోట్లాడుతున్నారు. నడిగడ్డ గుత్తకు తీసికొన్న సుబ్బారాయుడు కట్టమీద వీరుల విగ్రహాలను ఆనుకొని కూర్చుని పశువుల లెక్క వ్రాసుకుంటున్నాడు.

సు:- అప్పా! మీ గొడ్లెన్నిరా?

అ:- మావి ఒక ఆవూ, మూడు పెయ్యలూ, మూడు బర్లూ. దూడలను చెప్పవలసిందేనా?

సు:- అవిమట్టుకు మెయ్యవా?

అ:- అయితే యెడపడ్డలు మూడు.

ఆవులు కట్టమీదుగా పోయి వరవకాలవదాటి పెద్ద నడిగడ్డ పోయినవి. గేదెలు నీళ్ళు చూడంగనే ఆహ్లాదపడి చెంగనాలు తీస్తూ నీళ్ళలో దిగి, యీదుకొని చిన్న నడిగడ్డ చేరినవి. అన్నిటికంటే ఆఖరున జంగిలిగుంపు వచ్చింది. కాపరులందరూ వొక

వందమంది పోగయినారు. అన్నపుమూటలన్నీ గిజిగాళ్ళ గూళ్ళ వలె తుమ్మచెట్లకు వేలాడగట్టి కొందరు బిళ్ళంగోడు ఆడుకొనడానికి తుమ్మమండలు విరిచి ముండ్లు సెలిగి బిళ్ళలూ కఱ్ఱలూ చేసుకొంటున్నారు. కొందరు పిల్లనగ్రోవి వూదుతున్నారు. కొందరు బెత్తులు తెచ్చి చిల్లింకి ప్రారంభించారు. కొందరు చెడుగుడు ఆడుతున్నారు. దెబ్బలు తగులుతవని ఆలంకాటవద్దన్నారు. ఆడపిల్లలాడే నాలుగు స్తంభాలాట పనికిరాదన్నారు. దాగుడు మూతంటే నవ్వారు. దానికంటే గంతాట మగసిరెయిందన్నారు. గోలిగుండ్లు గడ్డిలో కనబడవన్నారు. కోతికొమ్మంచాట పేరు చెప్పంగానే గుంపెడుమంది పంగలచింత దగ్గరకు పరుగెత్తారు. అప్పుడు ఎనిమిదిమంది జట్టును కుదుర్చుకొని ఆడితే ఆలంకే ఆడవలెనని ప్రారంభించారు. ఒక్కమాటు లాగేసరికే యిద్దరికి మోకాళ్ళు చెక్కులు పోయినవి. అంతటితో అది చాలించి జిల్లాకోడి మొదలుపెట్టారు. ప్రతివాడూ వంతులు ప్రకారం టాంగ్, బిరాంగ్, ముష్టి, గోడా, కోనా, హంకీ, జిక్కులూ, ఆడి జిక్కులు పూర్తికాంగనే అందరూ చెంగినతరువాత గెలిచినజట్టు చెవులా మొక్కులా శిక్షలు వోడినవాండ్లకు అప్పగొట్టి యిచ్చారు. తరువాత మనలో కొందరం కూతపట్టేవాండ్లమున్నాం. గిరి ప్రారంభింతామని మధ్య గుండ్రంగా గిరిగీసి రెండువైపులా యాభై గజాలం యెలలు బెట్టారు. అప్పడూ, వెంకడూ పెనుజ్జీలుగా వుండడానికి అందరూ వొప్పుకొన్నారు. ఉభయులూ జట్లను ఏర్పుచుకుని వెంకడి జట్టులో సన్నకారు పడ్డారని వాడికి జీరకాయ యిచ్చారు. అప్పడిజట్టు గిరిలోవుండి వెంకడిజట్టు రెండు యెలలూ కాస్తున్నది.

అప్పడు "తాటిముక్కలో తంగేడుపుల్లా, దసినీయవ్వా కుందేలుపిల్లా, పిల్లా, పిల్లా, పిల్లా" అని కూతబట్టి వెంకడి ఎలను దొక్కి కూత విడువకుండా వెంకడి జట్టును విడిపించుకొని గిరిలోకి వచ్చాడు.

అప్పడిజట్టు గెలిచిందని యెలలు మార్చుకొని రెండవ ఆట ప్రారంభించారు. వెంకడు "చిప్పదెచ్చుకో చియ్యలుబెడతా-నీయబ్బ

దినిపోయె నన్నేమంటవు, నన్నేమంటవు, నన్నేమంటవు" అని కూస్తూ ఎల దగ్గరకు వచ్చేవరకు అప్పుడిజట్టు వెంకడిని పట్టుకొని కూత ఆపివేశారు. వెంకడు తనకు జీరకాయవున్నది, తాను చెల్ల లేదని మళ్ళీ గిరిలోనుంచి అప్పుడు లేని ఎలవైపుకు బయలుదేరి "పొగాకుమట్టా తిరగవేసికొట్టా, కొట్టా" అని అలుపువచ్చి గుక్క బట్టలేక ఎలదాకా పోకుండానే మధ్యనుంచి వెనుకకుదిరిగివచ్చాడు.

ఈ ప్రకారం ఆటలు నడిఝామువరకూ జరిగినవి. పిల్ల లందరూ అలిసిపోయినారు. పశువులన్నీ కాలుకదపకుండా మేస్తు న్నవి. ఇక ఆట చాలించి అందరమూ యీతకొడదామన్నారు. వంతులు వేసుకొని మునిగి దాక్కున్నారు. కొందరు వెనకీతా కొందరు ముందరీతా యీది తమరు నేర్చుకొన్న మెళుకువలు చూపించారు. వాళ్లు జల్లుమనేవరకూ యీది నీళ్ళబయటికి వచ్చి ఆరబెట్టుకున్నారు. అందరూ తమ గుడ్డలు కట్టుకొని "ఇక అన్నా లకు పోదామా" అన్నారు. అనడమే తరువాయిగా చెల్లెక్కి మూటలు దెచ్చుకొని గుంపులుబడి కూర్చొని తినడం ప్రారం భించారు.

వెం:- సాయిబు రొట్టె తెచ్చుకున్నాడే! నాకు కొంచెం పెడతావోయ్!

సా:- నీకీపెట్టి నే నేమి తినాల?

వెం:- నా అన్నం పెడతాలే.

సా:- మాలవాండ్ల అన్నంకీ తినమంటావూ?

అ:- అందరికీ పెడతానంటున్నావు. నీవేమి తెచ్చు కున్నావు?

వెం:- సజ్జసంకటీ, కారమూ.

అ:- అందుకనేనా! నాకు కొంచెము పెట్టు. నీకు పెరుగ న్నము పెడతా.

సు:- యెవరికయినా పూరుమిరపకాయకావలెనంటె ఇస్తా.

వెం:- అప్పడు పెరుగుముద్ద పెట్టాడు. దాంట్లో కొరు క్కుంటా తే.

నరిసిగాడు:- పెరుగన్నంలోకి నంచుకోటానికి కూడా కావలసివచ్చిందీ? నాది పట్టిచప్పిడన్నమని మిరపకాయ లాక్కున్నాడు.

అ:- వాడికి ప్రాప్తముంది. పోనియ్యి.

పిల్లలన్నం దినడం అయింది. పశువులు పూర్తిగా మేసి చెరువులో నీళ్ళుదాగి చెట్లకింద పడుకొని నెమరు వేస్తున్నవి. కొన్ని తిరుగుబోతులు వరదదారినబడి వెళ్ళిపోతున్నవి.

అ:- వోరే సాయిబు! నీ బర్రె అలుగుబండమీదిగా పోతున్నది.

వెం:- వాడిది దొంగమేతలు మరిగిన గొడ్డు.

సాయిబు:- "యహోవ్ యహోవ్ తిరుగిటూ" అని కేకలు వేస్తూ బూతులు తిట్టేవరకు గిఱున మళ్ళింది.

వెం:- మనకు పొగాకు యెవ్వడు పెడతాడు? దుండిగపాకు చుట్టలు తగల వెయ్యండోయ్. అరె నిప్పులేదుగాఁవాలె. అయితే యీ పూట పస్తుకిందలెక్క.

అ:- ఇప్పుడు చుట్టలెందుకు పెడతారుగాని యెవడన్నా కాసేపు పదాలు పాడండిరా.

వెం:- పదాల నరిసిగాడే దానికి మొనగాడు.

(నలుగురు నరిసిగాడిని లాక్కొని వచ్చి మధ్య కూర్చొబెట్టారు)

న:- నేను పాటలు మరచిపోయినాశా. చిన్నప్పుడు బాగా వచ్చేవి. మీ రెవరైనా యెగతాళిచేస్తే నే పాడను.

అ:- ఇప్పుడు మహా పెద్దవాడివి అయినావు గాఁవాఁలె. వచ్చినంతవరకు కానియ్యి.

న:- నాకు బూతుపాటలు వచ్చు

వెం: బూతులేనిది రుచిలేదు. మొదలుబెట్టవా.

న:- ముందొకపద్యం జదువుతా.

జొన్నచేనికాడ సొగసుకత్తెను చూచి
నిన్నటేలనుంచి నిదురలేదు

దాని నన్నుగూర్చి దయసేయు మాధవా
పొన్నపూలతోటి పూజసేతూ.

వెం:- ఒరే! వీడికి నిద్దురపట్టడం లేదుట యెందుకో.

అ:- నీ చమత్కారాలు చాలించి వాడిని పాడనియ్యి.

సు:- పదం పాడరా. పద్దేలకేమి. నే దరువేస్తాలే.

సా:- గుండేలుగాడి పదమంత మంచి దింకొకటిలేదు.

న:- గుండేలుగాడి పదం పాడతాగాని, ఏరాదిగె ముత్తా! నీవు చిం దెయ్యరా.

ముత్తడు అందుకు నే సిద్ధమని సైగుడ్డ నడుముకు గట్టుకొని బారలుచాచి నిలువ బడ్డాడు.

న:-

గుండేలుగాడి తమ్ముడంట - మందపాటి కోటడంట-
మాారెళ్ళ సుబ్బడంట - మందుపెట్టి చంపెరో రబ్బొ
గుండేలుగా!

అబ్బొ గుండేలుగా - ఓరబ్బొ గుండేలుగా-
అబ్బొ గుండేలుగో - రబ్బొ గుండేలుగో.

ము:-

(దేహమంతా లయస్వరూపమయి చిందులు దొక్కుతున్నాడు)

తక్కిస్కా-తక్కిస్కా-తక్కిస్కా-తక్కిస్కా ... ...

సు: ఇంకొకటను. పొద్దుగూకులూ వొకటే అయితే బాగుండదు.

న: మొదలు జ్ఞాపకంలేదు. ఇది బలేపాట వినండి.

1. నీకూ నీ-వారు లేరు నాకు నా - వారు లేరు
యేటివొడ్డునా-యిల్లుగడదం పదరా,
చల్ మోహానరంగా
యేరువస్తే యీదిపోదం పదరా.

(పిల్లలంతా విగ్రహములవలె నిశ్చేష్టులై వింటూ కూర్చున్నారు)

2. మనిద్దరీ మనసొక్కటైతే, మల్లెపూలా-తెప్పగట్టి

తెప్పమీదనే - తేలిపోదం పదరా.

చల్ మోహనరంగా

తెప్పమీదనే- తేలిపోదం పదరా

సు:- (మనసులో) యింతపెద్దది పాడుతాడేమి?

3. కంటూ కా - టిక బెట్టి కడవాచం-కానాబెట్టి
   కన్నీటా - కడవ నింపితిగదరా.

ఈ పదం యెందుకో అప్పణ్ణి ఎక్కువగా ఆకర్షించింది. దీని భావం తనకు ముందు అనుభవంలోకి వస్తుందని మాత్రం తెలియదు.

వెం:- ఒరే నరిసిగా! ఈ యేడుపు పద్యాలు చాలించి కుచిగా వుండేవీ కరకర లాడేవీ కానియ్యరా.

న:-

ఓరోరి బండోడ - వొయ్యారి బండోడ,

నీమీద నా మోజు నిలుపూబండీ, నీ మీద నా మోజు.

వెం:- నీ మీద నా మోజు - అంతమాత్రం తగలవొద్దు.

సు:- యల్లాము పదం నీకు వచ్చుటరా?

న:- అన్నీ వచ్చు.

సు:- బలే అది అన్నిటికీ కిరీటం.

“మటీయల్లామే—మటీయల్లామే” అని పయిగుడ్డ ఎగురవేస్తూ అన్నాడు.

అ:- యల్లామి పదమూవద్దు, వాగులామ పదమూవద్దు, వట్టి బూతు.

న:- అది వద్దుట పోనియ్యండి.

వెం:- మాకు అదే కావాలె. అప్పాయవద్దంటే నేగావాలెనన్నా. బూతేమిటి? ప్రపంచంలో బూతేలేదు.

అ:- ఎవరడిగిందీ వద్దుగాని, నీ యిష్టం వచ్చింది యేదో వొకటి ఆఖరుపదం పాడు.

నరసిగాడు:- (లేచి పయిగుడ్డ పమిట వేసుకొని) యిదే ఆఖరుది. వినండి! ఇక నన్నడగవద్దు.

తాన, తంధాన, తాన, తంధానానా
ఆయీా, కావేటీ వెంకటశాయీా
పెట్టెలోనె చెయివేయీా, శాలుదీసి నాకీయీా
మసిబూసుకొని నీవుబోయీా.

తనా, తంధానా, తాన, తంధానానా
అమ్మా, నీదొడ్డిలోది తులిసెమ్మ
నీ చెవుది చారెడుకమ్మ, కమ్మదీసి నాకిమ్మ
బూడిదె బూసుకపొమ్మ.

ఇప్పటికింతే. యింకా జాం పొద్దున్నది. దున్నపోతు సవార్లు తీతాంపదండి. గోడ్లు యిగ నిలవవు. వాటిని మళ్ళవేసినట్టుగా గూడా వుంటుంది.

అందరూ గోడ్లదగ్గరకు పోతున్నారు.

అ—ఇందులో యమధర్మరాజు నెవరిని సేస్తారు?

వెం—చిందులు దొక్కాడు. ముత్తడే యమధర్మరాజు.

న—ఓ దున్నపోతు మహారాజుగారూ! వో ముత్తయ్య చక్రవర్తీ! దయజేయండి.

అంత ముత్తడిని పెద్దదున్నపోతు నెక్కించారు. వొకజట్టు తక్కిన వాటినెక్కి ఘూకేగాయి. సుబ్బడెక్కిన పల్లదున్న కేకలకు బెదిరి నాలుకాళ్ళ సవారి దీసేవరకు వాడు కిందికి దొల్లాడు. కొందరుదిగి మరికొందరెక్కారు. ముత్తడు మాత్రం దిగలేదు. పొద్దుగూకివచ్చింది. పాడిపశువులకు దూడలమీాద మర్లుబుట్టినవి. యేను తల్లికడుపులోకి జారుతున్నది. పశువులు నెవర్లువేస్తూ యిండ్లదోవ బట్టినవి. పడమటిగాలి పొతుపు గొండలకిమాకి గిఱ్ఱున దిరిగి బోరున మంగళాపురముమీాద వీస్తున్నది. నడిగడ్డ నిశ్శబ్దమయినది. తుమ్మలు చీకటికమ్మి బావురుమన్నవి.

## ౭

## సద్గురువు

రామదాసు మాలపల్లెనుండి బయలుదేరి కొండ వెంబడిగా డొంకన కొంతదూరం వచ్చి వూరికీ, మాలపల్లికీ మధ్య వారకా టంగా వున్న పాటిదిబ్బదాటి తూర్పు వీధికి మళ్ళి కమ్మబజారున వస్తున్నాడు. రాత్రి పటంలోజూచిన శ్రీకృష్ణుని మోహనాకా రము మనస్సును విడువలేదు. అచ్చొత్తినట్లు మనస్సుకు అతికి పోయింది. పరధ్యానంగా వున్నప్పటికీ రాసమండలం కండ్లలో మెదులుతున్నది. "రాళ్ళు దేవుళ్ళయితె రాసులుమింగవా" అని అన్నాడుగాని "సగుణోపాసనవల్లే చాలా ప్రయోజనమున్నట్లే కనబడుతుంది. బుచ్చయ్యగా రేమంటారో అడుగుదాం" అని అనుకొంటూ వచ్చి బండిదగ్గరకు వచ్చేసరికి యిరవై సంవత్సర ముల వయస్సుగల వొకయావనుడు యెదురుపడ్డాడు. కొంచము నల్లనివాడు. జుట్టు కత్తిరించుకొని టోపీ పెట్టుకున్నాడు. కళ్ళికోట చెక్కుకోటు తొడుక్కొని గోచీకుచ్చెళ్ళుజార్చి తెల్లధోవతి కట్టు కొన్నాడు మొగానవున్న సన్నని అమ్మవారిచుక్కలు దూరా నికి కనబడవు పైన వుత్తరీయంలేదు. శరీరం బద్దవలె కొంచెం వంగివుంటుంది. అంతపొడగరికాడు. నడిచేటప్పుడు పక్కకు వూగుతుంటాడు. ముఖం గడ్డందగ్గర వాచి కణతలవైపున విశాల మవుతుంది. కనుబొమలు ముందుకు పొడుచుకొని వచ్చి అతడు మేధావంతుడని సూచిస్తున్నవి. కండ్లు తేటగలిగి విశేషంగా చలిం పక దీర్ఘాలోచనమునూ, విషాదమునూ వెల్లడిస్తున్నవి. ముఖ వైఖరినిబట్టి మనిషి దుర్బలుడని తెలుసుకోవచ్చును. చేతిలో పింగాణి లోటా బట్టుకొని రామదాసును సమీపించాడు.

రా—ఎక్కడికి, బుచ్చయ్యగా రూళ్ళోవున్నారా?

యావనుడు—నిన్న నీకోసంవచ్చారు. నీవింట్లోలేవు. ఈ వేళ మళ్ళిపోదామంటే నీవింట్లో వున్నావేమో చూతామని వస్తున్నా.

రా:- నేనూ వారి దర్శనంకోసమే వస్తున్నా. వారు గొప్ప వేత్తలు. యెరుగుదువా? ఇదివరకు వారి సంగతి.

యా:- ఇదివరకు వారిపేరు విన్నా. మహాజ్ఞానే అనుకొంటాను. భక్తి విషయంలో వారికి ప్రవేశం తక్కువ. నిన్న భక్తి యోగం వారికి చదవమని యిచ్చాను. అభిప్రాయ మింకా చెప్ప లేదు.

రా:- అంటే జ్ఞాపకం వచ్చింది. రాసమండలమనే పటం అద్భుతంగా వున్నది.

యా:- నా దగ్గర యింకొక పటంకూడ వున్నది. దానిని మననంచేస్తే ప్రేమభక్తి కుదురుతుంది. దానివంకచూస్తే పరుగెత్తే మనసుకూడా కట్టుబడుతుంది.

రా:- నాకు అనుభవంలోకి వచ్చింది. నీవు కృష్ణభక్తుడివి గాఁవాఁలె.

యా:- నేనా - నేను - గోపికను.

రా:- గోపికవా? సంగదాసూ. గోపికవేమిటిరా!

సం:- నేను కానేమో అని పిలుస్తున్నావా? సంగదాసునే, గోపికను గూడానూ.

రా:- (యోచించి) గోపికలది ప్రేమభక్తికదా?

సం:- నాదీ అదే.

రా:- వాండ్లది స్త్రీల ప్రేమ.

సం:- ప్రేమకు, ఆడప్రేమా మగప్రేమా అని లింగవిభాగ మున్నదా?

రా:- వాండ్లు శ్రీకృష్ణుని నాయకునిగా కామించారు.

సం:- నేనూ అట్లాగే ప్రేమిస్తాను. అయ్యగారున్న ఇల్లిదే.

రా:- ఊఁ. నాకు విషయం పూర్తిగా అవగాహనకాలేదు. మననం జేస్తేనేగాని మనస్సు కెక్కదు. విషయం మట్టుకు దొడ్డది. నీవు యింటికి పడుకోడానికి రావడమే మానివేశావేమి?

సం:- మన యింట్లో తెగ యెలుకలు. అవి కరుస్తవని నాకు భయం.

రా:- ఎలుకలు కరుస్తవీ? మమ్మల్నందరినీ కరుస్తున్నవీ?

సం:- మమ్మల్ని కరవకపోతే నన్ను కరవకూడదా? అందరినీ వొకవాడే కరుస్తవా?

రా:- గోపికనంటావు, కృష్ణభక్తి అంటావు, మళ్ళీ యిదేమిటి?

సం:- ఎలుకలు గోపికలను కరవకూడదా? కావలిస్తే కృష్ణునికూడా కరుస్తవి.

ఉభయులూ సంభాషణ చాలించి లోపలికి పోయినారు.

రా:- (ఉత్తరీయం నడుముకు చుట్టుకొని) అయ్యా దాసుడిని (అని సాష్టాంగ నమస్కారంచేసి నిలవబడి) యిది బహు సుదినం. తమ దర్శనం చేయవలెనని యెంతకాలంనుంచో అనుకొంటున్నాను. మా అయ్యగారు తమనిగురించి అనేకమాట్లు ప్రస్తాపించారు. తమమాట బహుచెప్పారు.

బుచ్చయ్యగారు:- వీరయ్యగారు నాకు జ్యేష్ఠసోదరులు. వారి గురువుగారి దగ్గర నేనూ కొన్ని విశేషాలు గ్రహించా.

రా:- తమరు అన్నీ గ్రహించారు.

బు:- మారంగా నిలుచున్నారేమి? యిట్లావచ్చి వసారాలో కూర్చొండి.

రా:- తమరు అచల పరిపూర్ణులు. తమకు యేభేదమూ లేదు. మాబోటి అజ్ఞానులను లోకవ్యవహార మొకటి బాధిస్తున్నదిగా! దానిని అనుసరించి పోకపోతే వీలులేదు.

బు:- నీ వన్నీ తెలిసినవాడవు. నే చెప్పవలసినది యేమీలేదు. నీ అభిప్రాయంతో నీ కొడుకు వకీభవిస్తాడా? నీ జ్ఞానం సంగతి దేవుడెరుగు; యీ భేదాలు ముందు కొట్టివేయమంటాడు.

రా:- ఇంతకూ నే నొక్కసంగతి మనవిచేస్తా. కట్టెవంకలు పోయి తీరుస్తుంది. మా అయ్యగారింట్లో ఆరాధనకు గుంటూరు నుంచి సాతని కృష్ణయ్యగారు దయచేశారు. అయ్యగారు ప్రసంగిస్తుంటే క్రిష్ణయ్యగారు లేచి సద్గురువును సంపాదించుకోవడం యెట్లాగని ప్రచ్ఛచేశారు. దానికి అయ్యగారు గురువుకోసం శిష్యు

లెవరూ వెదకనే అవసరంలేదు. శిష్యునికి యోగ్యతవచ్చేవరకు గురువే వెతుక్కుంటూ వస్తారని శలవిచ్చారు. వాడిలో ఎన్ని లోపాలుంటే నేమిగనుక ? తమరు అనుగ్రహిస్తే అన్నీ చక్కబడుతవి.

సగందాసేమీ మాట్లాడలేదు. తండ్రీ కొడుకూ దూరముగా గోడకానుకొని కూర్చున్నారు.

బు:- రామానాయుడుగారు యిప్పుడు వస్తున్నారని కబురు వచ్చింది. వారు చాలా యోగ్యులని వింటారు.

రా:- వారు నిశితయోగ్యులు. మావూరి దుర్మార్గానికి వారు యీ వూళ్ళో వుండబట్టే వర్షాలు కురుస్తున్నవి. మాపిల్ల వాడు వారిదగ్గరే వుంటున్నాడు. బుద్ధిగరిపిందీ వారే.

బు:- అందరూ మీ పిల్లవాడే రామానాయుడుగారిని చెడగొట్టుతున్నాడంటుంటే, నీవు వారు నేర్పారంటున్నావా ?

రా:- యెవరు యెవరికి నేర్పినా నడవడిలో తప్పులేదు. ఒకరికి అపకారం చేసియెరుగరు.

బు:- ఆ మాట అందరూ వొప్పుకుంటున్నారుగాని కొన్ని చర్యలు లోకానికి విరుద్ధమంటారు.

రా:- ఆ సంగతి నేను చెప్పేపాత్రపువాడిని కాను. తమరు దయచేశారు. తమరు అనుగ్రహిస్తే అన్నివంకలూ తీరుతవి.

బు:- యదార్థం చెప్పుతాను. మీ పిల్లవాడు గొప్పమేధావి. వారి వుభయులతోను గలిసి మాట్లాడుదామని నా కోరిక. అంతా వొకమాటే తటస్థించారు.

రా:- మా పిల్లవాడి విషయంలో తమరు గొప్పగా మాట్లాడడం వాడికి క్షేమంకాదు. అవన్నీ తమ ఆశీర్వచనాలుగా భావిస్తాను.

బు:-నేచెప్పినదాంట్లో అతిశయోక్తియేమీ లేదు.నాయుడు గారినికూడా చూడవలెనని కుతూహలంగావున్నది. వారు వచ్చేలోగా చప్పున స్నానంచేసివస్తాను. వారు దయచేస్తే యీ అరుగు మీద కూర్చోమని చెప్పండి.

రా:- చిత్తం, తమరు దయచేయండి.

రామదాసూ, సంగదాసూ గోడనీడనువోరసిలాగా కూర్చు న్నారు.

౮

కర్మయోగము

రామానాయుడు నిదానంగా వీధిగడప మెట్లెక్కి మండి గం వెలుపల నిలబడి యింటియజమాని వెంకటసుబ్బయ్యను 'అయ్యగా రేమిచేస్తున్నా'రని అడిగాడు.

వెం:- అయ్యా యిటులోపలకు దయచేసి అరుగుమీంద కూర్చోండి. అయ్యగారు స్నానంచేస్తున్నారు. అయింది- ఇప్పుడే వస్తారు. చాపమీద కూర్చోండి. బాబూ! తమబోటి వారు మాయిండ్లకు యెందుకు దయచేస్తారు? అయ్యగారి మూలంగా వచ్చారుగాని.

నాయుడు:- దానికేం లెండి.

రామదాసూ, అతనితోపాటు సంగదాసూ లేచి నిల బడ్డారు.

నాయుడు:- రామదాసు వచ్చాడే!

రా:- అయ్యగారి దర్శనంకోసమే. యెన్నాళ్ళనుంచో వున్నకోరిక యిప్పటికి ఫలించింది.

రామానాయుడు రెండువైపులా కట్లలో యిమిడేటట్లు బిగించబడిన పలచని వెండికట్లుగల జానబెత్తము చేతబట్టుకొని తగరంవేసిక్రిరులేనిఆకుచెప్పులుదొడిగి అరుగుమీదకూర్చున్నాడు. సన్నని పేటేరుధోవతీ, యెఱ్ఱగీరలకుడితీని, జరీ కొలుకులు వేసినవుల్లి పొరవంటి వుత్తరీయమూ, ఆయన ముఖమార్దవాన్ని అతిశయింప చేస్తున్నవి.

బుచ్చయ్యగారు స్నానంచేసి వుతికిన పంచెలు వేసుకొని రాగానే రామానాయుడు నిలిచినమస్కరించాడు. బుచ్చయ్యగారు తమరు లేవడ మెందుకనికూర్చుండచేసి తామూ కూర్చున్నాడు.

నాయుడిగారి సన్నగా దిద్దిన నామములు, పచ్చని తిరుచూర్ణమూ, ఎఱ్ఱరాళ్ళ కమలాలూ చామనిఛాయగల మేనికాంతికి వింతవికాసము నొసంగుచూ ప్రేక్షకులనాకర్షిస్తున్నవి. బుచ్చయ్యగారుకొంతవడి ముఖవికాసం చూస్తూ కూర్చుండి పలకరించదలచుకుని యేవిషయమును గురించి మాట్లాడడానికీ తోచక "నలబోతువారి కుటుంబమంటే మనజిల్లాలోకల్లా ఘరానా పొందింది. పాలసముద్రంలో అమృతం పుట్టినట్లు నాయుడుగారు జన్మించినారు" అని యింకా చెప్పబోతుంటే రామానాయుడు కాస్త వెనుకకు జరిగి తన కయిష్టములయిన స్తుతిపాఠములచే కొంచెం తెల్లబోయి తన సోగమొగమునకూ, కోలనుదురునకూ జవాబుగా పైకెగ్గట్టబడిన నల్లని కొండసిగ వెనుకవున్న స్తంభానికి తగిలేటట్లు మొగమొకింత పైకెత్తి చేతిలోని బెత్తమును కదలించుతూ "మా కుటుంబానికి కొంత గౌరవమున్నదేమోకాని, నేను అమృతం వంటి వాడిని కాను" అని ప్రత్యుత్తర మిచ్చాడు.

రా:- అయ్యగారికి నాయుడుగారు కొత్త. తమరు చెప్పిన సంగతులన్నీ నిజమే అయినా అవి వినడానికి నాయుడుగారి కిష్టంగా వుండదు.

బుచ్చయ్యగారు కొన్ని మతవిషయములు నాయుడిగారితోనూ చర్చించాలెనని అనుకున్నారు. సంగదాసు నాయుడుగారి దగ్గరచేరి దుర్బోధలుచేసి చెడకొట్టుతున్నాడని బుచ్చయ్యగారితో కొందరన్నారు. ఇదివరకు సంగదాసుతో మాట్లాడినప్పుడు అతని బుద్ధి చాకచక్యం చూచి ప్రవాదములు కొంతవరకు నిజమై వుండవచ్చునని అనుకున్నాడుగాని నాయుడుగారి మూర్తిని చూడంగనే అభిప్రాయం మారింది. రెండూ స్వప్రకాశంగల స్వతంత్ర వ్యక్తులుగా కనపడ్డవి. నాయుడుగారితో సంభాషింతామంటే గుచ్చుడు బడలేదు. మొదటి ప్రయత్నానికే మొన విరిగిపోయింది. మొదట రామదాసుతో సంభాషించినప్పుడు సంగదాసు చర్చకు దిక్కు-పోయినా తన అనుభవాన్నిబట్టి సంగదాసు సంభాషణప్రియుడుగా కనబడ్డాడు. విషయం తా నుపక్రమించ దలంచకంటే సంగదాసే

ప్రారంభిస్తే బాగుంటుందని "సంగదాసూ! ఏమైనా సంగతులు చెప్పవోయ్" అని అడిగాడు.

సం:- పెద్దలు, తమరు సెలవీయండి.

కథ ముగిసింది. రామదా సీ విషమస్థితిని కనిపెట్టి తన కది వరకు మొన తేలివున్న సందేహాలను గురించి సంభాషణ ప్రారంభించాడు.

రా:- అయ్యా! ప్రపంచంలో మానవుడు సత్కర్మ చేస్తూ వుండవలసిందేనా?

ఋ:- వ్యావహారికంగా విచారిస్తే దుష్కర్మ చేయడంకంటే సత్కర్మ చేయడం మెరుగు. పారమార్థికంగా విచారిస్తే రెండూ బంధ హేతువులే.

నాయుడు:- నిష్కామకర్మ అయితేనో?

ఋ:- నిష్కామకర్మ బంధహేతువు కానిమాటే! అది చేస్తూ వుండవచ్చు.

సం:- పారమార్థికంగా విచారిస్తే సత్రయాగాలు చేసిన ఋషులూ, రాళ్ళు గొట్టిన రాక్షసులూ వొక అంతస్తువారేనా? ఋషులు ఫలాపేక్షతో సత్రములు పెట్టరు. రాళ్లుగొట్టే రాక్షసులూ పొందగోరుతున్న ఫలమూ లేదు. ఉభయులకూ ఆ చేష్టలు స్వాభావికమే.

ఋ:- నీవు చెప్పిన ప్రకారం వుభయులవీ నిష్కామ కర్మ లయితే ఆ యా కార్యములవల్ల పారమార్థిక విషయమున కలుగ గల ప్రతిబంధకములు వారికి లేవనే చెబుతాను.

సం:- మంచీ, చెడూ కార్యములవల్ల లోకమునకు కలిగే సాధక బాధకము లటుండనిచ్చి కర్మఫలములు నిష్కాములను బాధించవా?

ఋ:- ప్రారబ్ధం భోగంవల్ల నశిస్తుంది! సంచితము ముక్తి వచ్చినప్పుడు విడిపోతుంది. నిష్కామ కవచంవల్ల యిప్పుడు చేసే కార్యముల ఫలం అంటదు.

సం:- పారమార్థికమునకూ మంచీ చెడూ పనులకూ సంబంధము లేదా ?

బు:- ఇంతవర కుంటుంది. ఫలాపేక్షతో గూడినదైతే రెండూ సంచితమును వృద్ధిజేసి ఆ సంచితము నశించకపోతే ప్రారబ్ధంగా మారుతూ జననమరణములకు హేతువవుతుంది. పరమార్థమునకు యివి రెండూ చాలావరకు సమానాంతరములనే చెప్పవచ్చు.

సం:- పరమార్థమునకు పాపపుణ్యములు చాలావరకు సమానాంతరములని శెలవిచ్చారు. నాయం దనుగ్రహముంచి రెంటికీగల తారతమ్యమును తెలుప వేడుతున్నాను.

బు:- పుణ్యకర్ములు పరలోకములలో సౌఖ్యములను బొంది భుక్తశేషమును మర్త్యలోకములో అనుభవిస్తారు. సత్యలోకమును పొందినవారికి సద్యోముక్తి లేకున్నా బ్రహ్మకల్పములోపుగా పునరావృత్తి కలుగదు. ఇంద్రత్వ బ్రహ్మత్వముల సహితమూ పుణ్య విశేషంచేత పొందవచ్చును. పాపకర్ములు నరకంలో పాపఫలములనుభవించి శేషమును మర్త్యలోకంలో ననుభవిస్తారు. పుణ్యకర్ములు భోగములను కామించి అనుభవించి, రోసి, వాటిని నశ్వరములనీ తుచ్ఛములనీ తెలుసుకొని, వాటిని గోరక నిష్కామకర్ములై అనుభవంచేతనో, తపోమహిమనో సంచితమును నశింపజేసి బొగిలినట్టిగాని లేక వేగినట్టిగాని గింజలు మొలవనట్లు పునరావృత్తి రహితమైన పరమపదమును పొందుతారు. పాపకర్ములు వాల్మీకాదులవలె మహాపురుషప్రసాదముచే అరుదుగా సన్మార్గమును బొందినా సాధారణంగా పాపులు నిష్కాములు కాజాలరు. ధ్రువుడు భగవత్సాక్షాత్కారంచేత వైరాగ్యమును పొందగలిగాడుగాని, రాక్షసులు తపోమహిమచేత బ్రహ్మసాక్షాత్కారం బొందీ మోక్షమును కోరలేదు.

రా- కంసాదులకు మోక్షమెట్లా వచ్చింది?

బు:- విరోధభక్తిచేత వచ్చింది. పాపకర్మములు జేసి బల వన్మరణం బొందినా, నిరంతర విష్ణుధ్యానంచేత ఉత్తమలోక ము పొందగలిగారు.

సం:- ఫలాపేక్షతో చేయబడిన సుకృతం స్వర్గాదిభోగముల నిచ్చుననీ, ఫలాపేక్ష లేనియెడల నిష్ఫల మగుననీ తేలుతున్నది.

నా:- ఫలాపేక్ష లేనియెడల బంధహేతువు కాదని తేలు తున్నదనీ దిద్దుకుంటావా ?

సం:- దుష్కృతమునుకూడా ఫలాపేక్ష లేకుండాచేస్తే ఫలము మన కంటదు గనుక నరకమూ రాదు, బంధహేతువూ కాదు.

బు:- బాగు బాగు. అప్పటికీ సుకృతమైన పనిచెయ్యి, అవు తుంది. నీవు జెప్పినట్లు దుష్కృతమునకు ఫలాపేక్ష లేకపోవడం వల్ల కర్తకు నష్టమేమీ లేకుండా పోయింది. సత్కార్యములు యెప్పుడూ లోకోపకారములుగా వుంటవి. కర్త ఫలమపేక్షించినా లేకపోయినా దుష్కార్యములు లోక కంటకములు.

స:- ఏమి తేలిందంటే దుష్కార్యములు సాపేక్షకము లయినా నిరపేక్షకములయినా కర్తకో, లోకమునకో బాధకములే. సుకృతములు సాపేక్షకములయితే లోకమునకు శ్రేయమూ, కర్తకు స్వర్గాదిభోగములూ యిస్తూ బంధహేతువు లౌతవి. ఫలాపేక్ష లేనియెడల లోకోపకారకములుమాత్ర మవుతవి.

బు:- దాని కిది చేరిస్తే సరిపోతుంది. ఫలాపేక్ష లేకపోతే పాపకర్మములు చేయడానికి ప్రోత్సాహమేలేదు. అప్పుడు రాక్ష సులూ సత్రములలో రాళ్లుగొట్టరు. ఫలాపేక్ష లేకుండా సత్కా ర్యములు చేయడమున కలవాటుపడ్డవాడు ధ్రువుడివలె సిద్ధము లయిన సంపదలనే త్యజించి పరమపదమును మాత్రమే ఆశించు తాడు. స్వర్గాది భోగములు లేకపోయిన పని చింతించడు. ఇంతే కాకుండా ఫలాపేక్షలేని సత్కార్యములయందు ఆదరము హెచ్చు. ఫలాపేక్ష లేనప్పుడు కర్తృత్వము భగవంతుడిదే అవుతుంది.

చేసేవాడూ చేయించేవాడూ అతడే. కార్యస్వామ్యం ప్రత్యేక వ్యక్తినుండి మారి ప్రభువు దవుతుంది. వొక నౌకరు తన స్వంత కార్యమును నెరవేర్చుకునేటప్పటికంటె ప్రభువు కార్యములు నెరవేర్చేటప్పుడు యెక్కువ అధికారం చలాయించగలడు. ఫలాపేక్ష లేక అధికారవశమున చేసినపనులకు నౌకరుకు జవాబుదారీ లేదు. యితరులకు వర్తించే ధర్మములు అతనికి వర్తించవు.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ.

అని శ్రీకృష్ణభగవాను డన్నాడు. అదుగో, గుర్తు. అక్కడ నిలవండి.

సం. నా. చిత్తం! గోచరమయింది.

బు:- ఇప్పటికే కాలాతీతమయింది. “శరీరమాద్యం ఖలు ధర్మసాధన” మన్నారు. భోజనాత్పరం మీకందరికీ సావకాశంగా వుంటే దయచేయండి. నా కింకా తనివితీర లేదు. మీతో ఇంకా సంభాషించవలెనని కోరికెగావుంది..

నా:- మా పుణ్యంవల్ల తమరు దయచేశారు. మే మనవలసినమాట తమరే అంటున్నారు. ఝామ్రుపొద్దువుండగానే మేము రావచ్చునా?

బు:- సరే.

ముగ్గురూ నమస్కరించి వెళ్లుతున్నారు.

బు:- (నాయుడుగారిని గమనించి చూచి) మనిషికి అట్టే వయసులేదు. ౨౫ కి లోపు. గోగుకొమ్మేలే నేవళంగా పెరిగాడు. పొడుక్కు తగిన లావుంటే యెక్కువ బాగుండేది. అయితే బలహీనుడు మాత్రం గాడు. సాత్వికస్వభావం ముఖాన వుట్టి పడుతున్నది. ఈ శిష్యులు దొరకడము నాదీ అదృష్టమే.

:—:

## ౯

## ఉపాసన

మూడుజాము లయింది. ప్రభాకరుడు కాలగతిచే తన ప్రచండ దీధితులు గోల్పోయి వుచ్చస్థితినుండి జారిపోయినాడు. గ్రామకాంతలు సాయంతన భోజనమునకై ధాన్యములు సిద్ధం చేస్తున్నారు. నిర్వ్యాసంగులు శయ్యలపై బరుండి విసిగి, లేచి, ఫలహారములుచేసి చీట్లాట ప్రారంభించారు. నూత్న దంపతు లింకా మేల్కొంచలేదు. మన ముగ్గురు జిజ్ఞాసువులు కలిసి బయలు దేరి వెంకటసుబ్బయ్య యింటివద్దకు వచ్చారు.

నా:- సంగదాసూ? ప్రశ్న లడిగేపని నీదబ్బాయి.

సం:- ప్రారంభించే పని మా అయ్యది.

నా:- వింటూ కూర్చుండేపని నాది.

రా:- ప్రారంభించడమేకదా నాపని. యేదో నాకు తోచిన పాయింటు యెత్తుగడచేసి వూరుకుంటాను.

నాయుడు మెల్లగా తలుపునెట్టి లోపల ప్రవేశించి అరుగు మీద కూర్చున్నాడు. తండ్రీ కొడుకూ కొంచెం వెనుకగాపోయి దాసులమని నమస్కరించి తమ మామూలుచోట కూర్చున్నారు.

బు:- సరిగ్గా వేళకు వచ్చారే!

రా:- తమ దర్శనానికి అనేకమంది వస్తూవుంటారు. మరీ చల్లబడితే అవకాశం చిక్కదేమోనని కాస్త పొద్దు కలగంగనే వచ్చాం. యేవో నాలుగు మంచిమాటలు చెపితే వింటాం.

బు:- శుభమా అని పొద్దునా నీవే ప్రారంభించావు. యేదో వొక సంగతి యెత్తుగడచేయి.

రా:- చిత్తం. అచలపరిపూర్ణాన్ని సాకారంగా వుపాసించాలెనా, లేక నిరాకారంగా వుపాసించాలెనా?

బు:- పరబ్రహ్మం సాకారమంటావా, నిరాకారమంటావా?

నా:- ఆకారమంతా నిరాకారానిదే కాకపోతే యీ ఆకారము మరొకరి దనవలసి వస్తుంది. అప్పుడు విశ్వరూపు డింకొకడవుతాడు. పురుషుడూ, ప్రకృతీ పరబ్రహ్మయొక్క విభూతే.

బు:- సరేనా.

సం:- ఇంకొకడున్నా డనుకొన్నా విశ్వమయుడు కాని వాడితో ప్రయోజనమేమి ?

నా:- వాడు విశ్వమయుడు కాకపోతే విశ్వమే వుండదు. అప్పుడు యే వుపాసనా లేదు.

రా:- మానసికోపాస నంటారు. అదేమిటి ?

బు:- ఉపాసనంతా మానసికమే. సాకారాన్ని వుపాసించినా నిరాకారాన్ని వుపాసించినా మనస్సుతో చేయవలసిందే. మనస్సు నుపయోగించక వుపాసనే చేయలేరు.

రా:- ఆత్మోపాసనంటే ?

బు:- ఆత్మసంబంధమైన వుపాసన అని అర్థం చేసుకోవచ్చునా ? సాకారానికి చేసినా, నిరాకారానికి చేసినా వుపాసనంతా ఆత్మసంబంధమైనదే. జీవాత్మ పరమాత్మకు అర్పించే పూజంతా ఆత్మసంబంధమైనదే.

రా:- ఆకారం నిరాకారానిది కనుక.

బు:- "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనే శ్రుతిదీనికాధారం.

సం:- నిరాకారం సాకారం యెందుకయింది ?

బు:- ఎట్లా అయిందనే విషయం ఋషులు మహావిపులంగా చర్చించారుగాని ఎందుకయిందనే విషయం మనుష్యబుద్ధికి విపులంగా గోచరం కాలేదు. భగవల్లీల అని మాత్రం చెప్పారు. నా చిత్తం అన్నదానికి పై ప్రశ్న లేదు. తరువాత ప్రశ్నలకు అనవస్థా దోషం తగులుతుంది.

సం:- ఈ లీల యెప్పుడు ప్రారంభమయింది ?

బు:- అనాదిగా వున్నది. అనంతంగా వుంటుంది. నిత్యలీల యని దీనిపేరు. ఇదియే జగన్మాత, విశ్వరూపిణి, ప్రకృతి అని కూడా పిలుస్తారు. దీనికి జగద్ధాత్రి, రాధ మొదలైనవి సంప్రదాయానుసారములయిన నామములు.

రా:- 'రాళ్లు దేవుళ్ళయితే రాసులు మింగవా' అని వేమన్నగారు ఆక్షేపించారే. దానికేమి శలవు ?

బు:- మింగుతవని భయపడేవారి అభిప్రాయంలా గ్గనుపడుతున్నది. అయితే రాళ్లు దేవుళ్ళుమట్టుకు కావలె. కాకపోతే మింగలేవు. రాళ్ళకూ దేవుళ్ళకూ భేదం జెప్పుతూ రాళ్ళు దేవుళ్ళనే వాండ్లకు ఆ జవాబు చెప్పారేమో.

రా:- ఏ విధమైన ఉపాసనయితే శ్రేష్ఠం ?

బు:- మానింది మందు. తత్వాన్నిబట్టి వుంటుంది. కొందరు పరత్వంచేత విశ్వవ్యాపకుడై యుండగా ఆయనను జూచారు. పౌరాణికులయిన కొందరాత్మవిదులు దహరాకాశంలో తేజస్వరూపుడై ప్రకాశిస్తుండగా కనుగొన్నారు. కొందరతడు సాంధ్యారాగంలో తొంగి చూస్తుంటే గుర్తించారు. సౌలభ్యవశంచేత అతడు గొల్లపల్లెలో పేడ దీస్తుంటే కొందరు పట్టుకున్నారు. కొందరికోసం వుక్కు స్తంభం పెకలించుకొని వచ్చాడు. నాకు శబరి గుడిశలో దొరికాడు. నిగమ మహాటవిలో సంచరించి విసిగి యెక్కడా కనుపడలేదని వచ్చినవాండ్లనుకూడా నే నెరుగుదును.

సం:- అంతటా వుండేవాడు కనుకనా ?

నా:- అంతటా వున్నాడు. అంతా అతనిలో వున్నది.

బు:- అంశాభేదములతో రాయీ, చెట్టూ, పుట్టా, నీవూ, రాముడూ, కృష్ణుడూ, బ్రహ్మాండమూ మొదలయిన అన్నిటియందు ప్రకాశిస్తున్నాడు. కండ్లున్నవాండ్లకు యెక్కడనయినా కనబడుతాడు. ఎవరిదృష్టి దేనిమీద పారుతుందో మనం చెప్పలేం.

రా:- యోగులకు సాకారోపాసనతో అవసరమా ?

బు:- యెవరు యోగులంటే? అంతా యోగులే. జీవాత్మకు పరమాత్మతో స్పర్శకలిగినప్పుడెల్ల యోగమనే చెప్పవచ్చును. అట్టిస్పర్శం కలుగనిది మానవుడు ధ్యానోన్ముఖుడు కానేకాడు. భగవత్కృపారసంచేత అట్టి అవకాశములు కలిగినప్పుడెల్లా ధ్యానము నలవరచుకొని క్రమక్రమంగా నిరంతరధ్యానము నభ్యసింపవలయును. హఠయోగాభ్యాసులకు సయితం చాలాకాలం వఱకు నిరంతర సమాధినిష్ఠసాధ్యంకాదు. వారుసమాధిని విగమించి నప్పుడూ లేక ధ్యానవర్జితులైనప్పుడూ మానసమును దుర్విషయములనుండి మరల్చి ధ్యానోన్ముఖులుగ చేయునిమిత్తం విజ్ఞానులైన కవులచేతనూ, శిల్పులచేతనూ, చిత్రకారుల చేతనూ చిత్రితములై, రసభూయిష్ఠములై, భక్తిప్రేరితములై భగవల్లీలాబోధకములైన గ్రంథములు పఠించడమూ, దృశ్యముల నవలోకించడమూ అవసరం. సమాధిని విడిచిన వెంటనే మనస్సునుస్వేచ్ఛగా విషయములపై పారదోలడంకంటె భువనమోహనమైన యేరాసమండల రంగమునందో విడుచుట మేలుకదా.

సం:- సాయంకాలమున సురద్రుమ వనములో వాయు కిశోరములు కుసుమరజమును పైజల్లుచుండగా యమునా సైకతములపై పండు వెన్నెలలో వేణుగోపాలునితో వొక గోపికవిధముగా ఆడుకోవచ్చును.

నా:- గోపికవిధముగా అనుటకంటె గోపికనై అని దిద్దుకొందువా ?

సం:- మనఃపూర్వకముగా దిద్దుకొందును.

రామదాసు నిర్ఘాంతపోయి చూస్తున్నాడు.

బు:- నేను మాత్రం దండకారణ్యంలో పర్ణకుటీరమున విద్యుల్లతలవలె వెలుగొందుతూ మకరతోరణాలై సీతాలక్ష్మణులు వుభయపార్శ్వములా అలంకరింపగా శబరికి సహస్రోతనై నీలమేఘమువలె మానిజన మయూరమానసహారుడై ప్రకాశించే రామచంద్రభగవానుని పదసాన్నిధ్యమున రామకథాసుధారసము కర్ణపేయముగ నాస్వాదించుతుంటాను.

రా:- అయ్యా! తమబోటి యోగిపుంగవులను సయితం ఆక ర్షించిన దృశ్యం యొక్క ప్రాశస్త్యమును దెలుపప్రార్థిస్తాను.

బు:- ఈ దృశ్యమునాకు తలంపునకు వచ్చినప్పుడెల్లా నేను పరవశమును పొందుతాను. ఆయవస్థ యోగసమాధికంటె నాకెక్కువ తోడ్పడుతున్నది. శబరి వొక రామభక్తురాలైన యెరుకలమనిషి.

నా:- కులమునకేమి ? గుణం ప్రధానంగదా.

బు:- నిశ్చయం. శబరీ మోక్షణఘట్టం రామాయణం లోనిది, శబరి రామచంద్రభగవానుడు అయోధ్యనువిడిచి, కిష్కింధనుదాటి దక్షిణమునకు వస్తున్నాడని విన్నది. విన్నప్పటినుంచి ఆమెకు సరిగా నిద్రపట్టడంలేదు. ప్రతిరాత్రి భగవానుని స్మరించినట్లు కలగంటున్నది. ఆయనమూర్తి యెట్లావుంటుందో అదివరకామెచూడలేదు. తనభావనాశక్తి కల్పించగలఅందమంతా ఆయనకు సమకూర్చింది. నీలిమబ్బులూ, నల్లగలువలూ, ఇంద్రనీలములూ, ఆ మహాత్ముని మేనికాంతికి దులకింపనోపవని తోసివేసింది. తానువిన్న కమలలోచనములూ, కంబుకంఠమూ, దీర్ఘములైన బాహువులూ వెడదయురమూ, కస్తూరితిలకమూ మున్నగు సౌందర్య చిహ్నాలన్నీ నీలదేహాన్ని సమకూర్చి, కౌస్తుభమణిచే కంఠము నలంకరించి, చేతులో కోదండంపెట్టి, తనకల్పనా శక్తికంది నయనాభిరామమైన వొక స్ఫురద్రూపాన్ని మనసులో కల్పించి ఆ దేవుని పదకమలములను తన నయనపద్మములతో నొత్తుతూ ఆనందపడుతున్నది. తనకుటీరమునకు అరటికంబములూ ఆకుజొంపములూ పూగుత్తులూ మొగలి పొత్తులూ లేతకొమ్మలూ మృదువైన రెమ్మలూ తెచ్చి అలంకరించింది. ఆవరణమంతాకసవూడ్చి, నీళ్లుజల్లి, యిల్లలికి ముగ్గులుదీర్చి, తోరణాలు కట్టింది, అతనికి నైవేద్యం పచరించుటకై వనములోవున్న స్వాదుఫలాలన్నీ చేర్చి, వాటిలో మంచివాటినేర్చి, కొరికి రుచిచూచి మిక్కిలి తియ్యనివాటి నుంచి తక్కినవి పారవేసింది. సెలయేళ్ళ నుండి తియ్యనీటిం దెచ్చి కుండల నింపింది. పాప మాశబరికి వెఱ్ఱెత్తింది. తన పనులు మరచిపోయింది. దేహ సౌఖ్యాలు విడిచి

తన చిత్తవృత్తులన్నీ శ్రీమన్నారాయణుని పాదములకడ బెట్టింది. పూజాద్రవ్య సంపాదనలు దప్ప యితర సంపాదనలు మానింది. రాముడు మాయింటికి వస్తాడని చెలికత్తెలకు చెప్పింది. వారిని దోడ్కొనివచ్చి ఆహ్వాన పరికరములన్నీ చూపించింది. రాముడు తన ఆతిథ్యము స్వీకరించడానికి వస్తున్నాడని విన్నది. పాపము ఆయనను యెవరు పిలిచారో తెలియదు. విప్రుల యజ్ఞశాలలకు బోవ లజ్జించునది, సామగానమునకు మౌనము వహించునది, మానుల హృదయమందిరముల జొరనిది, శాస్త్రంబుల కందనిది నింగి గుడిసెలో ప్రత్యక్షమైంది. అయ్యో పాపము వెఱ్ఱిశబరి వుబ్బి తబ్బిబ్బులయింది. వొళ్ళు చెమటలు గమ్ముతున్నవి. కాళ్లు తడ బడుతున్నవి. చేతులు వణకుతున్నవి. నాలుక పిడచగట్టింది. నోట మాటరాదు. ఆహ్వాన వాక్యాలు చెప్పలేదు. పూజాద్రవ్యాలు సమర్పించలేదు. ఆహారము లొసంగలేదు. పిలవకుండా వచ్చి నాయనకు మర్యాద లే మవసరం? కాని అన్నీ చేసినట్లే అయింది. చేసినవి పుచ్చుకొనుటకైనా అతిథికి శక్తిలేదు. శబరి పడుతున్న అవస్థలన్నీ ఆయనా పడుతున్నాడు. పిలవందే యెందుకని పరుగెత్తు కొని వచ్చాడు? యేమీ చెప్పడేమి? కుశల ప్రశ్న లడగ డేమి? ఆయన ఏదో చెప్పవచ్చాడు. మాట తడబడ్డది. బిడ్డ పడు తున్న అవస్తే తండ్రీ పడుతున్నాడు. తాదాత్మ్యావస్థ అన్యోన్యంగా వుండకతప్పదు. ఆయన చెప్పిన మాటలు కొన్ని వినబడనేలేదు. "శబరీ! శబరీ! శబరీ!" అని మున్మాటన్నాడు. శబరి నోటి వెంట జవాబులేదు. ఉత్తర ప్రత్యుత్తరములు భావములే గ్రహిం చినవి. శ్రీరాముడు శబరి శిరస్సుమీద చేయుంచాడు. అదికూడా వూరక భావములో మాత్రమే వుంచాడేమో. శబరి ధన్యురా లైంది.

వాయు సంచలన మాగిపోయింది. మ్రాకులు మ్రాన్పడ్డవి. వృక్షకోటరములనుండి "శబరీ! అయ్యో! నీవు వెఱ్ఱిదానివని మే మనుకొన్నామే" అని శబ్దము వచ్చింది. అది వాయుతరంగ ములమీద కొట్టుకొని పోయింది. లోక మెప్పుడూ సత్పురుషులను

గూర్చి అట్లాగే అనుకుంటుందని చెట్ల తొఱ్ఱలనుండే జవాబు వచ్చింది. అదీ గాలి కెరటముల లోనే తేలిపోయింది.

రామదాసూ, యీ దృశ్యం భావించుకొన్నప్పుడెల్లా నాకు వీరిద్దరి అవస్థే పడుతుంది.

రా:- అయ్యా! ఇప్పుడు వింటున్న మేమూ ఆ అవస్థలోనే వున్నాం.

బు:- యోగులకు యిట్టి దృశ్యములు మిక్కిలి సహాయకాగులు.

రా:- తను సాక్ష్యంకంటే మాకు రుజువెందుకు?

నా:- యోగులంకాని మాబోటివారికి మిక్కిలి అవసరమని మే మే సాక్షులం.

సంగదాసు నిశ్చేష్టుడై వున్నాడు.

రా:- అయ్యా! ఈ శిష్యుల వలన తమరు కోరు గురుదక్షిణ యేమి?

బు:- సంచితము నా కిచ్చివేయండి.

నా:- ఈ జీవితముకూడ మీకే అర్పిస్తున్నానస యెఱ్ఱని చిగుళ్ళలో తాపిన తెల్లని పలువరసచే హృదయ నైర్మల్యమును ప్రకటిస్తూ, ప్రత్యుత్తర మిచ్చాడు.

సం:- నా ప్రాణాన్ని సహా యిస్తున్నాను.

బు:- చిరకాలజీవులు కండి.

రా:- రే పిక్కడ తమరు దయచేసి వుంటారుకదా?

బు:- లేదు. వెంటనే బయలుదేరుతాను. కాలం సమీపించింది. తొందరపడి వచ్చాను. జీవసమాధి చేయబోతున్నాను.

రా:- మా అయ్యగారివాక్యం నిజమైంది.

నా:- పొద్దున తమదర్శనం చేస్తాం.

బు:- అవసరం లేదు. నేను మీకిక అందను.

రా:- అయ్యా! వొక్క మనవి. యేమో యిట్టి వెఱ్ఱిప్రశ్నలడిగినందులకు క్షమించండి.

బు:- తప్పులేదు. ఉడక్కపోతే అమ్మయినా పెట్టదు. పొదుగున పా లున్నప్పటికీ దూడ కుమ్మందీ తల్లి చేపదు.

రా:- తమకు సాటువల కేమికోదువ? మా కిక అనుజ్ఞ యివ్వండి.

బు:- మంచిది.

ముగ్గురూ వెళ్ళిపోయినారు.

## ౧౦

### పె త్త నం

ముగ్గురూకలిసి బయలుదేరారు. వీరు సందర్శించిన కరుణా రసపూరితమైన రంగం మనస్సుల సమ్మోహింప జేసింది. కొంత సేపటికి తేరుకొని వొకరివంకవొకరు చూచుకుంటూ నిలువ బడ్డారు.

రా:- మౌనముద్రను భేదించి—మనిషి గొప్పవేత్త.

సం:- గొప్పభక్తుడు.

నా:- గొప్పయోగి. కమలాలవంటి కండ్లల్లోనుంచి బ్రహ్మ తేజం గురుస్తున్నది.

రా:- యోగాభ్యాసంచేతనే కావాలె. మనిషి బొత్తిగా కృశించాడు.

నా:- శరీరం కృశించినకొద్దీ బుద్ధి వికసిస్తున్నది.

రా:- జీవసమాధి యెప్పుడో మనం పోయిచూస్తే బాగుండు.

నా:- మన కందనని చెప్పెనే.

రా:- ఆ మాటలో అంత అర్థముందా? అయితే నేను వారితోనే వెళ్లుతాను.

నా:- వారు చెప్పినమాటలో - ఆ అర్థముంటే నీవు యిప్పుడు వెళ్ళినా ప్రయోజనముండదు.

సం:- అయినా నేబోయి కనుక్కొని వస్తాను.

సంగదాసు వెంటనే వెంకటసుబ్బయ్యగారి యింటికివచ్చి అరుగుమీద లేకపోవడం చూసి అయ్యగారు యేమిచేస్తున్నారని అడిగాడు.

వెం:- మీ వెంటనే ప్రయాణమై బయలు దేరారు. మధ్యాహ్నం చెప్పడంలో సాయంత్రమే వెళ్ళుతానన్నారు. తీరా ప్రయాణమయ్యేటప్పటికి జడుస్తూనే పొద్దులేదే అయ్యా, అన్నాను. ఎంతదూరం? యిప్పుడు పోలేనా అన్నారు.

సం:- యేవూరు పోతామన్నారు ?

వెం:- ఆసంగతి నే నడగలేదు. యెంతదూరమంటే పొరుగూళ్ళో పని వున్నదేమో అనుకున్నాను. యెందుకూ? దూరం బోయి వుండరు. వీధిమొత్త తిరిగివుంటారు.

ఇద్దరూ కలిసి మొత్తతిరిగిచూస్తే యెవరూ కనిపించలేదు. యేవైపు చూచినా యెవరూలేరు. అంతట సంగదాసు వచ్చి "నాయుడుగారు చెప్పిందే నిజం. నేను అపచారం చేశాను" అని అన్నాడు.

రా:- వెళ్ళారా యేమి ?

సం:- యేమైనారో యెవరికీ తెలియదు.

రా:- ఆశ్చర్యం.

నా:- చెప్పనే చెప్పారు. ఆశ్చర్యమేముంది ?

రా:- మీరు అదృష్టవంతులు. యిటువంటివారివల్ల కారణం సాధారణంగా దొరకదు.

సం:- ఆయన వుపదేశఫలం మనకందరికీ లభించింది.

రా:- పితృరుణం తీర్చుకున్నావు. నీవల్లనే నాకు లభించింది. యింటికి పడుకోవడానికి వస్తావా ?

నా:- యీరాత్రి మా యింట్లోనే పడుకుంటాడు. మా నాయనగారూ పిల్లలూకూడా యింట్లో లేరు.

రా:- యెక్కడికి పోయినారు ?

నా:- తిమ్మాపురం పెండ్లికి వెళ్ళారు. ఆయనగారు రేపు తప్పకుండా రావాలె.

రా:- కమలమ్మగారుమట్టుకు రారా ?

నా:- ఊఁహూఁ. అక్కడనుంచి నాదెండ్ల పుట్టింటికి వెళ్తుంది.

రా:- రేపైనా రా. నేనిగ యింటికి వెళ్ళుతాను.

సంగదాసూ, రామానాయుడూ యింటికి వచ్చారు. రామానాయుడు మేడమీదికి బోయినాడు. సంగదాసు కొట్టంలోకి బోయి యెద్దులచావిడిదగ్గర నిలువబడ్డాడు.

సం:- ఆదంసాహేబూ! యింకా దాణా పెట్టలే యెద్దులకు-లాక్కుంటున్నవే.

ఆ:- బుట్టలకు పోసి తెస్తున్నారండి. వులవలు వుడకటం ఆలస్యమైంది. పత్తిగింజలు బుట్టల్లో పోసి వుంచాం.

సం:- పత్తివిత్తులు ఇంకా యెన్నాళ్ళు పోతవి ?

ఆ:- అయిపోవచ్చినవి. రెండురోజులకు మిగలవు.

సం:- యెట్లాగబ్బా యిగను? పత్తి అడిగేవాండ్లు లేరు. పత్తిగింజలకు యెక్కడలేని ధరానూ. పత్తిపట్టిస్తే బాగుండు. ఆదంసాహేబూ! నీవు ఆనికై తోగటవీధి బోయి పత్తిరాటాల వాండ్లను పట్టుకరా. పదిపుట్లు పట్టిస్తే చాలావరకు నెట్టవచ్చు. యెదలైపోతే తరవాతమాట చెప్పబోకు. పదిరాటాలు వస్తే రోజూ వొక పందుం పత్తి నలుగుతుంది.

ఆ:- చౌదరయ్యగారు రేపు వస్తారుగా; గింజలు కొందామంటారేమో ?

సం:- మనం పత్తిపట్టిస్తే ఆయనెందుకు కొంటానంటాడు ? బిడ్డగనే కోడలుంటే వద్దనే అత్త యెక్కడావుండదు. రాటాలు యెక్కడ పెట్టింతాం? యింట్లో పెట్టిస్తే తెగ అరుస్తవే.

ఆ:- మొన్న వేలంలో గొన్న తోగటింట్లో పెట్టించండి. బాగా విశాలంగా వుంది.

సం:- కొనంగానే మనకు వచ్చిందా ! అమీనా వచ్చి స్వాధీనం చేయవద్దూ ?

ఆ:- అదొక ఖర్చెందుకని పంతులుగారూ, చౌదరయ్య గారూ పోయి వాళ్ళను వెళ్ళగొట్టి తాళంవేశారు. ఇంకా స్వాధీన మేమిటి ?

సం:- వాళ్ళు వూరుకున్నారా ?

ఆ:- గంపెడుచీకటి నెత్తినవేసుకుని తూర్పు బతకపోయి నారు. అక్కడనే వాలుగాఉంది. పెట్టించండి.

సం:- సరే కానియ్యండి. అక్కడ హమేషా వొక మనిషి వుండాలె. పద్దులు వ్రాయగలవాడవు నీవేవుండు. వొక్కవిత్తు బీరుపోనియ్యవద్దు. కూలివాండ్రు యేడుస్తారు. రేపుప్రొద్దున రాటాలు ప్రారంభించే జవాబుదారి నీది. తెలుసునా ?

ఆ:- సరే చెప్పారుగా ! నాజీతంసంగతి సాచేతగానే పోని స్తున్నారు.

సం:- రేపు చౌదరయ్యగారు రాంగనే యేదో వొకటి ఫైసలు చేస్తాంలే. రాంగనే వొకమాటుకదిలించు.

సం:- బండ్ల దొడ్లోకిబోయి— వెంకయ్యా రేపు అరకల పని యెక్కడ ?

వెం:- వెంకటయ్యగారు పదిహేను అరకలు మిరపదుక్కిలో చాళ్ళు తోలడానికి పోదామన్నారు. తక్కినవి ఎక్కడికి పోవలెనో నిన్ను గనుక్కోమన్నారు.

సం:- ఆయన అన్నీ గుంట్లుపెట్టి పనిచేస్తామంటారు. మళ్ళీ కురదలాం లెందుకు ? యిరవై అరకలు వాళ్ళకు పోనిచ్చి తక్కిన పదీ వరిగె దుక్కిలో గొర్రుదోలడం మొదలు పెట్టండి. గొర్రు లతో రామయ్యను పోమ్మను. చాళ్ళకు వెంకయ్యగారుబోతారు. జట్కాబండి మనిషిలేడూ ? ఫరీదుసాహెబూ !

ఫ:- క్యావుజీ, మహారాజ్ ?

సం:. యేం క్యావుజీ. మాట్లాడే స్థితిలో వున్నావా ?

ఫ:- లేకపోవడ మేమండి. మొన్న యెప్పుదో యేక్ దఫా-

సం:- అవును వొక్కమాటే—యెప్పటి కప్పుడు. చౌద

రయ్యగారు నీవు పనికిరావంటున్నారు. మీ అయ్యవచ్చి జతిమె లాడి భద్రంచేస్తానని పోయినాడు. యేమి భద్రంజేశాడో ?

ఫ:- మాఅయ్య ఖసం తినిపించాడుగా అండీ. మళ్ళీ దుకాణంకళ్ళి అసల్ పోతున్నానండీ ? నైజీ సబ్ కూ పూఛో.

సం:- యేమిటోయి మీనాయన కొత్తవి తినిపించాడు? ఖసం యేమిటి ?

ఫ:- ఒట్టు పెట్టించాడుగా అండి.

సం:- అదా ? సరే చూతాం. చౌదరయ్యగారు పొద్దున రైలు దిగుతారు. రైలు దగ్గరకు నీబండి పోవాలె.

ఫ:- అమ్మగారు దేవుడికి సూసేకి పోతామన్నారుగాఅండీ.

సం:- అమ్మవారిగుడికి పొద్దున్న పోతామన్నారా యేమి?

ఫ:- అవునండి.

సం:- జట్కా కావాలన్నారా ?

ఫ:- అమ్మగారికి ఝట్కా అయితేనే ఫసందండి.

సం:- యేమిటా ఫసందు ? అయిదాకుగు రెక్కాలె. యిసుకలో గి.టా్కా పడుకుంటుంది. నే కనుక్కుంటాలే. వెంగన్న వున్నాడా ? దుకాణానికి పంపించావా ?

వెం:- అయ్యా యేమండి, యీసాయెబు యెప్పుడూ దుకాణానికి రమ్మంటాడండి.

సం:- అవును నీవు చాలా బుద్ధిమంతుడివి. మీయిద్దరూ నడవవలసినవాండ్లే. రత్నాలు దొరికారు. బండ్లు బోల్తా తోస్తారేమోనని అయ్యగారు భయపడుతున్నారు. అన్నట్టు మొన్న రైలుదగ్గరనుంచివస్తూ రాతికి పట్టించి తిరగదోశావటగా?

వెం:- యెద్దు అలివితప్పితే నన్నేమి చేయమంటారు?

సం:- స్టేషనుదగ్గరి దుకాణంలో అదికూడా తాగిందా యేమి ?

వెం:- ఏమిమాటలు చెపుతారండి. నేనిప్పుడు అంటుకోపడమే లేదుగదా.

సం:- అయితే బుద్ధిమంతుడవేగాని రేపు ప్రొద్దున మీాయి ద్దరిలో యెవరు రైలు దగ్గరకు పోయినా అయ్యగారితో నీలి మందుకు ధరలేచిందట. చెన్నపట్నం తోలేటందుకు రెండు వాగిన్లు కావాలట. యిదివరకు హెచ్చరిస్తే మేష్టరుగారు నచ్చగా జవాబు చెప్పారట. మీారు వారితో మాట్లాడి తప్పక రెండు వాగిన్లు సెటిల్ చేసుకొని రమ్మన్నానని కామకా చెప్పాలె. మరిచిపోతారా?

వెం:- నేమరచిపోనండి. యీా సాయిబుకు తెలిసిందో లేదో.

ఫ:- కాగితం వ్రాసియియ్యండి.

సం:- వుద్ధరించావు. అయితే నీవు అమ్మవారి గుడికిపో. వెంగన్నా! నీవు స్టేషనుకుబోయి బండిలో పడుకోక గేటుదగ్గర నిలుచొని అయ్యగారు దిగంగానే పిలువు. షరాకదారీ అయ్యేరు. ఆయన రైలుకట్ట వెంబడి వస్తారు.

వెం:- అయితే నేను పాయింటు దగ్గరనే బండిదింపు కుంటా. రెండు రోడ్లూ అక్కడనే కలుస్తవి.

సం:- అప్పుడే మరచిపోయినావు. అయ్యగారు మేష్టరు గారితో మాట్లాడవద్దూ.

వెం:- సరే గేటుదగ్గరనే వుంటా.

సం:- వెంగన్నా! నీవు గొల్ల వెంకటసామింటికిబోయి నీవు పొగతోటలో గొర్లు తోలుతానని తలాయిస్తున్నావట. కామకావచ్చి మాట్లాడి పొమ్మన్నానని వెంట బెట్టుకొనిరా! అతడు మందదగ్గరవుంటే పెండ్లాన్ని పిలుచుకరా.

వెం:- వాడు యెప్పుడూ మందదగ్గరనే పడివుంటాడు. పెండ్లాన్ని రమ్మనమంటా.

సం:- చీపురు తీసుకొని కొడుతుంది.

వెం:- మీా పేరు చెపుతా.

సం:- అంత ప్రబుద్ధుడవ్వూనూ.

ఆదంసాహేబు వచ్చి "తొాగట చిన్నప్పతో మాట్లాడా, పదిరాటాలు సంతన చేసుకుని పొద్దున వస్తానన్నాడు. స్వంత రాటాలే నాలుగున్నవట. యెవరో సీలిమందు బేరగాండ్లు వచ్చారు. నాయుడుగారు మిమ్ముల్ను రమ్మన్నారు."

సం:- వీధిలోకి వచ్చి -యేమండో సాహుకారుగాయ, పెద్ద సాహుకార్లంతా దయచేశారే. కోస్తా లేచిందా?

షా:- గిరాకీలేదు, బండలూలేదు. అడిగే దిక్కేలేదు. మీరు పండినా యెండినా వ్యవసాయం చెయ్యక తప్పదుకదా. వర్తకంలో మేమున్నందుకు దండగో పండగో కొంటూం వుంటాం.

సం:- లాభంలేని సెట్టి వరదబోడు. యిదివర కెట్లా దీస్తున్నారు?

షా:- తమలో - సావులూ - పోగురుకా - అవల్ రకానికి అయిదు పెట్టాం. నాసికి నూరూ తొంభై వర్ణంకొద్దీ పెట్టాం.

సం:- యింకొక మాటనండి. మాది ప్రాప్తమైన సరుకు. నాసెన్న మాటలేదు.

షా:- అక్కడికే పెట్టుధర. యేమాత్రం తేలేను.

సం:- రెండువందలు దాకొంటుంది.

షా:- స్వంతమేనా?

సం:- కొద్దిగా బాకీలకింద వచ్చింది. యెందుకూ - దిష్టికి ఆక్కపోతే మేమే తియ్యాం. మాటదక్కవద్దా. రెండోరకమన్న మాటలేదు.

షా:- మరేమి. చెప్పా. వేయి రూపాయలు బయానా యిచ్చిపోతాం.

సం:- పొద్దున వస్తారుగా?

షా:- యెప్పటికప్పుడు రహితమైతే మంచిది.

సం:- మీరు బేరం యియ్యడానికి వచ్చారా, తియ్యడానికి వచ్చారా?

షా:- పోనియ్యి. నీవు బేరం యియ్యకపోతే మేము పంద మళ్ళు యిస్తాం తీస్తారా?

సం:- చౌదరయ్యగారుకూడా పొద్దున వస్తారు.

షా:- ఆమాట మాకు భయంలేదే. నీవు మాట అన్నా వంటే ఆయనదాకా అవసరంలేదు. అందాకా యెందుకూ. నీవు మా తరఫునపోయి బేరం యిచ్చిరా, కాదంటే అప్పుడను.

సం:- వేలతోగూడిన వ్యవహారంగా.

షా:- సరే యిప్పుడు కాదన్నమాంటేగా?

సం:- ఆఖరుమాట చెప్పలేదే.

షా:- పొద్దున్న పూళ్ళోకి తూకానికి వస్తాంగా, రకంజూచి.

సం:- సరే.

సంగదాసు లోపలికిబోయి స్నానంచేసి భోజనం చేశాడు. లక్ష్మమ్మ ప్రొద్దున తనకు గుర్రపుబండి వుంచమని చెప్పింది. గొల్ల వాడు తెల్లవారి వస్తానన్నాడని కబురు వచ్చింది. రాత్రి మళ్ళా నాయుడుగారిని చూడడానికి అవకాశం కలగలేదు. లాంతరు తీసు కొని తన గదిలోకిబోయి యెలుకలు లేకుండా వెదకిచూచి తలుపు వేసి పడుకున్నాడు.

## ౧౧

### దేవాలయం

తూర్పు తెల్లబారింది. వెంకటయ్యా, సంగదాసూ లేచి కొట్టంలోకి బోయి జీతగాండ్లను పనులకు పురికొల్పుతున్నారు. వాండ్లు పశువులకు మేతవేయడమూ, నీళ్ళు తేవడమూ, కుడితి బోయడమూ, పేడతీయడమూ, కసవూడ్చడమూ మొదలైన పనులు చేస్తున్నారు. అవయినతరువాత యిండ్లకుబోయి అన్నం తినివచ్చి కోతేన్లు వేస్తున్నారు. వెంకటయ్య భోజనంచేసి లక్ష్మ మ్మతో - చిన్నమ్మా! నీవు గుళ్ళోకి పోతున్నావుట. నీతో యెవరు వసున్నారు?

లక్ష్మ:- నీభార్యను తీసుకొనిపోతున్నాను. అబ్బాయికూడా వస్తాడట.

వెం:- ఆమెట్లు నీవు యెక్కి దిగ్గలవా? లేనిపోనిపని పెట్టుకొన్నా వెందుకు?

ల:- నీభార్య కాపురానికి వచ్చిన కొత్తలో అమ్మవారికి చీర మొక్కున్నాను. ఈ అయిదేండ్లనుంచీ అట్లాగే పోతున్నది. గొడ్డూ, బిడ్డాగలవాండ్లం. యే దగ్గువచ్చినా, యే పడిశంపట్టినా అదే నింజిలిగా వుంటుందని బయలుదేరుతున్నా.

వెం:- ఎండబడ్డదా అంటే యెక్కిదిగటం నీతరంకాదు. అసలు నీవు తేమానం మసిషివి. పని తెముల్చుకొని పోయే దెప్పుడో, వచ్చేదెప్పుడో. యేదెట్లావున్నా మధ్య నీవు జారిపడేవు. కొన్ని మెట్లు వొరకాటంగావుంటవి. నిన్నుపట్టుకొని యెక్కించాలె. అరకకు యెవరినైనా పంపి నీతో వచ్చేదా?

ల:- నీపనికి అరఖతెందుకు? పిల్ల వుంటుందికదా. అబ్బాయి వస్తానేవున్నాడు.

సం:- వెంకటయ్యగారూ! అరకలు పోతున్నవి.

వెం:- ఆమెను మెట్లెక్కించేటందుకు వొకమనిషిని పంపవోయ్. అబ్బాయి యెక్కిస్తాడంటుంది. ఆయన యెక్కగలిగితే చాలు. మేనా వుండెగదా, కాసేపు చాకలవాండ్లను రమ్మనకపోయినావా?

సం:- అదీ ఆలోచించా. వాండ్లు యేదోవూరు సవారికి పోయినారట. సరే యేదో చూతాం. మీరుగెన జొన్నచేనేమైన చూశారా? కోతకు వచ్చిందేమో.

వెం:- ముం దెక్కివచ్చిన ముప్పైయకరాలు తిరగబారి పోయింది. కాకపోతే కుళ్ళునేల పదెకరాలు కాస్త ఆగవలసి వస్తుంది. పల్లపుగుడ్డం బాగా కాసినట్టు లేదు.

సం:- యివ్వాళ మీరీచాళ్ళు తోలడం గానిచ్చి రేపు గొర్రుదోలడం పూర్తిచేయండి. రేపు వొక యాభైమంది కూలీ

లను తీసుకపోయి కోత మొదలుపెట్టిస్తాను. యెల్లుండి అరకల పని లేకపోతే జీతగాళ్ళందరినీ కోతకు తీసుకపోవచ్చు. సొంత మనుష్యులుగూడ కొందరు పనిచేస్తుంటే పని జరఘుగా సాగుతుంది.

వెం:- మందట నేను దున్నుతుంటే సాగినట్టు, లేకపోతే సాగదు.

సం:- నీలిమందు బేరగాండ్లు యీపూట వస్తామన్నారు. నూటఐదింటికి పైనే పడవచ్చు. మీచిన్నయ్యగారు యీరోజు రాకపోతే చేయవలసిందేమిటి? పెద్దమొత్తమని సందేహిస్తున్నా. పోనీ చెన్నపట్టంయె త్తింతామంటే శానా లాయిలాసాపని. ముందు అక్కడికి పోయేనాథుడు లేడు.

వెం:- నీవు చెప్పినకాడికయితే పోనీయవచ్చు. ఆయన వచ్చిమటుకు వెళ్ళవేసే దేమున్నది?

సం:- ఆపడానికి వీలయితే ఆపుతాను. అరకలు సగంత్రా నికి పోయివుంటవి. కలుసుకోండి.

చంకన ములుగఱ్ఱ పెట్టుకొని చుట్ట చుట్టుకొంటూ బారి డేసి అంగలు వేస్తూ వెంకటయ్య బయలుదేరాడు.

సం:- అమ్మా, లక్ష్మమ్మగారూ! ఎందుకీ తాచ్చారం. బండి వాకిట్లోకి వచ్చింది.

ల:- మేము బయలుదేరుతున్నాం. అబ్బాయి యింకా కిందికి రాలేదు. మాకు చిల్లర కావలె.

సం:- అబ్బాయిగారు మేడి దిగి వస్తున్నారు. వారొక అర్థరూపాయి నేబులు తీసుకున్నారు. చాలునా?

ల:- చాలకెందుకు పదండఱ్రా.

లక్ష్మమ్మ వాతపువొంటి మనిషి. ఆలావుమీద పొడు గనిపించదు. మండోదరివలె యిల్లు నిండివుంటుంది. కాళ్ళు కొంచెం పీలగా వుండటంవల్ల బందికాడుతూ నడుస్తుంది. పచ్చి పసుపుకొమ్మువంటి పసిమి. పూర్వకాలపు మనిషి. యీకాలపు

తళుకు బెళుకు ఎరుగదు. మనిషిదగ్గర కల్లాకౌడూ లేదు. యెవ రితోనైనా నోటార వరసన బిలిచి మాట్లాడుతుంది. స్వంతంగా వడికి, నేయించుకొన్న మైజారుచీర గట్టుకొని గుమ్మడిపండు పెట్టె కుచ్చెళ్ళు దోపుకొని గోటురవిక తొడుక్కున్నది. కాళ్ళకు పసుపూ, మెడకూ చేతులకూ గంధమూ పూసుకొని, పెద్ద యెర్ర కుంకుమబొట్టు పెట్టుకొన్నది. ముక్కున యెర్రరాళ్ళచిలకా, చెవు లకు నిండిన బొగడలూ, తిరుగుడు కమ్మలూ, మెడలో గళ్ళా పట్టెడా, పమిడినల్లలూ, తాళిబొందులో రూపులూ, అడ్డిగెలూ, తలను తిరుగుడుబువ్వా, సవరకుప్పె, చేతికి చక్కగా తొమిన రాగిగోట్లూ, నడుమ లక్కపట్టెలూ - యివే ఈమెకు సాధారణ మైన అలంకారములు. కాళ్ళకు సన్నని మెట్టెలకంటె వేరేనగలు లేవు. ఈ సరుకులు ఆమెకు యెప్పుడూ వొంటిమీదనే వుంటవి. దాపుడు నగలు రాగిడీ, కమ్మల గొలుసులూ, ముక్కుపోగూ మాత్రం కార్యఖరమ్మతులలో పెట్టుకుంటుంది. సగం నెరసిన తలవెంట్రుకలు మిక్కిలి శోభస్కరంగా వున్నవి. చూచినవారు పెద్దముత్తయిదు నమస్కారం పెడితె పాపాలు పరిసిపోత పనుకుం టారు.

మెల్లగా వాకిట్లోకి నడిచింది. గడపదాటి బండివంక చూచి అరుగుదగ్గరకు తిప్పితే! యెక్కుతా నన్నది. ఫరీదుసాహేబు బండి అరుగంట తిప్పి గుర్రాన్ని గట్టిగా పట్టుకొన్నాడు. మెల్లగా బండి లోకి సర్దుకొన్నది. కమాన్లు కిటకిటలాడినవి.

ల:- వెనకబరువూ, ముందుబరువూ అంటే నేజరగలేను. వొకరు వెనుకా, వొకరు ముందూ యెక్కి మీరే సర్దుకోండి.

కోడలు వెనుక ఎక్కింది. రామానాయుడు ముందెక్కి "బండి నేను మెల్లెగా తోల్తాను. జట్కావాలా వెంబడేరా" అన్నాడు. పనికత్తె అక్కలక్ష్మి పసుపూ, కుంకపు పళ్ళెమూ లక్ష్మమ్మచేతి కందించింది.

ల:- అక్కలక్ష్మి! ఇల్లు భద్రం. నీవు వొళ్లుబరువు మనిషివి. పొయ్యిలేక తిరెపెపు మజ్జిగ లేవనేవు!

అక్కలక్ష్మి చిరునవ్వు నవ్వింది.

ల:- దాసూ! పూజారి అప్పయ్యకు కబురంపావా?

సం:- పొద్దున కొండమీదికి పోయినాడు. మీరు వచ్చేదాకా అక్కడనే వుండమన్నా.

గుర్రం సాగింది. బండి మూలతిరిగిన తరువాత సంగదాసు గదిలోకి పోయినాడు. ఫరీదుసాహేబు వెంట పరుగెత్తుతున్నాడు. గుర్రం రోడ్డుమీద తరటుపోయింది. కాని డొంకలో నడక ప్రారంభించింది.

ల:- రాముడూ! చూశావు వాడిజాగ్రత. కూలివాండ్లను కొట్టవద్దంటాడని మీ నాయనకు కోపంగాని వాడు లేకపోతే మనకు వొక్కరోజు సాగదు. యింటివ్యవహారం నీవేమీ అంటించుకోవుగదా?

రా:- రేపటినుంచీ నే పొలంబోతా. వ్యవసాయపు పని నేర్చుకోవాలె.

ల:- నేర్చుకొనేదేమున్నదీ? చూస్తుంటే అదే అవగాహన అవుతుంది.

రా:- చూడడంగాదు. దున్నడం నేర్చుకోవాలె.

ల:- ఇక అయినట్టే. నీవు దున్నితేనేగాని సంసారం ముందుబడదు. మీ నాయన కోప్పడతాడు. కవిలె చూచుకుంటూ వ్యవసాయం అజ కనుక్కుంటూవుంటే చాలు.

రా:- వ్యవసాయం చేయందీ దాంట్లోవుండే కష్టనిష్టూరాలు యేమి తెలుస్తవి?

ల:- మీ నాయన నిన్ను వుద్యోగంలో ప్రవేశపెడతానంటున్నాడే! అక్కడ వెళ్ళితే వల్లగాదట. పోతావా?

రా:- నీ వేమన్నావు?

ల:- అయిన నీఅభిప్రాయం జెప్పు.

రా:- నేను నవుకరీ చేయను.

ల:- నీకు వచ్చిన చదువుకు కొన్నాళ్ళలో తహసిల్ దారు పని అవుతుందిటే ?

రా:- ఏమయినా గానియ్యి. నే బోను. నీ వేమన్నావు ?

ల:- నేను నిన్ను విడిచిపెట్టి వుండలేనన్నా.

బండి దేవాలయానికి పోయే మెట్లదగ్గర ఆగింది. కోడలూ, రామానాయుడూ దిగారు. లక్ష్మమ్మ మీరు నొగలు పట్టుకుంటే దిగుతానని మెల్లెగా జారింది. పూజారి అప్పయ్య హాజరుగా వున్నాడు. చాలా పొడుగాటివాడు. అరవయ్యోపడిలో వుంటాడు. కొంచం ఆడంగిరేకల మనిషి, సంసారం లేదు. చిన్నప్పుడే భార్య వెళ్ళిపోయింది. పొట్ట లోపలికిబోయి యెప్పుడూ అక్కళించే వుంటుంది. జామారు పింజబోసి మోకాళ్ళమీదికి దోపుకొని తడి కొల్లాయిగుడ్డ కుడిబుజాన పెట్టుకున్నాడు. సంసారం లేనివాండ్లకు సరసాలు మెండని ఆయనకు నవ్వేమాట లధికం. గాలి కెగురు తున్న పిలకజుట్టు సవిరించుకుంటూ లక్ష్మమ్మ కెదురుగా వచ్చాడు. ఎడమచేయి తిప్పుతూ మాట మాటకూ ముక్కు-గూళ్ళెగుర వేస్తూ,

అ:- లక్ష్మమ్మా! నీవు మావూరు కాపురానికివచ్చి ముప్ఫైయేండ్లు దాటింది. పొరుగు గడప తొక్కి యెరుగవు. ఆఖరకు అమ్మవారి దరిసెనానికి కూడా రాలేదు.

ల:- ప్రాప్తం వుండవద్దా—మామా—నాకు తెల్లవారి లేచినప్పటినుంచీ మునగానాం, తేలానాంగా యీ సంసారమే సరిపోతున్నది.

కొండకింది గుడి గ్రామదేవతది. గుడిముందు అమ్మవారి పాదాలున్నవి. ముందు ఆమెకు మొక్కులు చెల్లాలె. లక్ష్మమ్మ పసుపు కుంకుమ చల్లి నొక రవికా, ఖర్జూరకాయ బెట్టి దణ్ణం బెట్టింది. తలావొక కానీ దక్షిణ వేశారు. అప్పయ్య కన్నుల

సంతోషం వెలిబుచ్చుతూ పసుపూ, కుంకం వదిలివేసి తక్కినవి యేరుకొన్నాడు. అందరూ మెట్ల దగ్గరకు పోయినారు. చెక్కడపు రాళ్ళతో మెట్లు విశాలంగా కట్టబడ్డవి. ఇరుప్రక్కలా రాతి దూలములతో పిట్టగోడలు కట్టారు. గోడల ముఖస్థలమున రాతి గోడలో ఏనుగ తొండములు చక్రాకారంగా చెక్కబడ్డవి. మెట్ల దారి నిటాలుగా నుండక మెలికెలు దిరిగి పసుపుగా వుంటుంది. లక్ష్మమ్మ తిప్పమీద వున్న దేవాలయం జూసి అందాకా ఎక్క వలసిందేనా? మామా! నీవు నన్నెట్లా చేరుస్తావో అంటూ వొక చేయి కోడలిమీద వేసి రెండవచేత పిట్టగోడ ఆను జేసుకొన్నది. ఎక్కడం ప్రారంభించారు. అక్కడక్కడా కూర్చుంటూ లక్ష్మమ్మను గుంటి దగ్గరకు చేర్చారు.

అ:- ఇది ధనపుకొట్టు. ఎంతదిట్టంగా అమిర్చారో చూడు. అన్నీ చెక్కడపు దూలాలే! ఈ గుడి ఎప్పుడయినా శిథిలమయితే తిరిగీ కట్టించడానికి ధనపు బిందెలు యిందులో వున్నవిట.

అగ్బర్ పాదుషాకాలంలో అమీన్‌ముల్కు అనే సేనా నాయకుణ్ణి గోల్కొండనవాబు దండయాత్ర పంపించాడు. అతడు తన జయసూచకంగా వుత్తరంగా కనుపడే చెరువు తవ్వించి గుంటి మీద మసీదు గట్టించాడు. ఆమసీదుకట్టించే నిమిత్తం యీ దేవా లయపు రాళ్లు తీసుకొని పోవలెనని ధనపుకొట్టుమీదివి రెండురాళ్లు పెకలించేవరకు అతనిగుడ్డం భొళ్లున నెత్తురుగక్కి చచ్చింది. అంతట రాళ్లు పెళ్ళగించడం సంక్షేపించి తన మసీదుకు కావలసి నన్ని వేరేరాళ్లు చెక్కించుకున్నాడు. యిక్కడనుంచీ మెట్లు వారకాటం. యీధనపుకొట్టుదగ్గర కాసేపు అందరూ కూర్చోవల నని శాస్త్రం.

ల:- శాస్త్రం లేకపోయినా కాసేపు కూర్చోంది ఆమెత్తు మెట్లు నేనెక్కలేను.

రా—శాస్త్రంకూడా అందుకే యేర్పడి వుంటుంది.

అప్పయ్యా పెదవులు గిన్నెవలెబెట్టి ఉహుహూ అనినవ్వి మాకోడలు యెత్తుబడ్డది. మాకొడుకును పిలిపించమంటావా? లేవ దీయడానికి.

ల:- మామవు నీవు యిక్కడ వుంటివిగా.

లక్ష్మమ్మలేచి యెత్తుమెట్లెక్కవలెనని ప్రయత్నంజేసింది. కాలు లేవలేదు. మరల కూర్చొని మామా! యింతదూరమూ యెక్కి అమ్మవారిని చూడడానికి ప్రాప్తంలేదుగాఁవాలెనని మెట్టు మీద గూర్చొని పైకి దేకడం ప్రారంభించింది.

ల:- ఆఁహాఁ——నాకోడలు యెంత వుపాయశాలీ!

అందరూ నవ్వేరు.

ల:- ఎవరి వుపాయం వాండ్లది. వుపాయం లేనివాండ్లను వూళ్ళో వుండనీయగూడదట.

అందరూ గుంటిమీది కెక్కారు.

ఈ శక్తి దేవాలయం మిక్కిలిపురాతనమైనది. యేకాలమున యెవరు గట్టించిందీ తెలిపే చరిత్రాధారాలులేవు. గుంటి వుత్తరపుప్రక్క నొకశిలాశాసన మున్నది. అది యెడతెగని గాలీవానా పెట్లకు అరిగి అక్షరాలు శిథిలమైయున్నవి. ఇది రెడ్లనాటిశాసనం. మంగళాపురం, క్రంతేరు, డొంకిపఱ్ఱుగ్రామాలు అమ్మవారికి అగ్రహారమిచ్చినట్లున్నది. అమీన్‌ముల్క ముఖమండపంలో కొంత చిత్తరువుచెక్కి పారవేయించి అచ్చట తనదండయాత్రలో గలిగినవిజయములు వర్ణించుతూ శాసనం వ్రాయించాడు. యీ దేవాలయానికి స్థలపురాణమూ లేదు. యీకొండకు దక్షిణమున పుట్టకోటనే గ్రామప్రాంతస్థలములో పూర్వపు విదర్భాపురమున్నదని తనవివాహమునకు పూర్వం రుక్మిణి మాధవుం దనకు పెనిమిటింజేయమని ప్రార్థించి మొక్కుబడులు చెల్లించడానికి యీ దేవాలయానికి వచ్చిందనీ శ్రీకృష్ణు డామెను రథముమీద బెట్టుకొని పలానా దారిన వెళ్ళిపోయినాడనీ గుంటిమీద కనుపడే నీటిచారలు రథచక్రముల లేడెలనీ పూజారప్పయ్య యెడమచెయ్యి

తిప్పుతూ తేపతేపకూ గుక్కతిప్పుకుంటూ భక్తులకు వర్ణిస్తుంటాడు గాని యీకథలో సత్యమెంతో చెప్పడానికి వీలులేదు. రమేశదత్తు గారు విదర్భ బీదరుప్రాంతములో వుంటుందని పేరు పోలికనుబట్టి వ్రాస్తాడుగాని యితరకారణము లేమీచెప్పడు. ఆప్రాంతములో ప్రసిద్ధమయిన యీశ్వరీదేవాలయ మున్నదేమో తెలియదు. చరిత్రశోధనావిషయమున ఆంధ్రులు గనబరుచు అలసభావమే దీనికి అడ్డంవచ్చింది. విదర్భ ఆంధ్ర దేశములోనిదా అనే ముఖ్య విషయములో సయితం ఆంధ్రులు పరిశీలించి అభిప్రాయం వెల్ల డించకుండడం శోచనీయమే. రుక్మిణీకల్యాణములో పోతన్నగారు కూడా స్పష్టీకరించలేదు. "నమ్మితి నామనంబున సనాతనులైన యుమా మహేశులన్, మిమ్ముఁ బురాణదంపతుల" అని రుక్మిణి పార్వతీ పరమేశ్వరుల నిద్దరినీ ప్రార్థించినట్లు కనబడుతున్నది. ఈదేవాలయములో అయ్యవారులేరు. అమ్మవారొక్కతే వున్నది. పైపద్యములో రుక్మిణి యిద్దరిని భజించినట్లు కనపడ్డా పద్దెముచివ రను యీశ్వరీ అని ఒక్కరినే సంబోధించింది. యీపద్యానికి పూర్వపువచనంలో "ఇందుధర సుందరీ మందిరంబుచేరి" అనీ తరువాతవచనంలో "గౌరీదేవికి మ్రొక్కి." అనీ వ్రాయడంచేత కవి అలంకారంగా వొకచోట వుమకు మహేశ్వరుణ్ని చేర్చాడు గాని రుక్మిణివెళ్ళింది శక్త్యాలయమే అయినట్టు స్పష్టపడుతున్నది. పుట్టకోటప్రాంతంలో పడిపోయిన దేవాలయాలూ, పూడిపోయిన విగ్రహాలూ, మట్టిదిబ్బలూ, చాలా కనబడడంవల్ల యిది పురా తన ప్రసిద్ధస్థల మైనట్లు తోస్తుంది.

చుట్టూ షుమారు నూరుగజాలయెత్తుండి పైన వొక యెక రం విశాలస్థల మున్నది. యిట్టి రమ్యస్థలములలో పాశ్చాత్యులు విహారమందిరాలు గట్టించి పెద్ద పూటకూలియిళ్ళు పెట్టించేవాండ్లు. మనపూర్వులు తమ ఆదర్శాలప్రకారం దేవాలయాలు కట్టించి పవిత్రస్థలములు చేశారు. పైనుండిచూస్తే రంగం మిక్కిలి హృద యంగమంగా వుంటుంది. తూర్పున కొండలు బారులు దీరినవి.

తక్కినవైపుల పొక్కిటిగడ్డలవలె తిప్పలుంటవి. ఈ సమీప గ్రామాలు కొండకాటిపూళ్ళని తూర్పుసోదరులు పొగుడుతారు గాని యివి పూర్వనుంచీ ప్రసిద్ధస్థలాలే. రెండు పెద్దతటాకాలూ, నీరూ రేవాగూ, లోతులేని బావులూ, కొండవీటి చేంతాళ్ళవసరం లేకుండా చేస్తవి. కొండనెత్తములమీద యెండాకాలం చల్లగా వుంటుందిగాని జను లిప్పుడు నివాసంచేసే అలవాటు రెడ్లప్రభుత్వంతో బోయింది. యీగుంటికి వుత్తరమునా, తూర్పునా, వరిమళ్ళు పచ్చీసుగళ్ళవలె వరుసలుదీరి పసరుగక్కుతూ వచ్చిపొయ్యే పిల్లగాలులకు సయితము సలాములు చేస్తున్నవి. చిత్తకు చిరుపొట్టలన్నట్లు ముదురు మళ్ళనీ పొట్టకువచ్చి అక్కడక్కడ వెన్ను వెళ్ళుతున్నవి.

దేవాలయం మిక్కిలి సుందరమైనది. యింతకంటె పెద్ద దేవాలయము లున్నవికాని యింతటి పనితనం యీ జిల్లాలో మరొకచోట కనపడదు. దేవాలయస్థాపకులు ధనమూ, కాలమూ, వ్యయమాతుందని చూచినట్లు కనబడదు. శిల్పవిద్య అంతా ముఖమండపాన కురిపించబడ్డది. యెంతమంది శిల్పశిఖామణులు యెన్ని సంవత్సరాలు యీమంటపం కట్టారో చెప్పడానికి వీలులేదు. పెద్ద రాతితనాబీలను సన్నని వడాకులతో మలిచి అతికినట్లు మోపి గట్టించి దేవాలయపు గోడలు పెట్టారు. యివి యింతవరకూ దసల లేదు. యీ గోడలమీద రాతితో జవగట్టి చూపదింపారు. ముఖమంటపాన వెగటుపుట్టేటట్లు మాధుర్యం గుప్పించిన శిల్పి యీ గోడలమీద నాజూకుగా అక్కడక్కడ చిన్నప్రతిమలను చిత్రించి చూపరమనస్సులకు ఖిరామం కల్పించాడు. ఈశాన్యమున యిరవై గజాల దూరంగావున్న సేవామంటపందాటి ధ్వజస్తంభం దిరిగి మనవాండ్లందరూ ముఖమండపంలో ప్రవేశించారు. దాని కిరుప్రక్కలా వున్న నునుపుదేల్చిన నల్లరాలపరుపులపై కూర్చున్నారు. చేతుల నరుగులపై జార్చి చూచి అధరమును పంటనొక్కుకుంటూ కన్నులను మాంద్యముగ స్తంభములవంక దిప్పారు. నల్లని కాంతి యుషీ నిద్రంపు టరుగులనుండి విజృంభించి మేలుకటు

నందుకొన్నది. ఈ స్తంభాలు కొంతవరకు చచ్చౌకంగా పలకలు దీరి వొకచోట వృటువలై మరియొక వెంట బొద్దులు తమ్మాలింగ నముసేయ వేరొకచోట గాల్లుదీరి నిలువుటద్దములవలె చూపర ప్రతిమలు ప్రతిబింబిస్తూ, సోకిన చమురయ్యేటట్టు స్వచ్ఛములై యున్నవి. వాటిమీాద పీట లమర్చబడి శిల్పచాతుర్యమునకు పీటలై వొప్పుతున్నవి. వితానమున రెండుగజముల నడిమికొలత గల పద్మము చెక్కబడివున్నది. దళములు వొండొంటి నొరుసు కొంటూ వొకదానిపై వొకటి వరుసలుదీరి కుప్పతిప్పలై, హారు వులై, ముదువులై, నడుమబొడ్డు దేలి లోచనములకు విందులు చేస్తున్నవి. ఈ కమలానికి చుట్టూ కణికెకు రాతిగుబ్బలు వొం డొంటిం బెరసి నునుపులై, వలుదలై, వృటువలై మొనలు దేరి రసి కుల భావములను అపహరిస్తున్నవి. ద్వారబంధం శిల్పవిన్నాణము నకు పొలిమేర. శిల్పి శిల్పవ్యసనియై తన శిల్పచాపల్యమును మెదిపి పాకంజేసి గొడుగుబల్లను అచ్చుబోసి వుంటాడు. నల్లని చలువరాయిని జలపతనంవలె జర్రున వంపుదిప్పి జార్చి ఆపి అంచుగట్టాడు. ఈ అంచుపొడుగునా శిల్పలావణ్యంయొక్క జగ్గునిగ్గులు నయనామృతములై వొప్పుతున్నవి. కమ్ములసోయగం వర్ణనాతీతం. శిల్పి తన చాతుర్యంచేత భావమున రూపకల్పన జేసుకొని భ్రమరకీటకన్యాయంగా తన పోగరుపోట్లతో ముడిరాతి నుండి కమ్ములను మూర్తీభవింపజేసి వుంటాడు. తీగెల రామణీ యకమూ, చిగురుటాకుల మార్దవమూ, పూగుత్తుల రవళీ, మొగ్గల సొబగూ, కాయల గరువమూ అన్నీ హావణించి అల్లుకొని జడలు గట్టినవి. మండిగం మూడంతస్థులుగా వున్నది. కమ్ములయొక్క సౌందర్యాటవి యిచ్చట గన్పట్టదుగాని గాంభీర్యమూ, నిదా నమూ, భావనా సౌశీల్యమూ అతిశయించివుంటవి. యీశిల్పం చాలావరకు పెద్దన కవిత్వమునుబోలి స్వాభావికమైన సౌందర్య మును వెల్లడించుతున్నది. చాలాచోట్ల నాగపడిగెలనూ, గొడుగు బల్లలు మున్నగువానికి నాగుబాము ఆకారములునూ గన్పట్టుట చేత నిది నాగశిల్పములలో చేరియున్నది.

ప్రేక్షకులు చూచిచూచి శిల్పలావణ్యమునం దనిసి మన అప్పయ్యవంక జూచేటప్పటికి ఆయన మళ్ళీ తన కథ ప్రారంభించాడు.

౧౨

అమ్మవారు

అ:- పూర్వం వాసిరెడ్డివారి సంస్థానంలో పొత్తూరివారు దిహాంజీలుగా వుండగా అమ్మవారికి చాలాభోగం జరుగుతూ వుండేది. ఇప్పుడప్పటి సత్రాలన్నీ పడిపోయినవి. గుడికి ప్రాకారం లేకుండా వుండడం బాగుండలేదు. వెనుక యేకా లక్ష్మయ్య అనే ఆయన తొంగిచూడబోయి పడి, కాలంచేశాడు. పూర్వం అమ్మవారికి చాలా నగలు వుండేవి. నాపెండ్లికిముందు యెవరో యెత్తుకపోతే అప్పటి కరణం లక్ష్మినారాయణ మావల్ల దండగగొన్నాడు. యిందాకటి కథ ఆగిపోయింది. అమీనుముల్కు ఈ ప్రక్క గ్రామానికి తనపేరుబెట్టి బావి తవ్వించాడు. ఈ ద్వారబంధపు కమ్ములలో కలిపి మలచబడ్డ ద్వారపాలకులను బద్దలుగొట్టించి గుడిగోడలమీద చెక్కిన చక్కని బొమ్మలన్నీ భిన్నంజేశాడు. తురకవాడు అఘాయిత్తం చేస్తాడని అమ్మవారు వెనక గోడ బద్దలుగొట్టుకొని సత్రసాలలో వున్న బావిలో ప్రవేశించింది. వాడు పోయినతరువాత తిరిగీ తెచ్చి ప్రతిష్ఠజేశారు.

రామానాయుడు కండ్ల బొటబొట నీళ్ళు గార్చాడు. కుడిచేతి పిడికిలి గట్టిగా బిగిసి గజగజ వణికింది.

రా:- అప్పుడు యీవూళ్ళల్లో హిందువులు లేరా?

అ:- అయ్యో, లేకేమి?

రా:- (అరమోడ్పుగన్నులతో) జీవంతోటే వున్నారా? రెడ్డిసంతానుల వీరరక్తం విరిగిపోయిందా? గడిసీమలు కాచిన కామానాయుడి సంతతి అంతరించిందా? రావెళ్ళవారూ, పెమ్మసానివారూ, ధర్మసంరక్షణ బిరుదం దగ్గంజేసి కుక్షింభరులై కూళల

వలె జీవించుతున్నారా? వీరాధివీరుడైన మేడమాత్యునియొక్కయూ, చితాపుఖానుని సైన్యముల చిందరవందర జేసి కొండవీటి స్వాతంత్ర్యము నిలిపిన నాదెండ్ల గోపయామాత్యునియొక్కయూ సంతానం—

రామానాయుడు రక్తనాళములలో స్వచ్ఛమైన వీరరసం విజృంభించింది. దేహమెల్లనిండి నిబిడీకృతమైంది. దిగంతములకూ వ్యాపించింది. మనసు సంకల్పరహితమై లీనమైంది. దేదీప్యమానమైన నీలకాంతులతో త్రిశూలధారిణి వీరస్వరూపిణి దృష్టి గోచరమైంది. రెప్పలు మూతలుబడ్డవి.

హే విశ్వరూపిణీ, హే జగద్ధాత్రీ, సమస్త జగంబులూ నీవే, ముమ్మూర్తులకూ మూలాంకురాంబవు. నీ వాడికోరలతో నీ పవిత్రనఖంబులతో హిరణ్యకశిపుని జించి చెండాడి నీలో గలుపుకొంటివి. నీ కోదండం రావణుని వ్రయ్యనేసింది. నీ చక్రం శిశుపాలునికంఠం తెంచింది. నీవే త్రిపురాసురులం గుల్చావు. ప్రళయకాలరుద్ర రూపిణివి, లోకంబుల నీలోదాచుకొంటావు. నీవే పరాపరా ప్రకృతివి. బ్రహ్మాండముల సృష్టించి బంతులాడుతున్నావు. భారతివై లోకమునకు విజ్ఞానము నుపదేశిస్తున్నావు. లక్ష్మివై సమస్త దేశములకూ జీవనములిస్తున్నావు. దుర్గవై ఆంధ్రస్వరూపిణివై ఆంధ్రలోకము నేలుతున్నావు. గౌతమీ, కృష్ణా, పినాకినీ, తుంగభద్రా స్వరూపిణివి. శ్రీశైల ద్రాక్షారామ కాళహస్తి శ్రీకూర్మ శ్రీకాకుళ భద్రాద్రి తిరుపతుల వెలయుచున్నావు. నీవు ప్రేమస్వరూపిణివి. రాధవై బృందావనమున విహరించి భువనముల నిత్యలీలా విభూతిం దనరుచుంటావు. నీవు ఓంకార స్వరూపిణివైన మూలాంకురాంబవు. మంగళాపురములో వెలిశావు. అకారఉకార మకారంబవై సత్త్వరజస్తమోరూపిణివై, పంచభూతవికారిణివై, పచంతన్మాత్రారూపమునుబొంది, పంచేంద్రియములుగ అవతరించావు. శబ్దస్వరూపిణివై, దేవుని పుత్రుడవైనావు. మీంకార స్వరూపిణివై కడపటిపైగంబరునైనావు. విజ్ఞాన స్వరూపిణివై సత్యవతీ గర్భమున బుట్టావు. అహింసా స్వరూపిణివై

కపిలవస్తు నగరములో వెలిశావు. ప్రాగ్జ్యోతిషంలో జన్మించి నైయ్యాయికబోధిని వైనావు. నీవు నాయం దనుగ్రహంచేత సౌలభ్యవశమున భీకరవేషముడాల్చి నవరస స్వరూపమును సయితమూ ప్రదర్శిస్తున్నావు. తల్లీ! నీ మహద్రూపం దర్శించి ధన్యుడనైనాను. నీ విశ్వరూపమును ఉపసంహరింపుము.

ల:– ఏమి మామా! నాకు భయమేస్తున్నది. పిల్లవాడికి కండ్లు మూతలుబడ్డవి. నే నిందుకే యెక్కడికీ కదలను.

అ:– అతడికివచ్చిన భయంలేదు. అది అమ్మవారిచేష్ట. ఆమె సత్యం యీ రోజువరకూ ప్రత్యక్షంగా కనబడుతున్నది. ఇక్కడికి ఎన్నివేల ఏండ్లయిందో ఆ యంత్రంవేసి.

ల:– మాట్లాడించేదీ ?

అ:– ఇప్పుడేమీ వద్దు. కాస్త తెప్పరిల్లనియ్యి. నే నే అడుగుతాగా, అడగవలసినవేమిటో.

ల:– నీవేదో చెప్తూ వస్తున్నావా, దద్దళంలోకి అడుగు బెట్టాం. అప్పటినుంచీ వాడి ముఖాన ఏదో వికారం కనబడుతూనే వున్నది. అమ్మవారి చేష్టయితే యెగుడు దిగుడుమాట లెందుచేత?

అ:– అనేకమో స్తర్లు. అమ్మవారికి అయిదు బిందెలపానకం మొక్కుకో, ఆ వేడి శమిస్తుంది.

ల:– దానికేమి ? నచ్చే శనివారం పది బిందెలు చేయిస్తా, అమ్మవారి దయ చక్కగావుంటే.

రామానాయుడు కండ్లు తెరచి విభ్రాంతిగా చూచాడు.

ల:– ఏమినాయనా ! ఎట్లా వున్నది ? వికారంగా వున్నదా?

రా:– (కండ్లు తుడుచుకొని చప్పరించి) బాగానేవుంది.

ల:– బాగా వుందిగదా, ఆ తల్లి చల్లంగా, నేను పది బిందెలు పానకం మొక్కుకున్నానుగాని నీవుగూడా మొక్కుకో.

రా:– ఇరవై బిందెలు చేయింతాం. ఊళ్ళో అందరికీ పోయవచ్చు.

ల:- పాతమొక్కు చెల్లించిపోదాం పద.

అ:- ఇవి అమ్మవారి పాదాలు. వాటిని పూజించండి.

పాదపూజ అయిన తరువాత అందరూ దేవాలయంలో గర్భగుడి చుట్టూ విశాలంగావున్న చీకటిదారిగుండా ప్రదక్షిణం చేశారు.

అ:- అమ్మవారు ప్రతివాండ్లకూ తమయెత్తు ఉన్నట్లు కనబడుతుంది.

అందరికీ వొక మోస్తరుగానే కనపడ్డదిగాని అప్పటిస్థితిలో ఎవరూ పరీక్షించలేదు.

అప్పయ్యా అందరికీ కుంకం యిచ్చి మంత్రపుష్పంబెట్టి మొక్కుబళ్లు చెల్లిన తరువాత గౌరీపాదం యిచ్చాడు. అంతట అందరూ బయలుదేరి మెట్లు దిగారు. లక్ష్మమ్మ బండిలో మెల్లిగా యెక్కింది. అందరూ ఎక్కినతరువాత పరీదు సాహెబునే బండి తోలమన్నది.

ల:- మళ్ళీ ఏమీ వికారంగా లేదుగదా ?

రా:- లేదు.

బండి భోజనాల వేళకే యింటికి వచ్చింది.

## ౧౩

## పొగరాజులు—మడతకుడుములు

సంగదాసు అన్నందిని తన ఆఫీసుగదిలో కూర్చున్నాడు ఆదం సాహెబు వచ్చి "గుమాస్తాగారు భోంచేశారా" అని ఎవరినో అడుగుతున్నాడు.

సం:- ఆదం సాహెబూ! ఏమి సంగతులు? అక్కడ వుండకుండా వచ్చావేమి ?

ఆ:- పదిరాటాలు సాగుతున్నవి. వొక బోరెం యెండ నేయించాను. ఈ మాసుకంలో అంతకంటె ఎక్కువ పలగదు మీరాకు

చెప్పంగనే చీకటితోబోయి కూలింక్లు అన్నీ గాలించా. మునసబు గారి జొన్నకోతలు రేపల్లా పడతవిట. వొాళ పాతికమందికంటే మనకు ఎక్కువ తేలేటట్టులేదు. ఎల్లుండైతే వందమందిమి వస్తా మన్నారు. ఈ మాట చెప్పిపోవడానికే వచ్చా.

సం:- వారికోతలు అడ్డంవచ్చినవి? సరే పో. వెంగన్న స్టేషనునుంచి వచ్చాడేమో ఇటు రమ్మను. (తనలో) ఇవ్వాళ గూడా రాలేదేమబ్బా ఇల్లు విడిచి వుండేవారుగారే! నీలిమందు ఆపితే మళ్ళీ మందమవుతుందేమో. యేమోయి వెంగన్నా! ఎంతసేపయింది నీవు వచ్చి?

వెం:- ఇంతకుముందే కాదండీ, బండి విడిచి యిట్లా వస్తున్నా.

సం:- ఇంతసేపు ఏమిచేస్తున్నావు? తాగి పడుకున్నావా?

వెం:- ఇప్పుడు బొత్తిగా ఆ జోలి పోవడంలేదుగదా, ఏమిటండీ అట్లా అంటారు? వొకవేళ తాగితేమట్టుకు నే పడుకోనా లెటండీ.

సం:- మంచినీళ్ళ ప్రాయమయింది. అయ్యగారు రాలేదేమి?

వెం:- వచ్చారు.

సం:- ఏరీ?

వెం:- పాలెపు మునసబుగారూ, పీరూ యింకా హేమా హేమీలంతా జేరి కోతకూలీ గింజలిస్తామా, డబ్బులిస్తామా, అని ఆలోచిస్తున్నారు.

సం:- మన అయ్యగారు ఏమిస్తామంటున్నారు.

వెం:- మునసబుగారు తోక గొయ్యమంటే ఈయన సున్నం గూడా పెట్టమంటున్నారు.

సం:- అదేమిటోయ్. కూలీలకు తోక లుంటవా?

వెం:- మునసబుగారు కూలికింద డబ్బులిచ్చి గడ్డిమామూ లిస్తామంటుంటే పీరు గడ్డి అసలే వల్లగా దంటున్నారు.

స:- యింకా యేమేమి మాటలు జరిగినవి?

వె:- శానా మాట్లాడుతున్నారు. మీా రేమియ్యవలె నంటారు?

స:- నా మాటేమైనా వచ్చిందా?

వె:- పాడీలు చెప్పావంటారు. నా కెందుకు!

స:- పోనీ. యితర సంగతులు చెప్పు. నా అభిప్రాయం నీకు తెలుసునా?

వె:- మీారు కూలీలపట్టేగా.

స:- నేను నీతో చెప్పానూ?

వె:- మునసబుగా రన్నారు.

స:- అయ్యగారు కాదనలే.

వె:- వారికిమట్టుకు తెలియదూ?

స:- వారికిమట్టు కేమి తెలుస్తుంది?

వె:- మీారు వాదిస్తుంటారటగా.

స:- యేమని?

వె:- కూలీలకు డబ్బిస్తే గిట్టదని.

స:- యింకా యేమి సంగతులు?

వె:- మీారు పని చాలించుకుంటారా?

స:- అయ్యగా రంటేగా.

వె:- వారు వుండమనే అంటారు. మీా కిష్టం గాకపోతే చాలించుకోరా?

స:- యెందు కిష్టంగాకపోతుంది?

వెం:- మీారు అవునన్నది వారు కాదంటే.

స:- యింకా కొత్తసంగతు లేమి?

వె:- ఆఁ—యికనేమీా లేవు.

స:- (తనలో లేనట్టే) నామాట యేమివచ్చిందో చెప్పవు గదా?

వె—నా కెందుకయ్యా? వొకరిప్రస్తాపం.

స:- అయ్యగా రేరీ?

వె:- మునసబుగారు నిలిపారు. యేహో తేల్చుకొని మాపో రేపో వస్తారు.

స:- రైలువాగిన్ల సంగతి యేమిచెప్పారు?

వె:- నీలిమందుధర పడిపోయిందట. చెన్నపట్నానికి యెత్తించవద్దన్నారు.

స:- అరే! వర్తకులు మననెత్తిన చుట్టిపోవాలెనని వచ్చారన్నమాట. నిన్న బేరమే రహితంకాలేదన్నారే. యివ్వాళ యేమితూచుకుంటారు? అందుకనే రాలేదు. నాకు యేదో అనుమానంగానే కనబడ్డది-సరే, నీవు వెళ్లు.

(తనలో) జరుగుతున్న కథ యావత్తూ బోధపడ్డదిగదా. నన్నీపనిలోనే వుంచి అణిచిపెడదామని వారి వుద్దేశం. కూలివాండ్లను అన్యాయం జేయదల్చుకున్నారు. యిదివరకు వచ్చే కూలే చాలా హీనంగావుంది. దాన్ని డబ్బులోకిమార్చి యింకా తగ్గించవలెనని ప్రయత్నం. నాయుడుగారితో యీసంగతి యావత్తూ చెప్పుదామా? యెందుకు ఆయనమనస్సుకు వ్యసనం? కథ యెట్లా నడుస్తుందో చూదాం.

సాయంకాలం చౌదరయ్య రాలేదు. రామానాయుడు చల్లబడ్డ తరువాత పలహారంజేసి సంగదాసు గదిదగ్గరకువచ్చి 'షికారు పోదామా' అన్నాడు.

స:- పత్తిపట్టడం చూసివెళ్లుదాం.

వుభయులూ రాటాలదగ్గెరకు పోయినారు. పత్తి పట్టడం ఆపి విత్తులు తూస్తున్నారు.

స:- విత్తులు గదిలో బోయించి దూది బోరానికి తొక్కించు.

ఆ:- కూలీలు గింజలు యెప్పుడిస్తారంటున్నారు? వారానికి వొకమాటిస్తే వాండ్లకు జరగదట.

సం:- మూడురోజుల కొకమాటు యిప్పించు. తాళపుచెవి అమ్మగారి కియ్యి. మేము పొద్దుబోయి వస్తామేమో. కోతకూలీలను వచ్చినంతవరకు పోగుచెయ్యి. మబ్బు కారాడుతున్నది. జొన్న తిరగబాఠింది. నిలువునతడిస్తే గింజ మసకిస్తుంది.

రామానాయుడు, సంగదాసు రోడ్డువెంబడి మలకాచెరువు కేసి షికారు బయలుదేరారు.

రా:- పత్తిబట్టేవాండ్లకు రోజుకు కూలి యెంతిస్తారు?

స:- పూర్వం కట్టుకు తవ్వెణ్ణరసోలెడు జొన్నలిచ్చేవారు. యిప్పుడు తవ్వెడు చేశారు.

రా:- రోజూ యెన్నికట్లు పడతారు?

స:- సాధారణంగా మూడెత్తులగింజలు పడతారు. రెక్క పుష్టి గలవాండ్లైతే యింకో పదలం పట్టవచ్చు.

రా:- అరసోలెడు తగ్గిస్తే వాళ్ళు వొప్పుకున్నారా?

స:- అవీ యిచ్చేవాండ్లు లేకపోతే వొప్పుకోక యేమి చేస్తారు?

రా:- మానాయనగారు యివ్వాళ రానికథ తెలుసునా?

స:- చూచాయగా తెలిసింది. విశేషాలు మీకేమయినా తెలుసునా?

రా:- పాలెంలో యీసాయంత్రం మీటింగుట. చిన్నప రెడ్డి మన మునసబును రమ్మని కబురంపాడు. కోతకూలి గింజలు మాని వేసి డబ్బియ్యవలెనని యేర్పాటుట,

స:- మీటింగుసంగతి నాకు తెలియలేదుగాని మీనాయన గారూ, చిన్నపరెడ్డీ యీసంగతే మాట్లాడుతున్నట్టు విన్నవాండ్లు చెప్పారు.

రా:- చిన్నపరెడ్డి కూలివాండ్ల కూడుదీసి యింకా మేడలు కట్టిస్తాడుగాఁవాలె. మానాయనగారు దీంట్లో చేరకుండావుంటే బాగుండు.

స:- మీనాయనగారిదే యెక్కువ ప్రోత్సాహ మంటారు.

రా:- మునసబుకు చిన్నపరెడ్డి వుత్తరం వ్రాశాడే!

స:- మీనాయనగారికీ, మునసబుకూ మనస్పర్థగనుక కన్ను తగిలే వుల్లలన్నిటినీ కూడదీసుకుంటున్నారు.

యితరవూళ్ళకు మీనాయనగారు వ్రాసి వుండవచ్చును.

రా:- ఈ పెద్దవాండ్లంతా మోస్పాజేసుకొని యెందు కీ నిర్భాగ్యులమీద దండెత్తడం? పూటకూటికి లేని యీ కూలీలు యేమి ప్రతిక్రియ చేయగలరు? వీండ్ల కాధార మెవరు?

స:- దేవుడే ఆధారం.

రా:- ఆయనగూడా న్యాయం విడిచి భాగ్యవంతుల పక్షమైతేనో?

స:- మన మిద్దరం ఆయననుకూడా యెదిరింతాం.

రా:- ఇదే మన కిద్దరికీ శపథం. ఇక యుద్ధం ప్రకటించు.

స:- యికమీద బహుశా నేను మీయిల్లు విడువవలసి వస్తుంది.

రా:-నేనే విడువవలసివస్తుందేమో. యింట్లోవుండి యుద్ధం యెట్లా చేస్తాం? రేపు జొన్నకోతల కూలివిషయం యే మాలోచించావు?

స:- యుద్ధానికి వాండ్లే ముందు ప్రయత్నాలు చేస్తున్నారు గదా! మొదటిదెబ్బ వాండ్లనే కొట్టనీయండి.

రా:- ఆ గౌరవం వాండ్ల కెందు కీయాలే.

స:- మొదటిదెబ్బ కొట్టినవాడికంటే తిన్నవాడే ధన్యుడు.

రామానాయుడు సంతోషం పట్టజాలక సంగదాసును కౌగలించుకున్నాడు.

చండకిరణు డస్తమించాడు. ఈ యౌవనుల సంధిసమయములను సంధ్యారాగం రక్తాక్షరాలతో ఆకాశఫలకమున చిత్రించింది. యీ రక్తమే ప్రతి గృహమందూ దీపమై ప్రకాశిస్తున్నది.

సంభాషణ చాలించి వుభయులూ యింటికి బయలుదేరారు. యింటిదగ్గిర ఆదంసాహేబు యెదురుగా వచ్చి.

ఆ:- యిదిగో తాళపుచెవి. అమ్మగారు లోపల వున్నారు.

ఆ:- దిబ్బలో దం పెక్కువ పడుతున్నది. జీతగాండ్లు వాండ్ల యిష్టంవచ్చినట్లు తొక్కిస్తున్నట్లున్నారు.

అ:- అన్నీ బడీదంట్లే నండి.

స:- సన్నదంట్లైతే వాండ్లు తేపా వేయలేక వొక్కసారే యింత పడవేస్తారు. తిన్నంత తిని మిగిలింది తొక్కుతవి. వొబ్బిడిగా వాడుకోకపోతే యెన్ని ఖాములైనా ఆగవు. వాండ్లతో చెప్పు. అయ్యగారు రాసట్టేనా?

ఆ:- రారని మనిషి వచ్చాడు.

స:- మనిషెందుకు? ఆ కబురు పొద్దున్నే వచ్చిందే!

ఆ:- రెండు వుత్తరాలుకూడా తెచ్చాడు. తాటి లింగయ్యకూ, బాపయ్యకూ తక్షణం పాలెపు మునసబుగారింటికి రమ్మని వ్రాశారు. యిందుకని లేదు.

రా:- యెవరు వ్రాశారు?

ఆ:- అయ్యగారే.

స:- వారు వెళ్ళారా?

ఆ:- బాపయ్య లేడు. లింగయ్య వెళ్ళాడు.

స:- మునసబుగారు వచ్చారా?

ఆ:- వస్తుండాలె.

రా:- బాపయ్య వస్తే నే రమ్మన్నానని చెప్పు. మునసబుతో మాట్లాడటం యెట్లా?

స:- నేవెళ్ళి మాట్లాడతా.

రా:- మిక్కిలి వుత్సాహంతో — దాసూ! శత్రువులు సైన్యాలు కూర్చుకుంటున్నారు.

స:- అందులో తప్పేముంది? యెవరి ప్రయత్నాలు వాండ్లు చేసుకోరా? మనం వొకరి స్వాధీనంలోవున్న మనుష్యులమైనాం.

రా:- మన అంతరాత్మలు మన స్వాధీనంలోనే వున్నవి.

స:- రేపు జొన్నకోతకు మీరు వస్తామంటిరే !

రా:- అయ్యో ! తప్పకుండా నేనుకూడా అన్నం మూట కట్టుకొని తెచ్చుకోనా ? అంతా తెచ్చుకోవడంలా.

స:- అది పనికిరాదు. మధ్యాహ్నందాకా వుండి యింటికి భోజనానికి రండి.

రా:- అవన్నీ వట్టిమాటలు. భోజనం చేలో చేయవలసిందే. పోనియ్యి, యింటినుంచి అన్నం పంపించమందాం.

స:- మాఅయ్య పడుకోడానికి రమ్మన్నాడు. ఈరాత్రి వెళ్ళుతా.

రా:- బాగా పట్టుకున్నదే, మీవాండ్లతో మాట్లాడు.

స:- యేమని మాట్లాడేది ? వాండ్లేదారిన వస్తారో.

రా:- వొక్కటేదారి. యెరగనిదేముంది ! మార్పుకు ఒప్పుకోవద్దను.

స:- బాగాపట్టారే ?

రా:- నీవే నన్ను పట్టావు.

స:- మీరే నన్ను పూనారు.

రా:- మనిద్దరినీ వొక దయ్యమే పట్టింది.

స:- అది వదిలితే ?

రా:- నీకాభయం వద్దు. దేవుడి పట్టుకంటే దయ్యపు పట్టెక్కువ.

స:- అట్లయితే దేవుడు అటుచేరినా మనం గెలుస్తామన్న మాటే.

రా:- నాకేమీ తోచడంలేదు. అయితే కూలివాండ్లు సమ్మెకడితే ఆ రోజులలో భోజనం యెట్లా ?

స:- ఏమిచేస్తారు ? పస్తుంటాగు.

రా:- పస్తా ?

స:- అయ్యా, మీా రేమనుకొంటున్నారు. అందరికీ పొద్దుటి పూట గుమ్మపాలూ, మధ్యాహ్నం గడ్డపెరుగూ, మూడుగంట లకు రకరకాల పలహారాలూ, సాయంత్రం తేలికైన భోజనం, పడుకోబోయేటప్పుడు వేడిపాలూ, అప్పుడప్పుడు చిరితిండీ యీ మోస్తరుగా అనుభవిస్తున్న దనుకుంటున్నారా?

రా:- నన్నెందుకు యెగతాళి చేస్తావోయ్? నిజంగా వస్తుంటారా యేమిటి?

స:-అయ్యా, చెవులున్నవాండ్లు వినండి. మా మాలమాదిగ పల్లెలలో నాలుగు నెలలు పూర్తైన భోజనముంటే జొన్నన్నం, గోంగూరా, కారం, ఇవి కడుపునిండా తినడం. నాలుగు నెలలు అర్థభోజనం మిగిలిన రోజులు కటికి ఉపవాసం.

రా:- నీవు చెప్పేదంతా నిజమేనటోయ్?

స:-దేవుడనేవాడొకడు యీ ప్రపంచాన్ని పాలిస్తుంటే—— వున్నాడా అని నాకు సందేహం——వున్నా దయామయుడుగాడు- ఆయనమీాద ప్రమాణంచేసి చెపుతాను. నే చెప్పేది యావత్తూ సత్యం.

రా:- ఏమి ఆశ్చర్యం. భోజనం లేకుండా వూరికే వుంటారూ?

స:- దొరికితే నాగజెముడుపండ్లూ, బొద్దాకూ, చచ్చిన గొడ్ల మురికి మాంసం——

రా:- మురికి మాంసం తినకూడదు. ఆ సంగతి నీవు వాండ్లకు గట్టిగా చెప్పాలె.

స:- అయ్యా! ఆకలిబాధ మీాకు తెలియదు. మహర్షుల వంటివాడ్లు ఆకలిబాధకు నిలవలేక, ఏ మాదిగ పల్లెలోనో జొర బడి యెండవేసిన మురికి మాంసమును దొంగిలించి తిన్నారట. అది తినవద్దని యెవరూ బోధించ నవసరంలేదు. వాండ్లకు కడుపు లోకి అన్నం వుంటే తినమన్నా తినరు. అన్నం లేకపోతే మురికి మాంసంకాదుగదా యెముకలుగూడా కొరికి తింటారు.

రా:- ఓయబ్బా యిక చాలించవోయ్. నే వినలేను. ఇదివరకు అన్నంలేక బాధపడుతున్నారంటే యేమో అనుకున్నాగాని యీ సంగతులన్నీ నాకు తెలియవు. ఇక నన్ను విడిచిపెట్టు.

స:- పాపం మిమ్మును చాలా శ్రమపెట్టినట్టున్నా.

రా:- శ్రమేమిటి, వాళ్ళుపడే శ్రమలు వినడానికే మనకు శ్రమా? యిందాక నీవు దొరికితే నాగజెముడుపండ్లు తింటారన్నావే; వొకప్పుడవిగూడా దొరకవా?

స:- ఇదివరకే మీ మనసు కళవళ పడ్డది. ఇంకొకమాటు చెపుతాలెండి.

రా:- ఆ వొక్కటీచెప్పి వూరుకో.

స:- మనవూరి రెండుకొండలనిండా నాగజెముడు బలిసి వున్నదిగదా! ఎండాకాలం సగపడ్డతరువాత వచ్చి చూడండి. ఒక్క కాయయినా వుంటుందేమో.

రా:- ఏమీ దొరక్కపోతే యేమిచేస్తారు?

స:- మిమ్మును బాధపెట్టడం బాగుండలేదు. ఏమిచేస్తారా, మడతకుడుములు తింటారు.

రా:- అవేమిటీ?

స:- అవి మీరెప్పుడూ తినలేదు. అవి తింటే అజీర్తి పోతుంది. ఏకాదశినాడు యివే తింటారు.

రా:- నీవు హాస్యం చేస్తున్నావు.

స:- హాస్యంగాదు. ఇది వొలుకుల్లో పరాచకం. రోజూ పీనుగలు తగలవేసే మావాండ్లకు పీనుగలంటే ప్రాంతమైపోతుంది. ఈ దినపస్తులు నేను రోజూ చూస్తున్నవే. పస్తులుంటే దేవుడు మీకు పుణ్యమిస్తాడట. ఆ దేవుడు దినపస్తులుండే మా కెందు కియ్యడో—మరచిపోయినాం. మడతకుడుములంటే మాకే బాగా తెలుసును. అవి మాల మాదిగల కడుపులోనే యెక్కువ వుంటవి. అన్నం బొత్తిగా లేనప్పుడు పడకుంటే బాధయెక్కువని అన్నపు

తిత్తి మడతలు పడేటట్టుగా ముడిచిపెట్టుకొని పడుకుంటాం. యిది మేముకనిపెట్టిన పిండివంట.

రా:- ఈ స్థితిని తొలిగించేదోవ యేమయినావున్నదా?

స:- నాకు వొక్కటే కనబడుతున్నది. నిర్దయుడైన యీ దేవుణ్ణి పదభ్రష్టునిజేసి ఆసైతానునైనా దెచ్చికూర్చొబెట్టి దాని దోవన అది పడివుంటే మనము బ్రతకవచ్చునని నమ్మకం.

రా:- మళ్ళీ సైతానెందుకు?

స:- ఎవరూ లేకపోతే మరీమంచిది.

రా:-నామనసు ఆందోళన పెడుతున్నావు. నీమనసులో అంతకంటే యెక్కువగావుంది. యిక పోదాం పద.

## ౧౪

### సమిధలు

సంగదాసు మనసు పరిపరివిధాల ఆలోచనలతో నిండి యున్నది. రామానాయుడియొక్క వుత్సాహం ఆశ్చర్యం గలిగించింది. త్వరగా దారినడుస్తూ యేమో ఆలోచిస్తున్నాడు.

"నాయుడుగారికి మన విషయములో సంపూర్ణమయిన అభిమాన మున్నది. నిజంగా ఆయన పూనుకుంటే యెంత సహాయమైన చేయగలడు. కాని ఆయన చేయవలసిన త్యాగం గూడా అత్యంతం. తండ్రి ప్రతికక్షకు నాయకుడు. అందులో పట్టుదలమనిషి. కొడుక్కు స్థిరాస్తిలో నాలుగోభాగం పంచిపెట్టి కవిలెంతా అరుపుకుంటాడేమో. ధననష్టమేకాకుండా తండ్రి ప్రతికక్షలో ప్రవేశించాడని లోకాపవాదం భరించాలె. రయితులు యెవరో సధర్ములుదప్ప తక్కినవాండ్లు ఆయనకు వ్యతిరేక మవుతారు. ఆయన యెప్పుడూ కష్టపడ్డవాడుకాడు. యీచిక్కులచేత వుత్సాహం తగ్గిపోతుందేమోనని భయంగావుంది."

మాలపల్లెకు సమీపంలోవున్న కోమటిదగ్గరకు వచ్చాడు. కొత్తసుబ్బయ్యభార్య చంద్రమ్మ దుకాణంలో కూర్చున్నది.

మాలపల్లె దుస్థితి మూర్తీభవించినట్లు అక్కడ కనబడ్డది. సంగదా సదివర కెప్పుడూ యీదృశ్యం జూడలేదు. అక్కడ జరుగుతున్న సంభాషణవింటూ దూరంగా నిలుచున్నాడు.

చం:- నీ కేమి కావలెనే వెంకీ?

వెం:- నాకొక దమ్మిడీది చింతపండూ, వొకదమ్మిడీది వుప్పూ, మిరపకాయలూ, వొకదమ్మిడీది వుల్లిగడ్డ.

చం:_ తే, కానీ దే. అవి దీసుకో.

వెం:- వెయ్యవమ్మా యింకా కాస్తవుప్పు.

చం:- ఊఁ ఇకపో. నీ కేమి కావలెనే ముత్తీ?

ము:- నాకు అరగిద్దెటికి ఆముదం, వొకగిద్దెటికి వుప్పూ, అరగిద్దెటికి చినవుల్లిపాయా.

చం:- ఊఁ ఇట బట్టు.

ము:- కాస్త బెల్లం కొసరు బెట్టవమ్మా.

చం:- ఇకబో. నీ కేమిటే సత్తీ?

స:-ఈపత్తితీసికొని బియ్యమియ్యవమ్మా అల్లుడువచ్చాడు.

చం:- ఇట బట్టు. ఆపత్తి కేమిటి?

స:- దీనికి వుప్పూ మిరపకాయా చింతపండూ పెట్టు.

చం:- ఇన్ని యెట్లా వస్తవే ఆ కాస్తకు.

స:- వచ్చినంతవరకే పెట్టవమ్మా.

నాగి:- చంద్రమ్మా! నే నెంతసేపయిందమ్మా వచ్చి. నన్ను పంపవమ్మా.

చం:- ఏమి గావలెనే?

నాగి:- యీగిద్దడుగింజలకూ పొగాకుపెట్టు!

చం:- అవి గిద్దెడున్నవీ?

నాగి:- నే గొలిచానూ.

చం:- తీసుకో. తొందరపడితే యెట్లాగే. సత్తీ నీ విదిగోనే.

స:-నోట్లోకి కాస్తవెయ్యవమ్మా. నోట లేదనేబదులు చేత లేదంటావనే నీ దుకాణానికి రావడం.

చం:- ఇట బట్టు. కాస్తపొద్దుగలగా రాగూడదూ.

స:- కూలిగింజలు కొలిపించుకొంటిమి. యిట్లావస్తిమి.

ఈ విధంగా బేరం నడుస్తున్నది. ఇటువంటి పరిస్థితులు చూచి తాను నాస్తికుణ్ణి అయిపోతానేమో నని భయం పుట్టింది. "వీండ్లెట్లా నమ్మగట్టడం. పూటకూటికి లేదే" అని సందేహించాడు. తన మనసు నిరాశ చెందకుండా మళ్ళీ ఆపుకున్నాడు. మరల ప్రయాణమైనాడు. చంద్రమ్మ వాకిట్లోచూచిన స్థితిని తమ యింటితో బోల్చిచూస్తే పల్లినుంచి ఢిల్లీకి బోయినట్లుంది.

జోతి : అమ్మా! చిన్నన్న వచ్చాడే (అని కేకవేసింది.)

మా : (పరుగెత్తివచ్చి) మా అయ్యను చూచి యెన్నాళ్ళయిందమ్మా కండ్లుబోయినట్లుంది.

సంగ : వారంరోజులేకా ?

రా : (దొడ్లోనుంచి వచ్చి) చాలవూ వారంరోజులూ ?

సం : నిన్ననేకా నీవు చూచింది.

రా : పనిమేళ్ళా అక్కడికి రాబట్టె.

మా : మాఅయ్య జొన్నబాల కందుకున్నాడమ్మా! యీ పూట అంటబాగా యిరగవు.

జోతి : అన్నా ! మనకు బుజ్జామ బుట్టింది.

సంగ : పెయ్యా దూడేనా ?

మా : కాదు. మాగాని దున్నేందుకు పుట్టింది.

సంగ : అరంజోతీ ! నీవు బాగా చదువుకుంటున్నావా ?

జోతి :- ఆఁ నీవిచ్చిన పుస్తకమంతా అయింది. యింకొకటి తెచ్చిపెట్టు.

రా:- వాకిట్లో మంచంమీద కూర్చుందాము రా - చల్లగాలిలో.

మా:- కాసేపు కూర్చోనిస్తూ యిక్కడ. నిన్న నీవు చూచి వచ్చావుగా.

సం:- అప్పాయ బాగా సాగుతున్నాడే.

మా:- ఛీ అట్లా అనగూడదమ్మా, దిష్టి తగులుతుంది. వాండ్లమ్మ లేవడంలేదు. మోచేతిమీదా, దండమీదా యెవరో కొట్టారట. బుజం వాచి బ్రహ్మాలోడ్డయింది. వూళ్ళో మంగల వైద్యునికి చూపిస్తే లోపల యెముక చిట్లింది, తనవల్ల కాదన్నాడట. మధ్యాహ్నంనుంచీ నీకోసం వొక్కమోయిన కలవరిస్తున్నది.

సం:- యెవరు గొట్టారు ?

మా:- యెవరో బసివిరెడ్డట.

సం:- యెందుకూ ?

రా:- మనకర్మం. మాలమాదిగలై పుట్టినందుకు. చేనిగట్టు మీదిగా నడిచిందట. ఇగెప్పుడూ యిటు రావద్దని కొట్టి గడ్డి వూడదీసుకొన్నాడు. సరేనా ?

సం:- బాగానేవుంది. నేవెళ్ళి చూచివస్తా ఆమెను. రారా బావా.

వుభయులూ వెళ్ళేరు.

మా:- నీవు కోమటింటికి పోయి జున్ను బాలల్లోకి కాస్త బెల్లప్పాయ కొనక్కరా. ఇంట్లో నిండుకొన్నది. కొద్దిగా వుంటే పొద్దున అమ్మాయి వేసుకొన్నది.

రా:- ఒక సవాసేరు తేనా ?

మా:- తీసుకరా లేనప్పుడు పరుగెత్తేదానికంటే.

రా:- నాకు వట్టివే పోశావుకదా వొకమ్మగన్న బిడ్డననా.

మా:- నే నొక్కదాన్నేకా పరాయిదాన్నిక్కడ. నేను తిన్నానో లేదో మీరు విచారించారా ?

రా:- నీవు తినకుండా మాకు పెట్టవచ్చావా అనుకొన్నాం.

మా:- తనకుమాలిన ధర్మమా. నే తినే మీకు పెడుతున్నా. అబ్బాయి వచ్చేలోగా రా. చీకటిలో యెందుకు పంపేవని నా మీద కోప్పడుతాడు. దొడ్లో చెట్లపాదు పెట్టినందుకు వొక పొట్ల కాయ కాసింది. కోసిచ్చిపో, తాలింపువేస్తా.

సంగదాసు మేనత్త యింటికి పోయినాడు. సుబ్బలక్ష్మి గుడిసెలో కుక్కిమంచం వేసుకొని పడుకున్నది.

సంగ:- యే మత్తా! వొంట్లో యెట్లా వున్నది?

సు:- నాయనా వచ్చావా? నీకోసమని యెదురు చూస్తున్నా. మోచేతిదగ్గరనుంచి గూడదాకా పర్వతాకారంగా వాచింది. వల్లమాలినపోటు. నేను బతకననే దిగులులేదు. అప్పుడు యేణ్ణర్థంవాడై వుండగా మీమామ చచ్చాడు. అప్పటినుంచీ అష్టకష్టాలుపడి పెంచా. చిటుక్కున వొకదెబ్బగొట్టి యెరగను. నాకడుపు నాయుగట్టుకొని కరువురోజుల్లోగూడ వాడికి ముప్పూటా అన్నం బెట్టాను. నారోజులేమో అంత్యానికి వచ్చినవి. వాడిని నీవు చేయి వదిలావాఅంటే యెందుకూ గాకుండా బోతాడు. యీ దిక్కుమాలిన పక్షిని నీవొళ్ళో వేస్తున్నా, మీఅమ్మ వకరి వంటిది గాదు. జీతగాడని పేరేగాని యీ రెండేళ్ళనుంచీ తన బిడ్డలలో వొకణ్ణిగా చూస్తున్నది. నీచేతిలో బెట్టి దిగులు లేకుండా వెళ్ళిపోదామని కనిపెట్టుకొని వున్నా. అప్పడూ! ఇట్లా నామంచంమీద కూకోచ్చి నాయనా. వట్టి అర్భకుడు. ఇక అత్తనే అమ్మనుకో. చెడుసావాసాలు పోబోకు. సంగబావను దేవుడినిగా యెంచుకో.

అప్పడు యేడుస్తున్నాడు.

స:- యేడవవద్దు నాయనా, యేడవవద్దు.

సంగదాసుకు కండ్లన నీళ్ళు గిఱ్ఱున దిరిగినవి. మీద చేయి వేసి—

స:- అత్తా! అప్పడికి వచ్చిన భయంలేదు. వాడికి మేము యేలోపం లేకుండా చేస్తాం. నీ దిక్కడవుంటే లాభంలేదు. చీకటితో అయ్యనిచ్చి బండిలో ఆసుపత్రికి పంపిస్తాను. వాండ్లు యేదయినా వెంటనే పనిచేస్తారు.

సు:- సరే కానియ్యి - యీపూట్లో మట్టెమ్మే ప్రాప్తం కూడా లేదుగా౽వాలె. కళ్ళం యెక్కడవుంటే అక్కడికి పెట్టుకొని పోతుంది. అప్పణ్ణి నాతో పంపు.

స:- అట్లాగే. మామా నీవూ పోండిరా. అత్తా! అన్నం తిన్నావా ?

సు:- వొదినె ఇప్పుడే అన్నం పెట్టిపోయింది. రాత్రి అన్న యిక్కడే పడుకున్నాడు.

స:- నే వెళ్ళివస్తాను.

సు:- సరే. అప్పడిని అండవదలబోకు.

సంగదాసూ, అప్పడూ యింటికివచ్చి అంతా భోజనం చేశారు. సంగదాసు తండ్రిని గుంటూరుప్రయాణం చేసి బ్రహ్మం గారి వేపచెట్టుదగ్గిరకు వచ్చాడు. రంగదాసూ, పున్నన్నా అక్కడ మాట్లాడుతున్నారు.

ర:- యెప్పుడో సంగన్న వచ్చాడే. నీ విక్కడికి రావడం పొరుగూరినుంచి రావడంకంటే కనాకష్టంగా వున్నది.

స:- యీపూటనే మామా. బాగావున్నావా ?

ర:- యెరగవూ మాబాగూ. ఇట్లాగే వున్నాం ఎండుతూ, వాడుతూ. మీ అయ్యకు కాలు విరిగిందిటే ?

పు:- వాండ్లయ్యకు విరగడం యెందుకు కాలు ? నీకు విరక్కపోయిందీ రాతిబల్లపడి.

స:- యెవరికీ విరగవద్దు. అంతా బాగానే వుందాం. అంతా అన్నాలు తినివుంటారా ?

పు:- అన్నాలూ. సగంమంది నిద్రబోయివుంటారు. పొద్దు గూకంగానే యింత నాలికకు రాచుకుండేదీ, దీపం మలిపి పడు కుండేదీ. కోతలకు పోయివచ్చినవాళ్లు అన్నాలు వొండుకుంటు న్నారు.

ర:- మన మాటలు విని చేరబారుతున్నారు.

స:- పున్నన్న యీయేడు పెంకుటిల్లు వేస్తాడా ?

పు:- వీరదాసు మొదలుపెడితే నేనూ రెండోవాణ్ణిగా వుంటా.

వీ:- వెట్టినాక రోకటిప్పించు. వీరదాసుకూడా కడతాడు.

పు:- తండ్రీ, కొడుకూ రు. ౧౫౦ యీయేడు దిబ్బెంలో వేశారు.

వీ:- నీవు లెక్కబెట్టావు.

పు:- మీరిద్దరూ యెంతలేదన్నా నెలకు చెరిఆరురూపాయలకు తాగేవాండ్లు. రాతిపనిలో మీయిద్దరూ సంపాదించే డబ్బుకు తాగడమే లేకపోతే యిదివరకు వెండిగోడలు పెట్టించేవాండ్లు. సంగన్న ధర్మానా యీయేడు మానారు. రూపాయిలు కూడ బెడుతున్నారు.

స:- వీరమామా! మొదలుపెడతావా ?

వీ:- పెడుదునుగాని పిల్లవాడు బండీ, యెద్దులూ గొని రాళ్ళబాడిగ సాగిస్తా నంటున్నాడు. దాంట్లో చాలా నభా వుంటుందిలే.

స:- మళ్ళీ మొదలుపెట్టరుగదా ?

వీ:- మావాడు రూపాయిలు కూడబెట్టడం మరిగాడు. నీవు తాగమన్నా తాగడు.

స:- మామా! యీయేడు మనం బావి తవ్వించుకుందామా ?

ర:- అట్లాగే కానియ్యి. అందరికీ కావలసిందేగా. యెవరికేమి వొడ్డుతావో చెప్పు.

స:- మన పల్లెలో యెన్నిండ్లున్నవి ?

పు:- రెండు పెంకుటిండ్లూ, పది పూరిండ్లూ, పద్ధెనిమిది చుట్టుగుడిసెలూ. అందరికీ యిండ్లక్రమాన వొడ్డితే యెట్లా ?

స:- అదెట్లా కుదుర్తుంది ? రాళ్ళ తోలకం బండ్లున్నవాండ్లది. కట్టుబడి రాతిపనివాండ్లది. తవ్వకం తక్కినవాండ్లది. రాతి ఖరీదు నా స్వంతాన యిస్తా.

ర:- మేము రాత్రిపనికి జాముపొద్దెక్కిపోతాం. తవ్వకంకాగానే నేనూ మా పిల్లవాడూ పొద్దుటిపూట యావత్తు కట్టుబడీచేస్తాం.

పు: సంగదాసు బండితోపాటు నా బండీ వచ్చేదే.

ర: యిక తవ్వకం మిగిలున్నది. యేడీ మేస్త్రీ? దూరంగా కూర్చుంటావేమి?

నాయుడు:- వింటూనేవున్నా. కూలి దొరకక కాళీగా వుండేవాండ్లు వస్తే తవ్వకం నే చేయిస్తా.

రా:- పోతుమాల మీా అయ్యేగా. మంచిరోజు చూసి గడ్డెత్తమను.

నా:- తవ్వకానికి కూలి లేకపోయినా పోతు తప్పదు.

ర:- మాంబావ పోతుమాలను తీసుకో.

పు:- సింబోతువాలే పీరదాసున్నాడు. అతణ్ని దీసుకో.

స:- పనిలోనికి రాని సోమరిపోతును నే నిస్తా.

వీ:- ఏదో వొకటిస్తురుగాని. మాదిగపల్లిలో ఆగుబ్బుగా చెప్పుకుంటున్నారు. కోతకూలి సంగతి సంగదాసు ఏమంటాడు?

పు:- కోతకూలి సంగతేమిటి?

స:- మునసబు గింజలు లేవు డబ్బులు ఇస్తాను తీసుకోం డన్నాడుట.

పు:- ఏద్దైనేసేమి?

స:- ఎంత యిస్తానన్నాడు?

వీ:- ఆ తప్సీలు నాకు బాగా తెలియదు. నీవు వొచ్చావని విని వాండ్లిక్కడికే రావాలనుకుంటున్నారు. కేక వెయ్యండి.

ర:- వాండ్లలో పెద్దింటివాడు ముత్తడు; వాడిని పిలవండి.

వీ:- తలమాదిగెను పిలిస్తే అంతా వస్తారు. వొరే ముత్తా! సంగన్న పిలుస్తున్నాడు. అంతా రండి.

సం:- ఏమోయి ముత్తన్నా! ఏమి కథ?

ముత్తడు:- ఏమికథ వున్నదీ. బతికేకథ గాదు. చచ్చేకథ. మునసబు కోతకూలికి గింజలు ఇయ్యడట, డబ్బిస్తాట్ట.

స:- ఎంత యిస్తానన్నాడు?

ము:- రోజుకు పావలాట. అది మామూలు కూలట.

స:- రూపాయికి పన్నెండు మానికలు జొన్నలిచ్చేటప్పుడు కూలి పావలా. ఆ ప్రకారం అయితే ఇప్పటిధర ప్రకారం కూలి రూపాయికి దాకొంటుంది.

ర:- డబ్బులుమట్టుకేమి? చేదా? ఇప్పటి ధరకట్టి యివ్వ మనండి మనమే కొనుక్కుందాం.

ము:- అట్లా యియ్యడుట. అదీ వాయించాం.

స:- తాను ఇప్పటి ధర్లప్రకారం అమ్మి రూపాయిలు తీసుకోవడంలేదా?

పు:- అది వాండ్లసొమ్ము.

స:- చాకిరీ కూలివాండ్ల సొమ్ము, భూమిరైతుసొమ్ము. దేనిధర దానికుండాలె. తన పదార్థానికి తాను యెక్కువధర తెచ్చుకుంటున్నప్పుడు అవరపడిన కూలివాడి పదార్థానికి వెలహెచ్చవద్దా?

ము:- చాకిరీ సిళ్ళ కూలికి పోవలసిందే?

సం:- ఆసామికి పండే ధాన్యాన్నిపట్టి చూస్తే అడ్డెడు గింజలు చాలా తక్కువ కూలి. ఇప్పుడు అదీగూడా తగ్గించవలెనని చూస్తున్నారు. ఊళ్ళో అంతా యిచ్చే ప్రకారం ఇయ్యండని మీా రడగండి.

ము:- ఆ మాటంటే అన్ని వూళ్ళల్లో నొకటే కట్టుబడి చేస్తారన్నాడు.

సం:- మరి కూలి తీసుకున్నారా?

ము:- ఇంకా లేదు. ఇప్పటి ధరలప్రకారం పావలాకు మానెడు జొన్నలుకూడా రావుగా.

స:- ఏమిచేతామని మీా ఉద్దేశం?

ము:- అంతా ఆలోచించండి.

సీ:- ఆలోచనేమిటి? కోతలకు పోవద్దు. ఎట్లా కోసుకుంటారో చూతాం.

ర:- ఇదివరకే మనపని వానాకాలం వచ్చి, ఎండాకాలం ఎచ్చీగా వుంది. పావలా మట్టుకు వారికి నష్టం ఎందుకూ? పని మానుకొని వాండ్లను నష్టపెట్టనూవద్దు. వాండ్లనే బాగుపడ నీయండి. చచ్చేవాండ్లం ఎట్లాగూ చస్తాం. ఊరికే పనచేసిరండి.

వీ:- మనం వూరికే చావం, అంతా మనవెంబడివాండ్లే. అన్నం దినకుండా ఈరోజు కోస్తావు, రేపుకూడా కొయ్యగలవా? మనకు సరీగా కూలిస్తే వాండ్లు చెడిపోతా మనుకొంటున్నారుగాని దాని విలువ వాండ్లకు కనబడి తీరుతుంది.

పు:- ఎక్కువ కూలిచ్చారని యెక్కువపని చేస్తావా?

ర:- ఎక్కువ కూలిస్తే యెక్కువ తింటాం. సత్తువెక్కు వౌతుంది. ఎక్కువ పనిచేస్తాం. పస్తు పడుకొని వొక మోపెత్తా చూతాం. కడుపులో ఎత్తులేకపోతే వొకమాటు మోసేది రెండు మాట్లు మోస్తాం. అందువల్ల వాండ్లకు పనిజాగు! మనకూ కూలి నష్టమే?

ము:- వీరదాసు చెప్పింది నిజమే. కూలివాడికి అర్ధన్నం పెడితే ఆసామికి శ్రేయస్సుకాదు. పనిచేసి కూలీ తీసుకోకుండా వస్తే ఆసామికి మనమీద జాలా? జాలేవుంటే యీ కథంతా ఎందుకు? గొర్రె కొవ్వింద ల్లా గొల్లవాడికే మేలంటారు.

స:- ఇప్పుడు రెండుమార్గాలు చెప్పారు. రంగదాసు చెప్పింది ధర్మమార్గం. ఆ మార్గం మనమంతా అవలంబించ గలిగితే కూలీలు ధర్మమార్గ మవలంబించిన వాండ్లవుతారు. రైతులుకూడా కూలీలనుచూచైనా ధర్మమార్గానికి రావచ్చు. వీరదాసు మార్గం వీరమార్గం. దాంట్లో తప్పులేదు. రైతులకు పైర్లు కోసిపెట్టవలసిన బాధ్యత మీకు లేదు. మీకు గిట్టితే కోస్తారు. లేకపోతే మానుతారు. ఇదికూడా ధర్మమే. వీరధర్మం.

పు:- తెగచెప్పలేదే.

స:- ధర్మసందేహం. సూక్ష్మభేదమున్నది.

వీ:- కొందరదీ, మరికొందరిదీ అవలంబించడానికి వీలులేదు వీరధర్మ మవలంబించి కొందరు సమ్మె కట్టినప్పుడు సధర్మం అవ లంబించి కొందరు కోతలకుపోతే మార్గం చెడుతుంది.

స:- మీ అందరి అభిప్రాయ మేమిటి ?

వీ:- రంగదాసు చెప్పింది అందరూ అవలంబించడంకష్టం. దానికి క్రమంగా బోవచ్చు. వీరధర్మం త్వరగా అర్థమవుతుంది. అందరమూ అదే ప్రారంభించి చూతాం. నీవు ఎట్లయినా బుద్ధి మంతుడవు. ఆలోచించి చెప్పు.

స:- ఇప్పుడు మిగిలిపోయేది ఏమీలేదు. నిదానంగా ఆలో చింతాం. ఇతర ఊళ్ళల్లో పెద్ద లేమాలోచిస్తారో కనుక్కొందాం.

వీ:- ఇతర పల్లెలవాండ్లు మనపల్లె ఎట్లా పోతుందో ఆదారికే వస్తారు.

స:- ఊళ్ళో కూలీల అభిప్రాయ మేమిటో ?

ము:- బలిజ శేషయ్య సమ్మె కడదామంటున్నాడు. ఆయన చాలినవాడు. తక్కినవాండ్లు ఆయనను కాదనరు.

స:- జనులు వీరధర్మమే అవలంబించేటట్టున్నారు, ఇప్పటి వుద్రేకంజూస్తే. రేపు చౌదరయ్యగారి చేనికి కొందరు కూలీలు రండి. వారు ఏ మార్గానికి వచ్చేదీ తెలుస్తుంది. మునసబుగారి చేనికి వెళ్ళినవాళ్ళంతా వస్తే బాగుంటుంది. వారిద్దరికీ రాజీ కుదురుతున్నట్లున్నది.

వీ:- ఇది వొక సూటే. కానియ్యండి.

అందరూ లేచి యిండ్లకు వెళ్ళారు.

## ౧౫

## కోతలు

సంగదాసు వుదయం లేచి కాల్యాలు తీర్చుకొని కూలి వాండ్లకు కోతకు రమ్మనమని కబురంపించి తాటి సాపయ్యతో మాట్లాడి మునసబుగారింటికి వచ్చాడు.

స:- మునసబుగారూ ! ఏమి విశేషాలు ?

ము:- నీవు యెటుండేవాడవు?

స:- సంగతి చెప్పందే యెటుంటావని అడిగితే?

ము:- నీవు జాడలు తీయకుండా వున్నావు? చంకబిడ్డను జారదీసేవాడివి.

స:- సంగతులుచెప్పి తరువాత పెట్టవలసినవి వుంటే పెట్టండి.

ము:- చౌదరయ్యగారు వస్తారుగా?

స:- జొన్నకోతకు యివ్వాళ రమ్మని నూరుగురు కూలి వాండ్లకు చెప్పా. ఇప్పుడు నన్ను ఏమి చెయ్యమంటారు?

ము:-నిన్న మాకు యాభై మంది దొరికేవరకు గగనమైందే! నూరుగురు నీకెక్కడ దొరికారు? చట్రాత నారదీస్తావుగదా.

స:- గడబిడలుగా వున్నవి. గబామనేవరకు యావత్తూ కోయించివేయవలెనని చూస్తున్నా. ఈ రోజు యెవరికీ కోతలు లేవటగా?

ము:- మా చేనుకోత లేకేమి. ఇంకా నాలుగైదురోజుల పని వుంటే.

స:- కూలివాండ్లనందరినీ యింకా నాలుగురోజులు మీరు ఆకట్టుకొని కూర్చుంటే మా చేలు యేమిగావాలె?

ము:- కూలివాండ్లు దొరకరని చౌదరయ్య యెత్తినయెత్తా యేమిటిదీ?

స:- సంగతేమిటో చెప్పకుండా నన్నడిగితే యేంచెప్పేది?

ము:- యేమినష్టం వచ్చినాసరే పట్టుపట్టి కూలితగ్గించవలెనని అక్కడ ఆకోతలూను, యిక్కడ వూరికూలీలందరినీ బెట్టి యీకోతలూనా? నాకెందుకు యీ అపవాదంతా.

స:- నాకూ యెవరూ యేమీ చెప్పలేదు. మామూలుగా కోయిస్తున్నా. మీతో యేమన్నా చెప్పారేమోనని అడగడానికి వచ్చా.

ము:- సాయంత్రం లోగా పూర్తిచేయిస్తావా యేమిటి?

స:- నాలుగోవంతుకూడా కాదు.

ము:- ఈచౌదరయ్యతో నేను యేదీపెట్టుకోను. ఆ చిన్నప రెడ్డిచేత పిలిపించి యిరికించాడు.

స:- మీరు దీర్ఘకోపం లేనివారు. యితరులు చేసినతప్పులు మరిచిపోవడం సత్పురుషుల లక్షణం.

ము:- నీవు పూసిపెట్టి మాట్లాడుతున్నావుగాని మీ చౌద రయ్య చేసినద్రోహం నేనుమరచిపోను. మాయింట్లోవాండ్లంతా అతనితో స్నేహమేమిటని నన్ను దూయపట్టుకున్నారు.

స:- నేను సెలవు పుచ్చుకుంటా.

ము:- జవాబు చెప్పవేమి?- మాకూలీలను విడిచిపెట్టిపో.

స:- అది వాండ్ల యిష్టం.

ము:- అరే బసివిరెడ్డీ! నీవుపోయి మనకూలీలందరినీ కొట్ట కరా. మామూలుప్రకారం నిన్నటికూలిగూడా కలిపి వాండ్లు కావలెనంటే యింకా నాలుగురోజులుకూలి ముబాదలాగాయిచ్చి కోతసాగించు.

స:- మేము యీరోజు మాట్లాడుకుంటిమిగదా. మీకెట్లా వస్తారు?

ము:- చూస్తాం మీరు మాట్లాడుకోవడం యేమిటో ?

స:- మీతో నాకు వాదం యెందుకూ ?

అని మునసబుగారు కూలీలు కావలెనంటే నాలుగురోజుల కూలి ముందుగా తీసుకొని వెళ్ళండని మాదిగపల్లెకు కబురంపి రామానాయుడిదగ్గరకు వెళ్ళాడు.

రా:- ఏమి దాసూ ? కబుర్లేమి ?

స:-అవసరంవస్తే కూలీలంతా సమ్మెకట్టడానికి సిద్ధంగా వున్నారు. మునసబు అక్కడ రెడ్డితో మాటయిచ్చి వచ్చాడుగాని యింట్లో వత్తిడి తగిలినట్లున్నది. ఇప్పటికి చెదిరిపోయినట్లే కనబడు తున్నాడు. పాపయ్యకు వ్రాసిన వుత్తరంలో యేమీలేదు.

రా:- మనము బయలుదేరుదామా ?- పిలువు. పాలుతాగి సిద్ధంగా వుంటా.

సం:- పాలుతాగే సుకుమారులు జొన్నకోత కోస్తారట. మీరు నామాటవిని భోజనంచేసి బయలుదేరండి. కాకపోతే పది గంటలకే అన్నంవచ్చే యేర్పాటు చేయండి.

రా:- కాదు. అందరితో కలిసి రెండు జాములకే తినాలె. నలుగురిమోస్తరుగా నేనుభోజనంచేసే బయలుదేరుతా. కూర్చొని మాట్లాడుదాం రా. యెప్పుడూ హాలులోకి అడుగు పెట్టవేమి? నియమమా.

సం:- కిందికిబోయి కూలివాండ్లకోసం మనుష్యులను పంపాలె. ఆనికె మాట్లాడుదాం.

రా:- అయితే నేను అన్నందింటా. నీవుకూడాత్వరగాతిను.

కూలీలు ముఠాలుగా కొడవండ్లూ, కూటిదుత్తలూ తీసుకొని బయలుదేరుతున్నారు. రామానాయుడూ, సంగదాసూ వొకగుంపుతో వున్నారు. రామానాయుడు ముదుగుగుడ్డలు వేసుకొని చెప్పులు తొడుక్కొన్నాడు. రాత్రి సంగదాసుతో మాట్లాడినతరువాత కూలీలసంగతులు పూర్తిగా విచారించవలెనని అభిలాష గలిగింది. మొదట కూలీలకంటే ముందు నడిచాడుకాని కొంతదూరం పోయినతరువాత వెనకబడ్డాడు. అడకూలీలుకూడా త్వరగానే నడుస్తున్నారే అనుకున్నాడు.

సం:- శేషయ్యా! నీవు మునసబుగారిచేనికి పోలేదా?

శేషయ్య:- మళ్ళీ పిలవడానికి ఆయనకు సిగ్గులేకపోతే పోవడానికి నాకైనా వుండవద్దూ? మాముఠాలో వొక్కరూపోలేదు. నిన్నటికూలి వొకమనిషిని పంపించి తెప్పించుకొన్నాం.

రా:- మామూలు కూలేనా?

శే:- నాలుగురోజులకూలి ముబాదలాగా యిచ్చాడు. ఇప్పటికైనా కూలీలు పదిమంది మాదిగలుమాత్రం పోయినారు. తక్కినవాండ్లంతా మీకే వస్తున్నారు. ఆయనకు యెబ్బగావుంది.

స:- మమ్ముల‌ను కొత్తపద్ధతిగా యివ్వమంటావా? పాతపద్ధతిగా యివ్వమంటావా?

శే:- ఇన్ని పద్ధతులు మాకు దెలియవు. మే మెరిగింది వొకటే పద్ధతి.

స:- చివరకు తగాదా పెడతావా?

శే:- అన్నిటికీ మీరే వున్నారు.

స:- తగాదాకుకూడానా. చౌదరయ్యగారు యీయనంటే నా సొంతాన పెట్టుకోను.

శే:- ఈయనంటే రేపటినుంచీ బందే. దారి వొకటి యేర్పడే వున్నది.

రా:- ద్వంద్వయుద్ధం జరిగేటట్టుగా వున్నదే.

స:- రెండుసేనలూ తయారవుతున్నవి.

శే:- జయ మెటవుతుందో?

రా:- న్యాయ మెటుంటే అటు.

శే:- అయితే మాదే.

కూలీలందరు చేనిదగ్గరకు పోయి దుత్తలు కుంటగట్టున బెట్టి మునుములుబట్టి కొయ్యడం ఆరంభించారు. రామానాయుడూ, సంగదాసూ చివరపట్టెలు తీసుకొన్నారు. రామానాయుడు కొడవలి బట్టుకొని కోస్తే తెగదా అని మొదట అనుకొన్నాడు. కాని పాలు గుదరలేదు. పంతులు కలం బట్టించడం కంటె కొడవలి బట్టుకోడం యెక్కువ కష్టంగా కనబడ్డది. ఎదటి వాండ్లు పట్టుకోవడం చూచి అలవాటు చేసుకున్నాడు. కాసేపు కోసేవరకు బాగా చెయ్యి తిరిగింది. మరికొంత సెపటికి నొప్పిపుట్టింది. కలంతో వ్రాస్తేనే నొప్పి పుడుతుంది. ఇంతలావు కొడవలితో కోస్తే నొప్పిపుట్టదా అనుకొన్నాడు. కొడవలి పట్టుకోవడంకంటె దంటు కట్టెలు గట్టడం యెక్కువ చిక్కుగా వున్నది. ముడివేయకుండా దంటు మెలిదిప్పి విడిపిస్తే కట్ట యెట్లా నిలుస్తున్నదని ఆశ్చర్యపడ్డాడు. రెండుకట్టలుగట్టి పడవేస్తే బాగానే నిల్చినవి. కొంతసేపు అయ్యేవరకు కొడవలి వొత్తుకొని వేలుబొబ్బ పోయింది. దంటు మెలిపెట్టడంవల్లయీ నెలు బొటనవేలు కోసుకొన్నవి.

యెవరితోను చెప్పలేదు. మునుము పూర్తిఅయింది. సంగదాసు సందిగ్ధంలో పడ్డాడు. కోసినకట్టలు మేడాలువేయించక వోదెలు ఆరేటందుకు చేనిమీదనే వుంచితే మర్నాడు కూలీలు సమ్మెకట్ట వలసివస్తే తన యజమానికి నష్టం చేసినవాడినవుతానేమో అని సందేహం. ఆకాశం కావురు గప్పింది. తూర్పున మబ్బేలింది. వాన గురిస్తే కంకులు మట్టిగొట్టుకుంటవి. యిద్దరు కూలీలను యెప్పటిదప్పుడు మేడాలు వెయ్యమని యేర్పాటుచేశాడు. రెండవ మునుము ప్రారంభించారు. రామానాయుడికి అలుపువచ్చింది. సంగదాసువంక చూస్తే తక్కిన కూలీలకంటె వొకఅడుగు ముందుండి వాండ్లను సెలకట్టనీయకుండా కోస్తున్నాడు. యితడు అన్నిటికీ సమర్థుడుగానే వున్నాడే అని రామానాయుడు ఆశ్చర్య పడ్డాడు. సంగదాసు స్నేహితుడి అవస్థ గమనించలేదు. రామానాయుడూ రెండవ మునుము ప్రారంభించాడు. చివరదాకా లాగాడు. వొక బొబ్బ పగిలింది. రెండుచుట్లకే పొద్దున నంజిన అన్న మరిగిపోయింది. అన్నం వచ్చేవరకు ఆలస్యమవుతుందేమో ననుకొన్నాడు. మూడవ మునుము ప్రారంభించేవరకు కూలీలు కూడా కలాయించడం ప్రారంభించారు. మొదటి వురవడి తగ్గింది. అందువల్ల ఆయనకుకూడా కొంత విశ్రాంతి చిక్కింది. సంగదాసు మొదటి పట్టు సళ్ళినా ఊపిరిసలపకుండా కోయిస్తూనేవున్నాడు. రామానాయుడికి తనపట్టెలో చిన్న దోసపండు దొరికింది. అది కోసి కొరికితింటే దిల్‌ఫసందుకంటే తియ్యగాఉంది. కాని ఆకలి తీరలేదు. రెండుజాములు గావచ్చింది. కావురువిచ్చిపోయి యెండ చిటపటలాడింది. యింటినుంచి తనకు వెండిగిన్నెలో అన్నం రావడం చూశాడు. 'కాస్తే తెచ్చినట్లున్నారు. చాలుతుందా' అనుకున్నాడు. అక్కలక్ష్మి కుంటగట్టుకుపోయి గిన్నెబెట్టుకొని కూర్చున్నది. రామానాయుడికి యీకూలీలు యేవేళకూ అన్నానికి పోరేమని అనిపించింది. మునుము పూర్తికాంగనే సంగదాసు అన్నం వచ్చింది భోజనం చేయండన్నాడు. అందరూ బయలు

దేరారు. రామానాయుడికి వొళ్ళు చెమటబోసి తోపయింది. స్నానంచేస్తే బాగుండు ననుకున్నాడు గాని అంగవస్త్రమూ తువాలా లేవని వూరుకున్నాడు. కొంచెం గాలిదోలేవరకు చెమట ఆరి చొక్కాలోపల చల్లబడి హాయిగావుంది. స్నానం అవసరమైనట్లు కనపడలేదు. అందరూ యెడమచేతిలో అన్నపుముద్ద బెట్టుకొని కుడిచేతితో తింటుంటే తమాషాగా కనబడ్డది. తానట్లా తినడం బాగుండదని వూరుకున్నాడు. ఆకలి రెపరెపలాడటంచేత తెచ్చిన అన్నం నిముషంలో అయిపోయింది. అంతా చేతులు కడుక్కొని చుట్టలు గాల్చి మళ్ళీ పని ప్రారంభించారు. రామానాయుడు చుట్టలు కాల్చడం చూస్తూ జమ్మిచెట్టుకింద కూర్చొని సొమ్మసిలి వుత్తరీయం తలకింద పెట్టుకొని తాను పొలము వచ్చినసంగతికూడా మరచిపోయి నిద్రబోయినాడు. సంగదాసు యేదోసంగతి అడగవలెనని వచ్చి పలకరించాడు. కాని జవాబులేదు. అంతట అక్కలక్ష్మిని యింటికి పొమ్మని సంగదాసు కోతలోకి పోయినాడు.

పొద్దు దిరిగింది. రామానాయుడుమీదికి ఎండ వచ్చింది. మెళుకువ రాలేదు. మూడుజాముల పయినయింది. వొళ్ళు విరిచి లేచి కూర్చున్నాడు. ఆనంద సముద్రములోనుంచి పైకి తెప్ప తేలినట్లు కనబడ్డది. తాను ఎక్కడ వున్నదీ తోచలేదు. చేనివంక చూచేవరకు కూలీలు కోస్తున్న చప్పుడు వినబడ్డది. అప్పుడు వెనుకటి సంగతి జ్ఞాపకం వచ్చింది. వీండ్లెప్పుడే కోత మొదలుబెట్టారే అని కొడవలి తీసుకొన్నాడు. కొడవలి కాలి చుర్రుమన్నది. కొంచెం చల్లబడ్డ తరువాత పోదామని అనుకున్నాడు. పొద్దువంక చూచేవరకు చాలాసేపు నిద్రపోయినట్లు కనబడ్డది. లేచి చూచే వరకు రెండు మూడు మునుములు యెక్కువ కోశారు. రామానాయుడు నిద్రలేచిన సడి కనిపెట్టి సంగదాసు తన మునుము పక్కవాండ్లకు గలిపి కుంటదగ్గరకు వచ్చాడు.

సం:- చాలాసేపు నిద్రపోయినట్లున్నదే.

రా:- నా కేమీ తెలియదు.

సం:- కథ యెట్లా వున్నది?

రా:- కొత్త ప్రపంచంలో తెచ్చిపెట్టావు. ఈ లోకంలో మూడుగంటలకు యేమీ ఫలహారాలు లేవా?

సం:- మా లోకంలో అసలు ఫలహారాలే లేవు. అయితే నిజమైన ఫలహారాలను తెచ్చిపెట్టగలను. దోసఫలాలు సయిస్తవా?

రా:- పాతిక కాయలు తెచ్చి యిట్లా పడవెయ్యి.

సం:- పాతిక కాయలే!

రా:- పాతిక దోసచెట్లు కూడా సమూలంగా తింటా.

సంగదాసు నాలుగు కాయలు తెచ్చి యిచ్చాడు.

రా:- మా చేలోవేగా. ఇంకా తీసుకురా.

సం:- అవి కానియ్యండి తెస్తా.

రా:- రెండుకాయలు తినేవరకు పండ్లు పులిసినవి.

రా:- దాసూ! దోసకాయలు పండ్లు పులుస్తవాయేమి? నాకిక నోరుపట్టదు. ఎట్లా యీ ఆకలి?

సం:- ఇంటికిపోయి ఫలహారం చేస్తారా?

రా:- అక్కడికి ఈ శరీరాన్ని మోసుకుపోయేదెట్లా?

సం:- ఫలహారం త్వరగా తెప్పించనా?

రా:- అందాకా నిలిస్తేకద?

సం:- ఊచబియ్యం కొట్టిపెట్టనా?

రా:- తినేవి యేవయినాసరే తీసుకురా. ధ్వంసంచేస్తాను.

సంగదాసు లేతకంకివిరిచి వూచబియ్యం కొట్టిపెట్టాడు.

రా:- కొట్టవోయ్, ఇంకొక కంకి. పోయేటప్పుడు కట్టక పోతావా? పీనాసిలాగున్నావే?

సం:- అవి తినేవరకు కొట్టలేనా?

రా:- పండ్లు నొప్పేమి?

స:- పులిసినవంటిరిగదా. తియ్యాని వూచబియ్యం తింటే పులవడం పోతుంది.

రా:- ఇప్పుడు బాగా నమలుతున్నా కాని నాకు దవడలు నొప్పిపట్టుతున్నవి. యెందుకీ పాడు శరీరాలు? వాండ్లు జూకు రాళ్ళవలె పనిచేస్తున్నారు.

స:- దానికేమి? యెవరుచేసేపని వాండ్లు చేస్తారు.

రా:- నీవందరు చేసేపనులు చేస్తావే? కాస్త స్థిమితపడ్డది గాని మంచినీళ్ళు కాసిని తెచ్చిపెట్టు.

స:- మీరు పోయి తాగుదురూ. ఆ కూలివాండ్లు చూస్తే అల్లరిచేస్తారు.

రా:- యేమి చేస్తే? యింట్లోనుంచి వెళ్ళగొడతారు. దానికి సిద్ధమయ్యే కూర్చుంటిని. మీయింటికి రానిస్తావా? నేనే తాగివస్తాలే.

స:- నేనొక సంగతి అడుగుతా చెప్పండి. ఆకలంటే యేమిటో తెలిసిందా?

రా:- ఆకలంటే యెక్కడ ప్రారంభిస్తుందో, యెక్కడికి యెక్కుతుంతో, యెంతవరకు వ్యాపిస్తుందో, అప్పుడు శరీర మే స్థితిలో వుంటుందో నాలుగు పర్వాలకింద వొక భారతం వ్రాస్తా.

స:- మీకింత ఆకలెందు కెక్కువయింది?

రా:- పొద్దున పనిచేయబట్టి.

స:- పొద్దుగూకులూ పని చేసేవాండ్లకు యెంత ఆకలి వుంటుందో యోచించుకోండి. మడతకుడుము లంటేకూడా ఏమిటో తెలిసిందా?

రా:- అవి అనుభవంలోకి రాలేదే.

స:- మీరీపూట దోసకాయలూ వూచబియ్యం తినకుండా రాత్రి వూరికే పడుకుంటే అప్పుడు మీకు మడతకుడుములంటే యేమిటో బోధపడుతుంది.

రా:- కూలీలంతా మూడుగంటలకు దోసకాయలూ వూచ బియ్యం ఫలహారము చేయరా ?

సం:- యజమానుడు చూస్తే ముల్లుగఱ్ఱలు విరుగుతవి.

రా:- కొట్టడం నేరంకాదా ?

సం:- బీదవాండ్లను కొడితేకాదు. మునసబుగారి గట్టుమీదిగా నడిచినందుకు నాలుగురోజులనాడు మా మేనత్తను కొడితే ఆమె చావుకు సిద్ధంగావుంది. పొద్దున గుంటూరు ఆసుపత్రికి పంపించా.

రా:- పాపం ఆమెకు యెట్లావుంటుందో ?

సం:- ఎట్లా అయితేనేమి ? బీదవాండ్ల ప్రాణాలకు విలువ లేదు.

రా:- దాసూ ! నాకిదంతా కొత్తప్రపంచంగా వుంది. నీవుచెప్పే సంగతులన్నీ కొత్తవే. యిదివరకు నాజీవితమంతా వృథాగా గడిచిపోయింది. ప్రపంచపరిస్థితులు యదార్థంగా తెలియవు.

సం:- మీజీవితమంతా భగవత్సేవకు మీాదుగట్టారుగదా. మానవసేవే మాధవసేవ.

రా:- నిశ్చయం. మానాయనగారు వచ్చివుంటారేమో ? యీరోజు కూలివిషయం తగాదాలోకి వస్తుందా !

సం:- వచ్చారని తెలిసింది. మునసబును దూషిస్తూ తక్కిన ఆసాములతో ఆలోచిస్తున్నారట. వూళ్ళో రెండుపార్టీలు పడేటట్టుగా వుందట.

రా:- కొందరయినా ధర్మపక్షాన నిలువబడితే మంచిదే.

సం:- వాండ్లు ధర్మంకోసం వచ్చేవాండ్లుకాదు. బసివిరెడ్డి మీా నాయనగారిమీాద కక్షచేత పార్టీ నిలవదీస్తున్నాడు. దీనివల్ల కొంత తాత్కాలిక లాభం వున్నప్పటికీ మీరు వుద్యమాన్ని నిర్వ

హించలేరు. ధర్మకవచమును ధరించిన మీబోటివారే సాధనోపాయముల తారతమ్యముల గుర్తెరిగి నడిపించవలసి వుంటుంది.

రా:- దాసూ! నీముందు నే నెంతవాడిని. నీ చాటుననిల్చి పనిచేయడానికి సిద్ధంగా వున్నా.

స:- యిది మనకు మామూలేకదా. మనను యితరులెవరూ పొగడకపోయినా మనమైనా పొగుడుకుందాం.

రా:- దాసూ! నాదొక ప్రార్థనవుంది.

స:- యిదేమి యిలాసాగించారు. దయచేసి అనుజ్ఞ యియ్యండి.

రా:- అంగీకరిస్తానంటే చెపుతా.

స:- ఏమిటో చెప్పండేనా?

రా:- నాయందంత నమ్మకంలేదా?

స:- అనక విధిలేదా? చెప్పండి.

రా:- అంగీకరిస్తావా?

స:- తప్పదంటిరిగా.

రా:- మన వుభయులకు గల ప్రేమరసపానీయములో అడ్డ పుల్లలుగా వున్న మర్యాబానాచకములను వుపయోగించవద్దు.

స:- ప్రతిబంధకములు చాలావుంటవి.

రా:- ప్రతిబంధకముల కేమి?

స:- మన వుభయులుమాత్రమే మాట్లాడుతున్నప్పుడు వుపయోగించనులే.

రా:- సాయంత్రపువ్యవహారం యేమిటి?

స:- విూనాయనగారు ప్రతిపక్ష నాయకులలో వొకరుగా వున్నట్లు కనబడుతుంది. వారితో విషయం పూర్తిగా చర్చిస్తే బాగుండును.

రా:- మనకు న్యాయమని తోచింది వారికిమాత్రం యేల తోచదు?

స:- అట్లా అనడానికి వీలులేదు. ఒకవేళ తోచినా స్వలాభ విషయంకదా. అయినా మనం యీపూట ముందుగా పోయి మాట్లాడితే బాగుంటుంది.

రా:- నేను పూరాకే దగ్గర వుంటా.

స:- బయలుదేరండి మీరందరు. యిప్పుడు మొదలుబెట్టిన మునుము పూర్తిచేసి రాండి.

వుభయులూ బయలుదేరారు.

రా:- నాకు కాళ్ళు పత్తులవలె మడతలు పడుతున్నవి.

స:- కడుపులో యెత్తులేక. అన్నము లేనివాండ్లు యేమిపని చేస్తారు?

రా:- పనివాడికి కడుపునిండేకూలియివ్వందే పనిచేయలేరని యజమానులు యెప్పుడు గ్రహిస్తారో. స్వలాభాన్నిబట్టి చూచినా కూలితగ్గించడం చివరకు యజమానులకు కూడా నష్టమే.

స:- మనుష్యులకు దూరాలోచన తక్కువ. తాత్కాలిక లాభమే చూస్తుంటారు.

రా:- యింటికి యెంతలో వచ్చాం.

స:- దారికి నిచ్చెనవేస్తిమిగా. యేదో వొక కథ సాగింది. మీనాయనగారు తన గదిలో కూర్చున్నారు. నీవు నీళ్ళు పోసు కొని త్వరగా ఫలహారం చేసిరా.

## ౧౬

సాహుకారు

నల్లమోతువారిది చాలా ప్రశస్తమైన కుటుంబం. గుంటూరుజిల్లాలో యీయింటి పేరటివారు యెక్కడవున్నా అన్న వస్త్రాలకు లోపంలేకుండా మర్యాదగా జీవిస్తూ పౌరుషవంతులని ప్రకాస్తి గలిగివున్నారు. నల్లమోతువారి సమ్మె మేడి యెల్చిం దాకా వదలదని ఐతీహ్యమున్నది. పూర్వం కంపెనీ ప్రభుత్వంలో

పన్ను లెక్కువ కట్టినప్పుడు నాదెళ్ళ, తిమ్మాపురములలోని నల్ల మోతువారు సుప్రసిద్ధవీరుడైన నల్లమోతు రామన్న చౌదరిగారి నాయకత్వంకింద తిరగబడి దేశములో పన్నులియ్యకుండ జేసి వ్యవసాయం మాన్పించి చేలోగట్టివున్న నాగండ్లు, మేళ్ళు అక్క-డనే విడిచిపెట్టి తిప్పి నాటినమేడి నాటుకొని చిగిర్చేవరకూ అనగా బహుకాలం సమ్మె కొనసాగించినట్లు చెప్పుకుంటారు. చౌదరయ్య గారి కుటుంబం పూర్వంనుంచి తండులంగలది. తండ్రి చనిపోయే టప్పుడు వీరికుటుంబానికి రెండువందల యెకరాలు పల్లం నూరు యెకరాల మెట్టావుండేది. చౌదరయ్య సిగమెగ్గటి పెత్తనానికి వచ్చినప్పటినుంచీ చౌకధరలోకొనీ బాకీలకింద కట్టుకొనీ కోర్టు వేలములలో కొట్టివేయించుకొనీ యిప్పటికి అయిదువందల యెకరాలపల్లం, మూడువందలయెకరాల మెట్టా సంపాదించి మూడు లక్షలవరకూ కవిలె పెంచాడు. మంగళాపురంలోని తూర్పు బజారులో పడమటిశ్రేణియందున్న విశాలమైన ఆవరణంలో యెత్తైన భవంతీ పురాతనపు పాటిప్రహరీగోడలమీద వేసిన పశువుల కొట్టములూ వుండేవి. చౌదరయ్యహయాంలో కాపురంవున్న యింటికి యెదురుగా తూర్పు శ్రేణిలోవున్న వొకపెద్ద బ్రాహ్మణసంసారం చితికితే వారియిండ్లూ, దరిపాలిన ఆవరణం, దానికి ఆనుకొని తూర్పుగావున్న పదహారు యెకరాలపొలం దామాషాగా తనబాకీ కింద కట్టుకొని అక్కడ విశాలములైన కొట్టములు వేయించి ఆ పొలంలోవి పద్ధాలుగు యెకరాలు పాడిపశువులకని వూరిదగ్గర బీడుగా వుంచాడు. లక్ష్మమ్మ యింటిఆవరణంలోనే గొడ్డూ బిడ్డా వుండడం శుభం అనీ వేరేకొట్టాలు వేయడం పనికిరాదనీ పట్టు పట్టిందిగాని పాడిపశువులనుమాత్రం ఆవరణంలో కట్టివేసే యేర్పాటుతో ఆమెను సమాధానపరచి వాటికోసం వెడిగెలగావున్న పెద్ద కొట్ఠంమాత్రం వుంచి శేషించినవి వూడదీయించి వీధిగోడమీద పెద్దమేడ వేయించాడు. మేడకిందిభాగంలో నడుమ వుత్తర దక్షిణముల వెడసావిడీ; దానివుత్తరమునా, దక్షిణమునా విశాలమైన

గదులూ; సావిడిపారున తూర్పునా, పడమరా డాబాపంచలూ, తూర్పుపంచలో ఉత్తరపు వైపునా, పడమటిపంచలో దక్షిణపు వైపునా మేడమీదికి మెట్లూ వుండేటట్టుగా మిద్దెవేసి క్రిందిసావిడికీ, గదులకూ పంచలకూ వరవడిగా పైన మేడ కట్టించాడు. మిద్దెలో దక్షిణపుది చౌదరయ్య కచేరిగది. వుత్తరపుదాంట్లో సంగదాసు వుంటాడు. సావిడి ఖాళీగా వుంటుంది. మేడ యావత్తూ రామానాయుడు వుపయోగించుకుంటాడు. దక్షిణపుగది పడకకూ సావిడి కూలాసాగా స్నేహితులతో కూర్చునేటందుకూ వుత్తరపుది పరాయిలతో వ్యవహారములు మాట్లాడుకొనేటందుకూ వుపయోగించుకుంటాడు. మేడమీది ప్రతిగదీ, తివాసులు, కుర్చీలు, బల్లలతో నిండివున్నది. ప్రతిగదికీ, విశాలమైన కిటికీ లమర్చబడ్డవి. లక్ష్మమ్మ సాధారణంగా మేడలోకి రాదు. ఆమెకు మొదటినుంచీ భవంతే అలవాటు. పాడికీ, వంటకూ, భోజనాలకూ, చౌదరయ్య పడకకూ భవంతిలోనే యేర్పాటు. చౌదరయ్య అన్నకొడుకు వెంకటయ్యకూడా భవంతిలోనో కొట్టంలోనో అవసరాన్నిబట్టి పడుకుంటాడు. చౌదరయ్య రెడ్డిగం వేసుకొని తివాసీమీద తనగదిలో కూర్చున్నాడు. బుర్రమీసాలూ పుస్తీలూ, కొండసిగా, కోరతలగుడ్డా పూర్వపు కమ్మవారియొక్క- క్షాత్రమునకూ రాజరీవికీ బాహ్యచిహ్నాలుగా ఆయనయం దింకా నిల్చివున్నవి. ఈ కాలంలో అన్ని కులాలవాండ్లూ అచ్చుకొట్టినట్లు బోడితలలూ బోడిముఖాలూ పెట్టుకోవడం ఆయన కిష్టంలేదు. నల్లని ముఖంమీద మొండుగా స్ఫోటకం మచ్చలున్నప్పటికీ మనిషి వికారికాడు. కొంతకాలంక్రింద ఖాయిలా పడడంచేత శరీరం దొందపారిందిగాని పొడుగుమీద లావనిపించడు.

చౌదరయ్య మంచి వ్యవహర్త. చదువనూ, వ్రాయనూ బాగా నేర్చినవాడు. యెవరైన నమ్మకస్తుడని తోస్తేయతు బారీగా పనివాండ్లమీద వదలివేస్తాడు. కవిలె లెక్కా, కోర్టు వ్యవహారాలూ కంఠంరాజు చూస్తాడు. సంవత్సరానికి పుట్లెడువడ్లు, భార్యా

భర్తలను సరిపోయే మిరపకాయలూ, అపరాలూ తద్దినానికి వరహా రొఖ్ఖం. పండుగ మొాయిన్లు తండ్రికాలంనుంచి భూతాదిగా ఆయన కియ్యడం మామూలు. పంతులు కొంచెం పెటుకుమనిషి. పైన పావ్రూ ఛాలంతినా్న యజమానిని చెడనియ్యడని చౌదరయ్యకు నమ్మకం. సాధారణంగా పెట్టుబడి యావత్తూ ఆయన సలహాలేనిదీ జరగదు. వ్యవసాయపు అజమాయిషీ ఐవజు అమ్మడం నిల్వ చేయడం సంగదాసు పని. భోజనమూ, నెలకు ౧౫ రూపాయలు జీతమూ అతనికిచ్చే యేర్పాటు. సంగదాసు పైసా జాయా పోనీ య్యడని గ్రామంలో వాడుక. చౌదరయ్య తలగుడ్డ చిలుకకు తగి లించి చుట్టతాగుతూ యెవరితోనో కొంచెం మాట్లాడి చుట్ట పార వేసి ఘుమఘుమలాడుతూ లోపలికి వచ్చాడు.

చౌ:- పిల్లవా డేడీ ?

ల:- మేడమీాదికి యిప్పుడే పోయినాడు.

చౌ:- మీా అబ్బనా డెన్నడైనా మీావాండ్లు కోతలు కోశారూ ?

ల:- బాగావుంది సరాగం. యెన్నడో పోయిన మా అబ్బ సంగ తెందుకు ? యిప్పటి మీాసంగతి ఆలోచించుకోండి. మా అబ్బ గొంతులోని కెన్నడూ మీాగటక జారలేదు. యెప్పుడూ మీాకంటే పైచెయ్యిగానే వున్నారుగాని మీాకు లొాజ్జుగా లేరు.

చౌ:- పిల్లవాడ్ని కోతకెందుకు పంపించావు ?

ల:- నే పంపించాను ? వాడేమి పాలుతాగేవాడా నే పంప డానికి ?

చౌ:- ఈ మాలసావాసాన చెడిపోతున్నాడు. మాలవాడు తేపా మేడమీాది కెక్కడం యెందుకు ?

ల:- తండ్రి మాలవాణ్ణి మిద్దెలో పెడితే కొడుకు మేడ మీాద పెట్టాడు. పదిమంది వచ్చేయింట్లో ముఖ్యస్థలం మాల కూటంగా నెనపు నేరాగు ? మొన్న మీా వియ్యంకుడు భోంచేసి

యెరక్క వాడిగది తీసివుంటే దాంట్లో మంచంమీద పడు కొన్నాడు. తరువాత తెలిసి నొచ్చుకొని స్నానంచేశాడు.

చౌ:- నీవు అడ్డమైనవాండ్లకు బియ్యాలూ, పప్పు లూ అప్పులుపెట్టడం యెందుకు? పొద్దుటిపూట చల్లసత్రం, మధ్యాహ్నం దారినపోయే గుంపులకు అన్నసత్రం కొంప గుల్లవుతున్నది.

ల:- పిల్లవాడిమీది కోపం నామీదికి తిరిగింది. వూళ్ళో బీద సాదవుంటే బదులూ సదులూ పుట్టనీయకపోతే బాగుంటుందీ? వున్న వేళ వుంటుంది లేనివేళ వుంటుంది. మనకు యింతవున్నా వొకసమయాన యేదో నిండుకుంటుంది. కాకపోతే యెప్పుడైనా కాస్త తక్కువరకం బదులు తెచ్చిస్తారు. దానివల్ల కొంప గుల్లవు తుందీ? మీరిచ్చే బాకీలన్నీ తిరిగివస్తున్నవీ?

చౌ:- గేదె లెన్నెందుకు? అమ్మివేస్తా.

ల:- అమ్ముకోండి. తిరిపెపునీళ్లు పోయవలసివస్తుందనేనా అమ్ముకోవడం? వూళ్ళో ప్రతివాళ్ళకూ గొడ్లుంటవీ? నాండ్లంతా వట్టికూడు తినవలసిందేనా? మన పంతులువంటివాడికి గొడ్డులేదే. చుట్టం వస్తాడు పక్కం వస్తాడు. కొణిదెడు మజ్జిగనీళ్ళుకూడా పుట్టనీయకపోతే యెందు కీ పెద్దసంసారాలు?

చౌ:- అన్నసత్రం అవిచ్ఛిన్నంగా జరగవలసిందేనా?

ల:- అన్నసత్రం పెట్టానూ? మనసత్రాన్నే అంతా వచ్చి జారుతున్నారు. దారిని పోయేవాడు ఆకలికి చెవులు ఘుడియలుపడి 'గంజినీళ్లు పొయ్యమ్మా' అని అడిగితే యింత మజ్జిగ అన్నం కలిపి పోస్తున్నా. తక్కిన ఖర్చంతా లాభమూనూ యిది దుబారానా? యింతకాలము నాకు యెట్లాగో జరిగిపోయింది. మీ కోడలు మేడమీదనుంచి క్రిందకే దిగదు. యిక వారు పెట్టేదీ లేదు. వీండ్లు తినేదీలేదు. అప్పుడంతా పడ్డీకే యిచ్చుకొందురు గాని. నాకు దగ్గరకువచ్చింది. ఈ నాలుగురోజులూ యిట్లాగే జరిగిపోనియ్యండి. ఈతగాడా యివ్వాళ యెందుకు వచ్చింది?

చౌ:- (లక్ష్మమ్మమాటలకు కొంత జమికి) వాణ్ని వుద్యో గానికి పొమ్మను.

ల:- పోకుండా నే పట్టుకున్నానా? మీకు దుబారా ఖర్చు లేకుండా నేను వాడిదగ్గరనే పడివుంటా. మీరు పూటకూలి యింటికి పొండి. యేమీ నష్టముండదు.

చౌ:- సగం వాడిని నీవే చెడగొట్టుతున్నావు. వాండ్లు 'నీవు నీ' వనే పిలుచుకోవడం యిప్పుడే విన్నా.

ల:- నేను అట్లా పిలుచుకోమని చెప్పలేదు. నాకివ్వన్నీ తెలియవు. నా రోజులు నేను వెళ్ళబుచ్చుకుంటా. మీ తగాదా లన్నీ నాతో చెప్పవద్దు. యెవరిష్టం వచ్చినట్లు వారుండండి.

చౌ:- అన్నం పొలాని కెందుకు పంపావు?

ల:- పంపమంటే పంపా.

చౌ:- కూలివాండ్లతో కోతకోసి వాండ్లతో కూర్చొని అన్నంతింటే గౌరతకు భంగంరాదా?

ల:- ఆ సంగతి వాడికి తెలియదా?

చౌ:- మాలవాడూ, వీడూ కలసి మొన్న గురువుపాదాలు పట్టారట.

ల:- యెవ రన్నారు?

చౌ:- వెంకటసుబ్బయ్య యిప్పుడు చెప్పాడు.

ల:- గురు వెవరు?

చౌ:- ఎవరో బ్రాహ్మణుడట. ఆ బ్రాహ్మణుడు యీ మాలవాడికి గురువెట్లా అయినాడో. ఈ యీడున తనకు గురువు పాదం బట్టడం యేమిఅవసరం వచ్చింది?

ల:- నాకేమి తెలుసు యివన్నీ? కాలు గడపవతల పెట్టని దానికి.

చౌ:- మాలవాడు వీణ్ణి యింకా చెడగొడతాడు. వాడు మనకొంపకు ముసలమైనాడు.

ల:- ఇద్దరూకలిసి యెక్కడికో ప్రయాణంటే! పిల్లవా డనె.

చౌ:- ఎప్పుడు పోతారట?

ల:- అది నాకు తెలియదు.

చౌ:- గురువుదగ్గరకు గాఁవాలె. బాగానేవున్నది.

చౌదరయ్య దాహంతాగి తనగదిలోకి పోయినాడు.

౧౭

కూలీ

చౌదరయ్య యేమీతోచక మళ్ళీ చుట్టముట్టించాడు. పిల్లవాడు దారితొలుగుతున్నాడని చాలా విచార పడుతున్నాడు. 'సంసారమంతా తలకుచుట్టి యీదుగోమంటే బాగుంటుంది. యీ పొలం బోవడంగూడా వొక విధంగా బాగానేవుంది. సొమ్ముమీద కాపీనం బుడితేనేగాని బాగుపడ' దని మళ్ళీ అనుకొన్నాడు. చౌదరయ్యకు భార్యతో మాట్లాడినప్పుడున్న వుధృతం తగ్గింది. మనిషి శాంతపడ్డాడు. 'కూలివాండ్లు వచ్చేవేళ అవుతున్నది. మునసబు చీలిపోయినందుకు సంగదాసైనా మనపక్షంవుంటే బాగుండును. యేమో అబ్బా యిటుంటాడని నమ్మకంలేదు. యెటూ చేరకుండా ముభావంగావున్నా కొంతమెరుగే. అయినా వాయించిచూతాం. యెట్లామోగేదీ తెలుస్తుంది. పిల్లవాడుకూడా దగ్గరవుంటే దాసు యెగత్రించి పోగూడదు' అని అనుకున్నాడు. రామానాయుడు మెట్లుదిగి వస్తూవుండడం కనిపెట్టి చౌదరయ్య సంగదాసూ అని పిలిచాడు.

స:- (తన గదివాకిటిలోకి లేచివచ్చి)- అయ్యా పిలిచారా?

చౌ:- అబ్బాయి దిగుతున్నట్లున్నది లోపలికి రమ్మను.

స:- అయ్యగారు పిలుస్తున్నారండి.

రామానాయుడు గదిలోకివచ్చి కూర్చున్నాడు. సంగదాసు మొత్తపట్టుకొని నిలిచి—

స:- కూలివాండ్లు వచ్చేవేళవుతున్నది. రెండుబస్తాలు వాకిట్లో వేయించనా?

చౌ:- ఆసంగతి మాట్లాడడానికే పిలిచాను కూర్చో.

స:- యిక్కడ నిలుచుంటాలే చెప్పండి.

చౌ:- సావకాశంగా మాట్లాడి తరిచి నిగ్గుదీత్తాం.

స:- సంగతి విప్పన్నంగా ముందుజెప్పండి.

చౌ:- కూలివాండ్లకు పూర్వం రోజుకు పావలావంతున యిస్తూవుండేవారు. దరిమెలా ఆరణాలదాకా పెంచారు.

స:- పూర్వం రూపాయంటే బండికల్లుగా వుండేది. నాణెముల ప్రచారం తక్కువ గావడంచేత ధాన్యం యియ్యడమే నాణెంగా కనబడి వస్తువిచ్చి వస్తువేబదులు దీసుకొంటూ వుండేవాండ్లు. ధరలుయే ప్రకారంగావున్నా వస్తువే చెలామణి అవుతూ వుండేది. పత్తివిడతకూ, మిరపకాయలకోతకూ, కంకులు గిల్లడానికీ యెన్నడైనా మీ బుద్ధెరిగిన తరువాత డబ్బు కూలి యిచ్చారా? యేపంట కైలుచేస్తే అదే కూలిగా యిస్తూవుండేవాండ్లు. ఆపద్ధతి వుభయులకూ వుసులుగానే వుండేది.

చౌ:- యిప్పుడు మనము డబ్బే యిస్తామంటే వచ్చిన చిక్కేమి?

స:- అట్లా మార్చడానికి వుద్దేశమేమి?

చౌ:- వుద్దేశ మేదయితేనేమి? లాయిలాసా వొకటి కనపడేదిగా?

స:- నేను తరిమి అడిగానని కోపపడవద్దు. విషయం చర్చిస్తున్నాంగదా. లాయిలాసా లేకుండా చేసుకోవడమే మీ అభిప్రాయమూ?

చౌ:- డబ్బు యివ్వడం మనకు లాభమనుకో.

స:- యెట్లా లాభం?

చౌ:- అడ్డెడు జొన్నలకూలి. నాలుగుకట్టలకూ ఒకతవ్వెడు గింజలు కట్టుకోండి. రూపాయికి నాలుగు మానికెలవంతున అడ్డెడు దవ్వోటికీ పదణాలవుతుంది. చొప్పఖరీదు వొకఅణా యెక్కువలనుకోండి. రోజుకూలి పదకొండణాలు మదింపు వేయవచ్చు.

స:- కొన్నాళ్ళు మూడు మానికెలు కూడా అమ్మాను. ముందు అయిదు మానికెలు గావచ్చు. దేనినిబట్టి డబ్బుకూలి నిర్ధారణ చేస్తారు ?

చౌ:- ఈరోజు ధరలు మనసులో బెట్టుకొని ఆరణాలు నిర్ణయిస్తామనుకో.

సం:- ఈ ఆరణాలకింద యిప్పటి ధరలనుబట్టి మూడు దవ్వాలకూలి యేర్పరచడం మీ కిష్టమేనా ?

చౌ:- నా అభ్యంతరం లేదు. అట్లా ఆసామీలందరిచేత వొప్పిస్తా.

సం:- రేపు రూపాయికి మూడు మానికెలయితే మీ కుమారుడు మానెడే చేస్తానంటాడేమోనే ?

చౌ:- ఎందుకంటాడులే.

సం:- పేస్తరు తియ్యావలెననే వుద్దేశం మనుష్యులకు యెప్పుడూ వుండేదేగా.

చౌ:- డబ్బు మీవాండ్లకు చేదయినట్లు కనబడుతున్నది.

సం:- నేను కూలిపనివాణ్ని కానుగా.

చౌ:- కూలీలకే అనుకో.

సం:- ఇప్పటి ధరలనుబట్టి పదకొండణాలు పుచ్చుకోవడానికి సిద్ధంగా వుంటారు. వాండ్లకు గింజలిచ్చినా లేక వాటి ఖరీదిచ్చినా వొకటే. ప్రతిరోజూ ఖరీదు కట్టుకోవడం చిల్లర పంచిపెట్టడం చాలా లాయిలాస. ధ్యానమే యిస్తుంటే ధరలనుబట్టి మార్పవసరంలేదు. డబ్బు పద్ధతి రావడంతోటే ధాన్యపు ఖరీదంటూ కట్టి యివ్వకపోయినా అప్పుడప్పుడు కూలి మార్చవలసే వస్తుంది. ఆ మార్పుగూడా అడ్డగోలు వ్యవహారం అవుతుందిగాని నిలుకుండదు.

చౌ:- మనం సజావుగా మాట్లాడుదాం. అన్ని ధాన్యాలు అడ్డెడే తీసుకుంటారా ?

సం:- గట్టిధాన్యాలు అడ్డెడూ, పొట్టు ధాన్యాలు అడ్డెడు తవ్వెడూ లేక మూడు మానికెలూ రివాజునుబట్టి యిస్తున్న వేగా.

చౌ:- అయితే ధాన్యానికిగూడా నిలుకులేదే.

సం:- ఏ పంట కైలుజేస్తే అది ఇయ్యావలసిందేగా. దానికి నిలుకేర్పడే వున్నది.

చౌ:- గోడలు బెట్టినందుకు యేమి పంటిస్తావు?

సం:- పూర్వులు డబ్బుకూలేర్పాటు చేసింది యిటువంటి వాటికోసమే. పయిరుకు సంబంధించనప్పుడే డబ్బుకూలి వేర్పాటు. గింజల ధరలనుబట్టి అదీ ఇప్పుడు కొంచెం పెరిగింది. మీరు దానిని దెచ్చి వ్యవసాయపు పనులకు లంకె పెడుతున్నారు. మొట్టుకు మీ అభిప్రాయమేమిటి?

చౌ- ఆరణాల కూలి చాలా యెక్కువని. అంతకుమించితే రైతు భరించలేడు. అందరి క్షేమమూ విచారించాలె. కూలి పావలానుంచి ఆరణాలకు పెంచితే నూటికి యాభై వంతున పెంపకం ఆసామీలు చాలా ఔదార్యం జూపించినట్లే ఎంచవలసి వుంటుంది.

సం:- పంటకు యేమాత్రం ధర పెరిగింది?

చౌ:- ధాన్యమూ, ప్రత్తీ, మిరపకాయలూ, అపరాలూ సగటున మూడు నాలుగు రెట్లు ప్రియమయినవి.

సం:- అంటే పూర్వం నూరు రూపాయలు అమ్మేది ఇప్పుడు నాలుగువంద లమ్ముతున్నవి. కూలివాండ్లకు చాలా ఔదార్యం జూపించి అరరెట్టి యెక్కువ జేస్తామంటున్నారు. ధరల తేడాలవల్ల వచ్చే పేస్తరులో కూలివాడికంటె ఆసామి నాలుగు మొదలుకొని ఆరు రెట్లవరకూ వుదారబుద్ధితో యెక్కువ తీసుకుంటా నంటాడు.

చౌ:- నీవు కూలివాడికి భూస్వామితో ఒంతు పెడతావేమి?

సం:- మీ రడిగిన విషయం కొంత లోతుకి దిగి విచారిస్తే గాని తేలదు మన దేశంలో భూమిలో స్వామ్యం వ్యవసాయ

దారులకు లేదు. అది ప్రభుత్వానికిగాని మందికిగాని చెందివున్నది. మందిమీద జరుగవలసిన పనులను దానితరఫున రాజు పాలిస్తూ వుంటాడు. ఆసామీలు మంది దగ్గరనుంచి భూములు కౌలుకు పుచ్చుకొని మందికి యేజంటైన రాజుకు ముచ్చిల్కాలు వ్రాసి ఆయనవల్ల పట్టాలు పుచ్చుకొని మందికి చెల్లవలసిన మక్తా శిస్తు రూపకంగా రాజుకు చెల్లిస్తారు. వసూలు ఖర్చులుపోను మిగిలిన డబ్బు మందికి వుపయోగపడుతుంది. ఆసామీకి వుండేదల్లా కౌలు హక్కు. ఆసామి మక్తా యియ్యకపోతే యజమాని అయినమంది ఆసామిని వెళ్ళగొట్టవచ్చు. లేక ఆసామికి యింకా జరగవలసిన కౌలు శిస్తుమొత్తాని కవసరమయినంతవరకు వేలం వేయవచ్చు. న్యాయాన్నిబట్టీ ఆసామీ భూమిని బలపర్చడానికీ ప్రోత్సాహకరంగా వుండేటందుకూ శిస్తు వసూలుపని సులభంగా తేలిరావడానికీ కొన్ని భాగాలలో శాశ్వత జిరాయితీ హక్కులూ మరి కొన్నిచోట్ల దీర్ఘకాలపు పట్టాలూ యియ్యబడ్డవి. మందికిష్టమయితే ఆసామీలను కారణం చెప్పకుండానే కౌలునష్టం కట్టియిచ్చి మార్చవచ్చు. కాబట్టి మీకున్నది జిరాయితీ హక్కు. అది మంది యిష్టప్రకారం శాశ్వతపుదీ గావచ్చు, తాత్కాలికపుదీగావచ్చు.

చౌ:- మీ కూలివాండ్లంతా మంది దగ్గరనుంచి పై పోటీ బెట్టి నా పొలమంతా కౌలుకు తీసుకుంటారా?

స:- మనం మాట్లాడే విషయం అదిగాదు. యిప్పుడు మాట్లాడినంతవరకు ఆసామీలకున్నది జిరాయితీ హక్కేనని చెప్పాను. అనగా స్వంతదారైన మంది కొంతహక్కును కౌలుదారుకు పరివర్తన జేసింది. పూర్వం మందివల్ల హక్కుబొందిన దేశముఖులు లేక జమీందార్లు కొన్నిభూములు స్వంతకమతంకింద వుంచుకొని మిగిలినవి రహితులకు కౌలుకిచ్చేవారు. ఆకాలంలో కమతగాండ్లుగా వున్నవాండ్లు చాలామంది యిప్పటి భూస్వాములైనారు. పూర్వం కమతగాండ్లకు కొంత పాలి హక్కుండేది. ఆ పాలేరు మారి యిప్పుడు జీతగాడైనాడు. అందువల్ల భూమితో

అతనికుండే సంబంధం పోయింది. మామూలు కూలివానిస్థితిలోకి అక్రమంగా అతణ్ణి తీసుకొనివస్తున్నారు.

చౌ:- కూలివాండ్ల సంగతి ముందు తేలనియ్యి. జీతగాండ్లను తరువాత రేపెట్టి ఆసాములమీదికి యెగదోలుదువుగాని.

స:- ఇప్పుడు మనం మాట్లాడే విషయానికి కమతగాండ్ల సంబంధం వస్తుంది. సంవత్సరాలకోలది యేర్పరచుకొన్నవాండ్లు జీతగాండ్లు. రోజుపనివాండ్లు కూలీలు. వ్యవసాయ విషయంలో జీతగాండ్లూ, కూలీలూ ముఖ్యులు. చెమటవోడ్చి జనానికి భోజన పదార్థాలు సృష్టిజేసేవాండ్లు వాడ్లు. స్వంతగాడున్నే కౌలుదార్లు సైతం వీండ్లలోనే చేరుతారు. వందలకోలది యెకరాలకు మంది వల్ల కౌళ్ళుపొందిన పట్టాదార్లు పట్టితనిఖీదార్లు. వాండ్లు వొకవిధమైన వర్తకులు. వ్యవసాయంవల్ల వచ్చేలాభం విశేషంగా యీ తనిఖీదార్ల జేబులోకే బోతూవున్నది. ముందు మేల్కొన్న పై తరగతులవాండ్లు మందివల్ల కౌళ్లు సంపాయించుకోవడంచేత అలగాలకు యేమీ లేకుండా పోయింది. మీరు చెప్పినట్లు కూలివాడికి భూస్వామితో వంతుపెట్టడం నాదితప్పే. వ్యవసాయానికి కూలీ ముఖ్యుడుగాని మీరుచెప్పే భూస్వామిగాడు.

చౌ:- అయితే నీవిప్పుడు కూలీకి యేమియ్యడం న్యాయమంటావు ?

స:- నన్ను న్యాయమడిగితే యింకా చాలా చెప్పవలసి వుంటుంది. ఇప్పుడువున్నదే తగ్గించవచ్చునా, లేదా? అనేకదా మనఆలోచన.

చౌ:- నీవు న్యాయమని యేదనుకుంటావో అదంతా వివరంగాచెప్పు.

స:- తమరు అడిగేవిషయానికి తరువాత వస్తాను. యిప్పుడు అయ్యగారు చెప్పేప్రకారం కూలి యింకాతగ్గిస్తే కూలివాడు యెట్లా జీవిస్తాడు ?

చౌ:- కూలివాండ్లంతా యెట్లాజీవిస్తారో మాకవసరంలేదు. వాండ్లందరినీ పోషించవలసిన బాధ్యత మాకులేదు. వొకవేళ పోషించవలెనని అనుకొన్నా మాచేతగాదు. మనము చేయించు కుండేపనికి మనం యెంత యివ్వవలసిందో విచారించుకుందాం.

స:- యింతవిచారణ యెందుకు? మీచిత్తం వచ్చినంత యివ్వవచ్చునుగదా?

చౌ:- వాండ్లు పుచ్చుకోకపోతేనో?

స:- వూరికె చేసిపోతారో లేక అసలేమానుకొంటారో?

చౌ:- వూరికెచేస్తే చేయించుకుండే దేవరు? అసలే మాను కొంటే వుభయులకూ నష్టమేగదా?

సం:- వారి నష్టంసంగతి మీకెందుకు? మీ నష్టంసంగతి వారికెందుకు? వొకరికొకరు సహాయంచేయవలసిన బాధ్యతలు లేవుగదా? మీ యెనిమిదివందల యెకరాలు మీరే దున్నుకోండి.

చౌ:- యింకొకరికి కౌలు కిచ్చుకుంటాను.

స:- వారికిమట్టుకు కూలివాండ్లవసరంలేదా? వారికి కూలి వాండ్లు రామంటే యెవరూ మీదగ్గర కౌలుకే పుచ్చుకోరు.

చౌ:- యీకూలివాండ్లకే కౌలు కిస్తాను.

స:- అంటే పట్టాలుమాత్రం మీపేర వుండి భూములు కూలీలకు స్వాధీనమౌతవని అర్థం.

చౌ:- క్రమమైన మక్తాలు పుచ్చుకోమా?

స:- వారు దయదలిచి యిచ్చినంత.

చౌదరయ్య వూరుకున్నాడు.

స:- కాబట్టి కూలివాండ్ల విషయమై బాధ్యత మనకేమున్న దని రైతులు అనడానికి వీలులేదు. వ్యవసాయం ఆసాముల మీద కంటే యెక్కువ కూలీలమీదనే ఆధారపడి వున్నది. వారి పోషణ విషయమై మీరు యోచించక తప్పదు.

చౌ:- మమ్ములను యెట్లా వాండ్లను పోషించమంటావు?

స:- అధమం ప్రస్తుతమిచ్చే కూలైనా యియ్యడం అవసరం. వారు పడుతుండే బాధలన్నీ ప్రస్తుతం మీకు వినిపించడం అవసరంలేదు. ఇదివరకిస్తున్న రోజుకూలి వాండ్లకొకరోజుకుకూడా సరిపోదు.

చౌ:- ఆలు మగడు కూలికివస్తే వాండ్లకు కాంగా మిగులుతుంది.

స:- యెల్లకాలం ఆలు మగడే వుండరు. యింట్లో ముసలమ్మ తింటుంది. భార్యకు నీళ్ళాడుపొద్దులు రావచ్చు. ప్రసవపు రోజులూ, బాలింతనెలలూ గడవాలె. రెక్కలురాని పిల్లలను పోషించాలే. ఇవన్నీ తమరు యోచించండి! కూలిరోజులలో పోషణ జరిగినా వ్యవసాయపు పనులైనతరువాతవాండ్లేమిగావాలే? పస్తులైనా వుండాలే, పరులయిండ్లయినా దోచాలే. పస్తులున్న వాండ్లు మీకేమి పనిచేయగలరు? యెద్దువంటిదానికి బలంలేకపోతే మీవ్యవసాయం యేమిసాగుతుంది? యీపూట దాణావెయ్యకపోతే రేపుపని మట్టసమేగదా. ఇవన్నీ తమరు యోచించి కనికరించవలసి వుంటుంది.

చౌ:- నీవు శ్రీరంగనీతులు యిన్ని చెపుతావుగాని కూలివాడికి కడుపునిండా అన్నముంటే పనిచేస్తాడటోయి. వొకపక్కకాస్త కాలుతుంటే పనికోసం దేవులాడుతాడుగాని కడుపునిండితే పని మట్టే. నీకేమిదెలుసు పిల్లకాకివి. నలభైయేండ్లనుంచి బొప్పులు తిన్నాను. ఆరణాలు సిస్సలైనకూలే. ఒకరిచేత నేను చెప్పించుకునే వాణ్ని గాను. వొప్పుకోమని చెప్పు. నీవుచెపితే అంతా వింటారు.

స:- నేజెప్పినా వినరండీ.

చౌ:- ఇంతసేపటినుండి నీవు యిన్నిమాటలు చెప్పావుగదా. నేను వొక్కసూటి చెపుతా విను. కడుపులో వొకచెంప కాలుతుంటే మునసబుగారిమీద వాండ్లు సమ్మెకట్టేవాండ్లేనా? వాండ్లకు అన్నం యెక్కువైంది. యెక్కువగాక పోతే మాలపల్లీ, మాదిగపల్లీ, తొగటపాళెం, తురకపాళెం కూలీలకోసం యిన్ని

మాట్లు మనం దిరగాలెనా? మనిషి తిరగమళ్ళాడా అంటే నాకు తెగులు. ఈ వూళ్ళో పద్ధాలుగువీసాలు కూలిజనం నావల్ల బతికే వాండ్లు. యెదురుతిరిగి వాండ్లను నాచేలో అడుగుబెట్టనియ్యను. నూరారయ్యేదీ నే మాటదిరగను. చెడిపోతారు చెప్పు.

స:- యింత యిస్తువగలవాండ్లము మనము తొందరపడడం యెందుకు? దస్కతుజేసిన మునసబు చీలిపోయినాడుగదా!

చౌ:- నామీది కచ్చెచేత యితగాడు తిరిగిపోయినాడు గాని పెద్దవాండ్లంతా దీనికి మోటుకొని వున్నారు.

స:- నే మనవిజేసే దేమంటే కీడెంచి మేలెంచమన్నారు. మనవాండ్లది కప్పలతక్కెడ వ్యవహారం. కూడిరారు. పెద్దలంటే మాటలకు అంతా పెద్దలే. క్రియవచ్చేటప్పటికి యేవోసాకులూ, ధర్మపన్నాలూ చెప్పి తప్పుకుంటారు. మనము ముందుమిగిలితే అవలక్షణ మనిపించుకోవడ మవుతుందని నాభయం. చుట్టుపట్ల వూళ్ళు నిలవక కూలీలచేత మనంమాత్రమే సమ్మెకట్టించుకొని చివరకు మునసబుగారి మోస్తరుగా లొంగిపోవలసి వస్తుందేమో. ఇటువంటి వ్యవహారాలు తమరు లక్ష జూచివుంటారు. తమకు నేనా జెప్పేది. తమరే ఆలోచించుకోండి.

చౌ:- చిన్నవాడివైనా నీవు చెప్పినమాట యోచించ దగిందే. యిప్పుడేమంటావు?

స:- యీరోజు మామూలుప్రకారం పోనియ్యండి. రేపటి సంగతి ఆలోచింతాం.

చౌ:- చిన్నపరెడ్డి యేమనుకుంటాడోనే. ఈరోజుకు కూలి అస్సలే యియ్యకుండా దాటవెయ్యలేవా? రేపటికి భృగువు యీవత్తు తెలుస్తుందిగా.

స:- ప్రయత్నం చేతాం. కొట్టంలో కూర్చుంటే బాగుం టుందేమో.

చౌ:- అట్లాగే కూర్చుందాం.

స:- నాయుడుగారూ! తమరుగూడా దయచెయ్యండి.

చౌ:- రారా.

## ౧౮

### ముతరాచు ముసలిది

కూలిజనం వీధిలో మూగింది. కిందటిరోజున మునసబుగారింటిదగ్గిర కూలివిషయమై గలభాజరగడం, కూలివాండ్లు వారి చేనికి రామని కట్టుగట్టడం, దానిమీద మునసబు సర్దుకొని కూలి ముబాదలాగా యియ్యడం, యిచ్చినా శేషయ్యపార్టీ యెగత్రించి చౌదరయ్యచేనికి పోవడం వూళ్ళో పసిబిడ్డబాలాది అందరికి తెలిసి అట్టుడికినట్టుడికింది. ఈ వ్యవహారంలో మందికి తలకట్టుగావున్న చౌదరయ్య యీపూట యేమిచేస్తాడో చూదామని అలగాజనం చాలామంది పోగయినారు. చౌదరయ్య యీ జనాన్ని చూచి 'యిదంతా రభసలోకి దిగేట్టుగావుంది. అలగాజనంతో వేగడం కష్టం. పొరుగూరివాండ్లు నిలువబడకపోతే మనం లొంగిపోవడం, అదుగో చౌదరయ్య చేశాడోయ్ అని నలుగురిలో తలవంపులు వ్యవహారం కావడం, సంభవిస్తుందేమో' నని విచారిస్తున్నాడు. చౌదరయ్యా, నాయుడూ సరాసరి కొట్టంలోకి పోయి అరుగుపైన చాపమీద కూచ్చున్నారు. సంగదాసు కూలివాండ్లుమాత్రం లోపలికి రండని పిలిచాడు గాని యావత్తుజనం లోపలికి తోసుకున్నది. ఆడకూలీలంతా వోకచెంప నిలుచున్నారు.

చౌ:- జనమంతా తోసుకొచ్చేస్తే యెట్లా? కూలీలలో ముఖ్యమైనవాండ్లు ముందుకు రాండి.

శేషయ్యా, రంగదాసూ, వీరదాసూ ముందుకు వచ్చారు.

చౌ:- యీముగ్గురి యిష్టప్రకారం మీరంతా బోతారా?

కూలీలు:- వొప్పుకుంటాం. మేముగూడా యిక్కడవుండే వింటాం.

చౌ:- వీరదాసూ! నీవు జొన్నకూలికి పోతున్నావా?

పీ:- మరేనండి. కోరీలలో నీళ్ళు నిండినవి. రాతిపని జరగడంలేదు.

చౌ:- యింతమంది జనం మీమాటప్రకారం పోతామంటున్నారు. మీరు ముఠాలకు నాయకులైనందుకు అందరినీ జాగ్రతగా సగరొప్పుకోని రావాలె.

నాయకులు:- మరే, నామకా పెద్దలమే గాని వాండ్లకిష్టంలేకపోతే వినిపించే సత్తా మాదగ్గర లేదండి.

చౌ:- యేమంటారో చెప్పండి?

రం:- దొరలే శలవియ్యాండి. మే మేమి జెపితే సాగేటట్టుంది?

చౌ:- సాగకేమోయ్, చెప్పు.

రం:- నా దొక్కటే మనవండి. మీరు తండ్రులు, మేము బిడ్డలవంటివాండ్లం. మామూలుప్రకారం వెళ్ళబారిపోనియ్యాండి. యెందుకు మధ్య యీ లట్టాలు.

చౌ:- నేనూ లేడామనిషిని గాను. నలుగురితోపాటు మనమూనూ. యివ్వాళ గిద్దెడుగింజలు విడిగాలేవు. పాతరదీసి రేపు సాయంత్రం రెండురోజులదీకలసి యిప్పిస్తా.

రం:- యీపూట నలుగురముండి పాతరదీస్తాం. పొద్దున్నే యిప్పించండి. తలాబాక్కెడూ వండక తిని పొలంమీద బోతాం.

శే:- యీ రంగదాసు జమీందారీసెకలుపోతాడు. మా కీ పూట బోలెగాలదు యిప్పుడియ్యకపోతే.

కూలీలు:- శేషయ్య సరి, వున్నమాట తెగజెప్పాడు.

శే:- నాకీ వసవసలు పనికిరావు. వున్నమాట అనితీరాలే.

చౌ:- తొందర పడబోకవోయ్. శేషయ్యా! మా యిబ్బందులుగూడా మీరు చూడాలే.

శే:- మీ యిబ్బందులు చూచేమాత్రపువాండ్లమా? మా కడుపాత్రం మాది.

చౌ:- నేనేమి రోజులతరబడి ఆగమన్నాన గనుకనా. వీళ్లై నంతవరకు రేపుసాయంత్రమే యిస్తానంటుంటిని.

వీ:- పొట్ట చేతబట్టుకొని పొద్దున్నే యే ఆసామిదగ్గరకో పోతేనేగాని మాకు జరగదు. ఈపూట వస్తుపడుకొని పొద్దున యేమి పని చేయగలం.

చౌ:- నేను వూరికే మెత్తగా మాట్లాడుతుంటే మీరు పైకెక్కుతున్నారు. గాని మా ఆసామీలం మిమ్మును కూలికి పిలవకపోతే మీరేమిజేస్తారు ?

వీ:- ఈ గడ్డమీద బత్తెముంటే వుంటాం. తీరితే కాగర్లో అటూ దేశాలపాలై పోతాం.

శే:- ఆసాములు మమ్ములను కూలికి పిలవకపోతే కాస్త వెనుకాముందూ వారూ బయలుదేరవలసే వస్తుంది.

చౌ:- మాకేమి పోయినదాకా ?

శే:- పోకపోతే పొలాలు బీడుబెట్టుకొని గడ్డిమెయ్యాలె. మేము రేపుపొద్దున వెళ్ళి కొయ్యకపోతే మీ యిరవైయకరాల జొన్న మట్టిగలుస్తుంది. గనిమెలుతీసి నీళ్ళు గట్టకపోతే అయిదు వందల యెకరాల వల్లం యిగిరి చెక్కగడుతుంది. రేపు మీ జీత గాండ్లను బందుచెయ్యనియ్యండి. పొలాలు బీళ్ళుగాక ఏమాతవో?

ఒకకూలీ:- శేషయ్యమామ అతికేట్టు జవాబు చెప్పాడు.

చౌ:- వాడెవడోయ్ ? అంతా మొనగాండ్లయినారు.

రం:- వాడి మొగంలేండి పిల్లసన్నాసి. మా కష్టం తమకు చెప్పకోకపోతే యెవరికి చెప్పకుంటాం. మాకు యేరోజు కూలి ఆ రోజు కొంగులో బొయ్యందీ జరగదు.

చౌ:- అంత జరగనివాండ్లు యివ్వాళ మునసబుమీద సమ్మె యెట్లా గట్టారు ?

రం:- మాకు సమ్మె లేమున్నవండీ. కడుపులో యెత్తు లేకపోతే నడిచిపోలేక పడుకుంటాం.

చౌ:- మీ రంతగా చెప్పుతున్నారు గనుక నామాట మీరయినా వినాలె, మీమాట నేనయినా వినాలె. కోమటింట్లో యిప్పిస్తా పుచ్చుకోండి.

రం:- దొరలు యేదో వొకమార్గం జెయ్యాలెగాని లేక పోతే సన్నకారు బతగ్గలదా ?

చౌ:- సంగదాసూ ! వీండ్లకు తలావొక ఆరణాల గింజలూ యిప్పించు. లేడా వుంటే తరువాత చూసుకుందాం.

శే:- అయ్యా ! ఇట్లా మధ్య పెడితే సాగేరోజులు పోయిన వండి. మనిషికి పన్నెండణాల వంతున యిప్పించమనండి; కోమ టింట్లోనే ఆయెను.

చౌ:- దాసూ ! వాండ్లకంత నమ్మకం లేకుండావుంటే మనమే యిబ్బంది పడదాం. విడిగా గింజలేమయినా వున్నవా ?

సం:- హాసీహాసీగా వాండ్లకు సరిపోవచ్చు.

చౌ:- కొలిపించు.

చౌదరయ్య ఆవులదొడ్లోకి పోయి తనిఖీ చేస్తున్నాడు. సంగదాసు జీతగాండ్లచేత నాలుగుబస్తాలు బయట వేయించి కూలీ లకు కొలిపిస్తుంటే రామానాయుడు చూస్తూ కూర్చున్నాడు.

సం:- (కూలీల నాయకులను దగ్గరకు బిలిచి) చౌదరయ్య గారు కూలి మామూలుగా యివ్వడంచేత వూళ్ళోవాండ్లు కూడా యిస్తారు. రేపు సాయంత్రం చౌదరయ్యగారు బహుశా తగ్గిస్తా మంటారు. రేపు మీరు వూళ్ళో ముఖ్యమయిన ఆసామీల పొలా లకు మామూలు కూలి యేర్పాటుచేసుకొని పోండి.

శే:- సరే. మీమాట కింక అడ్డేమున్నది ?

రా:- దాసూ ! నీవు జూదం బాగా ఆడుతావా యేమి ?

సం:- ఈ జీవితమే జూదం.

రా:- జూదపుయెత్తులు వేయడం తప్పులేదన్నమాటే.

సం:- చేసేపని మంచిదయితే దుస్సాధనాలు వుపయోగించినా తప్పు లేదని కొందరంటారు గాని అది నే నంగీకరించను. ఒక కార్యం నిర్వహించ వలసివస్తే సామ దాన భేద దండోపాయాలు సమయానుకూలంగా వుపయోగించవచ్చు. సామోపాయం అన్నిటికంటె మంచిది. సాధారణంగా ముం దవలంబించ వలసిందిసీ, అయినా కార్యాలు కొన్ని దానివల్ల చక్కబడవు. అందువల్ల కార్యభంగమూ కావచ్చును. తక్కిన వుపాయాలు దోషాలనడానికి వీలులేదు. వుపేక్ష అనే పంచమోపాయం వొకప్పుడు వాటన్నిటికంటె యెక్కువ పనిచేస్తుంది.

కనిచీకటి పడ్డది. ఆదంసాహేబు గింజలుకొలుస్తున్నాడు. యింటిదగ్గర పిల్లలు యేడుస్తుంటారని కొందరు ఆడకూలీలూ, యింటికి దీసికొనిపోయి దంచి అన్నం వండుకోవలెనని మరి కొందరూ ముందు కొలిపించుకొని వెళ్లుతున్నారు. "నీవు నిక్కచ్చి మనిషివి. నీవు లేకపోతే యీపూట టోపీ పడేవాండ్లమే" అని కూలీలు శేషయ్యను పొగుడుతున్నారు. సంగదాసు నిప్పులలో దూకమంటే దూకుతానని శేషయ్య అన్నాడు. నాయుడుగారు పైకి అనకపోయినా అంతరంగంలో మనపక్షమేనని రంగదాసు వీరదాసుకు చెవిలో జెప్పాడు. యింతలోకి చౌదరయ్య తిరిగివచ్చే వరకు రామానాయుడు ఆయనతో గలసి యింటికి వెళ్లేసరికి అక్కడ రామానాయుడు హృదయాన్ని నీరుజేసిన చిత్రరంగం కనబడ్డది.

ఒకముసలిది—లచ్చక్క దొరసానీ !

లక్ష్మమ్మ:- ఎవరు నీవూ ?

ము:- నేను ముతరాచ ముసలిదాన్నమ్మా.—

రా:- అమ్మా నిన్ను లచ్చక్కని పిలుస్తారేమే ?

లక్ష్మ:- నేను యివ్వాళ యెంత పనికిరాని దాన్నైనా యిందాకా మీ నాయన మావంగసం మంచిదికాదని దెప్పినా మా అమ్మనమ్మ లచ్చక్క అనే ఆమె నలభై యేండ్లు సోల్పుగా జమీ యేలింది. ఆకలనే మాట ఆమెచెవుల వినలేకపోయేట,

చౌ:- ఆమెకు జమీందారీవుంది గనుక సత్రాలు పెట్టింది. ఆమె మోస్తరుగా నీవు సత్రాలు పెడతానంటే మట్టి పిసుక్కొని బతికేవాండ్లం మేము యెట్లా భరిస్తాం?

ల:- మీరు సత్రాలు పెట్టేవారే. కూలిగింజలకోసం ఇంత సేపటినుంచి ముగతికలు పడుతున్నారు.

ము:- వో లచ్చక్క దొరసానీ! నా మొరాలకించం డమ్మా. ఆకలికి ప్రాణాలు పోతున్నవి. ఇంత గంగ పొయ్యమ్మా.

చౌ:- యెవతో యిదొక వేషం వేసుకొని వచ్చింది. కోటి విద్యలూ కూటికేగా.

ల:- నీకు అన్నీ వేషాలే. యేమికే?

ము:- ఇవ్వాళకు ఏడురోజులయింది అన్నంతిని. యింత బొడ్డాకు వుడకబెట్టుకొని తిని బతుకుతున్నా. సోషకువచ్చింది. యింత గంజి పొయ్యమ్మా.

చౌ:- సోషవచ్చిందట. యిక్కడికి ఎట్లా నడచివచ్చిందో?

ల:- సిబ్బిలో అన్నం పెట్టుకొని వచ్చి-యిదిగో పట్టు.

ము:- ఏమిటమ్మా అదీ?

ల:- అన్నం.

ము:- అన్నం మింగుడు పడుతుందమ్మా యిప్పుడు?

చౌ:- అన్నం తెచ్చావుగాదూ! చల్లకూడా తెమ్మం టుంది. ఆ తర్వాత వూరగాయలు తెమ్మంటుంది. పెట్టే వెఱ్ఱి వాండ్లుంటే సరి.

ల:- నీవు అవతలికి పో - అయితే యేమంటావు?

ము:- ముందింత గంజిపొయ్యమ్మా, ధారకం అవుతుంది.

ల:- గంజి తెచ్చి- ఇదిగో గిన్నెతీసుకో.

చౌ:- ఈపెపన్నీ వేషాలు. గిన్నె యిస్తున్నది దానికి. వెండిగిన్నెనా?

ల:- వుందూ, నీవు వూరికేనూ ప్రతిదానికీ హేళన.

ముసలిది గిన్నెతీసుకొని ఆత్రంగా తాగబోయ్యే వరకు మింగుడుబడక వుక్కిరి బిక్కిరయింది.

ల:- (ముసలిదాని తలపట్టుకుని కూర్చొని) అయ్యో పాపం యిదేమిటే గుడ్లు తిరిగిపోతున్నవి ?

చౌ:- తెచ్చిపెట్టావు యేదో కొంపమీదికి. సోషకువచ్చి చస్తున్నదిగావాలె ? వీధిలోకయినా పట్టండి. మిద్దెలోగుండా శవాన్ని తీసుకపోవలసి వస్తుంది.

ల:- అబ్బా. నీవు అవతలికి వెళ్ళుదూ. అయ్యో పాపం. ఆకటికి ప్రాణం కడపట్టిందర్రా. నాయనా! రాముడూయిట్లా దీన్ని పట్టుకో, గొంతులోకి గంజి సాధకం జేతాం.

రామానాయుడు వెనుక ఆనుకొని కూర్చున్నాడు.

చౌ:- ఇకసరే. ( అని లోపలికి పోయినాడు. )

ముసలిది నోట్లోబడ్డ జావను కొంచెం చప్పరించింది. కొద్దిగా గొంతులోకి జారింది. మళ్ళీ నోరు తెరిచింది. కొద్దిగా మళ్లీ వేసేవరకు చప్పరించి మింగింది. యీప్రకారంగా నాలుగైదుసార్లు మింగేవరకు పేగులు గుర్రున అరచినవి. ముసలిది యిక తిప్పుకునే చిన్నెలు కనుపడ్డవి. కాని జావ కడుపులోకిపోయిన కాసేపటినుంచీ కాళ్ళు చేతులు కొంగర్లుపోయినవి మనిషి మొదటిమాత్రంగూడా లేకుండా కట్టెవలెబిగిసింది. వొళ్లు చెమటలు పట్టినవి. చలనంలేదు. అంత్యదశేనని అనుకున్నారు. చెమటవల్ల కొంచెం వేడితగ్గింది. వుభయులూ పట్టుకొని కూర్చున్నారు. తెమ్మెర వీచింది. భగవంతుడు స్వయంగానే వీచాడు. అయ్యో! పాపం తనబిడ్డమీద యెంతప్రేమ! కొంచెం సేపటికి కాలుగదిలింది. మరిరెండు నిమిషాలకు నిట్టూర్పు విడిచింది, తరువాత చింపిరినెత్తి గోక్కున్నది. యింకా కాస్తజావ పొయ్యమ్మా అన్నది. మళ్ళీ కాస్తజావ తాగినతరువాత రెండు మెతుకులు యెంగిలి పడతావా అంటే యిప్పుడు అరాయించుకోలేను, వొక్కకూరుకుబోయి లేస్తానన్నది. అంతట లక్ష్మమ్మ చాపకోసం పోగా చౌదరయ్య కోడలిచేత

అన్నం పెట్టించుకొని తిని చుట్టపొరదీసుకుంటూ ముంగిటిలోకి వచ్చి గద్రున తేపాడు.

రా:- నాయనా ! ముసలిది బతికింది.

చౌ:- పోనీ. వుద్ధరించింది. యిక భూములు యేల్తుందిగావాలె.

రా:- కిందనే పడుకుంటున్న దే !

ల:- యిదిగో చాపతెస్తిని.

చౌ:- ఓహో ! ఆవిడకు పవ్వళింపుసేవ జేస్తున్నారూ ! తల్లికీ కొడుక్కూ బాగాదొరికింది సేవ. ఇగనైనా అన్నానికి పోతారా. మీరీసంబ్రంబంలో వున్నారు. యిప్పుడల్లా వచ్చేటట్టు లేదని ఆకలవుతుంటే తినివచ్చాను. (అంటూ అక్కడ వాల్చివున్న మంచం మీద చల్లగాలికి పడుకున్నాడు.)

ల:- (మెల్లగా) నేనిక్కడ వుంటాగాని ; నీవు లేచి అన్నం తిను. ఆయనలేచి సణుగుతాడు.

రామానాయుడు పోయి భోజనానికి కూర్చున్నాడు. ముస లమ్మ దీనాలాపం, కండ్లు తిరగడం, కొంగజ్లపోవడం, అదే ఆలా పనగా వున్నది. ముసలమ్మస్థితి జాలిపుట్టించింది గాని తండ్రి యింత కనికరం లేకుండా వున్నాడేమా అని యెక్కువ జాలిపుట్టింది. లోకంలోవుండే దుఃఖాన్ని బాధనూచూచి జాలిపడక పోగా యింత నిరసన గలగడం యెందుకా అని ఆలోచించాడు. కావలసి నన్ని ధనధాన్యాలున్నవి. తలచుకొంటే యెంతమందకో బాధ నివారణ చేయవచ్చు. యితరులకు బాధలువుంటవన్న గమననే ఆయనకు లేదు. యితరులకు బాధలున్నవేమోనని తెలుసుకోవటా నికి ప్రయత్నంగూడా చేయడు. ప్రయత్నం జేసినా గ్రహించేశక్తి కూడా ఆయనకు లేదనుకుంటాను. హృదయశూన్యుడు. నిజంగా విచారిస్తే దయా సత్య శౌచాలు లేనిదే దారిద్ర్యంగాని ధన ధాన్యాలు లేనిదిగాదు.

రామానాయుడు భోజనంచేసి వచ్చేవరకు ముసలిది అన్నం తింటున్నది. మజ్జిగన్నంతో దేహం పూర్తిగా స్వస్థపడ్డది.

రా:- అవ్వా మీ దేవూరు ?

ము:- యీవూరే నాయనా.

రా:- నీకు బిడ్డలు లేరూ ?

ము:- వొక కొడుకుండేవాడు. వరికోరి వొక పెళ్ళాన్ని చేసుకుంటే అది వొకణ్ణి తీసుకోని లేచిపోయింది. అంతటితో వాడికి ప్రపంచంమీద భ్రమే పోయి కొంపా గోడూ వదిలిపెట్టి యెక్కడనో మఠంలో గలిసిపోయినాడు. చచ్చిపోయినాడని జాడా తెలిసింది. బాగుచేసే నాథుడు లేక ఆస్తి యెక్కడిదక్కడ కుందకమై పోయింది. యిక్కడికి పదేండ్లనుంచీ నా రెక్కలమీద జీవిస్తున్నా. వొకరోజు కొండకుబోయి కానీ పుల్లరిచ్చి తవ్వెడు కలేపండ్లో పరిగెపండ్లో పుల్జెరుకాయలో తెచ్చుకోని మరునా డమ్ముకోని తవ్వెడు గింజలువస్తే రోజుకు సోలెడుగింజలు జావ కాచుకోని తాగుతూ రోజులు గడుపుతున్నా. ఆ నారాయణ మూర్తికి యెప్పుడు దయ వస్తుందో అని కనిపెట్టుకోని వున్నా. వూరు దూరమైనకొద్దీ కాడు దగ్గరవుతుందిగదా.

రా:- యేడురోజులనుంచీ అన్నం లేదంటివే అది యెందువల్ల ?

చౌ:- (మంచంమీదపరుండి యీ కథంతా వింటూ) ఆ కథ మీరన్నం పెట్టడంకోసం కల్పించింది. మీరుమళ్ళీ అడిగే వరకు కొత్తకథ వచ్చింది. యెందుకూ మీకాపె చరిత్రలన్నీ ? చెవులు దోరలుబెట్టుకోని మరీ వింటున్నారు. పుణ్యమా ? పురుషార్థమా ?

ము:- నే చెప్పినదాంట్లో చింతాకంత అబద్ధంలేదు. చావ డానికి సిద్ధంగా వున్నా కదా.

చౌ:- చావడ మేమిఖర్మం. ఆకు తిరగబడ్డది. యీ రోజు నుంచీ మళ్ళీ కొత్తకవులు ప్రారంభం. శాశ్వితంగట్టా అడక్కపోయి నావూ? నీవు లేకపోతే లోకానికి యెంతలోటూ. యిట్లాగే వెర్రి వాండ్లు దొరికితే కథలుచెప్పి బతుకుదువుగాని.

ల:- ఆమాటలతో నీకెందుకు ? నీసంగతి పూర్తిగా జెప్పు.

చౌ:- నే నిద్దరబోతాలెండి. వింటే యేదో అనవలసి వస్తుంది.

ము:- వారంరోజులనాడు కొండకుబోతే యెవరో కొత్త యిజారాదారు పాటబాడాడు. ఆయన వారంరోజులదాకా చీట్లియ్య డన్నారు. నాకు యెడమచెయ్యిగూడ నొప్పి. పైకిలేవదు. యేమి పని చెయ్యగలను ? ముష్టికి పోవడానికి మనసొప్పక - యెన్నడూ ముష్టికి పోయిందాన్ని కానమ్మా - మాకులంలో తప్పు - పూర గొండకుబోయి యింత బొద్దాకు కోసుకొని వుడకబెట్టుకొని తింటున్నా. రోజూ అదే తింటే ననపక పాసనాలు బుట్టినవి. అందువల్ల బొద్దాక్కు పోలేకపోయినా. పొద్దుగూకేనరకు సోషకు వచ్చింది. ఎంత ముసలిదానికైనా ప్రాణమంటే తీపికదా. నీ వాకిట్లో వచ్చిపడ్డా. మీంకడుపులు చల్లంగా యిప్పటి కీ స్థితిలో వున్నా. రేపేమి గావలసివున్నదో (అని కునికి పాట్లుపడ్డది.)

రా:- ఇందాక అన్నం కొద్దిగా తిన్నావే. మళ్ళీ కొంచెం తింటావా ?

ము:- వారంరోజులనుంచీ అన్నం తినకపోవడంచేత ఇంకా దింటే హరాయించుకోలేను. కడుపులో నొప్పి పుడుతుంది. మీరు పోయి పడుకోండయ్యా నేనిక్కడే పడుకుంటా.

రా:- కప్పుకోవూ ?

ము:- అలవాటు లేదు.

రా:- చలిలేదా ?

ము:- మొదట ఉండేది. కప్పుకోడానికి గుడ్డలేక చర్మం బిరుసెక్కి చలి దూరనియ్యదు. తమరు బోయి పండుకోండి.

# ౧౯

రామానాయుడు మేడమీదికి పోయినాడు. మేడమీది సావిట్లో దీపం వెలుగుతున్నది. మెట్లదగ్గిరి తలుపుమూసి సావిట్లో పడక కుర్చీమీద పడుకున్నాడు. కూలివాండ్లూ, ముసలమ్మా జ్ఞాపకంవచ్చారు. "ముసలమ్మకు చలేలేదట. అలవాటు దప్పి అన్నమే తినలేకపోయింది. చలిమటుకు అలవాటు దప్పదా? ముసలమ్మ దురవస్థ సంగదాసుచూస్తే అలపటించేవాడు. అతడు చిత్రమైనమనిషి. మంచి మేధావి, యోగ్యుడు. దయాదాక్షిణ్యాలపరిమితంగా వున్నవి. నిర్వహించే నేర్పులేనిది పరోపకారబుద్ధి వుండి ప్రయోజనమేమి? వొకకార్యం పూనుకున్నాడంటే వేయి కండ్లతో కనిపెట్టి పనిచేస్తాడు. రేపటికేమి ఆలోచన చేస్తున్నాడో కనుక్కుందా"మనిగడియారంవంక చూచేవరకు పన్నెండుగావస్తూ వున్నది. "నేను మధ్యాహ్నం తెగ నిద్రపోయినాను. అతడు దేహం వాల్చలేదు. అయినా చూతా"మని మేడదిగి సంగదాసు గది దగ్గరకు పోయేవరకు తలుపుసందులగుండా వెలుతురు వస్తూ వున్నది. కొంచెం నిదానించిచూస్తే లోపల దగ్గినట్లు వినపడ్డది. తలుపు మునివేళ్ళతో గొట్టి బాసూ! అని పిలిచాడు. దాసు లేచి తలుపు దీసి,

సం:- నీవు యింకా మేలుకొనేవున్నావా?

రా:- నాకు నిద్రపట్టలేదు. నీవూ పడుకోలేదేమి?

సం:- ఇద్దరం వొక అవస్థలోనేవున్నాం. నిద్రపట్టించుకో.

రా:- పైకి పోదాం రా?

సం:- ఇశ్శో! అబ్బా! నే రాలేనండీ.

రా:- ఇంతవరకూ బాగా మాట్లాడి యిప్పుడు ఆపసోపాలు పడతావేమి? హాల్లో నిన్ను కట్టివేయనులే. సాయంత్రం కూలివిషయంలో న్యాయపద్ధతి సంగతి యెత్తి వదిలిపెట్టావు. చెప్పుదువుగాని రా.

సం:- మంచి లగ్నం బెట్టారే. పొద్దున మాట్లాడగూడదూ?

రా:- వస్తావా రావా?

తలుపు తాళంవేసి వుభయులూ మెల్లెక్కుతున్నారు. చౌదరయ్య యీవగలవాడు. రామానాయుడు వీధిమెట్లు దిగడం గనిపెట్టి యేమో కుట్రహాడు వొంటరిగా వున్నాడు గదా అని వూరుకున్నాడు. మళ్ళీ యిద్దరు మనుష్యులు మెల్లెక్కినట్లు వినపడ్డది. వుపేక్షించి వూరుకున్నాడు. రామానాయుడూ, సంగదాసూ చెట్టాపట్టాలు పట్టుకొనివచ్చి సావిట్లో కుర్చీలమీద కూర్చోవడం కిటికీలోగుండా కనుపడ్డది. మనిషి కుప్పలు గూలిపోయినాడు. 'వీరివ్యవహారం శ్రుతిమించి రాగానబడ్డది. అయినా చూతాం' అనుకున్నాడు.

రా:- దాసూ! సాయంత్రం ఒకముసలమ్మ సోషవచ్చిపడ్డది. నీవుచూస్తే మూర్ఛపడిపోదువు.

సం:- నేను చూస్తూనేవున్నా. యిటువంటివి మాపల్లెలోఅనేకం జరుగుతుంటవి. ఆముసలమ్మ మీయింట్లో పచ్చిపడ్డది గనుక బతికిందిగాని మాపల్లెలో యీవిధంగా అనేకులు రాలిపోతూనే వుంటారు. వాండ్ల అవస్థ యెండాకాలంలో వుంటుంది. కప్పలవలె యెండి జీవంతో వున్నవాండ్లు చినుకులు పడంగనే బెకబెకలాడి మీ ఆసాములకు పంటలు పండించడానికి వస్తారు.

రా:- దాసూ! లోకవిషయం తెలిసినకొద్దీ నాకు మనసులో వేదన యెక్కువవుతున్నది. వీండ్లకు దిక్కేమి?

సం:- నేను దేవుడే యేడుగడని తలంచేవాణ్ణి. తిక్కన జెప్పిన మాటే నిజం.

కం. కారణము లేకయును నుప
కారపరత్వమున నొరులకార్యంబులకున్
వారని యలజడివడియెడు
వారలనూ యేచుగడయు వసుధకు నధిపా.

యీ సిర్భాగ్యులకొరకై అర్థరాత్రియందూ ఆవేదనపడే మీబోటి పరోపకార పారీణులే దిక్కు. పాపమేనత్త యీరోజు ఆసుపత్రిలో చచ్చిపోయిందట విన్నావా ?

రా:- అయ్యో ! పాపం. ఆసుపత్రిలో శస్త్రం జేయలేదా ?

సం:- గూడదాకా కుళ్ళి శస్త్రానికి వీలుగాలేదట.

రా:- కేసు పెట్టించి నేరస్థులను శిక్షించకపోతే యేమి ప్రయోజనం ?

సం: అదీ అంతగానే వున్నది. మొదట మావాండ్లు యీ కేసు రిపోర్టే చేయలేదు. అంథేరాగా వూరుకొన్నారు. చచ్చిపోక ముందు డాక్టరు మరణవాఙ్మూలం పుచ్చుకున్నాడట. అదన్నా వుంటే కొంతపని జరిగేది. మీనాయన కక్షచేత మాకు వూతమిచ్చి తనమీద పనిచేయిస్తాడేమోనని మునసబు నిన్నసాయంత్రంబోయి డాక్టరును కట్టుకొని అయిదువందల రూపాయలు ఖర్చుపడి వాఙ్మూలం తీసిపారవేయించి శస్త్రంజేస్తే వాయి గమ్మి చచ్చిందని వ్రాయించాడట.

రా:- ఈ నేరస్థులు శిక్షనుపొందే మార్గమేమిటి ?

సం:- దేవునికే వదిలిపెడదాం. భాగ్యవంతులు ఆయనను గూడా లోబరుచుకోకపోతే వచ్చేజన్మలోనైనా శిక్షిస్తాడు.

రా:- దాసూ ! నాకు రానురాను మనసు వికలమైపోతున్నది. ఇంకోజన్మలో శిక్షిస్తాడంటావు. ఏజన్మలో శిక్షించినా యీ తప్పు జేసినందుకు యీశిక్షని తెలిసేటట్టు శిక్షిస్తే ప్రయోజనమున్నదిగాని వూకవుమ్మడిగా సంచితమంతా వొకగాదెలోబోసి ప్రారబ్ధమని పేరుబెట్టి జన్మబత్తెం చేటలోబోసి తినమంటే యేమి ప్రయోజనం ? శిక్ష త్వరగా అనుభవించినా, ఆలస్యంగా అనుభవించినా, ఇందుకని తెలియకపోతే శిక్షించిన ప్రయోజనంగూడా లేకపోయింది.

సం:- నేనుత్వరగా భగవంతుడి దగ్గరకుబోయి యీపద్ధతిని మార్చమని సవరణ నిమిత్తం దరఖాస్తన్నా పడవేస్తా.

రా:- ఆయనను పురాణ పురుషుడని పేరు. యిన్నాళ్ళనుంచీ నేర్చుకోంది కొత్తగా ఆయనకు రావచ్చిందా. 'నేనింత పెద్ద వాణ్ణి. జిల్లేడు లేవు. నాకు నీవు సలహా చెప్పవచ్చావా' అని నీ దరఖాస్తు తోసివేస్తాడు. అందాకా యెందుకు? యిక్కడనే పది కాలాలపాటు బతికి యీ నిర్భాగ్యులకు వుపకారంచేస్తూ చాలూ.

సం: అది మనవశమా?

రా:- అట్లా అంటివేమి?

సం:- యేమన్నా?

రా:- నీవు వశమా అన్నప్పుడు నీముఖం యేదో పాలిపోయి నిర్జీవంగా కనపడ్డది.

సం:- దాని కింతాలోచ నెందుకు? వుత్తరక్షణం మంది గాదు. నా ప్రయాణానికి అడ్డంకి వచ్చిందే. అది తీర్చుకోవద్దా?

రా:- ఏమి అడ్డు వచ్చింది?

సం:- శవాన్ని రేపుతెల్లవారేవరకు యిక్కడికి తీసుకొని వస్తారుట. మేము కాకులకు వేసేవాండ్లంగాదు. శవాన్ని పాతవేసి కలాపమంతా వగదెగి వచ్చేవరకు రైలు మిగులుతుంది.

రా:- నాకు వొకలాగ తోస్తున్నది. నేను వుదయంబండికి వెళ్ళి కమీజులకూ, కుడితినీలకూ గుడ్డపట్టించుకొని సిద్ధంగా వుంటాను. నీవు సాయంత్రం యెనిమిదిగంటల బండికి వస్తే భోంచేసి వెంటనే రైలెక్క వచ్చు.

సం:- నేను నాలుగురోజులు పనిలోకిరానని మీ నాయన గారితో చెప్పివస్తాను.

రా:- రేపు మనమిద్దరమూ యిక్కడ లేకపోతే కూలీల వ్యవహారం చెడుతుందేమో?

సం:- యేమవుతుంది? పరికోతలదాకా నెడుతుంది. మనం యిప్పుడే వెళ్ళడం అవసరం.

రా:- మానాయనగారు యీ విషయాన్ని దాక్షిణ్య దృష్టితో చూడడానికే ప్రయత్నించరు ఆయనవిషయమై మనం ఆశ వదులుకోవలసిందే.

సం:- అంతవరకు స్పష్టమే. అక్రమమైనా తనకోపు నిర్వహించుకోవాలెనని బాగా పట్టుదలగూడా వున్నట్టున్నది. చిన్నప రెడ్డి కొంచెం పట్టువిడుపులు గలవాడు. మీ నాయనగారు వుత్తి యందీ ఆయన పైకిరాడు. మీ నాయనగారిని మార్చడం నాచేత గాదు. ఆయనహృదయవీణకు తీగెలుంటే సప్తస్వరాలు విజృంభింప జేసి నవరసాలు పొలికేటట్టు పలికించేవాడిని. శ్రీ కృష్ణునియొక్క వేణుగానం సహితం ఆయన హృదయశైలాన్ని ద్రవింపజేస్తుందని నాకు నమ్మకంలేదు. దుర్మార్గుడు లోకానికి విభ్రమం గలిగే టట్టుగా ధర్మశూరుడికి అపాయంజేసి అందువల్లనే ధర్మప్రతిష్ఠాపనకు తోడ్పడడం తటస్థించినప్పుడో లేక స్వార్థపరుడు తన స్వప్రయత్నాలకూ స్వగౌరవానికీ పూర్ణమైన వ్యాఘాతం కలిగేటప్పుడో లొంగిపోవచ్చు. ధర్మవిజయ మెప్పుడూ బలిగోరుతుంటుంది. ధర్మ నిర్వాహణకై సోక్రటీసు విషం గ్రహించాడు, క్రీస్తువు శిలువ నెక్కాడు, ప్రహలాదుడు సమస్త కష్టాలు పడ్డాడు, హరిశ్చంద్రుడు సర్వత్యాగం చేశాడు, అమరుడు శిరచ్ఛేదం బొందాడు, రామానుజ శిష్యుడు అంధుడైనాడు, సారంగధరుడు కరచరణచ్ఛేదమును బొందాడు, కన్యక అగ్ని ప్రవేశ మయింది, హేమలత ఆత్మహత్యగావించికొన్నది, తిలక్ మహాశయుడు నిరంతరకారాగార బద్ధుడైనాడు. పశువధ లేనిదీ యజ్ఞంలేదు. పశువు లన్నింటికంటె వుత్తమమయింది స్వార్థపశువు.

రా:- నాకొక సందేహం బాధిస్తున్నది. నీ విచ్చిన దృష్టాంతాలవల్ల బలమైంది. పాపకర్మలకు శిక్ష వున్నదా?

సం:- పాపములు కొన్ని వాకొకరిని బాధిస్తవి. మరి కొన్ని లోకకంటకాలుగా వుండి అనేకులను బాధిస్తవి. ఒకొక వ్యక్తినిమాత్రం బాధించేపాపాలకు వెంటనే సాధారణంగా శిక్ష కను

బహుతుంది. గాని ధర్మాన్ని నిరోధించే లోకకంటక కార్యాలకు శిక్ష వెంటనే కనబడదు. శిక్షలు భిన్నంగావుంటవి. ధర్మనిరోధ ప్రయత్నంలో బాధ కలుగజేసేవాండ్లకూ, బాధపడే వాండ్లకూ ప్రత్యేక వ్యక్తిత్వముండదు. ప్రత్యేక వ్యక్తులయొక్క-జయాపజయాలకు ధర్మవిజయంతో సంబంధం లేదు. భారతయుద్ధములో వుభయపక్షాలపోరుతుండే మహాపురుషులూ నశించారు. పాండవులది ధర్మపక్షమయితే వారిపక్షంవా రేల నశించారు? కౌరవులది అధర్మపక్షమైతే వారివైపున కొందరేల మిగిలారు? అని ప్రశ్నలు పుట్టడానికి అవకాశం లేదు. యెందువల్ల? భారత యుద్ధంలో ప్రత్యేక వ్యక్తులకు పోరాటంలేదు. ప్రాణస్నేహితులు సహితం తమస్నేహాన్ని విడువకుండానే వుభయపక్షాల వుండి పోరాడారు. విజయం ధర్మపక్షమయిన పాండవపక్షాన నిలిచింది. ఆ విజయం పాండవపక్షంవారి కందరికీ కలిగినట్లే. దుర్యోధనుని అపజయం రథికత్రయానికి కలిగినట్లే. పైనజెప్పిన మహానుభావులు పడిన బాధలు వారికపజయములు కావు. వారుపూనిన ధర్మానికి బలియై ధర్మస్థాపనకు మార్గమేర్పరిచారు. వారిశత్రువుల కదీ అపజయమే. ప్రత్యేక వ్యక్తుల పాపపుణ్యాలగూర్చి మనమిప్పుడు విచారించవలసి వున్నది.

రా:- ఆప్రశ్న నిలిపి కూలీలకు న్యాయంగా యెంత రావలసి వుంటుందో చెప్పు. నిన్నసాయంత్రం యీవిషయం ఆపివేశావు.

సం:- ఇప్పుడు పనివాండ్లకిచ్చే కూలిచాలదు. యంత్రాలల్లో పనిజేసే కూలీలకు సంవత్సరం పొడుగునా పనివుండి కూలి విడువకుండా దొరుకుతుంది; వ్యవసాయపు కూలీలకట్లాగాదు. వ్యవసాయదారుకు సంవత్సరంలో వొకటిరెండు తరుణాలలో పంటయావత్తూ చేతికి వస్తుంది. మెట్టపైర్లకు వేసేటప్పటి కంటే కోసేటప్పుడు కూలీల అవసరమెక్కువ వుంటుంది, పునాసా, పయిరా అని మెట్ట పైర్లు రెండుకాలములలో రావడంచేత రెంటికోతలకూ కూలీ లవసరమౌతారు. పల్లపుపైర్లకు ఆభేదం లేకపోయినా నాట్లకూ కోతలకూ రెండుసార్లు కూలీలు కావలసి వస్తారు. కొంచెం పెద్దవ్యవ

సాయం గలవాండ్లకు సంవత్సరపు జీతగాండ్లు వ్యవసాయం చేస్తుంటే ఆసామి తనిఖీ చేస్తుంటాడు. సన్నకారు రయితులు జీతగాండ్లపని కూడా తామే చేస్తారు. సాధారణంగా భూమిలో పండే పంటకు నలుగురు హక్కుదార్లున్నట్లు తెలుస్తుంది. మందీ లేక ప్రభువూ అసలుహక్కుదారుడు. అతనివల్ల కవులుపొంది వ్యవసాయం తనిఖీ చేసే ఆసామి రెండవవాడు. వ్యవసాయపు పనులునిర్వహించే కమతగాడు లేక జీతగాడు మూడవ హక్కుదారుడు. నాలుగవవాడు కూలి. ప్రస్తుతపు స్థితిగతులుబట్టి పైనలుగురిలో మొదటివారు తరువాతవారికంటె యెక్కువ ప్రాముఖ్యతను గలిగివున్నారు. నిజం విచారిస్తే ప్రాముఖ్యత పైవాండ్లకంటెతరువాతివాండ్లకే యెక్కువ యివ్వవలసివుంటుంది. లేక భూమిహక్కునుబట్టి విచారిస్తే మొదటి వారికీ పనినిబట్టి విచారిస్తే చివరి వారికీ, ప్రాముఖ్యత యీయ వలసిఉంటుంది. జీతగాండ్లు లేనిచోట రెండుమూడు సంఖ్యలవారు వొక్కరుగానే ఉండవచ్చు. తనిఖీదారుకు తన కవులు హక్కు మాత్రమే గాకుండా పశువుల పెట్టుబడికూడా పెట్టవలసి ఉన్నది. గాలం మగపశువులకు ఆడపశువులకు వదలిపెట్టే యెడల యెరువు అందరు హక్కుదారులకూ ఉపయోగించినా ఆడపశువులకు పుట్టిన మగదూడలు యెద్దులలో నశించినవానికింద తీస్తే శేషించిన ఆడదూడలూ పాడీ ఆసామికి లాభంకింద వస్తుంది. ఎద్దుల పెట్టుబడికి ఈ లాభమే సరిపోవచ్చు. కాబట్టి పండిన పంటలో వొకటి రెండు సంఖ్యల హక్కుదార్లకు మూడవ వంతు. కూలీలకు మూడవవంతు కమతగాండ్లకు పూర్వపు మామూలు ప్రకారము నాలుగోవంతు, మిగిలిన పన్నెండోవంతు, తనిఖీకిందగాని యెద్దుల పెట్టుబడికిగాని పంచిపెట్టవలసి ఉంటుంది. న్యాయంగా చూస్తే తనిఖీదారుకు తనిఖీ హక్కు పెట్టుబడిహక్కూ దప్ప యితర హక్కులు లేవు. కౌలు హక్కు నామమాత్రం. ఒకటవ హక్కుదారుడు జవాబు మాత్రం చేయవలసి ఉంటాడు. కూలివాండ్లకు వచ్చే మూడవ వంతు ఆదాయము మక్తాగా కూలీలకిస్తే మామూలుకంటె యెక్కువ త్వరగా పని ముగించి పనిలేనప్పుడు ఉపయోగించుకుంటూ తమ

విరామకాలమును యిప్పటివలె పశుప్రాయులుగా ఉండకుండా తమ జ్ఞానాభివృద్ధికి దేశక్షేమ నిమిత్తం పాటుబడడానికీ రాజకీయ సాంఘిక మత వ్యవహారాలలో జోక్యం కలిగించుకోవడానికీ ఉప యోగ పడుతుంది. అట్లా గాకపోతే కృషి వాణిజ్య పాశుపాల్యా దాయములు కొందరి చేతులలోనే చిక్కి మఱికొందరు సంవత్సర మున కారునెలలు అన్నంలేక మాడుతుంటే మరికొందరు భోగ పరులై అమిత ప్రయాణాలు చేయడానికి అవకాశములు కలుగు తున్నవి. కూలీలకు చదువువస్తే కూలిపని చేస్తారా అని కొందరికి సందేహం. తెల్లవాండ్లలోనూ జపానులోనూ యెక్కువ కూలిచ్చి యినా చదువుకున్న పనివాండ్లు కావలెనంటారు. ఇప్పటి పరిస్థి తులు మారడానికి సంఘధర్మాలు గూడా అడ్డం వస్తున్నవి. అల గావాండ్లకు అన్నం దొరికే మార్గం జూపందీ సాంఘిక హక్కు లిచ్చినా ప్రయోజనకారులుగావు. అవి నిలుపుకొనే శక్తిగూడా వారికుండదు. "సర్వేగుణాః కాంచన మాంశ్రయంతే" అని ధనాకర్షణ మార్గాలు చూపించంది, తక్కిన మంచిగుణాలు అలవాటుపడవు. కాబట్టి అలగాజనుల అర్థసితి బాగుజేయడానికి ముందు ప్రయత్నాలు చేయవలసి ఉంటుంది. చేతిపనులు మొదల యినవి నేర్పి కొందరికి వృత్తులు గల్పించవచ్చు. కాని అది ప్రస్తుత విషయం గాదు.

రా:- సంగదాసూ! నీవిక వెళ్ళి పడుకో. నీవు బద్ధకించినా బలవంతపెట్టి తీసికొని వచ్చినందుకు క్షమించు.

సం:- నా బద్ధకమెంత. పొద్దున నీవు ప్రయాణం జేయ వలసినవాడవు. నిద్దరబో. ఇప్పుడువెళ్ళి నే పడుకుంటే ఈ విష యాలు తెల్లవారి నే మళ్ళీ రమ్మన్నదాకా నా మనసుకు రావు. నా కవసరమని తోస్తే ఈ తలంపులన్నీ తోసివేసి సాయంత్రం ఏడుగంటలకే నిద్రపోగలను. ఈ అలవాటు లేకపోతే ఉద్యమాలు నెత్తిన వేసుకొని తిరిగేవాండ్లకు నిద్రాభంగమై ఆరోగ్యం జెడు తుంది.

రా:- నాకది చేతగాదు. ఈ రాత్రి నాకు నిద్రపట్టుతుందని తోచదు. అయినా ప్రయత్నిస్తాను.

ఇద్దరూ లేచి తమ గదులలోకి పోయినారు.

చౌదరయ్య తూచాలు బోకుండా విన్నాడు. సంగతులన్నీ మననం జేసి ఆలోచించాడు. మాలవాడు పిల్లవాణ్ణి చెడగొట్టినట్టే. వీడి సావాసం వదిలించి వేరే వ్యాపకంలో పెడితేనేగాని కుదట బడదు. రామేశంగారితో మాట్లాడి పిల్లవాడిని మెడలు విరిపించి ఉద్యోగంలో ప్రవేశపెడితే ఆ ధోరణిలోదిగి పడి వుంటాడు. వీండ్లి ద్దరూ రేపు ఊరికిపోవడం బాగానే వున్నది. ఏ గురువునో చూచి వస్తారు. ఈ లోగా కూలీల వ్యవహారం ఫైసలు చేసుకోవచ్చు. ఈ రోజు కూలి పూర్తిగా యిచ్చాం గనుక రేపు ఊళ్లోవున్న కూలీల నందరిని పోగుజేసి జొన్నకోత పూర్తిజేయవచ్చు. ఏమ యినా కురదలావుంటే జీతగాండ్లు నెమ్మదిగా కోస్తారు. రేపు సాయంత్రం ఆరణాలకాడికి యిష్టముంటె వుచ్చుకోండి, లేకుంటే మానండని బెట్టుబెడితే సంగడు వుండడుగనుక దక్కినస్తా తీసు కుంటారు. ఎల్లుండినుంచి ఊళ్ళో ఆ ప్రకారమే జరుగుతుంది. వోపలేనివాండ్లకు వద్దనేవాండ్లు కన్నతల్లి. ఒకదారిబెట్టి సాగిస్తే యెక్కువ యిస్తాననే వెఱ్ఱి ఆసామి యెవడూ వుండడు. పోతుగడ్డ మనవూరు నిలిస్తే తక్కిన వూళ్ళు నిలవడానికేమి? నలుగురు కూలీలూ వొప్పుకొని పని జరిగిపోయిన తరువాత ఆందోళన చప్ప బడుతుంది. వరికోత లప్పటికి కొత్తపద్ధతి పాతబడిపోతుంది. మాల వాడు మట్టుకు కెర్లిస్తూనే ఉంటాడు. వాడెప్పటికైనా గడ్డే.

## ౨౦

మాదిగన్నం

సంగదాసు చీకటితో లేచి యింటికి బోయినాడు. రైలుకు వెళ్ళడానికి అయిదు గంటలకల్లా యెద్దుబండి వాకిట్లో నిలవబడ్డది. వెంగన్న ట్రంకుపెట్టె బండిలో పెడుతున్నాడు. రామా నాయుడు తల్లితో చెప్పి బండెక్కడానికి వాకిట్లోకి వచ్చేసరికి

తండ్రి అదివరకే యెక్కడికో వెళ్ళి వాకిటిదగ్గిర యెదురుగా వచ్చాడు. రామానాయుడికి ఆయనను చూడంగనే మనస్సులో డక్కుమన్నది. యేమన్నా అనసీయడని మెల్లగా 'నాయనా! నేను రైలుకు పోతున్నా' నన్నాడు. 'సరే. వచ్చేటప్పుడు పిల్లలను తీసికొనిరా' అని చౌదరయ్య లోపలికి బోయినాడు. రామానాయుడికి ఆశ్చర్యమైంది. పిడుగులు వర్షిస్తవని భయపడ్డందుకు మబ్బు తేలిపోయింది. బతుకు జీవుడా అని బండిలో బడ్డాడు. తానెక్కడికి బోయేదీ తెలియకపోవడమే యీ శాంతానికి కారణమై వుంటుందని వూహించి రైలందదేమో యెద్దు నదిలించమని వెంగన్నకుజెప్పి కునుకుతూ జేరగిలబడి కూర్చున్నాడు. 'జా' అని ఒకపర్యాయం తోకమట్టకదిపి వెంగన్నగూడా ట్రంకుపెట్టెమీదికి వొరిగాడు. యెద్దుగూడా కొంతసేపు అడుగులు లెక్కపెట్టి విసుగెత్తి బండి లంకలోకి తొలిగించి వూరుకోవడ మేమని మెయ్యడం ప్రారంభించింది. రామానాయుడు దీర్ఘాలాపనలోబడి హృదయం తండ్రి యెదురుపడ్డప్పుడు గుండె గబుక్కుమనడం గుర్తికి వచ్చి తుళ్ళిపడిలేచి వెంగన్న నిద్రబోవడం జూచి తమ ముగ్గురిలోకి యెద్దే బుద్ధిమంతురాలని వెంగన్నను లేపేవరకు, అతడు గొణుగుతూ 'నన్నేమి చెయ్యమంటావు? బండి అరకై ఆగిపోయింది. వెనక్కు సర్దుకోం'డని తరమడం ప్రారంభించాడు. బండి గేటుదగ్గిరకు వొచ్చేవరకు రైలు వచ్చేవేళయిందని పోర్టరు పెండెం దియ్యలేదు. బండి అక్కడ ఆపి ట్రంకు వెంగన్న నెత్తిన బెట్టి రైలుకట్టమీదుగా స్టేషనులోకిబోయి టికెట్టు తీసుకుండేవరకు రైలు పొడగట్టింది. ట్రంకు రైలులో బెట్టించుకొని జాగ్రతగా కూర్చున్నాడు. అది వేగానికి పేరుబడ్డ దక్షిణ మహారాష్ట్రి రైలు. మందగమనంయొక్క రీతులుజూపింది. తాగుబోతువలె ముందుకు వూగింది. పక్కలకు సోలింది. సంగీతం బాడి వెనుకకు తట్టుకున్నది. నిలువబడ్డది. నీళ్ళు వెళ్ళగాసింది. పొద్దుటిమోస్తరుగా లంకలోకి దిగి మేతమేస్తున్నదేమోనని రామానాయుడు తొంగిచూచాడు. మేత మేయడంలేదు. కాని నీళ్ళు తాగుతున్నది.

అలుపు తీర్చుకున్నది. తటతటలాడి కొంతదూరం పరుగెత్తి స్టేషనులో ఆగింది. తూర్పుబండి అప్పుడే వస్తున్నది. షుమారు వొక వూరిజనం మైదానంమీద నిలవబడ్డది. వ్యవధానం వుందని తెలిసినా యావత్తుమంది రెండుబండ్లనూ వొక్కమాటు ముట్టడించారు. లోపలివాండ్లు ఆయుధపాణులై మోహరించి నిలవబడ్డారు. శకటవ్యూహంలో ప్రతిద్వారం దగ్గరా పోరు ఘోరమైంది. ద్వంద్వయుద్ధం సాగింది. ట్రంకులకు ట్రంకులు మోటించారు. బాహాబాహి ముష్టాముష్టి ట్రంకాట్రంకిగా కొంతవరకు యుద్ధం నడిచి తుములసంగరంలోకి దిగింది. నలిగినకాళ్ళూ విరిగినవేళ్ళూ గీచుకున్నగోళ్ళూ చిరిగిన రుమాళ్ళూ రణరంగమును భీభత్సం గావించినవి. రణముఖాన పలురంగములలో యోధుల బలాబలముల ననుసరించి జయాపజయములు సమకూడినవి. పెండ్లిమేళానికి బోయే తన సానిని జంపవచ్చిన వైశ్యయువకుడు మొగములమధ్య వున్న మేఘంవలె ప్రకాశిస్తున్నాడు. టికెట్లకోసంబోయి రాని తన తండ్రికై వొక గొల్లపడుచు కొండ కేకలు పెడుతున్నది. ఒక సోమాసి మూట నెత్తినిబెట్టుకొని తాంబూలం నవిలి దవడలు తాటిస్తూ అడుగుల లయ ననుకరించి చెవుల కుండలాలు తాండవమాడుతుండగా పరుగెత్తుకొనివచ్చి మూటదించి రైలెక్కి ఆతొందరలో మూటమరిచి టికెట్టు పారవేసుకొని బండెక్కి కూర్చున్నాడు. వొక నిర్వ్యాసంగుడు స్టేషనుదగ్గర ఫలహారం జేసి రెండవ తరగతి బండివద్ద నిలిచి పక్కబండిని జూస్తూ ఆనందిస్తున్నాడు. రామానాయుడు సెకండుక్లాసు బండిదిగి విశ్రాంతి గదిలో సామాను బెట్టించి వూళ్ళోకి బయలుదేరాడు; వూరుచూడంగనే మనస్సున కొకవిధమైన ఆనందం గలిగింది. విశాలమైన వీధులూ చక్కని రోడ్లూ, నీడలనిచ్చు వేపమ్రాకులూ, తెల్లని సూర్యకాంతులూ, హృదయానికి వికాసం కలిగిస్తున్నవి. స్టేషను మైదానములమీద మిరపకాయల బోరెంలూ, దూదిబేళ్ళూ, కుప్పతెప్పలై ఆ పట్టణంయొక్క వాణిజ్య వైభవాన్ని చాటుతున్నవి. కళాశాలగోపురం ఆంగ్లవిద్యం జనువుబాలుర ఆరోగ్యంవలె పైకి

బోయినకొలదీ సన్నగిల్లుతున్నది. ఈ పట్టణంలో సీళ్ళు మధ్యం. కత్తెరగుండ్లు మృగ్యం. జనులు దేహబలమూ చురుకుదనమూ కలిగి బోళాతనం ముఖముల ప్రకటిస్తూ వుత్సాహంతో అనేక వుద్యమాలలో పాల్గొంటారు. ఆధునికులు యీ విషయాలు కొన్ని నాగరికానికి భంగమని తలుస్తారు. ఇప్పటి నాగరిక లక్షణాలు కొన్ని లేవనే చెప్పవచ్చు.

రామానాయుడు కోడిస్తంభం మీదుగా గుడ్డలకొట్లకు బోయి చొక్కాలు చింపించుకొని కుడితిసీలూ కమీజులూ పుర్మాయించి కుట్టించి స్టేషనుకువచ్చి భోజనంచేసి విశ్రాంతి గదిలో పండుకొన్నాడు.

సాయంకాలమైంది. యేడైంది. యెనిమిదైంది. గుప్పిట పట్టుకోవడానికి వీలయ్యేటట్టు చీకటి దట్టమైంది. వెలుతురు అంధకారాన్ని నెట్టుకొనిరావడం కష్టంగావున్నది. గంటకొట్టారు. కేక వినబడ్డది. రామానాయుడు బయటికివచ్చి పడమటగా చూచాడు. అంధకార సముద్రంలో నుంచి వొక పెద్దవెలుగు బొబ్బటిల్లుతూ కొట్టుకొనివస్తున్నది. అంధకారగర్భంలో నుంచి వొకటి తరువాత మరియొకటి వెలుతురుగూళ్ళు బయల్పడ్డవి. మైదానంమీద చీకటి పాపలు బండివెంబడి పరుగెత్తుతున్నవి. రామానాయుడు ప్రతిబండీ చూస్తూవచ్చాడు. సంగదాసు గాలిపడిగెవలె నేలమీదవ్రాలాడు. ట్రంకు కిందికి దింపుకుంటూ వుంటే రామానాయుడు తోడు పట్టాడు. యెవరో యిద్దరుమనుష్యులు బండిలోకెక్కి మొగానికి పట్టెచాటుజేసి చూస్తున్నారు.

సం:- పెట్టెలు యిక్కడబెట్టి భోంచేసి వత్తామా?

రా:- వూళ్ళోకిపోయి రావడం కష్టం. స్టేషనులోనే భోజనం మన యిద్దరికీ తయారుచేయించాను.

సం:- యిక్కడ నీచు కలుస్తుందేమోనే?

రా:- నీచుకలవకుండా ప్రత్యేకం శాకాహారమే చేయమని చెప్పా.

సం:- నీవు తొందరపడుతున్నావు. వ్యవహారం బెడుస్తుంది. ముందు చేయవలసినపని చాలా వున్నది.

రా: యిది ముందుచేయవలసిన పనే.

సం:- 'వేగిరింపనెదియు విషమమగు'నని నీతివాక్యమున్నది.

రా:- 'ఆలస్య మమృతం విషం' అనేదికూడా నీతివాక్యమే.

సం:- ఈ నీతులను దేశకాల పాత్రము లెరిగి వుపయోగించ వలసి వుంటుంది.

రా:- అది నేనంగీకరిస్తాను.

సం:- సరే అభిప్రాయభేదమంటావు. పోదాంపద. అయితే బెజవాడకు రెండుగంటల బండిలో పోదామా?

రా:- నీవు తర్కాలుమాని త్వరగా పని తెమలనిస్తే యీ బండే అందవచ్చు.

సం:- పద.

వీరిని చూడంగనే కుసినీవాడు బల్లమీద తెల్లని దుప్పటి రేకు పరచి, రెండుకుర్చీలు బల్లకుదగ్గరదోసి రెండు పింగాణీపళ్ళాలు బల్లమీదబెట్టి యెడమవైపున ముళ్ళగరిటా కుడివైపున కత్తీ యెదుట చెంచాలూ పెట్టి రెండుతట్టలతో అన్నం కూర తెచ్చి బల్లమీద పెట్టాడు.

రా:- నీవే వడ్డించు.

కుశిని:- యెస్సార్.

రా:- శుభ్రమయిన వడపోసిననీళ్ళు తీసుకొనిరా.

కు:- మంచిరకాలు వున్నవండిసార్.

రా:- నీళ్ళే తీసుకురా.

కు:- ఐస్ సార్.

రా.- కొంచం వేయి.

కు:- యెస్సార్.

స:- యీకత్తులూ కఠార్లూ యేమిచెయ్యానో?

రా:- వుపయోగించు.

స:- లైసెన్సు కావలెనేమో! యీతగాదా యెందుకు? ఇవి అవతల బెట్టించేసే వుపయోగిస్తాను.

రా:- తరువాతేమిటి?

కు:- పుడ్డింగ్ సార్. వెరీనైస్ సార్.

రా:- తే.

కు:- యెస్సార్.

సంగదాసు కొంతభోజనం చేసి మాట్లాడుతూ చంచా తన వైపుపెట్టి కూర్చున్నాడు. ఇంతలో కుసినీవచ్చి యిక భోజనం చాలించాడని పళ్లెం యెత్తుకొనిపోయినాడు. సంగదాసు మాటల సందడిలో యేమరచి గమనించలేదు—కొంతసేపటికి,

స:- అయ్యో! నాపళ్ళెమెత్తుకొని పోయినాడేమి?

కు:- మీరు వదిలివేస్తే తోసివేశానండి.

రా:- యింకా యేమైనా వున్నదా?

కు:- నోమోర్ సార్.

రా:- బిల్లు తే.

కు:- ఈపూటకు అయిదురూపాయలు సార్.

రామానాయుడు రెండుపూటలకు కలిపి యెనిమిది రూపాయలకు పైగా వొకఅర్ధరూపాయి యీనామూ పళ్ళెంలోపెట్టాడు.

కు:- థేంక్యూ సార్.

స:- నాయుడూ! నీకేమైనా మతిబోయిందా యేమి? ఈ తిండేమిటి? ఈ డబ్బేమిటి?

రా:- మతిబోయిన పనులే. మనమిక రావద్దులే.

ఎవరో యిద్దరు మనుష్యులు వాకిటికి రెండు మొత్తల చాటుగా నిలుపబడి వింటున్నారు.

రా:- ఎవరావారు ?

ఒకడు:- నేను మునసబును.

రా:- అక్కడ నుంచున్నారేమి ? లోపలికిరండి.

మునసబు:- మీరు భోంచేస్తున్నారుగదా అని యీకడ ఉన్నాం? మీరు రైలుకు వస్తారేమో కనుక్కుందామని యిటు వచ్చాం. మీరు వస్తే ఈ రాత్రే యింటికి బోవచ్చు.

రా:- మేము బెజవాడ పోతాం.

ము:- బెజవాడేమి పని ?

సంగదాసు మొగం చిట్లించుకొన్నాడు.

రా:- అక్కడ రేపు పెద్దసభ జరుగుతుంది.

ము:- సభాపతి యెవరు ?

రా:- వెంకటరెడ్డిగారు.

ము:- మా రెడ్లసభా యేమిటి ?

రా:- కాదు. పంచములది, ఆదిమాంధ్రులసభ అంటారు. వెంకటరెడ్డి రెడ్డిగాడు. ఊరక పెట్టుకున్న పేరు.

ము:- మాల చౌదర్లుగూడా ఉన్నారా ?

రా:- ఉన్నారేమో.

రెండవవాడు:- లేకేమి.

ము:- పంచములకూ ఆదిమాంధ్రులకూ భేదమేమిటి ?

రా:- పంచములంటే అయిదవ కులంవారు. ఆదిమాంధ్రులంటే ఈ వరసకు సంబంధంలేని పేరు.

ము:- పంచముల సభకు మీరు వెళ్లుతున్నారేమి ?

రా:- అభిమాన మున్నవాండ్లు యెవరైనా వెళ్ళవచ్చు. మీరు వస్తారా ?

ము:- ఇప్పుడు వెసులుబాటులేదు. అయితే అక్కడికి పోవడానికి ముందు మాదిగ కూడు తినవలెనా ఏమి ?

రా:- అన్నం మాదిగన్నమా ?

రెండవవాడు:- వండి వడ్డించేవాడు మతంలో గలిసిన మాదిగె. పంక్తిన భోంచేసేవాడు పచ్చి మాల. కాబట్టి యిది మాదిగన్నంకాదు ? ఇంతమాత్రం నీకు తెలియదా ?

రా:- తగవులాటకు వచ్చారా ?

ము:- ఊరికే అడిగాం. దీనికి తగవేమున్నది.

రా:- భోంచేశాం. యేమిచేస్తారో చెయ్యండి.

ము:- మరే. మే మేమి చెయ్యగలం ? భాగ్యవంతులు ఏది చేసినా చెల్లుతుంది.

రెండవవాడు:- వాండ్ల వూసు మనకెందుకు. మనం పోదాం పద. మునసబు కుసినీవాడికి సైగచేశాడు. వాడు వాక సీసా దీసి కొని పక్కదారిన మైదానంమీదికి వచ్చి మునసబుకిచ్చి తిరిగి లోపలికి వచ్చాడు.

రా:- ఏమిటోయ్ అదీ ?

కు: కొత్తరకం జున్ను.

రా:- డబ్బియ్యలేదేమి ?

కు:- మాకు ఖాతాదారండి. వందరూపాయల వరకూ యీయనకు పెట్టుబడి పెట్టవచ్చునని కంపెనీ ఉత్తరువున్నది.

స:- రామానాయుడూ ! యేమీ ప్రపంచం !

రా:- సంగదాసుకు తెలియనిదికూడా ప్రపంచంలో కొంత భాగమున్నదని సంతోషిస్తున్నాను.

స:- ఘంట కొడుతున్నారు పద.

వుభయులు ట్రంకులు పట్టించుకొని బండెక్కారు.

## ౨౧

వర్ణాశ్రమములు

రాత్రి పదిగంట లయ్యేవరకు బండి బెజవాడ బోయింది, స్టేషనుదగ్గిరకు కార్యదర్శులలో వొకరైన రామేశ్వరరావూ కొందరు బాలభటులూ ప్రతినిధుల నాహ్వానం చేయడానికి వచ్చారు. ప్రతినిధులకు పాకలలోనూ అభిమానులకు సత్రంలోనూ వసతులు యేర్పరచ బడ్డవని చెప్పారు. రామేశ్వరరావుగారు సంగదాసును విచారించి 'తమరు సభాపతిగారి పాకలో బసచేసి రేపుసాయంత్రం విషయనిర్ణయ సంఘంలో పెట్టవలసిన చిత్తుతీర్మానములు వారితో సంప్రతించి తయారు చేయవలసినదని ప్రార్థన.'

సంగ:- సభాపతిగారు యెప్పుడు వచ్చారు?

రా:- యీ సాయంత్రమే వచ్చారు.

సం:- నాస్నేహితు లొకరి సభాపతిగారి పాకకు తీసికొని పోవచ్చునా?

రామే:- అభ్యంతరం లేదుగాని. మీకు యిరుకుగా వుంటుందేవెూ.

సం:- యేదోవిధంగా సర్దుకుంటాం.

రామే:- బాలభటు లెక్కడయ్యా? వీరిద్దరినీ బండికుదిర్చి సభాపతిగారి బసలో దింపండి.

రామానాయుడూ సంగందాసూ జట్కాబండెక్కి సభాపతిగారి బసకు పొయ్యేవరకు వారప్పుడే భోజనంచేసి తాంబూలం వేసుకుంటున్నారు

సం:- నమస్కారమండీ. నేను సంగదాసును.

వెంకటరెడ్డి:- ఆహా! సంగదాసుగారా! మీకోసమే యెదురుచూస్తున్నాను. కుర్చీలో దయచేయండీ. తమరుకూడా కుర్చీలో దయచేయండీ. వారి నామధేయం?

సం:- వారు నల్లమోతు రామానాయుడుగారు. వారికి మన సంఘంమీద గల అభిమానం ఇంతని చెప్పడానికి వీలులేదు.

వెం:- నాకు ఆశ్చర్యం వేస్తున్నది. రామేశ్వరరావుగారికి రామచంద్రచౌదిరిగారికి మనయందు గల అభిమానంలో శతాంశ మైనా మనవాండ్లకుంటే మన సంఘం బాగుపడిపోను. ఇక రామజోగిగారూ, భీమసేనరావుగారూ తమ జీవితములనే మన సంఘ సేవకు ముడుపుగట్టారు. దీనినిబట్టి చూస్తే మన సంఘానికి ముందు మంచిరోజులున్నవని తోస్తుంది.

రా:- మా అభిమానం యెంత. ఇదివరకు మా సంఘాలు దిగువజాతులకు చేసిన అపకారాన్నిబట్టి చూస్తే యిది వుపకారమే కాదు. పాపపరిహారానికి మేము ప్రయత్న పడుతున్నాము.

సం:- బుద్ధిపూర్వకంగా అపకారం చేశారని నే నననుగాని యీ మధ్య వుపేక్ష మాత్రం జరిగింది. దానిఫలం అన్ని జాతులమూ అనుభవిస్తూనే వున్నాం.

వెం:- సంగదాసుగారు కొంచెం మొగమాటపడుతున్నారు. పర్యవసాన మేమైనా సత్యం వెల్లడించడమే నా అభిప్రాయం.

రా:- ఈ విషయంలో సంగదాసుగారితో నేను కొంత వరకు యేకీభవించక పోయినా ఆయన ముఖప్రీతికోసం సత్యం చెప్పడానికి జముకుతాడని నే ననుకోను. కఠిన విషయములుకూడా యెదటివాండ్ల మనసు నొచ్చకుండా చెప్పే సామర్థ్యం ఆయన కున్నది. ధర్మాతిక్రమణం లేకుండా నేర్పుతో కార్యం సాధించటం ప్రశంసనీయమే.

వెం:- కొంచెం జంకి-దాసుగారియందు నా కత్యంత గౌరవ మున్నది. కాని పై కులాలు మనకు బుద్ధిపూర్వకంగా అన్యాయం చేశారనే నా యభిప్రాయం.

స:- చేశారా ? చేస్తున్నారా ?

వెం:- చేశారు. చేస్తున్నారు.

సం:- ఇది యెటుచెప్పడానికీ కొంచెం కఠిన విషయం. మన ఆర్థికస్థితి విచారింతాం. రాచరికం కృషి వాణిజ్య పాశు

పాల్యములూ ధనాకర్షణకు ముఖ్య సాధనాలు. వృత్తివిభాగం జరిగినప్పుడు ఆ నాలుగు సాధనాలు రెండు మూడు నాలుగు జాతులకే వచ్చినవి.

ఒక బాలభటుడు:- అయ్యా! తమకోసం యెవరో యిద్దరు వచ్చారు.

వెం:- ఆ కుర్చీలు యిటులాగి లోపలికి రమ్మను—రామ చంద్రచౌదరిగారా! కుర్చీమీద దయచెయ్యండి.

చౌ:- వీరు మా బంధువులు. పేరు రామసోమయాజులు గారు. మన వుద్యమ విషయమై వీరికి చాలా అభిమానం. గుంటూరినుంచి వచ్చే పదిగంటల రైలుకు దిగారు.

సం:- చాలా ఆలస్యమైనదే.

చౌ:- ఆలస్యమంటే—రైలుటిక్కెటు పోయిందట. గేటు దగ్గరకొంచెంసేపు వేధించి నాలుగణాలు వదిలించి పంపించారు. బండివాడు బాడుగ కుదరనియ్యకపోతే పాపం నడిచివచ్చారు.

సం:- బాలభటులు కనపడలేదా?

చౌ:- పాపం వారికి బాలభటులంటే యేమితెలుసు? చాలా కర్మిష్టి.

వెం:- సోమయాజుగారూ — నమస్కారం. దయచేసి కూర్చోండి. మా ఉద్యమాన్ని తమరు ఆశీర్వదించాలే.

సో:- చేతిలోవున్న కొల్లాయిగుడ్డ కుర్చీమీద బెట్టి—నేను చాలా అభిమానంతో వచ్చాను. ఊళ్ళోకివచ్చికూడా ఈ రాత్రి తమదర్శనం చేయకుండా వుండడమేమని చౌదరయ్యగారికి కొంచెం శ్రమయిచ్చి యిప్పుడేవచ్చాను. తమరందరూ మత విషయం కూడా శ్రమచేయవలసిందని నా ప్రార్థన.

సం:- తమరు ఇప్పుడే యిక్కడికి రావడంకూడా మేలే అయింది, మా సంభాషణలో తమరూ చౌదరయ్యగారూకూడా కలవడం అవసరం. విషయ మిది. యింతవరకు వచ్చాం.

సో - తమ పేరేమి?

వెం:- వారిపేరు సంగదాసుగారు, వీరు రామానాయుడు గారు.

సో:- ప్రశస్తంగా వింటూవున్న పేర్లే. సుదినం గనుకనే తమదర్శనంగూడా అయింది. "ఏక క్రియాద్వ్యర్థకరీ" అన్నారు. మహాదేవా అని ఇక విషయం సెలవియ్యండి.

సం:- తక్కిన వృత్తులలో నేత ముఖ్యమైనది. దీనిలో ధనాకర్షణవున్నది. వ్యవసాయంతోపాటు యెడతెగకుండా జరుగవలసిందనీ. యిది మాలలకూ నాలుగవజాతిలో మిగత తరగతులకూ యేర్పాటు చేశారు. చర్మకారవృత్తి మాదిగలకియ్యబడ్డది. ఒకటవ తరగతివారికి ధనాకర్షణకై వృత్తి యేర్పాటుచేయలేదు. సంఘమే వీరిని పోషించవలసిం దన్నారు

వెం:- సోమరులుగా కూర్చోమన్నారు.

సం:- పనిమాత్రం వారికి తక్కువబెట్టలేదు. విద్యావ్యాసంగం, విజ్ఞానాభివృద్ధి, యాజనం, అధ్యాపకం, మతబోధ-యివి వీరుచేయవలసి వున్నవి. ఆర్యమత సంప్రదాయానుసారంగా బోధకుడు స్వోదరపోషణకై కాలం వ్యయపెట్టగూడదు. జంగాలూ, సాతానులూ, దాసరులూ డబ్బుకై పనిచేయటం ధర్మచ్యుతిగా తలుస్తారు. వీరు చేసేపనులలో స్వల్పంగా ధనాకర్షణవున్నా పడే శ్రమకు ప్రతిఫలం కాజాలదు. సభాపతిగారన్నట్లు వీరిలో కొందరు సోమరులు లేకపోలేదు. అట్టివా రన్నితరగతులలోనూ వున్నారు. మన పూర్వాచర్యాలు మారిపోయి ముందుగా ఖరీదుగట్టని యేపనీ చేయగూడదంటే నే జెప్పలేనుగాని స్వామిసేవయే నాకుప్రధానం. విలువగట్టకనే జ్ఞానాభివృద్ధికై పాటుపడతాననే భావంలో ఔన్నత్యం లేకపోలేదు. యేకాలంలోనైనా విద్య ధనాకర్షణకు పెద్ద కారణమే అయినా అమ్మకానికై దాని సంగడిలో బెట్టకపోవడం స్వల్పవిషయం గాదు. మన విద్యావిషయమై ఆదరణ పోవడంతో వారిలో చాలామంది పూర్వనియమితమైన వృత్తులు లేకపోవడం

చేత తక్కినవారి వృత్తులలోనే ప్రవేశించి ధనాకర్షణ చేస్తున్నారు. ఈ విధంగానే నేతవృత్తి పోగొట్టుకొన్న మాలె. జాంబ్రవ మాలలూ పూర్వవృత్తులు నశించిన జంగమ సాతానులూ తమకు చేతనైన యితరవృత్తులలో నొదిగారు—సభాపతిగా రడిగినప్రశ్న వల్ల మనం ప్రస్తుతవిషయంనుంచి తూలిపోయినాం— వృత్తులు అందరికీ పంచిపెట్టారు.

రా:- ధనాకర్షణకు యెక్కువ వీలైన కృషి వాణిజ్యాదులు కొందరికిచ్చి కూలిపనులు తక్కినవాండ్ల కియ్యడంలో యేమి న్యాయమున్నది ?

సం:- వృత్తివిభజన చేయడానికి పూర్వం ఆయావృత్తు లదివర కెవ్వరికీ రావని అదివరకు ఆవృత్తులు యెవరూ చేయడం లేదనీ భావించగూడదు. అదివరకే జనులు అన్నం దింటున్నారు. గుడ్డలు గట్టుకుంటున్నారు. కొందరావృత్తులను చేస్తూనేవున్నారు. యెవరో కొందరావృత్తులు చేయకనూ తప్పదు. సామర్థ్యం ననుసరించికూడా వృత్తులు పంచిపెట్టబడేవి. వృత్తి సాంకర్యంగాకుండా చేయడమే వృత్తివిభజన కొక కారణమై యుండవచ్చు.

వెం:- యెవరి యిష్టంవచ్చినవృత్తులు వారు అవలంబిస్తారు. వృత్తిసాంకర్యం వల్ల వచ్చినదోషమేమి ?

సం:- వృత్తి పోషణకొరకు వృత్తి విభజనం జరిగింది. ఒక తాలూకా గుమాస్తాపని ఖాళీ అయితే అయిదువందల దరఖాస్తులు వచ్చిన మోస్తరుగా యితరవృత్తులు మాని మరివొకరి వృత్తిలో ప్రవేశించడం వల్ల వృత్తులు నశించకుండా వుండేలాగు ఆయా వృత్తులవారు స్థిరమైనవృత్తు లేర్పరచుకొని వాటి నభివృద్ధి చేస్తుండే టందుకూ వృత్తిజ్ఞానం పారంపర్యంగా వచ్చి వృత్తుల అభివృద్ధికి తోడ్పడటానికీ వృత్తివిభజనం జరిగింది. ఈ విభజననుగూర్చి ధర్మశాస్త్రాలు ఋషిప్రోక్తాలేగాక రాజశాసనాలుగా యేర్పడ్డవి. మెకాలే శిక్షాస్మృతిని, స్టీఫెను సాక్ష్యచట్టమునూ, యితర ధర్మ శాస్త్రజ్ఞులు యితరచట్టములనూ రచించి రాజశాసనం బడిసినట్లు

పూర్వం ధర్మశాస్త్రాలు ఋషిప్రోక్తంలై రాజానుమతిని బడసినవి. ఈ శాసనము లమలులో పెట్టబడ్డప్పుడు అప్పటి కా యా వృత్తులు చేసేవాండ్లను వాటియందుంచి కొన్నివృత్తులకు యెక్కువ జనం కావలసివుంటే వృత్తియేర్పాటులేని యితరులను వారి తెలివితేటలనుబట్టి ఆయావృత్తులలో ప్రవేశపెట్టి వుందురు. పూర్వం యిట్టి యేర్పాటు చేయడమే కాకుండా ప్రతి గ్రామంలో అన్ని రకాల వృత్తులవారినీ ప్రవేశపెట్టి వారా గ్రామాలు విడువక స్థిరంగా నిలిచి గ్రామజీవితానికి తోడ్పడేలాగు యినాము లేర్పరచి చాకలి మంగలి కుమ్మరి వైద్యుడు పురోహితుడు పంతులు మొదలగు వృత్తులవారు ప్రతిగ్రామంలోనూ వుండి గ్రామవాసుల కవసరమైనప్పుడు సహాయం చేస్తూవుండేలాగు ప్రపంచంలోకెల్లా అద్భుతమైన గ్రామపరిపాలనాపద్ధతి స్థాపించబడ్డది. ఆంగ్ల ప్రభువులు ప్రతి గ్రామమందు పూర్వప్రభువులచే అద్భుతంగా మలచబడ్డ గ్రామపాలనా ప్రతిష్ఠాపనం విధ్వంసం జేశారు మెయిన్ అను ఆంగ్లధర్మశాస్త్రకర్త ఆంగ్లప్రభువులను యీ దుండగానికై యెంతో నిందించాడు.

వెం:- సాంఘిక విషయములలో ప్రభువులు జోక్యం గలుగజేసికొని జనులను శిక్షించడం అక్రమం.

సం:- ఈ ప్రతిష్ఠాపన కేవలం సాంఘికం గాదు. దీనికి సాంఘికానికంటే ఆర్థికానికే ఎక్కువ సంబంధ మున్నది. యూరోపులోని ప్రభుత్వాలు ప్రస్తుతం దేశాని కభివృద్ధికరమైన ప్రతి విషయంలోను జోక్యం కలుగజేసికొంటూ దేశాభివృద్ధికి తోడ్పడుతున్న మోస్తరుగా పూర్వపు హిందూప్రభువులు ఆర్థిక సంబంధమైన వృత్తి విభజనంలో జోక్యం కలిగించుకున్నారు. దేశంయొక్క విత్తరక్షకొరకు వృత్తిరక్షా, వృత్తిరక్షకొరకు వృత్తి విభజనం జరిగినవి. ప్రభు వొకనిని వొకవృత్తిలో వుండవలసిందని ఆజ్ఞజేసి తక్కినవాండ్లను ఆవృత్తిలో ప్రవేశించడానికి స్వాతంత్ర్యమిస్తే మొదటివాడికి అన్యాయం చేసినవా డౌతాడు.

ఒకనిని వృత్తిని విడువవద్దని రాజు యెప్పుడు శాసిస్తాడో రెండవ వాణ్ణి దాంట్లో ప్రవేశించవద్దని శాసించక తప్పదు. కనుక ధర్మ శాస్త్రాలు వృత్తిసాంకర్యం చేసినవాండ్లను కఠినంగా శిక్షిస్తవి. ఈ శిక్షలు కొన్ని మనకు కఠినంగా తోచవచ్చు. నేరము జరిగి నప్పుడల్లా యావత్తుశిక్షా విధించారని చెప్పడానికి వీలులేదు. సాధారణపు చౌర్యానికి మూడు సంవత్సరముల కఠినశిక్షను స్మృతి విధించినా వారంరోజులకు లోపు శిక్షతో అనేక కేసులు ఫైసలుచేస్తారు. అంతేగాక ప్రపంచంలోని పూర్వకాలపు శిక్షా స్మృతులు యిప్పటివాటికంటే యెక్కువ శిక్షలు విధించేవి. వురి శిక్ష యింగ్లండులో అనేక నేరములకు వేసేవారు. తప్పుసృష్టికి వురిశిక్ష వేసేది. చాలా దేశములలో దొంగతనానికి చేతులు తెగ గొట్టేవారు. ఈ శిక్ష కొన్ని తురకదేశాలలో యిప్పటికీ అమలులో వున్నది. కనుక యీ విషయం కొంతవరకు సాంఘికమే అయినా ప్రభుత్వంవారు జోక్యం కలుగజేసికొనడంలో అక్రమం లేదు.

వృత్తి విభజనమె సంఘంలోని యెక్కువ తక్కువలకు కారణమయిందనడానికి వీలులేదు. ఈ హెచ్చుతగ్గులు వృత్తి విభజనముచేతనేగాక వృత్తిభేదములవల్ల గూడా వస్తున్నవి. ధనం బలం గలుగజేస్తుంది. రెంటినీ జ్ఞానం వంచుతుంది. జడమును శక్తీ, శక్తిని చైతన్యమూ, నడుపుతవి. యిది ప్రపంచధర్మం.

హిందూదేశంలో యీ ప్రతిష్ఠాపనం బాహుళ్యంగా నిర్మించారు. కొన్ని దేశాలలో యీ విభజనం లేకుండానే వృత్తులు కాపాడడానికి ప్రయత్నంచేశారు. మరి కొన్ని దేశాలలో కొన్నివృత్తులే విభజించారు. "లోకోభిన్నరుచిః" యని అనేక త్రోవలు తొక్కారు. ఈ పద్ధతులు సంఘ క్షేమానికై వుద్దేశింపబడ్డవిగాని సంఘనాశన నిమిత్తముగాదు. ఈ యేర్పాట్లు బుద్ధిపూర్వకంగా చేశారనే నేనూ నమ్ముతాను. కాని అన్యాయం మాత్రం వుద్దేశించలేదు. వృత్తులు పారంపర్యం జేయడంవల్ల

కొన్ని సంఘాలకు అన్యాయంగలిగింది. కొన్ని వృత్తులు నశించచడములో ఈ అన్యాయం మరింత యెక్కువయింది.

యిప్పటికి వర్ణవిభజన మనే మహాసౌధం శిథిలమైందనే చెప్పవచ్చు. ప్రభుత్వం పరాధీనంకాంగనే క్షత్రియవృత్తి పోయింది. క్షత్రియులందరూ యితర వృత్తులలో మగ్నమై పోయినారు బ్రాహ్మలు చాలావరకు యితరవృత్తుల నాశించారు. వారికీ పారతంత్ర్యం పూర్తిగా ప్రాప్తమైంది. క్షత్రియేతరులు పూర్వకాలమందే క్షాత్రధర్మం అవలంబించారు. శూద్రు లనే కులు రాజులైనారు. పస్తుతం ప్రజాప్రభుత్వమే వుత్తమమైందిగా పరిగణిస్తున్నారు. కూలివాడు సహితం తన వోటిచ్చి ప్రభుత్వాన్ని నడపడమే వుత్తమపాలనమార్గంగా యిప్పటి ప్రభుత్వధర్మం జెప్పుతున్నది. క్షత్రియ జాతితో యిక అవసరంలేదు. బుద్ధ రామానుజ బసవ చన్నబసవ మొదలైన మత సంస్కర్తలు నిరసించి యితర కులములలో మతప్రచారక సంఘములను తయారు చేశారు. వేమన, వీరబ్రహ్మం, సిద్దప్ప, లక్ష్మప్ప, రామమోహనుడు, దయానందుడు, వీరేశలింగం మొదలైన వీరసంస్కర్తలు వర్ణవృక్షంమీద తమ గండ్రగొడ్డండ్లను ప్రయోగించారు. కాని కోట శిథిలమైన తరువాత నిలిచివుండే మొండి గోడలవలె యీ ప్రతిష్టాపన ఖిలమైనా కిందపడక మారుమసులుతున్నది. వృత్తులు నశించడంతో విత్తం నశించింది. దేశం దుర్భరమైన దారిద్ర్య స్థితిలో మునిగింది. సంఘం నిర్జీవమై శవాకారంగా వున్నది.

రా:- హిందూసంఘం యావత్తూ పునర్నిర్మాణం చేయడం అవసరమని మీ యభిప్రాయమైనట్టు తోస్తుంది.

సం:- మనసంఘం బాగయ్యే యేర్పాటు ముందు జూడండి. ఉట్టికెక్కిన తరువాత స్వర్గాని కెక్కవచ్చు.

సం:- హిందూ సంఘమంతా పునర్నిర్మాణం కావలసిందనే నా యభిప్రాయం. అది నాబోటివారికి సాధ్యమయ్యే పనిగాదు. తల్లిసంఘంయొక్క క్షేమంవిడిచి పిల్లసంఘాల క్షేమానికి మాత్రమే

పూనుకుంటే దానికీ ప్రతిబంధకా లున్నవి. యావన్మంది క్షేమం మనము విచారించకపోయినా చిన్నసంఘాల అభివృద్ధికై మన మవలంబించే మార్గాలు పెద్దసంఘంయొక్క క్షేమానికి భంగం గాకుండా వుండాలె. ఇంతేకాకుండా దేశంలో అందరూ తమ చిన్నసంఘాల క్షేమానికే పూనుకుంటే దేశమొత్తానికి సంబంధించిన పెద్దసమస్యలన్నీ మూలబడి చిన్నప్రయత్నాలు సయితం నిష్ఫల మవుతవి.

తక్కిన అన్ని ప్రయత్నాలూ మానివేసి మన మాలల యొక్క ప్రధానవృత్తియైన నేతఅభివృద్ధికి పూనుకున్నా మను కోండి. చూడడానికి యీపని చిన్నదిగానే కనుపడుతుంది. అందరూ మగ్గాలుగొని నేయడమేగదా అని అనవచ్చు. కాని సప్తా యేడు రాజకీయ సమస్యలు తేలితేనేగాని యిది తేలదు. ఇది తేలకపోతే మననేతా మనమూ అభివృద్ధిపొందే మార్గమేది? మనకు భూములా లేవు. వుద్యోగాలుచేతామంటే చదువు లేదు. చదువుకొనేటందుకు డబ్బులేదు. వర్తకం యేమిబెట్టి చేస్తారు. చివరకు ఘట్టకుటికా ప్రభాతమవుతుంది. ఇంకా వొక వుపమానం. సంఘనిర్మాణమంటె వొకపెద్దమేడ గట్టడం మోస్తరు. ఆయానికి దగిన దూలాలూ గోడలకు దగిన మొకరాలూ తగినంత కలపా వుండాలె. సమస్త భాగాలు వొకదానికొకటి పొసిగేటట్టుగా అమర్చాలె. సంఘ నిర్మాణంయొక్క యేర్పాట్లన్నీ యీ విధంగానే వుంటవి. అంద రమూ మొకరాలమె కావలెనంటె ప్రయోజనంలేదు. నీవు దూలా నివి కావడమేమి? నేను యెండకు యెండి వానకుదడిసే పెంకును గావడమేమి? అని అడిగితే ఏమిజవాబు? పెంకులన్నీ గలిసి దూలం గావలెనంటె అవుతవా? కాబట్టి మహాసంఘంయొక్క క్షేమం దృష్టిలో లేకుండా చేసే ప్రయత్నాలు నేలవిడిచి సాము జేసినట్లే అవుతవి. హ్రస్వదృష్టితో మనంజేసే ప్రయత్నాలు చిన్న సంఘాలకు తాత్కాలికంగా వుపయోగించినట్లు కనుపడ్డా మహా సంఘానికి అపకారముతో మహాసంఘంతోపాటు మనమూ నష్టపడ

డమే కాకుండా మనము దేశద్రోహులమూనూ సంఘద్రోహుల మూనూ కావలసివస్తుంది. ఆఖరుకు మహాసంఘంయొక్క క్షేమా నికి ప్రయత్నం చేయలేకపోయినా మహాసంఘ నిర్మాణంయొక్క రాస్తాగు త్రైగి దానికి అనుసంధానంగా చిన్న సంఘాల అభివృద్ధికి పాటుబడితే పెద్దసంఘముయొక్క అభివృద్ధికి ఒక విధంగా తోడ్పడ్డ వాండ్లమే అవుతాం.

అట్లుగాక మహాసంఘుంయొక్క విపత్తు నివారించుటకూ, దానిక్షేమ మొనగూర్చుటకూ త్యాగం జేయవలసి వచ్చినప్పుడు యేవో వంకలు బెట్టుకొని మూలమూలలు దాగి దున్నడానికి మూడ లలో మెయ్యడానికి మొద్దులలో జేరుతూ హక్కులు పంచుకోవలసి వచ్చినప్పుడు పెద్దకోరికెలు గోరడం హాస్యాస్పదం.

సోమయాజులుగారు కునికిపాట్లు పడుతున్నారు—ఎఱ్ఱరాళ్ళ కుండలాలు దీపంయెదుట తళతళ మెరుస్తున్నవి. ఒక చిన్నకాసు బంగారం యెక్కువబెట్టి చేయించుకోవడంచేత కొంచం బరువై తమ్మెలు నొప్పిమెత్తుతున్నవి. చిన్నప్పుడు గుట్టించిన దోసకాడ నాజూకుగానే వున్నది. తీయించవలె ననుకుంటే ముసలమ్మ వద్ద న్నది. గడియారం కొట్టడం ప్రారంభించింది. సోమయాజులుగారు తుళ్ళిపడిలేచి లెక్కబెట్టి పన్నెండూ అని చెప్పాడు.

రా:- పునర్నిర్మాణంయొక్క దార్లు మేము వినవలసి వున్నాం. యిప్పటికే చాలా పొద్దుబోయింది. మళ్ళీ సమావేశ మెప్పుడు?

వెం:- దాసుగారిపేరు నేనిదివరకే వింటూవచ్చాను. వారితో సంభాషించడం ప్రారంభించిన తరువాత వారియందునాకు గల గౌరవం యిబ్బడయింది. విషయం యావత్తూ వారినోట కొన దాకా వినవలసివుంటుంది. మీరు చేయబొయ్యే సమావేశంలో నేనుగూడా వుండేటట్టు జూడండి.

సం:- తమరు లేకుండానా-సభ రేపు ఉదయం పదిగంటలబండి వచ్చిన తరువాత ప్రారంభిస్తారట. యేడుగంటలకు సమావేశం

గావడానికి అందరికీ వీలేనా? ఇక్కడనే అయితే బాగుంటుంది సోమయాజులుగారు గూడా తప్పకుండా దయచేయవలెనని నా ప్రార్థన.

సో:- (కొంచెం తొట్రుబాటుతో)—చిత్తం—అవశ్యంగా దయచేస్తాను. నాకు వొక్క అరగంట వ్యవధిగావలె. యిది వొకటి బెట్టుకున్నా గనుక కొద్దిగా కలాపం వుంటుంది.

వెం:- సరే—సరిగా యేడున్నరగంటలకు కలుసుకొందాం. దాసుగారూ! రేపుప్రొద్దున మనకింకొక పని వున్నదే. చిత్తు తీర్మానాలు వ్రాయవలసివున్నవి. అది కొంచెం బండుపని. ఆ బరువు మీవొక్కరిమీదనే వేస్తాం.

సం:- సరే — సోమయాజులుగారి కలాపమయ్యేలోగా నాకలాపంగూడా పూర్తిజేస్తా.

## ౨౨

## ఆర్యవిజ్ఞానం అందరిసొమ్ము

సంగదాసు చీకటితో లేచి తీర్మానాలు వ్రాస్తున్నాడు. కొంతసేపటికి రామానాయుడు లేచివచ్చి దాసు తీర్మానాలు వ్రాయడంజూచి "నన్నుగూడా లేపకపోయినావా?" అన్నాడు.

సం:- నేను యింకొక అరగంటలో చిత్తుతీర్మానాలు తయారుచేస్తా. నీ వింతలో ఫలహారం జేసివస్తే సవరించి సాఫు వ్రాస్తువుగాని. సమావేశమయ్యేలోగా ఫలహారంజేసి నేనూ తయారుగా వుంటాను.

సభాపతిగారూ, సంగదాసూ వుదయానుష్ఠానాలు తీర్చుకొని ఫలహారంజేసి పందిట్లో చాపలమీద కూర్చున్నారు.

రా:- తమకొక కుర్చీ తెప్పించనా?

వెం:- అక్కరలేదు. జాతీయపద్ధతి ప్రకారమే కూర్చుందాం. సంగదాసుగారి వుపన్యాసం విన్న తరువాతగూడా కుర్చీలు

గావలెనంటే బాగుండదు. అదిగాక పదిమంది పెద్దమనుష్యులు వస్తూపోతూవుంటారు. సభలోకిగూడా కుర్చీలు వద్దని కబురం పించా. అదుగో దాసుగారు రానేవచ్చారు.

దా:- సోమయాజులుగారూ, చౌదరయ్యగారూ దయ చేశారా ?

వెం:- ఆ వచ్చేది చౌదరయ్యగారేనా ?

రా:- వారే.

సం:- సోమయాజులుగారు రావడంలేదేమి చెప్పుమా.

వెం:- కుండలాలకు పులికాపుచేస్తున్నారేమో. ఆ పద్ధతీ తమాషాగానే వున్నది. పూర్వం దాసుల్లెవరైనా యజ్ఞాలు చేశారేమో ?

సం:- దృష్టాంతాలు కనబడవు. పెద్దవాండ్ల నడిగితే తెలియవచ్చు. మనలో విశేషం భక్తిజ్ఞాన యోగాలు వ్యాపకం. యిప్పటికి భక్తిజ్ఞానయోగులు అనేకులున్నారుగాని కర్మపరులు గనబడరు. బసవాచార్యులవారు యజ్ఞయాగాది క్రతువులు పనికి రావని యజ్ఞోపవీతమేత్రోసివేసి వీరశైవం స్థాపించారు.

వెం:- చౌదరయ్యగారా! సోమయాజులగారేరి ?

చౌ:- భోజనప్రయత్నం మన సమావేశమైన తరువాత పెట్టుకొంటే సభ కడ్డము వస్తుందని చీకటితోనే స్వయంపాకం ప్రారంభించారు. నేను వారిబసకు వెళ్లేటప్పటికి గరపచేలో గుంటకతోలినట్టు కర్మ నడుస్తున్నది. యిప్పటికి భోజనం ప్రారం భించి వుంటారు. దాసుగారి ప్రసంగం వినవలెనని క్లుప్తంజేసి జప్లిన్ వెనా స్తరుగా పోనిస్తున్నారు. రాత్రి వీరి ప్రసంగం విన్న తరువాత వీరంటే వారికి పరమానందం.

వెం:- పాపం వారు రాత్రి పూర్తిగా విన్నట్టులేదు.

చౌ:- మొదటిభాగం కొంతవరకు అవగాహన చేసుకున్నట్లే కనుబడుతుంది—అదుగో నురుగుదబ్బలుబడుతూ రానేవచ్చారు.

సో:- సభవారి కందరికీ నమస్కారం. ఆలస్యానికి క్షమించాలె.

గంట యెనిమిది గొట్టింది. అతిచమటకు సోమయాజులు గారి బొట్టు తడిసి చెరిగి కిరణాలవలె అష్టదిక్కులా వ్యాపించింది. చూచేవాండ్లకు కడుక్కుంటే బాగుండునని తోచిందిగాని వారితో చెప్పడానికి సంశయించారు.

సో:- అయ్యా! సంభాషణ యేమాత్రం నడిచింది?

సం:- లేదు. యింకా గమిడిదాటలేదు. తలవని తలంపుగా మత విషయంలోకి దిగాం. తమరు సమయాని కందుకోవడం ముఖ్యం.

సో:- చిత్తం చిత్తం—తమరు సరస్వతీ విగ్రహం. యెదుట పొగడ రాదని విరమిస్తున్నాను. యీ పూట మత ప్రసంగమే సాగనియ్యండి.

వెం:- సోమయాజులుగారు శలవిస్తున్నారు గనుక అలాగే కానియ్యండి. సాయంత్రం సభ అయిన తరువాత అవసరం వుంటే మళ్లీ కూర్చుందాం.

సం:- సోమయాజులుగారూ! మా సంభాషణ యింతవర కైంది. మీ అభిప్రాయాలు పూర్ణంగా వెల్లడించాలె. శైవులు యజ్ఞోపవీతాలు తోసివేశారు. వేదశాస్త్రాలు పనికిరావన్నారు. వ్యాసుని సంహరించినందుకు గుర్తుగా వ్యాసతోడు లింగాయితులు వూరేగింపు జేస్తారు. బసవపురాణాది ప్రమాణగ్రంథాలను కొత్తగా రచించి వేదాల స్థానంలో వాటిని బెట్టారు. మహమ్మదీయులను సహితం హిందూమతంలో గలిపి వారితో సంబంధ బాంధవ్యాలు జేశారు. ఇంకా అరవైనాలుగువంశాల బ్రాహ్మణులు యజ్ఞోపవీత విసర్జనజేసి జంగాలైనారు. బసవాచార్యులవారితో యేకీభవించక పండితారాధ్యులవారు కర్మమీది ప్రేమచేత కొత్తశాఖను ఏర్ప రచి యజ్ఞోపవీతమూ లింగధారణా రెండూ కావలసిందన్నారు. రామానుజులు ఉభయవేదాంత ప్రవర్తకులు. రెండు వేదాంతాలను

ఒక రేవులో నీళ్ళు దాగించారు. దొడ్డయాచార్యులవారు సాతాను లతో సంబంధాలు చేయవలెనని ప్రయత్నించారు. వేదాంత దేశికులు దీనిని నిరోధించారు. కొందరు వైష్ణవమత ప్రచారకులు తమ సోదరులైన శూద్ర పంచమ వైష్ణవులకు యజ్ఞోపవీతమూ వేదపఠనమూ నిషేధములైతే పక్షపాతము గలవిగనుక అవి తమకు అగ్రాహ్యములని యజ్ఞోపవీతసన్యాసమూ వేదసన్యాసమూ గావించారు. ఆహా ! ఈ శైవ వైష్ణవ సంస్కర్తలయొక్క సర్వ సమత్వ ధర్మను మెంతవరకు బోయింది ! రామమోహనులు యజ్ఞోప వీతం త్యజించలేదు. పూర్వసంస్కర్తలైన జినబుద్ధులు వేదశాస్త్ర ముల ప్రామాణ్యము నంగీకరించకపోయినా పూర్వవిజ్ఞానమును విసర్జించకపోవడమే గాకుండా వీరి అనుచరులు సంస్కృతములో అనేక గ్రంథాలు రచించారు.

సో:- వేదశాస్త్రాలూ కర్మలూ విసర్జించుకుంటే మనకు మిగిలిందేమున్నది ? కర్మవిసర్జనం యెవరికి సాధ్యమౌతుంది ? మన మందరం గూడా కర్మలు ఆచరించవలసిందే. యజ్ఞోపవీతధారణం చేయవలసిందే.

వెం:- సోమయాజులుగారు తమ అభిప్రాయాన్ని గట్టిగా జెప్పారు.

సం:- అందుకనేగదా సోమయాజులుగారు మనకు కావలె నని కోరుకున్నాం.

చౌ:- బాగు బాగు. పనులన్నీ మానుకొని కమ్మగా గాచిన నెయ్యి కడుపులో వేసుకోకుండా బూడిదెపాలు చేస్తాముంటారు. భక్తిజ్ఞానయోగాలు చాలవా ?

రామానాయుడు కడుపుబ్బ నవ్వాడు.

సం:- (ఒక కాలు మార్చి రెండవ కాలిమీద గూర్చొని పై పెదవి పంటితో నొక్కి)—చాలవనిగాదు. ఆ రెంటిలో వొక టైనా చాలు. అందువల్ల రెండవది పారవెయ్య నవసరంలేదు. కర్మవల్లనే మోక్షం వస్తుందని జైమిని ఋషియొక్క అభిప్రాయ

మైనా, కర్మ చిత్తశుద్ధికిసాధనమని ఆ స్తికులంతా అంగీకరించారు. కర్మ కంచెవంటిది. పైరు పెరగడానికి యెరువూ, యెండా, నీళ్లూ సాధనమైనా చెడు గొడ్లను లోపలికి రానియ్యదు. మనకు కావలసింది లోపలి తొనలూ, గుజ్జే. అవి వుంటే చాలు. కాని అవి తొళకలేనిదీ లభించవు. కర్మ యెప్పటికైనా విసర్జించవలసిందే గాని భోగ్యసమయం వచ్చేవరకూ తొళక రూపకంగా అంటుకొనే ఉంటుంది.

సో:- పరమానందం.

సం:- హిందూవిజ్ఞానమనేది తరుగుల్మలతాదులతోగూడిన మహారణ్యాం. ఎవరెవరి యోగ్యతకు యెవరెవరి రుచులకు తగిన సాధనలన్నీ యేర్పరచబడ్డవి. భక్తులూ యోగులూ జ్ఞానులూ తేనెటీగలవలె యిప్పటివరకూ విజ్ఞాన మధువును ఊరుస్తూనే ఉన్నారు. ఇతర మతములలోనలె పిల్లడి మొదలు పితామహుడి వరకూ తొడిగేటందుకు వొకటేరకం తిత్తులు తయారు గాలేదు. హిందూ ఆకాశం యెన్ని వన్నె చిన్నెలతో చెన్ను మిగిలి వుంటుంతో హిందూభూమి యెన్ని చిత్రరంగముల హృదయంగమంగా ప్రదర్శిస్తుందో హిందూ మానసఫలకం అన్ని విచిత్రాలనూ ప్రతిఫలిస్తుంది. ఈ హిందూ భూమ్యాకాశాలు యెవరికి వారసత్వమో హిందూవిజ్ఞానం సహితం వారందరికీ దాయార్హమే. ఆద్యులయిన ఆర్యఋషులు ఆచండాలాంతమూ అందరికీ పూర్వీకులే. అందరితోనూ సంబంధము చేశారు. అందుకనే ఆర్యసమాజ స్థాపకులైన దయానందులు ఆర్యవిజ్ఞానం అందరికీ పంచిపెట్ట మన్నాడు. ఆర్యవిజ్ఞానాన్ని ఆర్యావర్తానికేకాక అన్ని దేశముల వారికీ ఆనందము నియ్యవచ్చునన్నాడు.

గంట ఠాం ఠాం అని మోగింది.

సో:- శుభం.

వెం:- ఈ స్థితిలో విరమించడం యెంతకష్టమైనా ఇప్పుడు లేస్తేనేగాని భోజనములు పదిగంటల కందుకోలేము.

సో:- సభను ఒంటిగంటకు విళంబిస్తే బాగుండదా ?

వెం:- దాసుగారి ఉపన్యాసం వింటూవుండడానికి మనకు బాగానే వుంటుంది గాని వందలకొలది ప్రతినిధులకూ అభిమానులకూ సంకటంగా వుంటుంది.

సో:- సరే చిత్తం - యింతే ప్రాప్తం.

వెం:- దాసుగారూ ! మీతో సంభాషణ అయినతరవాత నేను అచ్చు వేయించిన ఉపన్యాసం ప్రకటించడానికి యిష్టంలేకుండా వున్నది. కొన్ని అభిప్రాయాలు మారినవి.

సం:- సత్యమందు మీ కెంత గౌరవమున్నదో దీనివల్ల స్పష్టమౌతున్నది.

## ౨౩

## సంఘ నిర్మాణం

సభ పదిఘంటలకు జరుగుతుందని బెజవాడంతా తెలిసింది. సభాపతిగారి వూరేగింపుకు రామేశ్వరరావుగారు బ్యాండుమేళం యేర్పాటుజేసి వాండ్ల దగ్గరనుంచి చేవుత్తరం పుచ్చుకున్నారు. రామేశ్వరరావుగారి గుర్రపుబండెక్కి మాల మాదిగలు మేళంతో వూరేగుతారని వూరంతా విడ్డూరంగా చెప్పుకుంటున్నారు. మహామంత్రి నాటి కట్టుబళ్ల ప్రకారం వూరేగింపుకు ఆటంక పెడదామని పండితులు యోచిస్తే అడ్డునేర మవుతుందని ప్లీడర్లు సలహా చెప్పినారు. అన్నశ్రాద్ధం బెట్టే కొందరు వైశ్యులు పూర్వాచార పరాయణులైన వకీళ్ల దగ్గరకు పోయి వ్యాజ్యం దాఖలుజేసి వూరేగింపు కాకుండా యింజక్షను యిప్పించమని కోరితే ప్రయోజనం లేదని చెప్పారు. ఊరేగింపు బయలుదేరింది. వెంకటరెడ్డిగారూ సంగదాసుగారూ బండిమీద కూర్చున్నారు. అభిమానులంతా బండికి ముందు నడిచారు. ముందాయన మాల శాస్త్రిలనీ, వెనుకాయన మాలపంతులనీ, నడిపాయన మాలచౌదరనీ వేళాకోళాలు సాగించారు. పందిరి బాగా అలంకరించారు.

అరుంధతీ విగ్రహం సింహద్వారంమీద అమర్చబడ్డది. వశిష్ఠ శక్తి పరాశర వ్యాసాదుల విగ్రహాలూ, పంచములైన ద్రావిడ భక్తుల చిత్తరువులూ, తక్కిన ద్వారా లలంకరిస్తున్నవి. సభాపతి గారి వేదికదగ్గర మేలుకోట దేవాలయపు తన్నీరు వ్రేలాడ గట్టారు. సభ ప్రారంభమైంది. చౌదరయ్యగారు సభికుల నాహ్వా నించి తమ సానుభూతిని తెలిపారు. వెంకటరెడ్డిగారిని సభాపతిగా యెన్నుకొనే తీర్మానాన్ని ప్రస్తాపించడానికి సంగదాసుగారు లేవంగనే సభికులందరూ అత్యుత్సాహంతో "సంగదాసుకూ జై" అని కేకలువేస్తూ చప్పట్లు కొట్టారు. ప్రస్తాపన అయిన తరువాత వొకరు లేచి ఆమోదించారు. మరియొకరు సమర్థించారు. నిరో ధకులు లేరని తెలిసిన తరువాత సభాపతిగారు సభికుల కరతాళ ధ్వనులు చెలరేగుతుండగా సభాధిపత్యం వహించి వుపన్యాసం ప్రారంభించారు. తనను సభాపతిగా యెన్నుకొన్నందుకు ఆహ్వాన సంఘమువారికి కృతజ్ఞత తెలిపి దిగువజాతుల పూర్వ చరిత్రం వినిపించి ప్రస్తుత దీనస్థితిని కరుణారస మొలికేటట్టుగా వర్ణించి ఉద్యమం యొక్క వ్యాప్తిని నిర్వచించి మహాసంఘమునకూ అంత స్సంఘములకూ వుండవలసిన సంబంధములను వివరించి స్వసంఘాభివృద్ధికై చేయవలసిన పనులను విశదీకరిస్తూ సంఘముల యొక్క పునర్నిర్మాణాన్ని గూర్చి ఈ ప్రకారంగా గాంభీరో పన్యాసం జేశారు.

"ఆర్యులారా! నేను సంఘముల పునర్నిర్మాణాన్నిగూర్చి చెప్పబోయే సంగతులు మీ రనేకసార్లు సంగదాసుగారివల్ల వినే వుంటారు. సంగదాసు శబ్దము సంగదాసు శబ్దభవంగా తీసుకుంటే యీ పేరు వారికి తగివుంటుంది. (సంగదాసుకూ జై అని కేకలు) సంఘసేవే వారికి ఆదర్శం. వారు మన సంఘానికి చెందినవారైనా మహాసంఘాభివృద్ధి ప్రధానంగా యెంచుతుండే విశాల హృదయులు గాని సంకుచితాభిప్రాయములు గలవారు కారు. అందుచేత స్వసంఘాభివృద్ధికి ప్రయత్నించక పూర్వం మహాసంఘ నిర్మా

జానికి దారులు తెలుసుకోవలసిం దని వారి అభిప్రాయం. యిప్పుడు ప్రపంచంలో వుండే అన్ని దేశాలలో పూర్వపు కట్టుబడులు శిథిలమై ప్రస్తుత కాలమునకు అనుపయోగము లైనవి. పూర్వము సంఘ ధర్మములుగా యెంచబడేవి యిప్పుడావిధంగా యెంచబడవు. అట్టిస్థితే మన హిందూదేశములోగూడా తటస్థించింది. ఫ్రాన్సు, అమెరికా దేశములలో క్షత్రియవర్గమూ మతపీఠములూ పూర్తిగా నశింపజేసి ప్రజా ప్రభుత్వం స్థాపించుటకు ప్రయత్నాలు చాలాకాలం క్రిందనే జరిగినవిగాని ప్రజా ప్రభుత్వానికి బదులుగా ధనికప్రభుత్వ మేర్పడి దిగువజాతులకు మునుపటికంటే యెక్కువబాధకరమైంది. ప్రజలలో బహుమంది యొక్క అభిప్రాయ ప్రకారం గాకుండా, ధనికులలో బహుమంది యొక్క అభిప్రాయ ప్రకారం అమలుజరుగుతున్నది. యీ స్థితిని మార్చడానికి అలగాలు ప్రయత్నిస్తున్నారు. ఇటలీదేశములో ధనికుల యంత్రాగారాలు కూలీలు స్వాధీనపరుచుకొని చివరకు వుభయులూ రాజీపడ్డారు. రుష్యాదేశములో పంచాయితీ (సోవియట్) ప్రభుత్వం స్థాపించబడ్డది. వీరి వుద్యమానికి బోల్షెవిజమని పేరు. బోల్షెవిజమనగా విశేష జనులయొక్క అభిప్రాయమని అర్థం. దాని ప్రకారంగా ప్రభుత్వం జరుగవలయునని వారి ఆదర్శం. రుష్యాదేశంలో జనులకు వ్యవసాయమే జీవనం. భూములు చాలాభాగం వ్యవసాయం చేయని జమీందారుల చేతులలోనూ భూస్వాముల చేతులలోనూ పడ్డవి. ప్రభుత్వంలో ప్రజలకు యేవిధమైన పలుకుబడి లేదు. జారుచక్రవర్తి నౌకరుల యొక్కయూ జమీందారులయొక్కయూ ధనికులయొక్కయూ చేతులలో కీలుబొమ్మవలె వారి కోరికెల ప్రకారం మహాజనులను బాధించాడు. ఈ దుష్ప్రభుత్వం వంద సంవత్సరాలకు పైగా సాగింది. జనులు దుర్భరమైన దరిద్రంలో మునిగారు. తుదకు మొన్నటి యిరోపా యుద్ధసమయంలో నౌకరువర్గం, ధనికవర్గం సజారంగా కొల్లేరు కుంగినట్లు కుంగింది. పంచాయితీ ప్రభుత్వ మేర్పడి గ్రామ ప్రభుత్వానికీ, జిల్లా ప్రభుత్వానికీ, రాష్ట్ర ప్రభు

త్వానికీ, దేశప్రభుత్వానికీ పంచాయితీవర్గా లేర్పడ్డవి. ఈ పంచా యితీలలో సభికులు అయిదుగురే వుండవలసిన అవసరం లేదు. ఇదివరకు భూములు ఆసామీలకూ, జమీందారులకూ స్వాంత హక్కు కలిగివుండేవి. సోవియటువర్గంవారు భూములలో ప్రత్యేక వ్యక్తుల హక్కులను తొలగించి మందహక్కుగా మార్చి మంది తరఫున భూములన్నీ స్వాధీనపరచుకొని కేవలం స్వంత చేతితో వ్యవసాయం చేయువారికే వారు చేయగలంతవరకు విడదీసి జను లలో పంచిపెట్టారు. కోటీశ్వరుల భవనములూ ధనమూ యంత్రా గారములూ మందితరఫున సోవియటు సర్కారువారు స్వాధీన పరచుకొని పని జరిపిస్తున్నారు. దేశంలో భాగ్యవంతులకుగాని బీదలకుగాని స్వంతహక్కు లుండగూడదు. దేశంలో వుండే యావత్తు ధనం మందిసొమ్మే. మంది పంచాయితీ సర్కారు ద్వారా యంత్రములనూ, వ్యవసాయమునూ అజమాయిషీ చేసి వచ్చే ఆదాయంలో నుంచి దేశజను లెవ్వరికీ అన్న లోపం లేకుండా పంచిపెడుతుంది. పనిచేసేవాండ్లకే గ్రామసోవియటు వారు మోయినుచీట్లిస్తారు. యెవరు యేమిపని చేయవలసిందీ పంచాయితీసర్కారే నిర్ణయిస్తారు. భోజన సామగ్రులూ, వస్త్రాలు, చెప్పులూ మొదలైన యావత్తు అవసరవస్తువులూ టికెట్లు పొందిన కుటుంబములకే గ్రామసోవియటు భండారంలో యిస్తారు. సోమరులకు పస్తే. వ్యాధిగ్రస్తులకూ, వృద్ధాప్యంచేతగాని, అంగ వైకల్యంచేతగాని బొత్తిగా పని చేయలేనివారికీ పనినిర్బంధం లేకనే చీట్లిస్తారు. యిది మహాప్రయత్నం. యేసుక్రీస్తుయొక్క బోధలు దీనికి అనుగుణ్యంగానే వుంటవి. పూర్వం మునిపల్లెలలో యీ పద్ధతే జరిగే దనుకుంటాను. పూర్వపు గ్రామపద్ధతీ యిదే. యీ ప్రభుత్వపద్ధతి యెంతవరకు నిలుస్తుందో చెప్పలేము. యీ ప్రకరణయొక్క నిర్మాతలుమాత్రం అత్యుత్సాహంగా పని చేస్తున్నారు. ఈ నూతన ధర్మకర్తపేరు లెనిన్‌మహాశయుడు. వీరి బావమరిది ట్రాట్‌స్కీ అను ఆయన వీరికి చేదోడు. వీరుభ యులూ యూదులు. సృష్టిలోవున్న వస్తుభండారం అనుభవించ

డానికి అందరికీ సమానహక్కు వున్నదనీ అందరూ పనిజేసి అనుభ వించ వలసిందనీ కొందరు అన్నవస్త్రాలులేక మలమల మాడు తుంటే మరికొందరు భోగములలోనూ దుర్వ్యసనములలోనూ మునిగి తేలడం న్యాయంగాదనీ వీరి ముఖ్య సిద్ధాంతాలు. వీరి సిద్ధాంతాలు తప్పనడానికి యెవరికీ సాధ్యంగాదుగాని ఆచరణలో బెట్టడం అసాధ్యమని కొందరికి సందేహం. రష్యాలో ధనికుల భూములూ, యంత్రాలూ, పంచాయితీసర్కారు మందితరఫున జమకట్టుకొని బీదజనులకు పనిజేసేనిమిత్తం ఇచ్చినప్పుడు వారు సంతోషపడ్డారుగాని యంత్రాలవల్లా వ్యవసాయంవల్లా వచ్చే ఆదాయం పనిజేసేవాండ్ల కుటుంబాల అనుభవానికి సరిపోగా మిగి లేది యావత్తూ సోవియటు సర్కారుకు స్వాధీనపర్చమంటే వెను దీస్తున్నారు. యిప్పటివరకు బలాత్కారంగానో బుద్ధిపూర్వకం గానో సోవియటుసర్కారుకు దేశాదాయం యావత్తూ జమ వస్తూనే వున్నది. జను లీ పద్ధతికి అలవాటుపడి జరుపుకుంటారో తిరిగీ విప్లవంవచ్చి పాతపద్ధతులే అమల్లోకి వస్తవో లేక యేకొత్త రూపంగా మారునో చెప్పలేము. ఈ బోల్షెవికు సిద్ధాంతాలు ప్రస్తుతం అమలులోవున్న స్వామ్యసిద్ధాంతాల కన్నిటికీ వ్యతిరేకం. లెనిన్ ప్రభృతులు యీ సిద్ధాంతాలను తమ దేశంలో స్థాపించడమే కాకుండా ప్రపంచమంతటా వ్యాపింప జేస్తామని ఢంకా బజాయిస్తున్నారు. అందుకొరకై కోట్లద్రవ్యం ఖర్చు పెడుతున్నారు. పూర్వపు రష్యా చక్రవర్తులు జయించిన పర రాష్ట్రాలకు పంచాయితీ సర్కారు స్వాతంత్ర్య ప్రదానంజేసి మా రాజుల పాపమును క్షమింపుడని కోరుతున్నారు. ఈ రాష్ట్రా లలో సోవియటుప్రభుత్వాలు స్థాపించబడుచున్నవి. బోల్షెవిక్ భావాలు చెదపురుగులవలె తమకందిన పాత ప్రతిష్ఠాపన లన్ని టిని భగ్నంచేస్తున్నవి. జర్మను ఆస్ట్రియా దేశముల కిదివరకే వ్యాపించినవి. అమెరికా ఫ్రాన్సు దేశాలలోని ధనికవర్గాలు కంపం బొందుతున్నవి. బోల్షెవిక్కులు యింగ్లండు దేశంమీద తమదృష్టి సారించారు. బోల్షెవికు భావతరంగాలు ఆంగ్లమానస

కాసారములను చలింపజేస్తున్నవి. ఆంగ్లధనికవర్గం యీ భావాలను రాకుండా కొట్టవలసిందని వుద్ఘోషిస్తున్నది. భావాలను ఫిరంగులు యెట్లా గొట్టగలవని ప్రభుత్వంవా రంటున్నారు. ఆంగ్లరాజ ప్రకృతి మిక్కిలి పురాతనమైనవాట్లలో నొకటి. ప్రభుత్వంవారు యీ పాత కట్టడాన్ని బూజు దులిపి మరమ్మతు చేయడానికి ప్రయత్నిస్తున్నారు. స్త్రీలకు యెన్నిక అధికార మియ్యబడ్డది. ప్రభుసంఘాన్ని యెన్నిక పద్ధతుల ప్రకారం యేర్పరచనలెనని ప్రయత్నిస్తున్నారు. ప్రజాసంఘములో కొత్తయెన్నికెలు జరిగితే కూలీ సభికులసంఖ్య యెక్కువ కావడం నిశ్చయం. కూలీ ప్రభుత్వం యేర్పడి ఆంగ్లదేశంలో యేమార్పులు వస్తవో, యిండియా ప్రభుత్వాన్ని యెట్లా మారుస్తారో చెప్పలేము. బీదలకు ప్రభుత్వంవారు యిండ్లు కట్టించి యిస్తున్నారు. గనికూలీలు యీమధ్య గట్టిన సమ్మె దేశమంతటా పరవంజి, గనులను నీళ్లలోనూ, దేశాన్ని విప్లవంలోనూ ముంచివేస్తుందని భయపడ్డారు. తక్కిన కూలీసంఘాలుకూడా వొక్కమనుపున గనికూలీలతో చేరినట్లయితే అయిదు నిమిషాలలో ఆంగ్లదేశం రెండవరష్యా అయిపోయేదే. అటువంటి స్థితి రాకుండా యజమానులూ, కూలీలూ రాజీపడుతున్నారు. తెగినదాకా బిగించేపద్ధతి ఆంగ్లేయుల దగ్గర లేదు. గట్టిగా లాగితేనేగాని వారు వంగరు. బోల్షివిక్కు తాకుడుకు ఆంగ్లరాజ్యప్రకృతి వొక్కటిమాత్రమే నిలువగలదని తోస్తుంది. జనులలోని అన్ని సంఘాలకూ ప్రభుత్వంలో పలుకుబడివుంది. జమీందారులూ, మతాధిపతులూ ప్రభుసంఘంలో సభ్యులు. ప్రజాసంఘంలో ధనికులకూ, కూలీలకూ సమానమైన పలుకుబడి యేర్పడుతున్నది. మనదేశంలో కూలీలకు యెన్నికాధికారమే లేదు. అన్నిదేశాలకంటే మనదేశంలోనే పునర్నిర్మాణం యెక్కువ అవసరం. ప్రపంచమందంతటా కూలీలు బీదలే కాని కోట్లకొలదిగా అన్నంలేనివా రుండరు. మనదేశంలోనూ ధనం వ్యవసాయకులకూ, వర్తకులకూ హస్తగతమైవున్నది. పూర్వపు వృత్తివిభజనమే దీనికి కారణం. వృత్తివిభ

జన పద్ధతి పనికిరాదని అందరూ అంటారుగాని పూర్వపద్ధతి వలన గలిగిన లాభాలు వదులుకోకుండా కొత్తపద్ధతులవలన యెక్కువ లాభాలు వస్తే పొందుదా మంటారు. కొత్త లాభాలతోపాటు కొత్త చిక్కులు కూడా వస్తవని గమనించరు. మనము విప్లవ మార్గాలకు దిగగూడదు. యింగ్లండులో యేర్పడుతున్న పద్ధతుల ననుసరించి ఆచి అడుగు వేయడం వుత్తమమార్గం. భూస్వాముల నందరినీ భూములు అందరికీ పంచిపెట్టమంటే అంగీకరిస్తారా? అది మనం కోరడమూ భావ్యంకాదు. మనం పారమార్థికం విచారించి నప్పుడు వారుకూడా న్యాయానికి కట్టుబడి పండే పంటలో కూలీ లకు తగిన భాగం యివ్వడానికీ పోరంబోకులలోనూ, అడవుల లోనూ సారవంతమైన భూములను దిగువజాతులకు దరఖాస్తుల మీద యివ్వడానికీ వారంగీకరించవలసి వుంటుంది. మన విద్యను అభివృద్ధి చేయవలసిన బాధ్యత ధనికులది. ఈ విషయమై యికమీద వారెంతమాత్రం అశ్రద్ధచేయ గిట్టదు! దేశపాల నంలో కూలీలకు అర్హస్థాన మివ్వవలసిందని కోరడం యెక్కువ కోరిక గాదు.

మనవుద్యమం పవిత్రమైనది. దానియందు ద్వేషభావాలకు చోటులేదు. ద్వేషపూరితమైన వుద్యమం మేదీ నిలువజాలదు.

'మావిద్విషావహై' అని భగవంతుణ్ణి మన మందరం ప్రార్థన చెయ్యాలె. కొందరెవరైనా మనలో కేటించేవారున్నా మన ధనికసోదరులు మనవుద్యమాన్ని నిరసించకూడదు. కృష్ణా ప్రవాహం వచ్చి కట్టలుపొంగి కొంతదేశానికి నష్టం గలిగించినా వులవరం బోయినవెంటనే ప్రవాహం యధాస్థితికి రాకతప్పదు. కొంతనష్టం గలిగినా నది యెండిపోవడం కంటె వరదలే మేలు గదా! సంచలనం చైతన్యచిహ్నం, జడత్వం మరణచిహ్నం. ప్రాణ ముంటే యెప్పటికైనా బాగుపడవచ్చునని ఆశ వుంటుంది. కాబట్టి మనలో కొన్ని లోపాలున్నా పంచమేతరులు మానల మన్నించి మనకు తోడ్పడుదురుగాక."

నా వుపన్యాసం ముగిసింది. తమరందరూ మనసంఘాభివృద్ధికై అవసరమైన తీర్మానాలు చేయవలసి వుంటుంది. విషయనిర్ణయ సంఘమేర్పడి చిత్తుతీర్మానాలు తయారు చెయ్యాలె. మన నాయకులైన సంగదాసుగారు చిత్తుతీర్మానాలు వ్రాసి వుంచారు. అవి వారు మీకు చదివివినిపిస్తారు. విన్నతరువాత విషయనిర్ణయ సంఘ మవసరమని మీకుతోస్తే యేర్పాటు చేయవచ్చు. లేకపోతే మనం వెంటనే మహాసభ ప్రారంభింతాం.

సంగదాసుగారు చదివిన తీర్మానాలు:

౧. మనసంఘమువారు నీచమైనపేర్లు పెట్టుకోకూడదనీ తమపేర్లకు అన్నా, అప్పా, అయ్యా, అమ్మా, అక్కా మొదలైన మర్యాదవాచకాలను చేర్చుకోవలసిందనీ, వొకరి నొకరు మర్యాదగా పిలుచుకోవలసిందనీ, అట్లు చేయకపోవడం మన ఆత్మగౌరవానికి భంగమనీ యీసభవారు తీర్మానిస్తున్నారు.

౨. మనపిల్లలందరికీ సామాన్యవిద్యా, వృత్తివిద్యా విధిగా నేర్పించవలసిందని యీసభవారు కోరుతున్నారు.

3. మన సంఘీయులు వృత్తిగౌరవం గలిగి. నేతా, చర్మకారవృత్తీ, వృద్ధిచేసి మన సంఘంయొక్క అర్థస్థితి బాగుచేయవలసిందని యీసభవారు సిఫారసు చేస్తున్నారు.

౪. సంఘగౌరవానికి లోపంగానూ, అర్థాభివృద్ధికి భంగకరంగానూ వున్నటువంటి మద్యపానాది దుర్వ్యాపారములను మానివేయవలసిందని యీసభవారు తమ దృఢాభిప్రాయమును నొక్కివక్కాణిస్తున్నారు.

౫. ఆరోగ్యాభివృద్ధికిగాను స్నానం మొదలైన శౌచపద్ధతులను విధిగా అవలంబించవలసిందని సంఘంవారిని యీ సభవారు మరీ మరీ హెచ్చరిస్తున్నారు.

౬. జీతగాండ్లకూ యితరకూలీలకూ వోట్లిచ్చు అధికారం యియ్యవలసిందని యీసభవారు కోరుతున్నారు.

౮. అడవులలో వ్యవసాయానికి పనికివచ్చే భూములను దిగువ జాతులకు మాత్రమే దరఖాస్తుల కిప్పించవలసిందని యీ సభవారు కోరుతున్నారు.

౯. యిదివరకు పంచములకని దరఖాస్తులకిస్తున్న భూములు చాలావరకు పంచమక్రైస్తవులకే చెందుతున్నందువల్ల హిందూ పంచముల సంఖ్యనుబట్టి వారిభాగానికి రాదగిన భూములను వారికే యిప్పించవలసిందని యీసభవారు ప్రార్థిస్తున్నారు.

౯. యిండ్లనిమిత్తం స్థలములూ, యిండ్లు కట్టుకొనుటకు ద్రవ్యసహాయం యిప్పించవలసిందని యీసభవారు కోరుతున్నారు.

౧౦. పైతరగతులవారు విద్యాధికులై వున్నతోద్యోగాలను ఆక్రమించుకొని వున్నందువల్లనూ దిగువ తెగల కింతలో ఆస్థితి లభించే ఆశ లేనందువల్లనూ పోలీసూ, రివిన్యూ, సివిలూ, ఫారెస్టూ మిలిటరీ మొదలగు శాఖలలో స్వల్పవుద్యోగాలను దిగువజాతులకు ఆపుదల చేయించవలసిందని యీసభవారు ప్రార్థిస్తున్నారు.

౧౧. మందిసొమ్ము వుపయోగించి యేర్పరచిన విద్యాలయాలు, బావులు, చెరువులు, సత్రాలు, దేవాలయాలు మొదలైనవాటిలో దిగువతరగతుల హక్కులను అంగీకరించవలసిందనీ, వాటిలో కొన్నిటిని ప్రస్తుతం వారికై ప్రత్యేకించవలసిందని యీ సభవారు కోరుతున్నారు.

౧౨. బహిరంగస్థలాలలోగూడ పంచములను దూరస్థుల జేసే ఆచారం ఆత్మగౌరవం గల పంచములకు దుస్సహంగావున్న దని తదితర సంఘాలకు తెలియపరుస్తున్నారు.

౧౩. వ్యవసాయపు పనులలో పనివాండ్ల కిచ్చుకూలి స్వల్పంగా వున్నందువల్ల తగురీతిని హెచ్చించవలసిందని రైతులకు యీ సభవారు విన్నవించు కొనుచున్నారు.

౧౪. ప్రధానస్థలములలో పంచముల వుపయోగం నిమిత్తం వృత్తివిద్యా, సామాన్యవిద్యా నేర్పే పెద్దవిద్యాలయం స్థాపించి

వసతిగృహం యేర్పరచడం అత్యవసరమని యీ సభవారు తీర్మా
నిస్తున్నారు.

చిత్తు తీర్మానా లందరూ విని విషయనిర్ణయసంఘం అవ
సరం లేదనీ, కొత్త తీర్మానాలు చేర్చవలసివుంటే సభాపతిగారికి
పంపవచ్చుననీ, సభ ఫలహారా లయిన తరువాత జరుపవలసినదనీ
నిశ్చయించారు.

మూడుగంటలకు సభ తిరిగిసమావేశమైంది. తీర్మానాలన్నీ
సక్రమంగా ప్రస్తావించబడి ఆమోదించబడిన తరువాత సభవారిచే
అంగీకరించబడ్డవి. నూతక్కి రామయ్యగారు పంచముల నిమిత్తం
తమ పూరిపల్లెలో రాములవారి దేవాలయం కట్టిస్తానని ప్రచు
రించారు. రామచంద్రచౌదరిగారు తమ గ్రామంలో ఉండే పంచ
ముల తాలూకు ఆంజనేయస్వామివారి దేవాలయానికి మూడెక
రాల తరిభూమి చదివించారు. మరి వొకరు:

౧౫. కూలీలకు సక్రమమైనకూలి యియ్యక వారిశ్రమ
వలనవచ్చే ఆదాయంలో విశేషభాగం భూస్వాములే అనుభవిస్తు
న్నందువల్ల వేతల కోతల కాలాలలో కూలీలు సమ్మెకట్టి సహాయ
నిరాకరణ మవలంబించవలసిందని యీ సభవారు తీర్మానిస్తు
న్నారనే కొత్తతీర్మానాన్ని ప్రస్తావించగోరారు.

౧3 వ తీర్మానం సౌమ్యంగా వ్యవహారం ఫైసలు చేసుకోవ
డానికి వ్యవసాయదారులకు అవకాశమిస్తున్నందున శరణార్థికి చంక
దుడ్డు పనికిరానట్టు యీతీర్మానం ప్రస్తుతం విరమించ వలసిందని
సభాపతిగారు కోరినందువల్ల ఆపివేయబడ్డది. నిర్వాహక సంఘ
మేర్పడి సంగదాసుగారు కార్యదర్శిగా నియమింపబడ్డారు. సోమ
యాజులు గారు తమఆనందాన్ని వెలిబుచ్చుతూ మంగళశ్లోకాలు
చదివారు. సభాపతిగారు సభను విరమిస్తూ తమ వుపసంహారోప
న్యాసంలో సంగదాసుగారిని ప్రశంసించి వారిత్యాగంవల్లనే మన
వుద్యమం నెరవేరవలసి వుంటుందని చెప్పి చరమోపన్యాసం
ముగించారు వందనాలతో సభ ముగిసింది.

## ౨౪

## నన్ను మరచిపోబోకు

రాత్రి పదిగంటల రైలుకు సభాపతిగారు హైదరాబాదుకు పోయినారు. నర్సారావుపేట బండిమీద రామానాయుడూ, సంగదాసూ ప్రయాణమైనారు. కాన్ఫరెన్సును గురించే చాలాసేపు ముచ్చటించారు. ఊళ్ళో సమ్మె యేమైవుంటుందో ననుకొన్నారు. నామకా నేను కార్యదర్శినైనా పని నిర్వహించే భారం నీమీదనే వుంటుందని సంగదా సన్నాడు.

సం :- రామానాయుడూ! రైలులో కూర్చున్నప్పటి నుంచీ నాకేదో తమాషాగా కనుపడుతున్నది. ఈ రైలే వొక ప్రపంచంలాగుంది. జీవితంగూడా వొక ప్రయాణం వంటిదే. మన మంతా వొక్కమాటు యెక్క లేదుగదా? కాసేపు మనకు కొందరితో సంబంధం గలిగింది. కాలము తీరిపోయినవాండ్లు చచ్చిపోయినట్లు ప్రయాణం అంత్యం కాంగనే ప్రతివాడూ దిగుతాడు. ప్రపంచంలో చచ్చేవాండ్లను అవతలకు యీడుస్తాము, పుట్టే వాండ్లను ఆహ్వానం చేస్తాం. ఇట్లా యెప్పటినుంచి జరుగుతున్నదో! ఇంకా యెంతకాలం జరుగుతుందో! ఇదంతా యేమిటయ్యా అని యెవరినైనా అడిగితే తలా వొక జవాబు చెపుతారు. ప్రపంచం పుట్టినప్పటినుంచీ యిప్పటివరకు ప్రశ్న అడగడం, జవాబు చెప్పడం తటస్థిస్తున్నది. మతకర్తలు పుట్టారు. ఇదంతా యేమిటయ్యా అనే ప్రశ్నను పట్టుకొని లాగులాడారు. తపస్సులుచేసి తల్లక్రిందులైనారు. దీర్ఘచర్చలుచేసి సవాలక్ష గ్రంథం వ్రాశారు. వొకరి జవాబు వొకరికి పొసగదు. మొత్తంమీద చూస్తే వొకరికీ అంతుపట్టినట్లు లేదు. చివరకు,

"శ్లో॥ శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః,
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్."

అనేదే తేలుతున్నది.

రా:- ఏమిటిది? నీ బుద్ధి చాకచక్యమంతా వదిలిపెట్టి యిట్లా నీరసంగా మాట్లాడుతున్నావు.

సం:- మన బుద్ధులు కణిపెడేసి కొలబుఱ్ఱలు. వీటిసిబెట్టి అనంతుణ్ణి కొలవాలెనని ప్రయత్నం చేస్తాం. ఎట్లా తేలుతుంది? ఇది సాధ్యంగాదనే సద్గురుడు,

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః

అని ఆఖరుమాట చెప్పాడు.

రా:- స్టేషను దగ్గరకు వస్తున్నది. సామాను సర్దుకో.

సం:- సర్దుకొనే దేమున్నది?

"పొయ్యేటప్పుడు వెంటరాదు వొక పుచ్చిన వక్కైనా" అన్నాడు. నిన్ను విడిచిపెట్టి పోవడమంటే నాకు కష్టంగా వుంది. మళ్ళీ యెప్పటికో చూడడం.

రా:- నీవు లేనిరోజులు నేను యెట్లా గడుపుతానో. నీవు కృష్ణుడివి; నేను అర్జునుడనుగా రోజులు గడుపుతుంటిమి.

సం:- నాయుడూ! నేను వెళ్లుతున్నాను. నన్ను మరచి పోబోకు.

ఉభయులు కావలించుకొన్నారు. ఇదివరకు మనసులు మాత్రం కలసిపోయినవి. ఇప్పుడు దేహాలుకూడా వొకటైనవి. సంగదాసు కిందికి దిగాడు. గంట కొట్టారు. రైలు సాగింది. ఉభయులు దూరమైపోయినారు. వాతావరణం మారిపోయింది. సంగదాసు స్టేషనులోకి పోయి టిక్కెట్టిచ్చాడు. గంట రెండు దాటింది. కాసేపు తాళిపోదామని బల్లమీద పడుకొన్నాడు. వేళదప్పి నిదుర పట్టలేదు. నల్లులు కుట్టడం ప్రారంభించినవి. లేచి కూర్చు న్నాడు. మూడు విన్నాడు. యాదాలాపాన నాలుగు లెక్క పెట్టటం మరచిపోయినాడు. చిరుచలితో మిశ్రమమై రవ్వగాలి సాగింది. పది నిమిషాలలో బడలిక తీరింది. చుక్క బొడవంగనే బయలుదేరాడు. నడచినకొద్దీ వుత్సాహమూ యెక్కువయింది.

బాడిగబండ్లు రాతిబల్ల లెత్తుకొని యెదురుగా వచ్చినవి. తూర్పున చీకటి దండెలు విచ్చడం ప్రారంభించింది. ఊరుదగ్గరకు పోయే వరకు భల్లున తెల్లవారి ఆకాశాన యెర్రదాలు గప్పింది.

సంగదాసు రావడం తన గదిలోకే వచ్చాడు. తాళందీసి కోటు తలగుడ్డ చిలుకకు తగిలించి తలుపువేసి వేపపుల్ల కోసం ఆవుల దొడ్లోకి పోయినాడు.

సం:- ఆదంసాహేబూ! ఊళ్ళో కథలేమిటి?

ఆదం:- కథలేమిటి, ఊరంతా అట్టుడికినట్టు వుడుకుతున్నది.

సం:- కూర్చుందాం. కథంతా నాకు చెప్పు. మీరంతా కూర్చోండోయ్.

ఆ:- ఇప్పుడు వొకటికి రెండు కథలైనవి. ఇక్కడ సమ్మె కథ. అక్కడ మీటింగు కథ. ముందు మీటింగు కథ చెప్పుతాను. చిన్నయ్యగారు వస్తే చాల గడబిడ అయ్యేటట్టుంది. అసలు పెద్దయ్యగారు అనుకోవడం మీ రిద్దరూ గుడివుదగ్గరకు పోయి నారని. బెజవాడ పోతారని తెలిస్తే మర్తూరు కదలనిచ్చేవాడే కాడు. మీరిద్దరూ కలిసి యెక్కడో స్టేషనులో మాదిగవాడిచేతి అన్నం లొట్టలువేసుకుంటూ కేకిసలు కొట్టుతూ తింటున్నారట. మన మునసబు మీ దగ్గరకువస్తే వూరించి తిండువుగాని రమ్మన్నారట. ఆయన మీ కిదేమి చేటుకాలమని మందలిస్తే గల్లింతా యిస్తామన్నారట. మీ నాయనగారితో చెప్పుతామంటే మీ తాతకు చెప్పుకో పొమ్మన్నారట. రామానాయుడుగారు మాల పల్లెలోనే మేడవేసి కాపురం పెడతారని చెప్పుకుంటున్నారు. మునసబు వెలివేయించవలెనని నాలుగు కులాలవాండ్లనూ పోగు చేస్తున్నాడు. లక్ష్మమ్మగారికి నిన్నల్లా అన్నంలేదు. ఏమింతో చక కాలుగాలిన పిల్లివలె తిరుగుతున్నది. ఇక చౌదరయ్యగారు నిన్ను చూస్తే మింగేటట్టుగా ఉగ్రుడై మండిపడుతున్నాడు.

సం:- ఇక రెండో కథ చెప్పు.

ఆ:- రెండో కథా ! ఊళ్ళో కూలివాళ్ళంతా నిన్న కోతలకు వస్తారని చౌదరయ్యగా రనుకొన్నారు. మీరు బందుచేసి పోయిన సంగతి నప్పరివారికి తెలియనే తెలియదు. నాలుగువందలమంది కూలీలను పోగుచేసి సాయంత్రానికి కోత అయిందనిపించాలెనని చూశాడు. జీతగాండ్లందరిని అరకలకు పంపడం మానిపించి కూలీలను పోగుజేసుకొని కోతలకు పొమ్మన్నాడు. వెంకటయ్యను పల్లెలకు బంపాడు. తాను కాలికి బలపం గట్టుకొని ఊళ్ళో యిల్లిల్లు తిరిగాడు. యిదంతా సాయంత్రం కూలీ బిగపట్టడానికి ప్రయత్నం. కూలీలంతా బలేపని చేశారు. శేషయ్య అందిస్తే అల్లుకపోయే మనిషి. మీరు చూచాయగా అనిపోయినారు. వాడు ప్రబలం జేశాడు. కూలీలు అంతా వస్తామని చెప్పారు. ఊళ్ళో ఆసాములు యెవరి యిలాకా కూలీలను వాండ్లు చాటుగా ముందు కూలిల్చి గట్టిజేసుకున్నారు. వొకరి సంగతి వొకరికి తెలియదు. అంతా తోడుదొంగలే. పెద్దయ్యగారు తాను అన్నందిని స్వయంగా బయలుదేరాడు. కూలీలంతా తిరునాళ్ళ పజగా సాగారు. వీండ్లంతా తన చేనికే వస్తున్నారనుకున్నాడు. గమిడి దాటంగనే పిలిచినా పలక్కుండా వాండ్లలో వాండ్లు నవ్వుకుంటూ యెవరిదారిన వాండ్లు దూసుకున్నారు. అయ్యగారు దిగాలపోయి పల్లెవంక పోయేవరకు వెంకటయ్య బిక్కమొగం వేసుకొని యెదురుగావచ్చి మోసం జేశారని చెప్పాడు. అంతట యింటికి జేరి పంతులును బిలిపించి కచేరిలో గూర్చొని చాలాసేపు తలపట్లు పట్టుకున్నారు. వాండ్లు యెంతాలోచించినా దీనికి ఖులస్సు చిక్కలేదు. వాడికీ వులిపికట్టె వెంగన్నకు సారాయి విషయంలో కటకట జేశారని మీరంటే సరిపడదు. పంతులు వచ్చి జాడలు దీస్తే నీవే బందోబస్తు చేసిపోయినావని చెప్పాడు. అప్పుడు నీకోసం పెద్దయ్యగారు నన్ను మాలపల్లె తరిమితే వచ్చి కనుక్కుంటే మీరు వూరికి వెళ్లిపోయినారని చెప్పారు. ఆ సంగతి వచ్చి చెప్పాను. పెద్దయ్య పండ్లు పటపట గొరికి యిదంతా వీడు చేసిపోయిందే నన్నాడు. అంతట నేనూ పంతులూ ఆయనా

గలిసి పాలెం బోయినాం. చిన్నపరెడ్డి పదిమందిలో బట్టుకొని "నీ దెప్పుడూ లోకులను ముంచే వ్యవహారమే. నీతో వ్యవహారం యిక్కడికే తలబట్టింది. కూలీల సంగతి యిక నాతో తలపెట్టవ" ద్దన్నాడు.

చౌ:- పొరబాటు జరిగింది. మాలవాడు నన్ను దుబికించాడు.

చి:- అవును తాడిచెట్టంతవాడికి తలతన్నేవా డుంటాడు.

చౌ:- నామాట చెవిదూరనియ్యవేమి? యిప్పుడు మిగిలి పోయిం దేముంది?

చి:- అట్లా అనుకున్నావుగామాలె. యిప్పుడు మిగిలివున్న దేమున్నది? మీ వూరిమాట విని ఆసాములంతా విరగబడి పోయినారు. కాకపోయినా నిన్న మాల మాదిగెలు బెజవాడలో సభజేసి యింకా జీతమూ, కూలీ యెక్కించమని గోలెత్తారట. యింతకుముందే బెజవాడనుంచి మనుష్యులు వచ్చారు. ఇప్పుడు మనం తగ్గించడానికి ప్రయత్నంజేస్తే అల్లరెక్కువవుతుంది. యీ సభ అంతేమోచూచి పర్యాయితీన చూచుకుందాం. ప్రస్తుతం సంక్షేపించు.

చౌ:- నే నిప్పుడు వూళ్లోకి పోతే గేలిగొట్టరా? యిరవై పుట్ల జొన్నలూ మట్టిలో గలసినా నేను వెనక్కుబోను.

చి:- మట్టిలో గలిస్తే వచ్చే సెబ్బరేమిటి? ముందుకు విత్తనాలు జల్లకుండా పండుతవి. యింట్లో ముక్కిపోతున్న పాతళ్లు పదేండ్లు తినవచ్చు.

చౌ.- నీదంతా పరియాచికం. వూళ్లో తలయెత్తడానికి నాకు మొగం జెల్లడంలేదు. ఇక అందరూ తాతా అని పిలవడం ఆరంభిస్తారు.

చి:- నీకు మనుమడు యిదివరకే పుట్టాడుగదా. తాతవు యిదివరకే అయినావు. వూరికె విపర్యాసాలుపోక యింటికిబో. వ్యవహారాని కెప్పుడూ లగువు బిగువు లుండాలె. సమయం

గనిపెట్టి పోవాల్నేగాని దూకుదామంటే కుదరదు. భోజనానికి యీపూట కిక్కడనే నిలువు. తగువాత నీయిష్టం.

చౌ:- కాదు పోవాలె. నేను కూలివాండ్ల మొగం చూడ డానికి యిష్టంలేదు. యీ యేటి కోతలు మా పంతులుగారికి వొప్ప జెపుతాను.

అని యింటికి వచ్చాడు. యిది జరిగిన కథ. తరువాత నీ యిష్టం. యిదేమయినా నెరవేరేదేనా? చౌదరయ్యగారి వుక్రోష మణిగేదాకా ఆయన యెదట బడవద్దు. యీవేళా, రేపూ కాస్త తమాయించు.

సం:- మీరు అధైర్యపడవద్దు. మనం గెలుస్తాం.

యీ సంభాషణ జరుగుతుండగా చౌదరయ్య వీధిలోకి వచ్చాడు. సంగదాసు గదికి తాళం లేకపోవడం జూచి వెంగ న్నను బిలిచాడు. వెంగన్న అయ్యా అని దొడ్లోనుంచి పొగాకు నములుతూ బయటికి వచ్చాడు.

చౌ:- మాలవాడు రాంగానే చెప్పమంటే చెప్పలేదేమి?

వెం:- ఆపనిమీదనే వున్నా. ఆవులదొడ్లో జీతగాండ్లకు బడిబెట్టి బోధ జేస్తున్నాడు.

చౌ:- వీడు నన్ను నిలవనిచ్చేటట్టు లేదు.

అని అక్కడ పడివున్న రాగోల బుజాన బెట్టుకొని బయలు దేరాడు. యీన రావడం జూచి జీతగాండ్లు ఆవులదొడ్డి తలుపు లోపలి తూర్పువాకిలిగుండా గొళ్లెమువేసి బీట్లోకి పరుగెత్తారు. చౌదరయ్య తలుపుదన్ని "తీయి తలుపు" అని కేకలేశాడు. దాసు మెల్లగా తలుపుదీసి లేడిపిల్ల వలె బిత్తర చూపులు జూస్తూ వోరగా నిలువబడ్డాడు.

చౌదరయ్యకు పండ్లు పటపట మంటున్నవి. దేహం స్వాధీనంలో లేదు. శరీరం కట్టెబారింది. ముఖమంతా ముడతలు బడ్డది. కండ్లు బెత్తులై పైకుబికినవి. పెదవులు బిగిసి వుశ్వాసమాగి పోయింది. దేహం జేవురించి చెమర్చింది. మనసు క్రోధపూరి

తన్మై ఘూర్ణించింది. వేళ్లు అరవడి బడేటట్టుగా రాగోల బిగబట్టి తలమీద గొట్టాడు. సంగదాసు అల్లుడీసిన తీగవలె చతికెలబడి నేల కొరిగాడు. తల దానిమ్మపండువలె బద్దలయింది. లోకంలోని అక్రమాలను జూచి ఆక్రోశించిన రక్తం, వున్నత భావాలను వుద్రేకించిన రక్తం, పరులసేవలో పాలిపోయిన రక్తం, పవిత్ర భావాలచేత పావనమైన రక్తం, గొట్టాన జిమ్మినట్టు ప్రవహిస్తున్నది. భూమి పావనమైంది. చౌదరయ్యకు రక్తం జూచేవరకు కళ్లు బైర్లుగమ్మినవి. రాగోల దిబ్బలో విసిరివేసి తలుపు గొళ్లెం తగిలించి యింట్లోకి పరుగెత్తాడు. యెవరో వెంటబడి తరుముతున్నట్టు దోచింది. లక్ష్మమ్మ ముంగిట్లోకి యెదురుగా వచ్చి 'యేమిటం'టే మాట్లాడక భవంతిలోకి బరుగెత్తి పడమటింట్లో జొరబడి పత్తిమండెక్కాడు. లక్ష్మమ్మ లోపలికి పరుగెత్తివచ్చి యేమిటో కొంప మునిగింది, చెప్పమంటే చెప్పవేమని అడిగింది.

చౌ:- మాలవాడిని ఆవులదొడ్లో కర్రతో గొడితే చచ్చాడు. దబ్బునపోయి దిబ్బలో పాతివేయించు.

"కొట్టడమేమిటి—చావడమేమిటి—యిదేందో ముంచక పోయేందుకు వచ్చింద"ని లక్ష్మమ్మ కత్తివాటేసినా మొగాన నెత్తురు లేకుండా వీధివాకిట్లో నిలుచున్నది.

బీట్లోకి పరుగెత్తిన జీతగాండ్లలో వొకడు రాగోల పైకెత్తడం జూచాడు. ఫెళ్ళున దెబ్బ వినపడ్డది. "అయ్యో చంపాడురా" అని కేకవేశాడు. జీతగాండ్లంతా పరుగెత్తుకొని వచ్చారు. రక్తప్రవాహం జూచేవరకు ఆవేశమెక్కింది. అయ్యో మన రత్నం బోయిందిరా అన్నారు. తలుపు గొళ్ళెం వేసున్నది. మూడు తన్నులకు విరిగిపడ్డది. ఆ యెర్రమీద యేడి యేడని వీధిలోకి పరుగెత్తారు. లక్ష్మమ్మనుజూచి,

జీ:- ఏడీ? వాడేడీ? చంపి యింట్లో జొరబడ్డాడు.

ఆదం:- ఏడీ వాడు? రక్తంకళ్ళ జూస్తాం.

సత్తి:- ఏడీ పేగులుబీకి జందెం వేసుకుంటా.

నాగడు:- కండ్ల గ్గనబడితే ముక్కలుగా నరికి గద్దలకు పారేస్తా.

లక్ష్మమ్మకు తందరబుట్టింది. నిబ్బరించుకొని "యింట్లోకి రాలేదు. కొట్టంలోకి బోయినా"డన్నది. కొట్టూ కొట్టూ అని జనమంతా కొట్టంలోకి పరుగెత్తారు. లక్ష్మమ్మ తటాలున వీథి తలుపువేసి గడియ బిగించింది. చౌదరయ్య కొట్టంలో కనబడ లేదు. మళ్ళీ వీథిలోకి అంతా పరుగెత్తారు. తలుపు వేసివున్నది. వీథిలో నిలుచుండి తలుపులు పగలదన్నమని కేకలు వేస్తున్నారు. పది తన్నులకైనా తలుపు కదలలేదు. ఉద్రేకం కొంత అణిగింది. మదురుబోసిన ప్రహరీగోడవంక చూశారు. గోడ చేతికి మిగిలి వున్నది. మృగం తప్పించుకొన్న వేటకాండ్లవలె రోజుతూ అందరూ నిలువబడ్డారు. కొంత శాంతం వచ్చింది.

సత్తి:- ఆదంసాహెబూ! నేను మాలపల్లెకుబోయి వాండ్ల వాండ్లను తీసుకొని వస్తా. మీరు మునసబుకు రిపోర్టు చెయ్యండి.

సత్తిగాడు మాలపల్లెకు పరుగెత్తాడు. కొందరు దొడ్లోకి పోయినారు. ఆదం సాహెబు మునసబు దగ్గరకుబోయి జరిగిన సంగతి రిపోర్టిచ్చాడు.

ము:- మీరా సాహెబూ! తక్షణం నీవుబోయి పోలీసు స్టేషన్‌లో రిపోర్టిచ్చిరా. ఇదుగో మాట (రహస్యంగా) ఇన్‌స్పెక్టరుగారితో వేవిలిచేను పండిందని చెప్పు. బాగా సిబ్బందితో రావాలె.

మీ:- చిత్తం. పంటంతా మీరందరూ పొడుపుకున్నా కాశిని గగ్గులైనా నాకు బెట్టించండి. పిల్లలుగలవాడిని.

మునసబు:- పని పఖడుగా చేసుకురా, నీకు లేకపోతుందిట.

మీరాసాహెబు రిపోర్టు దీసుకొని బేడీలూ, తుపాకులతో పోలీసుఘాటు తీసుకొని వస్తానని పుకారుబుట్టించి పోయినాడు. వాకిట్లో అల్లరి అణగంగనే లక్ష్మమ్మ అక్కలక్ష్మిని దిడ్డివాకిట పంతులింటికి బంపించ పడమటింట్లోకి వచ్చింది.

చౌ:- ఎవరది ?

లక్ష్మమ్మ:- నే నే.

చౌ:- ఏమిజేశావు ?

ల:- ఏమిజేసేటట్టుగా వుందిప్పుడు. జీతగాండ్లు చంపుతాం కరుస్తామని యింటిమీద బడ్డారు. దరవాజాతలుపు బిగిస్తే కాసేపు అల్లరిజేసి వెళ్ళిపోయినారు. ఇప్పుడు బయటికి తలజూపేటట్టులేదు. పెద్దవాడు పొలంనుంచి రాలేదు. అక్కలక్ష్మిని పంతులుకోసం పంపించా.

చౌ:- పంతులు అటు చేరడుగదా ? ముందుగానే యిక్కడ వున్నానని చెప్పబోకు. నీవు మండెమీదకెక్కి పత్తితీసి నామీద గప్పి వట్టితట్టలు దానిమీద బెట్టు.

లక్ష్మమ్మకు కాళ్ళలో కలక కనిపించలేదు. చివ్వున మండె మీదికెక్కింది. పత్తి మీదవేసి తట్టలు పెట్టింది. చౌదరయ్యకు వూపిరి సలపక పుడ్డు కుడుచుకున్నట్టయింది. వొళ్ళు చెమటపోసి దాహమయింది. పత్తి కాకకు నిలువలేకపోయినాడు. కొంచెం మసిలేవరకు తట్టలు క్రిందికి దొర్లిపోయినవి.

చౌ:- ఇవి సమయానికి పుట్టుముంచుతవేమో. అయినా మళ్ళీ బెట్టు.

అక్క:- అమ్మా ! పంతులు దొడ్లోకి వచ్చాడు. రమ్మనేదా ?

లక్ష్మమ్మ:- రమ్మను.

లక్ష్మమ్మ బయటికివచ్చి గది తలుపులు వేసి "తమ్ముడూ ! నా పసుపుకుంకానికి తెరువులు వచ్చినవి. తరువాత సంగతి యేమైనా, అవమానం జరిగేటట్టుగా వుంది. ఏజావో చూసుకో వలసిందేగాని ప్రజలమొగం చూడడానికి వీలులేదు. చిన్నపిల్ల వాడుగూడా లేడు. ఊళ్ళో అల్లరికే యిదవుతుంటే అస్సలుకే మోసం వచ్చింది. మేము నడిసముద్రంలో వున్నాం. గట్టెక్కే మార్గమేమైనా చూస్తావా లేదా ? నేను యీ వూరువచ్చి ముప్పై

యేండ్లయింది. తలలో నాలికవలె వున్నావు. ఏమిబెట్టానో ఏమి జేశానో రెండోకంటివాండ్లెరుగరు. వొక్కమాటనుకోలేదు. మీ బావను వొడ్డు చేర్చుకుండే భారం నీ''దని గోడు గోడున ఏడ్చింది.

పం:- అక్కా! నీ వింతగా చెప్పనవసరంలేదు. నీవు వొకరివంటిదానవుగావు. నీది యెముకలేని చెయ్యి. నీ ధర్మగుణమే నిన్ను రక్షించాలె. మునసబు రిపోర్టులో యేమీ పసలేదు. డబ్బును బావ సంపాయించాడుగాని బావను డబ్బు సంపాయించలేదు. సమయమటువంటిది. మునసబు దగ్గరనుంచి డిప్టిసూపరెంటుదాకా అన్ని నోళ్ళూ గట్టాలె. నాలుగయిదు సంచులు వదలక తప్పవు.

లక్ష్మమ్మ తలుపుతీసింది. చౌదరయ్య సంభాషణ వింటూనే వున్నాడు.

లక్ష్మమ్మ :- ఏమంటావు? పంతులు వచ్చాడు.

చౌ:- పంతులూ! నాలుగింటితో సరిపుచ్చలేవా? (అని బావిలోంచి వచ్చినట్లు శబ్దం వినపడ్డది.)

పం:- బావా! నీవు నాకు చెప్పాలెనా? శాయశక్తులా చూస్తా. అవసరమైతే వొకటో, అరో పైన అంటా. వొకవేళ తండ్రిని లోబరచుకోవలసి వస్తుందేమో.

చౌ:- తండ్రిమాట తలపెట్టవద్దు. మాలమాదిగెలకు దండగలిచ్చి యీ వూళ్ళో యింకా నిభాయించనా? ఆఖరుకు అయిదైనా సర్కారుకు గట్టు. అది మొగసిరిపని. సంచుమాత్రం యెక్కడా వుంచవద్దు. పోలీసువాండ్లను మన యింటిదగ్గరకు రానియ్యకుండా అంతా మీ యింటిదగ్గరనే ఫైసల్ చేయించు. పోలీసులు వూరు విడిచిన తర్వాత యిక్కడికి రా. —యేమేవ్! అయిదు సంచులూ దిడ్డివాకిట పంతులింటికి జేర్పించు. వీధివాకిలి మాత్రం తియ్యవద్దు—పంతులూ! నీవు దిడ్డివాకిట రావడం యెవరైనా జూచారా?

పం:- ఎవరూ నా కెదురుపడలేదు.

పంతులు వెళ్ళిపోయినాడు.

## ౨౫

## మనం గెలుస్తాం

సత్తిగాడు మాలపల్లి బోయి యింట్లో జెప్పి రామదాసు పొలంబోయినాడంటే అక్కడికి పోయినాడు. వెంకటదాసు "వాడి శిరసు యీవాళ నేలబడాలె"నని గండ్రగొడ్డలి దీసికొని పరుగెత్తాడు. మాలచ్మి పిల్లలను తీసుకొని యేడుస్తూ వచ్చింది. వెంకటదాసు 'యేడేవా'డంటూ చౌదరయ్యయింటికి బోయి "ఆడదానివలె యింట్లో దాక్కున్నావా? బయటకురా." అంటూ బూతులుతిట్టి గండ్రగొడ్డలితో తలుపుమీద నాలుగుపెట్లు పెట్టాడు. ప్రతిధ్వనితప్ప మరి జవాబులేదు. వెంకటదాసు రాంగనే జీతగాండ్లూ, వూళ్లో కూలివాండ్లూ మళ్ళీ చెలరేగి యింటిమీద రాళ్ల వాన గురిపించారు. శేషయ్య సాయంత్రంలోగా ప్రాణానికి ప్రాణం బలిపెడతానని వెఱ్ఱెత్తి వీథులవెంబడి తిరుగుతున్నాడు. రంగదాసు వెంకటదాసు చేతులో గొడ్డలి లాక్కొని యింటికి బంపాడు. వీరదాసు రెండువైపులా పుఱ్ఱెలు లేవక తప్పవని మోహరించి గడపమీద గూర్చున్నాడు. వెంకటయ్య పొలము నుంచి వచ్చి కథ యీవత్తూవిని గోలజేసేవాం డ్లందరికీ దణ్ణాలు బెడుతూ కాళ్లూ, కడుపులూ బట్టుకొని బతిమెలాడుతూ "మాకిది వర కేమయినా విరోధాలున్నవా? ఎవండ్ల పెద్దలను యెవరు జంపారు? కానిరోజులు వచ్చేవరకు అన్నీ అట్లా తటస్తపడత"వని అందరినీ శాంతింప జేస్తున్నాడు. మాలచ్మి గుండెలు కొట్టు కుంటూ "మానాయన యేడీ? మా బంగారుకొండ యేడీ? మా సంగన్న యేడీ?" అంటూ వినేవాండ్ల హృదయాలు కరిగిపొయ్యే ట్టుగా సన్నగొంతుతో రోదనంజేస్తూ వచ్చింది. "అది మాల కులస్తురా లయినా దాని నోట ఒక్క పరుషవాక్కు అయినా వస్తుందేమో చూడండి. వాండ్లందరూ మంచివేత్త" లని వెంకట సుబ్బయ్య అన్నాడు. రంగదాసు మాలచ్మిని చేయిపట్టి ఆవుల దొడ్లోకి తీసుకొని పోయినాడు. రక్తప్రవాహం జూచేవరకు తల్లి

కడుపు తరుక్కొనిపోయింది. కండ్లు భ్రమలు కప్పినవి. 'ఏడీ మా సంగన్న' అని నేలగొట్టి మీదబడి ముద్దుబెట్టుకున్నది. "ఓరి సంగడూ! నా ముద్దులసంగడూ! నీకాలిన ముల్లుగుచ్చుకుంటే నా ప్రాణాలు విలవిల లాడేవి. నీ తల పదిచెక్కలైతే చూచి నా గుండె వక్కలుగాలేదు. నేను నిర్భాగ్యురాలిని. యే అదృష్టవంతురాలి కడుపునన్నా పుడితే నీకు అచ్చటా ముచ్చటా జరిగేవేమో. పెండ్లి లేదు. పేరంటం లేదు. మా నాయనకు యిరవై అయిదేండ్లు వచ్చినా ప్రపంచధర్మ మెరుగడు. ఆడవాండ్లు పోతూవుంటే తలయెత్తి చూడడు. ఆ శుకయోగి యేవో తపోభంగమై అరుంధతి బుట్టినట్లుగా మా మాలకొంపల్లో బుట్టావు గాని మా కెందుకు దక్కుతావయ్యా నీవు. తండ్రీ! నీవు పుట్టడం వల్ల మేము ధన్యులమైనా మనుకొన్నాం. మా మాలపల్లె పవిత్రమైపోయింది. యింట్లో చుట్ట తాగడానికి భయపడ్డారు. మాలపల్లెంతా సారాయి మానుకున్నది. యింట్లో యే మూలజూచినా పుస్తకాలే. మాలగూడెంలోకి రామాయణ భారతాలు జొరబడ్డవి. నాయనా! భావులు తవ్విస్తానంటివి. దేవాలయాలు కట్టిస్తానంటివి. బళ్లు బెట్టిస్తా నంటివి. మాలపల్లెలు మునిపల్లెలు చేయవలెనంటివి. ఏవీ? నీ రోజులు లెక్కచూసుకోకుండా కోరికెలు కోరావేమి?"

రం – ఇంకా ప్రాణముందబ్బా. పెదవులు కదిలిస్తున్నాడు. మాలక్ష్మి! నీవు మాట్లాడించి చూడు?

మా:– సంగడూ—అమ్మను—మీ అమ్మనూ—పలకవేమి?

రం:– ఏదో అంటున్నాడు. నిశ్శబ్దంగా వుండండి.

సం:– మనం గెలుస్తాం.

రం:– అదేదో తిరుపుమరుపుమాట. సంధి ప్రారంభించింది.

ఆ:– దెబ్బ తగలబోయే ముందు నాతో యీ మాటే అంటున్నాడు.

పం:- సంధి సమయంలో వెనకటి మాటలే మళ్ళీ అంటూ వుంటారు.

రామదాసు పరుగెత్తుకుంటూ వచ్చాడు. చూచి నిర్ఘాంత పోయినాడు. సద్గురూ! నీ దయ యిట్లా వచ్చిందా అని దగ్గిర కూర్చొని చెక్కిళ్లు నవరించాడు. ఎదురురొమ్ము మీద చెయ్యి బెట్టుకొని తదేక దృష్టితో సంగదాసువంక చూస్తూ కూర్చున్నాడు. అయిదు నిమిషాలు గుటగుటలాడి నోరు టక్కిన మూత పడ్డది. పోతున్నద పోతున్న దన్నారు. మాలక్ష్మిని రామదాసు ఏడువవద్దన్నాడు. మాలక్ష్మి విరుచుకొని పడిపోయింది. రామదాసు దుఃఖాన్ని. ఆయన వేదాంతం ఆపలేకపోయింది. పెద్ద పెట్టున సంగన్నా! అని కేకవేసి యేడ్చాడు. అయిపోయిందన్నారు. యేమి పోయిందో యెవరికీ తెలియదు. జనంలో ఆహాకారాలు బుట్టినవి. శవంమీద గుడ్డకప్పి అంతా నిశ్శబ్దంగా కూర్చున్నారు.

ఇంతలోకి మొహతాదు వచ్చి మునసబుగారితో పోలీసు ఘూటు వస్తున్నదని చెప్పాడు.

పం:- మీరంతా అటు పొండర్రా యెందు కిక్కడ. చూర్లుబార్లు తీరిపోయినవి.

శేషయ్య:- మనుష్యులను చావగొట్టి కమిన్నా చెయ్యి. మేమంతా పోతాము. అస్సలు వాడిని రమ్మను. బొమ్మవు, మధ్య నీవు వచ్చావెందుకు?

వెం:- శేషన్నా! నీ వెందుకు తొందరపడతావు? సంగడంటే దేవుడుగా చూచుకున్నాంగాని మరొకటి గాదు. వాడే యజమానుడు. నేనే వాడికింద జీతగాడుగా పనిజేశా. కాల మిట్లా వచ్చింది.

పం:- అంతా తొందరపడితే లాభంలేదు. ముందూ వెనకా ఆలోచించుకోవాలె. పోలీసువాండ్లు రావడం, పరీక్షలు

చెయ్యడం, శవాన్ని డాక్టరు దగ్గరకు మోసకపోవడం, వాడు కొయ్యడం, నానా అపస్మారకం చెయ్యడం జరుగుతుంది. మాలచ్మి చెప్పినట్లు, వాడేదో తపోభంగమై పుట్టిన పురుషుడు. అటువంటువాడి శవానికి యీ దుష్కర్మలన్నీ కలగడం అంటే నేనే భరించలేకుండా వున్నాను. ఇక తలిదండ్రులమాట చెప్పనే అవసరంలేదు. యీ రభసంతా జరగడంకంటే యింత పూలూ, బుక్కాయీ చల్లుకుంటూ వూళ్లో వూరేగింపు చేసుకుంటూ ఆనందంగా వుత్తర క్రియలు జరిగించుకుంటే బాగుంటుందని నా అభిప్రాయం. చిన్నవాడినో, పెద్దవాడినో చెప్పాను. నేను ఇటు వంటి వ్యవహారాలు అనేకం జూచి. బొప్పులు దిన్నవాడిని. తర్వాత మీయిష్టం.

తొగట వెంకమ్మ:—(నల్లని స్థూలశరీరం, తెల్లని పండ్లు, నల్లనికండ్లు, కల్లలేని మనస్సు, జాలి గుండె, బోళాతనమూ—ప్రకటిస్తూ) అంతవరకన్నా మాకు దయచేయండి. అదే పదివే లనుకుంటామన్నది.

జనము:- పంతులుగారు చెప్పిందే బాగుంది. యిక్కడే వుత్సవం చేసుకుందాం.

పంతులు:- రామదాసూ! నేను వొక్కమాట జెప్తాతా విను. ఉద్రోషంచేత బుద్ధి పరిపరి విధాల బోతుంది. నీవు మన స్సును జయించి తామరాకులో నీళ్ళ మాస్తరుగా సంసారంలో వున్నవాడివి. పోయినవాడేమో మళ్ళీ రాడుగదా? యెవరివల్ల యేమి జరిగిందో యీ మహాజనంలో వొక్కళ్ళుంగూడ కండ్లతో జూడలేదు. కుంకకు మూతవుందిగాని నోటికిలేదు. నలుగురు నాలుగుదార్లుగా అనుకుంటారు. అనుమానాలనుబట్టి వ్యవహారం జరుగదు. ఒక్కమాట—(చిన్నంగా)—అయిదువందల రూపా యిలు యిప్పిస్తా; మాపుచేయించివేతాం.

మాలచ్మి:- అయ్యో, పంతులుగారూ! మా బంగారు కొండను అయిదువందల రూపాయలకు అమ్ముకుందేమా?

నాయనా! మానాయన మాంసం అమ్ముకొని తినమంటావా? నేను యే బీదకొంపలో బుట్టినా ఆ పుణ్యమంతుడింటిలో వచ్చి పడ్డాను. తినా గుడవా లోపం లేకుండా జరిగింది. కడుపున నాలుగు కాయలు కాసినవి. అదృష్టవంతురాలినే అనుకున్నా. నాఅదృష్టం నేటితో అధ్వాహ్నమై పోయింది. ఇక బిడ్డమాంసం అమ్ముకొని దరిద్రం తీర్చుకోనా? నేనామాట చెవుల వినలేను. అయిను దమ్మిడీలుకూడా మాకు వద్దు. ఇక వాడిని చంపారంటూరూ, మా కర్మమే మా నాయనను జంపింది. దేవుడు చంపంది యింకొకరు చంపలేరు గదా. ఎవరు చంపారో మేము కండ్లతో చూడలేదు. మాకెవరిమీదా అనుమానం లేదు. ఏచుమ్మర్లూ లేకుండా మా నాయన వెళ్ళిపొయ్యేమార్గం చూపండి.

రామ:- నాది వొక్కకోరిక వుంది.

మాలక్ష్మి:- మనకు యేకోరికలూ వద్దు, వూరుకో.

రామ:- వుండవే. చుమ్మర్లు మేముచూచి భరించలేము. ఆశరీరం నేలబడ్డచోటనే భూస్థాపన చేసి కాస్త తిరుపళ్ళ కట్టుకొని మానాయన పేరుతో ఆరాధన జేసుకుందామని వున్నది. ఈమూల యాభైగజాలు బజారుధరకు యిప్పించండి.

వెం:- అది అందరూ కోరవలసిందే. ధరమాట చూచు కుందాం. యాభైగజాలు యిప్పుడే హద్దు పెట్టిస్తా.

పం:- తథాస్తు. గ్రామస్థులు మీరిద్దరూ రాండి. పోలీసు వారు వూళ్ళోకి వచ్చారట, మాట్లాడివత్తాం.

పోలీసువారూ, గ్రామస్థులూ, పంతులూ కలిసి మాట్లాడి తిరిగి వచ్చారు.

పం:- శాస్త్రిగారూ! తమరు బండమీద దయచెయ్యండి.

ఇన్‌స్పెక్టరు:- రామదాసూ! నీకొమారుడు యెట్లా జచ్చాడో తెలుసునా?

రామ:- ఆయువుమూడి చచ్చాడు. యింకొకవిధం యేమున్నది?

శాస్త్రి:- అది సరే. యెవరు చంపారో నీకు యెవరిమీద నైనా అనుమానమున్నదా ?

రామ:- నాకు యెవరిమీదా లేదు.

శాస్త్రి:- పంతులుగారూ! వ్రాయండి.

పం:- నేనొక పంచాయితీదారును. మునసబు కరణాలు యిద్దరు. వీరదాసూ శేషయ్యకూడా వుంటే బాగుంటుంది.

వీ, శే:- మేము వుండం. మా కెందుకు యీ కర్మమంతా.

శాస్త్రి:- ఉంటారా వుండరా ?

వీ, శే:- మీరు యేమన్నా జెయ్యండి, మే ముండం.

పం:- ఇన్ స్పెక్టరుగారూ! వాండ్లను వదలివెయ్యండి. వీండ్లిద్దరినీ వెయ్యండి.

శాస్త్రి:- వాం డ్లెవరు ?

పం:- ఎవండ్లో కన్పెన్నలు. పంచాయితీదార్ల కెవరైతే నేమీ ? వెంగన్నా, ఫరీదుసాహెబు.

శాస్త్రి:- బంధువుల వాఙ్మూలాల మీద దస్కతులు పెట్టించండి.

పం:- ఊఁ అయింది.

శాస్త్రి:- లేటు సంగదాసు ఆత్మరోగంవల్ల చనిపోయినాడు అని వ్రాసి పంచాయితీదార్లచేత దస్కతులు పెట్టించు.

పం:- కర్ణంగారూ! పెద్దలు మీదస్కతు కానియ్యండి.

కర్ణం:- నాఅభ్యంతరం యేమీలేదు. మునసబు దస్కతు కానియ్యండి.

పం:- నీవే కానియ్యవయ్యా. సివిలు మేజష్ట్రీటు అధికారాలు కలవాడవు.

ము:- కానిస్తాంలే, తొందరేమి.

పం:- తొందరేమంటే శవాన్ని వూరేగింపుచేసి ఖననం చెయ్యాలెనా వద్దా ? యిప్పటికే అపరాహ్నమైంది. జనమంతా పశిపిడవాలాడీ భోజనం లేకుండా కూరున్నారు.

ము:- వాండ్ల వ్యవహారానికేమి అడ్డముంది, కానిచ్చుకో మనండి.

ఇ:- కానియ్యరాదటయ్యా నీదొకజాగు.

ము:- నేను తమమాటకు కాదంటున్నానా? దస్కతులు కూడా శవందగ్గర యెందుకు?

పం:- రామదాసూ మీఖనన ప్రయత్నం మీరు చేసుకోండి.

రా:- అదే మాకు పది వేలు.

ము:- యిక లేవండి. పంతులింటికి వెళ్ళుదాం.

[గ్రామస్థులూ, పోలీసులూ, పంతులూ లేచారు.

శాస్త్రి:- (రహస్యంగా)మునసబూ! యేమిటీనీయనుమానం?

ము:- అనేక వ్యవహారాలు చూశామంటూరు. డబ్బు చేతిలోపడందే దస్కతు పెట్టమంటారేమి?

శాస్త్రి:- పంతులు దగ్గరకు యావత్తుపైకం వచ్చిందటగా.

ము:- వస్తే, మీ వాళ్ళో పడ్డట్టేనా? మీకు దెలియదు. పంతులు అసలు కేపుమారీ ముండాకొడుకు. దస్కతులైతే మీకు మళ్ళీ కనపడతాడా?

శాస్త్రి:- తుపాకిన కొట్టించనూ.

ము:- ఈ సంచులు దక్కేటట్లైతే అందుకూ వొప్పు కుంటాడు. చౌదరయ్యలో సగమంశగలవాడు. ఇద్దరిదీ వొకజే సుదుపు. ఒక్కబళ్ళో చదివినవారే.

శాస్త్రి:- వేవిలిచేసనంటివి, మూడు వేలతో నేపోనిచ్చావేమి?

ము:- మీ పప్పు చిమిడిందా. మూడుసంచులు చాలవూ. యింకా శాస్త్ర నొక్కితే యింకొక సంచి రాల్తుందికాని యేదో అనుకున్న ప్రకారం పోనియ్యండి. పంతులు వెనుకకు జారు కున్నాడు చూచారా.

శాస్త్రి:- ఏమి పంతులూ! పరారీ అవుతున్నావు.

పం:- ఎంతమాట అన్నారు! మీరేదో రహస్యం మాట్లాడుతూవుంటే నేను తగ్గాను. నా సంగతి యేమంటారు?

శాస్త్రి:- రా అన్నీ వొకమాటే ఫైసలవుతవి.

అందరూ పంతులుగారి యింటికి బోయి కూర్చున్నారు.

... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

పం:- నా సంగతి యేమిటి?

ము:- నీకు అయిదోసంచి వుందిగా.

పం:- నాకు మళ్ళీ వేరేనా?

ము:- వేరే యేమిటి. అన్నీ ఒక యినుపపెట్టెలోవే.

పం:- మునసబు యికనైనా దస్కతు పెడతాడా?

ము:- తేకలం. రైలు నడిచినట్టు నడుస్తుంది. కరణమూ! నీవు దస్కతుచేసి తక్కిన వాండ్లవి నిషానీలు పెట్టు.

శాస్త్రి:- వాండ్లు నిషానీదార్లేనా?

పం:- కామని తగాదాకువస్తే చూతాం. ఇప్పుడు వాండ్ల కోసం యెవరు పోతారు?

శాస్త్రి:- కొంపతీసేవు.

పం:- మాటవరస కన్నా. నాకుమట్టుకు భయంగాదా?

అంతా వెళ్ళిపోయినారు. పంతులులేచి దిడ్డివాకిట చౌదరయ్య ఇంట్లోకివచ్చి 'అబ్బ' అని తూర్పు ఇంట్లో నూలబడి 'అటు శవాన్ని, యిటు పోలీసులనూ సాగదోలి వచ్చా. అయిదు సంచులతో యావత్తూ పూర్తి అయింది.'

చౌ:- (లోపలనుంచి) నే లేచి రావచ్చునా?

పం:- నిరభ్యంతరంగా రావచ్చు.

బావిలోపడ్డవాడివలె వొళ్ళంతా పాలిపోయి దిగచెమటలతో దూదిపింజలు దులుపుకుంటూ బైటికి వచ్చాడు.

ల:- (కండ్ల నీళ్లు పెట్టుకొని) ఇప్పటికి అదృష్టవంతులమే. గట్టున పడేశావు.

పం:- బావా! ఇక నీవు స్నానానికి లే. నేను శవాన్ని చూశాను. పైగా మాల స్పర్శ తగిలినట్లున్నది. జంధ్యాలు వేసుకొని భోజనం చెయ్యాలె. మజ్జిగబొట్టు యివ్వేళ పోయించుక పోలేదు గాంవాలె.

ల:- అక్కలక్ష్మి చేత పంపిస్తాపో. వీధివాకిలి తీయవచ్చునా?

పం:- అన్నట్టు కొంచం ఆపండి. వాండ్లు శవాన్ని పూరేగింపు జేసుకుంటారట. అల్పపు ముండాకొడుకులు కొందరు రాళ్లు వేస్తారేమో. వెంకయ్యను దిడ్డివాకిట లోపలికి పంపిస్తా. ఖననమై అంతా పోయేవరకు తలుపు తీయవద్దు.

వెంకటయ్య యాభైగజాల స్థలం హద్దు పెట్టాడు. శవాన్ని గంధమూ, పూలూ, బుక్కాయీ చల్లుతూ మేళ తాళాలతో పూరేగింపు జేశారు. చాలామంది కొత్తగుడ్డలు తెచ్చి కప్పారు. పూలదండలు వేశారు. ఇండ్ల దగ్గర వార్లు పోశారు. నడివీధులలో ఖడ్గాలు చదివి వీరంగాలు వేశారు. అన్ని కులాల కూలీలు తలా కాసేపు శవాన్ని బట్టారు. వేదాంతం కోటమ్మ గురుపుత్రుడని నమస్కారం పెట్టింది. మూడుఝాము లపుడు శవరత్నాన్ని భూస్థాపితం జేసి అందరూ ధర్మమట్టి జల్లి వెళ్ళిపోయినారు.

---

# మాలపల్లి

## రెండవ భాగము

### ౧

#### పుట్టిల్లు

రామానాయుడు నరసారావుపేట దగ్గర దిగి గుఱ్ఱపుబండి జేసుకొని నాదెండ్ల వెళ్ళాడు. చంద్రవీథిలో వున్న మేడ దగ్గర బండిదిగి యెత్తైన గచ్చు మెట్లెక్కి లోపలికి పోయినాడు. ముంగిట యెఱ్ఱని పీకె కుడి చేతిలో బెట్టుకొని యెడమ చేతితో తాషాబండి లాగుతూ పొంకమైన పిరుదులమీద బంగారు చిరుగజ్జెలు కిణికిణి శబ్దముల రవళితో విరాజిల్లుతుండ మెడను హనుమంత బిళ్ళ, చేతుల యెఱ్ఱరాళ్ళ వత్తులూ, కాళ్ళకు గజ్జెలకడియాలూ వేషమమరియుండే దివ్య దిగంబరాకారుఁడగు నొక కిశోర చక్రవర్తి నేత్ర పర్వంగా బెళుకు చూపులు నిగుడ్చుతూ "అమ్మా! అప్ప వచ్చా" డని కేకవేసి తాషారవమును అడుగుదమ్ముల గునగున నడకలతో లయించి, మేళవించుతూ, పరుగెత్తి వచ్చి తండ్రి కాళ్ళను కౌగలించుకొని పాలపండ్ల లావణ్యమూ, చిఱునగవుల ధావళ్యమూ, ముక్కుపై నీలిమా, బుగ్గల అరుణిమా నవ్వైగొని పున్నమ చందురుం దులకించే మోముటందము అతిశయింప తల యెత్తి తండ్రిమోముం దిలకించగా నాయని కందోవలు వికసించి మోము చందురుడు హసింప బింబప్రతిబింబభావ మొనగూడింది. రామానాయుడు తన వేలు గొనలతో బుగ్గలు పుణికి చిన్న పెదవులు చెణికాడు.

పిల్లవాడు:- అప్పా! చినమామయ్య నాకు తాషాబండీ, పీకే కొన్నాడు. మన వూరికి తీసుకపోదాం.

రామా:- అట్లగే పద.

పిల్ల:- ఎప్పుడు పోదాం ?

రామా:- రేపు.

(మేడమీాదనుంచి) అమ్మా మీా అల్లుడుగారు వచ్చారట-అబ్బాయి కేక వేస్తున్నాడు.

అనంతమ్మ:- (కాళ్ళకు నీళ్ళుదెచ్చి)-కడుక్కోండి-అంతా బాగావున్నారా? సాహూ! మీా నాయనను నడిపించుకొని వస్తూ వున్నావా?

సాహు:- రేపు నా బండెక్కి పోతాం. యేమప్పా! మనకు యింకో బండెందుకు!

రామా:- యీా బండేనా! విరిగిపోతేనో?

సాహు:- యింత మాత్రానికే విరుగుతుందా? నిన్న మూడు రాళ్ళు మోసింది.

రామా:- యెంత రాళ్లు?

సాహు:- పెద్దవే. గోలుగుండ్లకంటే గూడ పెద్దవే.

అనంతమ్మ పకపక నవ్వింది.

రామానాయుడు కాళ్లు కడుక్కొని వచ్చి బల్లమీాద కూర్చున్నాడు. సాహు బల్లమీాద బండిపెట్టి తండ్రి తొడలమీాద వెల్లకిల పండుకొని పీకె నోట్లోబెట్టి "అప్పా! నీచేతవుతుం దేమో వూదు, చూతాం."

రామానాయుడు పీకె నోట్లో పెట్టుకునే వరకు రంధ్రం గూడా లోపలికిబోయి వూదుడుబడలేదు.

సాహు:- నీ చేతగాదు. నే వూత్తా తే. (అని చెవులు గింగురు మనేట్టుగా వూది గర్వంతో తండ్రివంక జూచాడు.)

రామా:- అబ్బా! యెంత బాగా వూదావురా!

సాహు:- నాకు యెవరూ నేర్పలా. నేనే నేర్చుకున్నా. నీకు నేర్పుతాపట్టు. బొక్కంతా నోట్లో పెట్టుకోకుండా వూదు.

రామానాయుడు యీాసారి బాగా వూదాడు.

సాహు:- అంతే. అమ్మమ్మా! మా అప్పకు కూడా వచ్చింది.

మేడ మెట్లమీదినుంచి మెట్టెల కాళ్ల చప్పుడు వినపడ్డది. కమలమ్మ వూరికి పోదామని అభ్యంగనం జేసింది. నగలు పెట్టుకోలేదు. వెంట్రుకలు తడి ఆరలేదు. తొందరగా పెద్ద కీలుగంటు వేసుకున్నది. సహజమైన తెల్లని మెరుపునకు స్నానం చేవ యెక్కించింది. యింకా బొట్టు బెట్టుకోలేదు. కళంకమనే మిషతో చంద్రుడు పోటీకి వస్తాడని భయంగావాలె, లేకపోవడం చేతనే వొక వన్నె చంద్రునికంటే వాసి గనపడ్డది. తల దువ్వకపోవడం చేత ముంగురులు చెలరేగి కారు మబ్బులవలె ముఖ చంద్రుని కప్పుతున్నవి. ఒక్క ముఖానికే కమల సామ్యమేమి? ఒడలంతా కమలమే. కనుబొమ్మలు వంపులై వాలి వొండొంటిం బెరసి గిరి దిరిగి సాముద్రికులకు కొంచ మనుమానమూ, రసికుల కానందమూ గలిగిస్తున్నవి. కన్నులు బేడి సమీలవలె సంచలిస్తున్నవి. సీల బిగిసిన తెలిరాల ముక్కుపుడక తెలుపులో చాయ జూపడానికో యన మెరుస్తున్నది. తామర తూడును తెలిదమ్మల బొదివినట్లు చలువ జేసిన సన్నని తెల్లచీర గట్టుకొని దారెములు దీసిన మల్లు రవికె పిక్కటి బిర్లుగా తొడుక్కున్నది. చేతులకు చెరి వొక బిళ్ళేరిగాజుమాత్ర మున్నవి. కాని మోటని కాళ్ళకు నగలు మానివేసింది. కాన్పు యెడం గావడంచేత కొంచం వొళ్లు వచ్చినా ముఖాన నవకమూ, శరీరంలో జిగివీ తగ్గలేదు.

కమలమ్మ:- మీరు నిన్ననే వస్తారనుకున్నాం. మీ అబ్బాయి బండికూడా సిద్ధంజేసి అట్టేపెట్టాడు.

రామా:- తాషా బండేనా?

అనం:- అదే. మగపిల్లలు యిద్దరూ మొన్న బడి సెలవులకు యింటికి వచ్చి పెండ్లింఢ్లని అత్తవారింఢ్లకు పోయినారు. మీ మామగారు యెల్లుండి వస్తారు. మీరు బేస్తవారం పోగూడదా?

రామా:- రేపు సాయంత్రం స్టేషన్ దగ్గరకు బండికూడా పంపమన్నా. పోవలసిందే.

అనం:- బండివస్తే తిరిగి పోతుంది. రాకరాక వచ్చారు. మధ్య మూడు రోజులేకా యెడం?

రామా:- సరే చూతాం.

కమలమ్మ:- మెత్తబడ్డారులే. మేము పొయ్యేలోగా అబ్బాయిలుకూడా వస్తే బాగుండు.

రామా:- వాళ్ల అత్తవారిండ్లలో వాళ్లుండ నక్కరలేదా?

కమ:- రాముడు మొన్ననేగా సంవత్సరం వెళ్లు జేత పోయి వచ్చాడు.

అనం:- యెండనుబడి వచ్చారు. స్నానానికి నీళ్లు దోడు.

కమ:- అబ్బా! నేను తోడలేనమ్మా— నీవు తోడుదు.

రామా:- ఆడవాండ్లు పుట్టింటికి వస్తే మగవాండ్లమీద గౌరత పోతుంది.

కమ:- యేమి పోయిందే మిప్పుడు?

రామా:- పాపం పెద్దదాన్ని ఆమెను తోడమంటావెందుకు?

కమ:- ఆమె పెద్దదైతే నేను చిన్నదాన్ని.

రామా:- అవును. చిన్నఅమ్మాయివి.

అనం:- చిన్నదిగాక పెద్దదా? మాపిల్ల మాకు చిన్నదే. నేను తోడుతాలెండి. అంగవస్త్రం కావలెనేమో చూచియియ్యి. అదీ వారినే చూచుకోమంటావా?

రామా:- అనేటట్టుగానే వున్నది.

కమ:- తప్పా యేమి?

రామా:- ఇక్కడ వున్నరోజులలో యేతప్పులూ లేవు. యీ ధోవతి తడుపుతాలే.

కమ:- మా అమ్మ గనుక నన్ను కూచోబెట్టి పనిజేస్తుంది. ఒకమ్మ గన్న బిడ్డమీద మీకెందుకు జాలి వుంటుంది?

రామా:- ఆమెను కూచోబెట్టి పనిచేయడంబోయి నిన్ను కూచోబెట్టి ఆమె పనిజేయవలెనా?

కమ:- ఆమెను కూర్చోబెట్టవలసి వచ్చినప్పుడు కూచో బెడతాం. ఇప్పుడు పూరక అన్నంపెడతామా?

అనం:- నాకెవ్వరూ పూరికేకూర్చోబెట్టి పెట్టవద్దు. చాకిరి చేయించుకొనే పెట్టండి. రెండుజాములు కావచ్చింది లెండి.

రామానాయుడు స్నానానికి లేచాడు. సాహు పీకెపాడుతూ వాకిట్లో తాపాబండి యీడ్చుకుంటున్నాడు.

అనం:- కమలం! వారు భోజనానికి వచ్చారు. పిల్లవాడు రాడా ?

కమ:- వారిదగ్గర అలవాటు లేదు. నాదగ్గర కూర్చుంటా డులే.

అనం:- వారు లేచేదాకా మేడమీదకు పోబోకు. ఏదైనా అందిస్తువుగాని.

కమ:- నిమిషం పూరుకోనీయవుగదే. యీబల్లమీద పడు కుంటున్నా. కావలిస్తే పిలువు.

అనం:- యేమి కష్టపడుతున్నావే పనిచేయలేక. అక్కడా యింతేనా ?

కమ:- తల్లే పూరుకోనీకపోతే అత్తవారు పూరుకోనిస్తారూ? నేల బెట్టి కాలరాస్తారు.

రామా:- ఇంతేనా ఫిర్యాదులు? ఇంకేమైన వున్నవా? మాఅమ్మ యెదటివాండ్లకు పనేచెప్పదు.

కమ:- చెయ్యనివాండ్లకు చెప్పదు. మా తోడికోడలకి జెప్పదా ?

రామా:- ఆమె చెప్పకుండానే చేస్తుంది.

కమ:- సరే. నేనే చేయనిదాన్ని. అటూ యిటూ కూడా లఘాధికార్లయితే నేచాకిరెందుకు జెయ్యాలె?

అనం:- వారిభోజనమైంది. తాంబూలమిచ్చి పిల్లవాడిని తీసుకొనిరా.

కమ:- ఆయన షికార్లు గొడుతుంటాడు. సాహూ! అన్నం తిందువుగానిరా ?

సాహు:- పోవే యెప్పుడూ అన్నమన్న మంటావు.

కమ:- వొక్కపూట్మైనా సాగదీయకుండా అన్నానికి రావు గదా, నీకు దెబ్బలు తగులుతవి. యిటరా.

సాహు:- అమ్మమ్మా - చూడవే - యెప్పుడూ దెబ్బలు తగులుతవి, దెబ్బలు తగులుతవి అంటుందీ.

అనం:- ఎవరా అనేది?

సాహు:- ఇంకెవరూ? యీ కమలమ్మగారు.

అనం:- యెందుకే వాడికిదెబ్బలు పొన్నెమ్మలాగ అన్నానికి వస్తేనూ.

సాహు:- చూడు, తానింకా రాలేదు. నాకు దెబ్బలుతగులుతవట.

కమ:- ఈవేళ వచ్చావు లేవోయ్! నామీద నేరంబెట్టడానికి.

సాహు:- నేను వేరే కూర్చుంటా.

కమ:-ఇంకా యెంతసేపయ్యా నీసాధింపు. నాదగ్గరకూర్చో.

అనం:- వాడు వేరే కూర్చుంటాడట, కూర్చోనియ్యి.

కమ:- వాడు వేరే కూర్చుంటే నాకు తిన్నట్టుండదు. మా నాయన అలిగాడమ్మా. అలిగావా ?

సాహు:- అలిగా.

కమ:- మానాన్నా రావే.

సాహు:-బుడ్డమూతి బెట్టుకొని దగ్గరకు వచ్చాడు. తల్లి దగ్గరకు లాక్కొని ముద్దుబెట్టుకొని తొడమీద కూర్చోబెట్టుకున్నది.

సాహు:- నాకు అప్ప పీటవెయ్యి.

కమ:- పెద్ద పీట తీసుకరావమ్మా మానాయనకు.

సాహు పెద్దపీటమీదికి దుమికి కూర్చున్నాడు.

కమ:- నీ కేమిగలిపేది ?

సాహు:- పప్పు గలుపు. నెయ్యి నాచేతుతో వెయ్యి.

కమ:- ఊఁ, యికకలుపుకో, కారిపోతున్నది.

సాహు:- ఇంకా.

కమ:- ఊఁ ఇక కానీ.

సాహు:- ముచ్చికి ముమ్మాటు.

కమ:- నచ్చికి నాలుగుమాట్లో. ఊఁ సరేనా ?

సాహు అన్నం దింటున్నాడు. కమలమ్మ పిల్లవాడి అన్నం పోగుజేస్తూ కూర్చున్నది.

అనం:- నీవు కలుపుకోవేమే ?

కమ:- వాడి కడుపునిండనియ్యి. నాకు తొందరేమివచ్చింది?

అనం:- వాడికి కలిపిపెడితివిగా.

కమ:- నా ధోరణిలో నేవుంటే యేబల్లినో చూస్తూ కూర్చుంటాడు.

ఎవరో వచ్చి— యేమమ్మో యని పిల్చారు.

అనం:- అదుగో నీసావాసగత్తె. నీవు వచ్చావని చెప్పారు గాఁవాలె వచ్చింది.

క:- నా సావాసగత్తెవరూ ?

కో:- ఎవరనేకాడికి వొచ్చిందీ? నేను లింగబజ్జెవారి కోటమ్మను.

క:- నీవటోయి - యెప్పుడు వచ్చావ్ ! అరుగుమీద కూర్చో.

కో:- యింతకు ముందుగానే. నీవు వచ్చావంటే ప్రాణం లేచివచ్చింది. నీకోసం బండి వచ్చిందని విని కండ్లైనా చూసి పోదామని వచ్చా.

క:- గురువారం బోతాం. యీ మూడురోజులూ మస్తుగా గవ్వలాడుకుందాం. కావచ్చింది వస్తున్నా.

కో:- తొందరేమీ లేదులే. నిదానంగానే కానియ్యి.

కమలమ్మ చెయ్యి కడుక్కొని మూతి తుడుచుకుంటూ వచ్చింది.

క:- యెన్నాళ్ళ కెన్నాళ్ళకు చూసుకున్నాం.

కో:- ఎన్నాళ్ళు గాకేమి! నీ కొమారుడి పుటకలకేగా. బొందిలో ప్రాణాలుంటే యెప్పటికైనా చూసుకుంటాం. మా చిన్నక్కయ్య కాలంచేసిందిగా. అంతా పది నెల్లు గాలేదు.

క:- అయ్యో పాపం! కలుపుగోలుతనంగల మనిషి. యేమైనా పిల్లలా?

కో:- తొలినా మలినా పూరికేనే పోయె. తల్లిచావుకూన మట్టుకున్నాడు. వాడికీ యెప్పుడూ రోగాలు. యీనేనా నీ కొమారుడు? పేరేమి పెట్టారు?

క:- ఈయనే. సహదేవరావు. తగవుల చక్రవర్తి. నీ కేమయినా పిల్లలా?

కో:- (చెంపన చెయ్యిబెట్టుకొని)-ఏమో వొదినా. నా కాపురమంతా చీకాకుగాఉంది. ఆయనకు యిల్లూ వాకిలీ బట్టదు. యెవతెనో పెట్టుకొని పేటలోనే పడివుంటాడు. గంపంత సంసారం. ముసలాయన దేనికని పాకులాడుతాడు? యిక సంతానంసంగతి అడిగినట్టేవుంది. యిప్పటికి మూడు ముక్కలైనవి మళ్ళా తీసుకొని వచ్చారు. నాకు యేమీ వొంట్లో పుసులులేదు. కోక పెట్టుకొన్నాను. మెన్నో అయినవి. నా సొద చెపితే తీరేది కాదు. మీ వూళ్ళో సంగతులు జెప్పు.

క:- యింతవరకు బాగానే వున్నామమ్మ.

కో:- అనంతమ్మా! నీ అల్లు డెవరినైనా పెట్టుకున్నాడా?

అ:- ఆయన్నే అడుగలేకపోయినావూ. నాకూతురిని పెట్టుకున్నాడు.

క:- పెట్టుకున్నాడూ నీ కూతురుని - ఆమాట అనమనూ.

కో:- ఆయన మేధకుడు. అటువంటి గుణాలు లేవు. వాడి నెవు యింకా ని న్ననవచ్చు.

అ:- యెవడో మీ జీతగాడులా గున్నాడు. అటుబోయి చూడు?

రామానాయుడు:- (మేడమీదినుండి చూచి దిగివచ్చి) యెందుకురా వచ్చావు?

జీత:- వెంకటయ్యగారు వుత్తరమిచ్చారు.

రా:- వెంకటయ్యగా రెందుకు యిచ్చారు? అంతా బాగా వున్నారా?

జీత:- అన్నీ అందులోనే వుంటవి, చూడండి.

రామానాయుడు వేళ్ళువణుకుతూ వుత్తరం జదివి జార విడిచి, బల్లమీద కూలబడ్డాడు.

క:- వుత్తరంలో సంగతు లేమిటీ?

రా:- ఏమున్నది! దాసును మా నాయన కొడితే చచ్చా డుట - అయ్యో దాసూ, అయ్యో సంగడూ!

క:- అయ్యో - అయ్యో - యెంతపని జరిగింది?—

అ:- దా సెవరే?

క:- మా జీతగాడమ్మా. వాడు జీతగాడటే. రుషే వాడూ. సమస్తం దిద్దేవాడే. ఒక్క నలుసు రేజా పోనిచ్చేవాడు గాదమ్మా! యింటివాండ్ల కుందిటమ్మా అంత శ్రద్ధా! యేమి తెలివే! ఆయన కొట్టడమేమిటి! పీడు చావడ మేమిటి! అంతా మాయగా ఉంది. మెల్లెవలె ఆ చూపులూ, వాడూ కండ్లలో మెదులుతున్నాడమ్మా!

అ:- ఆయనను పట్టుకున్నారా?

రా:- అవన్ని వ్రాయలేదు. వాడినడగండి.

క:- యేమిరా వెంకడూ! సంగతులన్నీ జెప్పు.

వె:- వొాకటే సంగతి. అందరికీ బోధచేస్తున్నాడని కోపం వచ్చి వొాకపెట్టి బెట్టేవరకు నసాళం బగిలి కిందబడిపోయినాడు. కాసేపటికి వూపిరిబోయింది. పైటాలకల్లా పోలీసుగాలు దిగేవరకు వూరంతా దద్దరిల్లిపోయింది. పంతులు అయిదు సంచులతో అంతా మాపుచేశాడు. శవాన్ని మట్టిగూడా జేశారు. పంతులు ఈసంగతి యెక్కడా అనవద్దన్నాడు.

రామానాయుడు:- (లేచి మేడమీదికి బోతూ) నే నిప్పుడే ఊరికి వెళ్లుతా. గుర్రపువాణ్ణి బండిగట్టమను.

క:- నేనూ వస్తా.

రా:- నీ యిష్టం.

అ:- సరే వెళ్ళూ. ఉండమనటానికి నోరు వచ్చేటట్టుందా?

క:- కోటమ్మా! వెళ్లుతానోయి.

కో:- వెళ్ళండమ్మా! చూడడంయిట్టుకైనా తటస్థించింది.

రామానాయుడు మేడమీదికిబోయి ఉత్తరం మళ్ళీ చదువుకొని "నాసంగడూ నన్ను విడిచిపెట్టి ఉండలేనంటివే. నన్ను వదిలిపెట్టి పోయినావేమీ! నీకు అన్నీ తెలుసు. స్టేషను దగ్గర నీ వన్నావు. నా కిప్పుడర్థమాతున్నది. నాతో చెప్పకుండా నన్ను మోసంజేసి పోయినావు. చేశావుమోసం.

అయ్యో—యెంతమాటన్నా! సంగడా మోసంజేయడం? ఓ చౌదరయ్యా! సంగణ్ణి చంపినవాడివి నన్నుగూడా జంపరాదూ? మా యిద్దరికీ యేమిభేదమున్నది? గంగిగోవును జంపావేమయ్యా? సంగడూ! నేను రానా నీతోటి? నాకేమీ దారి చెప్పలేదేమి? నీ చాటున పని చేదామనుకున్నానే, నన్నే పెద్దవాణ్ణి జేశావూ?"

సామాను వేశాడని కేక వినపడ్డది. ముగ్గురూ బండెక్కి బయలుదేరారు.

౨

గుయ్యారం

ముగ్గురూ హుటాహుటీ నరసారావుపేటవచ్చి రైలెక్కి రెండుగడియల పొద్దుకల్లా ఇంటికి జేరారు. రామానాయుడు బండి దిగాడు. సంగనాసుగదివంక చూడడానికి మనసుగొల్పలేదు. ఇల్లు ఇల్లుగా గన్పడలేదు. గుయ్యారంలోకి పోయినట్లుగా తోచింది. అతని ఆలోలనేత్రములూ, పలచని శరీరమూ, కత్తిరింపుజుట్టూ ముఖ కళివకలూ, మంగళాపురం వచ్చినప్పటినుంచీ దృష్టికి రావడంలేదు. అతని భౌతికమూర్తి మానసపథంనుండి అంతర్థానమైంది. అతని సౌశీల్యం, పవిత్రబావాలూ, ఉన్నతాదర్శాలూ, కరుడుగట్టి పోతబోసి మూర్తీభవింపజేసినట్లు మానసగోచర మవుతున్నవి. ఆ మూర్తియందు మనసు విలీనమైంది. తాదాత్మ్యభావం బొందింది. రామానాయుడు రామానాయుడు కాడు.

కమలమ్మా, పిల్లవాడూ భవంతిలోకి బోయినారు. లక్ష్మమ్మ వలవల ఏడ్చింది.

క:- (కండ్లనీళ్లు బెట్టుకొని)—చెడురోజులువస్తే అన్నీ అట్లా తటస్తమవుతవి. ఇప్పటికింకా అదృష్టవంతులమే. అంతా పరిసి పోయినట్లైనా?

ల:- పోయినట్లే అనుకుంటూరు. ఆవేళ వున్న వునిక్కి ప్రపంచాన్ని మళ్ళీ కండ్ల చూస్తామనుకోలేదు. ఆమాట తలుచుకుంటే యిప్పుడుగూడా నా వొళ్లు గలదరిస్తున్నది. ఆ రక్తప్రవాహంజూసి అలబరి జనమంతా కంపరమెత్తి కర్రలుదీసుకొని యింటిమీది కెగబడ్డారు—నే నప్పుడే గడపలోకి పోయినాను. వొక్కక్షణంలో లోపలికి తోసుకొని వచ్చేవాండ్లే. నాకేమీ తోచక ఆవేళను యేమిబుద్ధి పుట్టిందో, కొట్టంలోనే వున్నాడనే వరకు, అట్టె కొట్టంలోకి బరుగెత్తారు. నేను తటాలున తలుపువేసి గడియబిగించి యేమిజేస్తారో చూదామని నిలుచుండేవరకు గుంపంతా మళ్ళీ వచ్చి తలుపు తన్నడం ప్రారంభించారు.

పూర్వోత్తరపు తలుపుగనుక కదల్లేదు. ఆ కంపరంమీద వాండ్లకు తోచలేదుగాని దిడ్డితలుపు వొక్కటన్ను కెగిరిపోయేది. తలుపురాక పోయేవరకు జనమంతా మునసబింటికీ మాలపల్లెకూ పరుగెత్తారు. పెద్దవాడు పొలంబోయి రాలేదు. ఎవరు కబురంపించారోగాని వచ్చి జనాన్నంతా కాళ్ళా వేళ్ళాబడి సర్దుతున్నాడట. కార్యం వల్లదప్పి అవమానం జరిగేటట్టుగా వుంటే వురిబెట్టుకుంటానని ముసలాయన గూర్చున్నాడు. పంతులుకోసం అక్కలక్ష్మిని పొమ్మంటే తనను చంపుతారంటుంది. ఆయనను దిడ్డివాకిట రమ్మని చెప్పి యెక్కడైనా దాక్కోమని దాన్ని పంపించా. కొండవాలె ఆయనవచ్చి ఆదుకోబట్టి మా బజావు దక్కింది. ఏదో తంత్రంజేసి యెవళ్ళమాట వాండ్లకుజెప్పి సానుకూలపరిచాడు. అప్పుడు మేము మళ్ళి నరలోకంలో బడ్డాం.

క:- అసలు దీనికి కారణ మేమిటి?

ల:- ఏమిటంటే గ్రహచారం. ఆ చచ్చినవాడూ, మన పిల్లవాడూ యెక్కడనో కలిసి తిన్నారని మునసబు అల్లరిబెట్టాడు. దానికిదోడు యీ కూలివాండ్ల సమ్మెలు. ఆ ఘోష మనకువద్దని నోరు నెత్తిన గట్టుకొని మొత్తుకుంటే యీయన విన్నాడా? ఇప్పుడు యిరవై పుట్ల జొన్నలూ నేలగలవడానికి సిద్ధంగావున్నవి. ఆ త్రాగుబోతు వెంగన్నకు చచ్చినవాడిమీద గుర్రు. తేపావచ్చి యీయనతో గుసుగుళ్ళాడి లేనిపోని పురేపనలు బెట్టాడు. ఈయనకు కోపంవస్తే మంచీచెడ్డా తెలియవు—కాలం కర్మం వొన గూడినవి. అన్నిటికీ అదే కారణం.

క:- తల్లి తండ్రులు మళ్ళీ వ్యవహారం తిరుగదోడరుగదా.

ల:- రామ, రామ. వాళ్ళననడం పాపం. వాండ్లనోట వొక్క దురుసుమాట రాలేదు. తమకడుపుసొద తమకుదప్ప రెండో జోలి వాండ్లు బెట్టుకోలేదు. వాండ్లు కేటిస్తే వ్యవహారం బెసికేడే. వాండ్ల యోగ్యతకు జెపుతాను: పంతులు యేదైనా ముట్ట జెపుతానంటే ససేమిరా అన్నారట. నడిమింటివాండ్లు అయిదు

వేలు కాజేశారుగాని వాండ్లు డబ్బు విషంగా జూశారు. మాలక్ష్మి రాత్రింబవళ్ళూ "సంగడూ" అనే మాటదప్ప రెండో స్మరణ లేదట. వరుగై శల్యావశిష్టంగా వున్నదని చెప్పారు. నేనూ మొదట మూడనుభవించాను. కడుపు దుఃఖంతో సమానమైంది మరొకటిలేదు. అందులో లోకమంతా అలమరిగిన బిడ్డ. వొక మాటు చూసివస్తామంటే ఆయన అలుచౌతుంది వద్దంటాడు. దిన మైన తరువాత పోదామని వూరుకున్నా.

క:- మామగా రెక్కడ వున్నారు ?

ల:- గదిలోవున్నాడు పద. అబ్బాయీ, కమలమ్మా వచ్చారు. కూరుకుబట్టిందా ?

చౌదరయ్య :- (ముసుకుదీసి) వచ్చారమ్మా—ఈ స్థితిలో వున్నాం, (అని కండ్లనీళ్ళు బెట్టుకున్నాడు.)

క:- ఇంకా అదృష్టవంతులం. మర్యాదకు భంగంలేకుండా పోయింది.

చౌ:- ఆయన యేడీ ?

ల:- అబ్బాయా ?-దిగులు పడి మేడమీద గూర్చున్నాడు.

చౌ:- ఆ దిగులుపడడం నాకోసంగాదు, మాలవాడికోసం.

ల:- ఎన్నటికీ నీ పుల్లవిరుపు మాటలు పోకపోయెగదా. పులికైనా బిడ్డమీద ప్రేమ వుంటుంది గాని నీకు లేదు.

చౌ:- అది నా జననకాల విశేషం. మీరంతా మంచి వాండ్లు గదా! ఏదో అఘాయిత్తం జేసుకొని దాటిపోయినట్లయితే మీకు డబ్బుగూడా మిగిలేది.

ల:- ఏమిటామాటలు? వాడు మనిషి పోంగనే మెంపలో బడి పరుగెత్తుకొని వస్తే...

క:- వారి మనస్సు కేదో కష్టందోచి అన్నారు. అంతట పోనియ్యండి.

చౌదరయ్య ముసుగుబెట్టుకున్నాడు. లక్ష్మమ్మా, కమలమ్మా గది బైటికి వచ్చారు.

ల:- నీవు పైకిబోయి అబ్బాయిని వచ్చి చూడమను.

క:- (మేడమీదికిబోయి)—యిక్కడకువచ్చి కూర్చున్నారేమి? మీ నాయనగారిని వోదార్చండి. ఆయనకు మనసు సరిగా లేదు. ఆయనతో కారుడ్డాలు మాట్లాడక సౌమ్యంగా మాట్లాడి రండి.

రా:- యేమన్నా రేమిటి?

క:- యేమీ లేదు. మీాపు కనడలే దనుకున్నారు.

రామానాయుడు మెల్లగా లేచి గదిలోకి బోయి నాయనా అని పిలిచాడు.

చౌ:- వచ్చావా నాయనా!—నాగతి యిట్లా అయింది. దిగులుపడి కూర్చున్నా.

రా:- కర్మఫలం అనుభవించక తప్పదు.

తత్వం: గట్టిగా తన పూర్వకర్మ మెప్పటికైన
కట్టి కుడుపకపోదు కాశిలోనైనా.
శివా-దిగులు పడుటేకాని తీరునా వెతలు.

మీరు దిగులుపడి ప్రయోజనం లేదు. రానున్నది రాక మానదు.

చౌ:- యిట్లా నన్ను ఆనుకొని కూర్చో. (అని కావలించుకొని పెద్దపెట్టున యేడ్చాడు.)

రామానాయుడు హృదయం నీరైంది. తాను చదివిన తత్త్వం తనకే పనికిరాలేదు. తండ్రిని కావలించుకొని ఆయనకంటె యెక్కువగా యేడవడం సాగించాడు. ఉభయులూ రోదనం జేయడందప్ప మరి మాట్లాడలేదు.

చౌ:- నాయనా? యెండలోబడి వచ్చావురా? మన కన్నీ కష్టపు రోజులు వచ్చినవి. తలనొప్పి వచ్చేను. కాసేపు మేడ మీదికి బోయి పడుకో.

రామానాయుడు లేచి నిలువబడి పోలేక వెనుకకుమళ్ళి తండ్రి ముసుగు పెట్టుకోవడంచేత వెళ్ళిపోయినాడు. రోదనంచేత అలిసి నిట్టూర్పు విడిచి "యేమిటీ చిత్రం! కమలం జెప్పినదాన్ని బట్టి ఆయన చాలా కోపంగా వున్నాడనుకున్నా. నే నెంతో శాంతంగా తత్త్వోపదేశం జేస్తిని. ఆయన అవస్థలో వున్నప్పటికి నాకు మనస్సు చలించలేదు. నన్ను చూడంగనే నాకంటే ముందుగా ఆయనకు దుఃఖం యెందుకు వచ్చిందీ? ఆయన దుఃఖం నాలో జాలిని యెందుకు ప్రేరేపించిందీ? మా వుభయుల హృదయాలలో సమాన స్వభావంగల దేమున్నది? వొక దానిలో వొకటి కారుణ్యము నేల ప్రేరేపించుకొన్నవి? జ్ఞానం నిలకడ నీటి వంటిది. భావాలు ప్రవాహతుల్యాలు. జ్ఞానాన్ని భావ వేగం నిమిషంలో చలింప జేసింది. అయితే జ్ఞానంలో మాత్రం వేగం లేదా? లేకపోతే యెందుకు చలిస్తుంది? జ్ఞానంలో వేగం స్తంభించి వున్నది. రస స్వరూపాలైన భావాలే స్తంభించి జ్ఞాన రూపకంగా వుంటవి. అంతా రసస్వరూపమే. రసస్వరూపమే రాముడు. అందుచేతనే సర్వాన్ని చిత్ర విచిత్రంగా లీలా స్వరూపుడై రంజింప జేస్తున్నాడు.

కీర్తన

"అంతా రామమయం-బీ జగ-మంతా రామమయం,
అంతరంగమున ఆత్మారాము డ-నంతరూపముల వింతలు సల్పగ. అం"

రామానాయుడు మేడమీదకు బోయి పడక కుర్చీలో కూర్చొని యోచన చేయవలెనని ప్రయత్నం జేశాడు. శరీరం అలిసిపోయింది. కొంచం ప్రోద్బలం జేశాడు. సాగలేదు ముట్టగిల బడ్డది. రెప్పలమీద కొండలు పెట్టినట్టు బరువై కూరుకొని పోతున్నవి. శ్వాస దప్ప మరివొక చలనం లేదు.

పంతులు పరక తలగుడ్డ జుట్టికొని పొడుగాటి వెదురు కఱ్ఱను గుప్పిట బట్టికొని కిఱ్ఱు చెప్పులతో భవంతిలోకి వచ్చాడు. లక్ష్మమ్మ యెదురుగా వచ్చి "తమ్ముడూ! ప్రయాణమై వచ్చావూ! పాలెం జోతున్నావా?"

పం:- పోయే వస్తున్నా. బావ యేమి చేస్తున్నాడు?

ల:- పంతులు వచ్చాడు. కాసేపు బయటకు వచ్చి కూర్చుంటావా?

చౌ:- ఆ బల్ల యిటులాగి లోపలికి రమ్మను—పంతులు గారూ! కూర్చోండి. వేంజేసి వచ్చారు?

పం:- వ్యవహారం గడుసుగానే వున్నది. చిన్నపరెడ్డి నయనా భయానా జెప్పినా కూలీలు మంగళాపురం పొలిమేర మీదికి రామంటున్నారు. యెవడైనా వొకడు మొగిసినా బలిజ శేషయ్య తిరగ దీస్తున్నాడు.

చౌ:- అక్కడికి వీ డెందుకు బోయినాడు?

పం:- యిప్పుడు వాడి కదే పని. మాలపల్లెకు వీరదాసూ, వూళ్లోకి శేషయ్యా యేజంట్లుగా యేర్పడ్డారు. కూలీలంతా దామాయిషీగా వాండ్లిద్దరి కూలి భరించుకొంటున్నారు. చిన్నప రెడ్డి శేషయ్యను పిలిపించి అడిగితే ముబాదలాగా అయిదు రోజుల కూలి యిస్తే వచ్చి మనచేను కోస్తామన్నాడు.

చౌ:- వూళ్లో అందరి దగ్గర ఆ ప్రకారం పుచ్చుకుంటు న్నారా?

పం:- మనం ఆసామీలను సమ్మెకట్టించామట. దాని కిది జుల్మానా. మునసబు దానికి షరీకు. మనదగ్గిరకూడా ముబాద లాగా కూలి వసూలుచేయించాలెనని చూస్తున్నాడు—

చౌ:- చిన్నపరెడ్డి యేమంటాడు?

పం:- పదిమంది కూలీలకంటె తా నెక్కువమందిని పంప లేనన్నాడు. వాండ్లు జొన్న కోసేవరకు గింజలు రాలిపోతవి. ఈ సారి కూలి ముందిస్తే తరువాత అందరితోపాటేనట.

చౌ:- జీతగాండ్లసంగతి యేమన్నాడు?

పం:- జీతగాండ్లైనా యీ పదిమందే. ప్రస్తుతం వీండ్లతో పని జరుపుకో మన్నాడు.

చౌ:- నీ అభిప్రాయ మేమిటి?

పం:- అయిదురోజుల కూలి ముందిచ్చివేస్తే ప్రస్తుతం పని జరుగుతుంది. పర్యాయితీన ఆలోచించుకుందాం. పట్టుమంటే యీవేళ మనుష్యు లెక్కడ దొరుకుతారు? ప్రస్తుతం గోల అణిగితే జీతగాండ్ల యిబ్బందికూడా లేకపోవచ్చు.

చౌ:- ఆలోచించి నీ యిష్టంవచ్చినట్లు రాత్రికి యేర్పాటు చెయ్యి.

## 3

## అచలబోధ

వోత్సవం జరిగి సమాధిలో నుంచినతరువాత రామదాసూ, మాలక్ష్మి మొదలయినవాండ్లంతా యిండ్లకు బోయినారు. వీరదాసుభార్య ఆపూట వంటచేసి రామదాసు మొదలైన వాండ్లకు వడ్డించి మాలక్ష్మిని యెంత బలవంతపెట్టినా యెంగిలి పడలేదు. ఎగుడుదిగుడుగా మాట్లాడడం సాగించింది.

రామదాసు పిల్లవాడికి ఆవుపాలు పోసి గురుకీర్తనలు చదువుతూ కూర్చున్నాడు. అప్పాదాసు తల్లి మరణించినప్పటినుంచీ యితరులతో విశేషంగా మాట్లాడడం చాలించి పరధ్యానంగా వుండడంచేత పసువులకాపుకు యింకొక పిల్లవాడిని యేర్పరిచాడు. సంగదాసు బలవన్మరణము చూచినప్పటినుంచీ జిజ్ఞాస బలమైంది. హిందూసంఘంలో పంచములకుండు బాధ లిదివరకు చూస్తున్నా అంతగా మనసు కెక్కలేదు. ధూర్తుల దుండగములకు ప్రియమైన తల్లీ ప్రేమాస్పదుడైన బావా బలియైంది మొదలుకొని సంగదాసు ప్రసంగాలన్నీ స్మరణకువచ్చి ప్రబోధం కలిగించినవి. సంగ

దాసువలె తాను సంఘసేవ చేయవలెనని నిశ్చయ మేర్పడ్డది. సంఘసేవకు ప్రథమసోపానంగా మరునాడు వంటచేసి అందరికీ బెట్టి క్రిందటిరోజంతా కటికలంకణం చేసిన మాలక్ష్మిని ఆదరించి అన్నం తినిపించాడు.

అ:- మామా! నేనొకమాట అడుగుతాను.

రా:- అడుగూ.

అ:- చిన్న బావకోసం మనం చింతించి యేమి ప్రయోజనం? ఆయన పూనుకొన్న మహత్కార్యాన్ని వోపినంత నెర వేర్చడమే ఆయనను గౌరవించడం. మన పల్లెలో రాములవారి దేవాలయం కట్టించే విషయం నీ యభిప్రాయ మేమిటి?

రా:- పొగాకుతాలూకూ, కోడెనమ్మినతాలూకూ రెండు వందల రూపాయ లున్నవి. స్థలం దరఖాస్తు మంజూరు అయింది. వెంటనే మనం ప్రారంభించవచ్చు.

అ:- పెద్ద దినంరోజున శంకుస్థాపన చేస్తే మంచిది. ఈ వూళ్ళో కూలీలు సమాధి కట్టించడానికి సాయంత్రం సభ చేస్తారట. నిన్నుకూడా రమ్మనమని చెప్పుమన్నారు. అక్కడ భజన చేయడానికి యిల్లు కట్టించి అక్కడ సంగపీఠం పెడతారట.

రా:- సంగపీఠమంటే యేమి చేస్తారు?

అ:- గచ్చుతో సమాధి గట్టించి దానిమీద చావడి వేసి అక్కడ భజనలూ, మతబోధ పుస్తకాలు చదవడం, చదువు చెప్పడం. కూలీల సభలు మొదలైనవి చేస్తారట. అదుగో శిలారు సాహేబు మళ్ళీ వచ్చాడు.

రా:- రండి కూర్చోండి. ఇందాకా వచ్చి వెళ్ళారట. సభ నిశ్చయమేనా?

శి:- అంతా తయారవుతున్నది. అయిదారు వందలు జనం పోగైనారు. శేషయ్యా వీరదాసూ జనంకోసం పొరుగూళ్లు పోయినారు. దగ్గరవూళ్ళవాండ్లు అప్పుడే కొందరు వచ్చారు.

చిత్రమేమిటంటే, పాలెపు చిన్నపరెడ్డిగారు సమాధి గట్టించమని యాభై రూపాయలు పంపినారు.

రా:- ఆశ్చర్యంగా వున్నదే. మీరు పెట్టుకొన్నది చాలా పెద్దమెత్తు. అది నెరవేరుతుందా?

శి:- లాల్‌ఖాఁవుంటే బాల్‌ఖాఁ అప్పుడే వస్తాడు. యీ సాయంత్రం డబ్బు చాలా పోగుగావాలె. ఊళ్ళో ఆసాములు కూడా కొంద రిస్తామంటున్నారు. మునసబు బాగా సాయితా చేస్తాడు. సభకు వేళయింది. మీరు బయలుదేరండి.

రామ:- మూడుగ్ఘాములకే సభ ప్రారంభిస్తారా?

శి:- పొరుగూళ్ళజనం సాయంత్రమైతే వుండరు. మీరు పెద్దపల్లెం దెస్తే సమాధిదగ్గర పెడదాం. యిష్టమయిన వాండ్లు కానికెలు వేస్తారు.

రా:- అప్పడూ! పెద్దతాంబాళం దీసుకురా. పోదాంపద.

శి:- మీరువచ్చి యేదయినా చదివి వినిపిస్తుండండి. జనానికి వుత్సాహంగా వుంటుంది.

అ:- తత్త్వాలు తెచ్చేదా?

రా:- తీసుకరా. చిరతలూ, చితారూ, గజ్జలుగూడా వుండనియ్యి.

ముగ్గురూ గలిసి సభకు బయలుదేరారు. ఊరిజనం చాలా మంది వచ్చారు. వేదాంతం కోటమ్మగారు ఆంజనేయుల మండపం దగ్గర కూర్చున్నారు. రామదాసు రాంగానే జనంలో కదలికె బుట్టింది. మనిషి వొకరోజులోనే సగం తీసిపోయినాడని కొందరూ, ముఖంలో కాంతి యెక్కువయిందని కొందరూ, తత్త్వాలు ఆనందంగా పాడతాడని కొందరూ అనుకుంటున్నారు. రామదాసు కాళ్ళకు గజ్జెలుగట్టుకొని చిరతలు యెడమచేతబట్టుకొని చితారు కుడిబుజానబెట్టి తత్త్వాలు ప్రారంభించాడు. అప్పదాసు చిటికెలు వాయిస్తున్నాడు.

## కాలజ్ఞానం

తత్త్వం:

" నేజూచీనానే - సద్గురునాలో - నేజూచీనానే - బ్రహ్మము నాలో - నేజూచీనానే.

౧. నేజూచీనానమ్మ నెలతరో తారక - రాజయోగులజూచే రమ్యమైనచూపు నే.

౨. కన్నులనడుమను సన్నబిలంబులో - వున్నతమైనట్టి పున్నమచంద్రుని నే.

౩. చూపులలోపల పాపలనడుమను - వ్యాపించివెలిగేటి ఆ పరంజ్యోతిని. నే.

౪. చందమామ నడుమ కుందనాకృతితోడ - ఆనందముగవెలిగే హరుని వీర.గురుని. నే.

### యాగంటి లక్ష్మప్పగారు

౧. దేవుడు తనలో దండిగవుంటే - తెలియద మానవపశువులకు,

౨. సంశయముడిగి సద్గురుజేరి - సర్వము తానని తెలియవలెన్.

### వీరబ్రహ్మంగారు

౧. చిల్లర రాళ్లకు మొక్కుతువుంటే - చిత్తముచెడురా వారే వారే.
చిత్తమునందున చిన్మయరూపుని - చూచుచుండుట సరే సరే.

౨. వొక్క పొద్దుల యెండుతువుంటే - వొనరు చెడుదువుర వారే వారే.
వొక్కడైన యా వైభవమూర్తిని - చూచుచుండుట సరే సరే.

౩. నీళ్లలోవుండి గొణుగుతువుంటే - నిలకడ చెడురా వారే వారే.
నిలకడవుండే నిర్మల జ్యోతిని - జూచుచుండుట సరే సరే.

౪. బాధ గురువుల పంచను జేరితె - భావము చెడునుర వారే వారే.
భావమందున బ్రహ్మతేజమును - చూచుచుండుట సరే సరే.

౫. భూములు, అడవులు తిరుగుతువుంటే - బుద్ధులు చెడునుర వారే వారే.
బుద్ధిలోవుండే పూర్ణ చంద్రుని - చూచుచుండుట సరే సరే.

౬. వీరయ చెప్పిన వాక్కును నమ్మితె - వివరము దెలుసుర వారే వారే.
వివరమందున విగ్రహమూర్తిని - చూచుచుండుట సరే సరే.

### వీరబ్రహ్మంగారు

౧. శివుడంటేనేమి - కేశవు డంటేనేమి - శివకేశవులమీది శిఖరమై
వెలిగేటి చిన్మయ రూపుని చేరగల్గితిమేని ॥శి॥

ఆర్యులారా!

ముక్తుడైకూడ లోక సంగ్రాహణార్థమై కందిమల్లయపల్లె గ్రామంలో అవతరించి అన్నాజీ గురుని సాక్షాత్కారము వడసి యోగీశ్వరేశ్వరుడై త్రిమూర్తులకును శిఖరమై వెలుగొందిన పోతులూరి వీరబ్రహ్మంగారు తనలో ప్రకాశించే చిన్మయ రూపాన్ని సందర్శించి ఆనందంతో దానిని మనోహరంగా వర్ణించారు. అదిగాక లోకంలో జనులు చిత్తశుద్ధికై నిర్మింపబడ్డ కర్మ కలాపమే మోక్ష సాధనమని భ్రమపడి నిజమైన ఆత్మారాధనను మఱచి అజ్ఞానవర్తులై వుంటే శ్రీగురువర్యులు నిజమైన ఈశ్వరోపాసనకు ప్రతిబంధకంగా పరిణమించిన భేషజవర్తనాన్ని ఖండితంగా, నిరసిస్తూ వున్నారు.

సాలె కులజులైన యాగంటి లక్ష్మప్పగురువర్యుడు దేవుని ఆత్మలోజూడడమే వుత్తమ మార్గమని శాసిస్తూ వున్నారు.

నాసరయ్యగారు యెరుక స్వభావాన్ని వివరిస్తూ, యింద్రియ నిగ్రహమూ, సద్వర్తనమూ, గురూపదేశం అయినందుకు ప్రయోజనమని యీ క్రింద వివరిస్తూ వున్నారు. ఆయన యొక్క అద్వైతసిద్ధి మిక్కిలి ప్రశంసనీయం.

౧. గురు వుపదేశం బైనందుకు దుర్గుణములు మానిం దెరుక,
మరువక సద్గురు మంత్రంలోపల మర్మం దెలిసిం దెరుక.

౨. తారక బ్రహ్మం తనలోవుండే దారి దెలిసిన దెరుక.
వారకాంతలను జూచి తల్లిగా వర్ణనజేసిం దెరుక.

మహాత్ములారా!

యిప్పటికే గురుకటాక్షం వల్ల చాలా ఆలస్యం చేశాను. యిక తమరు వచ్చిన పని నెరవేర్చుకోండి.

బలిజె శేషయ్య రోమ్ములు విరుస్తూ ముందుకు వచ్చి "మనకు నాయకుడూ, గురువూ అయినటువంటి సంగదాసుగారి పేరుమీద సంగ పీఠమని యిక్కడ ఏర్పాటు చేసేటందుకు పెద్దలు నిశ్చయించినారు. పెద్దదినం లోపల సమాధీ, సావిడీ పూర్తిచేసి

తీరాలె. దానికి చాలా డబ్బు సహాయం గావాలె. మనుష్యులు సాయితా చెయ్యాలె. యేది చెయ్యగలవాండ్లు ఆ పనికి బూనుకోవాలె యింకొక సంగతి యేమంటే గురుపుత్రురాలైన వేదాంతం కోటమ్మగారు ప్రతి సంవత్సరం అయిదు వందల రూపాయలు పీఠం ఖర్చుకు యిస్తామన్నారు. ఆమె తదనంతరం ఆమె తాలూకు యినాం భూములన్నీ యీ మఠానికే వ్రాసి యిస్తారట. (అంతా చప్పట్లు గొట్టారు) మీరెవరైనా కానుక లివ్వదలుచుకుంటే యిప్పుడుగాని, తర్వాతగాని యియ్యవచ్చు."

అప్పుడే కొంత డబ్బు వసూలైంది. కొందరు నగలిచ్చారు. వసూలు మొత్తం అయిదువందల రూపాయలకు మించింది. అంతట సభ చాలించి యెక్కడి వాళ్ళక్కడకు పెళ్ళిపోయినారు.

మర్నాటినుంచి పని ప్రారంభమైంది. ఊరగొండ నుంచి చెక్కడు రాళ్లు కూలివాండ్లు మోస్తున్నారు. రాతి బల్లలు తోలుతున్నారు. వీరదాసు సున్నం దెప్పించగనే కట్టుబడి ప్రారంభం చేశాడు. రామదాసు హమేషా హాజరుగా వుండి పని చేయిస్తూ వున్నాడు. అప్పాదాసు యింట్లో వంటచేసి తీరికె సమయంలో చందాలు వసూలుచేస్తూ వున్నాడు. శిలారు సాహేబు సరుకుల నిమిత్తం గుంటూరు పోయినాడు. పత్రికలలో పంచముల నాయకుడైన సంగదాసును యెవరో విరోధులు చంపారనీ, సంగపీఠం ప్రారంభించారనీ వ్యాసాలు పడ్డవి. పెద్దదినం రోజున సంగపీఠానికి ప్రవేశ మహోత్సవం జరుగుతుందనీ, రామమందిరానికి శంకుస్థాపన చేస్తారనీ ప్రకటించారు. పంచమోద్యమాభిమాను లంతా తమ సానుభూతిని దెలుపుతూ వుత్తరాలు వ్రాశారు. బయటినుంచి గూడా కొందరు సంగపీఠానికి మని యార్డర్లద్వారా పైకంపంపారు. శేషయ్యకుఅహోరాత్రాలు నిద్ర లేదు. అరిచి గొంతు మెలుగు రాచింది. గోడలు గోగు కొమ్మలవలె పెరిగి వస్తూవున్నవి. బాగా రెండు బద్దిరింపులు వదలి శాశ్వతంగా కడుతున్నారు. పెద్దదినం మూడురోజులు కద్దనంగా

పాలగచ్చుతో సహా పని యావత్తు పూర్తిచేశారు. ఈ పని పూర్తి గావడం జూచి యీ వేడిలోనే బావి ప్రారంభిస్తే బాగుంటుందని రామదాసు వీరదాసుతో హెచ్చరించాడు. అది యెంతలోదని వీరదాసు మోటుకొని పూర్వపు పంపిణీ ప్రకారం తవ్వకం, తోలకం, కట్టుబడీ యావత్తూ పూర్తిచేయించాడు. రామదాసు వీరదాసు చేతనే బావికి గడ్డ యెత్తించి శంకుస్థాపనకూ, బావి సంప్రోక్షణకూ, గృహప్రవేశానికీ. దినానికీ సమారాధనలు పదిహేనవ రోజుననే నిశ్చయించారు. ప్రయత్నాలన్నీ నాలుగు కాళ్ళా పరుగెత్తుతున్నవి.

## ౪

## పెద్దదినం - సంగపీఠం

ఇది కార్తీకమాసం. రాత్రి పిండారబోసినట్లు వెన్నెల గాసింది. సూదిబోటికి శిఖర మెత్తినరీతిగా అరుణకిరణుడు పొడుపు కొండపై నెక్కి ప్రకాశిస్తున్నాడు. వెదుళమ్మా, పుట్టలమ్మా రాత్రంతా తమ చెరువులు దురస్తుచేసి తూర్పు తెల్లబారంగనే చాలించి విశ్రమిస్తున్నారు. బొల్లుమోరయ్య పులికాపు చేసుకొని చెల్లెలైన కృష్ణవేణిని చూస్తూ కూర్చున్నాడు. రెడ్డిపీరుల వీరరక్తసిక్తములైన శిథిలములు యినుమడించిన రక్తిమతో వెలుగొందుతున్నవి. ప్రతిఅడుగున పెన్నిధానానికి, సంజీవికీ, నిలయాలని పేరు వడసిన కొండభూములు విలసిల్లుతున్నవి. వీరుల కాటపట్టయిన పూరకొండ విరాజిల్లుతున్నది. త్రిభువనములకూ మూలాంకురమై అమ్మవారు త్రిశూలాధారిణియై గద్దెచట్టుపై నెక్కి తరుగుల్మలతా శోభితములైన కొండసీమలను పాలిస్తున్నది. కొండపీటి జంగం పాలనాధికారం పార్వతికి వదలి గంగాప్రియుండై తటాక సమీపమున జలపాలేశ్వరుడను రసికనామధారియై పాడు దేవళములో విహరిస్తున్నాడు. ఉత్సవార్థమై యెత్తైన కొండ గోడలపై నెత్తిన నీలపు వుల్లడంవలె శారదాకాశం చౌకళించి వున్నది. సంగోత్సవ సందర్శనార్థమై చనుదెంచిన గగనచారుల తెలి విమానముల తెరం

గునా, నాకకుమారు లధిష్ఠించి విహరించే శ్వేతకలభముల పోల్కి-
నీ మబ్బుగున్నలు చెల్లాచెదరై పరుగిడుతున్నవి. చలి యింకనూ
ముదరలేదు. నాతి శిశిరములైన పిల్లగాలులు కోరుపులు సెక్కని
వామనగాయలవలె నాజూకులై కవోష్ణపు బాలకిరణ రుచులతో
మెదిసి అత్యంత భోగ్యములైనవి. శేషయ్యా, శిలారుసాహెబూ,
వీరదాసూ రెండు కాళ్లూ దగ్గర బెట్టుటకు వ్యవధిలేకుండా సమా
రాధన ప్రయత్నాలు చేస్తున్నారు. పెరుగు కావిళ్ళూ, కూర
గంపలూ వ్యవధిలేకుండా వస్తున్నవి. కోటమ్మా, వెంకమ్మా
వంట కమామిషీ విచారిస్తున్నారు. రోడ్డు పొడుగునా మిఠాయి
కొట్లూ, పండ్లదుకాణాలూ బార్లుదీరినవి. ప్రోలేలమ్మ మైదానంలో
వందలకొలది బండ్లు దిగుతున్నవి. దూరపు టూళ్ళనుంచి జనులు
ఆరాధన చూడడానికి వచ్చి విస్తరించివున్న మర్రులూ, జువ్వలూ
రావులూ, వేపలూ మొదలైన చెట్లకింద విడిది దిగారు. బుర్ర
కథలూ, భజనలూ, కోలాటాలూ, కుస్తీలూ చెలరేగినవి. సత్తెన
పల్లి పీరయ్యగారూ, బెల్లంకొండ మస్తాన్‌గారూ శిష్యసహితంగా
వచ్చి బస లేర్పరుచుకున్నారు. బెజవాడనుంచి రామేశ్వరరావు
గారూ, హైదరాబాదునుంచి వెంకటరెడ్డిగారూ, ఇంకా యితర
అభిమానులూ తొమ్మిదిగంటల రైలుకు వచ్చారు. కంఠంరాజు
యీ వుత్సవం జూడవచ్చే బ్రాహ్మణులు మాలబ్రాహ్మణులనీ,
వారికి భోజనంపెట్టే బ్రాహ్మణులను వెలివేయిస్తాననీ, శంకర
స్వాములవారిని రప్పించి వేదాంతం కోటమ్మకు జుట్టు కోయించి
ప్రాయశ్చిత్తం చేయిస్తాననీ బెదిరిస్తున్నాడు. రెండు జాములకు
దినం పూర్తిఅయి అష్టాదశ వర్ణాలూ భోజనం చేశారు. భావిలో
చేదవేయడం అయింది. శంఖుస్థాపన చేశారు. సంగపీఠ స్థాపనం
అయింది. రామేశ్వరరావుగారు సంగపీఠానికి అనుకొని పఠన
మందిరం గట్టడానికి అయిదువందల రూపాయిలూ, భాగిరెడ్డిగారు
గ్రంథాలు కొనడానికి అయిదువందల రూపాయిలూ వాగ్దత్తం
చేశారు. ఆంజనేయ మండపానికి యెదుట రెండు గంటలకు సభ
చేరింది. పీరయ్యగారూ, తిరుమలశెట్టి కోటయ్యగారూ, రామే

శ్వరరావుగారూ, భాగిరెడ్డిగారూ మొదలైనవారంతా సభ నలంకరించారు. కోటిమ్మగారు బుచ్చయ్య గురువర్యు డుపదేశించిన మహావాక్యాన్ని స్మరిస్తూ జనకసభలో యాజ్ఞవల్క్య మహర్షిని, రతాలు గుణింపజేసిన గార్గిమహాదేవి ననుకరిస్తూ ఆంజనేయ మంటపంమీద కూర్చున్నది. పీరయ్యగారి బ్రహ్మతేజం సభను ప్రకాశింప జేస్తున్నది. సభ ప్రారంభించే సమయానికి అప్పాదాసూ, మరికొందరూ నగర సంకీర్తనంచేసి యాగంటివారి తత్వాలుపాడుతూ యే ప్రకారంగా వచ్చారంటే :

తత్వం

అప్పా :- గుణము కుదరదు యేమిసేతురా రామ॥ న్యతంత్రీ గు॥

పరభామల యెడబాయనంటది - పరద్రవ్యము తా బట్టెనంటది
పరభోజనమే యింపని యంటది - పరనిందెకు తా మొనగాడంటది
పొరిగింట్లకుదా బోతానంటది - గీదగీడములు తెస్తానంది.
వరుసదప్పియే తిరుగుతనంటది - నీరసదేహమె నిత్యమంటది
గురుతుగ స్వామిని మరుచకుమంటే-కుయ్యబోకు ఆదికొరగాదంటది॥గు॥

కంఠంరాజు:- (ఆంజనేయమంటపం మీద కూర్చొని) యిక్కడ బ్రాహ్మలం కూర్చున్నాం తొలుతొరాయేమి ?

తత్వం

అప్పా:- బ్రహ్మంబేదో తెలుపండయ్యా - బ్రాహ్మలు మీరయితే ?
బ్రహ్మం బేదో తెలుపండయ్యా - భ్రాంతిలేక యీజీవులకూ ?
అండపిండ బ్రహ్మాండంబులలో - నిండియుండి తానిండు పున్నమ
పండువెన్నెలను దండిగ వెలిగే ॥ బ్రహ్మం ॥

కం:- మేము బ్రాహ్మలం కాకపోతే మానె, నీవెవరు ?

తత్వం

అప్పా :- యెవరనియడిగితె సిగ్గవుతున్నది - యేమనిచెప్పుదు విసరయ్యా !
బూతుహేతువై లోకములోనికి - మూత్రపుగవి దాటొస్తినయా.

కం:- వాండ్ల ననవలసిన పనిలేదు. హీనకులాలకు హీనపు మాటలే వస్తవి.

త త్వ ం

అప్పా:- ఘనమైన కులమేదీ కానీకులమేదీ-కులమెంచగానేలా గుణమేకారణమూ

కంఠంరాజు, మనం యిక్కడకూర్చోవడమే తప్పని లేచి పోయినాడు. కొందరు వైశ్యులూ, కమ్మవారూ, ఆయనను వెంబడించారు.

త త్వ ం

అప్పా:- యీజన్మమిక దుర్లభముగా-ఓరి పాజన్మసాకార సద్గుణునికనరా ॥యీజ॥

అని తత్వం పాడుతూ సభలోకి వచ్చి భజన విరమించాడు. వెంకటరెడ్డిగారిని సభకు అధిపతిగా జేశారు. వారు లేచి "మనకు నాయకుడై మన కుల ముద్ధరిస్తాడని యెంతో మన మాశపెట్టుకొన్నందుకు మన దురదృష్టంవల్ల వారి కకాలమరణం సంభవించింది. స్వార్థపరులగు దుర్మార్గుల దుండగాలకు బలియైనాడు."

రామదాసు:- అయ్యా! పరనింద కూడదు. మానాయనెన్నడూ పరనిందచేసి యెరుగడు.

సభలో హాహాకారాలు చెలరేగినవి.

వెం:- కుమారుని మించినతండ్రి. వుద్యమాలు యిట్టివారు నడిపితేనే నిడివేరగలవు. మీావూరిలో పుట్టిపెరిగిన సంగదాసుగారియొక్క గుణాలు మీాకు వర్ణించి చెప్పనవసరంలేదు. వారివుపన్యాసాలు నాకే స్మరణకు వస్తున్నవి. మన ఉద్యమం మహాయజ్ఞం. పశువధలేనిదీ యజ్ఞాలులేవు. సంగదాసుగారు మన వుద్యమానికి తన ప్రాణాన్నే బలియిచ్చారు. మనఉద్యమానికి యింత మంచి పశువెన్నడూ బలిగాలేదు. విజయంయొక్క ఆధిక్యత త్యాగము ననుసరించి వుంటుంది. త్యాగమే మనల నుత్సాహమునకు పురికొల్పుతుంది. మహాత్ముల త్యాగములే మహాత్ములు బయలుదేరడానికి కారణములవుతవి. యేసంఘంలో త్యాగముండదో అది మృతిచెందినట్లే. రామదాసుగారు యేవో కొన్ని సంగతులు చెప్పవలెనని కోరుతున్నారు. మీారంతా నిశ్శబ్దంగా కూర్చోండి.

రామ:- ఆర్యులారా! యీరోజు ఉపన్యాసం చెప్పవలె నని నే నుద్దేశించి రాలేదు. కంఠంరాజుగారడిగిన ప్రశ్నలే బహు కాలం క్రిందట అనేకులడిగారు. యిప్పుడు అడుగుతున్నారు. యిది నిత్యసమస్యగా కనబడుతున్నా దానికుండుబలం తగ్గిపోతున్నది. దురభిమాన రహితులైనా ఆత్మగౌరవ ప్రేరితులై గురుత్రయం వా రాప్రశ్నలకు సదుత్తరా లిచ్చివున్నారు యీ ప్రశ్నలకు నే జవాబు చెప్పడానికి ప్రయత్నించడంకంటె వారిచ్చిన జవాబులనే మీకు వినిపించవలెననే వుద్దేశంతో నేనిచ్చటికి వచ్చాను. కొందరల్పానికి దూదేకులసిద్ధయ్యగారి కులాన్ని ఆక్షేపించితే వారు అద్భుతమైన యీ క్రింది జవాబు నిచ్చారు.

తత్వం

యేకులమని నన్నివరమడిగితే యేమనిచెప్పుదూ లోకులకూ, పలుగాకులకూ, దుర్మార్గులకూ, యీదుష్టులకూ ॥యే॥

ఫాలభాగమున యేలలుపాడుచు భావంగన్నది నాకులమూ. ఇంటిలోపలను యిల్లుగట్టుకొని మంటిలోపలా రాటంబెట్టుక, కంటిలోపల కదురుబెట్టుకొని, ముక్కులోపలా యేకుబెట్టుకొని, చెవులోదారా చేతికిదీసుక, నారాయణయని నరముదీసుకొని, శివసాక్షరియనే తడికవేసుకొని, పంచాక్షరియనె కుంచదీసికొని మధిమిత మిధిమిత గుబ్డెబ్ గుబ్డెబ్, యేకినకులమే మాకులమూ. ఏకినయేకులు పీకినపింజలు, లోకమంత వొకపాకముజేసుక, ఏకినకులమే మాకులమూ.

ఒంటరిగాదూ మాకులమూ గురిజంట దిరుగునూ మాకులమూ. అండపిండ బ్రహ్మాండంబెల్లా నిండివున్నదీ మాకులమూ.

ఆహా! సిద్ధగురుని భావోద్గమనం నిర్భయంగా బ్రహ్మాండాల నధిగమించింది. కొందరు లక్ష్మప్ప గురువుది హీన వృత్తని నిందిస్తే తన వృత్తి గౌరవం యీ విధంగా వెల్లడించారు.

తత్వం

మగ్గంబెట్టి నేసినందుకూ మోక్షం బిడుగో వినరయ్యా! భర్గోదేవస్యా యని మగ్గం పదిలపరచి తా నేయవలెన్, కామక్రోధ లోభ మోహముల కదల కుండగా గట్టవలెన్. నీమము దప్పక నీతిమార్గమున నెమ్మదిగా పరుగెత్తవలెన్.

గురువాక్యం బను కుంచ దీసుకొని నాసుపు పడుగు నేయవలెన్, నింగు వేసుకతొ పండు వెన్నెలను నిలిచి తమంతట యెరుగవలెన్, దండి సిద్ధగురు అండనుజేరి బారి యెరిగి దిగనేయవలెన్.

వీర గురునియొక్క యుద్ధ ప్రకటన ధర్మయోధులెల్లరూ వినదగినది.

## తత్వం

నడివీధి యందునా నాటింతు నాకొల్మి నాడు మండలముల సాటింతురా.

మతము దెలియని యట్టి మాయ గురువుల బట్టి ప్రమానిప్రమానికి వేల గట్టింతురా. పోతులూరి వీర వాక్యమునమ్మినా వాడవాడల నోలలాడింతురా ॥శివా॥

మూడు మొనలామీద ఆడింతురా లోకం, ముగ్గురు మూర్తుల వోడింతురా, భేదమూ సేయక హరి పోతులూరయ్య వాక్యమునుబట్టి నేబల్కేనురా, ఆరు మతమూలాకు [illegible]ందేటి నాకొల్మి యేటు లోకాలలో వెల్గింతురా ॥[illegible]వా॥

గురుప్రియంవారి సమతా, భావ గంభీరతా, కార్యోత్సాహమూ, నిర్భయ వర్తనమూ మన కందరకూ అనుకరణీయాలు. ఆది శంకరులకు పరమార్థంలోమాత్ర మందిన సమత్వం వీరికి వ్యవహారమందూ అందింది.

వెం:- అప్పాదాసుగారు తాము రచించిన చరమ గీత మను యేలను చదువుతున్నారు. మీ రందరూ విన ప్రార్థితులు.

## (యేల) చరమ గీత

౧. వుండానిల్లా పండనేలా – వండపొయ్యా దండామయ్యా – అందలేకా మాలాలేందేరు ఓ సంగా బావా! దండనుండా వనుకుందేరు.

౨. చేతామంటే కూలేలేదూ - పోదామంటే నాలీ లేదూ - బిచ్చమంటే మాలీ గాదురా. ఓ సంగాదేవా! దేవుడికె జాలి లేదురా.

౩. తినబోతే మెదుకే సున్నా – కట్టబోతే గుడ్డేదన్నా? తాగబోతే నీళ్లే మన్నారా ఓ లోకాసంగా! పిల్చబోతే గాలే సన్నరా.

౪. ఇంటావుంటా వంటాగబ్బా చుట్టుగుడిసె లన్నీ మబ్బా బయట బోతే మాకే దొబ్బురా ఓ నిస్సంగా నీకూ! సంగరక్ష బిరుదా మబ్బారా.

౫. ఆసామీలా చరణాకోలా - పోలీసులా పోడూ చాలా - యింతకంటె జైలూ మేలేరా ఓ గురునాథా! మా జీవనమే మాకే గోలారా.

౬. బాల్యమూనా పాలాపూసా - పడుచూ కు రకై నాసొగసా॰ ముసిలికైనా బేడకాసా(? ఓ వ్యాసంగాకాయా! ఈ బ్రతుకుమీదా యేలా ధ్యాసారా.

౭. వెతలామర పాడిక్కే సారా - పోలీసులా చేతా చెహరా - రాత్రి పగలూ మాకే పహరారా ఓ గురూరాయా! దుఃఖ్ఖములా నెడాదోయారా॰

౮. మొక్కాబోతే గుళ్లేలేవూ - యెక్కాబోతే బళ్లేరావు - కుడవ పూటకూళ్ళే లేవురా ఓ జ్ఞానసంగా! చదువనైనా బళ్ళే లేవురా.

౯. బ్రాహ్మణులా కెల్లామారం - వైశ్యమణులా కెల్లాబేరం - సూద్ర జనుల కెల్లా సారంరా ఓ ముక్తీసంగా! మే మెంమల కీ భూమీభారంరా.

౧౦. ఆరంజోతి అమ్మాగాదా? - వసిష్టుడూ తండ్రిగాడా? - పారాశరుడు బంధువెగాదా? ఓ శిష్టాసంగా! ఇంతకంటే శిష్టూ లెవరూరా.

౧౧. పరాత్పరుడూ అయ్యాగాగా - పరమేశ్వరీ అమ్మాగాగా - బేధములా కెడామేదీరా ఓ అజ్ఞానదాసా! భేద వాదామూల మేదిరా.

అందరూ చప్పట్లు గొట్టారు.

వె:- అయ్యా! సభ యింతటితో ముగిస్తాను. సంగదాసు యొక్క ఆత్మకు శాంతి గలుగునుగాక! వారి స్వార్థత్యాగం మనలను ధర్మ నిర్వాహణమునకు పురికొల్పునుగాక! వారు తల పెట్టిన ఉద్యమాలన్నీ విజయం గాంచునుగాక!

౨౫

దా వా

వృత్తిక్రియల్లో యెక్కడివాండ్లక్కడికి బోయిన తరువాత రోజుల వెంట వూళ్ళో క్రమేణ గడబిడ తగ్గింది. కూలీలలో ప్రతి కక్ష నాయకుడైన చౌదరయ్య లొంగిపోయి కూలీ ముబాదలగా యిచ్చి పైరు గోయించడం ఆయన వుద్యమానికి రెక్కలు దీసి నట్లయింది బెజవాడ సభలోని తీర్మానాలన్నీ అచ్చు వేయించి వేలకొలది కాగితాలను గ్రామాలలో పల్లెలలో పంచిపెట్టటంచేత వుద్యమానికి వినికిడి యెక్కువైంది. మంగళాపురంలో జరిగిన గడ బిడలు విన్న తరువాత చిన్నపరెడ్డి వుద్యమంతో జోక్యం పెట్టు

కోవడం మానివేశాడు. రామదాసు సంసార వ్యవహారాలలో జోక్యం మాని సంగపీఠంలో కూలీల పిల్లలకు ధర్మంగా చదువు చెప్పడం ప్రారంభించాడు. అప్పాదాసు పగలు యింటిపనులు చేస్తున్నా సంగ మందిరంలో రాత్రి పాఠశాల పెట్టి కూలీలకు విద్య చెపుతున్నాడు. పఠన మందిరం తరఫున కొన్ని పత్రికలు తెప్పించి అందరూ పుస్తకాలూ పత్రికలూ ధర్మంగా చదువుకోవడానికి యేర్పాట్లు జరిగినవి. రామానాయుడు యిదివరకెన్నడూ సంగ మందిరములోకి రాలేదుగాని తన పుస్తకాలు గ్రంథాలయానికి బహుమతిగా యిచ్చి తనకు వచ్చే పత్రికలన్నీ పంపిస్తున్నాడు. కూలీలు సాయంత్రం యిండ్లకు రావడంతోటే పత్రికలు చదువుకుంటూ, లోక సంగతులు వింటూ యితర దుర్వ్యాసంగాలు విడిచిపెడుతున్నారు. జిల్లా సంఘం తరఫున యెవరో వొకాయన వచ్చి పరపతి సంఘాలను గురించి సంగ మందిరంలో వుపన్యాసాలు యిస్తున్నాడు. పట్టయ్య అనే భట్రాజు కుర్రవాడు పత్రికలు చదువురాని వాండ్లకు చదివి చెపుతూ అప్పుడప్పుడు కూలీలకు వుపన్యాసాలిస్తున్నాడు. ఓపిక వున్నప్పుడు రామదాసు పురాణాలుగానీ, వేదాంత గ్రంథాలుగానీ చదివి వినిపిస్తుంటాడు. విశేషంగా కూలిజనం వుంటారనీ, మాలస్పర్శ తగులుతుందనీ బ్రాహ్మలూ, కోమట్లూ, మందిరానికి యింకా రావడంలేదు. కొందరు కమ్మవారూ, రెడ్లూ వస్తున్నారు. చౌదరయ్య యింకా బయట తిరగడం లేదు. ఎప్పుడైనా కొట్టంలోకి వెళ్లుతాడుగాని చిన్నపిల్లలు ఆయనను చూస్తే చంపుతాడేమోనని భయపడిపరుగెత్తుతున్నారు. బయటికి రాకూడదనే నిర్బంధం మాత్రం లేదుగాని పొద్దుగూకులూ యేదో వ్యావృత్తిమీద తిరుగుతుండే మనిషికి యింట్లో కూర్చోవడముంటే ఖైదు చేసినట్టుగానే వున్నది. ఏమీ వుబుసుపోక పగలూ రాత్రులూ నిద్రలోనూ, చుట్టలతోనూ కాలక్షేపం జేస్తున్నాడు. పని లేనివాడి మనసు పరిపరి విధాల బోతుంటుంది. కూలీ రేటు తగ్గించలేకపోగా వాండ్లకు లోబడి ముందుగా కూలీ యివ్వడం చౌదరయ్యకు తల గొట్టినట్టుగా వుంది. మధ్యాహ్నం నిద్రబోయి

లేచి ఫలహారాలు చేయడంకంటే అనేక విధాల అన్నం దినడమే మేలని రెండవసారి భోజనం చేసి చుట్ట దాగుతూ కచేరీ గదిలో కూర్చొని మనసు దీర్ఘాలోచనలలో మునిగి చుట్ట దాగడానికి కూడా వల్లగాక చేతులోది గోడకానించిపెట్టి దిగ్గున లేచి గదిలో యిటూ అటూ పచారి చేయడం ప్రారంభించాడు. మనసులో ఆలోచనలు యెంత తీవ్రంగా వున్నవో నడకకు అంత వడి ఎక్కువైంది. "ఈ మాల కీటకాలకు నాబోటివాండ్లను సహా పరాభవం జేయడానికి అధికారము వచ్చింది. నా వంటి మోతుబరు ఆసాములనే సెలకట్టనీయక యీ జంగిలి గుంపు పంతాలు నెగ్గించుకొంటున్నారు. నే నొక మాలవాడిని యేదో దెబ్బ కొట్టడం, వాడు ఆయువుమూడి చావడం, నేను అయిదు సంచుల కరుకులు దండగ పెట్టడమూనా? ఈ మాలపల్లెంతా మూడు మడతలు పెట్టి అమ్మినా అయిదువేలు రావు. ఊరంతా తెలుగు మీరిపోయింది. బొడ్డూడని సన్నాసులంతా పెత్తనదార్లే. పూట గంజికి గతిలేని శేషయ్య నలుగురిలో నన్ను యెదిరించి మాట్లాడాడు. ఇట్లాగే కోపం వచ్చి వొకదెబ్బ గొడితే వూరి సగానికి చాలిన ఆసామిని యింటిమీదబడి నానా బజీతూ చేశారు. నా అంత వాడిని యేమీ చెయ్యలేక వూరుకుంటే తక్కిన ఆసాములకు పారాగతా లుంటవా? తగిన శాస్తి వీండ్లకు చేసితీరుతా. మనం యిప్పుడు యేమిటి చేయడం?" అని గట్టు తెగిలేవరకు మనసు సవారి దియ్యడం ఆగింది. నడక నిలిచిపోయింది. ఏకదీక్షగా వీధి వంక వట్టిచూపు జూస్తూ నిలుచున్నాడు. వీధిన పోతూ వస్తూ వుండే వాండ్లెవరూ మనసుకు గోచరం గాలేదు. బట్టబయలు మాత్రమే కనబడుతున్నది. తను గదిలోవున్న సంగతి గూడా మరిచిపోయినాడు. మనసు సంకల్ప రహితమైంది. తానుగూడా స్ఫురించలేదు. సర్వమూ శూన్యమూ యేమి?

పంతులు సిరుకావి దోవతి పింజబోసి కట్టుకొని కిర్రు చెప్పులతో ద్వారం దగ్గర ప్రత్యక్షమయినాడు. చౌదరయ్య ఆయనను జూడంగనే మనసుకు హాయిజిక్కి శ్వాస బిల్చుకొని "పంతులు

గారూ ! సమయానికి వచ్చారు. కూర్చోండి. మీరు బాగా ఆలోచన జేసి తిరుగులేని యెత్తు యెత్తాలె. మీ శక్తి యావత్తూ యిందులో కనబరచండి, చూతాం."

పం:- హనుమంతుని దగ్గర కుప్పిగంతులా ? సంగతులేమో చెప్పండి. యేదో ఒక పంథా చిక్కకపోతుందట ?

చౌ:- ఇది అన్ని వ్యవహారాల మోస్తరు గాదు. మాల వాండ్లకూ, మనకూ జరుగుతున్న వ్యవహారాలు మీ కెరిగినవే గదా. వాండ్లను అణగగొట్టే మార్గమేమిటి ? దెబ్బకు దిమ్మ దిరగాలె.

పం-- దిమ్మదిరిగితే చాలదు. మళ్ళీ లేవకుండా వుండాలె. అది వొకమాటు నీకనుభవమేగదా !

చౌ:- నీదంతా చెతురూ. మాటవచ్చింది గనుక అంటున్నాను. ఆ సమయంలో మహాతమాషాగా వుంది. చంపాలెనని వుద్దేశం లేకపోయినా చచ్చేటట్టు గొట్టాను.

పం:- సరే, అది అందరికీ—కనబడుతూనేవుంది. అప్పుడు చేతులు వణకలేదా ?

చౌ:- అదంతా నాకు తెలియదు. అప్పుడు నాకు రెండో ప్రపంచం కనబడలేదు. నెత్తురుచూచేవరకు గుండె గుభేలుమన్నది. అప్పుడు యెంత వళ్లు తెలియకపోయినా తప్పించుకోవడానికి చేసిన పనులన్నీ యెట్లాతోచినవోగాని స్రకమంగానే వున్నవి. యేదో అయిపోయింది. గట్టునపడ్డాం. ఆసమయంలో నాకొక లక్ష్యంగా వుండలేదుగాని అయిదు వేలరూపాయలు పారబోయడమంటే నాకిప్పుడు గుండె బద్దలవుతున్నది.

పం:- ఆసమయ మటువంటిది. అప్పుడు మనము మర్యాద చూచుకొన్నాంగాని డబ్బుమొఖం చూడలేదు. గనుకనే కార్యం గట్టెక్కించ గలిగాను.

చౌ:- అందుకు నేననడంలేదు. అది భ_ర్తీపరుచుకునే వ్యవహారం గూడా నీవే చూడాలె. రెండుపనులూ నీచేతులోనేవున్నవి. బాగా యోచించు.

పం:- ఉన్నమాట వా_స్తవమేగాని నాధరకు మీరుమొగ్గరు.

చౌ:- కొండకు నాగలిమోటి_స్తే లాభంలేదు. సలీసుగా వుంటేనే ఆయెను. వ్యవహారం దారితప్పివ_స్తే యావత్తూ నష్టమే గదా!

పం:- ఇక ఆమాటలన్నీ తీయండి. మన ప్లీడరుగారు స్వాధీనపు వ్యాజ్యం వేయడంతోనే యావదా_స్తీ స్వాధీనపడితీరుతుందని చెప్పాడు.

చౌ:- ప్లీడరు చెప్పడానికేమిలే. ఓడిపోతవన్న వ్యవహారాలు అనేకం గెలిచినవి. గెలు_స్తవన్నవి కొన్ని వూరికెనే పోయినవి. వ్యవహారమంటే జూదమనుకోవలసిందే. వ్యవహారంపోతుందని నిశ్చయంజేసుకునే దిగాలె. ఖర్చులు మూడుకోట్లలకు రెండు వేలకు యేమాత్రమైనా మిగులుతవిగాని తగ్గవు.

పం:- మీరు వ్యవహారసరళిని బట్టి అనుమాన పడుతున్నారు. కాని నాకేమీ చిక్కులుకనపడవు. మన వ్యవహారానికి ప్లీడరుసలహే అవసరంలేదు. నేను అనంతర వారసునని రామదాసు కొన్న పదియకరాలు వారసత్వపు ఆ_స్తిఅని పబ్లికుదృష్టాంతాలే వున్నవి. నిజంగాబడితే వాండ్లకు వాదమేలేదు. వాడు క్రమమైన ప్రతిఫలమిచ్చి కొన్నామన్నా బాధించదు. మూడు సంవత్సరములకు గతఫలసాయం తొమ్మిదివందల రూపాయలకు తక్కువలేకుండా యిప్పిస్తారు. నేను ఖర్చులకు మిణకలేక వూరుకున్నాగాని పనిజే_స్తే బాగా లాభించేవ్యవహారమే. అయితే ధైర్యముండాలె.

చౌ:- యేదోవొకపేరు బెట్టు.

పం:- నీయభిప్రాయం చెప్పు.

చౌ:- సొమ్ముమ్మవాడివి నీవుచెప్పడం క్రమం.

పం:- నా అయిదువందల తాకట్టుదస్తావేజు యిచ్చివేసి పైన అయిదువందలు రూపాయిలియ్యి. తాకట్టుభూమి స్వాధీన పరుచు.

చౌ:- బ్రాహ్మల కెంతాశ!

పం:- నీవు యిట్లాఅంటావనే ముందు చెప్పమన్నా.

చౌ:- దస్తావేజు యిచ్చివేస్తా. నీపాలం జేసుకో. అత్యాశకు పోబోకు.

పం:- మునసబు యేడువందలు రూపాయిలు యిస్తానంటే నేనే మొగ్గలేదు.

చౌ:- పన్నెండు వందలిస్తానన్నాడు. యివన్నీ నాకు జెపుతావూ! ఖర్చులు పెట్టడానికి ఆయనకు టికాణావున్నదీ!

పం:- ఆఖరుమాట చెప్పు.

చౌ:- పైన వకవందయిస్తా. నీవు బాగాపనిజేసి గెలిపిస్తే నీవుగోరినప్రకారమే తక్కినవందగూడా తీసుకో.

పం:- నీవు అడగడం, నేకాదనటం యెందుకు? నీయిష్టప్రకారమే కానీ.

చౌ:- రేపు దస్తావేజు రిజిష్టరుచేయించి వెంటనే వ్యాజ్యం తగిలించు. ఇంకా యేమిచేతాం!

పం:- ఇదే సర్వరోగహరి.

చౌ:- పదియెకరాలేగా పోతవి. ఇంకా వోపినంతఆస్తి వుంటుంది.

పం:- ఖర్చులూ గతఫలసాయం మూడువేలకు డిక్రీఅవుతవి. వాడిఖర్చులు వొకరెండువేలకు దాకొంటవి ఐదువేలతో సర్వమంగళం అవుతుంది. ఇంకా మధ్య ఫలసాయం యివ్వవలసే వుంటాడు.

చౌ:- అసలు ౧౦ యెకరాలూ నామీద పోటీకివచ్చికొన్నాడు. ఇది తనకురాకపోతే పోటీచేను నాలుగుయెకరాలూ అమ్మనన్నాడు. ఎప్పటికయినా రాకపోతుందటలే అని అది

వదిలివేసి పాటిచేనితో అప్పటికి తృప్తిబొందా. దీనితో మన చేలమధ్య యీ మాలపోడు వదలి పోతుంది. ఏరోజు మనకు ప్రాప్త ముంటుందో ఆ రోజుకే వస్తుంది. నీవు నా బాకీ యిప్పుడు తీర్చకపోతే తొందరేమి వచ్చింది? మన యిద్దరి లావాదేవీ జరుగుతుండ నియ్యి. ఆరేండ్లలో బాకీ దీని నీ భూమి నీ కెట్లాగూ రానే వస్తుంది. యింటిముందు యీ ఆరువందలూ పెట్టి డాబా వేయించు. తగిలితే నేనే యిస్తా.

పం:- నీది ముప్ఫై యేండ్లనాటి బాకీ. నేను పెత్తనానికి వచ్చిన తరువాత ఆ పొలములోనుంచి గిద్దెడు గింజలు నా యింటికి రాలేదు. ఇప్పుడు మా యిద్దరికీ వున్న యిల్లు చాలు. నీవు చేసే ౧౦ యెకరాలూ స్వాధీనమయితే పిల్లవాడిని పెంచుకుందా మని వుద్దేశం. రూపాయిలు నా కిందబడ్డవా అంటే యిక మళ్ళీ తేలేది కష్టం. నీ బాకీ అట్లాగే వుంటుంది. రామదాసు పొలంతోపాటు నాదీ వేలానికి వస్తుంది.

చౌ:- అమ్మ బాపడా! లోపల యెంతాలోచనయ్యా! నీ పొలం నేను వేలం వేయిస్తానూ. ముప్ఫై యేండ్ల నుంచీ నాకింద వున్న పొలం గనుక వుండనియ్యి మన్నాను.

పం:- యేమో బావా! ఋణ విముక్తుణ్ణి అవుదామని వుంది. ఋణ శేషమూ శత్రు శేషమూ వుండగూడ దన్నారు. నీవు నన్ను కొట్టుక పోతావని గాదు.

చౌ:- నీకు ఋణశేషం లేకుండా చేసుకుంటున్నావు గదా. నాకు శత్రుశేషం లేకుండా పోయేటట్టు లేదు. ఒక్కరవ్వ మిగిలినా యెప్పుడో భగ్గుమని మించి యావత్తూ హరిస్తుంది. ఈ కూలీల తగాదా, మహిషాసురుడి లాగ అంతులేని రూపాలతో పెరిగి వస్తున్న దేమి?

పం:- వేళ్లు పారింది.

చౌ:- కొమ్మలూ వేసింది. పెద్ద వృక్షమయ్యేటట్టుంది. యిప్పటి కీదారిన పద. తరువాత సంగతులు ఆలోచింతాము.

## ౬

### మోహనరావు

వారసత్వపు వ్యాజ్యం దాఖలు చేయడానికి యేర్పాటు జరిగిన తరువాత చౌదరయ్యకు కొంత మనశ్శాంతి గలిగింది. యితర గృహకృత్యాలు గూడా విచారించు కుంటున్నాడు. కొన్నాళ్ళదాకా వూరి తగవులలో జోక్యం కలిగించుకోక పోయినా పొలం వస్తూపోతూ వుంటే అదే పనపడి పోతుంది. తెల్ల వారి మాగిలి పొలాలు చూసి వత్తామని అనుకున్నాడు. పడమటి చేలకు పోయి తగాదా పొలం చూసివత్తా మనుకున్నాడు. కాని వ్యాజ్యపు నోటీసులు వచ్చే వరకూ ఆ చాయల బోకపోవడమే మేలనుకున్నాడు. రాత్రి భోజనమైన తరువాత చాలాసేపు హాయిగా నిద్రపోయి చీకటితో లేచి పొలం పోవటానికి ప్రయాణ మైనాడు.

ల:- యింత చీకటితో యెందుకూ? బాగా తెల్లవారిన తరువాత బయలుదేర రాదూ?

చౌ:- నాకేమి భయమా?

ల:- యెందుకైనా మంచిది. వెంకటయ్యతోనో, జీతగాండ్ల తోనో కలిసిపో. దూరపు పొలం పోవద్దు.

చౌ:- యెంత భయస్తురాలివే. పోనీ, వెంకటయ్యా, నేనూ కలిసే పోతాంలే. రాత్రి సంగతి పిల్లవాడితో హెచ్చరించు.

ల:- నాకీ గుంటచిక్కు లన్నీ తెలియవు. మీ కోడలినే అడగమంటా.

చౌ:- నీవు యింట్లో అంటీ అంటనట్లు పరాయిదానిలాగ వుంటున్నావు గాని యింటిదానవుగా గనబడవు. సాహెబును యెండలో తిరగనిచ్చేవు. వాడి కోసమే నే పడే పాట్లన్నీ.

ల:- పరాయిదాన్ని గాక మీ యింట బుట్టానా? నన్ను అడిగావు గనుక నా వుద్దేశం నే జెప్పా. తరువాత మీమీ యిష్టం.

చౌదరయ్యా, వెంకటయ్యా చద్దన్నం దిని పొలాలకు పోయినారు. రామానాయుడు పలహారం జేసి మేడ మీదికి బోయి నాడు. సాహు ఆడుకుంటున్నాడు. కమలమ్మ పచ్చీసుపట్టా దీసుకొని మేడమీదికి బోయింది.

క:- అప్పుడే నిద్దర పోతున్నారా? కుంభకర్ణుని మోస్తరుగా ఆరు నెలలు నిద్రా, ఆరు నెలలు మెళుకువానా? కాసేపు గవ్వలైనా ఆడుకుందాం లెండి. ఉద్యోగానికి వెళ్ళితే యిట్లా నిద్రపోనిస్తారా?

రా:- (ముసుగు దీసి) యేమిటి అంటున్నావు?

క:- నే నన్న మాటలు వినబడనే లేదా? మీరు పొద్దు గూకులూ పోకచే మయికం. యెన్నాళ్ళు యీయనకీ దుఃఖమని మీ నాయన కోప పడ్డాడు. రేపు వుద్యోగానికి గుంటూరు వెళ్లుతారా? మీకు యిరవై అయిదు సంవత్సరాలు కొద్దిలో వెళ్ళిపోతవిటే. నాకు గుంటూరులో ఉండవలెనని యున్నది.

రా:- నాకు యిరవై అయిదు సంవత్సరాలూ యింగ్లీషు తారీకుల ప్రకారం వారం రోజుల క్రిందనే వెళ్ళిపోయినవి.

క:- అయ్యో! అదేమిటి? మీ నాయనగారు యింకా పదిహేను రోజుల వ్యవధానం వున్నదంటున్నారే. తెనుగు తారీఖులనుబట్టి పనికిరాదా? వెళ్ళిపోయినట్టు మీ కెప్పుడు తెలిసింది?

రా:- (కొంతసేపు వూరుకొని) తెలుగు లెఖ్ఖ పనికిరాదు. నాకు ముందే తెలుసు.

క:- మీ నాయనగారితో యెందుకు జెప్పలేదు?

రా:- నన్నెవ్వరడిగారు? చెపితేమట్టుకు వెళ్ళిపోదా? ఆగుతుందా?

క:- సరేగాని మీ అన్నదమ్ములు భాగాలు పంచుకోరాదా? ఒక్క తల్లిబిడ్డలు కనుకనా, కలిసి వుండడానికి.

రా:- "వేలుపడితే మేలురా మగడా" అని వేరింటి కాపురం వెలిగించవలెనని వున్నదా? తోడికోడలి నుంచి వేరా, అత్తనుంచి కూడానా?

క:- వాండ్ల మూడో భాగం పంచిపెట్టి మన రెండుభాగాలూ కలిపే వుంచుకుందాం.

రా:_ అదెట్లా, వాండ్లకు సగభాగం.

క:- మీరు ముందుగానే నేర్పబోకండి. చాలా ఆస్తి మీ నాయనగారి స్వార్జితమేటగా?

రా:- ఒక్క యకరం కూడా స్వార్జితం లేదు. అంతా కుటుంబాస్తి పెట్టి కొన్నదే.

క:- వ్యవహారానికి దిగితే స్థిరాస్తి సగం పంచుకుంటా డనుకోండి. డబ్బెట్లా చిక్కుతుంది?

రా:_ మీరు బాకీలు లేవంటారా? లేవంటే వుభయులకూ లేకుండానే పోతవి. ఎవరీ వెఱ్ఱి ఆలోచనలు చేస్తున్నది? మా అమ్మ నన్ను గన్నది, వాణ్ణి పెంచింది. ఈ దురాలోచనలకు ఆమె వొప్పుకున్నదా?

క:- మీరు వొప్పిస్తే వొప్పుకుంటుంది.

రా:- మన సగమాస్తి మన నూరుమందికీ చాలకపోతుం దటగాని వెఱ్ఱి ఆలోచనలకు పోబోకండి. నిజం విచారిస్తే వెంక టయ్య వ్యవసాయంలోకి దిగిన తరువాతనే చాలా భూమి కొన్నారు. అతడు లేకపోతే మనకు వ్యవసాయం సాగినట్టే. అతడు వ్యవహారానికి దిగి నన్ను సాక్ష్యం వేసుకుంటే వున్న సంగతి యావత్తూ చెపుతా. తరువాత మీ యిష్టం.

క:- ఏదో గుఱ్ఱపుబండి వచ్చినట్లున్నది. (వీధివైపు కిటికీలో గుండా తొంగి చూచి) మీ పినతల్లి కొడుకులా గున్నాడు.

రా:- (తొంగి చూచి) మోహనా! పెట్టె మేడమీదికి పట్టించుకొనిరా.

మోహనరావు షోకు పురుషుడు. సూటూ, బూటూ వేసుకొని తలమీద ఫర్‌టోపీ వోరగా బెట్టుకొని చటచట మేడమెట్లు యెక్కి వచ్చాడు. రామానాయుడు మెట్ల దగ్గరకు యెదురుగా బోయి చిరునవ్వుతో ఆహ్వానించి కూర్చోమన్నాడు. బెత్తం బల్లమీద బెట్టి లాగులు ముడత పడకుండా కొంచెం మోకాటి పైకి లాగి కాలుమీద కాలు వేసుకొని కుర్చీమీద గూర్చున్నాడు. బండివాడు తోలుపెట్టెను సావిట్లో పెట్టి వెళ్ళిపోయినాడు. కమలమ్మ, మోహనరావు సావిట్లోకి రాంగనే పడక గదిలోకి బోయి కిటికీ ప్రక్కన కుర్చీమీద గూర్చుండి వోరకంటితో చూస్తున్నది.

రా:- మోహనా! తెనాలి నుంచేనా? మీ కిప్పుడు శెలవులు గాంవాంలె?

మో:- (చేతి గుండీల దగ్గరె షర్టులో దూర్చిన వుల్లిపొర వంటి పట్టు చేతిరుమాలును దీసి అంకురిస్తున్న చిరుచెమటను తుడుచుకొని మరల గుండీల దగ్గర చొప్పించి) "తెనాలి నుంచే వస్తున్నాను. ఇంకా నాలుగు రోజులు సెలవున్నది. చూచి వెళ్లుదామని యిటు వచ్చా."

రా:- కమలం! మోహను వచ్చాడని అమ్మతో జెప్పి ఫలహారంచేసి తీసుకరా.

మో:- నాకు అక్కరలేదు. గుంటూరులో స్టేషన్ దగ్గర ఫలహారం తీసుకున్నా. మీ భోజనమైందా?

రా:- మా భోజనం యింకా కాలేదు. ఒక గంట లోపల తయారవుతుంది. కమలం! త్వరగా కానియ్యమని చెప్పు.

మో:- నాకు తొందరేమీలేదు. కొంచెం అలసట తీర్చుకుంటాను. బయటినుంచి యింట్లోకి రావడంచేత చెమట పోసింది. సూటు విడిస్తే బాగుండును. (అంటూ ఖాళీగది వున్నదేమోనని అటు యిటు చూచాడు.)

రా:- మెట్ల గదిలోకి వెళ్ళి విడువు. అక్కడి కెవ్వరూ రారు.

మోహనరావు పెట్టెగదిలోకి తీసికొనిపోయి పావుగంటలో దుస్తులుమార్చి లాగు మడతబెట్టి పెట్టెలోబెట్టి చలువచేసిన మల్లు పాజామా తొడుక్కొని పొట్టిచేతుల తెల్లచొక్కా వేసుకొని అకు చెప్పులతో చిటచిటనడుస్తూ మళ్ళీవచ్చి కూర్చున్నాడు. మొదట పెట్టుకొన్న బంగారుచట్టపు కండద్దాలు యిప్పుడు లేవు. సన్నని బంగారుకొక్కెంగల పిన్సునెజ్ అద్దాలను పెట్టుకొన్నాడు.

రా:- కమలం! వొక విసనకర్ర యిట్లా యియ్యి.

కమలమ్మ విసనకర్ర తెచ్చి బల్లమీదబెట్టి మోహనరావును చూచీచూడనట్లు గదిలోకి వెళ్ళిపోయింది.

మోహనరావు అయిదారు యేండ్లక్రిందట కమలమ్మను చూచాడు. అప్పుడామె విశేషసుందరంగా కనబడలేదు. మోహనరావు విసురుకుంటూ కూర్చున్నాడు. కమలమ్మ లక్ష్మమ్మతో జెప్పడానికి కిందికిబోలేదు.

రా:- మోహన్! నీవు కసరత్తు చేస్తావా? ఛాతీ యెన్ని అంగుళాలు?

మో:- యీమధ్య వొకఅంగుళం తగ్గింది. యిప్పుడు ముప్ఫైయేడంగుళా లున్నది. మనదండాలు తీస్తే చాలా బలం వస్తుందిగాని శరీరం చక్కగా యేర్పడదు. బస్కీలుదీస్తే పొట్ట పెరుగుతుంది. డంబెల్సుచేస్తే ప్రతికండా పెరిగి అందంగావుంటుంది. అయితే చెయ్యడంమానితే కండలు తగ్గిపోతవి.

రా:- నీదండలు చొక్కాపైకే కనబడుతున్నవి. ముంజేతి నరాలు యినపకడ్డీల లాగున్నవి.

మో:- చేపనూనె తాగుతూ డంబెల్సుచేస్తే వొళ్ళు చక్కగా బెరుగుతుంది.

రా:- మనము కిందికి బోదాం.

మోహన్ లాగుదీసి పంచకట్టుకొనివస్తానని గదిలోకిబోయి చలువచేసిన జరీవుత్తరీయుం మొలకుగట్టుకొని హాలులోవున్న

నిలువుటద్దంలో విగ్రహాన్ని చూచుకొని—— కిందికిపోదామా అన్నాడు. వుభయులూ కలిసి కిందికి బోయినారు.

మో:- అమ్మనుజూచి అయిదారేండ్లయింది. అప్పుడు అయిదోఫారమో, ఆరోఫారమో, చదువుతున్నా. నన్ను గుర్తు పడుతుందా?

రా:- మెదిగేవాండ్లలో మార్పెక్కువ కనుపడుతుంది. అయినా గుర్తుపట్టవచ్చు— అమ్మా! మోహన్ వచ్చాడు చూచావా?

లక్ష్మి:- నీవుటరా నాయనా! పెట్టె పైకెత్తించుకొని పోతుంటే యెవరోఅనుకున్నా. అంతా బాగున్నారా? నీ పెండ్లికి పిలవడానికి వచ్చావా?

మో:- నాపెండ్లికి నేనేపిలుస్తానా దొడ్డమ్మా?

రా:- యీయేడు బి. యల్, పరీక్షయితే పెండ్లి చేసుకుంటావా?

మో:- మావాండ్లు వేధిస్తున్నారుగాని యిప్పుడేమి తొందరని అంటున్నాను.

లక్ష్మి:- చాపమీద కూర్చోండి. మనుములేమైనా వస్తున్నవా?

మో:- చాలా వస్తున్నవి. యింకాయేదీ నిర్ధారణ చేసుకోలేదు. పెదనాయన యెక్కడికి వెళ్ళాడు? వ్యవహారపుచిక్కులన్నీ పోయినట్టేనా?

ల:- గట్టునబడ్డాం నాయనా. పొలంకళ్ళ పోయివస్తానని వెళ్ళాడు. రావాలె, భోజనానికి వేళదప్పుతుందేమో నీకు.

మో:- నాకు తొందరలేదులే.

రా:- మనం స్నానంచేసి సిద్ధంగా వుందాం. కమలం!— నీళ్లుతోడి అంగవస్త్రాలియ్యి.

మో.- నేను పైకిబోయి అంగవస్త్రం, తువ్వాలా తెచ్చుకుంటాను. నీ వింతలోకే స్నానం కానీయి.

కమలమ్మ రామానాయుడికి స్నానానికి నీళ్ళిచ్చింది. ఆయన నామాలు దిద్దుకుంటూ కూర్చున్నాడు. మోహనరావుకు వేడినీళ్లు పాళాలుచేసేలోగా ఆయనదిగివచ్చాడు. స్నానాలగది లోకి రాంగనే, కమలమ్మ వెళ్ళిపోబోయింది గాని యెందుకో పోలేదు. "ఆవేడి చాలునా? యింకాచన్నీళ్లు కావలెనా?" అని అడిగింది. "నేను వేడినీళ్లు చేయనండి. చన్నీళ్ళే అలవా"టన్నాడు మోహనరావు. అయితే తోడకవస్తానని గదివాకిటికి రెండుగజాల దూరంలోవున్న బావిలో చేదవేయబోయింది. మోహనరావు అక్కరలేదనే వరకు వూరుకున్నది. అతడు చేంతాడు తీసుకొని అక్కడున్న యిత్తడిబిందెకు వుచ్చు, వుగ్గమూపెట్టి గబగబతోడి వొంటిచేతితో బిందె తలపైకెత్తి నీళ్లు కుమ్మరించుకుంటున్నాడు. కమలమ్మ చూస్తూ నిలుచున్నది. చేయి పైకెత్తినప్పుడల్లా పక్క టెముకలమీద మాంసకండరములు యిసుక తరంగముల వలె హృదయంగమంగా కనబడుతున్నవి. బంగారుచాయగల విశాల వక్షంమీద కొదమతుమ్మెద రెక్కలవలె రోమాంచం చెలువారు తున్నది. నీళ్లుతోడేటప్పుడు కండలుగట్టిన పిక్కలూ, పెడదిరిగిన రెక్కలూ, దుక్కలవలెనున్న తొడలూ, పొక్కియున్న పొక్కిలీ, అక్కళించిన నాభీ, విల్లుం ధిక్కరించు పక్కలూ చక్క దనాల కిక్కలై కెంపెక్కి యున్నవి. మామూలుకంటె యెక్కువ సేపు వొళ్లు తోముకుంటున్నాడు. లక్ష్మమ్మ పిలవడంచేత కమ లమ్మ లోపలికి పోంగనే స్నానం ముగించి అన్నానికి వచ్చాడు.

ల:- ఆయన మాగాణి నుంచి పడమటి పొలం పోతున్నా డట. వేళ కందదు మీరు లేవండి.

మో:- మాకు మట్టుకు తొందరేమి?

ల:- స్నానంచేసి యెంతసేపని కూర్చుంటారు, కానియ్యండి.

రా:- బొట్టు పెట్టుకోవా?

మో:- అగర్బుంటే పెట్టుకుంటాను.

కమలమ్మ, ఇదుగో అగరు భరిణె అని కొంచెం భిడియం తగ్గి చెప్పి మరల సిగ్గు నభినయించుతూ అక్కడ బెట్టిపోయి మేడ మీది కెక్కి వుభయులకూ తమలపాకులు చుట్టుతూ కూర్చున్నది.

రా:- (భోజనం చేసి లేవబోతూ) అక్క లక్ష్మీ—నీవు మేడమీది సావిట్లో మరమంచం వాల్చి వీరికి పక్క వెయ్యి.

ఉభయులూ మేడమీదికి బోయినారు. మోహనరావు అద్దాలు పెట్టుకొని బల్ల దగ్గర కుర్చీమీద కూర్చున్నాడు.

రా:- మోహనా! తాంబూలం వేసుకో.

మో:- మీరు రండి!

ఉభయులూ తాంబూలం వేసుకున్నారు. దేహం కొంచెం వేడి తీసుకొని ముఖానికి తేజస్సు హెచ్చింది.

రా:- బి. యల్. పరీక్ష పూర్తికాంగనే వుద్యోగంలో ప్రవేశిస్తావా?

మో:- మా అన్నయ్య ప్రవేశించమంటున్నాడు. నాకు ప్లీడరు పనంటే సరదా.

రా:- పంచమోద్యమం నీ కిష్టమేనా?

మో:- దాన్ని గురించి బాగా చదవలేదు. అయినా మంచి వుద్యమమనే వింటాను.

రా:- పంచముల దుస్థితి నీ వెప్పుడూ స్వయంగా చూడ లేదా?

మో:- వాండ్లతో నా కేమిపని? అయినా యీ వుద్యమాలు పెట్టుకుంటే మనసుకు అందోళన మెక్కువ. నా క్లాసులో నారాయణరావు అనే కుర్రవాడు చదువులో మొదటివాడుగా వున్నా వూళ్ళో వుద్యమాలన్నీ నెత్తిన బెట్టుకొని అహోరాత్రాలు వూపిరి సలపకుండా తిరుగుతుంటాడు. వాడిని చూస్తే నాకు జాలి వేస్తుంది.

రా:- మోహనా! నే నిప్పుడు బయలుదేరి యిక్కడి దే, పాలెమనే వూరికిబోయి వస్తాను. నా కోసం చాలామంది కనిపెట్టు

కుని వుంటారు. అయిదు గంటలకు తిరిగీ రాగలను. బడలికగా వున్నదంటివిగా. పడుకుంటావా, నాతో వస్తావా?

మో:- రాత్రి నాటకానికి వెళ్లాను. నిద్ర తూలుతున్నది. నీవు వచ్చిన తరువాత అయిదు గంటలకు షికారు పోదాం.

రా:- సరే పడుకో. కమలం! మూడు గంటలకు మోహనుకు ఫలహారం జెయ్యి.

రామానాయుడు పాలెంలో ధర్మపఠన మందిర మొకటి పెట్టించడానికి వెళ్ళాడు. మోహనరావు నిద్రపోయినాడు.

## ౭

### ద్రోహము

కమలమ్మ కొంతసేపు పడుకున్నది. నిద్ర పట్టలేదు. దిగిపోయి భోజనం చేసి ఫలహారం తయారుచేసి మేడమీదికి తెచ్చింది. మోహనరావింకా లేవలేదు. కాని కదులుతూనే పడుకున్నాడు. మూడుగంటలు కావచ్చింది. లేపడానికి సందేహించి కిటికీగుండా మోహన రూపం చూస్తూ కమలమ్మ కూర్చున్నది. చూచి చూచి, దగ్గర వున్న వీణెను దీసికొని సారించి,

ఓ—రమణీమణి వేగమె పోగదె-సామిని తేగదె॥

అనే జావళీ యెత్తుకొని మోహనంగా పాడుతున్నది. మోహనరావు నాగస్వరం విన్న కోడె తాచువలె తలయెత్తి వీణాగాన ప్రవాహాన్ని వెల్లువలు గట్టిస్తూ కూర్చున్న మోహినీ రూపాన్ని చూచాడు. చూచి కనికట్టు కట్టిన తాచువలె పక్కమీద వాలి, అరగండ్లతో ఆనందిస్తున్నాడు. ఆనంద సముద్రంలోనుంచి యింకా తెప్పరించుకో లేదు. కమలమ్మ వాలు గన్నులతో అతని నిద్రావసాన కమనీయ ముఖారవిందాన్ని తిలకించింది. ముఖ కమలంమీద ముసురుకొన్న బాల చంచరీకముల కొనరెక్కలవలె బెరిగిన నును మీసములూ, విరిసి నుదుటిపై యాడుకొను కత్తిరింపు ముంగురుదీగెలూ, సోయగము చింది

ముఖముపై విరజల్లినట్లు విరాజిల్లు తున్నవి. కమలమ్మ ఈ యద్భుత రామణీయక విలోకనంబుచే నై పెక్కు ప్రేమోన్మత్త యయి కంఠమెత్తి మోహన రాగమును శ్రవణ సమ్మోహనంగా పాడు తున్నది. మోహనరావు విని, విని, మొగం చిట్లించి వీణపై యెన్ని సంగతులు గనబరిచినా జంత్రం శ్రావ్యమున గొంతుయొక్క చక్కదనానికి తీసిపోతున్న దనుకొన్నాడు. ప్రేయసి యొక్క చక్కదనాల కలస్వనాన్ని పాదుచేస్తున్న వీణా గానమును శిక్షించుటకోయన చివ్వున లేచి కూర్చున్నాడు. కమలమ్మ జావళీని పూర్తిచేసి పాట నాపివేసింది. మోహనరావు నిరాసజెంది మిన్నక కూర్చున్నాడు. కమలమ్మ మందాక్రాంతా వృత్తంవలె మందగమనంతో చావిటిలోకి వస్తున్నది. జంత్ర సహాయం లేని స్వాభావికమైన మనోహర పిక స్వరంవలె విరాజిల్లుతూ కమలమ్మయొక్క సాన్నిధ్య సౌభాగ్య మబ్బింది. గాన మాపివేసిన లోపం గన్పట్టకుండ మరియొక జావళీ యెత్తుగడ చేసినట్లు అభిరామంగా మోహన రూపం పొడ గట్టింది.

క:- ఫలహారం చేయరా ?

మో:- తీసుకొని రండీ.

వెండి పాత్రలతో కాఫీ, వుప్మా, కమలాఫలాలూ తెచ్చి బల్లమీద బెట్టింది. మోహనరావు ఫలహారం చేస్తూ కమలం యొక్క తొనను సీత్కారంతో ఆస్వాదించగా రస భావాలన్నీ కమలమ్మా అనుభవించి సొక్కి సోలిపోయింది. కమలం మోహన రావుయొక్క అధర సౌభాగ్యాన్ని చూరగొన్నది గాని కమలమ్మ కింకా ప్రత్యక్షంగా లభించలేదు. కమలమ్మ పెదవులు సంచలించి నవి కాని గంభీరించి నిలువబడ్డది. మోహనరావు కేవల మాన సికానుభవంతో తృప్తిచెందక సంభాషింప నిశ్చయించుకొని విషయం దొరకక ఫలహారం చాలించి కరకమలం చేత ముంగురు లెగజిమ్మి,

మో:- ఒదినగారూ! తలదువ్వుకొనుటకు నూనె వున్నదా?

క:- ఉన్నది. నిమ్మనూనె పనికివస్తుందా?

మో:- శైత్యోపచారంగా చాలా మంచిది. తీసుక రండి.

కమలమ్మ దువ్వెనా, అద్దం, నూనె తీసుకొని వచ్చి బల్ల దగ్గర నిలువబడ్డది.

మో:- ఒదినగారూ!, మిమ్ములను వొక్క మాటడుగుతాను. కోపం రాదుగదా?

క:- వొక్క మాటేనా?

మో:- మొదటంతే.

క:-ఒక్కమాటే అడిగితే కలహం రావచ్చు.

మో:- అయితే మరి తరువాత మాటాడరా?

క:- ప్రాయ కలహమైతే యెందుకు మాట్లాడను?

మో:- అయితే చెప్పండి. మీకు నామీద దయవున్నదా?

క:- వట్టి దయేనా?

మో:- తరువాత మారుతుంది.

క:- మారి యేమవుతుంది?

మో:- మారి ప్రేమవుతుంది.

క:- అమ్మా యెంత జాణవు!

మో:- కోపం వచ్చిందా?

క:- కోప కారణ మేమున్నది?

మో:- నూనె యిస్తారా?

క:- ఇయ్యవలసిందేనా? మీ చేతులకు చమురవుతుందేమో?

మో:- అయ్యో మాట నిజం.

క:- నేను రాయనా?

మోహనరావు చూపులతో సమ్మతి గనుపరచాడు. కమలమ్మ చేతులో నూనె వేసుకొని తలకు రాచింది. ఉభయులూ శరీరం మరచారు. చెంపను నూనె తగిలితే హస్తకమలంతో

అద్దింది. ఉభయులకూ ఆనందం యినుమడించింది. ఇద్దరూ పర వశులైనారు. సుఖ కమలములు స్పర్శించినవి. అప్పటి రసవృష్టి యెవడు వర్ణించగలడు ? మాధుర్యం కంటె మధురంగా వున్నది.

మేడ మెట్లమీద సాహు వస్తున్న కాళ్ల అలికిడి వినబడ్డది. కమలమ్మ దృష్టి గోచరమైన మోహనరూపాన్ని మనసులో బంధించి చిక్కబట్టి గదిలోకి బోయి పడుకున్నది. సాహు సావిట్లోకి పరుగెత్తి కొనివచ్చి 'యేమండీ ! మా అమ్మెక్కడున్నది ?' అని అడిగాడు.

మో:- లోపల వున్నది లే.

సాహు:- అమ్మా ! నాకు ఫలహారమేది ?

క:- (సాహువంక చూడకుండా) అదుగో ఆగిన్నెలో దిసీకు.

సాహు "నాకు పండువలిచిపెట్టు. లే," అని పమిటెపట్టుకుని లాగితే లేచింది. పండు వొలిచిపెట్టి మళ్ళీ పడుకున్నది. మొదటి మోహనదృశ్యం అంతర్ధానమై మళ్ళీ స్ఫురించలేదు. మోహనరావు లేచి కిందికిబోయినాడు. ముఖమంతా యేమో కొత్తగా కనబడుతున్నది. వీధివసారాలోకి బోయి పచారీచేస్తూ సిగరెట్టు కాలుస్తున్నాడు.

రామానాయుడు నాలుగు గంటలకల్లా పాలెంబోయినాడు. సాయంత్రం సభ జరుగుతుందనీ, రామానాయుడుగారు వుపన్యాసం యిస్తారనీ చాటింపుచేశారు. పఠనమందిరం దగ్గరనుంచి బయలుదేరి నగరసంకీర్తనతో వూరేగింపు జరిగింది. బాలకులూ, కూలీలూ, 'తిలక్ మహరాజ్ కు జై, మహాత్మాకూ జై, సంగదాసుకూ జై' అని కేకలువేస్తున్నారు. నాలుగున్నరకు మందిరం దగ్గరకు వచ్చారు. రామానాయుడు ప్రతిష్ఠనుబట్టి వూళ్ళోవుండే ఆసాములంతా సభనలంకరించారు. పెద్దవాడని చిన్నపరెడ్డిని సభకు పెద్దనుగా యెన్నుకున్నారు. విద్య అవసరమనీ, పఠనమందిరములు వుపయోగకరములనీ, పంచములు దుస్థితిలో వున్నారనీ రెండుగంటల సేపు రామానాయుడు వుపన్యాసం యిచ్చాడు. అందరూ ఆహ్లాదపడ్డారు. పట్టయ్య అనే మంగళాపురపు కుర్రవాడు

పంచమోద్యమాన్నిగురించి పద్యాలు వ్రాసి చదివాడు. చిన్నప రెడ్డి పఠనమందిరాలు అవసరమని చెప్పి యిల్లు గట్టించడానికి స్థలం, అయిదువందల రూపాయిలూ యిస్తానని వాగ్దానంచేశాడు. తక్కినవారు కొన్ని స్వల్పమొత్తాలను పుస్తకాలు గొనడాని కిచ్చారు. అప్పటికి సేకరించిన పుస్తకాలతో పఠనాలయం ప్రారంభమైంది. మందిరానికి సంబంధంగా పంచమపాఠశాలను బెట్టి వుచితంగా బోధించడానికి వొక బ్రాహ్మణ కుర్రవాడు అంగీక రించాడు. జయధ్వనులతో సభముగిసింది. అనంతరం రామానా యుడు ఊరికి ప్రయాణమైతే చీకటిపడ్డదని పోనియ్యలేదు.

మోహనరావు చాలాసేపు వసారాలో పచారీచేశాడు. కూడదనీ చెప్పేయవనుడుసహితం వినుపక చదివే తారాశశాంక విజయం, బిల్హణీయం తమాషాగా అనేకమాట్లు చదివి ఆనందిం చాడు గాని విషయములన్నీ తెరచాటు బొమ్మలమోస్తరుగా లీలగా కనబడ్డవి. భావప్రపంచంలోనుంచి భౌతిక ప్రపంచములోకి మారేటప్పటి సంధికాలమే మనుష్యజీవితంలో మిక్కిలీ రసవత్తర మైన భాగం. సర్వజంతు సామాన్యమైన యీమార్పు మానవుని మానవత్వం నుండి దేవత్వంవంక వొక మెట్టెక్కిస్తుంది. పాప మీతరుణకాలములో మోహనరావుపై చెడుగాలిసోకింది. తెగులు దగిలిన సస్యం పూర్ణఫల మీయజాలదు. మోహనా! పొంగి పొరలు నీ యౌవనప్రవాహం గట్లుదాటింది. పంకసమ్మిళితమై మాలిన్యాన్ని బొందింది. అంతటితో పోలేదు. ఫలవత్తరములైన సుందర కేదారములపై వెల్లువగట్టి నష్టం గావించింది. భూస్వామి నీజీవానికిబడి దుఃఖిస్తాడు. పాపం నీవేమి చేయగలవు? నీశక్తికి మించింది. పాలవంటి నీయౌవనాన్ని పొంగబోసుకున్నావు. యిక మరి నీచేతికి శుభ్రంగా ఎట్లావస్తుంది. నీ మోహన విగ్రహమే నీకు శత్రువైంది. దేహసౌందర్యమే నీవెరుగుదువు గాని ఆత్మసౌందర్యం నీవెరుగవు. ప్రతిదినం నీదేహాలంకారానికి చేసే ప్రయత్నంలో శతాంశమైనా ఆత్మాలంకారానికి వుపయోగించినట్లైతే బంగా

రానికి వెలిగారం అతికినట్లు నీ దేహసౌందర్యం నీఆత్మకు తగిన వేషమై వొప్పివుండేది. అద్దంచూచి ముఖం దిద్దుకున్నావుగాని సత్పురుషుల జీవితాలనుజూచి నీ ఆత్మవర్తనం దిద్దుకోలేదు. నీవు పరీక్ష తప్పిపోయినావు. కాలం వృథా చేసుకున్నావు. భగవంతు డిచ్చిన అవకాశం పోగొట్టుకున్నావు. నీ హృదయంమీద కావురు గమ్మింది. యిక ముందు నీవొక పతివ్రతా తిలకాన్ని వివాహం చేసుకున్నా కిల్బిషరహితమైన హృదయాలింగన మియ్యజాలవు. పాపాన్నే ప్రసరింపజేస్తావు. అయ్యో! పాపం! యేమీ తెలియని నవయౌవనుని కెంతశిక్ష? నిన్నుజూస్తే జాలివేస్తున్నది.

మోహనరావు కొంతసేపు పచారుచేసిన తర్వాత మనస్సు ఆలోచనోన్ముఖమైంది. "యేమది చిత్రం! యిట్లా జరుగుతుందని కలలోకూడా అనుకోలేదు. అబ్బా, యేమాసౌందర్యం! సంగీతం సౌందర్యాన్ని మించింది. కిన్నెరవలె తీగెలు దీసినట్లు రాగం దీస్తుంది. ఆమెకు నామీద అత్యంతమైన ప్రేమవున్నట్లు కనబడు తుంది. తారాశశాంక విజయములోని కథ కల్పనైనా విషయం తప్పకుండా సత్యమే. తారా చంద్రు లనే వ్యక్తులు లేకపోయినా తత్సదృశులు అనేకు లుండడం నిశ్చయం. యెట్లా మాట్లాడు దామా అని ముందాలోచించుకుంటే వొక్కమాటా స్ఫురించ లేదు గాని, ఆసమయానికి సంభాషణ మహారసవంతంగా సాగింది. అరే! యీ వ్యవహారాలలో ఆరితేరినట్లు మాట్లాడాను. కాకపోతే మట్టుకు యీ పాండిత్యం వొకరు చెప్పి తేవచ్చేదా? యీ సంభా షణదాకా యెందుకూ? అసలు యీ విషయమే దేవుడువచ్చి యిట్లా అని ప్రతిజంతువుకూ చెప్తున్నాడా? అన్నీ స్వభావం గానే తెలుస్తవి. యింతవరకు పరీక్షయి తేలాం. మొదటిరకం మార్కులు వచ్చినట్టే. యిక జరుగవలసిన దేమి? సగం సగం వ్యవ హారాలు నాకు బనికిరావు."

సాహు:- యేమండోయ్! మా తాతయ్య మిమ్ములను పిలుస్తున్నాడు.

మోహనరావుకు మనసు డక్కు-మన్నది.

మో:- సాహుకూ! యెందుకురా?

సా:- ఊరికెనే మాట్లాడడానికి.

మో:- (తనలో) ఓరినాయనా, రాగోల దీసుకొని సిద్ధంగా వున్నాడనుకొన్నా—(ప్రకాశంగా) యిదుగో వస్తున్నా. (అని కాలుతున్న సిగరెట్టు పారవేసి లోపలికి పోయినాడు.)

౭

అమ్మ లేదు.

సాహు ఫలహారం దిని వెళ్ళిపోయినాడు.

కమలమ్మ మంచంమీద బండుకున్నది. మొదటి సమ్మోహన దృశ్యం మళ్ళీ దృష్టికి తెచ్చుకోవలెనని ప్రయత్నం చేసింది. కవి శిల్పచిత్రకార నిర్మితములైన కృత్రిమ విగ్రహాలవలె సహజ రస విహీనములై అనేకరకముల దృశ్యాలు గాన్పించి అసహ్యంగా దోచినవి. ప్రయత్నించిన కొలది కొత్తరూపాలు భాషాంతరీకరణమున కవుల భావములవలె వికృతములై కన్పడ్డవి. రూపం మనస్సులో నాటలేదు. తస్వీరు తీసేటప్పుడు ఫలకం పూర్ణంగా రూపగ్రహణం చేయకముందే తీసివేసినట్లైతే విగ్రహ మెట్లా వస్తుంది? అతనిని మళ్ళీ వొకమారు చూస్తే బాగుండునని కిటికీలోగుండా వీధివైపు తొంగి చూచింది. కనుపడలేదు. వీధిలోకి దిగే మెట్లదగ్గరకుబోయి చూచేవరకు మోహనరావు సిగరెట్టు త్రాగుతూ పచారు చేస్తున్నాడు. స్వాభావికమైన ముఖవైభవానికి, వొయ్యారంగా పట్టి పీల్చుతూవున్న సిగరెట్టు నూతన విలాస మొనగూర్చింది. మర్పితంగా త్రాగడంచేత వ్రేళ్ళ సందున కొంచెం పచ్చబడ్డదిగాని పెదవులు నల్లబడలేదు. ఆపాదమస్తకం పరిశీలించింది. కొంచెం ముడిచిన కోమలాధర పుటమునుండి ముఖ కమల సమీరాలతో సమ్మిళితమై గుప్పున వెలువడిన ధూమపుంజానికీ అరమోడ్పు గన్నులకూ తోడు మదనుడు వున్నత భ్రూలతను

ఆకర్ణాంతంగా లాగి నీలోత్పలముల నిగనిగను ధిక్కరించే చిఱు మీసపుటమ్ముల సంధించి చేతికొద్ది లాగి నువ్వి హృదయం గాఢ సేయగా సొక్కి సోలి కటకటాలపై వ్రాలింది. యిట్టి సమయముల గదా ప్రియులు కైదండలొసగి సేవింప నవసరమవుతుంది. ప్రాణనాథుడు దండనుండ తన కట్టి భాగ్యము లభింపమికి దుస్సహమైన పారతంత్ర్య జీవనమే కదా కారణమని తోచింది. బంధముల తెగడెంచుకొని పరువిడి అతని బాహుదండముల నల్లుకొన నువ్విళ్ళూరింది గాని అతడేమనునోయని సంశయించింది. నిట్టూర్పు విడిచి యిప్పటి కింతయే భాగ్యమని మరియొక్కపరి కండ్లార జూచి జారి దుర్భరమైన శరీరమును మోచి పాన్పుపై వైచింది. అనుభవైకవేద్యమైన ప్రథమ దృశ్యాన్ని భావంలో వూహించుకొనలేకపోయిందిగాని ద్వితీయ దృశ్యం బాగా గోచరమై మనస్సును విడువలేదు. మోహన రూపాన్ని మనస్సున కావించుకొని కనులు మూసి మననం చేసింది. భావగోచరము లవుతున్న రూప విభ్రమ విలాసములు మూర్తిమంతములై కండ్లు తెరచినా నలుదిక్కుల ప్రత్యక్ష మవుతున్నవి. మోహన రూప పంకములో దగుల్కొని కమల క్షణభంగురములైన ఆనంద కెరటములలో దేలిపోతున్నది.

నాలుగు గంటలైంది. అయిదైంది. ఏడైంది. కమల కాలపరిమాణం దెలియని అఖాతంలో బడిపోయింది. లేవలేదు. సాహు ఆడి యాడి ముంగిట్లోకి వచ్చి అమ్మా అని కేక వేసినాడు. అంధకారమంతా నిశ్శబ్దంగా వున్నది. ప్రత్యుత్తర మెవరిస్తారు ? అమ్మ లేదు. అమ్మ లేనివానికి అంతా లేనిదే. అమ్మా లేవటే అని మరల కేక వేశాడు. లేదని భవంతిలోనుండి ప్రత్యుత్తరం వచ్చింది.

సా:- (ఇంట్లోకి బోయి) నాయనమ్మా ! మా అమ్మ యేదీ?

ల:- మేడమీద వుంది. పిలుచుకొని వస్తానా ?

సా:- చీకటిలో నే బోలేను. నాకు అన్నంబెట్టు.

ల:- తాతయ్యా వాండ్లు అన్నానికి వచ్చిందాకా వుండవా?

సా:- నాకు నిద్దర వస్తూవుంది. త్వరగా బెట్టుమంటే ఆ మాటలూ యీ మాటలూ చెప్పుతుంది.

ల:- ఇదుగో తిను.

సా:- (అన్నం దిని,) నాయనమ్మా! చీకటిలో నే పైకి బోలేను. అమ్మ వచ్చిందాకా నీ పక్క మీంద పడుకుంటా.

ల:- పడుకో. నిద్దగపోతే మళ్ళీ లేవవుగా ?

సా:- నీ దగ్గిరే పడుకుంటాలే, (అంటూ పడుకొని నిద్ర బోయినాడు.)

మోహనరావూ, చౌదరయ్యా భోజనానికి వచ్చారు.

ల:- అక్కలక్ష్మి! కాళ్ళకు నీళ్ళిచ్చి అమ్మాయిని పిలచ కరా. ఒకటే మోయిను నిద్రపోతున్నది. పిల్లవాడు యింకా రాలేదే.

చౌ:- మనిషి వచ్చాడు, పాలెంనుంచి. రేపు గూడా రాడట. ఆ ప్రక్క వూళ్ళకు బోతున్నాడట. చచ్చినవాడి పిచ్చి పీడి కెత్తింది. ఊరూరు తిరిగి కూలివాండ్లను రెచ్చగొడతాడు గాంవాలె. మోహనా! ఈ మాల మాదిగె పిచ్చి నీకూ వున్నదా?

మో:- యీ గోలంతా నాకు పట్టదు పెద్దనాన్నా. నా వ్యవహారమేమో, నేనేమో దప్ప యితర జోక్యాలు నాకు లేవు.

చౌ:- అది బాగుపడేవాండ్ల లక్షణం. ఉద్యోగానికి పోతావా ?

మో:- ఉద్యోగమో - ప్లీడరో - యేదౌతుందో యింకా చెప్పలేను.

చౌ:- బాగుంది. ఆ రెండింటిలో యేదైనా వొకటే - మావాడు వుద్యోగం చేయబతుతుందని యేండ్లు మిగిలిపోయినవని సాగించాడు. వాడికి స్వబుద్ధిన పుట్టాలెకాని యెదటివాండ్లు యెంత కాలమని యెత్తు పెడతారు ?

మో:- అన్నయ్యకు వుద్యోగానికి వెళ్ళడం ఇష్టంలేదా యేమి?

చౌ:- ఇంకా వుద్యోగ మెందుకు? ఇదొకటి దొరికిందిగా మాలవుద్యోగం. కొంపా, గోడూ పట్టకుండా దానితో వూరేగుతున్నాడు. ఇదేమో మంచికి వచ్చిన వ్యవహారం గాదు. నీవైనా మనవాండ్లలోకి కాస్త ముందుకురా.

మో:- ఉద్యోగం చెయ్యకపోతే ఆయన కేమి తక్కువా?

చౌ:- తిండికి జరగదనా? ఉద్యోగం పురుష లక్షణం అన్నారు. కాదన్నాడు; నే సంతోషించుకున్నా. ఈ ముసలి వాడు యెప్పుడూ గోకాడుతాడని నాకెందు కీ అపవాదు. ఇంట్లో ఎవరికీ కొరగానిపని నాకుమటు కెందుకు? నాయనా! కాళ్లు కడుక్కోవోయ్.

క:- (కండ్లు నలుపుకుంటూ క్రిందికి వచ్చి) నాకు వంట్లో ఖులాసాగా లేదండి. భారంగా వుంది.

ల:- అది జలుబున. వేడిపాలు పోసుకొని అన్నందినవు; రా! నీకు వంటింట్లో పెడతాను. ఆయన రేపుకూడా రాడట.

క:- యింకా వచ్చారేమో అనుకుంటున్నా. అయితే అన్నందిని పోయి పడుకుంటా.

ల:- పడుకో. పిల్లవాడు నిద్రబోయినాడు. యిప్పుడు పైకేమి మోసుకొని పోతావులే. నా దగ్గర పడుకుంటాడు.

కమలమ్మ పైకి పోయింది.

మో:- పెదనాన్నా! నేను యీపూటనే వూరికి పోదామనుకొని అన్నయ్య రాలేదని వూరుకున్నా. యిక రేపుకూడా రాడు. కనుక తెల్లవారి లేచి వెళుతా. నే వచ్చిన బండికూడా వున్నది.

చౌ:- నిన్ను చూస్తే నాకు ముచ్చట వేస్తున్నది. మీ వాండ్లంతా బుద్ధిమంతులు. యింకా రెండురోజులు వుంటా వనుకున్నానే. అతగాణ్ణి దారికి తిప్పలేవా?

మో:- నేను చెబితే వింటారా. అందులో పెద్దవారు. మా సెలవులుకూడా అయిపోతున్నవి.

చౌ:- పెద్ద - దేనికి? - అన్నిటికంటె తాటిచెట్టు పెద్ద. బుద్ధిలో నీ కెవ్వరూ చాలరు. మాసేశం వొకరు చెబితే వినేది కాదు. నీవు స్కూలు చెడగొట్టుకొని యెందు కుంటావుగాని అవసరమైతే వెళ్లు. గుంటూరులో ఆగుతావా?

మో:- ఊఁహూఁ సరాసరే వెళ్లుతా. నాకు వ్యవధి లేదు.

మోహనరావు భోజనంచేసి మేడమీదికి పోయినాడు. గడియారం తొమ్మిది కొట్టింది.

కమలమ్మ తమలపాకులు చుట్టిస్తున్నది.

చౌ:- యేమేవ్! మన మోహను యీపాళాన వుద్యోగంలో ప్రవేశిస్తే పది సంవత్సరాల్లో డిప్టికలెక్టరు పనౌతుంది. మనవాడికి చిలకకు చెప్పినట్టు చెప్పా! వినకపోతే నేనేమి చేసేది? వాడికీ తాహస్సీల్దారీ కావచ్చునట!

ల:- యింకా యెందుకు తప్పుకోవడం? యెవరిమీదా దూరులేకుండా వెళ్ళిపోయిందిగా!

చౌ:- బుద్ధిపూర్వకంగా కావలెనని పోగొట్టుకుంటే పోయింది.

ల:- పోతే పోయింది. మీ వుద్యోగం సంగ తేమయింది?

చౌ:- అదీ వట్టిదే అయింది. మునసబు అప్పీలు చేసుకుంటే భర్తరఫు ఖాయం చేస్తూ కుటుంబంలోనే వుద్యోగ మియ్యవచ్చునని వుత్తరు వయిందట. తాసీల్దారుగారు తమ్ముడిపేరు సిఫారసు చేశారని తెలిసింది. నేనూ వుద్యోగం చేశాననిపించుకొందామంటే విఘ్నం వచ్చింది. ఇవ్వేళ ప్రొద్దుగూకులూ తిరగడం చేత నిద్ర తూలుతూవున్నది. (అని పడుకున్నాడు.)

ల:- అక్కలక్ష్మీ! తోడు వెయ్యి, పడుకుందాం. యీయేకు తీరా వడికి నేనూ వస్తాను.

పదకొండుగంట అయింది. మేడమీది తూర్పు వసారాలోకి కుర్చీ లాక్కొని విసురుకుంటూ మోహనరావు కూర్చున్నాడు.

మో:- కమలా! యింకా లేవలేదా? యిక్కడ కూర్చుందాము రా.

కమలమ్మ జారిన కచభరం సవరించుకుంటూ వచ్చి కుర్చీలో కూర్చున్నది.

మో:- కమలా! యేదో వొక సంగతి తేల్చిచెప్పు. తెల్లవారుజాముననే వెళ్లుతాను.

క:- నగలు నాలుగువేలకంటే యెక్కువ వుండవు.

మో:- వాటి విషయమై అంత ఆలోచన అవసరం లేదు. రేపు మా చిన్నమ్మ నడిగి రెండువందల రూపాయలు తీసుకుంటా. మా అన్నయ్య నెలకు ౬౦ రూపాయల దాకా పంపిస్తాడు. యింకా కావలిస్తే మళ్ళీ మా చిన్నమ్మే పంపుతుంది. ఆమెకు పిల్లలు లేరు. డబ్బు చాలా వున్నది.

క:- యెందుకంటే యేమని చెపుతావు?

మో:- ఆమె అడగదు. మా అన్నయ్య గుంటూరులో చదువుకుండే టప్పుడు ఆమె దగ్గరదీసి యిష్టం వచ్చినట్టు ఖర్చుకిస్తూ వుండేది.

క:- ఆయనకూడా యీ మోస్తరు వాడేనా?

మో:- ఆఁ కొంతవరకు.

క:- మనిషి యెట్లా వుంటాడు?

మో:- నా మోస్తరే. కాని కొంచెం పల్లెటూరి పద్ధతి.

క:- పొయ్యేమార్గ మెట్లా?

మో:- పోవడం నిశ్చయమైతే దాని కేర్పాటు చేస్తా.

క:- పిల్లవాడి సంగతే తగులాటంగా వుంది.

మో:- అది నీవు వదిలించుకోక తప్పదు. తక్కిన సంగతులు ఎట్లావున్నా పిల్లవాడి కోసమైనా వెతికి పట్టుకుంటారు.

వాడు నీవెంట లేకపోతే నీజోలే తలుచుకోరు. అదిగాక పిల్లవాడి నిక్కడ వదలి పెట్టడమే వాడికి క్షేమం. ఆస్తీ వుంది, పోషణా జరుగుతుంది.

క:- నాకేమో భయంగా వున్నది.

మోహనరావు కుర్చీ వెనకకు లాక్కొని కూర్చున్నాడు. దీపపు వెలుతురు కిటికీగుండా మోహనరావు ముఖాన ప్రసరించింది. ముంగురులు కమల హృదయానికి ములుకులై సోకినవి. ముఖ సోయగం జాలకుని మంత్రోచ్చాటనము వలె కమలను నిశ్చేష్టు రాలిని చేసింది. నునుమీసం వశ్యౌషధం అయింది.

క:- సరే! ప్రయాణాని కేర్పాటు చెయ్యి.

మో:- బాగా ఆలోచించి చెప్పు.

క:- ఇక ఆలోచన లవసరము లేదు.

మో:- ముమ్మాటికీ నిశ్చయమేనా?

క:- మూడుమూళ్ళు తొమ్మిది మాట్లకూ నిశ్చయం; మార్గం యోచించు.

మో:- రేపువుదయం యెనిమిదిగంటల బండికి గుంటూరు చేరి మంచి గుఱ్ఱపుబండి మాట్లాడి ప్రొద్దుగూకే వరకు ఆంజనే యుల మండపానికి యెదురుగా జువ్విచెట్టు క్రింద నిలువబెట్టుకో మని చెప్పతాను. నీవు కనిపెట్టుకొని వుండు. యిక్కడ నిలువ బడి చూస్తే కనబడుతుంది. బండి రాంగనే రెండుమూడు మంచి చీరెలూ, నగలు మాత్రం తీసుకొని వెంటనే బండెక్కి సరాసరి గుంటూరుకే బయలుదేరండి. నేను నల్లపాటి సత్రాల దగ్గరనే కాచుకొని వుంటా. గుంటూరు వొకగంట ప్రయాణం.

క:- నీ తన్నీరు నాకిచ్చిపో.

మో:- ఇస్తాగాని నీ గదిలో పెట్టుకోవద్దు. సావిట్లో తగి లిస్తాను. యెవరూ దానిని చూడకపోతే వచ్చేటప్పుడు తీసుకునిరా. ఇక వెళ్ళి గదిలో పడుకో. నేను సావిట్లో పడుకుంటాను.

కమలమ్మకు భయం దీరింది. గుండె రాయిచేసుకున్నది. స్త్రీల స్థిర సంకల్పం యెవడు మరల్చగలడు? లేచి ధృఢంగా అడుగులువేస్తూ పోయి పడుకున్నది. కాని మనసులో ఆవేదన గానే వున్నది. సరిగా నిద్రపట్టలేదు.

మోహనరావు మళ్ళీ సిగరెట్టు ముట్టించాడు. నిప్పుపుల్ల గీచిన చప్పుడు విని ఒయ్యారపు మోహనరూపం మరల చూడ వచ్చునని కమలమ్మ కిటికీలోగుండా చూచింది. మోహనరావు చీకట్లో కూర్చున్నాడు. పాపం! కమలమ్మ కాశాభంగం గలిగింది. చీకటిలో వెళ్ళుతాడు. మళ్ళీ యెప్పటికో చూడడ మనుకొన్నది. మోహనరావు సిగరెట్టు పారవేసి వుమిసివచ్చి పడుకున్నాడు. చుక్క పొడువంగనే లేచి తాను సిగరెట్టు గాల్చు కుంటూ తీయించుకున్న చక్కని తప్పీగును సావిట్లో తగిలించి సూటు వేసుకొని మరియొక మన్మథ వేషమై "కమలా" అని పిల్చాడు. ఆ పిలుపు కమల కెంతో మధురగీతం వలె వినబడి ఆత్రంతో లేచివచ్చి దీపపు వెల్తురున వెలుగు లీలావతారం జూచి ఆనందబాష్పాలు గురిసింది. ప్రఫుల్ల నేత్ర కమలముల నలంక రించిన బాష్ప బిందువులు దీపపు టరుణ కాంతులలో తళతళ మెరసి ప్రభాతము గావించినవి. మోహనసూర్యుడు కరకమల దళములతో తుడిచి ముఖ కమలములతో కపోల కమలమును స్పృశించి పోయివస్తా నన్నాడు. కమల వెక్కి వెక్కి యేడ్చింది.

మో:- వెళ్ళి పడుకో.

క:- బండి రాకపోతేనో?

మో:- రాకపోవడమేనా?

క:- జీవితం దుర్భర మవుతుంది.

మో:- నాకూ అంతే అవుతుంది. నీవు యేకారణం చేత నైనా సాయంత్రం రావడానికి వీలుగాకపోతే తెల్లకాగితం మీద వుల్లిరసంతో గాని మైనపుఖడ్డీతో గాని యెప్పుడువచ్చేదీ వ్రాసి

బండివాడిచేత పంపు. దోహదం జేసి చదువుకొని తరువాత పని జరిగిస్తా.

క:- యిక వెళ్ళు.

ఉభయులూ వొకరిచేతులనుండి వొకరు విడిపించుకొనేటప్పటికి అయిదునిమిషాలు పట్టింది. మోహనుడు పెట్టె తానే చేత పట్టుకొని మెట్లదగ్గరకు పోయినాడు.

క:- మోహనా—(పిలిచిందిగాని అశ్లీలమని అనుకొన్నది. స్వర్గం స్వల్పకాల మనుభవించినా స్వర్గమేనని మనసు కుదుర్చుకున్నది. )

మో:- కమలా! పిల్చావా?

క:- లేదు వెళ్ళు.

కమల వెళ్ళి పడుకున్నది.



తారాశశాంకం

మోహనరావు గుంటూరులో రైలుదిగి అగ్రహారంలో పినతల్లిగారింటికి బోయి తనకు స్కూలుకుబోయే కాలం మించి పోయిందనీ రెండువందల రూపాయలు అవసరమనీ బలవంత పెట్టి పైకం దీసుకొని రెట్టింపుబాడుగకు మంచి జట్కాబండి మాట్లాడుకొని మంగళాపురం బయలుదేరి నల్లపాటిసత్రాల్లో తాను దిగబడి బండిని బంపించాడు.

కమలమ్మ తెల్లవారుజామున కొంచెం నిద్రపట్టి ౮ గంటలవరకు లేవలేదు. సాహు అవ్వకు మాలిమిగనుక చద్దెన్నందిని ముంగిట తాపాబండి లాగుకుంటున్నాడు. కమలమ్మ మేడదిగివచ్చి ఆడుకుంటున్న సాహును చూచేవరకు గుండె లవిసి పోయినవి. సాహుయొక్క నిర్మలమైన నెమ్మోము చూచేవరకు కమలమ్మ హృదయతాపాలన్నీ శమించి మరులుకొని పట్టి కౌగిలించుకో పోయింది. ఆటలుమరిగి సాహు "ఉండవే, నా బండితోక్కేవు"

అని చిక్కక బండిలాక్కొని పసుగెత్తాడు. కమలమ్మ నిలిచి మత్తిల్లి సాహువంక వెఱ్ఱిదానివలె చూచింది. కాఠిన్యంవహించిన మనస్సు వెన్నవలె కరిగిపోయింది. కళవిళపడ్డది. మరిగింది. కళ వెళ్ళాడింది. గగ్గోలుపడి ఘూర్ణిల్లిపోయింది. బిడ్డను తప్పిపోయిన ఆడుపులి వలె ఆక్రోశిస్తూ భవంతిలోకివచ్చి చాపమీద మొదలు నరికిన చెట్టువలె విరుచుకొని పడిపోయింది. లక్ష్మమ్మవచ్చిచూచి,

ల:- అమ్మా! వికారమా యేమే? నిన్నటినుంచీ జబ్బుగానే వున్నావు.

క:- (లక్ష్మమ్మతో మాట్లాడ సిగ్గుపడి) ఒళ్ళు తిరుగుతున్నది. (అని తలవంచుకొని చెప్పింది.)

ల:- అయితే, కొంచెం మజ్జిగన్నం దిను(అని తెచ్చి బలవంతపెట్టి తినిపించింది.)

కొంతశాంతపడి మేడపైకి పోయింది. దురదృష్టవశాన సాహు మళ్ళీ కనపడలేదు. సావిట్లో పడకకుర్చీమీద పడుకొని యెదురుగా గోడన తగిలించివున్న మోహనపటం వంక చూచే వరకు హృదయరంగాన తాండవమాడుతున్న కిశోరవేషం నిష్క్రమించి మోహనవేషం ప్రవేశించింది. ఆపాలపండ్లూ, నునుబుగ్గలూ వేణువూ, తాపాబండి మున్నగు పరికరాలచే పొలుపొందు కోమల శైశవస్వరూపం మరుగుపడి నవయువ్వనము విజృంభించి మూర్తిభ వించిన లీలామోహనవిగ్రహం హృదయరంగా న్నాక్రమించింది. మరొకపాత్రకిక చోటులేదు. కమలమ్మ చివ్వనలేచి పటాన్నితీసుకొని పరిశీలించింది. ఆ మోహనదృశ్యమే లోచనగోచరమై వివశత్వాన్ని బొందించింది. తస్వీరును హృదయాన బెట్టుకొని హృదయేశ్వరుని సందర్శన మభిలషిస్తూ పడుకున్నది. రెండవసారి భోజనానికి పోలేదు. అక్క లక్ష్మివచ్చి వొళ్ళు పట్టిచూచి "లోజ్వరం తగులుతున్నది అన్నంతింటావా," అని అన్నది. కమలమ్మ "నా కాకలి కాలేదు. సాయంత్రందాకా పడుకుంటే అన్నీనయమువుత" వన్నది. లక్ష్మమ్మ వైద్యుణ్ణి బిలిపించి చెయిచూపిస్తే అతడు

చెయిచూచి యేదో హృదయరోగమని మాత్రలిచ్చాడు. వైద్యుడు వెళ్ళిన తర్వాత వాటినికిటికీలోగుండా విసిరి పారవేసి కొంతసేపు ముసుగు పెట్టుకొనిపడుకొని గడియారమైదుగొట్టంగనే పంచలోకి వచ్చి చూచేవరకు జువ్విచెట్టుక్రిందికి బండింకారాలేదు. రాడేమో నని మనస్సుకు సందేహంకలిగి మరల పరుపుమీద పడుకొని తస్బీరును పరీక్షించి చూచింది. బాహ్యవేషమెంత సుందరంగావున్నా స్నానంజేయునప్పటి సహజసౌష్ఠవమును మరుగుపరచిందని విచారపడి సహజవిగ్రహాన్ని కొంతసేపు మననంజేసి తనను చూతవృక్షము నల్లుకొన్న మాలతీలతగా భావించుకొని ఆనందించింది. సహజములైన ప్రేమానుబంధాలకు వివాహబంధాలు ప్రతిబంధాలుగ దోచినవి. మనస్సుకు వొకవిధాన వుత్సాహం కలిగింది. లేచి మూడు నాలుగుచీరెలూ, నగలూ పెట్టెలోనుంచి తస్బీరు కొంగ చేతిరుమాలు చుట్టింది. మళ్ళీ చేసుమారు తీసివేసి తన మొహ మంజరఫికలో పొదివి నగలుమీదబెట్టి తాళంవేసి చెవి కొంగున కట్టుకొని పంచలోకివచ్చేవరకు గుఱ్ఱపుబండి జువ్విచెట్టుదగ్గరఆగుతున్నది. అప్పుడే కమలమిత్రుడు పూర్తిగ అస్తమించి తారాసహితుడైన శశాంకుడు నూదిబోటు మీద కనపడ్డాడు. షోడశకళా పూర్ణుడైన తారామోహనుడు కళంక సహితుడనీ, కమలాహితుడనీ గోచరించలేదు. జట్కా సాహెబు బండి నిలిపి దాణా సంచి గుఱ్ఱపుమూతికి తగిలించి అటూ ఇటూ చూస్తూ మేడకెదురుగా వచ్చి సైకెజూచి చేయి వీచాడు. కమలమ్మ వుండుమని సైగచేసి చేపెట్టె దీసుకొని మడిమెలమీద నడిచి మెట్లుదిగి యిరు వంకల జూచింది. సాహెబు "యెవరూ లేరు. త్వరగా రం" డన్నాడు. ఉభయులూ బయలుదేరారు.

క:- నిన్ను పంపినవారి పేరేమి ?

సా:- మోహనరావుగారు.

క:- వారు యెట్లావుంటారు ?

సా:- బలే షోకు పురుషులు. ఆ చందమామవలె వుంటారు.

క:- వారెక్కడ వున్నారు ?

సా:- మనం వచ్చేవరకు సత్రాలలో వుంటారు.

కమలమ్మకు యింకొక సంగతి దూరలేదు. త్వరగా నడిచి బండిలో పెట్టెపెట్టి యెక్కి కూర్చున్నది. సాహెబు దాణాసంచి బండిలో పెట్టి కవుచితో గుఱ్ఱము నదలించి గ్యాలపు పోనిచ్చాడు. లైను చెట్లు యీ సంగతి గ్రామంలో వెళ్ళడించుటకో యన మంగళాపురంవంక పరుగెత్తు తున్నవి. కమలమ్మ నిశ్చేష్టురాలై కూర్చున్నది. కొంతదూరం గాలపు పోనిచ్చి తరటు పోనిచ్చాడు. అయిదు నిమిషాలలో బండి మలకాచెరువు దాటింది. రెండు చోట్ల రైలుపట్టాలు డడడడ మన్నవి. కాశీరాం చింతల దగ్గర వడి యెక్కువయింది. అరగంటలో బండి సత్రాలదగ్గ రాగింది. కమలమ్మ మౌనముద్రను ఛేదించి తొంగి చూచేవరకు రోడ్డు మీద కనిపెట్టుకొని వున్న మోహనరావు "కమలా ! వచ్చావా?" అని బండిలోకి యెక్కంగనే కమలమ్మ మోహనరావు నలుము కొన్నది.

మో:- నే వచ్చిన తర్వాత విశేషము లేమైన జరిగినవా ?

క:- యేమీ లేవు. మీ అమ్మ వైద్యుని బిలిపించి మాత్ర లిప్పించినది.

మో:- విసిరి అవతల పారవేశా వనుకుంటాను.

క:- వాడు వెళ్ళిన తర్వాత.

మో:- అవును. యిప్పుడు నీ శరీరం ఖులాసాగా వున్నదా?

క:- నిజవైద్యుణ్ణి జూడంగనే స్వస్థపడ్డది.

మో:- పోనియ్యాపోయ్.

సా:- యీ మోస్తరుగా పోనియ్య వచ్చునా ?

మో:- మెయిలు కందించవలె. లేకపోతే, యిబ్బంది పడతాం.

కవుచీ చిటుక్కు మన్నది. గుఱ్ఱం నురుగులుపడ పరుగెత్తు తున్నది. తారాచంద్రుడు తమ్మనుకరించే కమలా మోహనులకు

ప్రత్యుత్థానం చేస్తున్నాడు. బండి సల్లపాడూ, చుట్టుగుంటా దాటి కొత్తపేటలో సాహెబు యింటిదగ్గరాగింది. మోహనరావు దిగి వెన్నెట్లో నిలువబడి వెలిగిపోతున్నాడు. తారామోహనుడు మత్సరించి తన అనురక్తిని విడిచి తెల్లబోయినాడు. సాహెబు గుఱ్ఱాన్నిమార్చి మోహనరావు సామానును బండిలో యెక్కించాడు.

మో:- కమలా! దాహం దాగుతావా?

క:- అవసరం లేదు.

మో:- పోనియ్యి.

సాగించి సాహెబు బండెక్కాడు. గుఱ్ఱం వొక నిముషం మారంజేసి యినుమడించిన వేగంతో గాలపు పోయింది. కమలమ్మ మోహనరావు దండచేతిమీద తలవాల్చి సొమ్మసిలింది. బండి కదలికకు ఆమె కదలకుండేటట్లు తన ముఖమానించి మోహనరావు కూర్చున్నాడు. వేరు తలంపులేవీ వారి మనస్సులను కలకపర్చలేదు. బండి సరాసరి తెనాలి స్టేషనుకు పోయింది. కూలివాడికి సామానెత్తి సాహెబు బాడిగె దీసుకొని సలాం పెట్టాడు.

మో:- మీరా! మా అన్నయ్య కనుపడితే యీ సంగతి చెప్పేవు.

మీ:- అనేకమాట్లు నా బండిమీద తమబోటి సర్దార్లను యెక్కించుకొని పోయినా. నా మనస్సులో అనేక సంగతులున్నవి. యీ దేహం గోసి గద్దలకు వేసినా వొక్కమాట బయటికిరాదు.

కమలా మోహనులు రెండవ తరగతి విశ్రాంతి గదిలో ప్రవేశించారు. మోహనరావు భోజనం దీసుకొనిరాగా వుభయులు భోజనం చేశారు. సిగరెట్టు కాలుస్తూ మోహనరావు మైదానం మీద పచారు చేస్తున్నాడు. కమల వొంటరిదై విసిగి కనుమొరగింది. సిగరెట్టు పారవేసి గడియారం చూసి మోహనరావు గదిలోకి వచ్చాడుగాని కమలమ్మ చప్పుడు విని లేవలేదు. నిద్ర పోతున్నదని పడక కుర్చీలో పడుకున్నాడు. తనను పలకరించలే

దేమని కమలమ్మ అనుకున్నది. ఆమె కెంత ప్రయత్నించినా నిద్ర పట్టలేదు. మోహనరావుని జూచి చాలా సేపైంది. ఏమీ తోచక "మోహనా" అని పిలిచింది. అతడు నిద్రలో పలకలేదు. కోపం యెందుకు వచ్చిందబ్బా అనుకొన్నది మనస్సు పరిపరి విధాల పోయింది. వికలమైంది. మంగళాపురం జ్ఞాపకానికి వచ్చింది. మోహనరావు బండి దిగడం, దుస్తులు మార్చుకోవడం, స్నానం చేయడం మొదలైన విషయాలన్నీ బయస్కోపు చూచినట్లు వొక దాని వెంబడి వొకటి రంగాలు నడుస్తూ వున్నవి. మోహనరావు వెళ్ళడం అయిపోయింది. తాను మేడ మెట్లు దిగడం చూస్తూవున్నది. దురదృష్ట వశంచేత ముంగిట్లోకింకా దిగలేదు. సాహు కనపడలేదు. దిగీ ప్రయోజనం గనపడదు. అంతా మిగిలిపోయింది. కూలివాడు వచ్చి "అయ్యా! బండి వస్తున్న"దని లేపాడు. మోహనరావు లేచి "కమలా" అని పిలిచాడు. పలికిందిగాని లేవలేదు. "లే, బండి వస్తున్నది. గంట కూడా కొట్టా"రని చెప్పుతూ బయటికి బోయి రెండోక్లాసు టిక్కెట్లు తీసుకొని ప్రత్యేకమైన గది యేర్పాటు చేయించాడు. కూలివాడు సామాను దెస్తున్నాడు. గాని కమల రావడం లేదు. గదిలోకి మళ్ళీ వచ్చి పిలిచాడు. పలికి లేవబోయింది. మోహనరావు రెక్క పట్టుకొని "కమలా! నీవు పట్టి పిరికిదానవు. నీ స్థితి చూస్తే నా మనసుకు చాలా కష్టంగా వున్న"దన్నాడు.

కమల జవాబీయలేదు. బండి కూత వినబడ్డది. మోహనరావు "కమలా! బండి వస్తూ వున్నది. నీ అభిప్రాయమేమో చెప్పు" అని అన్నాడు. కమల జవాబియ్యలేదు. అడుగులు వేయడం ప్రారంభించింది. మోహనరావు రెక్కపట్టుకుని నడిపిస్తూనే వున్నాడు. రెండవ తరగతి బండి దగ్గరకు నడిపించే వరకు చాలా ఆలస్యమైంది. మైదానంమీది మనుష్యులుగాని, వెలుగుతున్న వాయు దీపాలుగాని కమలమ్మకు కనపడలేదు. అంతా అంధకార బంధురమైంది. మోహనరావు పట్టి బండిలో కెక్కించి

పరుపుమీద కూర్చోపెట్టి సామాను చూచుకొని కూలీ యిచ్చివేశాడు. గంటకొట్టి పచ్చ లాంతరు విసిరారు. బిగులూది యింజను సాగింది. బండ్లు కిటకిట్లాడి చక్రగతి తీవ్రమై, అమోఘమై, అనర్గళమై, ధూమ శకటాన్ని విధియై లాక్కొని పోతున్నది.

"వెళ్లు కమలా. వెళ్లు. నీ వబలవు. విధినెట్లు నిరోధించ గలవు? కాలగతి నెవ్వరు మార్చగలరు? కాలచక్రము నెవ్వరాపగలరు? కాని యీ అంధకారంలో సహితం వొక వెలుగు మాత్రం కనబడుతునే వుంటుంది. అది కనబడక తప్పదు. అందరికీ నీకూ అదే శరణ్యం."

బండిలో వాయుదీపం ధగధగ వెలుగుతున్నది. కమలమ్మ నూతన ప్రపంచంలో ప్రవేశించింది. ఇక కమలమ్మ తిరిగి రాదు. కమలమ్మ హృదయం కేతనపటంవలె యింకా టపటప కొట్టుకుంటూనే వున్నది. అరమోడ్పు గన్నుల నింకా విప్పలేదు. కమలమ్మకు భ్రమ వచ్చింది. మోహనరావు ఆదుర్దాపడి విసురుతూ హస్తకమలముతో హృదయాన్ని పట్టి చూచాడు. వెనుక నానుకొని దండచేతిమీద శిరస్సు నుంచుకొని ముఖాన్ని స్పృశించి చెదిరిన ముంగురు లమర్చాడు. అయిదారు నిమిషాలలో కండ్లు విప్పి చూచింది. గాలిదీపపు కాంతులలో తళతళ మెరిసే మోహన రూపం లోచనాభ్యుదయ మయింది. అంతరాయాలు శమించినవి. భ్రమ తగ్గి మనస్సు కలకదేరింది. దేహం స్వస్థపడ్డది.

మో:- కమలా యెట్లా వున్నది?

క:- ఇప్పుడు బాగానే వున్నది.

మో:- జబ్బేమి?

క:- ఏమీ లేదు. కొంచెం నొల్లు తిరిగింది. మనమిప్పుడెక్కడున్నాం?

మో:- బండి బాపట్లను సమీపిస్తున్నది.

క:- (నిట్టూర్పు విడిచి) సరే! కానియ్యి.

మో:- ఏమే కమలా! ఏదో నొకవిధంగా వున్నావు?

మోహనరావుయొక్క ముఖ చంద్రబింబం మేఘచ్ఛన్న మైంది. కమల ముఖ్యకైవరం ముకుళించి సంభ్రమముతో:

క:- మోహనా! నీ సాన్నిధ్యంలో నాకు సంతాప కారణమే లేదు. నీ ముఖ చంద్రగ్రహణం చూచి నే భరించలేను. నీ సహజ మోహన రూపాన్ని వొక్కమారు ప్రదర్శించు.

మో:- (చిరునవ్వు నవ్వి) కమలా! నా యందు నీ కెంత దయ!

క:- మోహనా! నీ వింకా ఓనమాలలోనే వున్నావు. నా దయ ప్రేమకు పెచ్చు పెరిగిపోయింది.

మోహనరావు ప్రణయకలహమున వోడిపోయి జేతకు తన లోచన విలసనాలు కానుక లొసంగి, సిగరెట్టుకస్యకు నఖక్షతా లుపచరించి, అధరమాధుర్యం చవిచూపి దంతక్షతా లర్పించి, ఉవ్విళ్ళూరు కమలను మచ్చరింపజేస్తూ లీలావిభ్రమములను జూపు తున్నాడు.

క:- మోహనా! యేల న న్నిట్లలయించడం?

మో:- ని న్నలరించుచున్నానని నీ యర్థం.

క:- మోహనా! నీ జాలమహిమచే రెండు క్రియలకూ సమానార్థమే కల్పిస్తున్నావు. ఏకక్రియచే రెండర్థములూ స్ఫురింప జేస్తున్నావు.

రైలత్యంత వేగంగా పోతూన్నది. ఫలాపేక్షారహితమైన ప్రతిక్రియా నిష్క్రియగా మారేటట్లు రైలు చలించడంలేదు. జగన్మోహనుడు గానలోలుడై పెనుగాలి తాకుడుచే వాతాయనాల పూరించి శకటవేణువు నూదుతున్నాడు. భూనభోంతరాళములకు నాదానందం గల్పిస్తున్నాడు. పాలవెల్లి పొంగి దిగంతములవరకు వెల్లువలుగట్టినట్లు శరద్రాత్రి వెన్నెలలం బచరిస్తున్నది. కమలామోహనులు తమ సహజ సౌందర్యాన్ని విపులలోచనాలతో నాస్వాదిస్తూ ప్రయాణం చేస్తున్నారు.

# ౧౦

## ఇక తరచవద్దు

కమలమ్మ యిల్లు వెడలిపోయేటప్పుడు యెవ్వరూ పడిగట్ట లేదు. సాహు అన్నం దిని అవ్వమంచంమీద పడుకున్నాడు. పొద్దుపోయినా మేడమీద దీపంలేదు. చౌదరయ్యా, వెంకటయ్యా పొలంనుంచి యింకా రాలేదు.

ల:- అక్కలక్ష్మీ! అదీ యింకా లేచినట్లే లేదు. అవలక్షణంగా లంకంత లోగిట్లో దీపం లేకపోతే బాగుండదు. నీవు ముట్టించెన్నారా!

అక్కలక్ష్మి మేడమీదికిపోయి "అమ్మా!" అని పిలిచింది. ఎవరూ పలకలేదు. దీపం ముట్టించి గదిలోకి పోయింది. కమలమ్మ కనపడలేదు. మేడంతా దేవులాడి కిందికి పరుగెత్తివచ్చి,

అ:- అమ్మా! చిన్నమ్మ మేడలోలేదు. నాకేదో భయంగా వుంది.

ల:- లే కేమాతుందే; నీవు వట్టి అదురుదానవు. దొడ్లోకి పోయిందేమో చూడు, నే భవంతిలో చూచి పైకి వస్తా.

ఉభయులూ వెతికారు. మేడమీద మూలలన్నీ చూచారు. కేకలుపెట్టారు. దీపం దీసుకొని దొడ్డిభావిలో తొంగిచూచారు. జాడ గనపడలేదు. లక్ష్మమ్మ కండ్లనీళ్ళపర్యంత మైందిగాని పైకి యేడ్వలేదు. మనసులో గుద్దుకుంటున్నది. కాలుగాలిన పిల్లి మోస్తరుగా యింట్లోకి, వాకిట్లోకి తిరుగుతున్నది. కొట్టంలోకి చౌదరయ్య వచ్చాడేమో చూచి, లేకపోతే జీతగాణ్ణి పంపి ఎక్కడున్నా తక్షణం రమ్మనమని చెప్పడానికి అక్కలక్ష్మిని పంపించింది. పావుగంటలో చౌదరయ్య వచ్చాడు. ఎవరు వచ్చి యేమి చేస్తారు? ఆయన వొకపర్యాయం యిల్లంతా గాలించి చూచాడు.

చౌ:- ఏమయిందని నీ యభిప్రాయం? మీరేమైనా కేచులాడారా?

ల:- రామరామ! నోటా పండ్లాబెట్టి వొక్క మాట దాన్నిదివరకు నే ననలేదు.

చౌ:- పుట్టింటి కేమైనా పోయివుంటుందా?

ల:- దొంగతనంగా పోవలసివచ్చిన గరు జేమిఁవచ్చింది దానికి? మహారాజులాగ అది పోతానంటే మనం వద్దన్నామా? మొన్న దానంతటదే వచ్చిందిగా? వాండ్లవాళ్లు యెవరూ వచ్చిందికూడా కనుపడలేదు. యేమో మాయగా ఉంది.

చౌ:- రుగ్మ తేమైనా వున్నదా?

ల:- నిన్నటినుంచి కొంచెం సుస్తీగా వున్నది. పొద్దున వాళ్ళు తిరుగుతున్నదంటే మజ్జిగన్నం తాగించా. తాగి పడుకుని సాయంత్రందాకా లేపవద్దని అక్కలక్ష్మితో చెప్పిందట.

చౌ:- అక్కలక్ష్మి కేమైనా తెలియకుండా వుంటుందా? పూజాడలు తీసి చూడు.

ల:- దాని కేమి తెలుసు; అది లబలబ లాడుతున్నది.

చౌ:- అక్కలక్ష్మీ! ఇటురా! నీవు నిజం జెప్పకపోతే ఈ చెట్టుకు వేలదీయించి ముంతపొగ పెట్టిస్తా.

అక్కలక్ష్మి:- (వలవల్లాడి) నా సత్తెధర్మంగా చెపుతా! పచ్చని వేపచెట్టుకింద వున్నా. నాకేమీ తెలియదు.

చౌ:- ఆలోచించి తరువాత చెప్పు.

అ:- ఇంకా నాకు ఆలోచనేముంది.

చౌదరయ్య కొట్టంలోకి బోయినాడు. వెంకటయ్య కనబడితే అతనినీ, కొందరు జీతగాండ్లనూ దీసుకొని చెరువు వెతికించాడు. వెంకటయ్యను గుఱ్ఱపుబండి చేసి రైలుస్టేషనుకుబంపి వెనుక స్టేషనులో యెక్కివస్తారేమో రైలులోగూడా వెతికి చూడమన్నాడు. వొక వుత్తరం వ్రాసి జీతగాడికిచ్చి పాలెం బోయి విచారించి రామానాయుడెక్కడుంటే అక్కడికి పోయి వుత్తరం ఎవరికీ చూపకుండా అతనికే యియ్యమన్నాడు. తెల్లవారిందాకా

మెవ్వరితోనూ చెప్పవద్దని జీతగాండ్లకు చెప్పాడుగాని పావు గంటలో వూరంతా పొక్కింది. మునసబు "పిట్ట బుర్రున లేచి పోయింది. గూడుమాత్రం మిగిలిం"దని నడివీధిలో నిలబడి తన అక్కసున్నకొద్ది అల్లరిపెట్టి అక్కడకీ కసిపోక "మీయింట్లో హత్య జరిగిందని వింటాను. వాఙ్మూలమిచ్చి పోవలసిం"దని చౌదరయ్యకు కబురంపాడు. చౌదరయ్య జీవచ్ఛవమైనాడు. ఈ అవమానానికి తోడు పోలీసువాండ్లు యే దుర్మార్గానికి దిగుతారోనని భయపడు తున్నాడు. ఊరిజనమంతా వీధిలో మూగింది. చౌదరయ్యకు తగినశిక్ష జరిగిందని సంతోషించారు. మునసబు పార్టీవాళ్లు కొందరు ఖూనీజరిగిందనీ జీతగాండ్లచేత మోయించి చెర్లో పారవే యించాడనీ మళ్ళీ పదిసంచులు వడ్లు పత్తవనీ ఖర్చుపడకపోతే నీళ్ళ మీద వేస్తారనీ చిలవలకు పలవలు కల్పించి మనిషికొక మోస్తరుగా మాట్లాడుతున్నారు. చౌదరయ్య వీధిలోకి తలచూపలేదు. రామదాసు సంగమందిరములో కూర్చొని రామానాయుడుగారికి గొప్ప అన్యాయం జరిగిందని విచారపోయినాడు. ఆరోజు వూరు మాటుమణిగేవరకు రెండుజాములయింది. రైలుకు యెవరూ పోలే దని కబురు వచ్చింది. ఊరు సర్దుమణిగినతరువాత, రైలుదిగివచ్చి కంఠంరాజు వచ్చాడు. చాలాసేపు కారణం యోచించాడు. బుద్ధిని పాదరసంవలె పాకించాడు. పంతులు వోకుకు యెక్కడా అందలేదు. లక్ష్మమ్మ వెంకటసుబ్బయ్యను పిలిపించి అంజనం వేయించింది. అదీ పారలేదు. రాక్షసఘడియలలో జరిగినసంగతులు అంజనానికి అందవన్నాడు.

పంతులు పోలీసువాండ్లసంగతి యెత్తేవరకు చౌదరయ్య తత్తరపోయి, యెగుడుదిగుడు మాటలు సాగించాడు.

ల:- తమ్ముడూ! ఆయనమతి తిరిగిపోయింది. పిల్లవాడు రాంగనే అన్నిసంగతులూ మాట్లాడుదువుగాని యిప్పుడాయనతో యేసంగతీ యెత్తవద్దు.

పం:- ఆయనకోసం యెవరైనా పోయినారా? రైలుకు పోయినవాండ్లు తిరిగివచ్చినట్లున్నదే?

ల:- అప్పెసం ఆయనకోసమే వొకమనిషిని పంపాం. ఈ సంగతులన్నీ వ్రాయలేదుగాని వుత్తరమందినట్టుగానే రమ్మన్నాం.

పం:- ఆయన వచ్చేదాకా నమ్మకం లేదు. రెండోసంగతి ఆయన చెవిదూరదు.

వెం:- సంగతులు సూచనగా వ్రాసిరా పోయినమనిషి సంగతులన్నీ యెరిగినవాడేలెండీ.

చౌ:- (వెఱ్ఱిచూపులు చూస్తూ) పంతులూ! నా ఐదువేల రూపాయలకు జమపద్దు తగలందీ వొక్కదమ్మిడీ ఖర్చుపెట్టను. ఖర్చుపెట్టించావా, నీకొంప వేలం వేయిస్తా.

ల:- తమ్ముడూ! ఆయన వ్యవహారం బొత్తిగా పిచ్చికింద పడ్డది. ఆయనను యిప్పుడేమీ కదపవద్దు.

చౌ:- పిచ్చే. రాపిచ్చేగాని పోపిచ్చిలేదు.

ల:- నీవు కాసేపు పడుకో. మేము యీవత్తూ ఆలోచిస్తాం.

పంతులు రాత్రి అక్కడనే పడుకున్నాడు. లక్ష్మమ్మ రెప్ప వాల్చలేదు. వెంకటయ్యను రెండుమాట్లు కొట్టాలోకీ, చెరువుదగ్గరకూ పంపించింది. మళ్ళీ లాంతరువేసుకొని దొడ్లోభావిలో తేలిందేమోనని వెతికారు. యెక్కడా ఆ పోఖుకువ కనబడలేదు. చివరకు లక్ష్మమ్మ మనుష్యులను భావిలోకి దింపించి వెతికించింది. చిన్నప్పుడు సాహు భావిలోపడవేసిన పలువస్తువులు మాత్రం దొరికినవి. ఏమీ పాలుపోక పంతులును లేపింది. ఆయన కండ్లు నులుచుకొని కొమిరెలవంక జూచి "నగలు యీవత్తూ వున్నవేమో చూచారా?" అని అన్నాడు. అప్పుడంతా మేడమీదికి బోయినారు. మామూలుగా గదిలో వంకెన వుండే బీగాలగుత్తి సావిట్లో బల్లమీద వేసియున్నది. పెట్టెలకు తాళం వెయ్యలేదు. లక్ష్మమ్మ మూతలు దీసి పెదవి విరిచి పండంటికాపరానికి యేదో వండ వచ్చిందంటూ నిలుచోలేక నేలమీద చతికిలపడ్డది.

చౌ:- నాలుగువేల నగలూ పోయినట్టేనా?

పం:- కుల్లుకు అభిప్రాయం ఏమని తేలుస్తారు?

వెం:- యెట్లా చెప్పగలం?

ల:- యెట్లా చెప్పేదేమిటి? కనబడుతూనే వున్నది.

పం:- ఆత్మహత్యమటుకు కాదు.

ల:- చచ్చేది నగలు తీసుకొనిపోతుందా?

పం:- పోలీసుపోడు తప్పినట్టే.

ల:- పోలీసువాండ్లు రారా?

పం:- మనము ఫిర్యాదు చేయందీ వాండ్లు యిలాకా పుచ్చుకోరు.

చౌ:- కీడులో మేలు.

వెం:- వీధిమెట్ల తలుపు తీసిపెట్టే పోయింట.

ల:- తన కాపురమే బోర్ల దోసుకొని పోయిం దానికి మన మేగంగలో కలిస్తేనేమి?

వెం:- బిడ్డా, మాణిక్యమంటి కాపురం వదలి లేచిపోయిం దంటే నే నమ్మను. మేడమీదికాలు కింద పెట్టకుండా దానికి రాజోపచారంగా జరిపాం. వాడైనా యెన్నడూ వొక్కమాట తోణికి యెరగడు. లేచిపోయిందన్న మాట నాకు నచ్చదు.

పం:- కాదక్కా—కారణార్థ మట్లావుంటే తప్పుతుందా? "నొసటన్ వ్రాసిన వ్రాలకన్న కలదా నూఱేండ్లు చింతించినన్" ఈవిడె పోవడం వొక మనివా? కొమ్ములుదిరిగిన వాండ్లు పోయినారు.

ల:- తమ్ముడూ! చివరకు మాగతి యిట్లా అయిందేమీ? ఈ చుమ్మర్లన్ని చూడకుండా నేను బోరాదూ!

పం:- ఓహోహో! పోరాదూ అంటే, యెవరి చేతిలో పని? నీభాగం వచ్చింది నీ వనుభవించవద్దూ?

ల:- యెప్పుడూ "సాహూ సాహూ" అని అలసురుగు తుండేదే! తల్లింటుబాయని బిడ్డను వదిలిపెట్టి పోవడానికి దానికి మనసెట్లా వొప్పిందంటా?

పం:- అదీ వొకపిచ్చేనమ్మా! ఆ యెర్రలో విచక్షణేమీ వుండదు. వొక చక్రవర్తి పెళ్లాం కుష్ఠువాడి కోసం ప్రతిరాత్రి నదిదాటి పోయేదట. ఆ కావరంలో మంచీచెడ్డా కనపడుతుందా!

సా:- నాయనమ్మా, నన్ను వొక్కడినే పడుకోపెట్టావా?

ల:- లేదు నాయనా - యిప్పుడే లేచా! యిక్కడ కూర్చుందువుగాని రా.

సా:- నన్ను దొడ్లోకి తీసుకపో.

ల:- వెంకటయ్యా! వాడు దొడ్లోకి పోతాట్ట వెంటపో. తమ్ముడూ యీ కసిగందును నేను యెట్లా సాకేది? నాకూ మునుపటిమోస్తరు జవసత్వాలు లేవు. కాస్త నడిచానా అంటే, యెక్కడలేని వొగర్పూనూ.

సా:- నాయనమ్మా! నాకు చలే.

ల:- ఇటురా! నాయనా! నావొళ్ళో కూర్చో. నే నీ గుడ్డును సాకి వాడికి రెక్కలు వచ్చినప్పటికా. తమ్ముడూ, నేను నట్టింట కూర్చొని చెప్పుతున్నా. నా బిడ్డ వొకరివంటివాడు కాడు. పట్టి జాలిపేగుల వాడు. నే లోపలనుండి పలక్కపోతే వాడు మేడ దిగివచ్చి ముష్టి పెడతాడు. దోసిలిదప్ప పిడికిలితో యెరగడు. వాడివంక వేలు చూపడానికి దోషం కనుపడదు ఈ మాల తగువుల మూలంగా నలుగురి నోళ్ళల్లో నానుతున్నాడు గాని. యేమిటో! లోకసేవట! దానితో సతమతం అవుతున్నాడు. వాడికీ కర్మం యెందుకు పొసగాలె చెప్పా? నలుగురిలో తలయెత్తడానికి లేదుగదా. ఫలాని యెల్లయ్యపెళ్లాం యిట్లాగుట అంటే చాలదూ.

వెం:- ఇది యేనాడు చేసుకున్నదో గాని మావాడు శ్రీరాములువారివంటి వాడండి(అని వెంకటయ్య యేడిచాడు.)

పం:- నిజమే; సీత దొరకలేదుగా! నేను అనేక సంసారాలు చూచా. ఒక్క జోడైనా వొడీ వంకా లేకుండా సరి

పోయినదాన్ని నే చూడలేదు. లక్ష కొకరుంటే అది లెక్కలోది కాదు. బ్రహ్మదేము డట్లా చేయవలెనని చేస్తున్నాడో, లేక చేత గాక చెడగొడుతున్నాడో నాకు తెలియదు. యెక్కడనైనా కాస్త వంక కనబడక మానదు ?

ల:- మా వియ్యంకుడుగారు కూడా మూడేడు తరాలా మచ్చలేని వాండ్లు. అన్ని నాణాలూ విచారించే జేసుకున్నాం. నేటికి మా వంగసాలకు మైల సోకింది.

పం:- యిప్పు డివన్నీ విచారిస్తున్నారూ. "సర్వే గుణాః కాంచన మాశ్రయంతే" అని-డబ్బువుంటే అన్ని సుగుణాలు వున్నట్టే.

వెం:- ఇక చేయవలసిన పనేమిటి ?

పం:- నోరు మూసుకొని వూరుకోవడమే బుద్ధి.

చౌ:- నగలో ?

పం:- నగలకోసం యెవరిమీద వ్యాజ్యం వేస్తావు ?

చౌ:- వ్యాజ్యానికి పోయేమాట వట్టిది.

వెం:- ఆమెవల్ల యేదైనా పొరపాటు జరిగివుంటే యే పుట్టింటికో పోయిందని తీసుకొని రాగూడదా !

చౌ:- ఊరంతా యెరిగిన సంగతికి గుట్టేమున్నది ?

ల:- పిల్లవాడు వచ్చిన తర్వాత ఆ సంగతి ఆలోచించండి.

సా:- నాయనమ్మా ! అమ్మేది ?

ల:- ఇంకేమమ్మ నాయనా ! అమ్మ చచ్చిపోయింది.

సా:- మళ్ళీ యెప్పుడు వస్తుంది ?

ల:- చచ్చిపోతే మళ్ళీ యెట్లా వస్తుంది ?

సా:- మేము నాదెండ్లబోయి రాలేదా ?

ల:- ఈ తడవ రాదు.

సా:- వస్తుందిలే. నీ వన్నీ అబద్ధాలు చెపుతున్నావు.

పం:- మీ అమ్మ వస్తుందిలే అబ్బాయి. యేడవబోకు.

తెల్లవారింది. పంతులు దేహబాధలు తీర్చుకొని వస్తానని వెళ్ళాడు. ఇంతలో రామానాయుడు వచ్చాడు. మేడమీదికి పోబోతున్నాడు.

వెం:- రాముడూ! అంతా యిక్కడనే కూర్చున్నాము. రా.

రామానాయుణ్ని జూచి లక్ష్మమ్మ యేడ్చింది. వెంకటయ్య విషయం సవిస్తరంగా జెప్పాడు.

రా:- మోహనరావు వెళ్ళాడా?

ల:- వాడు నిన్న పొద్దునే వెళ్ళాడు.

రామానాయుడు మేడమీదికి పోయి పరిశీలించి చూచాడు. విశేషము లేమీ కనుపడలేదు. పట్టెమంచం దగ్గరకుబోయి మొగం చిట్లించి దుప్పటీ పసుపూ తీసివేయించాడు. "కమలమ్మా! సాహుకు ఆజన్మాంతమూ అపకీర్తి వస్తుందనయినా యోచించావు కాదుగదా" అని మాత్రమన్నాడు. యింతలో వెంకటయ్య పైకి వచ్చాడు.

వెం:- రాముడూ! ఏ మాలోచన చేశావు?

రా:- ఇక చేయవలసిన ఆలోచన లేదు.

వెం:- తొందర పడవద్దు.

రా:- ఇక తలచవద్దు.

## ౧౧

ఆ న్స రు

గ్రామ మునసబు పోలీసు స్టేషనుకు పోయి వ్యవహారం సంగతి చెప్పి మీరు వూరిదాకా వస్తే పని తాను ఫొక్తుపరుస్తానని ప్రోత్సాహపరిస్తే సబిన్స్పెక్టరు శాస్త్రిగారు పోవాలెనని వూగాడు గాని కొత్త యిన్స్పెక్టరయిన నాయుడుగారు అంగీకరించలేదు. ఊరికి తిరిగివచ్చి పోలీసువారు మధ్యాహ్నం వస్తారని పుకారు పుట్టించారు. ఊరంతా సంగమందిరం దగ్గర పోగై పోలీసువాండ్ల

కోసం యెదురు చూస్తున్నారు. రెండుజాము లయ్యేవరకు గుంటూరు నుంచి వొక బిళ్ళ బంట్రోతు యేవో కాగితాలు తీసికొని వచ్చి చౌదరయ్యగారిల్లెక్కడని విచారిస్తున్నాడు. జనం అతని చుట్టూ కమ్ముకొని అడిగితే తా నెందుకు వచ్చిందీ చెప్ప లేదు. చౌదరయ్యను అరెస్టు చేయడానికి ఆయన యెక్కడ వున్నదీ కనుక్కోనే టందుకు ముందుగా వొక పోలీసువాడు వచ్చాడని ఆనోటా ఆనోటాబడి చౌదరయ్యకు దెలిసి పోలీసువాండ్లకు యిలా కాలేదని రామానాయుడు చెప్పినా నమ్మక సావారంలో వున్న గాదెలో దాక్కున్నాడు. బంట్రోతు విచారిస్తూ చౌదరయ్యగారింటికే వచ్చి వీధిగడపలో వున్న అక్కలక్ష్మిని చౌదరయ్య వున్నాడా అని అడిగేవరకు అది ముందు తలుపు మూసి వూళ్ళో లేడని జవాబుచెప్పి యింట్లోకి బరుగెత్తి పోలీసు నూపరెంటు వచ్చాడని లక్ష్మమ్మతో చెప్పింది. వెంకటయ్య పరుగెత్తి మేడ మీాద చదువుకుంటూ వున్న రామానాయుడితో చెప్పితే ఆయన దిగివచ్చి వద్దన్నకొద్దీ వినక వీధివాకిలి దియ్యంగనే జవాను సలాం బెట్టి కాగితాలు చేతికిచ్చాడు. రామానాయుడు తీసుకొని చదువు కుంటున్నాడు. వెంకటయ్య వారంట్లు వచ్చినవని భయపడి గజ గజలాడుతూ నిలుచున్నాడు.

రా:- ఇది మాదగ్గెరకు తెచ్చావెందుకు ?

బంట్రోతు:- ఆ రామదాసెవరో నాకు తెలియదు. సర దార్లు నాతో వొక మనిషిని పంపి చూపిస్తే నోటీసులు జారీ జేస్తాను.

వెంకటయ్య:- రామదాసు కేసు ఫైసలయిపోయిం దను కొన్నామే.

రా:- అదిగాదు. భూమి స్వాధీనం నిమిత్తం వ్యాజ్యం వేశారు.

వెం:- వాడి, పంతులా ? చిన్నాయనా ?

రా:- లేదు. ఈయనే.

వెం:- ఇది పంతులు చేసిన పితలాటకం.

రా:- మన బంగారం మంచిదైతే కంసా లేమిచేశాడు?

వెం:- ఈ జవానును పంతులుకు వొప్పజెప్పి వస్తా. నీవు నాయనతో యీ సంగతి చెప్పు.

రా:- అన్నా! నా మనస్సు వికలంగావుంది. పైకిబోయి పడుకుంటాను.

వెం:- జవానూ! నేను లోపలికి బోయివస్తా వుండు.

వెంకటయ్య:-(వసారాలోకి బోయి)చిన్నయ్యా!నీవు యెక్కరావచ్చు. వాడు పోలీసు గాడు. కోర్టు బంట్రోతు.

చౌ:- పోలీసువాడి మాట నీవు నమ్మావూ? వాండ్లు నమ్మించడానికి అట్లా అంటారు. కాకపోతే లక్ష్మి నూపరెంటని యెందుకు జెపుతుంది?

వెం:- రామదాసు కేసులో నోటీసులు తెస్తే రాముడు చదివాడు. అతనిని పంతులుకు వప్పజెప్పి నోటీసులు జారీ చేయిస్తాను.

చౌ:- (గాదెక్కుతూ) ఘనుడవే. పంతులును యిక్కడకు పిలుచకరా. దానిపని మేము చూచుకుంటాం.

చౌదరయ్య క్రిందికి దూకేవరకు పంచ కొర్రుబట్టి గిలక బెణికింది.

వెం:- నీవు కోపబడకపోతే వొక్కసంగతి చెపుతాను. ఈ వ్యాజ్యం లోక విరుద్ధంగా వుంటుంది. తమ్ముడికికూడా యిష్టం లేదు. యేదోవిధంగా రాజీపడి వ్యవహారం ఫయిసలు చేయించు.

చౌ:- రాజీమాట నా చెవుల వినగూడదు. మాలమాదిగలతో రాజీ యేమిటి? మీ అన్నదమ్ములు పెత్తనానికి వచ్చిన తర్వాత యావదాస్తి మాలమాదిగెలకు చదివింతురుగాని. నేను హరీ అనేవరకూ నా బాటకు అడ్డం రావద్దు.

చౌదరయ్య ఆఫీసుగదిలోకి బోయికూర్చున్నాడు. పంతులు జవానును గదిలోకి బిలిచి :

పం:- ఏమోయ్! నీమాట చెపుతాం. నే చెప్పినప్రకారం చేసి నోటీసులు వాపసు చెయ్యి.

జ:- ప్రతివాది నోటీసులు నిరాకరించా డని మునసబు వ్రాసియిస్తాడా?

పం:- మునసబుకూ, మాకూ యెదురుపార్టీ. కరణం భయ స్తాడు.

జ:- అందులో భూసంబంధమైన వ్యాజ్యం. నా కంఠానికి వస్తుంది. కష్టాన్ని గనిపెట్టి తమరున్నది సెలవియ్యండి

పం:- అన్నంబెట్టించి రూపాయి యిప్పిస్తాను.

జ:- నా దారిఖర్చులే రెండు రూపాయిలు అయినవి. తక్కిన రెండూ దయచేయించండి. తమ యిష్టంవచ్చినట్లు వ్రాయించుకొని యిద్దరిసాక్షుల సంతకాలు చేయించండి.

వ్రాతపని పూర్తి అయినతరువాత జవాను భోంచేస్తు న్నాడు. చౌదరయ్య వేళ్లు లెక్కపెట్టుకుంటూ ముంగిటిలో పచారీ చేస్తున్నాడు. పంతులు మూడు రూపాయలు తీసికొని జవానును వెంటబెట్టుకొని పోయి రెండురూపాయలు చేతిలో బెట్టి పొమ్మ న్నాడు.

జ:- అయ్యా! నాకు రెండురూపాలు ఖర్చులేలయినవండి.

పం:- పన్నెండు రూపాయ లయినవి. అనేకమాట్లు వచ్చి పోయేవాడివి. యింకోదాంట్లో ముట్టజెపుతా పో.

చౌదరయ్య వ్యాజ్యం వేశాడనీ, జవానును లోగట్టుకొని నోటీసులు జారీ చేయించలేదనీ అందరికీ తెలిసింది. వెంకటదాసు వూరి బయటికి జవాను కడ్డంబోయి వొక రూపాయి వాడి చేతిలో బెట్టి ప్లయంటుకు నకలు వ్రాసుకొని వాయిదా తేదీ వేసు కున్నాడు. పంతుల కీసంగతి తెలిసి జవాను మోసం చేశాడని

చౌదరయ్యకు జెప్పాడు. రామదాసు ప్లెంటునకలు చదువుకొని 'దాసూ ! మనకు రోజులు మంచివిగావు. శుక్ర మహాదశలో శన్యంతరం. రెంటికీ షష్ఠాష్టకం గూడాను. మనం కనిపెట్టిపోతే మంచిది. వ్యాజ్యంలో మనకు పట్టు లేదనుకుంటాను. రాజీపడితే మేలు. వెంకటసుబ్బయ్యగారి ద్వారా చౌదరయ్యను హెచ్చరించి చూదాం.

వెం:- ఆయనతో రాజీ నాకు సుతరాం పనికిరాదు. కొంపలు తెగనమ్మైనా, మూడు కోర్టులూ చూడవలసిందే.

రామ:- ప్రవాహం వచ్చినప్పుడు తలవంచడం మంచిది. ఎదటిబలం మించివున్నప్పుడు రొమ్మువిరిచి లాభంలేదు. ప్రయత్నించి చూస్తాను.

వెం:- మాట పోగొట్టుకోవడంతప్ప ప్రయోజన ముండదు. అతనుండే హుమ్మస్సుమీద రాజీకి వస్తాడా ? వాలాయికం తీర్చుకోవడంతప్ప ప్రయోజన ముండదు.

రా:- అట్లాగే అయెను. ఆ సొద్దు మనమీ దెందుకుంచుకోవాలె? కాదనిపించుకొనే దిగుదాం.

వెం:- నీసం దేహం తీర్చుకొనిరా. సాయంత్రం రైలుకే గుంటూరుపోయి — మాట్లాడివత్తాం.

రా:- (వెంకటసుబ్బయ్యగారి యింటికిబోయి) శాస్త్రిల్లుగారూ ! మా వ్యవహారం సంగతి విన్నారుగదా.

వెంకటసుబ్బయ్య:- యింతకుముందే విన్నాను. గ్రామంలోకి నోటీసులు వచ్చేవరకూ, కప్పివుంచారే.

రా:- అంతేకాదు. నాకు తెలియకుండా డిక్రీకూడా పొందవలెననే ప్రయత్నం చేశారు.

వెం:- అదంతా విన్నా. ఇంతకూ యేమి నిశ్చయించావ్రు?

రా:- తమబోటివారికి తెలియకుండా నిశ్చయ మెట్లా అవుతుందీ. కోరుకు యెక్కవలసిందేనా ?

వెంక:- "సంధి మిచ్ఛంతి సాధవః" అన్నారు. కాని వాకరు సాధువ్వూ రెండవవాడు పలవా అయినారు. పొసుగుతుం దని నమ్మకంలేదు.

రా:- తమరూ ఆమాటే అన్నారా? ప్రయత్నం చెయ్య మంటారా, లేక సంక్షేపించుకో మంటారా?

వెం:- "యత్నేకృతే యదినసిధ్యతి కోత్రదోషః" అన్నారు. వాడు మనమీద లేకుండా ప్రయత్నంచేసే చూతాం. ఇదివరకు మాటలేమైనా జరుగుతున్నవా?

రా:- ఇంతవరకు లేదు. రాయబారం తమరే నడిపితే బాగుంటుందని యిట్లా వచ్చాను.

వెం:- సంజయరాయబారమా; కృష్ణరాయబారమా?

రా:- రెండూ వద్దు. యేదోవిధంగా కుదిరే ప్రయత్నం చెయ్యండి.

వెం:- మాటతభావతు రాకుండా నీ ఆఖరు అభిప్రాయం చెప్పు.

రా:- సంగోరుకైతే చూడండి. మా పిల్లవాడు దానికే కాదని అంకె వేసుకొని కూర్చుంటే వొప్పించేవరకు తలప్రాణం తోకకు వచ్చింది. కుదరకపోతే తమరుకూడా గుంటూరుదాకా దయచేయవలసి వుంటుంది.

వెం:- నే రావడానికి సందేహ మేముందీ. అవతల పంతులు కృష్ణసారథ్యం చేస్తుంటే యివతలకూడా దీటైనసారథి వుండవద్దా?

రా:- బాబూ! శల్యసారథ్యం మటుకు చెయ్యవద్దు. వూరికే నవ్వుతూ అన్నాను. తమరు వెళ్ళిరండి. నే నిక్కడనే కూర్చుంటాను.

వెంకటసుబ్బయ్య వెళ్ళి వచ్చాడు.

రా:- యేమి శానాసేపున్నారు? కాయా; పండా?

వెం:- రెండూ గావు. తాము తప్పక గెలుస్తామనే ధీమసం మీద వున్నారు. మనం పోవడమే అప్రశస్తం.

రా:- (నిట్టూర్పు విడిచి)—అంతే అన్నారూ. సగానికి కూడా వొప్పుకోలేదా, అభిప్రాయం యిట్లా అని కనబరిచారా?

వెం:- వాండ్లకు రాజీ అంటేనే వేళాకోళంగా వుంది. చౌదరయ్య అడ్డదిడ్డాలు మాట్లాడి తాను పోలీసువారి కిచ్చిన అయిదువేల రూపాయిలూ యిస్తే వ్యాజ్యం తీసివేసుకుంటా నన్నాడు. పంతులు రక్కరించే వాడిలాగు మాట్లాడి దావా ప్రకారం డిక్రీకి వొప్పుకుంటే సగం ఖర్చులు తీసివేయమని శిఫారసు చేస్తానన్నాడు. అన్నీ కోడిగాలుదప్ప వ్యవహార సరళిగా, మాట్లాడనే లేదు.

రా:- కొడుకులతో మాట్లాడితే ప్రయోజనం వుంటుందా?

వెం:- ఉండదు. వెంకటయ్యతో అని చూశా. తన మాటలు సాగవన్నాడు? చౌదరయ్య మీ కాపురానికి పూలు ముడుచుకొని కూచున్నాడు. ఆయన ఆలోచనలు చాలాదూరం పోతున్నవి. నీ జాగ్రత్తలో నీవుండు.

రా:- సాయంత్రం బయలుదేరుతారా?

వెం:- నాకు వొంట్లో వుసులుగాలేదు. అదిగాక నాకు కోర్టుకుబోయే వాత్తే తప్పిపోయింది. అన్నరు దాఖలుచేసి వస్తే పర్యాయితీన చూతాం.

రా:- ఇందాక వస్తామంటిరే ?

వెం:- అన్నమాట వాస్తవమే. మాట బదలాయింపు కావలసి వస్తుందనే విచారం. నేను మీతో వస్తే కాపురం యీ వూళ్లోనుంచి బదలాయించవలసిందే !

రా:- అంతమాట వద్దు. మా బదవలు మేము పడతాం. సెలవు పుచ్చుకుంటాను.

వెం:- రామదాసూ ! కనుగలిగి ప్రవర్తించు.

రా:- దేవుడే వున్నాడు. సెలవు.

రామదాసూ వెంకటదాసూ రాత్రి యెనిమిది గంటల బండికి గుంటూరు వెళ్ళి ప్లీడరు నారాయణరావు పంతులుగారింటికి పోయినారు.

వెం:- ఇల్లంతా డాబుగా లేదే?

రా:- ఈయన దగ్గర భేషజం లేకపోయినా పని బాగా చేస్తారు. వ్యవహారంలో పట్టు లేకపోతే వద్దని చెపుతారు. అయ్యా! ప్లీడరుగారున్నారా?

నారాయణరావు:-లోపలికి రా.

రా:- మేము చెప్పరాని వాండ్లమండి.

నా:- చెప్పవచ్చినవాండ్లే. వచ్చి ఈ ప్రక్కన కూర్చోండి. ఇతరుల కెవరికీ యిబ్బంది వుండదు.

రా:- మాకిదే ప్రసాదం. తమకు మాయందు అభిమాన మున్నదని విన్నాను. కాని దర్శనం చేయలేదు. తమరు గురు పుత్రులు కూడానట.

నా:- మీరు పీరయ్యగారి కోవలో చేరినవారా యేమి?

రా:- చిత్తం.

నా:- ఈమధ్య బెజవాడలో మీ వాండ్లొక పెద్ద సభ చేశారట. పోవడానికి నాకు వీలయిందిగాదు. కాని తీర్మానాలు చక్కగా వున్నవి. పాపం! మీ సంఘ నాయకుడైన సంగదాసు గారు కాలం చేశాడటే?

రా:- అవునండి. తమరు గారని ప్రయోగించడం ధర్మం గాదు. తమ అభిప్రాయ మెట్లావున్నా లోక విరుద్ధం గదా.

నా:- లోక విరుద్ధమేమి? సంగదాసుగారు మీవొక్క సంఘానికేగాక హిందూ సంఘానికి యావత్తూ నాయకుడుగా మెంచవలసినవారు. వారి అకాల మరణం అందరికీ సంతాప కరమే! ఆయనను మీరు చూచారా?

రా:- చిత్తం. అతడు యీ నిర్భాగ్యుని కుమారుడేనండి.

నా:- ఏమీ! మీరు రామదాసుగారా? మీరు ధన్యులు. నిర్భాగ్యులు గారు. మిమ్ముని చూడడం చాలా సంతోషం. వారి వుద్యమం బాగా వ్యాపిస్తున్నదా? సంగ మందిరం కట్టించారని పత్రికలలో చదివాను. అది సాగుతున్నదా?

రా:- సాగుతునే వున్నది.

నా:- సంతోషం—మీరు వచ్చినపని చెప్పండి.

రా:- యీ వాది సంగదాసును చంపినవాడేనండి.

నా:- అట్లాగా? ఈ పిశాచం మిమ్ములను ఇంకా విడువలేదా?

రా:- మమ్ములను వూళ్లో వుండనియ్యడట. ఈ బాణం ప్రయోగించాడు. దీనితో నిర్ధాసంట.

నా:- వ్యాజ్యం సంగతులు చెప్పండి.

రా:- నేను ఒక వితంతువు దగ్గరనుంచి దావా ఆస్తి కొన్నాను. ఆమె చనిపోయింది. కంఠంరాజు సన్నిహితవారసు. వాది ఆయన దగ్గర కొన్నాడు.

నా:- ఆస్తి వారసత్వపుదనీ, ఆయన సన్నిహితవారసనీ నాది ఋజువు చేయగలడా?

రా:- పూర్వం వ్యవహారాలు జరిగినవట. పబ్లికు దృష్టాంతాలే వున్నవి. వితంతువు యొక్క భర్త యీ ఆస్తికి రిజిష్టరు కవుళ్ళిచ్చాడు.

నా:- ఈ ఆస్తి భర్త చేసిన ఋణాలు తీర్చడానికిగాని, లేక తన జీవనం జరక్కగాని అమ్మిందా?

రా:- భర్త ఋణాలు అదివరకే తీర్చింది. ఆమెకు ఇంకా ఆస్తి వున్నది.

నా:- వ్యాజ్యంలో నీకు చింతాకంతైనా పట్టులేదు.

రా:- మేము తెలియక కొన్నాం.

నా:- యెట్లాకొన్నా,వాకటే.

రా:- తమ సలహా యేమని?

నా:- వృథాఖర్చులు పైనవేసుకొని ఇతర ఆస్తి పోగొట్టు కోకుండా ఇంటికి పొమ్మనే నా సలహా. గత ఫలసాయం యెక్కువగా కోరారా?

రా:- రుజువు చేయలేడేమో కాని, అంత ఆదాయం రాదగినదే.

నా:- మీరు వ్యాజ్యమాడడం నిష్ప్రయోజనం.

రా:- యేమిరా పంతులుగారు ఖండితంగా సెలవిస్తున్నారు. ఇంతకంటె యేవిధంగానూ మేలు సలహారాదు. యేమంటావు?

వెం:- వారు రుజువు చేసుకున్నప్పటికి గదా. అన్సరు దాఖలు చేయించండి. భర్తచేసిన బాకీలు కొన్ని ఈ డబ్బుతో తీర్చిందని రుజువు చేయవచ్చు. తక్కిన ఆస్తివల్ల ఆమెకు జీవనం జరగదు.

నా:- అవి మీరు రుజువు చేయవలసి వుంటవి.

వెం:- చేయవచ్చు.

రా:- యేమో అబ్బా.

వెం:- తమ ఫీజు సెలవియ్యండి.

నా:- అడగడానికి నాకు నోరు రావడములేదు.

రా:- వ్యవహారంలో మొగమాటపడితే పని సాగదు. మా శక్తి మనవిచేస్తాను. నూరురూపాయలతో మమ్మును కడతేర్చండి.

నా:- గెలుస్తుందని నే చెప్పలేను.

వెం:- అది మా అదృష్టం.

నా:- ఆ ఫీజు సంగమందిరానికి నే ధర్మంజేసినట్టు వెంటనే జమ కట్టించండి.

రా.- యేమీ మీ అభిమానం!

నా:- ఈ రాత్రి అన్సరు వ్రాస్తాను. పొద్దున దస్కతులు చేసి రైలుకు బోవచ్చును. విచారణ వాయిదా దూరంగా వేస్తారు.

రా:- చిత్తం.

## ౧౨

### రంగుల మేడ

కలకత్తా మెయిలు గూడూరు వచ్చేవరకు వుదయం ౮ గంటలు అయింది. మోహనరావు స్టేషన్‌లో ఫలహారాలు తీసుకొని వచ్చాడు. రైలు స్టేషన్‌లో ఆగినప్పుడల్లా ప్రయాణీకులు యీ మోహన విగ్రహాలను జూచి ఆనందించి రత్నాన్ని బంగారములో తాపడం జేసినట్లు దాంపత్యం కుదిర్చినందుకు బ్రహ్మదేవుణ్ణి ప్రశంసించారు. ౧౦ గంటలకు సెంట్రల్ స్టేషన్లో బండీ ఆగింది. తమను పట్టుకోవలసిందని స్టేషన్‌మాస్టరుకు టెలిగ్రాములు వచ్చినవేమో అని మోహనరావు అలుకుపడ్డాడుగాని, అది జరుగలేదు. ఉభయులూ రామస్వామి మొదలియారు సత్రంలో ఒక గది తీసుకొని సామాను పెట్టి భోజనం చేశారు. తిరువళిక్కేణిలో విద్యార్థులు చాలమంది వుండడం, జార్జిటవునులో కళాశాల వుండడం తమ రహస్యానికి భంగకరాలని వెడిగెలగా మాంబళంలో పూలతోటలో వున్న రంగులమేడను అద్దెకు యేర్పాటు చేసుకొని దాని సమీపంలో తాను చదువుకునేటందుకు వొక గది తీసుకొని వెంటనే యింట్లో ప్రవేశించారు. తెలుగు వచ్చిన ఆడమనిషిని పనికి కుదిర్చి మోహనరావు వైటవేలెయిడ్లాకు పోయి వొక పెద్ద స్ప్రింగుమంచం, కీలుపరుపూ, గాలిదిండ్లూ, పడక కుర్చీలు; బల్లలూ, వీణె, జపానుబొమ్మలూ, క్రిష్ణవిగ్రహాలూ, రవివర్మ పటాలూ. తీసుకొని యెర్రని యెండలో తిరిగి తిరిగి 3 గంటల కింటికి వచ్చాడు. కమలమ్మ యిల్లు శుభ్రం చేయిస్తున్నది. ఇంతలో మోహనరావు క్షౌరం చేసుకొన్నాడు. ఉభయులూ మొగలిసబ్బుతో స్నానంచేశారు. మోహనరావు వుప్పాడ జరీ వుత్తరియ్యం కట్టుకొని పక్కగుండీల పట్టుకుడ్తా తొడిగి సేలం రుమాల పైన వేసుకున్నాడు. మొగముపై గవిసిన ముంగురులు వెనుకకు దువ్వేవరకు నల్లమబ్బులోనుండి వెలువడిన చంద్రబింబమువలె నెమ్మొగము ప్రకాశిస్తున్నది. కళంకంచేత చంద్రు

డికి వన్నె తగ్గినా మోహనరావుయొక్క మోము సోయగం, నీలంపుజగ్గు నిగ్గుల వెదజల్లు లేత మీసములచే పెంపుగాంచినది. కమలమ్మ కీలుగంటు వేసుకొని ఆకుపచ్చని జపానుపట్టు దుప్పలువ హొయలుమీర ధరించి వెన్నెలచాయ పట్టురవికెను తొడిగి. చేతులకు బంగారుగాజులు, చెవులకు కెంపులకమ్మలూ దప్ప యితర భూషణాలచేత సహజ సౌందర్యాన్ని మరుగుపరచలేదు. ఉభయులూ వొండరుల సౌందర్యమును పలుమారు చూడడంచేత అలవాటుపడ్డారుగాని, యితరులకు వెగటు పుట్టించేటంత మాధుర్యంగా వున్నది. మోహనరావు మంగళాపురంలో జూచినప్పుడు యీమె యందు మింత వెల్లడిగాలేదు. రాజకీయ స్వాతంత్ర్యంగల జాతి విజృంభించేవిధాన విడిచెట్లకు కొమ్మలు, రెమ్మలు విస్తరించినపోల్కి బంధముక్తమైన కమలా లావణ్యసాగరం రాకాసుధాకరునిపైగల వాత్సల్యంచేత పొంగి పొరలెడి పాల్కడలిమాడ్కి తనకు మారస్వరూపుడుగానున్న మోహనచంద్రుణ్ణి సౌందర్య వైభవంచే వెల్లువబెట్టి కడాని మేనిలతకు పటికనార్చిన తెరంగున పెంపుగాంచినది. మోహనరావు మోటువారువపు గున్న తెఱంగున విచ్చలవిడిం బెరిగి విజృంభించి స్మరశాస్త్ర పాండిత్యమున మిన్నయగు కమలోపాధ్యాయిని యనుగ్రహంబున ప్రథమ పాఠములం గరచుటచే హృదయసంస్కారమును బొంది వశుడై, కింకరుడై, కనుసన్నల నేవళంపుసపర్యలం బచరించుతూ లీలాకురంగ శాబకంబు పోల్కి అనుగమిస్తున్నాడు. ఇరువురూ వృశ్చిక మిథునంవలె కేలంగేలు గీలించి వొండొరులను లోచనపర్వంగా చూసుకుంటూ సాయంకాల శరత్సమీరములు పైకొన మందగమనములతో మేడ వెనుకనుఉన్న సుందరోద్యానవనములో కమలా సాహచర్యంచేత అకాల మాధవాగమనంబోలి ప్రవేశించారు. అనిల శిశిరంబుచే సృష్టియెల్లను పులకరించినది. గండు తుమ్మెద కొదమ లొండొంటితో తమ ప్రేయసుల గుణాతిశయంబుల వర్ణించి యానందిస్తున్నవి. విచ్చలవిడి విహరించే ప్రాయంపుటళినీ మత్తకాసినులం గని చెలరేగి తమ ఝుంకార నిస్వనంబులచే

వాని మనంబుల కామోదంబిడి యాకర్షించుతున్నవి. చిన్ని మొలకలు భూమిలోనుండి బయలుదేరి పైగప్పిన ఆకలముల త్రోసికొంటూ పర్దాలోనుండు బాలికలవలె తొంగిచూస్తున్నవి. లేజివుళ్ళు బిడియంచేత జేవురించినవి. తరు లతా గుల్మములు పుష్పిస్తున్నవి. కింజల్కములు చల్లగాలికి పులకరించి నిక్కి పుప్పొడి గురుస్తున్నవి. పవనదూతికలు పుష్పరజమునకు పూగన్నియలతో సంధాన మొనగూర్చుతున్నవి. పుష్పవతులైన యెల్లబ్రాయంపు తీవియలు బయల వాడుతూ గాలి బూజుంగుల కాలింగనం బిడుతూ వెలిచవులు చూస్తున్నవి. బెలగువ్వలు కులాయములం జేరి వాండొరుల నొరసి హత్తుకుంటూ కువకువ లాడుతున్నవి. సృష్టెంతా ప్రేమస్వరూపుని వికాసమని ప్రస్ఫుటమైంది. సృష్టిలో విసీలమై ప్రవహించే రస ప్రవాహిని వుత్తరంగితమై కమలా మోహాములలో వెలి కుబికి, బుగ్గలై వెల్లువలు కట్టుతున్నది. ఉభయులూ పరవశులై శృంగార రసప్రవాహములో దొప్పదోగి మునిగి తేలుతున్నారు. కండ్లు మత్తిలి మ్రూంగన్నుగొన్నవి. కమల అడుగిడ నోర్వక నిలువ నుంకించుతున్నది. మోహనరావు వుద్రేకపూరితుడై మించిన తమకంతో కమలమ్మను ఆపి యెదురు దిరిగాడు. పెదవులు సంచరించినవి. కమలమ్మ వివశ యయినా స్త్రీజన సహజమైన స్థైర్యము విడువక పసుగక్కు హొంబట్టుచీరకు

కెమ్మోవి బాసటగా మోహనకీరముంబలె "మోహనా" యని పిలిచి భ్రూలతా విభ్రమముచే వారించింది. కాటువేయ నుంకించే కోడెతాచునకు వుచ్చాటన మంత్రంవలె కెరటంబు లెగసే రాగప్రవాహినికి మోహనశబ్దం చెలియలికట్టయై నిలువ విలజ్జిత వదనాంబుజమును వాల్చి వూరకున్నాడు. మోహనమోము చందురుడు మరుగవుటచే దుర్భర విరహంబున కగ్గమై సైపనోపక ఉదిలగొనే చిత్తంబుతో "మోహనా" యని బుజ్జగించు సిగ్గను చిరుమబ్బుచే కప్పవేసిన మోహన వదన కైరవమును తన చిరునగవు యొక్క తెలికాంతులం దేల్చింది. మోహనుడు కలకదేరి చేయ

పీడి వన్య కుసుమములంగోసి తొడిమెల మెలిపి అలగుదండం జేసి వాతెర కుసుమారుణిమం జెలంగ పాలాశపాద రూపంబున విహరించే వనలక్ష్మి సౌందర్యముం దెగడు కమలా సహజ సౌందర్యమునకు అప్పనంబుగ బహూకరించి మెడ నలంకరించి పలుమారు సవరించాడు. మేలి కుసుమంబుల నేరి అవతంస కుసుమంబులగా పొందుపరచి నును జెక్కి-ళులంగరకమలములం బచరించాడు. కుసుమ పల్లవగుచ్ఛముం ద్రెవ్వి కబరీభరంబునం జెవిరి కరపుటంబుల గమిచి సేవించాడు. కొంతవడికి శమించి కమలా మోహనులు ఆరామరామణీయకముం దిలకించుతూ విహరిస్తున్నారు.

క:- మోహనా! కండ్లకు అద్దాలు పెట్టుకోలేదేమి?

మో:- ఈ చొక్కాకు జేబు లేదు. అద్దాలు యింట్లోనే పెట్టి వచ్చాను.

క:- ఇప్పుడు నీకు బాగా కనబడుతున్నవా?

మో:- ఆహా! నాకు కండ్లకు యేమీ జబ్బులేదు.

క:- అయితే నీకు అద్దాలెందుకు?

మో:- నీకు నగలెందుకు?

క:- అలంకారానికి.

మో:- నాకు షోకుకు.

క:- రెండు రకాల అద్దాలెందుకు?

మో:- పూర్వం సత్యభామ యేడువారాల సొమ్ములు పెట్టుకుండేదట. వొక రోజు పెట్టుకొన్న సొమ్ములు రెండోరోజుకు మోటుగాౘమాలె.

క:- ఇవి నగల మోస్తరేనా?

మో:- కాస్త లేకుండా. కాకపోతే అద్దాలకు బంగారుతీగ లెందుకు? అవసరంగా కావలసినవాళ్లు యెటువంటివైనా పెట్టుకుంటారు. వాళ్ళకు కనబడడమే ప్రధానం. అస్మదాదులకు షోకే ప్రధానం.

క:- షోకు కోసమైనా యీ పూట పెట్టుకోలేదేమి ?

మో:- నీవు నగలు పెట్టుకొన్నప్పటి కంటె లేనప్పుడే యెక్కువ అందంగా కనుపడుతావు.

క:- నీవు అద్దాలు పెట్టుకుంటే యెక్కువ షోకుగా కనుపడుతావే !

మో:- అది నే నొప్పుకోను. అద్దాలు పెట్టుకుంటే మరొక అందం వస్తుంది. వొకే విధమైన అందంలో స్వారస్యం లేదు. అద్దాలు లేకపోతే సహజ సౌందర్యమే వుంటుంది.

క:-అయినా మొగవాండ్లకు అందమే అక్కర లేదన్నారుగా?

మో:- అందం లేనివాండ్లున్నారు. అయితే యింకొక సంగతి; మగవాండ్లకు అంద మక్కర లేదంటే కృత్రిమ సౌందర్యం అక్కరలేదన్నారు. మగవాండ్లంతా సహజ సుందరులే.

క:- నిన్ను జూచినవాండ్లు మీ జాతికి సహజ సౌందర్యం లేదనరు. గాని దానికి తోడు వయస్సు యెక్కువ అందాన్ని తెచ్చి పెడుతుంది.

మో:- ఒక్క మగవాడే కాదు. మగజాతంతా యిదే విధము. సృష్టిని పరికించి చూడు. మగ సింహము, మగ నెమిలి, కోడిపుంజు, మగ పిచ్చుక మొదలైన జంతువు లన్నింటికీ వయస్సు వచ్చేటప్పటికి అత్యంత సుందరమైన రోమ పుంజము నిచ్చి సురూపాన్ని కల్పిస్తాడు. ఈ మోహన రూపాలు స్త్రీ జంతుజాలము నాకర్షిస్తవి. అయినా స్త్రీలు సహజ సుందరులు గనుకనే వయస్సు వచ్చినప్పటికీ ప్రత్యేకమైన బాహ్య సౌందర్య చిహ్నాలను గల్పించలేదు. వయస్సు స్త్రీల సహజ సౌందర్యానికిసహా వన్నె పెడుతుంది.

కమలమ్మ మోహనరావు యొక్క ముఖమువైపు దృష్టి బరపి వివశురాలైంది. మూర్ఛిల్లునని భయపడి కమలా నామమును సార్థకపరచే బిసకాండంబులంబోలు బాహులతలం దెమల్చి గుచ్చి పట్టుకొని కూర్చోబెట్టాడు. కమల మరల మోహనరావు యొక్క మొగం చూడడానికి జంకింది.

క:- మోహనా! మనకీ కలహం వద్దు. రాజీపడదాం.

మో:- స్త్రీలకు సహజ సౌందర్య మెక్కువ గలదనేది మొదటి షరతు.

క:- వయస్సు పురుషుల కెక్కువ సౌందర్యం తెస్తుందనేది రెండో షరతు.

మో:- వయస్సు అందరి సౌందర్యానికీ వన్నె తెస్తుందని మూడో షరతూ.

క:- నేను అంగీకరించాను.

మో:- నాకూ అంగీకారమే.

సాయంకాల మైంది. ఇంకా నెల పొడవలేదు. మిణుగురులు ఆడుకుంటున్నవి. పెరియముత్తు వచ్చి పూటకూలివాడు భోజనం తెచ్చాడని చెప్పింది. ఉభయులూ యింట్లోకి పోయినారు. కమలమ్మ పట్టుచీర విడిచి గులాబీ పువ్వు లద్దిన తెల్లచీరె కట్టుకునే వరకు వింత సోయగం వచ్చింది. ఉభయులూ భోజనం చేశారు. పెరియముత్తు యిల్లు బాగుచేసి కింద పడుకొన్నది. కమలా మోహనులు మేడమీదికి బోయినారు. విద్యుద్దీపముల కాంతిలో కడాని విగ్రహములనలె ప్రకాశించారు. కమలమ్మ కుర్చీ బల్లవైపు లాక్కొని వీణె చేతికి దీసుకున్నది.

క:- మోహనా! నీకు సంగీతజ్ఞానం వున్నదా?

మో:- నాకు సంగీతం రాదు.

క:- పోనీ. సంగీతం నీకిష్టమేనా?

మో:- నీవు పాడితే యిష్టమే.

క:- సంగీతమూ, వైద్యమూ తెలియనివాం డ్లుండరు.

మో:- రాక్షసగడియలలో జన్మించి దయాదాక్షిణ్యా లెరుగని వాండ్లకే సంగీతం అంటే తలనొప్పి. కమలా! వీణె అవతల పెట్టి వొక కీర్తన పాడు.

క:- నాకు వీణాగానమంటే ప్రేమ.

మో:- కేవల స్వార్థపరురాలివి కావద్దు. వీణకంటె నీ గాత్రమే నాకు ప్రియతరం.

కమల గొంతెత్తి:

"నా కొంగువిడరా గోపాల" అని బ్రహ్మానందంగా పాడింది.

కములా ముఖకమల వినిర్గళిత సౌరభగీతములు వాయు కెరటములపై నెక్కి నలుదిక్కుల ప్రసరించినవి. మోహనరావు పారవశ్యం జెంద "కమలా! యెన్నిగంట లయిందో చూడ" మన్నాడు.

కమలమ్మ లయబ్రహ్మలో లయమైపోయింది. మోహనరావు మాట వినిపించలేదు. ఇంకొక గీతమెత్తి ఆలపించి,

"తరుణారుణ కరుణామయ విపులాయతనయనం-కమలాకుచ కలశీభర విపులీకృత పులకం" అని మోళ్లు మోసులెత్త పాడి సూరకవినాథ కృతమైన:

ఉ. "ఇట్టి మనోహరాంగుఁ డొకఁ డెంచయిన నల్గడేని గల్గినన్
గట్టిగ నా కతండు బిగిఁకౌగిఁట జేర్పఁగ నబ్బునేని నే
నిట్టటు గొంచినన్విడక యిష్టవిహారము లెల్లఁ గాంక్షచే
పట్టి యొనర్చునేని రసభావము లెట్టివియొక్కొ అత్తఱిన్.

అని రసవత్తరంగా జదివింది.

మోహనరావు గంట చూడు అని విసుగుతో అడిగాడు.

క:- తొమ్మిది కావచ్చింది.

మోహనరావిక లేతామని లేచాడు.

## ౧౩

## సహవాస దోషము

తెల్లవారింది. శీతలసమీరములు ఘర్మబిందువుల నార్పినవి. మోహనరావు లేచి కూర్చున్నాడు. కమలమ్మ చేయి గట్టిగా పట్టుకున్నది. రావు మనస్సుకు చాపల్యం కల్గింది. కమలమ్మ చేయి

విడిచి ముసుగుగప్పుకున్నది. రావు ముసుగు లాగాడు. కమలమ్మ మంచంమీదినుండి లేచివెళ్ళిపోయింది. కాల్యాలు తీర్చుకున్నారు. పొద్దు కరకర పొడుస్తున్నది. ఒకరినొకరు చూచుకొని ముసిముసి నగవులు నవ్వుకున్నారు. కమలమ్మ తిరిగీ జపానుచీర గట్టుకున్నది. మోహనరావు కసరత్తుచేసి చన్నీళ్లలో హాయిగా స్నానంచేసి వుక్కుమిగిలి అంగ లిడుతూ మేడమీదికి బోయినాడు. అయ్యంగారు ఫలహారం దెచ్చాడు. ఉభయులూ పుష్కళంగా యేక పాత్రలో ఫలహారం చేశారు. మోహనరావు సిగరెట్టు కాలుస్తూ సూటువేసుకొని "కమలా! నేను తిరువళిక్కేణి వెళ్ళిరావాలె. హాస్టల్లోగది ఖాళీచేసి సామాను పట్టించుకొని స్కూలెప్పుడో కనుక్కొని వస్తా."

క:- స్కూలు యివ్వాళుంటేనో?

మో:- ఉంటే నేనిక్కడికి వచ్చి భోజనం చెయ్యడానికి వ్యవధుండదు. అటే వెళ్ళుతా.

క:- భోజనానికిక్కడికే రా? సామాను సాయంత్రం దెత్తువుగాని. నా బంగారుజడ మోటుగావున్నది. అది మేలిమి; యెవరైనా కొంటారేమో విచారించు.

మో:- ఇప్పుడు తొందరేమి? నిదానంగా ఆలోచించవచ్చు.

క:- స్కూలు లేకపోతే పదిగంటలకల్లా రా! అక్కడక్కడ తిరగవద్దు. నే వొక్కదాన్ని వుండలేను.

మోహనరావు జో హుకుమని బయలుదేరాడు. యెగ్మూరులో రైలుదిగి పెరియమెట్టు దగ్గర ట్రాం మార్చుకున్నాడు. హాస్టలుకు పోయేవరకు ౮ గంటలయింది. మోహనరావు యొక్క సహవాసి నిజాపురపు వెంకట్రావు గదిలో సంగీతం దీస్తూ "హింబూ లా" చదువుతున్నాడు.

మో:- గుడ్‌మార్నింగ్, వెంకట్రావ్.

వెం:- ఒరే ఎప్పుడు వచ్చావురా?

మో:- నే నిన్నవచ్చాను. మా బంధువులలో వొకామె యిక్కడ ఆసుపత్రికి వచ్చింది. నిన్నల్లా వాళ్ళకు బసకుదిర్చి ఆసుపత్రికి తీసుకొనిపోవడంతో సరిపోయింది. అందువల్ల నే నిన్నిక్కడికి రావడానికి వీలులేకపోయింది. మరి యితర కారణమేమీలేదు.

వెం:- ఏదో యితర కారణమున్నది?

మో:- అరే మొదటనుండీ యెరిగుండికూడా అనుమానపడతా వెందుకు? కసరతు చేసేవాండ్లకు యెప్పుడూ చెడునడత వుండదు.

వెం:- (తనలో ఏదోకథ వున్నట్లేవున్నది) నా దగ్గరకూడా నీరహస్యాలు మరుగుపరచడ మెందుకురా! నాసంగతులు నీకే మైనా దాచానా?

మో:- (వుత్సాహమును అణుచుకొని) అనవసరంగా అనుమానపడుతున్నావు. వస్తాదులదగ్గర దుర్నడత వుండదు.

వెం:- వస్తాదులకు దుర్నడతే అవసరం లేదట.

మో:- అదీ చాలాపొరపాటు. నీకే తెలుస్తుందిలే.

వెం:- డిండిగల్లు చుట్ట కాలుస్తావా? మంచిరకం వచ్చినవి.

మో:- అక్కరుమా యియ్యి.

వెం:- దానిమీాద వున్నవి అందుకో.

మో:- (సిగరెట్టు కాలుస్తూ) నేను హాస్టలు విడిచిపెట్టి బయట వుండవలసి వస్తుంది. నిన్ను వదిలిపెట్టడమంటే చాలా విచారంగా వున్నది.

వెంకట్రావుకు అనుమానం యెక్కువైంది. ఈ విషయ మింతసేపు దాచి క్షమాపణలతో ముగించటం యెక్కువ సంకోచ కారణమైంది "వదిలిపెట్ట వలసిన అవసర మేముంది? మీా వాళ్లెవరైనా వచ్చివుంటారా?" అన్నాడు.

మో:- పూటకూలింట్లోనే భోజనం. వైద్యంకోసం వచ్చిన వాండ్లకు సహాయం చేయడానికి వుండవలసి వచ్చింది.

వెం:- వారి కేమిజబ్బు?

మో:- అదేదో ఆడవాండ్ల జబ్బు.

వెం:- ఆమెతో యెవరూ రాలేదా?

మో:- ఒక ఆడమనిషిమాత్రం వున్నది.

వెం:- నీకేమి గావాలె?

మో:- నాకా—దగ్గర బంధుత్వమే.

వెం:- వాళ్ళను యే పేటలో వుంచావు?

మో:- ఇల్లు దొరకక యెగ్మూరులో వుంచాను.

వెం:- నీ గదికి నే నెప్పుడైనా రావచ్చునా?

మో:- నిరభ్యంతరంగా.

వెం: ఈ పూట వెళ్లుదామా? నేనుగూడా నీ గదిలోనే వుంటాను.

మో:- చాలాదూరం. మాంబళంలో తీసుకున్నాను.

వెం:- ఎగ్మూరులోవుండే రోగికి సహాయం చేయడానికే.

మో:- ఎగ్మూరుకు వచ్చి వెళ్ళుతుంటాను.

వెం:- ఇక్కడనుంచి వెళ్ళగూడదూ?

మో:- హాస్టెలులోనుంచి పోవడానికి అంత స్వతంత్రం వుండదు.

వెం:- రాత్రులు వెళ్ళుతుంటావా?

మో:- వెళ్ళవలసివస్తే వెళ్ళవద్దా?

వెం:- నే వెళ్ళివస్తుంటే యెవరు పట్టుకొంటున్నారు.

మో:- అట్లా కాదు. రాత్రులంతా వుండవలసి వస్తేనో!

వెం:- అటువంటప్పుడు వార్డెన్ వుత్తర్వు తీసుకోకూడదా?

మో:- తేపా అడగడం అంటే కష్టం. జబ్బు విశేషం లేకపోయినా కొత్తవాళ్లు గనక వెళ్ళవలసి వుంటుంది.

వెం:- మాంబళంలోని గడెందుకు? డబ్బెక్కువైయా?

మో:- వాళ్ళకుకూడా మాంబళంలోనే ఏర్పాటు చేస్తాను.

వెం:- ఇదివరకే చేశావనుకుంటాను.

మో:- ఇంకా చెయ్యలేదు.

వెం:- వైద్యుణ్ణెవ ర్నేర్పాటు చేశావు?

మో:- చెయ్యాలె.

వెం:- ఆసుపత్రికి తీసుకొనిపోరాదా?

మో:- వాండ్లకు మనవైద్యులను యేర్పాటు చేసుకోవలెనని వున్నది.

వెం:- మనవైద్యులంటే నేగూడా పనికివస్తానా?

మో:- (మొగంచిట్లించి——) నీదంతా తమాషారా? ఎవరిని యేర్పాటు చేయమంటావు?

వెం:- ఎవరైనా కసరతుచేసే దిట్టమైన వైద్యుణ్ణియేర్పాటు చెయ్యి.

మో:- నీదంతా వేళాకోళం.

వెం:- ఇద్దరు వైద్యులు పనికివస్తారా?

మో:- ఇద్దరెందుకు?

వెం:- "అధికస్య ధికం బలం" నీవు వట్టి స్వార్థపరుడవు. మా విజయనగరంలో మా మేష్టరూ, మేమూకలిసి వొకచోటనే వైద్యం చేస్తూవుండేవారం.

మోహనరావు:- (జాడా గట్టాడని అనుమానపడి— ఎరగనట్టుగా) యెవరని యేర్పాటు చేయమంటావు?

వెం:- కొంతకాలం నీవే చేస్తూవుండు. నీకంటె మొనగాడి వైద్యుడెవడుంటాడు?

మో:- అయితేమానె. గురువు నీవేగా.

వెం:- గురువును మించిపోయిన శిష్యుడవు. నేనూ మా గురువులూ గూడా వోనమాలల్లోనే ఏడుస్తున్నాం. నీ కొకమాటే డబుల్ ప్రొమోషన్ అయిందే.

మో:- అదేమిటి?

వెం:- మాదంతా టెంపొరరీ వ్యవహారం. నీవు శశాంకుణ్ణి మించిపోయినట్టున్నావు. నీవు లేవదీశావా? సిన్నే లేవదీసిందా?

మో:- ఛా! పిచ్చిమాటలు మాట్లాడకు.

వెం:- గురుదక్షిణేమైనా వున్నదా?

మోహనరావు చిన్నపుచ్చుకున్నాడు.

వెం:- గురుద్రోహివిరా! యేదో లపక దొరికింది. అంతా నీవే అరుపుకోవలెనని చూస్తున్నావు. ఎప్పటికైనా అజీర్తి పుట్టక పోతుందటలే.

మో:- నీవూ నిన్నటి రైలుమీదనే వచ్చావా!

వెం:- రైలుస్టేషనుకు వచ్చా నిన్న.

మో:- నన్ను మాట్లాడించలేదేమి?

వెం:- "మొదవుకడ నున్న వృషభముంలు, జదివిన దూనీచు కడకుం జనకుర సుమతీ" అన్నారు. అసలు నీవు పోట్ల కొడెవు. రొట్టలు వేసుకుంటూ సీ ననుభవిస్తుంటే నోరూరుతూ నే దూరంగా నిలుచుని చూచేదా?

మో:- నన్ను మాట్లాడిస్తే తప్పేమి?

వెం:- ఇంత కథ వున్నదని తెలిస్తే ఒకరినో, ఇద్దరినో పలకరించే వాడి నే. పోలీసులు వెతుకుతున్నా రేమో కనుక్కున్నావా?

మో:- వాండ్లు అందాకా పోరు.

వెం:- ఇదివరకే రోసి వదిలిపెట్టింది గాంవాలె. వీధుల వెంబడి తిరుగుతుంటే తోలక వచ్చినట్లుంది చూస్తే.

మో:- ఛా! ఛా! గడపదాటిన మనిషికాదు. ఇవ్వాళ స్కూలున్నదా?

వెం:- ఈ రోజూ, రేపుకూడా సెలవు. ఇవ్వాళ నీకోసం, రేపు మీ యావిడ కోసం ఇక ప్రతిరోజూ సెలవే!

మో:- ఉన్నదేమో చెప్పరా?

వెం:- ఏమిటా ప్రశ్న. ఎందుకుండదు? నీకు దొరికినట్టుగానే అందరికీ వుట్టవుడియంగా తలా వొకతె దొరికిందనుకున్నావా?

మో:- అయితే యివ్వాళ నే రావడానికి వీలుండదు.

వెం:- ఏమి ముంచుకపోయింది, యీ రోజు రాకపోతే? ఈ మేష్టర్లు మనకు చెపుతున్నదేమిటి? హాయిగా యింటి దగ్గర పడుకో. నేను హాజరు చెపుతాను.

భోజనానికి గంట కొట్టారు. వెంకట్రావు బలవంతపెట్టి వుండమన్నాడు. హాస్టలు భోజనం యిదే ఆఖరుగా అని చివరకు మోహనరావు వొప్పుకున్నాడు. తక్కిన పిల్లలంతా భోజనంచేసి వెళ్ళిపోయినారు. ఇద్దరూం కులాసాగా మాట్లాడుకుంటూ సావకాశంగా భోజనం చేశారు.

వెం:- ఇంట్లో వంట పెట్టించావా?

మో:- హోటలు నుంచి ౧౦ గంటలకే భోజనం వచ్చి వుంటుంది. ప్రస్తుతం వంట వ్యవహారం పెట్టదల్చలేదు.

వెం:- చిక్కులేని పని. ఇక రెండో వ్యావృత్తి వుండదు.

మో:- అంతా నీ వెూస్తరే అనుకుంటావు.

వెం:- ఇదివరకట్లాగే అనుకున్నా. ఇప్పుడు నీ యాధిక్యం అంగీకరించక తప్పదు.

భోజనం కాగానే చెరివొక చుట్టా కాల్చుకున్నారు. ౧౧ గంట లయింది. గడియారపు వలయం గణగణ లాడింది. మోహనరావు హృదయం ప్రకంపించింది. జట్కాబండి సరాసరి

మాంబళం మాట్లాడి సామానెత్తించుకొని మాంబళం బోయే వరకు వొంటిగంటపైగా కావచ్చింది. సామాను మేడకిందిగదిలో పెట్టించి చకచక మెట్లెక్కి వచ్చాడు. మనస్సు చాలాఉత్సాహంతో వున్నది. కమలమ్మను చూడవలెనన్నకోర్కె అతిశయించింది. ౫ గంటల వ్యవధి అయిదురోజులయినట్లు కనబడ్డది. తాను మేడమీదికి పోంగనే "మోహనా" అనేశబ్దం శ్రవణానందం చేస్తుందని ఉవ్విళ్లూరుతున్నాడు. కమల మేడమీద సావిట్లో లేదు. 'వెళ్ళిపోయిందేమోనని మనస్సుకు తోచింది. అయ్యంగారు తెచ్చిన అన్నం ఆపాట్లనే వున్నది. యీగలు ముసురుతున్నవి. గుండె తటతట కొట్టుకుంటున్నది. "కమలా" అని పిల్చాడు. పలకలేదు. గదిలో మంచంమీద ముసుగు బిగదన్ని పడుకున్నది. "కమలా" అని తట్టి లేపాడు. పలకలేదు. ముసుగు బలవంతంగా లాగేవరకు కోపంతో చురచురచూపులు చూచింది.

మో:-నే రావడం ఆలస్యం అయింది. అన్నం దినకుండా నాకోస మెందుకు కూర్చున్నావు ?

కమల "నీ వసలే రావనుకున్నా"నని వెక్కి వెక్కి ఏడవడం ప్రారంభించింది.

మో:- అసలే రాననుకున్నావా? ఏమైపోతాననుకున్నావు?

క:- ఈ వూళ్ళో నీ వెక్కడ నక్కితే నే వచ్చి పట్టుకుం డేది ? నిర్భాగ్యురాలను. మహదారణ్యంలో వచ్చి పడ్డాను. అడవి పాలై పోవలసిందే.

మో:- (వినమ్రుడై) కమలా! ఏమిటే ఆ మాటలు! సంగతి కనుక్కోకుండా మాట్లాడతావు. ఆడవాండ్లకు తొందరెక్కువ.

క:- వివేకం తక్కువ కూడా అను. పడక విధిలేదు.

మో:- కమలా ! క్షమించు. నే నింకా భోజనం చెయ్యలేదు. కళ్ళు తిరుగుతున్నవి. అన్నంతిన్న తర్వాత మిగిలిన శాపనార్థాలు చదివింతువుగాని, ముందన్నం బెట్టు.

మోహనరావు అగ్గి తగిలినట్లు అభినయిస్తూ పెట్టెమీద గోడకు జేరగిలబడి కూర్చున్నాడు. కమలకు కోపజ్వరం మంత్రించినట్లు తగ్గిపోయింది. లేచి "అన్నానికి రా" అని పిలిచింది. మోహనరావు అలిగి పలకలేదు.

క:- ఇంకా బెదిరింపు గూడానా? నాదే తప్పౌలే దయ చెయ్యండి.

మోహనరావు యెండదెబ్బ దగిలిన మొఖం పెట్టాడు. అలిగిన కుర్రవాడివలె అందంగానే వున్నాడు. చన్నీళ్ళు పెట్టి ముఖం కడుక్కునేవరకు మంచు బిందువులు గప్పిన చంద్రమండలంవలె ప్రకాశించింది. తడిసి కుచ్చులు గట్టిన లేత మీసములు ముఖ కమలమునుండి వెలువడే బాలచంచరీకముల నిగనిగలను మించిపోయినవి. కమలమ్మయొక్క కోపతమస్సును మోహనరావు ముఖ చంద్రికలు తరిమివేసినవి. ఉభయులూ యేకపాత్రలో భుజిస్తున్నారు.

క:- నీవు తినకుండా అన్నమంతా నామీద తోసివేస్తున్నావు.

మో:- వేళ తప్పడంచేత మొఖం కొట్టింది. వడదగిలినట్లు బడలికగా వున్నది.

క:- వేళ తప్పిందాకా వుండడమేమి? అబ్బాయీ! నీ కిదే చెపుతున్నాను. నేనొక్కదాన్నీ వుండలేను. నీవు లేకపోతే సాహు జ్ఞాపకం వస్తాడు. ఇందాక మేడమీదనుంచి కిందికి చూచేవరకు సాహు తాషాబండి లాగుతున్నట్టు మనస్సుకుతట్టాడు. నా కదిచూచి భరించలేక ఆత్మహత్య మేలనిపించింది.

మోహనరావు ఆకలీ, రుచీ, గమనం లేకుండానే భోజనం చేస్తూనే వున్నాడు. మనస్సు ఆలోచనకింద మునిగిపోయింది. హృదయాకాశం విచారమనే చిరుమబ్బులు గమ్మి మోము టద్దంలో ప్రతిబింబిస్తున్నది. భ్రూలత గాలపు టూచవలె కదులుతున్నది. స్కూలుకు పోకపోతే రోజులు చాలవు. యీ సంగతి

కమలకు చెప్పినమాత్ర మేమిప్రయోజనం ? ఆమెకు విచార మెక్కువవుతుంది. మోహనరావు యెదుట లేకపోతే తాను నిలువలేనని యథార్థం చెప్పింది. పిల్లవాడిమీది మరులెట్లాపోతవి? రోజులమీద యెట్లా మారుతుందో చూదామనుకున్నాడు. ప్రస్తుతం "ఓ చదువా! భద్రమస్తు భవతే" అని అనక తప్పదని నిశ్చయించుకున్నాడు.

క:- మోహనా ! నా మనోవ్యథ నే చెప్పాకున్నాను. నీకు సంతాప కారణమవుతుందని యెరుగుదును. నీకంటె నాకు దిక్కెవరు ?. నీవు చింతపడవద్దు. నీ ముఖ చంద్రబింబాన మబ్బు గప్పింది. నే జూచి భరించలేను. నన్ను విడిచి నీవు ౫ గంటలున్నావు. నీకనేక స్నేహితులున్నారు. ఈ సంగతంతా జరగనట్టుగానే భావించి వారు సంచరిస్తారు. నాది దుర్గతి నాకు నీవుతప్ప యితర ప్రపంచం లేనట్టే. నేను ప్రపంచానికీ లేను. యిది సంఘముయొక్క దురంతం. అవివేకుల దుర్నీతి. మగవాండ్ల కొక ధర్మం, ఆడవాండ్ల కొక ధర్మం. సంఘం యొక్క ఈ క్రూరధర్మానికి నేను బలి అయినాను. ప్రపచం నా కంధకారమయం. నేను దానికి మృత్యురాలి కింద నే లెక్క. నీ వొక్కడవే నాకు చేయూత. నీవే నాకు ప్రపంచం. సర్వబంధువులు నీవే. యీ నా మనోవ్యథ నీకు దెల్పి నీ మనస్సు నొప్పించడం నా కిష్టంలేదు. కాని నే నాపుకోలేక పోయాను. క్షమించు.

మోహనరావు తల వంచాడు. చేతులు మొగాన గప్పుకొని కూర్చున్నాడు. క్షణ భంగురమైన ఆనందానికై తాను జేసిన దుష్కార్యం యొక్క ఫలిత మెంతవరకు పోతుందో యిదివరకు స్ఫురించ లేదు. కమలమ్మయొక్క భావిస్థితి కష్టభూయిష్టమని పొడగట్టింది. ముందు తా నేమి చేయవలెనో తన వర్తన తన జీవితాన్ని యెట్లా మారుస్తుందో, కమలమ్మ విషయంలో తన కెట్టి ధర్మాలున్నవో యిదివరకు గుర్తించ లేదు ! తానింత వరకు వివాహం చేసుకోలేదు. శాశ్వతంగా కమలమ్మతో నుండడమా, నడుమ విడువడమా ! కమలమ్మ కొరకు తానింత

త్యాగం చేయవలసి వస్తుందని యింతవరకు గ్రహించలేదు. కను వేదురుచేత శలభాలవలె వుభయులూ దూకారు. మాడి నశించడమా, బైట పడడమా?

కమలమ్మయొక్క ఆర్తనాదం ప్రబోధం కలిగించింది.

క:- మోహనా! నే నెంత తెలివితక్కువ పని చేశాను? ఈ ఆలోచన లన్నీ యిప్పుడు మన కెందుకు? వరదలో పడ్డాం. కొట్టుకొని పోతున్నాం. కావలసిన దేమో అయింది. గత జలసేతు బంధన మెందుకు?

మోహనరావుకు యేమీ తేలలేదు. యిద్దరూ ప్రవాహంలో దూకారన్న మాట వాస్తవంగానే తోచింది. కమలమ్మకు నేల కాలికి తగలడంలేదు. గట్టు కనబడడంలేదు. మోహనరావుకు మాత్రం గట్టు అందికలోనే వున్నది. నేల కాళ్ళ కింకా తగులుతునే వున్నది. లోతు నీళ్ళలో కింకా పోవడమో లేదో నిర్ధారణ కాలేదు.

క:- మోహనా! మజ్జిగ పోసుకోవా?

మో:- వట్టి మజ్జిగదాహం తాగుతా. (ఉభయులూ చేయి కడుక్కొని పడుకున్నారు.)

## ౧౪

## అమ్మకు అపవిత్ర తెక్కడిది?

మోహనరావుకు మనోవ్యాకుల మేర్పడ్డది. కళాశాలకు వెళ్ళవలసిన రోజులు చాలనందున పరీక్షకు పెట్టించలేదు. అందుచేత స్కూలుకు వెళ్ళడం బొత్తిగా మానివేశాడు. ఉత్తరాలూ, మనిఆర్డర్లూ హాస్టెలుకు వస్తుండేవి. వెంకట్రావు మాంబళంకు పంపిస్తూ వచ్చాడు. ఇంటి దగ్గరనుండి వచ్చే డబ్బు యింటి అద్దెకు చాలటం లేదు. కొన్ని పెద్ద నగలు అమ్మివేశారు. ఉభయులకూ మొదటిరోజుల మోజు తగ్గిపోయింది. మొదటి రోజులు గడియలై పరుగెత్తి పోతుండేవి. యిప్పుడు గడియలు

రోజులుగా పట్టి నెడుతున్నారు. కాలక్షేపం జరగడంకోసం పచ్చీసూ, చదరంగమూ ఆడుతుండే వాండ్లు. ఉత్తరాదినుంచి వచ్చిన వొక యాయవారపు బ్రాహ్మడు మధ్యాహ్నం వచ్చి పురాణం చెబుతుండేవాడు. జమదగ్ని మహర్షి ఆడవాండ్లకోసం చెప్పులూ, గొడుగూ సృష్టించాడని శాస్త్రిలుగారు పురాణంలో చెప్పినందున కమలమ్మ చక్కని జోడూ, పట్టుగొడుగూ తెప్పించుకొని మోహనరావుతో సాయంత్రం షికారు వెళ్ళు తుండేది. ఏదో విధంగా రోజులు గడుపుతున్నారు గాని మొదటి వుత్సాహం ప్రయత్నించినా రావడంలేదు. స్కూలు మానివేసి మోహనరావు యింటి దగ్గరనే వుండడంచేత పరీక్ష పోయిందనే తప్ప కమలమ్మకు వేరు విచారం లేదు. "తన భావిస్థితి యేమి? తన కర్తవ్య మెద్ది?" అనే ప్రశ్నలు మోహనరావును హృదయ శల్యాలై బాధిస్తున్నవి. అహోరాత్రాలూ యోచించినా జవాబు దొరకలేదు. యోచించినకొద్దీ దూరమైంది. ఆలోచనలో పడ్డదీ, అడుగున పడ్డదీ తేలదు. వివాహం మానుకొనడం, బంధువులను త్యజించడం కష్టంగా తోచింది. కమలమ్మ దగ్గరబంధువులు కావడాన్నిబట్టి సంగతి వెల్లడైతే యెక్కువ అపకీర్తి పాలవుతానని భయపడ్డాడు. తాను విడిచిపెడితే కమల అధోగతిపాలవుతుందని మనసు బాధిస్తున్నది. ఏమీ నిర్ధారణ చేసుకోలేక పోయాడు. ఇదివరకు పువ్వుల రంగడులాగ తిరగడం తప్ప లోకానుభవం యెరుగడు. నెలలు గడిచిపోతున్నవి. ఉన్న బంధం చాలక కొత్త బంధంకూడా తయారవుతున్నది. కమలకు నెలరోజుల నుంచీ వంట్లో ఖులాసాగాలేదు. చాలాచిక్కిపోయింది. ఒళ్ళు కాగుతున్నది. క్రమంగా డోకులు అణిగినవి. మనిషి పాలిపోయింది. నీరుపట్టడం ప్రారంభించింది. సౌందర్యం యినుమడించింది. శాస్త్రిలుగారు వొడ్డాణం తీసివేయమని చెప్పారు. ఆయన భార్య సందేహం లేదు, నిజమే నన్నది. కమలమ్మకే తిరుగుతూ వున్నట్లు గోచరమైంది. అవసరమైనప్పుడు శాస్త్రిలు గారిభార్య సహాయం చేస్తానన్నది.

పరీక్షరోజులు దగ్గిరకు వచ్చినవి. మేనమామ తొందర పడుతున్నాడనీ, ౨౦ యెకరాల మాగాణి వివాహకాలంలో చదివిస్తాడనీ, అటువంటి పిల్ల దొరకదనీ, ౧౦ రోజులు సెలవు తీసుకొని రావలసిందనీ మోహనరావు అన్న ఉత్తరం వ్రాశాడు. పరీక్షలు దగ్గరకు వచ్చినవి గనుక ప్రస్తుతం రా వీలులేదని జవాబిచ్చాడు. పరీక్షలు కాంగనే వివాహం చెయ్యడానికి లగ్నం పెట్టారని వుత్తరం వచ్చింది. పరీక్షలు వారంరోజు లున్నవనగా మోహనరావు అన్న రాజారావు సెలిమం దెత్తించుకొని చెన్నపట్నం వచ్చి సాహుకారు పేటలో దిగి కళాశాలకు ౧౧ గంటలకు వెళ్ళాడు. మోహనరావు కనపడలేదు. గుమాస్తాను విచారిస్తే అతడు ౨ నెలలనుంచి బడికి రావడంలేదనీ, జీతం యివ్వలేదనీ, పేరు తొలిగించారనీ చెప్పాడు. హాస్టెలుకు పోయి విచారిస్తే ౬ నెలల క్రిందనే గది వదిలిపెట్టినట్టు తెలిసింది. వెంకట్రావు నడిగితే తానేమీ యెరుగనన్నాడు. జాడ తెలిస్తే తెలుపుతానని పతా తీసుకున్నాడు. అంతట యేమీ తోచక యీ సంగతి బైట బడితే మనువు తిరిగిపోతుందని భయపడి రహస్యంగా రాజారావు జాడాలు తీస్తున్నాడు. ఏమీ ఆచోకీ చిక్కలేదు. ఒకరోజు మోహనరావు యెవతెనో పెట్టుకొని మాంబళంలో వున్నాడని ఆకాశరామన్న వుత్తరం రాజారావుకు వచ్చింది. మాంబళంలో యెక్కడ గదులువిచారించినా విద్యార్థులెవరూ లేరన్నారు. కమలమ్మ మేడమీందనుంచి మోహనరావు పోలికలుగల మనిషి యెదటింటివాకిట్లో మోహనరావనేపిల్లవాడద్దెకున్నాడా అని అడగడం విని మోహనరావునుపిలిచింది. అతడుచూచి చాటుకుబోయినాడు. కమలమ్మ తన్ను గుర్తుపడతాడేమోనని భయపడి శాస్త్రిలగారి భార్యను కిందికిపంపి యిక్కడకూడా అడిగితే లేడని చెప్పమన్నది. ఆయన వీధిలో యెవరినో యీ మేడలో యెవరున్నారని అడిగాడు. కమలమ్మకు ప్రాణములలో ప్రాణములు లేవు. యెవరో జమీందారు డున్నాడనే జవాబు వినపడ్డది. ఆయన విచారించకుండానే వెళ్ళిపోతున్నాడు. కమలమ్మకు మనస్సు స్తిమితపడ్డది

గాని, మోహనరావుకు మనఃక్లేశ మెక్కువయింది. వెంకటరావే కొంటెతనం చేసివుంటాడని అనుమానపడ్డాడు. 'నీ చర్య బాగా వుండలేదు. వెంటనే బయలుదేరి తత్క్షణం సాహుకారుపేటకు వచ్చి తనతో మాట్లాడకపోతే అమ్మను రమ్మని టెలిగ్రా మిస్తా' నని రాజారావు మామూలు ఎడ్రెసుకు వుత్తరం వ్రాశాడు. ఆ వుత్తరం వంకబెట్టుకొని వెంకట్రావు మాంబళం వచ్చి మోహన రావు లేని సమయంలో కమలమ్మకు జాబిచ్చిపోయినాడు. మోహనరావువచ్చి వుత్తరం చదువుకొని కల్లోలపడుతున్నాడు. "సంగతు లేమి? వుత్తరం యెవరు వ్రాశారు?" అని కమలమ్మ తరిమి అడిగింది. చదివి అర్థం చెప్పాడు. ఏమి చేయడానికీ ఆలోచన పోలేదు.

క:- ఏవిధాన చూచినా మీ అన్నగారికి కనుపడి మాట్లాడడం వుత్తమంగా కనబడుతూవున్నది. నేను ఫలానా అని తెలియనియ్యవద్దు. అత డిక్కడికి రావడం క్షేమంగాదు. యోగ్యులకు కాపురం మార్చుకొన్నామని చెప్పు.

మోహనరా వాలోచించాడు. మెరుగైనది మరొకదారి కనబడలేదు.

మో:- పోవడమే మేలని నాకూ తోస్తున్నది.

క:- నీవు జాప్యపు మనిషివి. ఆలస్యమైతే నీవు రావని యింటికి టెలిగ్రా మిస్తాడేమో? వెంటనే వెళ్ళు.

మో:- నే రావడ మాలస్యమైనా అన్నం రాంగానే నీవు భోజనంచెయ్యి. పెంకెతనం మాను.

క:- మోహనా! యింతేచూసా—న న్నేమిచేసిపోతున్నావు?

మో:- నీ వెప్పుడూ వొకటే మాస్తరు. ఇంత అమాయకురాలివి ప్రపంచంలో యెట్లా జీవిస్తావే?

మోహనరావు మేడమెట్లు దిగి వెళ్ళుతున్నాడు. వీధిలోకి అడుగుపెట్టాడు. మనస్సు కలుక్కుమన్నది, వుయ్యాల లూగింది,

సుడిదిరిగింది. రైలు తప్పుతుందేమోనని నెట్టుకొని పరుగెత్తు
తున్నాడు. కమలమ్మ మేడమెట్లమీద నిలిచి చూస్తున్నది.
మోహనరావు మూల దిరిగాడు. దృష్టిపథంలోనుంచి అదృశ్యు
మైనాడు. కమలమ్మ చూస్తూ నిలుచున్నది. ఎండ తీక్షణంగా
కాస్తున్నది. గాలి వేడెక్కింది. ఎండమావులు ప్రవహిస్తున్నవి.
కాని పూలచెట్లన్నీ యెండిపోయి ఆవరణం పాడుగొట్లాడుతున్నది.
కాకులు సంచరించడంమాని గుబురుచెట్లల్లోవాదిగి హీనస్వరంతో
కూస్తున్నవి. నవరంగులు సుడిపడి రెమ్మలలో అదృశ్యమైనవి.
కమలమ్మ యింకా చూస్తూనే నిల్చున్నది. ఏమీ కనబడడం
లేదు. జగత్తుమిథ్యఅయింది. టపటపమని తాషా వినబడ్డది.
సాహు బండిలాక్కొని మేడ మెట్లదగ్గరకు వచ్చాడు. ఓయమ్మా—
అని సింహపుపిల్లను చూచిన లేడిపలె తలుపులు వేసుకొని గదిలోకి
పరుగెత్తింది కాని అవి అతనిని అడ్డలేదు. తలుపులలోగుండా బండి
తోసహా వస్తున్నాడు. గోడల్లోనుంచీ అతడే వచ్చాడు. గదినిండా
తాషాబండ్లే. మనసు యెన్నిమైళ్ళు పరుగెత్తినా ప్రపంచమంతా
తాషాబండ్లమయమయింది. కాలుపెట్ట సందులేకుండా అక్షౌహి
ణీల తాషాబండ్లు దిగినవి. ఓయబ్బా—యెంతమంది సాహు
లున్నారు! బండికొక సాహు లాగుతున్నాడు. టపటపలకు దిక్క-
టాహాలు బద్దలవుతున్నవి. కమలమ్మ తప్పించుకొనే ప్రయత్నం
మానివేసింది. ఒకసాహు మంచంమీద కెక్కాడు. ఒకడు
పొట్టమీద పడుకొన్నాడు. ఒకడు కమలమ్మ కాళ్ళమీద
వుయ్యాల లూగుతున్నాడు. కమలమ్మ సాహుకు అపవిత్రురాలు
కాదా! అమ్మకు అపవిత్రతెక్కడిది?

మోహనరావు సాహుకారు పేటపోయి రాజారావును
కలుసుకుండేవరకు నాలుగు గంటలయింది. మోహనరావు రావ
డం రాజారావు పొడగట్టి గదిలో విచారపడుతున్నట్టు కూర్చు
న్నాడు. పాఠంరాని పిల్లవాడు పంతు లెదటబడ్డట్టు పిల్లెడుగులు
వేస్తూ గదిలోకి వచ్చాడు. ఉరుముల మెరుపులతో వాగ్వర్షం
కురుస్తుం దనుకొన్నాడు. రాజారావు గంభీరించి పూడుకొని చెలి

గ్రాం చేతి కిచ్చాడు. "వుత్తర మందింది. మీ అమ్మకు మరణ మాసన్నమైంది. కొడుకులను చూడవలెనని కోరుతున్నది. వెంటనే బయలుదేరండి" అని చదువుకున్నాడు.

మో:- ఉత్తర మేమని వ్రాశావు?

రా:- ఇక్కడి వ్యవహారాలను గురించి మాత్రమే వ్రాశాను. నీ కామెయందు ప్రేమ లేకపోయినా ఆమె యింకా పట్టుకొని పాకులాడుతున్నది. నీకోసం ప్రాణా లుగ్గపట్టుకొనే వున్న దనుకొంటాను. రేపు నాకు అపీలువాయిదాగూడా వున్నది. అదేమైనా సరే పోదల్చుకొన్నాను; నీవుకూడా బయలుదేరు.

మో:- నేనా——

రా:- అవును. నీవే. నీవు మోహనరావువేనా?——(అని రాజారావు భీష్మించుకొని కూర్చున్నాడు.)

కష్టనిష్ఠూరాలు చెప్పకున్నా వినేటట్టు లేదు. కదిలిస్తే తొడుగంతా కదులుతుందని మోహనరావు భయపడ్డాడు. తల్లి చావుబతుకులతో వున్నదని టెలిగ్రాంవస్తే వుంచుకున్న దొక్కతే వుండలేదని సాకు చెప్పడం హాస్యాస్పదంగా దోచింది. హాస్యాస్పదమేగాదు; అమానుషచర్యంగా గనుపడ్డది. చెప్పిరావడానికి వ్యవధిలేదు. ఉదయం బండికి పోతే చూపందదేమోనని సందేహంకలిగింది. జేబులోనుంచి కార్డుదీసి వూటకలంతో సందర్భాలు కమలమ్మకు వ్రాసి పోస్టులో వెయ్యడానికి జేబులో పెట్టుకొని రాతివిగ్రహంవలె నిశ్చంచలుడై కూర్చున్న రాజారావుతో "వేళయింది, పోదాంలే" అన్నాడు.

రా:- రైలుకు వొక్కణ్నే పోగలను. తోడవసరంలేదు.

మో:- ఊరికి పోదాం.

ఉభయులూ జట్కాబండెక్కారు. ఒకరితో వొకరు మాట్లాడలేదు. స్టేషన్‌కు బోయేవరకు అయిదైంది. రాజారావు టికెట్లు తీసుకొనేందుకు వెళ్ళాడు. మోహనరావు యింతలో

సందు చేసుకొని జాబు వుత్తరాలపెట్టెలో వేసి టిక్కెట్లు తేంగానే ముక్కుతాడు పోసిన పోట్లకోడెవలె వెంటపోయి రైలెక్కాడు.

కమలమ్మ సాహసమయ ప్రపంచంలో పడివున్నది. క్రమంగా దాని కలవాటు పడుతున్నది. ఎవరో తలుపు కొడుతున్నట్లు నాదుగా వినబడి చివాలున లేచికూర్చొని చెవియొగ్గి విన్నది. "అమ్మాయి కమలమ్మా" అని మళ్ళీ వినబడ్డది. కమలమ్మ "వస్తున్నా" అని లేచి తలుపు తీసింది. రామశాస్త్రి పురాణం చెప్పడానికి వచ్చాడు. కమలమ్మకు కొంతవిరామం కలిగింది. ఉభయులూ బల్లదగ్గర కూర్చున్నారు.

రా:- అబ్బాయి లేనట్టేనా? మనం పారాయణం ప్రారంభింతామా? అహల్యాశాపవిమోచన ఘట్టం యీరోజు పూర్తి చేతాం.

క:- చిత్తం అలాగే కానివ్వండి.

అంతట వెనుకటి పట్టునుంచి మొదలుపెట్టి అర్థంచెపుతూ,

శ్లో. తపోబలవిశుద్ధాంగీం గౌతమస్య వశానుగామ్,
గౌతమోఽపి మహాతేజా అహల్యాసహితః సుఖీ.

అని శాపవిమోచన ఘట్టం పూర్తిచేసి శాస్త్రి స్వస్తిచెప్పాడు. కమలమ్మ చెంపన చెయి పెట్టుకొని వింటూ కూర్చున్నది. మామూలు ప్రకారం ప్రశ్నలేమీ అడగలేదు. స్వస్తి చెప్పిన తర్వాత కూడా అట్లాగే కూర్చున్నది.

శా:-అమ్మా! రోజూ వున్నట్టు లేవు. ఇవ్వాళ నువ్వు రామాయణం విన్నట్టే లేదు.

క:- (చెంప చెయిదీసి చప్పరించి) రోజులికంటె యీ దినమే బాగా విన్నాను.

శా:- నీవు వట్టి మనిషివికూడా కావు. మనోవ్యాధికి మందు లేదని-వ్యాకులపడుతూ కూర్చుంటే జబ్బు చేస్తుంది.

క:- మనోవ్యాధికి మందేలేదా?

శా:- నీవు అడిగితే జ్ఞాపకం వచ్చింది. "కిమౌషధం పృచ్ఛసి మూఢ దుర్మతే, నిరామయం రామకథామృతం పిబ" దైహిక మానసిక వ్యాధులన్నీ కుదుర్చేది రామనామమే.

క:- అహల్యకు రామమూర్తి ప్రసాదించింది శాపమోక్షణమా లేక పాపమోక్షణం కూడానా ?

శా:- పాపవిమోచనం కాందీ; శాపవిమోచనమెలా అవుతుంది ? పాపఫలమే శాపం.

క:- అయితే రామదేవుడు పాపాన్ని హరిస్తాడన్న మాట మాటే.

శా:-ఆఁ. తప్పకుండా హరిస్తాడు.

క:- ఎట్లా హరిస్తాడు.

శా:- భీష్ముడొక్క పరమస్మృతి చెప్పాడు. విను.

చ. దురితముఁ జేసి తాపమునఁ దూలిన నిం కిటు చేయ నన్మతిం
బొరసిన ధర్మ సంచరణ బుద్ధియ మేలని యాఁదినం గ్రియా
పరుఁడయి మేలు సేసినను బాదము పాదముగాఁ గ్రమంబునన్
విరియు సమస్తముం దదభిపిష్ట కళంకము నిశ్చయంబుగన్॥

చ. నరవర ! వాసవుం డడిగినన్ గురుఁ డిట్లని చెప్పె బుద్ధితో
బొరయనిపాతకంబులు సబుద్ధిక పుణ్యముల న్నశించు నం
బరమునఁ బట్టినట్టి మలపంకము గారములోన నద్దగా
విరిసినయట్లు నమ్ము మిది—వేదము చెప్పిన నేను జెప్పితిన్.

సబుద్ధికములూ, అబుద్ధికములోనైన పాపాలు వరుసగా పైన జెప్పినట్లు నశించగలవు. అహల్యా సంక్రందను లీవిధంబుగానే పాపములం బోగొట్టుకున్నారు. ఇది రామదేవుని కృపచేతనే లభించగలదు. గోపాల మంత్రపఠన మాత్రమున నే సర్వపాపములూ హరిస్తవి.

క:- చేసినపాపం చెపితే పోతుందంటారే. మా పాపచరిత్రం తమరువిన్నారా ?

శా:- అమ్మా! మోహనరావువల్ల విన్నాను. ఇక నీవు చెప్పనవసరం లేదు.

క:- అయ్యా! తమరు దేవుడివలె వచ్చారు. పాపం ఆపిల్లవాడికీ తరుణోపాయం కలుగుతుందా?

శా:- మోహనరావుకూ తరుణోపాయం చూపిస్తాడు.

క:- అయ్యా— రామదేవుడికి పాపిష్టులయం దెంత దయ!

శా:- (కన్నీళ్ళతో) అమ్మా— తనబిడ్డలను బాగుచేసుకోవడం రాముడికిమాత్రం ధర్మంగాదా? గడ్డిపోచనుసహా పెంచుకొనే నేను మనుష్యులను వదలిపెట్టుకుంటానా?

క:- ఆహా— రాముడివా నీవు! రామా, నారామ!—(అని మూర్ఛిల్లినది)

కమలమ్మ కొంత వడికి మూర్ఛ తేలింది. బ్రాహ్మణుడు కనపడలేదు. సాహు పీకె నూదుతూ నెమలిపురిం జెవురుకొని బాలకృష్ణుడు యశోదం జూచినట్లు చూస్తూన్నాడు. ఇల్లంతా బాలకృష్ణ మయమై పోయింది. సాహు మునుపటివలె భయంకరుడుగాక ఆనందమయు డైనాడు.

కమలమ్మ సాహుకృష్ణు నెత్తి అలుముకొని మంచంమీద పడుకోబెట్టుకున్నది. సాహు పీకె వూదుతూ పడుకున్నాడు.

## ౧౫

పోటకం

తెల్లవారుతున్నది. జగన్నాటక సూత్రధారి, రంగం మార్చివేస్తున్నాడు. రిక్కగముల మక్కవవిటకాడు విచ్చలవిడి నుప్పర వీధిన సంచరించి పాండువపుట్టి క్షీణించి నిష్క్రమించాడు. రంగాధిపతి జగన్మోహనమైన కావిజననిక మెత్తాడు. నేపథ్యాధిపతి తన చిత్రనైపుణ్యమును వెలిబుచ్చుతూ జగజ్జేగీయమానమైన ధగధగ కాంతులతో దిననాయక పాత్రను ప్రదర్శించబోతున్నాడు. లోకబాంధవుని రాక నెరిగించుటకోయన

ప్రణిధులవలె కెరటములు పట్టణమువైపు పరుగెత్తుతున్నవి. దృష్టి దీయుటకు పళ్లెంలో వుంచిన యెర్రనీళ్ళవలె అంబుధి అరుణిమ గాంచింది. తూర్యఘోషము ననుకరించుతూ సముద్రఘోష మిన్ను ముట్టుతున్నది. సహస్రకరుడు తెర బయటికివచ్చి రంగంలో ప్రవేశించాడు. భారతరాజ్యలక్ష్మి సూర్యభగవానుని పత్రపుష్ప ములతో పూజచేసి మందసమీరముల కుసుమ సౌరభమున ధూపం సమర్పించింది. సముద్ర తరంగాలు సప్తపర్ణముల నివాళి దీపములనూ, సహస్రకరముల కనంతములైన కంకణములనూ సమర్పించినవి. జలచరములు స్వాదుజలములం ద్రావి, జీవనప్రదా తను కీర్తిస్తున్నవి. కుజంబులం గువకువ రుతంబులతో పక్షిసంజాత ములు పక్షిసారథిని పొగడుతున్నవి. సృష్టి అంతా సూర్యభగవా నుని రాకకు ఆనందిస్తున్నది. కమలమిత్రుని యాగమనముచే రంగుల మేడలో కమలాహృదయకమలవినిర్గతమై మధురగీతము వెలువడినది.

కీర్తన

హిందుస్తాని - తోడి.

జీవనవల్లభా - త్వం దీనశరణా త్వంహి దీనశరణ-
ప్రాణినాం ప్రాణస్త్వంహి ప్రాణరమణా ॥జీ॥

౧. సదానంద శివత్వంహి శంకరశోభనా -
సుందరయోగిజన చిత్తవిమోహన ॥జీ॥

౨. భవార్ణవపారహేతుత్వం హేకర్ణధారీ -
దుర్దమ పాపతాప—శోకభయహారీ ॥జీ॥

౩. త్వంహి మమ ప్రాణనాథ - త్వంహి మమ ప్రాణ -
త్వంహే దయామయ దేవ కరుణానిధాన ॥జీ॥

౪. తవైవ ప్రసాదప్రభూ - హేజీవనాధార -
జయజయ కృపామయ - మహిమా తవైవ ॥జీ॥

పోస్టాఫీసు జవాను:- అమ్మామ్మ వుత్తరమండీ!

కమలమ్మ కాగ్దుదీసుకొని యెవరిదగ్గరనుంచి వచ్చిందో చూచింది. పేరుచూచి చదువుకొనడానికి సందేహించింది. అతని భావములెట్లున్నవో తెలుసుకొందాం మనుకున్నది. తల్లి జబ్బు సంగతీ, తాను చెప్పకుండా పోవడానికి కారణం తెలియపరుస్తూ దిగులుపడవద్దనీ సాధ్యమైనంత త్వరలో వస్తాననీ వ్రాశాడు. ఉత్తరం బల్లమీద బెట్టింది. ఎడమచేతితో కణతలు పట్టుకొని కుర్చీలో కూర్చున్నది. మనస్సు మరల ధ్యానముఖ మయింది. అత్యంతమైన యేడుపు వచ్చింది. రామశాస్త్రి జ్ఞాపకానికివచ్చాడు. డగ్గుత్తికతో "రామా! నీవు రాముడివా? తండ్రీ! యీ పాపుల యందు నీ కెంతదయ! తల్లీ! భువనమాతా! లోకప్రపూతా! సీతా! నీపవిత్రనామాన్ని వుచ్చరించడానికి నాకర్హతేది? సీతా రాములూ! నన్ను క్షమించమనడానికి నాకు యోగ్యతేదీ? నే నర్హురాలిని గాను. అయ్యో! రామానాయుడుగారూ! మీ కెంత ద్రోహం చేశాను? సారంగధరుడవే, ప్రహలాదుడవే, పరస్త్రీలను నీశరీరమునంటనీయవే, పరస్త్రీలను ద్రోహబుద్ధితో కన్నెత్తిచూడవే, నీ మన స్సెంత ఖేదపడి వుంటుందో. నీ పత్నీవ్రతానికితోడు నీ కొక పతివ్రత లభించకపోయెనే. ఈపాపి నీ కేల తటస్థపడ్డది? నీ కులగౌరవములకు హానిదెస్తినే రామా! శ్రీరామా! ఈ పాపమును భరించ లేను. ఈ మనోవ్యధ పడలేను. ఇశ్శో! రామా! ఓయిరామా! అబ్బా! యేమి యీతాపం, రామా! నీ సన్నిధికి తీసికొనిపో. తీసికొనిపోతావు. నీవు దయామయుడవు. నీవు తీసుకొని పోకపోతే నేనే వస్తా" నంటూ దృఢనిశ్చయంతో లేవ నుంకించింది. కడుపులో చరున కదిలింది. రామశాస్త్రి అంతర్ధానమైనతరువాత మళ్ళీ కనబడలేదు. సాహు తొపాబండి లాగుతూ వచ్చాడు. పీకె చెవులు గింగురు మనేటట్లు వూదాడు. పమిటకొంగు పట్టుకొని లాగి కూర్చోబెట్టాడు. కుర్చీమీదికెక్కి తొడమీద కూర్చొని ముఖాని కడ్డంపెట్టుకొన్న చెయిదీసి కిలకిల నవ్వాడు. కమలమ్మ హృదయతాపం శమించింది. ఆవేదన అణిగింది. మనస్సు స్తిమిత పడి చూస్తూ కూర్చున్నది. సిగలో చెవురుకొన్న నెవలికండ్లు

కమలమ్మముఖాన సోకినవి. మూర్ఛ మాఘ్రాణించింది. భోజనం తెచ్చిన అయ్యంగారు సాహువలె వున్నాడు. సాహు, కమలమ్మ దగ్గర కూర్చొని భోజనం చేశాడు. ఈ విధంగా రోజులు గడుస్తున్నవి.

ఒకరోజు విశేషశ్రమ లేకనే పాపఫలం జారిపడ్డది. మూడు మూర్తులూ మోహనరావే. కమలమ్మ చూడడానికి లజ్జపడ్డది. పెరియముత్తు చాలా సహాయం చేసింది.

కమలమ్మ తన విలువగల చీరెలన్నీ దానికూతురు కిచ్చింది. నగలన్నీ కర్చైపోయినవి. రెండువందల రూపాయిల రొక్కం మాత్రం మిగిలింది. ఆ పెద్దమేడకు యింకా వొక నెలవరకూ అద్దె ఖరారునామా వున్నది. పెరియముత్తు ప్రతిరోజూ తోడుపడుకుంటున్నది. తరువాత వూరంతా పోటకాలు ముజ్జిడ్డుగా వుండడం చేత పెరియముత్తు భయపడి రాత్రులు రావడం మానివేసింది. పిల్లవాడికి పులికె తగిలినట్లున్నది. వేసిళ్ళజ్వరమేనని పెరియముత్తు పగలుకూడా రావడం మానింది. ఆదివారం సాయంత్రం వెంకట్రావు చక్కగా షోకుచేసుకుని కమలమ్మను చూడడానికివచ్చాడు. ఆ ఘాటున గుర్తుపట్టలేదు. తలవెంట్రుకలు చాలాభాగం వూడిపోయి మిగిలినవి అంటగట్టినవి. దేహసంస్కారాలు మానిసేసింది. నడికట్టు వేసుకోకపోవడం చేత కొంచెం పొట్టవూదింది. మనిషి నాదారి. కణతలూ గవదలూ లోపలికి పోయినవి. ముఖమంతా పాలి కళాహీనమై చెక్కిళ్ళు యెండిపోయినవి. తనరూ, పసులకూ ఇష్టుపుగా పరిణమించిన సౌందర్యం వెలిసి సృష్టిసౌందర్యంలో లీనమైంది. మనిషిపడిపోయినా భగవానుని పాదములకడ బడ్డది.

వెంకట్రావు:- కమలా! మోహనరావుదగ్గరనుంచి వుత్తరం వచ్చింది. వాడెంత దుర్మార్గం చేశాడు! యిప్పుడు నీకు దిక్కెవరు?

క:- దీనులకందరికీ దిక్కైన భగవానుడే నాకు దిక్కు. పాపం! అతనుచేసిన దుర్మార్గం యేమున్నది?

వెం:- తమవాండ్లు తనకు బలవంతంగా వివాహం చేస్తున్నారట. తనకు స్వతంత్రంవస్తే నిన్ను వచ్చిచూస్తాడట.

క:- వివాహం చేసుకోవడం న్యాయమే. నా కెంతో సంతోషంగా వుంది.

వెం:- నీకు పోషణ నే చేస్తాను. మాయింటికి నేనే పెద్దను.

క:- భగవానుడే నన్ను పోషిస్తాడు. అయ్యా! మీరు పోషించవలసిన వాండ్లను చక్కగా పోషించి మీ ధర్మం మీరు నెరవేర్చుకోండి.

వెంకట్రావు మారుమాటాడక "కారణమేమి చెప్పుమా. బంగారుచాయంతా పొట్లిపోయి చావుకళపడ్డది. యెందు కిది? దుర్భ, దీని దగ్గ రేమున్నది? చెక్క పేడయుంది. మనిషి చేపవలె యెండినా ముఖాన లమాషాకాంతి యేర్పడ్డ" దనుకుంటూ వెళ్ళిపోయినాడు.

సాయంత్రానికి పిల్లవాడికి జ్వర మెక్కువై కమలమ్మకు కూడా వొళ్ళు ఫులకరించింది. ఊరంతా పోటకం అల్లుకున్నది. ఊరిజనం సగం లేచిపోయి నెలవుల వెంబడి తక్కిన పేటలలో ప్రవేశించారు. ప్రతివాండ్లకూ సల్లపోత. కూసీవైద్యులు రోగులను స్నానాలు చేయిస్తుంటే "యీరోగానికి మందులేదు. కూసీవైద్యం చేయవ" ద్దని మ్యునిసిపాలిటీవారు వుత్తర్వుచేశారు. అందరికీ పొడిపిల్లు వేయిస్తున్నారు. వేసినవాళ్ళకల్లా నిండుపోత పోస్తున్నది. ఇంటికి నలుగురూ, అయిదుగురూ మంచాలు పడుతున్నారు. పోసినవాళ్లు చాలామంది జాయాకావడమే. పోసినవాండ్లకూ మళ్ళీ పోయడంచేత వాహకులు రావడం మానవేశారు. కొన్ని యిండ్లలో పారవేసేవాండ్లు లేక శవాలు ముదిగి కంపుకొడుతున్నవి. కొందరికి అట్టపోతపోసి నొళ్ళంతా తోళువూడి, చూడడానికి భయంకరంగా వుంది. మ్యునిసిపాలిటీవారు వూరికి దూరంగా పాకలు వేయించి రోగులను వాటిలో బెట్టించి వైద్యానికి డాక్టర్లను యేర్పాటుచేశారు. కాని వారు వైద్యంమాత్రం చేయడంలేదు.

పాకలలో గొంం తెండినా నీళ్ళుపోసేవాండ్లు లేరు. రెండు మోటారు లారీల సేర్పరచి అనాథప్రేతలనూ, రోగులనూ మోసుకొనిపోతు న్నారు. బండి శబ్దం విని కొందరు శవాలను తెచ్చి వాకిట్లో పెడుతు న్నారు. కొన్నిశవాలు కుళ్ళి చేతికిరావడంలేదు. వాటిని సేకుల మీదికి దొర్లించి మోసి మోటార్లలో పెడుతున్నారు. ఒక్కొక్క దాంట్లో పన్నెండు శవాలకూ, పన్నెండుమంది రోగులకూ మాత్రమే స్థలముంది. శవాలు యెక్కువకావడంచేత రోగులతోనే కలిపి వొకబండిలో వేస్తున్నారు. ఒక ముసలమ్మ రోగులనుకూడా తీసుకపోతారని తెలియక ప్రాణంతోవున్న తనకొడుకును తీసుకొని పోతూవుంటే ఘోష పెడుతున్నది. "ఇప్పుడు ప్రాణం గుటగుట్లాడుతున్నా అక్కడికి పోయేవగకు పోదా" అని వొక పోలీసువాడు జవాబు చెప్పాడు. పోలీసులూ మోతకూలీలూ శవాలను మోయడంకంటె యిండ్లు సవిరించడం యెక్కువయింది. విలువగల సామానులు దొరికినప్పుడు శవాలనూ రోగులనూ వొక బండిలో వేసి రెండవదాంట్లో సరుకు లెత్తుతున్నారు. మొదటి రోజులలో శవాలను విడివిడిగా పూడ్చిపెట్టారు గాని పీనుగులెక్కు వైనకొద్ది పెద్దబొందలు తవ్వి డజనుల తరబడిన వొకదాంట్లోకే తోసి మట్టిగప్పుతున్నారు. దొంగిలించినవీ, పీనుగులమీదివీ, రోగులవీ గుడ్డలన్నీ కలిపి పోలీసులు పట్టణంలో పెద్దపాపు పెట్టారు. గంటకు వందలకొలది పీనుగులను మోసుకపోతున్నారు. యెక్కడా రోదనశబ్దం లేదు. కూలీల కేకలింతలూ, పదాలూ, చిందులూ, కుపామత్తులూ, ప్రళయరుద్రుని హృదయానందం వెల్లడిస్తున్నవి. మృత్యుదేవత యథేచ్ఛగా విహరిస్తున్నది. అమ్మవారు నీల వరాహ రూపంతో పాదిని వెంటవేసుకొని ఘుర్ఘురింపులతో రాత్రులు వీధులలో విహరిస్తుందనీ, చూచినవాండ్లు ఘూముతగిలి మూడు ఘటియలలో చస్తారని చెప్పుకొంటున్నారు. కొందరు గ్రస్తీపోలీసులు ఆవిధంగా చచ్చారు. కొన్ని రోజులు శవాలను పగలుమాత్రమే మోయవలసిందని వుత్తరువుండేది గాని పని తెమలక రాత్రులుకూడా మోయవలసిం దన్నారు. కూలీలు

తలుపులు గొట్టి మీ యింట్లో శవాలున్నవా యని కేకలు వేస్తున్నారు. కొన్ని యిండ్లలో శవాలు తప్ప పలికేవాండ్లు లేరు. కొందరు లేవని చెపుతున్నారు. పని కలిసిరావడంకోసం చావక ముందే పాతివేస్తారని కొందరు రోగులను దాచిపెడుతున్నారు. కొనవూపిరితో వున్న వాండ్లను దొరగాయలనీ, చచ్చినవాండ్లను పండ్లనీ కూలిలు హాస్యానికి పేర్లు పెట్టారు. సాధారణంగా దొరగాయలను శవాల బండిలోకే నెడుతున్నారు. అటువంటివి జరగకుండా చేయడానికి రోగికింతని పోలీసులు కలవాండ్ల దగ్గర వసూలు చేస్తున్నారు. ప్రారంభంలో వొకమారు పోసిన వాండ్లకు రెండోసారి పోయదని అటువంటి వాండ్లను వూరువిడిచి పోనిచ్చారుగాని రోగం వుద్ధృతమై పాతవాండ్లకుగూడ మళ్ళీ పోసి వ్యాధి యితర చోట్లకు వ్యాపిస్తుండటంచేత యెవరూ వూరు విడిచి పోగూడదని వుత్తర్వులు పుట్టడంచేత అహోరాత్రాలు పోలీసులు గమిళ్లు గాస్తున్నారు. ధనవంతులు మాత్రం పారు గూళ్లు పోతున్నారు. కమలమ్మకూ పిల్లవాడికీ మూడురోజులు పెట్లిపడుతూ జ్వరం గాచింది. వొళ్లంతా చిత్తవత్తుగా కండపోత పోసింది. యేడవ రోజుకు కుండలు నిండినవి. నారం రోజులూ ధారకం లేదు. ఆరంభంలో పిల్లవాడికి పాలున్నా తరువాత యెండిపోయినవి. కమలమ్మకు పక్కలో పిల్లవాడున్నాడనే గమనమే పోయింది. పక్కన వేడిగా తగిలినప్పుడు గుర్తు దగిలేదిగాని పొర్లి చూడలేకపోయింది. పిల్లవాడికి కొంచెంసేపు గొంతులో గురుగురు మన్నది. దేహం కమలమ్మకు చల్లగా తగిలింది. సాహూ అని మూడుసార్లు వుచ్చరించింది. యెవరు లేకపోయినా, సాహు లేకపోలేదు. మనసులో వున్నాడు. మంచంమీద వున్నాడు. మనసు వ్యాపించినంత వరకూ సాహు వ్యాపించే వున్నాడు. మనసుకూ అతీతుడై అంతటా వున్నాడు. పెరియ ముత్తును పోలీసులు యీడ్చి తెచ్చి స్థలం చూపించ మన్నట్లు అలికిడి వినబడ్డది. రూపాయిలు మోగించుకొని పంచుకున్నారు. కమలమ్మకు స్మారకంలేదు. యిద్దరినీ మంచాలమీదినుంచి రేవు

మీదికి దొర్లించుకున్నారు. పెరియముత్తు కన్నీళ్లు విడిచింది. మీకు డబ్బుకూడా దొరికిందికదా, బతికివుంటే పారవేయ వద్ద న్నది. పోలీసులు దాన్ని మెడపట్టి నెట్టారు. తల్లినీ పిల్లనూ వాక బండిలోనే వేశారు. బండ్లు బుర్రున వూది ప్రయాణ మయినవి. కమలమ్మకూ మాంబళానికీ రుణాస్య తీరింది. మరి కమలమ్మ రాలేదు.

మాంబళంలోని ఘోరస్థితులు వర్ణిస్తూ పత్రికలు వుద్ఘో షించినవి. మోహనరావు అల్లాడిపోయినాడు. యెవ్వరికీ తెలియ కుండా రైలెక్కి సెంట్రల్ స్టేషన్‌లో దిగాడు. వెంట్రావు కనుపడి కమలమ్మ పూర్తిగా మారిపోయి నూతనజన్మ మెత్తిందిరా అన్నాడు. మోహనరావు సరాసరి మాంబళమే వచ్చాడు. దారిలో పెరియముత్తు కనబడ్డది.

మో:- అమ్మగారు కులాసాగా వున్నారా?

ము:- అయ్యా! యింకెక్క డమ్మగారు! యిద్దరికీ పోటకం పోసింది. పిల్లవాడికి వూపిరి పోయింది. తల్లికి గొరగొర లాడుతుండగనే యిద్దరినీ వాక బండిలోవేసి తీసుకొని పోయినారు.

మో:- యెన్నాళ్ళయింది?

ము:- వారంరోజు లయింది.

మో:- ఏ బండిలో?

ము:- ఇద్దరినీ చావుబండిలోకే నెట్టారు.

మోహనరావు అలవటించాడు. నా దుర్మార్గం ని న్నిట్టి దశకు తెచ్చిందని ముఖాన గుడ్డపెట్టుకొని భోరున యేడ్చాడు. మోటారుబండ్లు పరుగెత్తు తున్నవి. ఆపమని వేలు చూపాడు. ఆగినవి.

పో:- యేమైనా పీనుగు లున్నవా?

మో:- అయ్యా! నన్ను పాకల దగ్గరకు తీసుకుపొండి.

పో:- నీవు రోగివా, పీనుగువా?

మో:- రోగిని చూడవలసివుంది. మీకు గొప్ప బహుమతి యిస్తాను.

పో:- యెన్నాళ్ళయింది, వారు పాకలకు వచ్చి?

మో:- వారంరోజు లైంది.

పో:- ఆరోగి అక్కడింకా కూర్చున్నాడా? యీ పాటికి మట్టిలో గలిసివుంటాడు.

బిగు లూదంగనే బండ్లు పరుగెత్తినవి.

మో:- ఆహా! దిక్కుమాలిన చావైందిగదా! ముత్తా! యేబండిలో వాండ్లను తీసుకొనిపోయినారు?

ము:- వెనుక బండే, పీనుగుల బండి. నాకు బాగా గుర్తే.

ఉభయులూ మేడలోకి బోయినారు. మంచాలు మొదలైన సామాను యావత్తూ లేదు. కిటికీలో కమలమ్మ భగవద్గీత మాత్రం కనబడ్డది. చేతికి తీసుకున్నాడు. ఆనెకర్ర గుర్తు పెట్టివున్నది. తెరిచి పెన్సిలు గుర్తుపెట్టివున్న శ్లోకం చదువుకున్నాడు.

శ్లో. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥

శ్లోకాన్ని కండ్ల కద్దుకున్నాడు. కన్నీళ్ళతో తడిపాడు. లోకంలో అంత స్వచ్ఛమైన అశ్రుబిందువులు యిదివర కెన్నడూ రాలలేదు. మోహనరావు పుస్తకం దీసికొని యింటికి వెళ్ళిపోయి నాడు.

## ౧౬

### శాంతమ్మ

అప్పాదాసుకు యుక్తవయస్సు వచ్చింది. పదునాలుగు సంవత్సరములు వెళ్ళేవరకూ సన్నంగా తొగరుదారంవలె వున్నా పదిహేనవ సంవత్సరం వచ్చినప్పటినుంచీ సాగి బాగా జంపు బారాడు. కంఠం కొంచెం గళ్ళైబారింది. మనిషి నల్లగా వుంటాడు. చక్కని పలువరుసా తేటయిన కండ్లూ పురుషులను

సహితం ఆకర్షిస్తున్నవి. నూత్న యౌవనాన్ని మించి వొత్తయిన లేతమీసాలు నీలంపు నిగనిగలతో గుబురుకొంటున్నవి. బిరుసైన తలవెండ్రుకలను సంగదాసువలె కత్తిరించుకున్నాడు. నుదురు చిన్నది. దానికితోడు సగంవరకు వెంట్రుక లాక్రమించుకొన్నవి. కనుబొమ్మ లొండొంటిం డీకొని జోడుతల్వారులవలె దృఢమై వొప్పుతున్నవి. చురుకుదనమూ, శాంతమూ, దయా, సత్యశౌచాలూ ముఖమున వుట్టిపడుతుంటవి. సమ్మోహనమైనగాత్రంలో గండుకోకిల యిన నొప్పియున్నాడు. అత డెరనివాడైనట్టయితే ఆ కోకిలస్వర మబ్బివుండదు. నశ్యం అతని కలవాటు. దాని నెప్పుడూ పొగుడుతుంటాడు. కాని కంఠమాధుర్యాన్నీ శౌచాన్నీ మాత్ర మది కొంత తగ్గించింది. అది సంగదాసున కప్రియ మని యెరిగీ విడువలేకున్నాడు.

అప్పాదాసు జీతాని కుండడం మాని సంగ మందిరంలో బెట్టిన పంచమపాఠశాలలో వుపాధ్యాయుడుగా ప్రవేశించిన తరువాత వూళ్ళో అలగాజాతుల పిల్లలందరూ బడికి రావడంచేత తాలూకాలోకల్లా యిది పెద్ద పంచమస్కూలని పేరుపొందింది. తాలూకాబోర్డువారు దీనిని తమ పాలనకిందికి దీసికొని అప్పాదాసుకు నెలకు ౨౦ రూపాయలు జీత మేర్పరచారు. అప్పాదాసు శ్రద్ధతో చదువు చెపుతున్నాడనీ పిల్లలవర్తన బాగుచేస్తాడనీ పేరుపడ్డందున యెక్కువ గ్రాంటు శాంక్షను చేశారు. ఉపాధ్యాయుడుగా ప్రవేశించినప్పటినుంచీ పంచకావ్యాలను క్షుణ్ణంగా చదివి చక్కని భాషాజ్ఞాన మలవర్చుకున్నాడు. దైనికాంధ్ర పత్రికను తప్పక చదువుతుంటాడు. ధర్మసాధనయం దాసక్తి మెండు. మంచి వక్త. సకాలమున పనులు నిర్వర్తించుకొనే అలవాటు బాగా పట్టుబడ్డది. జోతికిగూడా మంచి భాషాజ్ఞానం కుదిరింది. పంచమపాఠశాల కనుబంధంగా బాలికాపాఠశాల నేర్పరచవలెనని ప్రయత్నిస్తున్నాడు. తనకు కావ్యాలు పూర్తికాందీ వుపాధ్యాయునిగా చేరనని జోతి పట్టుపట్టింది. గుంటూరునుంచి వొక బ్రహ్మసమాజకుడు మంగళాపురం వచ్చి బ్రహ్మసమాజో

ద్దేశాలను గూర్చి పంచమోద్యమాన్ని గూర్చి ఉపన్యాసం యిచ్చాడు. ఆయనయొక్క సుందరమైన దేహమూ, సుందరమైన వర్తనా, అప్పాదాసునూ జోతినీ ఆకర్షించినవి. బ్రాహ్మబోధకుడు శుద్ధమైన భక్తిగీతాలను యిద్దరికీ వ్రాసియిచ్చాడు. జోతి ఆనందంగా పాడుకుంటున్నది.

నరసింహారావు సంగమందిరంలో దిగాడు. ఆయన జాతి భేదం వదిలిపెట్టాడని తెలిసి రామానాయుడు తమ యింటికి భోజనానికి రమ్మని ఆహ్వానం చేశాడు. ఉదయం యేడు గంటలకు సంగమందిరంలో సంభాషణ జరుగుతుందనీ సభికులు తమకుండే సందేహాలు వెల్లడించి చర్చించవచ్చుననీ ప్రకటించారు. నరసింహారావు, వెంకటదాసును ప్రత్యేకంగా బిలిచి సంభాషణకు తప్పకుండా రావలసిందని చెప్పాడు. రామానాయుడు నరసింహారావును భోజనానికిపిలిచాడని కంతంరాజువిని లక్ష్మమ్మకూ చౌదరయ్యకూ కిర్రెక్కి చక్కాబోయినాడు. రామానాయుడూ నరశింహారావూ మేడమీదకు బోయి మాట్లాడుకుంటూ కూర్చున్నారు. లక్ష్మమ్మ ముందుగా మనం కదిలించడం ఎందుకని వూరుకొన్నది. చౌదరయ్య భవంతిలోకివచ్చి సాహుకు అన్నం పెట్టారా అని లక్ష్మమ్మను అడిగాడు.

ల:- వాడు ఆడుకొని ఇంటికి వచ్చేవరకు అన్నం వుడకలేదు. మధ్యాహ్నపు అన్నం తినమంటే ఆరిపోయింది, అక్కరలేదన్నాడు. ఇంతవరకు వంటపని తెమలలేదు. వాడు ముంగిటలోనే మంచంమీద పడుకొని నిద్రపోతున్నాడు. లోపలికి తీసుకొనివచ్చి పడుకోబెడదామంటే అక్కలక్ష్మీ నేనూ యెత్తుకొని చాలేకపోయినాం. కోడలు నీళ్ళాడి వచ్చేవరకూ నాలుగైదునెలలైనా పడుతుంది. అక్కలక్ష్మి యేదైనా పైపను లతకటానికితప్ప అడవ పని రెండుపూటలా చేయలేదు.

చౌ:- గుర్రం గుడ్డిదైనా దాణాకు తక్కువలేదు. పని చేయలేకపోతే వెళ్ళమను. చేయగలదాన్ని పెట్టుకుందాం.

ల:- మీ రిచ్చే జీతాలన్నీ మళ్ళి పోతున్నవా? ఇక్కడికి 30 యేండ్లనుంచీ వొక్కతీరాన ఇంట్లో చాకిరీచేసింది. అదవగా వచ్చిందన్న మాటేగాని ఇంటివాండ్లకంటే యెక్కువగా పని చేసింది. అస్త్రీ చర్మం, మనకు ధారపోసి యిప్పుడు లేచి పొమ్మంటే యెక్కడికి పోతుంది? ఈ ముప్పైయేండ్లకూ జీతం కట్టియ్యండి. రక్తస్పర్శగలవాం డ్లెవరైనావుంటే వాండ్లకిస్తే మంచానబడ్డప్పుడు చేస్తారు.

చౌ:- సరే, కట్టివేసి మేపు. కొత్తగా వచ్చినమనిషి కేమైనా జీతం యివ్వవలెనా?

ల:- వట్టినే యెవరు చేస్తారు? యేమియ్యమంటుందో అడగలేదు.

చౌ:- యెడమకంట్లో కాయ, కుడికంట్లో పువ్వు, మోచేతికి మోరు, మీగాలు సొట్ట; యెక్కడ దొరుకుతారు నీ కిటువంటివాళ్ళంతా? నీకు జీతం యేమాత్రం కావలెనమ్మా?

ల:- శాంతమ్మా! చెప్పు.

శా:- మీకు తోచినంత దయచేయండి.

చౌ:- ప్రవేశించేటప్పుడు మెల్లెగా చొప్పిస్తారు. తరువాత యెవరైనా యెక్కువ పెట్టంగనే అంతా యింతా తెమ్మంటారు. తగవులూ తాకట్లూ మాకు పనికిరావు. ఖండితంగా అనుకోవడమే మంచిది. మీకు వంటచేత నౌనా?

శా:- ఆం.

చౌ:- రెండుపూటలా చేస్తారా?

శా:- అట్లాగే.

ల:- లక్ష్మీ లక్ష్మి, ఆమె చెరొకపూటా చేస్తారు. ఆమెకు చదువుకూడా బాగావచ్చు. పిల్లవాణ్ణి జాగర్త చేసేభారం ఆమె మీద పెట్టండి.

చౌ:- పిల్లవాడికి ఆమె చేసేజాగర్త యేమిటి? నేనే చూస్తుంటాను. పని వాండ్లను పనిచేయకుండా చెడగొడతావు. అవసరం

అయితే యీమె రెండుపూటలూ వంట చేయవలసిందే. సంవత్సరానికి పరకరూపాయి లిస్తాను.

శా:- సరే.

ల:- పరకంటే ఆమెకు లెక్క తెలుసునో తెలియదో?

చౌ:- నీకూ తెలియదు. బయటివాడు మాడిగేదంటే ఇంటివాండ్లు గొడ్డు గేదంటారట. అంతకు యెక్కువైతే వొక్క పైసా యివ్వను. ఇష్టమైతేనే ఉండమను. నాతో సంగతి మాట బద్దోలు కాగూడదు.

శా:- ఏదో వొకవిధంగా ప్రస్తుతం కానీయండి. పనినిబట్టి-

చౌ:- అదుగో అందుకున్నది; చూశావా? మొండిచేతి వాండ్లకు నూగులు తిననేర్పుతావు.

శా:- తమ ఇష్టంవచ్చినట్లు కానియ్యండి.

అక్క:- (లోపలికివచ్చి) యీ పూట యెవరో భోజనానికి వస్తారట. చిన్నయ్య నీతో చెప్పమన్నాడు.

చౌ:- వాడిని యిక్కడికి దబ్బున రమ్మను

రా:- (లోనికి వచ్చి) యెందుకు పిలిచారట?

చౌ:- ఆ వచ్చినాయన యెవరు? నాకీ వసవసలు పనికిరావు.

రా:- గుంటూరు. బ్రహ్మసమాజకులు.

చౌ:- యేమి కులం?

రా:- పూర్వం బ్రాహ్మలు.

చౌ:- ప్రస్తుతం మాదిగెలు.

ల:- అందరితో భోజనం చేస్తారా?

రా:- ఆఁ. చేస్తారట.

చౌ:- బస మాలపల్లెలోనే చేయించక పోయినావా?

రా:- వారు సత్పురుషులు.

చౌ:- సత్పురుషులకు మాలపల్లి పనికిరాదా ?

రా:- పనికిరాదని కాదు. మన యింట్లో దిగడం మన అదృష్టం.

చౌ:- మన అదృష్టం పుచ్చింది. కాని మునసబు అల్లరి వాడు. రేపు పూరి భావిలో చేద వెయ్యవద్దంటాడు. ఎల్లుండి వెలివేశామని శ్రీముఖాలు వస్తవి. ఆయనకు వెడిగెలగా పెట్ట గూడదా ?

రా:- నాకూ ఆయనకూ కలిపివెట్టండి. ఆక్షేపణ వున్న వాండ్లు లోపల భోజనం చెయ్యండి.

వెం:- యెందు కింత విచారణ ? యెక్కడ బెట్టిందీ యెవరు చూడవచ్చారు ? మనకు కలిసే ఛండాలాలకంటే యెక్కువైందా? ప్రత్యక్షం మాలవాడు గాడుగదా ? ఆయన యెవరింట్లో వుంటే మన కేమి ?

ల:- అందుకు గాదు. ఆయనకు నా చేతిమీదుగా భోజనం పెట్టడ మంటే కష్టంగా వున్నది. ఏ ధ్యే జన్మాన జేసుకున్నామో యిప్పు డనుభవిస్తున్నాము. బ్రాహ్మణ్ణి మాలపల్లెకు పొమ్మనడం దోషం. ఈ మల్లిగుల్లాలకంటె మన గదిలో శుభ్రంగా వంట చేసుకోరాదూ. సామాగ్రీ యిత్తాం.

రామా:- యింత పొద్దుపోయి నీళ్లు దెచ్చుకొని వం టెప్పుడు చేసుకుంటాడు ? నీ కిష్టం లేకపోతే అక్కలక్ష్మిని వడ్డించమను.

అక్కలక్ష్మి:- ఆ పాతకం నా కెందుకు ? బ్రాహ్మణ్ణి చెడ గొట్టిన పాపం పతివ్రతను చెరిచిన పాపం పోవట.

వెం:- యిప్పు డాయన కొత్తగా చెడేదేముంది ? యిదివర కెన్నిచోట్ల దిన్నాడో ? మీకంత పాపం వచ్చేటట్టుగా వుంటే నేను వడ్డిస్తానులే.

చౌ:- రేపు మునసబు యెక్కడ పెట్టారంటే ముందు మన వాడే చెపుతాడుగా.

వెం.- యెందు కిప్పు డీ వులుకంతా? మనసబు నడతంతా చక్కంగా వున్నది, మనది లేకపోయింది. రచ్చకువస్తే యెవరికి వెలివెయ్యవలసిందో ఆలోచింతాం.

చౌ:- మీరంతా అనుమానాలు తీర్చుకొని రండి. యింతలోకే సాహు అన్నం దింటాడు. నలుగురిలో వాడికి వంటబట్టదు.

ల:- నాకు తిరిగి తిరిగి కాళ్ళు పడిపోతున్నవి. రెండుమాట్లు వడ్డించలేను. తండ్రో, నీవో కూర్చోబెట్టుకోండి.

చౌ:- వాడికి అన్నం పెట్టడానికి నీకు బద్ధకం. అక్కలక్ష్మి, నీవు అన్నం దీసుకొనిరా. నేను వాణ్ణి లేవదీసుకొని వస్తాను.

సాహు పక్కలేకుండా నులకమంచం మీద ఆరుబైట పడుకున్నాడు. మొలన చెడ్డీమాత్ర మున్నది. వొళ్లు చెమటపోసింది. చౌదరయ్య లేపాడు. మెళుకువ రాలేదు. లేవదీసి బుజాన పడుకోబెట్టుకొని తీసుకొనివచ్చి దీపం యెదుట పీటమీద కూర్చోబెట్టాడు. వొళ్ళతా తెల్లగా వుప్పులిసి వాసన గొడుతున్నది. తల పెరిగి వున్నది. కత్తిరించలేదు. నిద్రమత్తున రెండు చేతులతో బరుకుతున్నాడు. తల అంటలుగట్టి పేలకంపు గొడుతున్నది. నోరు వాసన. మొగం కడుక్కోవడమే లేదు. పక్క టెముకలు బైటపడ్డవి.

చౌ:- అక్కలక్ష్మి! వీడికి తలంటిపోసి యెన్నాళ్ళైంది?

అక్క-ల:- తలంటేదాకా బోతున్నారు; వొంటిమీద నీళ్లు పోసుకొని వారం రోజులైంది. స్నానానికి రమ్మంటే రాడు. బళ్ళోనుంచి రాంగనే నీళ్లు పొయ్యండంటూ వస్తాడు. కాస్త ఆలస్యమైతే అలిగిపోతాడు. కోప మెక్కువైంది. వీడితో సతమతమవుతున్నాం.

చౌ:- వాడిని యేమి దిక్కులేనివాణ్ణి చేశారర్రా? రోజుకు పది మానికల బియ్యం ధూపానికి ఆగవు. వాడు నీళ్ళడిగి నప్పుడు పొయ్యడానికి ఆస్కారం లేకపోయింది.

ల:- వాడు మాకు అల్లివిగాడు. మధ్యాహ్నం అన్నానికే రాడు. రాంగనే అన్నమని కేకవేసి చేతులో పని తీర్చుకొనివచ్చే వరకు బడి వేళ్లైందని పరుగెత్తుతాడు.

సాహు గొణుగుతూ కలవరింపులో పద్యం చదువుతున్నాడు.

చౌ:- నాన్నా! కండ్లు తెరిచి చూడు. కండ్లు నీళ్లుపెట్టి కడుగుతాపట్టు; నిద్ర పోతుంది.

సాహు:- అబ్బా! చలిగా వున్నది తాతయ్యా!

చౌ:- నా వుత్తరీయం గప్పుకో. అన్నం దిను. నీకు పెరుగు వెయ్యమంటావా?

సాహు:- నా కాకలిగా లేదు తాతయ్యా! నన్ను పడుకోబెట్టు.

చౌ:- ఈవేళ మధ్యాహ్నం దిన్నాడా?

అక్క-ల:- తిన్నాడేమో!

ల:- నే బెట్టలేదు. అక్కలక్ష్మి పెట్టిందనుకున్నా.

చౌ:- యిక వీడికతేమి కావాలె?

సాహు:-నాపీకె మంచంమీద వుంది. తీసుకరా తాతయ్యా!

చౌ:- తీసుకరావే అక్కలక్ష్మీ? వీడికి యీపూట నీళ్లెందుకు బొయ్యలేదు?

ల:- వాడెప్పుడు వచ్చాడో అడుగు? యీవాత్త్రిళ్ళు నే బడలేను. మనిషాకారంగా వున్నాననమాటేగాని వొక్కపని చేసేటందుకు నాకు నాలిలేదు. నాలుగు నెలలనుంచీ పగ ర్పెక్కువైంది. రాత్రింబగళ్ళూ పిల్లికూతలే.

చౌ:- బాబూ? యీవేళ ఆలస్యంగా యెందుకు వచ్చావు?

సా:- సంగమందిరంలో వొకాయన భక్తిమీద వుపన్యాసంచెప్పాడు. చాలా బాగావుంది. మా బోర్డుస్కూలులో మంచి పాఠాలు చెప్పరు తాతయ్యా! అప్పదాసుబళ్ళో రామాయణంలో

భాగవతంలో వున్నకథలన్నీ చెప్పుతాడు. ఈవేళ వుపన్యాసం చెప్పినాయనగూడా అందరినీ ఆబళ్ళోకే రమ్మన్నాడు.

చౌ:- ఉపన్యాసం నీకేం దెలిసిందిరా?

సా:- తెలిసింది తాతయ్యా! ఆయన గొప్పభక్తుడు. ప్రహ్లాదుణ్ణి గురించి చెప్పాడు. నీవు నాకు నేర్పిన పద్యాలన్నీ ఆయన చదివాడు. రేపు అప్పాదాసు బళ్ళోకే పోతా. ఇవ్వేళ ప్రహ్లాద నాటకం చూతాం తాతయ్యా!

చౌ:- ఎక్కడ?

సా:- ఆంజనేయులు గుడిదగ్గర. అదుగో మద్దెల వాయిస్తున్నారు.

చౌ:- యెవరు ఆడించడం?

వెం:- కూలివాండ్లు చందావేసుకొని యీరోజు ఆడిస్తారట. యెల్లుండి కోమట్లు.

చౌ:- పోదువుగానిలే అన్నందిను. నీవు అన్నం శానాదింటే తీసుకొని పోతాను.

సా:- నేను ముద్ద నోట్లో పెట్టుకుంటాను. వొక్కొక్క పచ్చడిబద్ద నోట్లో బెడుతూవుండు.

సాహు గబగబ మింగుతూవుంటే కొరబోయింది.

చౌ:- కొరమారింది పైకిజూడు. చుట్టా లెవరో అనుకుంటున్నారు.

సా:- యేమనుకుంటున్నారు?

చౌ:- యేమో. మనకేమి దెలుసు. మంచినీళ్లు దాగు. పెరుగు వేయించుకుంటావా, పాలు పోయించుకుంటావా.

సా:- మీగడపెరుగు దెమ్మను. దాంట్లో పాలుపోసుకుంటా.

చౌ:- రెబ్బే? రెండూపోసుకుంటే కడుపులో గడ్డకడతవి.

సా:- మా అమ్మ రెండూపోసి కలిపేది మా అమ్మమ్మగారి వూళ్ళో. మా అమ్మ యిక రాదా యేమిటి?

చౌ:- యిక రాదు.

సా:- వట్టిమా టంటున్నావు. ఈవేళ మా అమ్మ పోసే మో_స్తరుగా కలిపి పోసుకుంటాను.

చౌ:- రెండూట తేవే?

ల:- జబ్బు చేయదూ?

చౌ:- వాడు కావలెనంటూ వుండెగా?

సా:- ఈ రెండూ కలిపి పోసుకుంటే మా అమ్మ జ్ఞాపకం వచ్చింది తాతయ్యా!

చౌ:- త్వరగా కానియ్యి.

సా:- నాకు అందరిముద్దలూ చేసిపెట్టు.

చౌ:- ఇదిగో మొదటిముద్ద, యిది యెవరిది?

సా:- యింకెవరిది? మొదటిది అమ్మముద్దే. అందరి ముద్దలూ దిన్నా, అయిపోయింది.

చౌ:- కంచంలోనే చేయి గడుక్కో.

సా:- నీవు అన్నం దినేదాకా నీ దగ్గర పీటవేయించు. కూర్చుంటా, లేకపోతే నిద్రవస్తుంది.

చౌ:- పెద్దపీట నావి_స్తరిదగ్గర వెయ్యవే. వెంకటయ్యా! వారిద్దరినీ రమ్మను.

రామానాయుడూ, నరసింగరావూ క్రిందికి దిగివచ్చారు. ఉభయులూ కాళ్ళు కడుక్కున్నారు. నరసింహారావు శుభ్రమైన చలువదోవతి కుచ్చిళ్ళు వేలబోసి పింజగోచీ పెట్టుకున్నాడు. సన్నని కుడితిసీ దాడిగి తుర్కీతువాల పైనవేసుకొని కండ్లకూ కాళ్ళకూ జోళ్లు వేసుకొని రామానాయుడితో భోజనాలచావిట్లోకి వచ్చాడు. శౌచం వుట్టిపడుతున్నది. ముఖాన భ_క్తిరస మొలుకుతూ చూచేవాండ్ల హృదయ తాపాలను చల్లారుస్తున్నది. ఆటు చెప్పులచప్పుడు వినబడనంత శాంతంగా అడుగులు పెడుతూ, పీట దగ్గర జోడువిడిచి సనత్కుమారుడి వలె కూర్చొని అయిదు

నిమిషాలు ధ్యానంచేశాడు. చౌదరయ్యా మొదట చెప్పులవంక చూచాడుగాని మొగం చూచేవరకు ఆక్షేపించ మనసొప్పలేదు. చక్కని ఆకారం, మనస్సుయొక్క నిర్మలత్వాన్ని ప్రకటించే ముఖం, భక్తిని గురిసే కండ్లూ, శాంతిని ప్రకటించే చేష్టలూ ఆవరణమంతా ఆశ్రమం చేస్తున్నాడు. చుట్టుప్రక్కలు కామ క్రోధాదు లుడిగి శాంతశమదమాదులకు చోటిస్తున్నవి. చౌదరయ్యా యెగాదిగా జూచి స్తిమితపడి వూరుకున్నాడు. లక్ష్మమ్మ తన సహజ సరళ స్వభావంతో వడ్డించింది. అందరూ భోజనం చేస్తున్నారు.

సాహు:- అప్పా! నీవు నాటకానికి రావా?

రామా:- వస్తాను. నరసింహారావుగారూ! తమరు గూడా దయచేస్తారా?

నర:- ఆడేవాండ్లు బోంగవాండ్లా?

రామా:- కాదు. కూచిపూడి భాగవతులు.

నర:- నాటకాలు చూడడం తప్పులేదు. కేశవచంద్రసేను గారు నీతిబోధకాలైన నాటకాలు వేయించేవారు. ప్రహ్లాద మంచిదేగాని అవతారాలూ, ప్రార్థనలూ విగ్రహారాధనకు సంబంధంగా వుంటవి. అయినా ఫరవాలేదు. ఇంగ్లండులో గూడా యేకేశ్వరోపాసకులు అన్ని నాటకాలకూ వెళ్ళుతూనే వుంటారు. కొంచంసేపు చూసి వత్తాంలెండి.

రామా:- ప్రహ్లాదుడు పరమ భాగవతోత్తముడు. భాగవత గోష్ఠి అత్యంత శ్రేయోదాయకం. ఇటువంటి నాటకాలూ, హరి కథలూ వొక విధమైన సాంఘికోపాసనలు. ఇవి పండిత పామరుల కెల్లరకూ మోక్షసాధకాలు.

సాహు:- అదుగో మద్దెల వాయిస్తున్నారప్పా. మీరు మాటలు చెప్పుకుంటూ కూర్చుంటే మనల పొద్యోవరకు నాటకం అయిపోతుంది. తొరగా లేవండి.

౧౨

## ప్రహ్లాద నాటకం

దృశ్యప్రబంధముల ప్రయోజనములు జను లనాదిగ గ్రహించారు. "నాటకాంతేన సాహితీ" అనడంవల్ల నాటకాలు చదువనివాడు సాహితి కాడని అభిప్రాయం. పాశ్చాత్త్యులలో గ్రీకులు నాటక రచనయందు గొప్ప సామర్థ్యం చూపారు. ఇటీవల ఆంగ్ల కాళిదాసని పేర్కొనదగిన షేక్సుపియరు మహాకవి సృష్టికి ప్రతిసృష్టి చేసి నాటక ప్రపంచమును సృష్టించాడు. కవి సార్వభౌముడైన కాళిదాసు నాటక సౌధమునకు శాకుంతల మను కాంచనశిఖర మెత్తాడు "ఉత్తరే రామచరితే భవభూతిర్విశిష్యతే" యని పేరువడసి భవభూతి కాళిదాసుకు ప్రత్యర్థి అనిపించుకున్నాడు. కరుణరస ప్రదర్శనములో వొకడుగు ముందు గూడా వేశాడు.

ప్రాచీనాంధ్రకవులు రాజాధిరాజుల ఆస్థానము లలంకరించీ నాటక రచనకుం దొడంగలేదు. ఆధునికులు పలువురు మంచి నాటకములే వ్రాశారుగాని కవిత్వ పటిమలో ఆంధ్రకవి సత్తములతో పోల్చదగరు. పాశ్చాత్యులలో నాటకముల ప్రభ తగ్గి సినీమాలు వాటి స్థానము నాక్రమించినవి. షేక్సుపియరు నాటకములు చూచువా రనేకు లుండరు. పూర్వకథలు సినిమాల కెత్తబడుతున్నవి. కేవల నీతిబోధకములే గాక సినీమాలలో ప్రకృతి శాస్త్రములు సహితమూ సామాన్య జనులకు బోధిస్తున్నారు. రాను రాను దుర్నీతి బోధకములగు కథలు జనుల నెక్కువ ఆకర్షిస్తున్నవి. ధనాశాపరులగు సినీమా ప్రదర్శకులు పచ్చి శృంగార కథలనే యెక్కువ ప్రదర్శిస్తారు. బొంబాయిలోని ఫడ్కే కంపెనీ వారు ప్రదర్శనాసాధ్యములైన దృశ్యాలెన్నో చూపి సినీమాల ఆధిక్యత రుజువు చేశారు. క్రమ క్రమంగా నాటకప్రదర్శనా లంతరించి సినీమాలే మిగులునేమో ? సినిమా ప్రతిమలు అభినయించడమే గాక సంభాషించడం, పాడడం మేధావంతులు కనిపెట్టారు.

ఉత్తమ నటకులూ గాయకులూ తమ అభినయములనూ గానములనూ సినిమా పటములలోని కెత్తింతురు గనుక సర్వవిధాలా సినిమా లతిశయించునని తోస్తున్నది. బీదలకుసహా అందికలో వుండేటట్లు రేట్లు తగ్గిస్తే జనసామాన్యంలో విద్య వ్యాపించడానికి సినిమాలు బలవత్సాధనాలు గావడం నిస్సందేహం. పూర్వం గ్రీకుదేశంలో పెరికిల్సు మొదలైన ప్రజారంజకులగు ప్రభువులు రాజధనంతో నాటకము లాడించి ప్రజల కుచితంగా చూపించి జ్ఞానం వ్యాపింపజేసేవారు. హిందూ ప్రభువుల పాలనలో శాకుంతలాది నాటకములు రాజాస్థానములలో ప్రకటింప బడినప్పుడు పెద్దల నాహ్వానించి వుంటారుగాని పామరులు పిలువబడిరనీ, వారి కవి బోధపడ్డవనీ చెప్పడానికి వీలు లేదు. ప్రజావబోధమునకై వీధినాటకాలూ, బొమ్మలాటలూ, బుర్రకథలూ అనాదినుండీ మనదేశంలో యేర్పాటు చేయబడ్డవి. ప్రజాప్రబోధానికేగాక వినోదానికీ యివి యేర్పాటుచేసి వుంటారు. ప్రజాక్షేమాభిలాషులైన పూర్వపు ప్రభువులు యీ ప్రదర్శనాలవిచ్ఛిన్నంగా జరగడానికి కూచిపూడి మొదలైన అగ్రహారాలిచ్చి స్థిరమైన యేర్పాట్లు చేశారు. ఏనాదులు, మాలలు మొదలైన జాతులలో కొందరు వంశపారంపర్యంగా నాటకా లాడడమే వృత్తిగా బెట్టుకొన్నారు. తోలుబొమ్మలవాండ్లు సాధారణంగా మరాటీ మాట్లాడడంచేత యిది మహారాష్ట్రులు ప్రతిష్ఠించి వుంటారు. వీటిని చూడడానికి ప్రేక్షకులు డబ్బియ్యనక్కరలేదు. స్థితిపరులు పేరు ప్రతిష్ఠల కోసం సొంత ఖర్చుతో ఆటలు వేయించి అందరినీ వూరికెనే చూడనిస్తారు. ఇటీవల మనదేశంలో వీటియం దాదరణ తగ్గింది. నాటకశాల లేర్పరచి నాటకాలు వేస్తున్నారుగాని బీదల కివి అందికలో లేవు. ఈ ప్రదర్శనాలు జ్ఞాన వ్యాపకానికి బదులు డబ్బు సంపాదించడానికి సాధనా లవుతున్నవి. సినిమా ప్రచారంలోకి రాలేదు. సర్కారువారు వీటి నాదరించి బీదలకు అందికలోకి తెచ్చేవరకూ వీధి నాటకములను నిరసించడం అన్యాయం.

మంగళాపురంలో ప్రహ్లాద నాటక మాడుతారని పుకారు మోగింది. సందెలు కూకంగనే అన్నాలు తిని పొరుగూళ్ళనుంచి నాటకం చూడడానికి వస్తూ వున్నారు. సంగమందిరానికీ, ఆంజనేయ మండపానికీ నడుమ పందిలివేసి తోరణాలు కట్టారు. శేషయ్యా, రంగదాసూ, సిలారుసాయెబూ పెత్తనం గట్టుకొని తిరుగుతున్నారు. శిలారు సాయెబు చమురు పోయించుకొని వచ్చాడు. చాకలివాండ్లు విళాయిచుట్టల కాగడాలు ముట్టించారు. పూజారివారింట్లోనుంచి వేషాలు తీసికొని రావడానికి చే దివిటీ తెచ్చారు. శేషయ్య పూడ్పించి చాపలు పరిపిస్తున్నాడు. పెద్దలంతా వచ్చి కూర్చుంటున్నారు. బ్రాహ్మలు మంటపంమీద కూర్చున్నారు. ఆడవాండ్లు, మగవాళ్లు, హిందువులు, మహమ్మదీయులు పికపిక లాడుతూ మూగి కూర్చున్నారు. ముసలమ్మలు కట్లపీటలూ, కుక్కిలూ దూరంగా వేసుకొని కూర్చున్నారు. చౌదరయ్య కోడలు లేచిపోయినప్పటినుంచీ నలుగురిలోకీ రావడం మానివేశాడు. వారసత్వపు వ్యాజ్యం గెలువడానికి యితరుల మాట సాయం అవసరం గనుక పదిమందితోనూ అనుబాంధికగా వుండడం మేలని పంతులు చవుదరయ్యను వెంటబెట్టుకొని వచ్చి జనంలోకి పోక మంటపంమీద కరణానికి దగ్గరగా కూర్చోపెట్టాడు. అందరూ రావడానికి యిది తారాశశాంకం నాటకం కాదని చవుదరయ్య వినేటట్టుగా అని మునసబు లేచిపోయినాడు. శేషయ్య వెళ్ళి బతిమిలాడినా రాలేదు. సంగమందిరపు సభికులూ కూలీలూ, మాల మాదిగలూ, మందిరాన్ని ఆనుకొని కూర్చున్నారు. రామానాయుడూ, నరసింహారావూ, సాహూ మందిరపు వీధి అరుగుమీద కూర్చున్నారు. అరుగు క్రింద రామదాసూ, అప్పాదాసూ, వెంకటదాసూ కూర్చున్నారు. పల్లెలోనున్న ఆడవాళ్ళంతా వచ్చారుగాని మాలక్ష్మి రాలేదు. జోతి తండ్రి ప్రక్కగా కూర్చున్నది. విదూషకుడు వెంకట్రామయ్య సభవారిని ఆట ప్రారంభించవచ్చునా? అని అడిగాడు. వంతపాడే జనార్ద

నయ్యే త్యాగరాయ కృతి యెత్తుకొని ఆనందంగా వినాయక ప్రార్థన చేశాడు.

న:- ఇతడే గనుక యేకేశ్వరోపాసన కీర్తనలు పాడితే యెంత బాగుండేవి?

రా:- బ్రహ్మసమాజ కీర్తనలు సంగీతం లేకుండా పాడితేనే బాగుంటవి.

న:- గాయక అపోస్తలని పేరుపొందిన త్రైలోక్యనాథ సన్యాలు అద్భుతంగా పాడేవాడట.

రా:- ఆ "ట" సంగతి తెలియదుగానీ నే విన్నంతవరకు అందరు బ్రాహ్మ సమాజకులూ అన్ని కీర్తనలూ వొకటే మోస్తరుగా పాడేవారు.

న:- అదిమట్టుకు కష్టం గాదా?

రా:- అభ్యాసం.

న:- నేను తెలుగు కీర్తనలు బాగా పాడలేనుగాని బంగాళీ కీర్తనలూ, ఇంగ్లీషు మట్లూ షుమారుగా పాడతాను.

రా:- తమకు సంగీతం వచ్చినా రాకపోయినా భక్తిరసం వొలికేటట్టుగా పాడుతారు గనుక హృదయ రంజకంగా వుండక తప్పదు.

ఆటల సంగతి యెట్లావున్నా పల్లెటూళ్ళలో చాలామంది బంగారక్కను చూడడానికి వస్తారు. అందుకనే మాధవి ప్రతి నాటకానికి ప్రథమ పాత్ర. ప్రధాన వేషం గూడాను. అదే హాస్య గత్తె, స్త్రీ వేషాలకు చెలికత్తె. విళాయి వేసే చాకలి దీనికి మగని వరస. ఆట పూర్తి అయ్యేవరకు వాడిని వొళ్లు వాచేటట్టు కొడుతుంది. మాధవి తెరలోకి వచ్చింది. చక్కగా వొక కృతి పాడింది. వచ్చేది యే వేషమో కొత్తవాళ్ళకు తెలియలేదు. రభసంతో రెండు విళాయీలు మోటించి గుగ్గిలం వేశారు. ధగధగ మెరి

సింది. కాటిపాపవలె మాధవి చిందులు తొక్కుతూ బయటికి వచ్చింది. చాకలి మగడితో తా నాడిన సరసాలు వర్ణిస్తూ;

"వినరందో చెప్తాను—వీనుల విందూగ-- విన.
౧. తమలపాకుతో తానిట్లంటే-తలుపు చెక్కతో నే నట్లంటి. విన.
౨. విసనకర్రతో తానిట్లంటే-విసురురాయితో నేనిట్లంటి. విన.

వెం:- మాధవీ! ఇదేమి సరసమే?

మా:- (పఁవిటె సవిరించుకుంటూ గూడ లెగరవేసి) యిది మోటు సరసం బావా.

వెం:- పరాయి మగవాణ్ణి, అందులో పడుచువాణ్ణికూడా గదా! బావా అంటే నీమగ దూరుకుంటాడూ?

మా:- నామొగు దూరుకోపోవడం 'గూడానా? యిటువంటి వన్నీ వాడికి నేర్పబోకు. ఏమిరా! వూరుకోవురా?—(అని ఫెడేలున వొక్క పెట్టుపెట్టి,)

౩. చిగురుటాకుతో తానొకటంటే-చీపురుకట్టతో నే మూడంటి. విన.

వెం:- మరదలుపిల్లా! ఈ తడవ సరసం యింకోపా లెక్కువ గలిపావూ?

మా:- మరదలుపిల్లా—ఎంత బాగుంది బావా యీమాట. అంతా నన్నిట్లా పిలిస్తే బాగుంతును. ఈ వెధవ నా కిష్టంలేందీ తేపా నాతో సరసమాడడడ మేమిటీ. బుద్ధి రావడంకోసం మూడోమాటు యింకొక దెబ్బ యెక్కువ చదివించా.

వెం:- వాడు నిన్ను పెళ్లి చేసుకున్న దెందుకోసం?

మా:- నాకు అన్నం పెట్టడానికీ, చాకిరీ చేయడానికీ, నాకు పుట్టిన పిల్లల్ని మోయడానికీ, వాడిలో వుండటానికి నా కిష్టంలేకపోతే మాకు భరణం యివ్వడానికీ. జర్మనీదేశంలో వొకడు తన భార్యకు యిష్టంలేనిదే అదనంగా సరసం ఆడితే యాభైరూపాయలు జుల్మానా వేశారట. ఈతడు జర్మనీవాడి కంటే మొనగాడా?

మాధవి నిష్క్రమించింది.

జనార్దనయ్య సమ్మోహనంగా కృతి పాడుతున్నాడు. చూడడానికి వచ్చిన చుక్కమ్మ "వెంకాయీ! నే కాసేపు నిద్రపోతా! మళ్ళీ మాధవి రాంగనే లేపు" అని నిద్రపోయింది.

న:- నాయుడుగారూ! ఈ బూతు హాస్యాలు మాని పించండి. వినడం చాలా కష్టంగా వుంది.

రా—నా:- పంతులుగారు పనికిరాదంటున్నారు. హాస్యం మాన్పించు.

శే:- ఓ వెంక్రటామయ్యగారూ! హాస్యం మాన్పించాలె.

వె:- అవస్యం మాన్పిస్తాను. ఆ వొద్దన్నావా రెవరో జనం నిద్రపోకుండా జవాబుదారీ చెయ్యమనండి. లేకపోతే నాకొక కొరడా యిచ్చి మేజస్ట్రీటు అధికారం యిప్పించండి. అదీకాకపోతే తమరు సెలవిచ్చారు గనుక యిక విశేషంగా రానియ్యను లెండి.

వెంట వెంటనే ప్రధాన పాత్రలు వస్తూ వున్నవి. కథ దాట్లతో నడుస్తున్నది. హిరణ్యాకశ్యపుని తపస్సూ, లీలావతి చెరా పూర్తి అయినవి. విష్ణుపురాణంలో విష్ణువు తన పినతండ్రిని చంపాడని ప్రహ్లాదుడు ఆయన మీదికి దండయాత్రకు పోయి యుద్ధంలో వోడి విష్ణుభక్తుడైనాడని వున్నదిగాని భాగవత పురాణాన్ని అనుసరించే కథ నడిపారు. ఈ కథలో గర్భస్థుడైన ప్రహ్లాదునికే నారదుడు విష్ణుబోధ చేశాడు.

న:- నాయుడుగారూ? గర్భస్థుడైన వానికి బోధచేయుడం సాధ్య మవుతుందని మీరు నమ్ముతారా? పిల్లవాడే గ్రహించ నేరనపుడు పిండ మెట్లా గ్రహిస్తుంది?

రా—నా:- అసాధ్యమేమీ గనపడదు. స్థూల శరీరాని కుండే సంకుచిత పరిస్థితులు పిండానికి లేకపోవచ్చు.

అ:- జ్ఞాన సంపాదనకు భౌతికేంద్రియాలే సాధన లనడానికి వీలులేదు. వాటి సూక్ష్మరూపాలైన పంచతన్మాత్రాదులు సాధనాలు కావచ్చు. ఈ సాధనా లవసరం లేకనే జీవుడేల గ్రహింపలేడు? ఉపాధి సహితుడైన జీవునకు యితర సాధనము లుండవచ్చు. గుణపరిణామ సిద్ధాంత ప్రకారం జీవుడు హీన జన్మలకు దిగకున్నా మానవజన్మం దాటిన తర్వాత జీవుడు స్థూలశరీరం సహాయం లేకనే గుణపరిణామము నందవచ్చు. వొకవేళ ఉపాధి నశిస్తుందని నమ్మినా సగుణబ్రహ్మం ఉపాధిరహితంగా వుండే విషయాలను గ్రహించడం లేదా?

నరసింహారావు వూరుకొన్నాడు.

ప్రహ్లాద జననం, మంత్రసాని దెప్పిళ్లూ, జన్మోత్సవాలూ పూర్తైయినవి. బాలుడు పెరిగి విష్ణుభక్తుడని స్పష్టపడ్డది. కొడుకు యితర మతాలలో కలిసిపోతే యే తండ్రికి దుఃఖ ముండదు? హిరణ్యకశిపుడు శైవుడు, తానే పరమేశ్వరుడని నవ్మాడు. శక్తి తనయందే మూర్తీభవించిం దనుకున్నాడు. ధర్మార్థకామాలు మూడే అతనికి పురుషార్థాలు. అతని సంప్రదాయంలో నాల్గో పురుషార్థం లేదు. తండ్రి తానే రారాజు ననుకుంటుంటే కొడుకు కాయనను సామంతరాజును చేస్తా నంటాడు. తన స్వరాజ్యాన్ని పోగొట్టుటకు సంసిద్ధుడైన కుమారుడికి బోధించాడు. వినకపోతే బాధించటం ప్రారంభించాడు. ప్రహ్లాదుడు తండ్రి పశుబలాన్ని నమ్మి చెడిపోతున్నాడని తెలిసికొన్నాడు. "తండ్రి లోకాలన్నీ జయించా నంటాడు గాని అరిషడ్వర్గాలకు బానిసైనాడు. పశుబలం ఆత్మబలానికి చాలదని యెరుగడు. పైగా ఆత్మబలాన్ని ప్రతిఘటిస్తాడు. ఆత్మబలంమీద మారణసాధనాలు ప్రయోగిస్తున్నాడు. ఆత్మ నెట్లా చంపగలడు?"

మంత్రులు విషప్రయోగం చేయించమని సలహా చెప్పారు. భూతాల వెంకట్రాముడు వచ్చాడు. నల్లతాచులను ఆడిస్తున్నాడు. ఒడిసి పట్టుకోపోతున్నవి. వాటి కుద్రేకం కలిగించవలెనని నాగ

స్వరం తీసుకున్నాడు. నాట్యమాడుతూ పున్నాగవిరాళితో పున్నాగాలకు విరాళి కల్పించాడు.

పున్నాగవిరాళి

" బేత్రాయిసామిదేవుడా - నాయేల్నవాడ. బే.

కాటామిరాయుడా - కదిరీనరిసింహుడా

నీకైనమేటికాడా - నిన్నేనమ్మినవాడ. బే. "

వంతపాటకుడు "పొట్లపేగులు, గోంగూర, రొయ్యపొట్టు, చింతచిగురు" అని కలిపాడు. పాములు తలెత్తినవి పడగలు విప్పి ఆడినవి. కండ్లవిని ఆనందిస్తున్నవి. విషపుతిత్తులు చేపి నాలుకలు కోరుతున్నవి.

సంగీతానికి తలలు తిప్పుతున్నవి. ప్రహ్లాదుడు శాంతం మూర్తీభవించినట్లు తేవారం పాడాడు. శ్రోతలహృదయాలు సంచలించినవి. నరసింహారావుకండ్ల జోటజోట నీళ్లు కారినవి. రామదాసు సమాధినిష్ఠుడై కూర్చున్నాడు. అప్పాదాసు భక్తిపారవశ్యం జెంది వెక్కి వెక్కి యేడుస్తున్నాడు. వెంకటదాసు వీళ్ళమొగాలు చూచి చిరునవ్వు నవ్వాడు. నరసింహారా వీదృశ్యం చూచి ఆలోచనలో బడ్డాడు.

న:- విగ్రహారాధకుల కీ భక్తిపారవశ్యం యెట్లా గలిగింది? "ప్రతిమా స్వల్పబుద్ధీనాం" అన్నాడుగద. స్వల్పబుద్ధు లెవరు? ప్రతిమ అంటే యేమిటి? ప్రహ్లాదుడు యే కేశ్వరోపాసికుడా? ఇంత భక్తు డెట్లా అయినాడు?

పాము ప్రహ్లాదుణ్ణి భస్సుమని వాడిసి కాటందంది. జనులలో హాహాకారాలు మిన్ను ముట్టినవి. విష మమృతప్రాయమైనది. ప్రహ్లాదుడు అచంచలభక్తి రసాస్వాదనం చేత మత్తిల్లి ఆనందపరవశుడై ప్రామాగన్ను పెట్టి మత్తభృంగం వలె చెలరేగి గానం చేస్తున్నాడు. తండ్రి కీసంగతి తెలిసి వేటుతప్పిన వేటకాని వలె కసిమసంగి మారణోపాయాలు విచారించాడు. సముద్రంలో

ముంచాడు. గదాఘాతాలకు శిరస్సు మారుమసిలింది. పర్వత శిఖరాలమీదనుంచి నెట్టించుతే వాళ్ళు చెక్కు చెదరలేదు. ఖడ్గాలు మొక్కపోయినవి. మారణసాధనా లన్నీ నిష్ఫలము లయినవి. పశుబలానికంటే సాత్వికబల మెక్కువని ప్రభువింకా గ్రహించలేదు. "చావడి దేమి చిత్రమో" అనిమాత్ర మనుకున్నాడు. అప్పుడే జిజ్ఞాస ప్రారంభమయింది. తండ్రికి పుత్రుడు గురువైనాడు. గురుశిష్య సంవాద మిట్లా జరిగింది.

శిష్యుడు—:

క. బలవంతుఁడ నేజగముల, బలములతోఁ జనక వీరభావమున మహా
బలుల జయించితి నెవ్వని, బలమున నాడెదవు నాకు ప్రతివీరుడవై.

గు:—

క. బలయుతులకు దుర్బలులకు, బలమెవ్వడు నీకు నాకు బ్రహ్మాదులకున్
బల మెవ్వడు ప్రాణులకును, బలమెవ్వం డట్టివిభుడు బల మసురేంద్రా!

హిరణ్యకశిపునకు ప్రబోధం గలిగింది. భక్తి కుదిరింది. అది విరోధభక్తి. ప్రత్యక్షం చేసుకోవలె నని ఆతురత పడుతున్నాడు. గురువును వేగిరించి అడిగాడు.

శి:—

క. ఎక్కడఁగల డేక్రియ నే, చక్కటి వర్తించు నెట్టి జాడనువచ్చున్.
జక్కడుతు నిన్ను విష్ణుని, బెక్కులు ప్రేలెదవు వానిభృత్యుని భంగిన్.

ఆచార్యోత్తముఁ డపారశిష్యవాత్సల్యంబున బాలవర్తనంబున నర్తనం చేస్తూ "జనిత శ్రమతాపదుఃఖ సంశోషణము"లైన భాషణములతో బ్రహ్మవిద్య నిట్లుపదేశించాడు.

మ. కలఁ డంబోధిఁ గలండు గాలిఁ గలఁ డాకాశంబునన్ గుంభినిన్
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోతచంద్రాదులన్
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటన్
గలఁ డీశుండు గలండు తండ్రీ! వెదకంగా నేల యీ యాయెడన్.

భక్తవశం వదుడయిన శ్రీమన్నారాయణుడు కరుణాంతరంగిత హృదయుండై;

మ. హరి సర్వాకృతులం గలం డనుచుఁ|బ్రహ్లాదుండు భాషింప స
త్వరుఁడై యెందును లేఁడు లేఁడని సుతున్ దైత్యుండు తర్జింప శ్రీ
నరసింహాకృతి నుండె నచ్యుతుడు నానా జంగమస్థావరో
త్కరగర్భంబుల నన్నిదేశముల నుద్దండ ప్రభావంబునన్.

ఇట్లు ప్రత్యక్షోన్ముఖుడై సర్వాంతర్యామియై పరుండైన వానిం గన నశక్తుండై సౌలభ్యరూపసందర్శన కుతూహలుండై కోపాతిరేకంబున త్యక్తాన్యచేష్టుండై బొమలుముడివడ నొక్కఁ మొగి దృక్కులం బరపుతూ:—

క. డింభక! సర్వస్థలముల, నంభోరుహనేత్రుఁ డుండు ననుచు మిగుం
సంరంభంబునఁ బలికెద వీ, స్తంభంబునఁ జూపఁగలవె చక్రిన్ గ్రక్కిన్.

అమందానందకందళిత హృదయుం డగుచు గురుకల్పుండు ముందు చరమావధి నిట్లు బోధించాడు.

క. అంభోజాసనుఁ డాదిగాఁగఁ దృణపర్యంతంబు విశ్వాత్ముఁడై
సంభావంబున నుండు ప్రోడ విపుల స్తంభంబునం దుండఁడే
స్తంభాంతర్గతుఁ డయ్యు నుండుటకు నే సందేహమున్లేదు ని
ర్దంభత్వంబున నేఁడు గానఁబడుఁ బ్రత్యక్ష స్వరూపంబునన్.

హిరణ్యకశిపుడు పుత్రోపదిష్టంబైన మహా వాక్యంబునం దచంచల విశ్వాసంబుతో విరోధభక్తి పారవశ్యుండై కరాళించి లేచి గద్దియ డిగ్గనురికి పూర్వజన్మ సముపార్జితమైన నుగ్రతపంబున బెరిగిన పశుబలమునెల్ల ప్రయోగించి చూపటి నయన శ్రవణ భీషణంబుగా స్తంభాన్ని పొడిచాడు. జగదేకవీరుడై ముల్లోకములం జయించి పాలించిన మహావీరుని కర్మరూపమైన అభ్యుదయము ప్రసాదింప వీర పాత్రోచితములైన రౌద్ర భీభత్స భయానక రసముల ప్రకటించుతూ పెనుగాలికి మిన్నుముట్టే భీకర కెరటములతో ఘోరాకారముం దాల్చి నా సముద్రుని హృదయము చలింపనట్లు అంతరంగమున కరుణారస పరిపూరితుడై యున్నాడు. కరుణా వీరరస సమేతమైన నృసింహరూపం పొడ గట్టింది. బహు కాలములనుండి పట్టగోరిన శత్రువు కళ్ళ బడ్డాడు.

హిరణ్యకశిపు డానందించి శత్రువుపై కురికాడు. కాలపరిపాక సమయంబున బ్రహ్మాండ కబలంబుల చిదుపు నఖంబులూ, నమిలి కబళించు భీకరదంష్ట్రిలూ, హిరణ్యకశిపు నువ్వెత్తుగొనక "సః నౌ భునక్తు" అను శ్రుత్యనుసారముగ భోగించి యాహరించి నవి. వీర పురుషోచితమైన పరమపదము నొంది హిరణ్యకశిపుడు ధన్యుడైనాడు. నాటకం ముగిసింది.

న:- ప్రహ్లాదుని రంజించుటకూ, హిరణ్యకశిపుని భంజించుటకూ కరుణా వీరరస సమ్మిశ్రితమైన అద్భుత దృశ్యాన్ని సందర్శించాం.

రా—నా:- అది పోతన్నగారి అభిప్రాయం. ప్రహ్లాదుని రంజించుటకు నృసింహమూర్తి అవతరించా డని నే దలంచను.

రా—దా:- నృసింహు డవతరించక పూర్వమే ప్రహ్లాదుడు తరించాడు.

అ:- హిరణ్యకశిపుని భంజించి రంజించుటకే నృసింహు డవతరించాడు. వీర కరుణారసాలు జోడించి అద్భుతరూప మందుకే ఆవిర్భవమైంది. పశుబలానికీ, సాత్విక బలానికీ గల తారతమ్యం ప్రస్ఫుటమైంది.

వెం:- యీ కథ చాలాభాగం కల్పితం. యీ సృష్టిలో పశుబలమనీ ఆత్మబలమనీ రెండు శక్తులు లేవు. ఉన్నది వొకటే శక్తి. ధనికులు బీదలను మోసగించడానికి పండితులకు డబ్బిచ్చి ఆత్మశక్తిని సృష్టించారు. హిరణ్యకశిపుని వంటి పౌరుషశాలిని నే నెక్కడా చూడలేదు. అతని ధర్మనిష్ఠ అనుపమేయం. "బహుధా విభజ్య మప్యేవం, నని మేయంతు కస్యచిత్" నన్ను వేయి చీలికలుగా చీల్చినా నే నెవడికీ నమస్కరించనని ఎదురు రొమ్మూ పొట్టా చీల్చిన తర్వాత తొడలమీద బోర్ల పడవేసు కుంటే యెగిసి వెల్లకిలబడి తల ప్రక్కకు తిప్పాడు. యిట్టి దృఢ వ్రతుడు "నభూతో న భవిష్యతి."

జోతి:- అన్న దోపిడితప్పైనా దొంగల ధైర్యం ప్రశంస నీయ మంటాడు.

వెం:- దోపిడి తప్పని నే ననలేదు.

జో:- యింకా పై మెట్టుకే పోయినావు ఆ సంగతటుండ నిచ్చి, విరోధభక్తి మోక్షసాధనమే కాని అనుకరణార్హం గాదు. దేవుడు లేడనేభక్తి లేడనే జీవుడికి మోక్షం రెంటికీ అతికినట్లు కుదిరింది.

అంతా నవ్వారు. నరసింహారావుకు నవ్వు రాలేదు.

రా:- అయ్యా! మీ తర్కాలన్నీ మాకు తెలియవు. మాది మోటు విశ్వాసం. తోచినప్పుడు క్రిష్ణా రామా అనుకుంటాం. గుహుడిమీదా, శబరిమీదా ప్రవహించిన దయ మా మీదికీ కాస్త జారకపోతుందా?

న:- మీది మాలపల్లె గాదు. మునిపల్లె అని చెప్పవలసి వుంటుంది. మీ ఆశ్రమవాసుల సేవ నాకు తరుణోపాయం అవుతుం దని తలుస్తాను.

రా:- పెద్దలు తమరాలా శలవీయవద్దు. తమ ఆశీర్వచనం ఫలించునుగాక!

తెల్లవారు తున్నది. కప్పర చీకటి పోయేవరకు కాలం గడపటంకోసం మాధవి వచ్చింది. కొందరు లేచినవాళ్లు మళ్ళీ కూచ్చున్నారు. జనులకు వుత్సాహం గలిగి చదివింపులు చదివించడానికి నవ్వుపుట్టించే దరువు మెత్తుకున్నది.

౧. "మొక్కిన మొక్కులు చల్లంగుండీ - మొగుడికండ్లు పోతే - నా మొగుడికండ్లు బోతే - కట్టమీది యా అంకాళమ్మకు పెట్టకోళ్ళనిస్తూ.

౨ గండుకుబోయిన యిద్దరు మరుదులు గుండ్లు దగిలి చస్తే - పెద్ద - గుండ్లు దగిలి చస్తే-సాతులూరి యా పోతురాజుకు మేకపోతు నిస్తూ.

౩. చంకనవున్న చంటిపిల్లకూ సన్ని పుట్టిపోతే - మాయగ - సన్ని పుట్టిపోతే - సత్తెనపల్లి గోపాలుడికీ నిత్తెపూజ జేతూ.

వెం:- అవును బిడ్డ తగులాటకం. అదిపోతే అందరుబావల తోను షికార్లు కొట్టనచ్చు. యిక పద.

జనం అంతా నవ్వుతూ లేచారు. ఆవలించి వొళ్ళువిరిచారు. యధాశక్తిగా చొక్కాలూ, వుత్తరీయాలూ పోటీలుపడి చదివించారు. భాగోతులు వూళ్ళో పెద్దలిండ్లకు పోయి ఆటలు వొప్పించుకోవడానికి మేళంతో బయలుదేరారు.

## ౧౮

### ధర్మకన్నాలు

ప్రహ్లాదనాటక మాడిసరోజుననే గుంటూరులో చౌదరయ్యగారి వారసత్వపు దావాకు విచారణవాయిదా. ప్రిన్సిపల్ మునసబు కోర్టులో వ్యాజ్యం దాఖలైనా సారాంశాలుపుట్టి నాలుగు విచారణవాయిదాలు పడి విచారణకు సిద్ధమైనతర్వాత ఆ కోర్టు నుంచి అడిషనల్ కోర్టుకు మార్చారు. అడిషనల్ మునసబుగారు చాలా బద్ధకస్తుడు. సంవత్సరంలో ప్రతిపాదంలో విచారణఫయిసలైన దావాలపట్టీ పంపేనిమిత్తం కొన్ని కేసులు బలవంతంగా రాజీపెట్టించీ, ప్లీడర్లు లేకుండా చూచి కొట్టివేసీ, సాక్షులు హాజరైన దావాలు వాయిదాలువేసీ, హాజరుకానివ్యాజ్యాలు విచారణకు పెట్టించీ పని తేలిక చేసుకుంటుండేవాడు చౌదరయ్య దావాలో వాదిప్రతివాదులు చెరిపాతికమంది సాక్షులకు సమన్లు చేయిస్తున్నందువల్లవిచారణకు వాయిదా వెయ్యకుండానే తిరిగీ వాయిదా వేయుడం నిమిత్తమని రెండుసార్లు వాయిదాపడ్డది. ఏప్రిల్ ౨౦-వ తేదికి ఆఖరువాయిదా వేశారు. సమన్లూ, తిండిభత్యం, దారిభత్యాల నిమిత్తం యాభై రూపాయలు రామదాసు ప్లీడరుగుమస్తాకిచ్చివచ్చాడు. గాని మే నెల ౮-వ తారీఖున కోర్టు కట్టివేస్తారనీ, ప్రస్తుతం పెద్దదావాలు యెత్తుకోరనీ ప్లీడరుగుమస్తా రామదాసు తరఫున వొక్క మునసబుకుమాత్రం సమనుచేయించి తక్కిన వాండ్లను హాజరుపెట్టుకుంటామని వ్రాశాడు. రామదాసు ఈ వాయి

దాకు సాక్షులు రావలసివుంటారా అని నారాయణరావు నడిగితే ఆయన 'విచారణ కాదు; అంతగా విచారిస్తానంటే విచారణ ప్రారంభం చేసి తక్కిన సాక్షులను తెచ్చుకుంటామని చెప్పుతా' నన్నాడు. అందువల్ల రామదాసు తాచ్ఛారంగా వూరుకొని సాక్షులలో వొకడైన వీరదాసునుమాత్రం వాయిదా కోరవలసిందని ప్లీడరుకు వుత్తరం వ్రాసి పంపాడు. ప్రతివాది సాక్షులెవరూ బయలుదేరకపోవడంచేత చౌదరయ్యా సాక్షులకు సమన్లు చేయించీ వృధాఖర్చు అవుతుందని యెవరినీ తీసుకొనిపోలేదు; మునసబుగారు తమవాడనే ధైర్యంతో యేవిధంగానైనా దావా డిక్రీచేయించుకొని రావలెనని పంతులు మాత్రం బయలుదేరాడు. ౧౧ గంటలకల్లా రికార్డ్లూ, ప్లీడర్లూ మునసబులూ కోర్టుకు హారజయినారు.

మునసబు కోర్టు మూసేరోజులుగనుక తన స్వంతగదిలో కూర్చొని అదివరకు విచారణైన కేసులలో తీర్పులు వ్రాసుకుంటున్నాడు. ప్లీడర్లు కొందరు కబుర్లాడుకుంటున్నారు. కొందరు నిద్రపోయినారు. 3 గంట లయింది. పని వున్నవాళ్ళూ, లేనివాళ్ళూ ఫలహారాలకు లేచారు. వాది ప్రతివాదులు గాల్లె సుబ్బమ్మదగ్గర ఫలహారాలు తీసుకొని సాక్షులకు పెట్టుతున్నారు. ప్రైవేట్లు మర్రిచెట్లక్రింద రెడ్డిగాలు వేసుకొని చక్కట్లు చెప్పుతున్నారు. సమన్లకనీ, గుమస్తా మామూళ్ళకనీ పార్టీలదగ్గర వీలైనంతవరకు డబ్బు వొడుపుకుంటున్నారు. యేవేళకూ మునసబుగారు బెంచిమీదికి రాకపోవడం చేత యెక్కడి వాళ్ళక్కడ లేచిపోయినారు. గుమాస్తాలు మాత్రం కనిపెట్టుకొని వున్నారు. మూడున్నర అయింది. మునసబు బెంచిగుమస్తా హనుమంతరావును గదిలోకి పిలిచి ఫయిసలైన నంబర్లు లెక్క వేయించేవరకు చాలా తక్కువగా వున్నవి. హనుమంతరావు "ప్లీడర్లంతా వెళ్ళిపోయినారు. గుమాస్తాలు మాత్రం వాయిదాలు కనుక్కోవడంకొరకు వున్నా" రని చెప్పినాడు. మునసబుగారు ధుమధుమ లాడుతూ బెంచిమీదికి వచ్చి పార్టీలను పిలవమన్నాడు. చాలా కేసులలో పార్టీలూ, ప్లీడర్లూ

లేరు. మొదట పిలిచిన ౧౦ కేసులూ కొట్టివేశాడు. నారాయణ రావుగారి గుమస్తా వాయిదాపిటీషన్ దాఖలుచేశాడు. సమనులు ఆలస్యంగా చేశారనీ హాజరుసాక్షులను తెచ్చుకోలేదనీ వాయిదా పిటీషన్ తోసివేసి వాదుల తరఫున యెవరూ హాజరులేనప్పటికీ అసలు తెత్తుకోకుండా రుజువుభారం ప్రతివాదులమీద వుండడం చేత దావాప్రకారం దావాభూమి స్వాధీనానికీ గత ఫలసాయం-మధ్యఫలసాయం, ఖర్చులకుసహా డిక్రీయిచ్చాడు. పంతులు నకళ్ళకు దరఖాస్తు చేయించి వెంటనేయిచ్చేటట్టు ఏర్పాటుచేసి వెళ్ళిపోయి నాడు. నారాయణరావుగుమాస్తా రామదాసుకుకోర్టువారువాయిదా యివ్వక దావా డిక్రీచేశారనీ కోర్టుతియ్యంగనే ఫీజు తెచ్చియిచ్చి ఖర్చులపట్టీ దాఖలు చేయించుకోవలసినదనీ అప్పీలునిమిత్తం నకళ్ళదరఖాస్తు పడవేశామనీ వుత్తరం వ్రాసి వీరదాసుచేతి కిచ్చాడు.

వీ:- గుమాస్తాగారూ! దావా మళ్ళీ పాటుకు వచ్చేనా?

గు:- మునసబు నంజివట్టు కనబడుతుంది. యకాస్పార్టీ రద్దు చేయడు. అప్పీలుచేస్తే వుపయోగించవచ్చు

వీ:- ఖర్చులు యేమాత్రం పడతవి?

గు:- వేయిరూపాయలదాకా వుంటవి. గత ఫలసాయానికి డిక్రీ యిచ్చాడు. అదొక వేయిరూపాయి లుంటుంది. మధ్య ఫలసాయం కూడా అంతకు కావచ్చు.

వీ:- రామదాసుకు అయిన ఖర్చులు రెండు కోర్టులలో వేయి రూపాయలకు పైగా అయినవి. ఇక అతని కాపురం చితికి పోయినట్టే. ఆత్రానికి అమ్మబోతే అడివి, కొనబోతే కొరివి. దావా ఆస్తి పోతే మిగిలిన ఆస్తికీ అప్పుకూ బొటాబొటిగా సరి పోతుంది. పైగా యీయేడు పునాస బొత్తిగా పోయింది. ఆసామీ యిక పొర్లుకోనడం కష్టం.

గు:- అప్పీలులో గెలిస్తే యివన్నీ తిరిగి రావా?

వీ:- గెల్చేనా?

గు:- సోది చెప్పమంటావా? ఫీజిచ్చి ప్లీడరుగారి నడగండి.

వీ:- అప్పీలు రామదాసు చేయగలడని తోచదు మనిషి దగ్గర ఆశలేదు.

గు:- బొత్తిగా మెత్తులేకపోతే అప్పీలు చేయడం కష్టం. నా మామూలిప్పించు. సలీసుగా అప్పీలు దాఖలయ్యే యేర్పాటు చేస్తాను. మా బంధువుడే వొక ప్లీడరున్నాడు. అప్పీలు మా ప్లీడరుగారిచేతనే చేయిస్తే బాగుండదు.

వీ:- నారాయణరావుగారు దాఖలు చేయరా?

గు:- ఎబ్బె! ఆయన పనికిరారు. వేళ్ళు వంకపెటితేనేగాని వెన్నరాదు. కాస్త వుల్లాసీదాలు చేయలేకపోతే ప్రయోజనం లేదు. ఆయన ముక్కుకు సూటిగా పోతానంటాడు.

వీ:- రామదాసు అప్పీలే చేస్తే మరొకరి కియ్యను. నే సెలవు పుచ్చుకొంటా. రైలు వేళయింది.

వీరదాసు స్టేషనుకుబోయి రైలెక్కాడు. "ఇంకేమి రామదాసు! మర్రిచెట్టును పక్షులు ఆసించుకొన్నట్లు మాలపల్లె అతని నాసించుకొన్నది. సంగదాసు లేని లోపం అప్పుడు తీర్చాడనుకొన్నాం. రామదాసు పూలమ్మిన వూళ్ళో కట్టెలెట్లా అమ్ముతాడు? ఇక వెంకటదాసు జీతానికి కుదరవలసిందేకా! వాణ్ణి పట్టడం కష్టం. యేనో అఘాయిత్తం చేస్తాడు" అనుకొంటూ నిద్రపోయినాడు. రాత్రి రెండు గంటలకు స్టేషన్‌లో దిగి కొంచెంసేపు పడుకుని వూరు దగ్గర తెల్లవార వచ్చాడు. ఈ సంగతి వూరంతా గుప్పుమన్నది. రామదాసు వృత్తాంతమంతా విని "సద్గురూ" అని వూరుకున్నాడు. మాలక్ష్మి కుప్పలుగూలి కూర్చున్నది. వెంకటదాసు మండిపడి ఆస్తి అంతా వాడినే స్వాధీన పర్చుకోనియ్యి. వాడికి వంటబట్టినప్పటికి నే చూస్తా నన్నాడు. ఊరి కూలిజనం అంతా మాలపల్లె నిండింది. నరసింహారావు సంగమందిరం విడిచి మాలపల్లెలో పఠనమందిరంలో బస చేశాడు.

ఈ దుర్వార్త విని మిక్కిలి నొచ్చుకొని రామదాసును ఓదార్చ వచ్చాడు.

రా:- మా సొమ్మైతే మాకుండేదే. విచారించి యేమి ప్రయోజనం !

వెం:- ఈ వేదాంతాలు బీదవాండ్లను మోసం చేయడానికి బుట్టినవి.

రా:- అయ్యా ! వీడు వెర్రివాడు. వాడి మాటలు గమనించకండి. మందిరంలో వుపన్యాసంగదా అక్కడికి పోదామా ? వేళ గావొచ్చింది. మన మెంతసేపు విచారించినా కోర్టు తీర్పు మారదు. శిలాక్షరాలతో వ్రాశారు.

అ:- ఇప్పుడు వ్రాయడమేమి ? యెప్పుడో వ్రాశారు. అయ్యేదేమో కానియ్యండి. మందిరానికి పోదామా ? కాలయాపనెందుకు ?

జో:- జనమంతా యిక్కడనే పోగైనారు. మళ్ళీ అక్కడికెందుకు ? సంభాషణ కూడా ప్రారంభమైంది. ఇక్కడనే పూర్తి చేయండి.

న:- బాగున్నది ఇదివరకే ప్రారంభం చేశాం. కాని యీ దుర్వార్త విన్న తర్వాత సంభాషించడానికి మనస్కరించడం లేదు.

శేషయ్య:- అయినదేమో అయింది—కావలసిందేమో కానున్నది. ఇప్పుడు సభ మానుకోవడ మెందుకు ?

వెం:- ఎందుకీ కూటికీ గుడ్డకూ రాని వుపన్యాసాలు. పనిలేని బోలాయలు కాలక్షేపం చేసుకోవడానికి పుట్టినవి.

శే:- ఇవ్వాళ నాకు పని చూపించు.

వీ:- పని లేకేమి ? కూలిచ్చేవాడు లేడు. ప్రతివాడూ సిళ్ళ కూలికి చేయమంటాడు. నిన్న గుంటూరివాళ్ళు చెప్పుకుంటు న్నారు. పాటకపు పనివాళ్ళంతా సమ్మె కడతారట. ఊరంతా జెండాలు పట్టుకొని వూరేగుతున్నారు.

శే:- వాళ్ళ సమ్మె దేనికి ?

పీ:- బియ్యపు మరలలోనూ ప్రత్తి మరలలోనూ యీయేడు నూటికి నూర్లు లాభాలు తీశారట. కూలీలకు వొక్క పైసయినా యెక్కువ చేయలేదట. వచ్చే శనివారంలోగా కూలి రోజుకు రూపాయి వేయకపోతే పని ఆపుతారట.

శే:- బస్తీ సమ్మెలు నిల్చేదాకా నమ్మకంలేదు. కూలీలకు నీతి తక్కువ. పొట్టాత్రాన లోబడుతారు.

వెం:- నే నొక లాభసాటి బేరం పెట్టిస్తా. భాగస్తులుగా వుండేవాళ్లు పేర్లియ్యండి.

రం:- భాగాలు వేయడానికి శక్తుంటే మన కీబవవ లెందుకు?

వెం:- నా వ్యవహారానికి డబ్బక్కరలేదు.

శే:- నా కర్థమైంది. నీతి దప్పిన వ్యవహారాలు నా మాట కాదు.

వెం:- నీబోటి బలాఢ్యులు వేదాంతాలు చెప్పడం నీచం. ధర్మకన్నాలు వేయడం యెక్కువ పుణ్యం.

పీ:- ధర్మకన్నా లేమిటి ?

వెం:- ఎవడైనా తన కవసరమైన దానికంటె యెక్కువ భాగ్యం పోగుచేసి అవసరమైనవాళ్ళ కుపయోగపడకుండా నిలువ చేసినా, లేక దుర్వ్యయం చేస్తున్నా వాడింట్లో కన్నం వేసి ఆ ద్రవ్యమంతా లోకానికి వుపయోగపరచేటట్టయితే అది ధర్మ కన్నమంటారు. ఈ విధమైన లోకసేవకు తిరుమంగయాళ్వార్ల కైంకర్యమని పెద్ద లంటారు.

న:- దొంగతన మని నే నంటాను.

వెం:- ఏ పేరుతోనైనా పిలవండి. అంతా దొంగలే. కాని వాళ్ళెవ్వారు ? పెద్ద సెట్లు పెద్దదొంగలు. "వణిగ్వరః పట్టణమధ్య చోరః" కొందరు దొంగలు దార్లు కొడతారు. మరి కొందరు బయటినుంచి వచ్చి కన్నం వేస్తారు. మరి కొందరు

పూళ్ళో మేడల్లోవుండి దాళ్ళాల్లో, తూనికెలో పిక్కి, కల్తీచేసీ తప్పు ధరలు చెప్పీ పెద్దశెట్లవుతారు, వీటి సారమంతా కలిసి యింత లావు బొజ్జతో లక్షాధికారనే బొమ్మవుతుంది.

వీ:- అంతా దొంగలయితే రామదాసు బావగూడా దొంగేనా?

వెం:- ఆహా! ధర్మాపన్నాలుచెప్పే ఆయన దొంగలకు తోజుచేస్తాడు. కర్తా కారయితా భేదమాత్రం వుంటుంది. మగ దొంగలూ, ఆడదొంగలూ అనే తేడాదప్ప ప్రపంచంలో దొంగలు కానివారు లేనేలేరు.

వీ:- నీవు కర్తవా? కారయితవా?

వెం:- నేను అసలు సిద్ధాంతిని. గరిమెళ్ళ గంగరాజు మా గురువు. మాది తిరుమంగయ గోత్రం. రుషులు తిరుమంగయ్యా, కంచెర్ల గోపన్న, సర్వా పాపడు.

రా:- మీ కందరికీ వొక నమస్కారం. ఈ రోజు మీ రెవ్వరూ వాణ్ణి కదిలించ వద్దు. మనస్సు చెడివున్నది.

వెం:- దైత్యగంజాయి వనంలో చందనపు మొక్కను. నా జోలి మీ కెందుకు? ఈపూట ధర్మపన్నాలు వినండి - కడుపు నిండుతుంది. మధ్యాహ్నం భోజనం మాత్రం మానివేయండి.

వీ:- దాసూ! పెద్దవాడిని, నే నొక్కసంగతి చెపుతా విను. మీ నాయనది సత్యవాక్యం. పితృవాక్య పరిపాలన చేస్తే అంద రికీ క్షేమం.

వెం:- అవును. పితృవాక్య పరిపాలనం శ్రీరాములవారు చేశారు. దశరథుడు ధర్మమేమీ వదులుకోమన లేదు. అధర్మ మేమీ చేయమనలేదు. రాములు స్వార్థత్యాగం చేయవలసి వచ్చింది; చేశాడు. ధన్యుడైనాడు. ప్రహ్లాదు డెందుకు పితృవాక్య పరిపాలనం చేయలేదు? చేయడానికి వీలులేకపోయింది. తండ్రి గోరింది కేవల స్వార్థత్యాగం గాదు. ధర్మత్యాగం. ప్రహ్లాదుడు తన ధర్మం విడువలేకపోయినాడు. అందువల్ల బాధలు వచ్చినవి.

సహించారు. మీరందరు ఆయనను ప్రశంసించారు. ఇది మీరందరూ వొప్పుకొనే సిద్ధాంతాల ననుసరించి చెప్పే జవాబు.

రా:- (కండ్ల శాంతరసం వొలుకుతూ) నాన్నా-దాసూ-అద్భుతమైన జవాబు చెప్పావు. నిన్ను శాసించడానికి నేను అశక్తుణ్ణి.

న:- అయ్యా! యిది మాలపల్లె కాదు. మునిపల్లె.

వీ:- నీ సిద్ధాంతం ప్రకారం జవా బేమిటి?

వెం:- నీ కెందుకు? న న్ననుసరించేవాళ్ళకు జెపుతాను.

శే:- కాలాతీతమైంది. భోజనాల కిక లేవండి.

వెం:- చాలామంది లేవరనుకుంటాను.

శే:- వేదాంతాలు వినలేదుగా?

వెం:- వాటి పై సంగతులు విన్నారు. సర్వోత్కృష్టమైన సమతా ధర్మం మీకు వుపదేశించబడ్డది. వేదాంతానికి బట్టిన తుప్పు దులిపితే ప్రకాశిస్తూ నిలువబడే ధర్మమిదే. తుప్పు దులపడం సాధ్యమైన పనిగాదు. మానవుడికి దారేషణ, పుత్రేషణాలకంటే ధనేష ఎక్కువ. ఇప్పటి దుస్థితుల కన్నిటికీ లోభమే కారణం. పూర్వం భగవంతు డవతారమెత్తి లోకకంటకులైన రాక్షసులను సంహారించాడని పురాణాలు చెప్తున్నవి. ఏడా శ్రీరాములను యీయుగపు ధనపిశాచాలను సంహారింపమను? వీటికి వెరచిగామాలె, భగవంతుడు అవతారాలు యెత్తడం మానివేశాడు. మీ వేదాంతాల కడ్డంవొచ్చేవి ఈ ధనపిశాచాలే. లోకాన్ని పీల్చి పిప్పిచేస్తున్న ధనపిశాచాలను సంహారింపవలెనంటే ధర్మశాస్త్రాలు చాలా తిరిగి వ్రాయవలసి వస్తవి. ఈ ధర్మశాస్త్రాల ఫలితమే యీ ధనపిశాచాలు. మరొకవిధంగా కూడా చెప్పవచ్చు. యీ లోభుడే తన ప్రభుత్వాన్ని లోకంలో నిరంకుశంగా చెల్లిస్తూ తనకనుకూలమైన ధర్మశాస్త్రాలను వ్రాయించాడు. వీడిసైన్య మపారం. సులభంగాపడేవాడు గాడు. రాజాధిరాజులూ, కోటీశ్వరులూ వీడిపక్షా న్నే వుంటారు. ఈ పోరు రోజు

లలో, నెలలలో సంవత్సరాలలోగూడా తెమిలేది కాదు. శతాబ్దాలు పట్టవచ్చు. వీడు జనాన్ని అంధకారంలో వుంచవలెనని చూస్తున్నాడు. కాని తెల్లవారింది. జనులు ప్రబోధితు లవుతు న్నారు. ఇక యీ నిరంకుశుని బాటు సాగదు. మీ దేవుడు యీ పిశాచాలు దేవాలయాలు కట్టిస్తున్నవనీ, వుత్సవాలు చేయిస్తున్న వనీ, వాటి అధికారం చెల్లవలెనని కోరుతాడేమో ? మీ దేవుడు లంచగొండి. "సహేంద్రతక్షకాయ స్వాహా" అని ఈ సర్పాల తోపాటు మీ దేవుకూడా ఆహుతికావలసి వున్నాడేమో తెలి యదు. ఆయన యింకా కొంతకాల ముండదలచుకొంటే ఫలాపేక్ష రహితుడు గావాలె. మీ దేవుడు ప్రతిఫలం అపేక్షించకుండా ధర్మం చేయవలసిందని బోధిస్తాడు. తానుమటుకు పూర్వకర్మల ననుసరించే ఫలమిస్తాడట. అట్లయితే మీ రెక్కడా? మీ దేవు డెక్కడా? ధనపిశాచాల చేతుల్లోనుండి మీ దేవు డీవతలబడాలే. మీ దేవుడికి ముందు వైరాగ్యం బోధించండి. ఆయననుగూడా దౌర్భాగ్యులైన యీ బీదలకందరికీ వుపకారం చెయ్యమనండి. భాగ్యవంతులపక్షం విడవమనండి.

న:- దేవు డేమిచేశాడు? బీదవాళ్ళను బాధపడమన్నాడా? భాగ్యవంతులను బాధపెట్టమన్నాడా ?

వె:- అయితే ఆయన యేమన్నాడు ?

న:- ఆయనమార్గాలు తెలుసుకోవడం కష్టం. కొందరు కష్టాలవల్లనే తరుణోపాయం పొందుతారు. కొందరు కష్టపెట్టగల స్థితియందుండి వెనుకబడతారు. హరిశ్చంద్రుడు విశ్వామిత్రుని కంటె అనేకరెట్లు అధికమైనాడు. బీదవాడైన కుచేలుడూ, చక్ర వర్తి అయిన జనకుడూ తరించారు! భాగ్యమూ, దారిద్ర్యమూ ఖడ్గం వంటివి. రెండూ సక్రమంగా వుపయోగించుకొంటే మాన వుని గట్టుచేరుస్తవి. చైత్ర, వైశాఖమాసముల లోని వుష్ణవాయు వులు కొందరికి బాధాకరంగా వుండవచ్చు. కాని ఆ వాయువులే నూతనసంవత్సరమున పుష్కలంగా వర్షం కురవడానికీ, సస్యాలు

పెరగడానికీ కారణ మవుతవి. కాలచక్రం దొర్లేటప్పుడు కొందరు దానికిందపడి నలగక తప్పదు. కాని చక్రమాగదు. అది యెంత దూరమో పోవలసివున్నది. సమయానికి పోకపోతే యెన్ని యేర్పాట్లో చెడిపోతవి కాని చక్రంకింద బడ్డవాళ్ళకు సహితం తరుణోపాయమున్నది. మానవబుద్ధి స్వల్పం. సృష్టిక్రమమంతా ఆద్యంతాలు అవగాహన చేసుకోలేరు. మానవుడు సంకుచిత పరిస్థితులలో నున్నమాట వాస్తవం. భూతభవిష్యత్తులు వానికి దెలియవు. అతనిదృష్టి క్రమంగా విస్తరిస్తున్నది. ఏసుపుకంటే యెక్కువ చూస్తున్నాడు. అందరికంటె వ్యాసుడెక్కువచూశాడు. "ఊర్ధ్వలోకాలలో మన జ్ఞానచక్షువు వికసించి యిప్పటి యిరుకు హద్దులను మించి బహుదూరం చూడగలరు" అని తోస్తుంది. కాలపరిపాకానికి వేచియుండడం మంచిది. వేచియుండక చేసేదీ లేదూ, క్రమేణ అమృతత్వం సర్వజ్ఞత్వం రాక తప్పవు.

నిశ్చలహృదయుడైన రామదాసు నిట్టూర్పు విడిచాడు. అప్పాదాసు తబ్బిబ్బులైనాడు. జోతి యేడుస్తున్నది. వెంకటదాసు చప్పరించి పెదవివిరిమకి "మీా వుపన్యాసానికి భాగ్యవంతుల కేమి ఆక్షేపణా వుండదు. ముందెప్పుడో భాగ్యవంతులకూ, బీదలకూ కూడా తరుణోపాయం వున్నదంటారు. యెప్పుడో, యెక్కడో యేవిధంగా వుంటుందో యెవరికీ తెలియదు. దేవుడిమార్గాలు మనకు తెలియవని తమరే చెప్పారు. చచ్చిపోయిన తరువాతిసంగతులు వచ్చిన తర్వాతనే ఆలోచించుకుందాం. ఆగోల యిప్పటి నుంచీ యెందుకూ? మన హద్దులలోపలి సంగతులుమాత్రమే మన మాలోచించుకుంటే వుపయోగం. మీాభాగ్యవంతులలో యెవడైనా వుభయులు చచ్చినతర్వాత తీర్చుకొనే షరతుమీాద ౧౦౦ కి నూరు వడ్డీకి వ్రాసుకొనియైనా వొకరూపాయి బదులిస్తాడా? రెంటి కొకటిచొప్పున మా నెడుగింజలు నాగుకిప్పించండి. అందరికీ తరణోపాయం వుండేకాడికి యిక్కడ బీదతనానికి యెవడొప్పుకుంటాడు? అందరూ భాగ్యవంతులమే కావలెనంటారు.

అప్పాదాసు:- కొందరు బుద్ధిపూర్వకంగా భాగ్యాల్ని త్యజించి సన్యాసం పుచ్చుకున్నవాళ్ళు లేరా?

వెం:- కొడుకులకు వొప్పగించి కొందరు సన్యాసాలు పుచ్చుకొంటారు. అప్పటినుంచీ తమభోజనఖర్చు యింట్లోకూడా లేకుండా పరాయియిండ్లలో గడుపుకుంటారు. బిడ్డలులేనివాడు వొకడెవడైనా సన్యాసం పుచ్చుకొన్నా అది అస్వాభావికపు చర్య. సన్యాసులే కాకుండా కొందరు డబ్బుపారవేసే పిచ్చివాళ్లుకూడా వున్నారు. సాధారణ పరిస్థితులను మనం యోచింతాం. కనుక పరలోకంలో అందరికీ స్వర్గ మిస్తామని చెప్పినా యీ లోకంలోకూడా అందరూ భాగ్యం కావలె నంటారు గాని బీదరికం కావలెనని యెవరూ అనరు.

అ:- దేవుడు సుఖదుఃఖములను కలిగించడములో వారివారి పూర్వ కర్మలను బట్టి నిర్ణయిస్తాడు. తక్కువ నోములు నోచి యెక్కువ ఫలాలు కోరితే యేమి ప్రయోజనం?

వెం:- పంతులుగారు యీ జన్మంలోని తరతమస్థితులకు జవాబుదారీ కాబోయే జన్మలమీదికి నెట్టితే నీవు వెనక జన్మల మీదికి తోస్తున్నావు. కాని పర్యవసానం వొకటే. మన కర్మల ప్రకారం మనం అనుభవించేకాడికి మధ్య దేవుడి ప్రాజాపత్య మెందుకూ? ఆయనను వెడిగెలగా కూర్చోబెట్టవచ్చు. ఆయన చూచేవాడూ, చేసేవాడుకూడా కాడట. పాపం అటువంటి అనాయకుడితో మనకేమీ తగాదాలేదు. అసమర్థుడు యెక్కడున్నా వొకటే. వున్నా, వూడినా వొక్కటే. నేను లేనివాడి కిందనే లెక్కపెడతాను.

అ:- ఆయన లేడనుకో. మన ప్రాప్తాన్నిపట్టే మనకు లభిస్తుంది. ప్రాప్తం లేనిది రాదు.

వెం:- ఆ సిద్ధాన్తం చాలాభాగం నేనూ వొప్పుకుంటాను. ఈ రాత్రి గడ్డపారలు తీసుకొని బయలుదేరుదాం. తిరుమంగని

పేరుచెప్పి ధర్మకన్నాల మూలంగా యెవరికి ప్రాప్తమున్నది వాళ్ళం తెచ్చుకొందాం.

శే:- ఈ వాదం. తెగేది కాదు. భోజనానికి లేవండి.

అందరూ లేచారు.

## ౨౯

## గాలిలో గండభేరుండం

వ్యాజ్యం డిక్రీ అయిన వారంరోజులలోగా కంఠంరాజు గుంటూరు పోయి దావాభూమి స్వాధీనానికి వుత్తర్వుపొంది గత ఫలసాయం, ఖర్చులూ వసూలుపర్చు కోవడానికి జప్తుదీసుకొని అమీనాతో సహా మంగళాపురంలో హాజరైనాడు. జవానును జూచి జనమంతా పోగైనారు. అమీనా మునసబు కరణాలను బిలిపించి దండూరా వేయించి యిండ్లూ, పొలాలూ, పశువులూ మొదలైన యావత్తు స్థిరచరాస్తీ జప్తుచేశాడు. రెండువేల మొత్తానికి జామీ నిచ్చేవాండ్లు గుదరక చరాస్తి యావత్తూ బండ్ల కెత్తించాడు. తాగే చెంబూ, తినే కంచం, పండే మంచం కూడా విడువలేదు. జప్తు అయిన తర్వాత భూమి స్వాధీనం నిమిత్తం పడమర పొలాలకు పోయినారు. పదియకరాలూ మిరప తోట వేసివున్నది. ఈయేడు తోటలు లేతనబడి అంతటంతట చినుకులు పడుతూ పైర దోలడంచేత బాగా చెట్టుగట్టి చాళ్ళల్లో నడవడానికి వీలులేకుండా విస్తరించి వున్నవి. ఇంకా తొలికోత కోయలేదు. తోటలు బెట్టకురాక నిదానంగా సగంకాయ పండినా యింకా పూతా, పిందా విడులుతున్నది. చక్కగా యెరువుదోలి పాటుచేసిన పొలం గనుక మొదటి కోతకే యకరం పుట్టికి పైనవుతుం దంటున్నారు. కన్ను చెదిరేటట్టు తోట యెర్రగావుంది. మంచి బళ్లారి విత్తనం. చూచేవాండ్ల కండ్లు గుట్టేటట్టు కాయ వూరి తోట అమ్మతల్లాలె తాండవ మాడు తున్నది. సీకాయ కుంశలు పెట్టారు. ఈయేటి ధరలమీద చెడి

అమ్మేకున్నా రెండువేల రూపాయలు యెత్తేవి. రామదాసు ఈ కాయలమ్మి గత ఫలసాయానికి అడ్డం పెట్టవచ్చుగదా అనుకున్నాడు. మింగే సమయాన కుత్తికె పట్టుకొని పైరుతోసహా అమీనా భూమి స్వాధీనం చేశాడు. వెంకటదాసు వూళ్ళో లేక పోవడం మేలైంది. రామదాసు పొలంచాయల రాలేదు. అప్పాదాసు బడికి సెలవిచ్చి మాలక్ష్మి నోదారుస్తున్నాడు. చెంబులూ, తప్పేలలూ బయట పడవేయడం చూచి మాలక్ష్మి భరించలేక పోయింది. గాదెలూ, పాతళ్లూ దీసి వీధిలో కుప్ప పోశారు. పొరుగువాండ్లు సామాను దాచుకోమన్నారు గాని రామదాసు వొప్పుకోలేదు. ఘడియ కిందటివరకూ రామదాసు మోతుబరు ఆసామి. ఆ సాయంత్రానికే వంట పాత్రలూ, గింజలూ లేవు. సిరి యెంత చంచలమయినదో రామదాసు ప్రత్యక్షంగా చూచాడు. యింట్లోవున్న చిల్లరడబ్బులతోగూడా జప్తులో పడిపోవడంచేత పానపాత్రల కోసం కుమ్మరింటికి పోయిరావలె నను కొనికూడా సందేహించి వూరుకున్నాడు. అప్పాదాసు వంట చేయవలెనని లేచాడు గాని వుప్పుతో తొమ్మిదీ కోమటింటినుంచి రావలసి వస్తుందని మొదట తోచలేదు. చౌదరయ్య జప్తుచేసే చోటికిగాని, స్వాధీనానికిగాని రాలేదు. యావత్తు గ్రంథం పంతులే జరిగించాడు. స్వాధీనం చేసుకొని వస్తూ యావదాస్తీ గుంటూరుకు బండ్లకెత్తించారా అని అజగనుకొంన్నాడు. హడావుడిగా వూళ్లోకీ, పల్లెకూ తిరుగుతున్నాడు. అమీనాకు గారెలతో సహా కోమటింట్లో భోజనం యేర్పాటయింది. జప్తు ఆస్తికి మట్టసంగా ధరలు వేయించాడు. పని యావత్తూ పూర్తి చేసి చౌదరయ్యకు వినిపించాడు.

చౌ:- (పెదవులు విరిచి) తోరణం గట్టంగనె పెండ్లిపూర్తి అయిందా? నీ ప్రజ్ఞంతా ముందు చూపాలె.

పం:- ఇంతవరకు వచ్చింది ఆగుతుందటలే. నీవు వుబ్బించి చాకిరీ చేయించడానికి మొనగాడివి. ఇదివరకు చూపిన ప్రజ్ఞకు వేసే హారమేమిటో వెయ్యి.

చౌ:- అనుకున్న పని నెరవేరడమే ఫలం. లాభనష్టాల కేమిగాని పని తలపెట్టుకున్న తరువాత నెరవేరేవరకూ నాకు నిద్ర పట్టదు. మందిరం వేలం వేయడానికి వీలైతే కొన్ని పశువులు కట్టివేయిస్తా. దొడ్డి సరసన పీడగా వున్నది.

పం:- ప్లీడరుగారిని ఆలోచిస్తే వీలుపడదన్నాడు. అందు కనే జప్తు చేయించలేదు. తక్కినవన్నీ వేలమయి స్వాధీనమయిన తరువాత దాని సంగతి యెత్తుకుందాం. ఇప్పుడే దాన్ని కదిలిస్తే అలగా జనం రేగుతుంది. అటు తరువాత మనకత్తి కెదురుండదు. మన యిష్టం వచ్చినట్టు జరిగించుకోవచ్చు. ముందు వీండ్లను వూరు వదలనియ్యి.

చౌ:- మందిరం వేలం అయితేనేగాని పిల్లవాడు బాటుకు రాడు. ఈ వ్యవహారం అంతా పూర్తి అయిన తర్వాత జప్తు చేయించి చూతాం. వ్యవహారం తప్పినస్తే వొకరాత్రి దులిపిస్తా. అది నే వూళ్ళో లేనప్పుడు జరగాలె. లేకపోతే పిల్లవా డనుమాన పడుతాడు.

పం:- నీ వేమీ తొందర పడవద్దు. చూస్తూ వుండు. అన్ని కార్యాలూ చక్కపడతవి. దానితో యీ వూరికి మాలపోడు వదులుతుంది.

రామానాయు డారోజు వూళ్లో లేడు. పొద్దుపోయి వచ్చి సంగతి యావత్తూ విని పంతులును పిలిపించాడు.

రా:- పంతులుగారూ! యేమి యింత అన్యాయానికి తల పడ్డారు?

పం:- ఇందులో అన్యాయ మేమున్నది? డిక్రీ అయిన సొమ్మూ పొలమూ రాబట్టుకోకుండా యెవరైనా వూరుకొంటారా? మూడు లక్షలకు కవిలె పెరిగింది గదా. జప్తులూ, వేలాలూ

లేకుండా, ఎట్లా వ్యవహారం జరుగుతుంది? తమరొక్క విషయం మాత్రం గమనించాలె. నేను వృత్తికులకు బద్ధుణ్నై నడిచేవాణ్ణి. రావణ స్వస్తి రామ స్వస్తే నా వుద్దేశ్యం. ప్రస్తుతం మీ నాయన గారి అమలు చలామణి అవుతున్నది. వారి వుద్దేశాలు తూచాలు పోకుండా నిర్వహిస్తున్నాను. ఆయన పట్టుదల మనిషి. ఏదో ఒక విషయం నిర్ధారణ చేసుకొని దానిని నిర్వహించడానికి సాధక బాధకాలు నన్నడుగుతాడు. తమరు వారితో ముచ్చటించి వారి వుద్దేశం మార్చగలిగితే ఆ తక్షణం యావదాస్తి రామదాసుకు నే స్వాధీన పరిపిస్తాను. నా విషయమై తమరు అన్యథా తలంచ వద్దు. నాకు యింకొక ఆలోచన కూడా పోతూవున్నది. తమరు వొక్కరే మాట్లాడడంకంటే వెంకటయ్యద్వారా గాని, ఇద్దరూ కలిసి గానీ హెచ్చరించడం మంచిపని నాకు తోస్తున్నది.

రా:- అన్నతో మాట్లాడాను. మేము మాట్లాడి యేమీ ప్రయోజనం లేదంటాడు. వ్యాజ్యం వేసినప్పుడే అన్న మాట్లాడడం, కాదనిపించుకోవడం అయిపోయింది.

పం:- అయితే యిక వట్టిమాటే. రామదాసుకు మంగళాపురపు నీళ్ళు రుణం దీరినట్లే యెంచుకోవలసి వుంటుంది.

రా:- ఏమి అట్లా మాట్లాడుతున్నారు?

పం:- అది అంతే. మీరు మీ వుద్యమం మానుకుంటే రామదాసు గట్టున పడవచ్చు. మానుకొన్న తక్షణం మీ నాయన తాళపుచేతులు మీకు వొప్పజెప్పుతాడు.

రా:- నేను మానుకోవడం రామదాసే వొప్పుకోడు. వాళ్లు దేశమ్మకొరకులై పోనన్నా పోతారుకాని నేను వుద్యమం విడవడానికి అంగీకరించరు. నేను ఉద్యమంలో ఉండడానికీ, వాళ్ళను బాధించడానికీ సంబంధమేమున్నది?

పం:- వాళ్ళవల్ల మీరు చెడిపోతున్నారని మీ నాయన గారి నమ్మకం. మొదటినుంచీ వారి కదే కోపం. దాని మీదనే ఆవేశాలు పెరిగినవి.

రా:- నేను వుద్యమం విడిచేమాట అబద్ధం.

పం:- తమ చిత్తం. శెలవు పుచ్చుకుంటాను.

మరునాడు వుదయం వెంకటదాసు బండి తోలుకొని వచ్చాడు. ఇంటి స్థితి చూచాడు. తండ్రితో యే సంగతీ హెచ్చరించలేదు. కోపపడి అల్లరి చేస్తాడని అంతా అనుకున్నారుగాని ఆ జోలి తలచలేదు. రాత్రింబగళ్ళూ యేదో ఆలోచిస్తున్నాడు. దిగాలపడి కూర్చుంటాడు. పొద్దుగూకులూ పని చేసేవాడికి వూరికె కూర్చోవడం కష్టంగా వున్నది. ఇప్పుడప్పాదాసు కుటుంబానికి తారకమయినాడు. “విచారానికి మొదటి వుధృతం వుండదు. రోజుల పేరట తగ్గిపోతుంద”ని తటస్థంగా వూరుకున్నాడు రామదాసు. పాలుమాలి యేదైనా పనికి పొమ్మన్నా పోక వెంకటదాసు పడుకొని నిద్రపోవడం ప్రారంభించాడు. కొన్నాళ్లు నిద్రపోయి విసుగెత్తి బయటికి పోవడం మొదలుపెట్టాడు. ఇల్లు పట్టకుండా తిపాసిలాగు తిరుగుతున్నాడు. ఒక రోజు సాయంత్రం రామదాసు యింట్లో వాండ్లందరినీ కూర్చోబెట్టి కుటుంబ స్థితిగతులను గూర్చి ముచ్చటించాడు.

రా:- మనకు కానిరోజులు వచ్చినవి. దైవం అనుకూలించకపోతే అన్నీ ప్రతికూలిస్తవి. ఇండ్లూ, మాగాణీ, సావరం కూడా దక్కుత వని నమ్మకం లేదు. డిక్రీ అయిన రెండువేలూగాక మధ్యఫలసాయం ఆరువందల రూపాయలూ మనం ఖర్చుల కోసం చేసిన వెయ్యీ కలుపుకుంటే సెట్టి మిగులుతాడు. కోర్టు ద్వారా వేలంపడితే బాకే మిగులుతుంది. యితర బాకీలుకూడా చౌదరయ్య కొనవలెనని ప్రయత్నం చేస్తున్నాడట. మనం అప్పీలు చేసి ప్రయోజనం లేదని నారాయణరావుగారు చెప్పారు. చేసే తాఖతు కూడా మనదగ్గర లేదు. జీవించి వున్నంతవరకు తినక తప్పదుగదా ? యిండ్లు వేలంబడి వెళ్ళగొట్టించుకొన్నదాకా యిక్కడుండడంకంటే ఏదో చిన్న యిల్లు చూచుకుని మట్టసంగా కాపురం గడుపుకోవటం అవసరం. కొద్దీ గొప్పా రావలసివుంటే

తెచ్చుకొని యింతవరకు తిన్నాం. ఇక అప్పడి రెక్కలమీద ఆధారపడవలసిందే. వాడి నెలసంపాదన మన కుటుంబానికి పది రోజులకంటే రాదు. బండీ, యెద్దులూ జప్తుగాకుండా వున్నవి. తక్కిన ఆస్తి చౌదరయ్యచేతిలో పెట్టి మనలను ఋణవిముక్తులను చేయవలసిందని కోరుదాం. యెద్దులను పదిలంగా వాడుకుంటే పది కాలాలపాటు బాడిగె సాగవచ్చు. వెంకటదాసుది కొరమాలిన విచారం. కుటుంబాన్ని యీదే భారం వాడిమీద వేసుకుంటే మనం కూటికి పేదలమైనా గుణానికి పేదలం గాకుండా వుంటాం. భాగ్యవంతులం గావడం మన చేతులలో లేదుగాని, నీతిమంతులం గావడం మన చేతిలో పని. జోతిని వొక అయ్య చేతులలో పెట్టి నా భారం వదిలించుకుంటా. ఏతావతా చంటివాడు మిగిలుంటాడు. ఇంకా పదేండ్లు వాణ్ణి దగ్గరతీసేవాళ్లుంటే వాడికీ రెక్కలు వస్తవి. యెవరిగొడ్లదగ్గిర వున్నా పొట్టకూ, బట్టకూ గడుస్తుంది. మా ముసలివాండ్ల సంగతి యెట్లైనా యిబ్బంది లేదు.

మా:- నేను ఈ వూళ్ళో వుండలేను. కాననికంతనపడి దూరంగా బోయి అంతా కూలి చేసుకుని బ్రతుకుదాం.

జో:- ఊరు విడిచి లేచిపోయినా, లేక యిక్కడే వున్నా పంతులు పని, సంపాదించుకొని పిల్లవాడినీ, ముసలివాండ్లనూ పోషించే భారం నాది. నా పెండ్లిసంగతి మీరు పెట్టుకోవద్దు.

వెం:- ముసలివాళ్లు జోతిని కనిపెట్టుకొని వుండండి. బండి, యెద్దులూ మీరే తీసుకోండి. అప్పుడు పెళ్ళి చేసుకొని వాడి దారిన వాడుంటాడు. నేను లోకానికి విందునై సంచారం బయలుదేరుతాను. మరి వొక ప్రార్థన వున్నది. చౌదరయ్యకూ, మీకూ రాజీ వద్దు. ఒకటి రెండు కూనీలు గానిదీ యింట్లోకి యితరులను అడుగు పెట్టనియ్యవద్దనే నా అభిప్రాయం. మన సంగణ్ని మింగిన పులి యింకా స్వేచ్ఛగా విహరిస్తున్నది. అది మానుష్యరక్తం రుచిగన్నది. మన సంసారం మింగటానికి సిద్ధమైంది. యీ రాక్షసులకు దేవుడూ, రాజుగూడా విచ్చలవిడిగా

విహరించడానికి పట్టాలిచ్చారు. మీ ధర్మశాస్త్రాలన్నీ భాగ్యవంతులు పేనించిన పురులు. బీదల కంఠాలకు వురులు. నేను మీ రాజుమీదా, దేవుడిమీదా సవాలే. ఉభయుల చట్టాలకూ అతీతుణ్ని. దారం దెగిన గాలిపడిగన్నై సంచరిస్తాను. అడవులలో మృగాన్నవుతాను. గాలిలో గండభేరుండాన్ని, నీళ్ళలో తెప్పనై తేల్తాను.

అందరూ నిశ్చేష్టులై మాట్లాడకుండా కూర్చున్నారు.

జో:- అన్నా! నీ ధర్మనిష్ఠ ప్రశంసనీయం. రాజుకంటే బలమైన సాత్విక ధర్మమార్గాన్ని సంగన్న చూపించాడు. నీ మార్గం అధర్మం, అసత్యం, లోకకంటకం.

వెం:- ధర్మానికి వ్యవస్థ లేదు. దేశకాలపాత్రలనుబట్టి వుంటుంది. ధర్మం చాలాకాలం క్రిందటనే పెడదారి బట్టింది. నేను చేసే యుద్ధం ధర్మయుద్ధం. పౌరుషమనీ, ప్రతాపమనీ, దేశాభిమానమనీ, ధర్మరక్షణమనీ పేర్లుపెట్టి స్వలాభ ప్రేరితులై భాగ్యవంతులు లక్షలకొలది బీదజనులను రణరంగాల్లో బలిదీస్తారు. లోభుని ప్రతినిధులైన, ధర్మ వినాశకులైన భాగ్యవంతులమీదనే ధర్మయుద్ధం ప్రకటిస్తాను. రాజులు యుద్ధాలు చేసి దేశాలను నాశనం చేస్తే, నేను స్వల్ప సంఖ్యాకులైన భాగ్యవంతులను నాశనం చేస్తాను. వాళ్ళు సంఘాలను దోస్తే, నేను కుటుంబాలను దోస్తాను. వాండ్లు అధర్మ చట్టాలను ఫిరంగుల బలంతో చలాయించుకుంటే, నా బాహుబలంతో నా వుత్తర్వులను అమల్లో పెడతాను. భాగ్యవంతుల ధన ప్రాణ రక్షణం అతడు చేస్తే, బీదలకు జీవనోపాధి నేను కల్పిస్తాను. దొంగలమయితే వుభయులమూ దొంగలమే. రాజు పెద్దదొంగ, నేను చిన్నదొంగను.

రా:- (అచంచల హృదయంతో, ప్రసాదవాక్కులతో) రేపు మళ్ళీ సంభాషింతాం.

అందరూ భోజనం చేశారు. వెంకటదాసు కొఠంలో పడుకున్నాడు. రామదాసు గురుకీర్తనలు పాడి నిద్రించాడు. జోతి

అప్పాదాసుచేత పాండురంగ మహాత్మ్యంలో కొన్ని పద్యాలు పాఠం చెప్పించుకొని పడుకున్నది. కుటుంబ వ్యవహారా లిట్టి దుస్థితిలో వున్నా పరిస్థితులేమీ మారకపోయినా దినచర్య జరుగు తున్నది. తెల్లవారి లేచిచూస్తే వెంకటదాసు కనబడలేదు. వారంరోజులు జాడాలుదీసినా చేతి కక్కరకు వచ్చినవాడు, పెద్ద కొడుకు, దక్షతతో వ్యవసాయం చేసి కుటుంబ పోషణ చేసిన వాడు. తండ్రిని మునివేళ్ళతో పని ముట్టుకోనియ్యకుండా సుఖపెట్టిన వాడు, కుటుంబం మహదవస్థలో వుంటే చెప్పకుండా లేచిపోయి నాడు, వెంకటదాసు స్వాభావికంగా యితరుల వ్యవహారాలతో జోక్యం కలుగజేసుకోకుండా తనపని చూసుకుంటూ వుండేవాడు. మితభాషి. చిన్నతనంలో స్వల్పంగా చదువుకున్నా సంగదాసు ప్రోత్సాహంచేత కొంత భాషాజ్ఞానం కలిగింది. అసాధారణమైన దేహబలం గలిగి తదనుగుణ్యమైన నిర్మల హృదయంతో ప్రతి వాళ్ళతోనూ అరవిడిచి మాట్లాడేవాడు. కొరకొరలాడే స్వభావం గాకపోయినా తమ్ముడి దుర్మరణం, దానికి ప్రతిక్రియ లేకపోవడం అతని మనస్సులో నాటి అస్వాభావికమైన ద్వేషమును పురిగొల్పి నవి. చౌదరయ్య ధనతృష్ణకు బలియై నశించిన కుటుంబాలు చూసి ధనికులకు ప్రబల శత్రువైనాడు. లోకంలో అందరి దుస్థితికి ధని కులే కారణమనీ, ప్రపంచంలోని వస్తుభండార మనుభవించడానికి సమస్త జనులకూ హక్కు గలదనీ, లోకంలోని నేరములకు ప్రస్తుత విషమ పరిస్థితులే కారణములనీ అతని నమ్మకం. ఇంత కాలం నుంచి ప్రపంచ పరిస్థితులు క్రమక్రమంగా హీనస్థితికి వస్తున్నా ధర్మ సంస్థాపనకై యే సంస్కర్తా పూనుకోనందుకు విచారపడ్డాడు. తమ కుటుంబాస్తి పూర్తిగా నశించి పోకపోయినా మర్యాదగా జీవించిన కుటుంబం మంగళాపురంలో జీవనం లేక బండి తోలీ, కూలి చేసీ జీవించడం దుర్భరంగా తోచింది. నూతన పరిస్థితులకు తగినవిధాన వర్తించుటకు అతనికి సాధ్యమైంది గాదు. రామ దాసుకున్న చిత్తశుద్ధి అతనికి లేదు. ఎట్టి కష్టస్థితులు వచ్చినా

కాలు నిలువత్తొక్కుకొని సమదృష్టితో చూడడానికి తోడ్పడ గల సంస్కార మలవడలేదు. కాని తండ్రివలె లోకదుస్థితినిజూచి వగచి వూరుకుండు స్వభావం కాదు. యథాశక్తిగా లోక సంస్కరణమునకై పోరాడు వీరస్వభావం గలవాడు. అతని ఆదర్శాలెంత ధర్మబద్ధములైనా సాధనశుద్ధి లేని పరమావధులు కళంక మాపాదిస్తవని తలచండు. మనిషి కేవలం ఆదర్శప్రియుడు గాడు. కార్య సాధనమే ప్రధానమని యెంచు స్వభావం కలవాడు.

వెంకటదాసు యిల్లు విడిచి పోంగనే రామదాసు యిండ్లూ కొట్టాలూ ఖాళీచేసి అప్పాదాసు స్థలంలో పాకలు వేసికొని పై గుడ్డలతో వెళ్ళి ప్రవేశించాడు చౌదరయ్యా తాను ఆర్డరు వేయించు కున్న నోట్లనుబట్టి దావాలు దాఖలు చేయించి బండీ, యెద్దులూ కూడా ఫైలు జప్తు చేయించాడు. డిక్రీలన్నిటికీ వేలం యిస్తిహార్లు ప్రకటించారు. కోర్టువారి వుత్తర్వు పొంది స్థిరచర రూపకమైన యావదాస్తీ చౌదరయ్యే తనపేర కొట్టివేయించుకున్నాడు. ఆస్తి యావత్తూ పోగా యింకా రు. ౮౦౦ లు బాకీ నిలిపి పెట్టాడు. అయినా వచ్చి యిండ్లూ, భూములూ స్వాధీనపర్చాడు. శేషించిన బాకీనిబట్టి సంగమందిరాన్ని జప్తు చేయిస్తే అప్పాదాసు పిటీషన్ దాఖలుచేసి వదిలించుకున్నాడు. రామదాసు కష్టాలింతటితో పూర్తికాలేదు. తాలూకాబోర్డు ప్రెసిడెంటు చౌదరయ్యా ప్లీడరు. రాజకీయ వ్యవహారములలో అప్పాదాసు జోక్యం కలుగజేసు కుంటున్నాడనీ, కూలి సమ్మెలకు నాయకుడనీ చౌదరయ్యా కలెక్టరుకు మహజర్లిప్పించాడు. కూలీ సమ్మెలకు మంగళాపురం ముఖ్య స్థానమని కలెక్టరు కదివరకే తెలిసింది. విషయం పూర్తిగా విచారించి తగిన చర్య జరిగించవలసిందని కలెక్టరు తాలూకాబోర్డుకు పంపించాడు. ప్రెసిడెంటు గ్రామంలోకి పోయి విచారించి మహజరు సంగతులు వాస్తవం అనీ, అప్పాదాసును మరివొక చోటుకుబదలా యించినా సమ్మెలు వ్యాపిస్తవనీ, నవుకరీలోనుండి తొలిగించడమే మేలనీ, అతనివల్ల చార్జీ వొకటి జేసుకున్నాననీ కలెక్టరుకు తెలియ

పరచాడు. పిల్లలు కొందరు బోర్డు హైస్కూలుకు పోయినారు. మిగిలినవాండ్లకు అప్పాదాసే బడిపెట్టి చెప్పుతున్నాడు. మొదటి ఉత్సాహంలో పిల్లలు జీతాలిస్తామన్నా వసూలు కావడంలేదు. జోతికి వూళ్ళో పని కుదురలేదు. పొరుగూరు పంపడానికి తండ్రి సందేహిస్తున్నాడు. ఆయన కుటుంబానికి వచ్చే ఆదాయం లెక్క-చూచి వొంటిపూట భోజన మేర్పాటు చేశాడు. ఒకరోజు సాయంత్రం వుపవాసం చేసిన తర్వాత మర్నాడు రెండు ఝాము లకు వడ్లు రోటబోసి దంచి అన్నం వండుకున్నారు. మగవాళ్ళకూ పిల్లలకే హాసీహాసీగా సరిపోయింది. మాలక్ష్మికి మిగలలేదు. సాయంత్రానికి పిల్ల మెతుకులైనా లేకపోయినవి. మాలక్ష్మి తన కన్నంలేదని చెప్పలేదు. చెప్పి చేసేదేమిటి. సాయంత్రం మామూ లుగా అందరికీ పస్తే అయింది. మాలక్ష్మికి వరుసగా మూడుపూట లుపవాసం. మంచినీళ్లు దాగి పడుకున్నది. సాయంత్రం చంటిపిల్ల వాడి కన్నం లేదు. మాలక్ష్మి ముడుచుకొని పడుకున్నది. నిద్ర పట్టలేదు. పిల్లవాడు ఝాముపొద్దు పోయినప్పటినుంచీ అన్నం పెట్టమని యేడుస్తున్నాడు. తల్లిదగ్గిర యెన్నిసార్లు పాలు దాగినా జీరకూడా రాలేదు. కొనచిటికెలు కూడా అయిపోయినవి. తేపా అన్నం పెట్టమని పిల్లవాడడుగుతాడు. మాలక్ష్మికి కడుపు దరించు కొని పోతున్నది. పిల్లవాడు పాలియ్యమని వేధిస్తున్నాడు. నవిలిన కొద్దీ బొడిమెలు మంటలు పుట్టుతున్నవి. విసిగి పిల్లవాణ్ణి దూరంగా పడుకోపెట్టింది. పిల్లవాడు—"అమ్మా! బాయే,!" అన్నాడు.

మా:- ఏమి బాయిరా? లేవు, పడుకో. బూచి వస్తుంది.

పిల్లవాడు:- (అయిదు నిమిషాలు తాళి) అమ్మా! బాయే!

మా:- తండ్రీ! నామీద దయలేదు? ఈ పిల్లల బాధ నే చూడలేను. (అని ధ్యానం చేసుకున్నది.)

పిల్లవాడు:- అమ్మా! బాయే!

మాలక్ష్మికి కోప వచ్చింది. జవాబు చెప్పలేకపోయింది పాపం! ఏమి జవాబు చెప్పుతుంది.

పి:- అమ్మా! బాయే!

రామదాసు:- ఏమే? నిద్రపోతున్నావా? పిల్లవాడు లేచి యేడుస్తున్నాడు. పాలియ్యి.

మాలక్ష్మి:- ఏమిపాలిచ్చేది, మూడుపూట లయింది అన్నం తిని.

రా:- మధ్యాహ్నం తినలేదా?

మా:- మధ్యాహ్నమా! తిన్నానులే.

రా:- ఏ మట్లా అంటావు?

మా:- ఏమీ లేదులే.

రా:- నీకు అన్నం మిగల్లేదా?

మా:- మిగిలిందిలే!

రామ:- ఓయి సద్గురూ! ఇప్పటికి మాలక్ష్మికి మూడు పూటలు అన్నం లేకుండా చేశావా?

మా:- ఏమీ విచారపడవద్దు.

రా:- పొద్దున కూలికి పోదాం.

మా:- ఆ, కూలవలసిందే. కూలికిపోనూ నాకు నాలేది. నీవు యేమి కూలి చేస్తావు?

అ:- మామా! పెదబావ భావాలు నా కిప్పు డర్థమైనవి. ఈ బాధ చూడకుండా పోయినాడు. అతడే ధన్యుడు.

జ్యోతి:- ఆయనది అక్రమ మార్గం. ధైర్యంతో నిలువ బడాలె. శ్రమపడి సంపాదించాలె. సాధ్యంకాకపోతే ఆత్మహత్య మేలు. అదీ తప్పని తోస్తే యిల్లాగే మెదలకుండా పడుకోండి. కావలసిన కార్యాలు గంధర్వులు తీరుస్తారు.

రా:- ఓయి సదురూ!

# ౨౦

## పా ది రీ లు

సుమారు 300 యేండ్లనుంచి గుంటూరు జిల్లాలో క్రైస్తవ మతం వ్యాపకంలో వున్నట్లు కనుపడుతుంది. పల్నాడు, సత్తెనపల్లి తాలూకాలలో కొన్ని వూళ్ళయందు బ్రాహ్మలూ, కోమట్లూ, పంచములూ దప్ప దక్కినవాళ్ళంతా జ్ఞాన స్నానం చేసి కతోలిక్కు మతాన్ని స్వీకరించారు. ఒకప్పుడు క్రైస్తవా క్రాంతములైన బ్రాహ్మణపల్లి మొదలయిన గ్రామాలలో యిప్పు డొక్క క్రైస్తవుడూ కనబడడు. ఏ కారణాలచేత, యే హిందూ మత బోధకులు యే శాఖలలోకి యెవండ్లను కలుపుకున్నారో చెప్పడానికి దృష్టాంతాలు కనబడవు. క్రైస్తవమత ప్రచారకులు పూర్వం దౌర్జన్యం కూడా వుపయోగించి హిందువుల నంగులు సమాధులు పాడుచేసినట్టు దృష్టాంతాలు కనబడుతున్నా మొత్తం మీంద రెండు మతములూ సయోధ్యగానే వున్నట్టు మనం యెంచ వచ్చు. ప్రస్తుతం సంపూర్ణమైన క్రైస్తవ గ్రామాలు పాడిబండ, పొడపాడు, తాళ్ళచెరువు, రావిపాడూ మాత్రమే. ఇతర గ్రామా లలో కతోలిక్కు లున్నా హిందువుల ప్రాముఖ్యం తగ్గలేదు. సాధారణంగా తొగట, రెడ్డి, Xండి కొటకమ్మ తెగలవారే క్రైస్త వులైనారు. వీరు మతాంతరులైనా ఆచార వ్యవహారాలలో హిందువులనుండి విశేషంగా భేదించరు. ఆకారములలో మార్పు లేదు. రాజకీయ వ్యవహారాలలో పాదిరీలకు కేవలం దాసులుగా నున్నవాళ్లు తప్ప విశేష సంఖ్యాకులు మతేతర విషయాలలో పాది రీలు జోక్యం కలుగజేసుకోకూడదని వారిని ప్రతిఘటించి కూడా కొన్నిచోట్ల హిందువులతో ఐకమత్యం చూపించారు. ప్రస్తుతం కతోలిక్కు ప్రచారకులు హిందువులకు బోధించి తమ మతములో కలుపుకొనే పద్ధతి మానివేశారు. హిందువులతో వివాహ సంబం ధాలు చేయవలసి వచ్చినప్పుడు మాత్రం మాధ్వులు స్మార్తులతో సంబంధం చేసే మోస్తరుగా వధూవరులకు జ్ఞానస్నానం ఇప్పిస్తారు.

ఇప్పు డీ జిల్లాలలో విశేషంగా వ్యాపిస్తున్నది ప్రాటెస్టెంటు క్రైస్తవం. పంచము లిందు ముఖ్యంగా చేరుతున్నారు. హిందువులు ప్రతిఘటించకపోతే కొద్ది కాలంలో పంచము లందరూ క్రైస్తవులై పోవచ్చు. ఇంతవరకు చాతుర్వర్ణములవారు ప్రాటెస్టెంటు మతములోకి చేరకపోవడానికి జాతిభేదము నంగీకరించకపోవడమే కారణమని యెంచి యికమీద ప్రాటెస్టెంటు మతములో చేరువారు తమ జాతి కట్టుబాట్లు విడువవలసిన పని లేదనీ, పై వర్ణములవారికి పంచమాదుల సంబంధం లేకుండా, వేర్వేరు దేవాలయములు పెట్టించవలసిందనీ అమెరికా పాదిరీలు కొత్త యెత్తులు యెత్తినట్టు తెలుస్తున్నది. ఇది యెంతవరకు పారుతుందో చూడవలసి వున్నది. ఇంతవరకు మంగళాపురపు పంచములు క్రైస్తవులు కాలేదు. సంగదాసు ప్రభ సాగకపూర్వం కొందరు ప్రచారకులు మహోపన్యాసా లిచ్చారుగాని వారికి ఆను చిక్కలేదు. రామదాసు ప్రతిఘటించి వాదించాడు. సంగాదాసు ఆక్షేపణలకు జవాబు చెప్పలేక పాదిరీలూ, బోధకులూ రావడమే మానివేశారు. చౌదరయ్యా హిందూమతాభిమాని. కమ్మవా రెవరూ బీరుపోలేదు. చౌదరయ్యా సెకలక్రింద నిభాయించలేక మునసబు పాదిరీల అండ చేరాడు. శిస్తులో మునసబు యెక్కువ వసూలుచేసినట్టు డిప్టీకలెక్టరు దగ్గర చౌదరయ్యా చార్జీ పెట్టించి సాక్ష్యం పలికించాడు. డిప్టీకలెక్టరు భర్తరఫు చేశాడు కాని రెవరెండు బ్రౌన్‌సన్ అడ్డికొట్టుకు పేర నవుకరీ పెట్టించి తమ్ముణ్ణి గుమాస్తాగా యేర్పాటు చేయించాడు. ఆపద మొక్కులు యెన్ని మొక్కినా వెంటనే తీర్చే మామూలు మనకు లేదు. మునసబు చివరకు మతంలో చేరలేదు. మాలలను చేర్పించేటందుకు తగుసహాయం మాత్రం చేస్తానన్నాడు. మంగళాపురంలో రామదాసు కాపురం భిన్నమైపోయిన తర్వాత ప్రచారకులు మళ్లీ మంగళాపురంమీదికి దాడివెళ్ళారు. యీ గ్రామం పట్టుకోందీతక్కిన గ్రామా లలివయ్యేటట్టు లేవు. ఒకపాదిరీ, యిద్దరుపంతుళ్ళూ పొరుగుగ్రామాలలో పనిచేసే వుపదేశకులూ మంగళాపురంలో దిగారు. మాలమాదిగెపల్లె లింకా వారికి చోటు

పెట్టలేదు. మునసబు ఆహ్వానించి వారికి గావలసిన సామగ్రి ఇచ్చి తనకొట్టంలో నిలిపాడు. మంగళాపురం రహదారీ గ్రామం. దారి తలస్థల మొకటి గొని గుడి కట్టిస్తారనీ, కొత్తబడి పెట్టిస్తారనీ ప్రచారకులు జనులను పూరిస్తున్నారు. రామదాసు మతం స్వీకరిస్తే మేనల్లుడికీ, కూతురికీ పెద్దజీతా లిచ్చి వుపాధ్యాయులుగా యేర్పాటు చేస్తానని సోలతులు నడుస్తున్నవి. హిందూమతం పనికి రాదనీ, క్రైస్తవ మతమే మంచిదనీ వొప్పిస్తే తాను నిరభ్యంతరంగా కలుస్తానన్నాడు రామదాసు. ఈ షరతుపై బూకరింపే గాని మనసులో మతం స్వీకరించవలెననే వున్నదనీ, పొట్టే వొప్పిస్తుందనీ ప్రచారకులు పాదిరీకి చెప్పారు. ఇదివరకు క్రైస్తవ మతానికి వ్యతిరేకంగా వున్నాడు గనుక వ్యతిరేకంగా కొంత చర్చ జరిపి తర్వాత తా నోడిపోయినట్లు నటించి క్రీస్తుమతమే సత్యమతమని ప్రకటించి మతస్వీకారం చేస్తాడని నమ్మారు. ఒక రోజు సాయంకాలం మంగళాపురంలో హిందూ క్రైస్తవ మతాలను గూర్చి చర్చ జరుగుతుందని చుట్టుపట్ల గ్రామాలలో ప్రకటించారు. కొందరు పంచములూ, గురు సంప్రదాయములకు చెందిన హిందూ మహమ్మదీయులూ, కొందరు కతోలిక్కులూ వచ్చారు. చౌదరయ్య స్వాభావికంగా హిందూ మతాభిమాని గావడం చేతనూ, పాదిరీ తనకు మునసబు పని రాకుండా పాత మునసబు కొడుక్కిప్పించి నందువల్లనూ, మునసబు పాదిరీ పక్షం చేరడం చేతనూ, రామదాసు కాపురం చితకడంతోటే కూలి సమ్మెలు సశిస్తవని భావించడం చేతనూ పాదిరీని వూళ్ళో అడుగు పెట్టనిస్తే తనధాటి సాగదని యోచించుకొని ఆ సభలో హిందువుల పక్షమే వహించి కూర్చున్నాడు. అష్టాది వర్ణాలూ, మహమ్మదీయులూ సంబ్రంబం చూడవచ్చారు. సభ సంగమందిరం దగ్గర యేర్పాటైంది. చౌదరయ్యను గౌరవించి లోగట్టుకోవలెననే వుద్దేశ్యంతో యీ సభకు చౌదరయ్యగారు సభాపతిగా వుండవలసిందని పాదిరీ కోరాడు. అందుకు చౌదరయ్య అంగీకరించి కూర్చున్నాడు.

ఇది మునసబుకు కారం రాచినట్టయింది. పాదిరీకి భయపడి దూషణవాక్యా లాడలేదు. పాదిరీ ప్రస్తుతం తనపట్టున్నా పాదు గుదిరిన తర్వాత చౌదరయ్యతో చేరడమే నిశ్చయమనుకున్నాడు. అప్పుడు మాత్రం యెటూ చెప్పక ముభావంగా గూర్చున్నాడు.

జాన్సన్‌గారు పాదిరీ తెలుగుతో మంగళాపురవాసులకు తాను దెచ్చిన సువార్త యిట్లని వినిపించాడు:

ఒకటి రెండు పంక్తులు పాదిరీ తెలుగును మా చదువరులకు రుచి చూపించి తర్వాత దేశ తెనుగులో పాదిరీగారి సువార్తను వినిపిస్తాను.

"ఓ నశానైమ్ఫోయే జన్లారా! మీ కొఖ్మాటా సెపుకోంటాన్; ఇన్‌ఖోండి.

ఖోండి. మీళ్లు రఖ్లూ, రెఖల్ ఖూ. ఫూజచేయఖండీ, కండీ. ఆ యేస్తూ ఆకశ్మంనుండి ఫ్రాడిపడినా ఏస్తు, లోఖంలోని పెఘాత్ములఖూ ఏస్తు మీరు నమ్మండి, నమ్మండీ" దేవుడు వొకడే వున్నాడు. ఒక్కడే అయినా తండ్రీ, కుమారుడూ, పరిశుద్ధాత్మ అని ముగ్గురు వ్యక్తులు వేరుగా వున్నారు. వీరు ముగ్గురూ కలిసి వొకడే దేవుడు. దేవుని ఆజ్ఞచే అయిన కుమారుడు మనుష్యుల యందలి ప్రేమచేత వారిదోషములను పోగొట్టడానికి పాలస్తీనాలో యేసుక్రీస్తునై అవతరించి సువార్తను దెలిపి సిలువమీద యూధుల చేత చంపబడ్డాడు. పరిశుద్ధాత్మ కరుణాస్వరూపుడు. మీరు యేసును నమ్మితే ఆయనద్వారా మిమ్మును దేవుడు రక్షిస్తాడు. ఈ సువార్తను క్రీస్తుయొక్క ఆజ్ఞ ననుసరించి లోకానికి వినిపిస్తున్నాం.

రామదాసు:- అన్ని మతాలూ దేవుడు వొక్కడనే చెప్తవి. దేవతలు అనేకు లుండవచ్చు. వారిని యితర మతస్థులు దేవదూతలు మొదలైన పేర్లతో బిలుస్తారు. బ్రహ్మపర్యంతం దేవత లనే హిందువుల నమ్మకం.

బ్రా:- కొందరు హిందువు లట్లా చెప్పరు.

రా:- అజ్ఞానుల మాట లెక్కలేదు.

అ:- క్రైస్తవమతంలో దేవుళ్లు ముగ్గురైనట్లా? ఒక్కరైనట్లా?

బ్రా:- ముగ్గురూ ప్రత్యేకవ్యక్తులే కాని వొకడే దేవుడు.

అ:- ఈ ముగ్గురూ కాక ఇంకొక డున్నాడనా?

బ్రా:- ఈ ముగ్గురే వొకడు.

అ:- అయితే తమరు చెప్పింది మేము గ్రహించడానికి చిన్నప్పుడు మేము నేర్చుకొన్న కూడికలు మరిచిపోవలసివస్తుంది. దేవుడు వొకవ్యక్తి, కుమారు డొకవ్యక్తి, పరిశుద్ధాత్మ మరివొక వ్యక్తి. ఈ మూడు కూడితే మూడు కావాలె కాని వొక డెట్లా అయిందో నాకర్థం కాలేదు.

బ్రా:- త్రిత్వంయొక్క స్వభావాన్ని గ్రహించడం కష్టమని మా పెద్దగురువులే చెప్తూతారు. అది గోచరం కాదు.

అ:- అది మీకైనా తెలిసిందా?

బ్రా:- లేదు.

అ:- అయితే మీరూ, మేమూకూడా ధన్యులం. అంతటితో దాన్ని వదిలిపెట్టండి.

రా:- మీరు చెప్పిన మూడువ్యక్తులూ దేవుడిమూడు తత్వాలుగా గ్రహిస్తే సమన్వయం చేసుకోవచ్చు నని నా తలంపు. ఈశ్వరతత్వం, రక్షక తత్వం, కరుణాతత్వం. ఈ మూడూ ప్రత్యేకవ్యక్తు లనుకోవడంలో మీరు పొరబడుతున్నారు. భగవంతుని అనంతకళ్యాణగుణములలో యివీ చేరిన వనుకుంటే యే బాధా వుండదు.

బ్రా:- అదంతాకాదు. మీరు నమ్మవలసింది. రక్షణ కలుగుతుంది.

రా:- నమ్మకపోతేనో?

బ్రా:- సువార్త విని నమ్మకపోతే మీలోపం. మీకు రక్షణ వుండదు.

రా:- సువార్త వినని వాండ్ల గతేమి?

బ్రా:- వాండ్లసంగతి బైబిలులో చెప్పలేదు. వాండ్లకూ రక్షణ వుంటుందేమో!

రా:- తమరు మావూరు దయచేసి మాకు జేసిన వుప కారమా యిది. ఇది వినకపోతే మాకు రక్షణ వుండదేమో! మాకు నచ్చేటట్టు చెప్పలేకపోతిరి. కరిచీ గాటుపడకుండా చేస్తిరి. సహేతుకంగా వుంటే నమ్మకం కుదురుతుంది గాని నరకంలోకి తోస్తామని బెదిరిస్తే మనసు కుదురుతుందా? బలవంతంగా ముక్కు-పట్టించ గలరుగాని "ఓంభూః" అనిపించడం యెవరితరం?

బ్రా:- ఇది బైబిలుబోధ. అది దేవుడిచ్చినగ్రంథం.

రా:- చాలా బాగా వున్నది.

బ్రా:- యేసుక్రీస్తు దేవుడు కాడా?

రా:- దేవుని అంశానపుట్టాడని నా నమ్మకం. భగవంతుడు,

"యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత।
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.
పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్.
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే."

అని స్పష్టంగా చెప్పాడు. భగవంతుడు అన్ని దేశాలలోను అవసరమైనప్పుడల్లా తన అంశను అవతరిస్తాడు. మా దేశంలో అనేక అవతారాలు వ్యక్తీకృతం అయి అనేక విషయాలు బోధించినవి. ఏసుక్రీస్తు అవతారం అంటే మాకాశ్చర్యం కాదు.

బ్రా:- ఆయనకూడా అవతారం అయితే మీరు ఆయన ద్వారా యెందుకు ప్రార్థించగూడదు?

అ:- మధ్యవర్తి యెందుకు? దేవుడికి చెవుడా? కుమారుణ్ణి అవతార మెత్తించేటప్పుడు తనచెవు లాయనకు యెరువుపెట్టి పంపాడా? మళ్ళీ వచ్చినతర్వాత తీసుకోలేదా?

బ్రా:- నీవు దేవుణ్ణి యెగతాళి చేస్తున్నావు.

అ:- క్షమించండి. యెగతాళిచేయవలెనని నా అభిప్రాయం కాదు. మీరు చెప్పేవిషయాలు ఎగతాళిపంచాగంగా వున్నవి.

బ్రా:- ఈ విషయం వదిలిపెట్టి యింకొకసంగతికి బోదాం.

అ:- ఈవిషయం వదిలిపెట్టమంటే మీరు తెచ్చిన సువార్తనే వదలిపెట్టమని అర్థం. దానిని మీరుకూడా వదలిపెడతారా?

పాదిరీగారు జవాబు చెప్పలేదు.

రా:- నా కొక్కసంగతి సెలవియ్యండి. మా మతంలో లేని విశేష విషయాలు మీ మతంలో యేమున్నవి?

బ్రా:- "నీసోదరుని నిన్నుగా భావించి ప్రేమించు. నీ కేమి ఇతరులు చేయుచుండవలెనని కోరుదువో, నీవు అట్టివే వారికి చేయవలసింది." ఇవి సర్వోత్కృష్టమైన సూత్రాలని భావిస్తాం.

రా:- అందుకేమీ సందేహం లేదు. ఈ విషయములనే ఇంకా విస్తరించి మాఋషులు చెప్పారు.

౧ ఆత్మవత్సర్వభూతాని యః పశ్యతి స పండితః.

౨ తనయందు నిఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబున బరుపు వాడు.

౩ క. ఉపకారికి నుపకారము, విపరీతము కాదు సేయ వివరింపంగా
నపకారికి నుపకారము, నెప మెన్నక సేయువాఁడు నేర్పరి సుమతీ!

౪ క. ఒరు లేయవి యొనరించిన, నరవర! యప్రియము తనమనంబునకగుఁ దా
నొరులకు నవి సేయకునికి, పరాయణము పరమధర్మపదముల కెల్లన్.

అని పండిత పామరవేద్యంగా బోధించబడ్డవి. మీ సోదరత్వం సంకుచితం. మానవులమట్టుకే వర్తిస్తుంది. తెల్లమానవులకు మాత్రమే అని కూడా చెప్పవచ్చు. పిపీలికాది బ్రహ్మపర్యంతం సమభావమే మా ఋషులు బోధించారు.

బ్రా:- ఈ ధర్మం మీరు ఆచరిస్తున్నారా?

రా:- మీలో అనుభవంలోకి వచ్చిందా?

బ్రా:- మీరు చెప్పేప్రకారం అవతారాలు అన్నిదేశా ల్లోనూ వున్నప్పటికీ ఏసు సర్వోత్కృష్టమైన అవతారం. తక్కిన అవతారాలు ఆయనతో యేవిధంగానూ పోల్చతగవు.

రా:- యెందువల్ల ?

బ్రా:- శ్రీకృష్ణుడు వ్యభిచారి. మీదేవుడికంటె మీరే మంచివాండ్లు.

రా-నా:- మీరు చాలా అపచారం చేశారు. మీరు తెలి యనివిషయాలు చర్చించపూనుకొంటే హాస్యాస్పదు లవుతారు. ముందు స్వమతాన్ని సిద్ధాంతం చేసుకొని తరువాత పరమత ఖండనం ప్రారంభించాలె. మీరు దూషించినవిధంగా మీ దేవుణ్ణి దూషించడం నా కిష్టంలేదు. మీరు చెప్పే ఆక్షేపణలు మీకే తగిలివస్తవి. చూపించడానికి సామ్యంకోసం మీ బైబిలులోని కొన్ని విషయాలు కనుపరుస్తాను. మీరు అన్యథాభావించవద్దు.

బ్రా:- ఈ విషయాన్నిగురించి మీరు మాట్లాడుతారా ?

రా-నా:- అవును.

బ్రా:- దూషణ చేయకూడదు.

రా-నా:- మీరు చేసినంత చేయను. మీ గ్రంథాలలో నుంచి దృష్టాంతాలు చూపిస్తాను.

బ్రా:- మా బైబిలు వ్రాసినవాండ్లలో కొందరు వ్యభి చారు లని నే వొప్పుకుంటాను. అవతారపురుషుడైన యేసును గురించి చెప్పాలె.

రా-నా:- అట్లాగే కానియ్యండి. మీ దేవుళ్ళను గురించే మాట్లాడుదాం. ఈ క్రింది సంగతులు నిజమేనని అంగీకరిస్తారా ?

"దేవుడి కుమారుడైన యేసు మరియమ్మ అనే ఆమెను జోసేఫు అనే ఆయనకు యిచ్చి వివాహం చేయడానికి నిశ్చితార్థం జరిగినతర్వాత కన్యగా వున్నప్పుడే ఆమెకు జన్మించాడు. యిది సత్యమేనా ?"

బ్రా:- అవును.

రా-నా:- ఏసు గర్భస్థుడు గాకపూర్వం మరియా జోసెఫు లకు స్త్రీ పురుష సంబంధం కలిగిందా ?

బ్రా:- లేదు.

రా-నా:- అట్లయితే యేసు జన్మ విషయంలో కొంత న్యూనత కలిగిందని మనము నమ్మగూడదా ?

బ్రా:- కూడదు. పురుషసంబంధం లేకనే గర్భస్థు డయి నాడు.

రా-నా:- యిది సాధ్యమా ?

బ్రా:- సామాన్యుల విషయంలో సాధ్యము కాదుగాని, ఆయన విషయంలో సాధ్యమైంది.

రా-నా:- సాధ్యమైందని నమ్మమంటారు. అది నమ్మడా నికి సాధ్యంకాదనేవాళ్లు న్యూనత వున్నట్టే యెంచవలసిందిగదా ?

బ్రా:- అది వొక గొప్ప అద్భుతం. దేవుని కేది అసాధ్యం?

రా-నా:-ఆయన జన్మకు పురుషసహాయ మవసరం లేకపోతే స్త్రీ సహాయ మేల అవసరమైంది ? ఉభయ సహాయాలూ లేకుండా అయోనిసంభవుడై పుట్టిపడ్డట్లయితే మీరు చెప్పేది నమ్మ డానికి వీలయ్యేది. అంతకంటె గొప్ప అద్భుతం లేకపో యేది. ఆయన మాటలు అందరూ నమ్మేవాళ్లు. ఇప్పుడు అనుమానానికి ఆస్పదం అయింది. నీతికి దూరమైం దని కొందరు అనుకొంటున్నారు.

బ్రా:- అట్లయినా ఏసుక్రీస్తు లోప మేమున్నది ?

రా-నా:- ఏ స్త్రీయైనా వ్యభిచరిస్తే, ఆ లోపం ఆమె వొక్కతెకే వుంటుంది. సంతానానికి ఆపాటంచకపోవచ్చు. దేవుడు యేరికోరి ఆ సంబంధానికి జన్మిస్తే ఆయన అవినీతిని అంగీకరించిననా డవుతాడు.

బ్రా:- పురుషసహాయం లేకనే దేవుడు మరియమ్మద్వారా యేసును జన్మింపజేశాడు.

రా—నా:- మీ కొత్త జవాబువల్ల యేసు కంటిన దోషం పోకపోగా తండ్రికికూడా దోషం ఆపాదిస్తున్నారు. మరియమ్మ దేవుడిభార్య కాదుగదా ?

బ్రా:- ఈ విషయాలు మానవ దృష్టితో చర్చించడానికి సాధ్యం కాదు.

రా—నా:- ఇదీ వొక సదుపాయమే ? శ్రీకృష్ణునికికూడా ఈ సదుపాయ మేల చూపరాదు ?

బ్రా:- మీ రాధాకృష్ణ మతాన్ని గురించి నాకు కొంత చెప్పండి. గోపికల చరిత్రను ఎట్లా సమర్థిస్తారు ?

రా—నా:- ప్రతి మానవుడుపరమేశ్వరుని తల్లిగా, తండ్రిగా, దయితగా, తనయునిగా, ప్రియ సుహృదునిగా, మిత్రునిగా, ప్రభువుసిగా, గురునిగా, గతిగా భావించి ప్రేమించవచ్చు. "పితా పుత్ర మాతృ ప్రజా నాయికా నాయక ప్రభుభృత్య గురుశిష్యాది" పదమూడు సంబంధములలో నొక్కదానిని ఆదర్శంగా గొని మత కర్తలు మత సంప్రదాయాల నేర్పరిచి వున్నారు. క్రైస్తవులు భగవంతుని తండ్రిగా, మహమ్మదీయులు ప్రభువుగా ప్రేమించి గౌరవిస్తారు. హిందూ విజ్ఞానార్ణవంలో వివిధ సంప్రదాయాలు, త్రయోదశ సంబంధాలూ ఆదర్శాలుగా దీసికొని సాధనోపాయాలు కల్పించారు. ప్రహ్లాదుడు, హనుమంతుడు, రాధ, అర్జునుడు, యశోద మున్నగు వారిని ఆయా సంప్రదాయాలవారు ఆదర్శాలుగా దీసుకొంటారు. పూర్వ సంస్కారాన్నిబట్టి యెవరి కేది హితవో, ఆయా సాంప్రదాయాల ననుసరిస్తారు. రాధాగోపికలు నాయకునిగా ప్రేమించారు. సంబంధా లన్నిటిలో నాయకీ నాయక సంబంధమే యెక్కువ బలవత్తరమైనది; శృంగారరస ప్రధాన మైనది; హిందూవిజ్ఞానమునకు కిరీట మైనది. ఆర్య విజ్ఞాన వనవాటికలో భగవద్గీత పుష్పరాజ మని పొగిడారు. గాని భాగవతం ఫలరాజం, శుక ముఖవిగళితం. నవరసస్ఫూర్జితం,

శృంగార రసార్ణవం. తమ రడిగిన ప్రశ్నకు విజ్ఞాన ధనుడైన పోతన్న గారే,

ఆ. గోపజనములందు గోపికలందును, సకల జంతులందు సంచరించు
నామహాత్మునకుఁ బరాంగన లెవ్వరు, సర్వమయుఁడు లీల సల్పెఁగాక.

మత్తకోకిల:-

ధర్మకర్తయు ధర్మభర్తయు ధర్మమూర్తియునైన స
త్కర్ముఁ డీశుఁ డధర్మశిక్షయు ధర్మరక్షయు సేయఁగా
నర్మిలిన్ ధరమీఁదఁ బుట్టెఁ బరాంగన జనసంగ మే
ధర్మమంచుఁ దలంచి చేసె? నుదాత్తమానస! చెప్పుమా.

అనే ప్రశ్నకు గోపికలే వాకచోట;

మ. పతుల న్బిడ్డల బంధుల న్సతులకు న్బాటించుటే ధర్మప
ద్ధతి యౌనంటివి దేహధారిజులకున్ ధర్మజ్ఞ! చింతింపుమా
పతి పుత్రాదిక నామమూర్తి వగుమన్ బాసిల్లు నీయందుఁ ద
త్పతి పుత్రాదిక వాంఛలం జలిపి సంసేవించు టన్యాయమే?

అని ప్రశ్నానురూపమైన జవా బిచ్చారు.

బ్రా:-పరమేశ్వరుని నా భర్తా యని పిలిచి ప్రేమించుట భావ్యమా? మగనా లట్లు పిలువవచ్చునా?

రా-నా:- తక్కిన స్త్రీలు పిలవడానికి మీారు ఒప్పుకుంటారా?

బ్రా:- పరిశుద్ధమైన భగవంతునితోడి సంబంధా న్నీ విధంగా అపవిత్రం చేయటం న్యాయం గాదు.

రా-నా:- నాథా అని పిలిస్తే తప్పు. నా తండ్రీ అనగా నా అమ్మమగడా అని పిలిస్తే పవిత్రం. మగనాలు భగవంతుణ్ణి నాథా అని పిలిస్తే భర్త మచ్చరిస్తాడని మీా భయం? తండ్రీ అని పిలిస్తే యింకొకణ్ణి తెచ్చావని మన తల్లిదండ్రులు మనతో పోట్లాడుతున్నారా? పితృసంబంధానికంటే భర్తృసంబంధం యేల నూన మని భావిసారో? శ్రీరామునకూ - సీతకూ, సావిత్రికీ

సత్యవంతునకూ వుండే సంబంధం, పవిత్రతలో ఏ సంబంధాలకు తీసిపోతుంది?

బ్రా:- భగవంతునితోడి పితాపుత్ర సంబంధం దైహికం కాదు.

రా:- కావచ్చు, కాకపోవచ్చు; మేరీ యశోదలు తమ పుత్రులను ప్రేమించి ధన్యులైనారు. వీరి సంబంధం దైహికమా? కాదా? సంబంధం దైహిక మైనంతలో న్యూనత యేమున్నది? అట్లాగే నాయకి నాయక సంబంధం యేవిధంగానైనా వుండ వచ్చు. భగవంతునితో యేవిధంగా సంబంధం వున్నా మనుజులు పవిత్రులు గాక తప్పరు.

అదిగాక పై వివిధ సంబంధాలలో వ్యక్తమయ్యే ప్రేమ వేరుగా భావించగూడదు. వివిధసంబంధములలో వివిధ రూపము లుగా ప్రకాశిస్తుంది. ఐహిక సంబంధములలో వ్యక్తమగు ప్రేమను విస్తరింపజేసి ఐహిక వ్యక్తులనుండి పరత్వరూపాన్ని పొందించ గలిగితే మోక్షం చేకూరక తప్పదు.

ఈ విధంగా వ్యక్తిపూజకూ, పరత్వపూజకూ, గలసంబం ధము హిందువులు పూర్తిగా గ్రహించారు. ప్రతి భార్యకూ తన భర్తే శ్రీకృష్ణుడు కావచ్చు. ప్రతితల్లీ యశోద కావచ్చు.

అ:- ప్రతిభార్యా యేల ముక్తికాంత కాగూడదు? భువన ముల సమ్మోహింపజేసే జగన్మోహిని ప్రతి ప్రియురాలియందూ వ్యక్తము కాదా? దైహికసంబంధం వున్నా లేకున్నా ప్రేయసే ముక్తికాంత. భగవంతుడే ప్రియురాలూ, పుత్రుడూ, భృత్యు డూను. ప్రేమస్వరూపునితో నేవిధంగా సంబంధ మున్నా మను జులు తరిస్తారు.

బ్రా:- యీరోజుకు సభ చాలింతాం.

అ:- మేము చెప్పినవి మీకేమీ నచ్చలేదా?

బ్రా:- బాగా తెలియలేదు.

అ:- మీ ౹తిత్వం మో స్తరుగానైనా దెలిసిందా ?

౹బా:- యేమి అతిశయంగా మాట్లాడుతున్నావు ?

అ:- మీరు చెప్పినవిషయంకంటె నాయుడుగారూ, రామదాసుగారూ చెప్పినవిషయాలు అతిశయమైన వని తమకు మనవి చేస్తున్నాను.

౹బాన్‌సన్ కోరిన౹పకారం సభాపతిగారు సభ ముగిసిందని చెప్పారు. అంతా వెళ్ళిపోయినారు.

## ౨౧

సాహు కృష్ణుడు

సాహు:- యేమంపోయ్! శాంతమ్మగారు! నాకు నిన్నటి పాఠాలు పోయినవికదా? యీరోజు తప్పకుండా బళ్ళోకి పోతాను.

శాంతమ్మ:- యీరోజు బడి లేదట, రేపు పోదువుగాని.

సాహు:- అయితే నేను నిన్నటిపాఠాలు యీ రోజు నేర్చుకుంటాను. అన్నం తిన్నతర్వాత చెపుతారా ?

శాం:- అన్నం తిన్నతర్వాత కాసేపు తామాబండితో ఆడుకొని చదువుకుందువుగాని. యెప్పుడూ చదువుకోవడం పనికిరాదు. కృష్ణుడివలె పీకె వూమా, చూతాం.

సా:- (బు౹రున వూది) అయితే నిన్నటి పాఠాలన్నీ రావద్దా? అన్నం వండేలోగా ౹పహ్లాదచరి౹తలో వొకపద్యం కంఠోపాఠం చేస్తా. నేను కొత్తపద్యం రెండుమాట్లు చదివి వొప్పజెప్పనా ?

శా:- అన్నం వుడికింది. నీకు కందిపచ్చడి నూరేదా ? వంకాయబజ్జి చేసేదా? లేక రెండూ చెయ్యనా ?

సా:- ఆ రెంటికంటె ౹పహ్లాదలో పద్యం బాగుంటుంది. నాటికిబదులు వొకపద్యానికి అర్థం చెప్పండి.

శా:- నాన్నా ! నీవు త్వరగా అన్నం తిను. ఫొటోలు తీస్తేవాడు రాంగనే ఆదిపట్టించుకుందువుగాని. నీవు ఫోటో తీయించుకుంటావా ?

ల:- అదెందుకు? ఫొటో తీయించుకుంటే మనుష్యులకళ తగ్గుతుందట.

చౌ:- లేనిపోనివన్నీ పెట్టు. యెవరు చెప్పారు, కళ తగ్గుతుందని?

ల:- జీవకళ దాంట్లో ప్రవేశించకపోతే అంతసరీగా యెట్లా పడుతుంది? దానివల్ల ఆయుక్షీణ మవుతుందని శాస్త్రులుగారన్నారు.

శా:- కాకపోయినా వీడి కిప్పుడు తస్వీ రెందుకులెండి.

చౌ:- మీ ఆడమాటల కేమి? తప్పక యివ్వాళ తీయించాలిసిందే! వెంకటయ్యా! వాగసత్వపువ్యాజ్యంలో వచ్చిన పది యెకరాలూ సాహుపేర బెడతాను. దాంట్లో వచ్చే ఆదాఅంతా వీడి పై ఖర్చుకు వుపయోగిస్తా. నాన్నకు యింగ్లీషు చెప్పిస్తే రెపరెప పైకి వస్తాడు. వాడిచేత డిప్టీకలెక్టరు చేయించాలె.

ల:- ముక్కుపచ్చలారని బిడ్డను యిప్పుడు గుంటూరు పంపిస్తారా?

చౌ:- ఒక యేడాది పంతులును పెట్టి యింట్లోనే చెప్పిస్తాను.

వెం:- రాముడు చెప్పగూడదా? బాగా అంటుతుంది.

చౌ:- అంతమాత్రమా! ఆయన వెయ్యాళ్ళ పూజారి. అంటబట్టి చెప్పితేనేగాని చదు వంటదు. వానాకాలపు చదువు వల్ల ప్రయోజనం లేదు.

సా:- తాతయ్యా! నేను ప్రహ్లాద పూర్తిచేసిన తర్వాత ఇంగ్లీషు చదువుకుంటా.

ల:- వాడికి క్రాపు పెట్టిస్తిరి. తల బుట్టాలె పెరిగింది. సరిగా కత్తిరించేవాడు వూళ్ళో లేకపోయె.

చౌ:- నేను రేపు గుంటూరు తీసికొనిపోయి మంచి మంగలివాడిచేత కత్తిరింపించుకొని వస్తా.

సా:- నాకు నిన్నటి పాఠం పోయింది. రేపటి పాఠంకూడా పోదా?

చౌ:- అయితే సెలవురోజున పోదాంలే! త్వరగా అన్నం దిను.

శాం:- బాలకృష్ణా! అన్నం పెట్టా. తిందువుగాని, రా!

సా:- అప్పుడే యెందుకు పెట్టారు. నాకు పద్యం యింకా రాలా. నేను చదువుకోకుండా తాతయ్య అడ్డం వచ్చి మాటలు పెట్టాడు.

శాం:- అన్నం ఆరిపోదా?

సా:- కంచంలోనుంచి తీసి తప్పేలలో మళ్ళీ పెట్టండి.

ల:- యెందుకురా, ఆమెను అట్లా తిప్పలుపెడతావు. ఆమె కాబట్టి నీవు పెట్టే బదవలన్నీ పడుతున్నది.

సా:- కంచంలోనే వుంచండి. వొక్క చిటికలో చదువు కొని వస్తా.

శాం:- యిప్పుడు నే చెయ్యబొయ్యే అమ లేమున్నది? మళ్ళీ వడ్డిస్తాలే.

చౌ:- మా నాయనకు చదువుమీంద యెక్కడలేని శ్రద్ధానూ! వాడికి చదువుకునేటందుకు వొక గదేర్పరచి అందులో వొక బల్లా, కుర్చీ, యేర్పాటు చేస్తా. ఇంగ్లీషు పుస్తకాలు పెట్టు కొనేటందుకు వొక చిన్న బీరునా కొంటా. వాడి పొలంలో డబ్బులే పెట్టి యిటువంటి వెన్నయినా కొనవచ్చు. రేపు గుంటూరు పోయినప్పుడు మూడుగాళ్ళ బండి యెంతకిస్తారో కను క్కొని రావాలె. నాన్న కూర్చుంటే దర్జాగా వుంటుంది.

శాం:- ఇక పదిహేను రోజులకు వాడు పుట్టినపండగ వస్తుంది. ఆరోజున వాడికి బండి చదివించండి.

చౌ:- అట్లయితే వాడి సొమ్ములోనుంచి బండి తేవడానికి వీలులేదు మనమే కొనిపెడదాం. వాడి డబ్బుతో మరి వొక వస్తువు కొనవచ్చు. నానా! యింకా నీకేమి కొనమంటావోయ్?

సా:- నన్ను యిప్పుడు మాట్లాడించబోకు తాతయ్యా! నాకు పద్యం రాదు.

చౌ:- సరే, దబ్బున అన్నం తిను. దర్జీవాడు రాంగనే కబురంపిస్తా.

సా:- శాంతమ్మగారూ! నాకు పద్యం వచ్చింది. ఇక నాకు అన్నం పెట్టండి.

శాం:- యిదుగో! బొట్టు పెట్టించుకో!

సా:- నాకు సాదు వద్దు. ప్రహ్లాదుడు పెట్టుకున్నట్లు నామాలు పెట్టండి. (నామాలు పెట్టించుకొని) శాంతమ్మగారూ! ప్రహ్లాదుడు కాక యింకా భక్తు లెవరైనా వున్నారా?

శాం:- మార్కండేయు డనేఆయన వున్నాడు. ఆయన శివభక్తుడు.

సా:- ప్రహ్లాదుడుమోస్తరు కావలెనంటే యేమి చెయ్యాలె?

శాం:- ఆయన మోస్తరుగా బుద్ధిమంతుడవై విష్ణుభక్తి గలిగివుండాలె.

సా:- నేను రోజూ రాములవారిని ప్రార్థిస్తాను.

శాం:- కదలబోకు బొట్టు చెరుగుతుంది — అట్లాగే ప్రార్థించు. యిక పద అన్నం తిను.

సా:- (అన్నం దిని) నాకు బూట్సు తొడగండి.

శాం:- (బూట్సులు తొడుగుతూ మీగాళ్లు వత్తిచూచి) అమ్మగారూ! పీడి కాళ్ళు చూడండి. వత్తితే గుంటలు పడుతూ వున్నవి.

ల:- (పరిశీలించి) నాకూ అనుమానంగానే వున్నది. బాగా చూడు.

శాం:- (వణుకుతూ) నాకేమీ కనపడడం లేదు. దడగా వున్నది. మీరు చూడండి.

ల:- అదేమి? పసిరికైలైనవి. ముసలాయనతో జెప్పితే దిగులుపడతాడు. వెంకటయ్యను బిలిపించి వైద్యునికి కబురంపించు.

చౌ:- (లోపలికి యింతలో వచ్చి) నే దిగులుపడడం దేనికి? ఏమిటి పరీక్షిస్తున్నారు?

ల:- ఏమీ లేదు. బూట్లు తొడుగుతున్నది.

చౌ:- కనుపొట్టలు వుబ్బినట్లున్న వే, కొంప మునిగిందా యేమి?

ల:- ఇంతలోకే గడబిడ పడతావెందుకు? కామెర్లైతే అట్లాగే వుంటవి.

చౌ:- ముదిరినట్లున్నవి. ఇన్నాళ్ళదాకా మీ రెందుకు జూడలేదు? మొఖం కూడా పచ్చబడ్డది.

శాం:- నిన్న చూచి జ్వరం నయమై కొత్త నెత్తురు పెడుతున్న దనుకున్నా. ఈవేళ జూస్తే పైకి బాగా కనపడుతున్నది.

చౌ:- ఈ పూట కేదో చిట్కా వైద్యం చేయించండి. రేపు ప్రొద్దుటికి గుంటూరు పోయి డాక్టరును తీసుకొనివస్తా.

శివార్చకుడు వచ్చి చెయి చూచి 'లోజ్వరం వస్తున్నది. పైకి కనిపించకపోయినా అంతర్గతం వదలడం లేదు. రేపటిదాకా చూచి మందిస్తా'నన్నాడు. శాంతమ్మకు గుండెలో రాయి పడ్డట్టయింది. ఆమెకు పిల్లవాడు బాగా మాలిమి గావడంచేత వాడికి యే కాస్త జబ్బుచేసినా దిగులుపడి కూర్చుంటుంది. ప్రతి నిమిషం వత్తి చూస్తుంది. మధ్యాహ్నం రెండు గంటలకల్లా పులిక దగిలింది. సన్నగా తెల్లవార్లూ జ్వరం కాస్తూనే వున్నది. తెల్లవారి అన్నం పట్టివేస్తూ తిన్నాడు. రోజూ బళ్లోకి పోతానని మారం పెట్టేవాడు, ఆ రోజు స్తబ్ధుగావూరుకున్నాడు. తిన్నన్నం యిమడలేదు. తేపా వోకిలించు కుంటున్నాడు. సాధారణపు జబ్బుకు వత్రపెట్టేవాడు గాదు. త్రోసివేసుకొని తిరుగుతూనే వుంటాడు. ఝాము ప్రొద్దెక్కిన తర్వాత శాంతమ్మను చలిగావుంది గుడ్డ గప్పమన్నాడు. శాల్వగప్పి చెంపన చేయిపెట్టుకొని మంచం దగ్గర కూర్చున్నది.

ల:- శాంతమ్మగారూ ! అన్నం దిందురుగాని రండి. రాత్రి గూడా తినకపోతిరి.

శాం:- నాకు ఆకలి కాలేదండి.

ల:- మా ఖర్మాలకు మీరేం చేస్తారు. దరిమాలిన ఆస్తి వుంది. పెద్దవాడికి నలుగురు ఆడచెత్త దప్ప యింత మగనలుసు పుట్టకపోయెను. రెండు కుటుంబాలకూ తారకం వీడే. పంచ ప్రాణాలూ వీడిమీద బెట్టుకొని వున్నాం. ముసలాయన రాత్రి విస్తరి దగ్గర కూర్చున్నాడన్న మాటేగాని అన్నం ముట్టలేదు. మధ్యాహ్నం అన్నం దినంగనే లేచి ఆ యెండలోనే కంపసబడ్డ కాకివలె పరుగెత్తాడు. ఈ జబ్బు దీర్ఘం క్రింద బడితే రాత్రిం బగళ్ళూ మేలుకోవలసి వస్తుంది. మీరు యిప్పుడే మూలబడితే తర్వాత కష్టం.

అంతట శాంతమ్మ లేచి యెంగిలి పడ్డది. లంకణం చెడ గొట్టడమేగాని అన్నం లోపలికి పోలేదు.

ల:- నేనూ తోడు పడుకోనా? తెల్లవార్లూ వొక్కరే మేలుకోవడం కష్టం.

శాం:- అవసరంలేదు లెండి.

రాత్రి వొంటిగంటకు జ్వర మెక్కువై పెనం కాగినట్టు కాగింది. జ్వరతీవ్రంచేత తెల్లవార్లూ పండ్లు గొరికాడు. తెల్లవారిన తర్వాత పైపొంగు దీసినా జ్వరం తగ్గలేదు. శాంతమ్మ కంటికి కడివెడుగా యేడుస్తున్నది. రామానాయుడు పిల్లవాడిదగ్గరకు వచ్చి యెట్లా వున్నదని అడిగాడు.

శాంతమ్మ కండ్లనీళ్ళు గుక్కుకుంటూ యేదో చెప్పింది గాని రామానాయుడుకు వినబడలేదు. ఆయన వొళ్ళుపట్టి చూచి వెళ్ళిపోయినాడు. గడియ ప్రొద్దెక్కేటప్పటికి గుఱ్ఱబ్బండిమీద చౌదరయ్యా, డాక్టరూ వచ్చి దిగారు. డాక్టరు వచ్చి రోగిని జూచి చెయ్యి జూడలేదనుకుంటారని నాడీ పరీక్ష చేశాడు. అంతు

పట్టలేదు. గాజుపుల్ల పెట్టి జ్వరం గొలిచాడు. నూటనాలుగు డిగ్రీ లున్నది.

డాక్టరు:- యీ పిల్లవాడికి జ్వరం యెన్నాళ్ళనుంచి?

చౌ:- నెలరోజులక్రింద పదిహేనురోజులు జ్వరం దగిలింది. లోపల జ్వరపు పలుకు వదలందే వైద్యుడు మందు మానివేశాడు. పైకి కనబడకపోయినా జ్వరం అంతర్గతంగా వుంది. ఉబ్బ చూపే వరకూ జ్వరసాక్ష్యం వున్నదని మే మనుకోలేదు. ఉబ్బ చూపి నప్పుడే నీరు వున్నదని పిన్న గుర్తుపట్టాం.

డా:- విరేచన మవుతున్నదా?

శాం:- తినుకుతాడు. బాగా కాదు.

డా:- ఆకలెట్లా వుంది?

శాం:- బొత్తిగా క్షీణించింది. తిన్నది కాస్తా హరించుకో వడం లేదు.

డా:- అబ్బా! రోగం యెంతముదర నిచ్చారండీ!

శాంతమ్మ నిట్టూర్పు విడిచింది. చౌదరయ్య మాట్లాడలేక పోయినాడు.

చౌ:- (తడబడుతూ) తమ అనుగ్రహముంటే అన్నీ చక్క బడుతవి.

డాక్టరు:- భగవంతుడి అనుగ్రహ ముండాలె.

చౌ:- తమరు మందు వెంటవెంటనే నడపండి. గుంటూరు నుండి దాదిని పిలిపిస్తారా? డబ్బు ఖర్చవుతుందని వెనుదీయవద్దు.

డాక్టరు:- సాయంత్రం చెపుతా. మందు నడుపుదాం. అనుకున్న ప్రకారం ముందు రెండో వంద యివ్వండి. రెండు రోజులు అయిన తర్వాత మూడో వంద యిస్తురుగాని.

చౌ:- యిదుగో తీసుకోండి. తమ అనుగ్రహ ముంటే అనుకున్న కాడికి వొక వంద అదనంగా ముట్టజెప్పతా. తమకు భోజనం మన యింటిదగ్గరే చేయిస్తా.

డాక్టరు:- ఈ మందు గంటకొక గీటు చొప్పున యియ్యాలె. ఈ చిన్న సీసాలోది ఆ మందిచ్చిన తర్వాత అర గంటకు వొకమారి స్తుండాలె.

చౌ:- తమ రా ప్రకారం మందు నడిపితే నయముగా కేమౌతుంది?

రామా:- (లోపలికి వచ్చి) ఇదుగో, నాయుడుగారేనా?

డాక్టరు:- తమరు విద్యార్థిగా వుండగా ఆస్పత్రికి వస్తూ వుండేవారేకదా.

రామా:- లేదు. మీతో అప్పుడప్పుడు టెన్నిసు ఆడు తుండేవాణ్ణి.

డాక్టరు:- అవునిప్పుడు జ్ఞాపకం వచ్చింది. యీ పిల్లవాడు తమ పిల్లవాడేనా?

రామా:- చిత్తం. తమరు శ్రద్ధగా పనిచెయ్యాలె. నేజెప్పనే అవసరం లేదు.

డాక్టరు:- నిస్సందేహంగా. యీ మందు జాగ్రత్తగా వాడగలవా రెవరు?

రామా:- శాంతమ్మగారి కంటే శ్రద్ధా, వోపికా, గల వాండ్లు లేరు. ఆమెవల్ల గావాలిసిందే.

చౌ:- ఆ గీట్లకొలతలు మాకెవరికీ దెలియవు. మందు ఆమె చేతికే యియ్యండి. గుర్తుగా పెట్టుకుంటుంది.

ల:- యితరులు యిచ్చినా మందు దాగడు. మారాం చేస్తాడు. ఆమె యివ్వవలసిందే.

డాక్టరు భోజనంచేసి పడుకున్నాడు. రెండుగంట లయ్యే వరకు పది మోతాదుల మందు పడ్డది. యేమూల బోయిందో తెలియదు. పిల్లవాడు కొద్దిగా పక్కలు యెగర వేస్తున్నాడు. మగతగా వున్నట్లు కనబడుతున్నది. మొఖం బాగా పచ్చబడ్డది. యెదురురొమ్ము మీద గూడా గుంటలు పడుతున్నవి. కాళ్ళు పట్టి చూచేవరకు శాంతమ్మ కాళ్ళు చల్లబడ్డవి. కండ్లలోమాత్రం

కాంతి తగ్గలేదు. గంట కొకమాటు తెరలు తెరలుగా మంపులు వస్తున్నవి. తెర అణిగిన తర్వాత పిల్లవాడు రెప్పలు దెరిచేవరకు కండ్లు చుక్కలవలె మెరిసినవి.

శాం:- బాలకృష్ణా!

సాహు:- శాంతమ్మగారండీ! నాకు వంట్లో యెట్లావున్నది?

శాం:- బాగానే వున్నది.

సాహు:- యేమో! నేను కొన్ని సంగతులు అడుగుతా, చెపుతారా?

శాం:- నాన్నా అడుగూ?

సా:- ప్రహ్లాదుడు చాలా మంచివాడుగదా.

శాం:- అవును, మంచి భక్తుడు.

సా:- ఆయన యెక్కడ ఉంటాడు?

శాం:- స్వర్గంలో వుంటాడు.

సా:- స్వర్గంలో యెవ రుంటారు?

శాం:- దేవుడూ, దేవతలూ, పుణ్యాత్ములూ, ప్రహ్లాదుడూ అక్కడనే సుఖ మనుభవిస్తూ వుంటారు. పాపాత్ములు నరకంలో బాధపడుతూ వుంటారు.

సా:- నే నెక్కడికి వెళ్లుతానో!

శాం:- నాన్నా! అట్లా అనవద్దు!

సా:- కాదు చెప్పండి.

శాం:- నాన్నా!

సా:- ముం దీ మాట చెప్పండి.

శాం:- నీవు స్వర్గానికే వెళ్లుతావు.

సా:- అక్కడ మాఅమ్మ వుంటుందా?

శాం:- మీ అమ్మ అక్కడ వుండదు. పాపాత్మురాలు.

సా:- మా అమ్మ పాపాత్మురాలు కాదండి, ఆమె యెక్కడ వుంటుంది?

శా:- ఆమె నరకంలోనే వుంటుంది.

సా:- అయితే నేనుకూడా నరకానికే వెళుతా. మా అమ్మను చూడవచ్చు. అమ్మా! అమ్మా!

శాంతమ్మకడుపు దరించుకొని పోయింది. "వోయ్!" అని పలకరించడానికి నోచుకోలేదు. ఆపుకోలేక,

శాం:- నాన్నా! నీకొకసంగతి చెపుతా, యెవరితోనూ అనవుగదా.

సా:- అనను లే చెప్పండి!

శా:- మీఅమ్మను నేనే.

సా:- (తేరిపారచూచి) ఇట్లా వున్నారేమీ?

శా:- స్ఫోటకంపోసి యిట్లా అయినా.

సా:- మా అమ్మమోస్తరుగానే దయగా వున్నారు. అమ్మా! నీవు అమ్మవుకే? నాదగ్గర పడుకొని నీ పొట్టమీద పండుకోబెట్టుకోవే.

శాంతమ్మ మంచంమీద పండుకొని సాహూను పొట్టమీద పడుకోబెట్టుకున్నది. వొళ్ళు మరిచింది. స్తన్యం వర్షించింది. సాహు పాలు త్రాగుతున్నట్టు ఆమె భావించింది. ఉభయులూ యీమధ్య గడిచిన సంవత్సరాలన్నీ మరిచిపోయినారు, అమ్మ యెక్కడికీ వెళ్ళనట్టే. పాపాత్మురాలుగాడు. ఆవిధంగా వుభయులూ వొక అరగంటసేపు పడుకున్నారు. కమలమ్మ పిల్లవాణ్ణి పడుకోబెట్టి లేచింది. మళ్ళీ మబ్బుతెర వచ్చింది. కండ్లు మూతలుపడుతూ వున్నవి. ఆమె కెవ్వన కేకవేసింది. ఇంట్లోవాండ్లంతా పోగైనారు. నారాయణ! నారాయణ! అంటూ క్రిందికి దింపారు. ఏమిటో లేచిపోయింది. ఇంతమట్టి మిగిలింది. దానిమీద గుడ్డ గప్పారు. అంతా అంధకారమైంది.

ఉత్తరక్రియలు జరిపారు.

## ౨౨

నా కమలవా!

శాంతమ్మ స్నానంచేసి వచ్చి లోపల పడుకున్నది. భోజనానికి లేవలేదు. లక్ష్మమ్మ పోయి పిలిచింది.

శాం:- ఇక నా కన్నమక్కరలేదు. నన్ను బలవంతపెట్టి ప్రయోజనం లేదు.

ల:- శాంతమ్మా! నీవు అన్నం దినక చేసే దేమున్నది? అహోరాత్రాలు నిద్ర మాని తల్లికంటే యెక్కువగా జేశావు. ప్రాప్తం దీరింది. చేయి గడుక్కున్నావు. వెనకా ముందూ దప్ప అందరం పోయేవాండ్లమే. మనం అన్నగత ప్రాణాలం. ఉన్నంతవరకూ తినడం, నిద్రపోవడం; దినచర్య తప్పదుగదా! లే అమ్మా! లే. లేచి కాస్త యెంగిలిపడు.

శాం:- అమ్మా! నీచేతి అన్నం నాకు ప్రాప్తం తీరిపోయింది. నా కొరకెవరూ శ్రమపడక మీ మీ పనులకు దయ చేయండి.

ల:- జ్వర మున్న దేమో డాక్టరును వచ్చి చెయి చూడమను.

చౌదరయ్య డాక్టరుకోసం పరుగెత్తాడు.

శాం:- నాకు యింకా డాక్టరెందుకు? పాప రోగాలు కుదర్చగల సాంబకృష్ణుడే నాకు వైద్యుడు.

ల:- మనిషి పైత్యానబడి సంబంధం లేకుండా మాట్లాడుతున్నది. మజ్జిగలో అన్నం పిండి ధారకం చేస్తే బాగుండును.

వెం:- ఆమె తింటే ఏ కష్టాలైనా పడవచ్చు. పట్టుపట్టితే మనం చెయ్యగల దేముంది? ఆమె తెలియండైతే తెలిపైనా చెప్పవచ్చు. ఆమె మహా భక్తురాలు. యేదో నియమం పెట్టుకొని యిట్లా చేస్తున్నది. చెప్పడానికి యిష్టం లేదనుకుంటాను.

డా:- యేమమ్మా శాంతమ్మగారూ! లేచి కొంచం భోజనం చెయ్యండి. తర్వాత మీకు మంచిమందు దిస్తా.

శాం:- సాహుకృష్ణా! అయ్యా! నాకు మందు అవసరం లేదు. తమరు బలవంతపెట్టవద్దు. సాహుకృష్ణా!

డాక్టరు:- మందక్కర లేకపోతే కొంచెం భోజనమైనా చెయ్యండి. శోషకు వచ్చి నాడి చాల బలహీనంగా వున్నది.

శాం:- నాకు భత్యం తీరిపోయింది. సాహుకృష్ణుడు రమ్మంటున్నాడు. ఉత్క్రమణ సమయం ఆసన్నమైంది. తమరంతా కొంచెంసే పవతలనుండి నాయుడుగారిని వొక పర్యాయం యిక్కడికి దయచేయమంటారా? సాహుకృష్ణా! సాహుకృష్ణ!

చౌ:- (ముంగిట కూర్చున్న కుమారుణ్ణి బిలిచి) శాంతమ్మగారు చాలా జబ్బుస్థితిలో వున్నది. నిన్ను చూడవలెనంటున్నది.

రామా:- అదేమి! పొద్దున జబ్బేమీ కనబడలేదే! యేమైనా ధారకం చేయించారా?

చౌ:- ఆమె నీళ్లుగూడా వర్జించింది. వ్రతంపట్టి కూర్చున్నది. సాహుకృష్ణ ధ్యానం దప్ప రెండో ప్రసక్తి లేదు.

రామా:- (లేచివస్తూ)—సాహుకృష్ణు డెవరు?

చౌ:- పిల్లవాడు పోయినప్పటినుంచీ సాహుకృష్ణా! అని వొకే విధంగా అలవటిస్తున్నది. అదేమైనా తిరుపుమరుపు మాటేమో?

రామా:- (వచ్చిచూచి)—ముఖం తేటగానే వున్నది.

డాక్టరు:- చేతులో యేమీ పట్టులేదు. అదేమి చిత్రమో మాటలు క్షీణించలేదు.

వెం:- ఆమెగారు కోరినప్రకారం మనమంతా బయట వుందాం. తమ్ముడూ! నిన్ను పిలిపించిం దెందుకో అడుగు?

తక్కినవా రంతా తలుపు దగ్గరదోసి బయటికి వెళ్లారు.

రామా:- యేమండీ! శాంతమ్మగారూ మీకు వంట్లో యెలా వున్నది?

శాం:- జబ్బేమీ లేదు. నాకు ప్రయాణ సమయమైంది. తమరు అనుజ్ఞయిస్తే వొక్క విషయం తమ చెవిలోవేసి లేవవలె నని వున్నా. అనుగ్రహిస్తారా?

రామా:- తమ రంత ప్రాథేయపడ నవసరం లేదు. నిర భ్యంతరంగా తమరు చెప్పదలచింది చెప్పండి.

శాం:- తమరు నాయందు ప్రసాదించి ఆ కుర్చీమీద కూర్చొని తమ దివ్య పాదపద్మాలు యీ ముక్కాలి పీటమీద వుంచండి.

రామా :- అదెందుకు?

శాం:- అనుగ్రహించవలసిం దని ప్రార్థన.

రామా :- సరే పెట్టాను. ఇక చెప్పండి.

శాం:- (చివాలున కూర్చుని వెక్కి వెక్కి యేడుస్తూ) అయ్యా! నేను పాపిని. ద్రోహిని. మీకు మహాపకారం చేశాను. ఈ నిర్భాగ్యురాలికి తమబోటి మహాత్ముల సాంగత్యం యెందుకు దక్కుతుందీ? నే నస్పృశ్యురాలిని గాకపోయినా తమపాదాలు యీ అపవిత్రురాలి పాపపు జేతులతో స్పృశించడానికి అనుజ్ఞ యివ్వండి.

రామా:- (తనలో-గురుపుత్రురాలేమొ) అదేమి అలా అంటారు? మీరు పాపాత్ము లెందు కవుతారు? మీ భక్తిచూస్తే నాకు ఆశ్చర్యం వేసింది.

శాం:- సాహుకృష్ణా! - అయ్యా! మీ పవిత్రమైన పాదాలు నా చేతులు తగిలితే అపవిత్ర మౌతవని నాకు భయం. ఉత్తరు వీయండి.

రామా:- తమరు కోరినట్టు చేయవచ్చు.

శాం:- ఆహా! అనుగ్రహించారా! యెంత అదృష్టవంతు రాలిని. (అంటూ) నమస్కరించి కన్నీటికాల్వలతో పాదాలు తడుపుతూ కండ్లతో స్పృశిస్తూ,

శ్లో. వ్యత్యస్త పాద మవతం సితబర్హిబర్హం
సాచీకృతానన నివేశిత వేణురంధ్రమ్.
తేజః పరం పరమకారుణికం పురస్తా
త్ప్రాణప్రయాణసమయే మమ సన్నిధత్తామ్.

అని ధ్యానంచేసింది.

రామా:- శాంతమ్మగారూ! ఇదంతా నాకేమీ అర్థం కావడంలేదు.

శాంతమ్మగారు:- పాదాలమీద చేతులుంచి తలయెత్తి మొగంవంక జూచి పెద్దపెట్టున ఏడ్చి "నేను కమలమ్మ" నన్నది.

రామా:- ఆహా! అయ్యో నా కమలవా! సాహుకృష్ణుడు నిన్నను గ్రహించునుగాక!

ఆ మాటలు చెవిలో వేసుకొని కమలమ్మ రామానాయుడి కాళ్ళమీద తల మోటించి పడిపోయింది. స్ఫోటకం పోసినా చడక మనోహరంగా వీపున ప్రకాశిస్తున్న యెర్రమచ్చ కనపడ్డది. రామానాయుడు కన్నీళ్ళు నిడిచాడు. కమలమ్మ మనసు సాహు కృష్ణ మయమయింది. తాషాబండ్లూ, పీకెలు, నెమలికండ్లూ ప్రపంచమంతా నిండిపోయినవి. లోకమంతా దివ్యదిగంబరుడైన సాహుకృష్ణుని తేజోరూపమై ప్రకాశించింది.

"కీ॥ యెత్తుకొందు రారా కృష్ణా — యదునందన వీరా"

అని సన్నగా బాడింది.

"అమ్మా! తాషాబం డెక్కవే వూరికి బోదాం. అప్ప గూడా మనదగ్గరకే వస్తాడులే," అన్నట్టు కమలమ్మకు వినపడ్డది. కమలమ్మ పాదాలమీదినుంచి లేవలేదు. రామానాయుడు నిశ్చే ష్టుడై కూర్చున్నాడు. కొంత సేపటికి కమలమ్మచేతులు కాళ్ళకు

చల్లగా తగిలినవి. నిట్టూర్పు విడిచి లేవదీసి తక్కినవారిని పిలిచాడు.

చౌ:- యేమి! యేమంటున్నది?

రా:- పరమపదించింది. కర్మలన్నీ సక్రమంగా జరిపించండి.

వెం:- ఎవరో తపోభంగమై కర్మశేషం అనుభవించడానికి మన ఇంట్లోవచ్చి పడ్డదిగాని యీామె సామాన్యురాలు గాదు.

—...—

# మాలపల్లి

## మూడవ భాగము

## ౧

### నిజమయిన వివాహము

అప్పాదాసుకు వుద్యోగం పోయిన తరువాత జీవనం జరగడం కష్టమై రామదాసు కూలికి పోవడం ప్రారంభించాడు. పెద్ద పిల్లవాడు వ్యవసాయానికి అక్కరకు వచ్చినానికె రామదాసు పొలం పోవడం మధ్యమైంది. సంగదాసు పోయిన తదుపరి బొత్తిగా మానివేశాడు. పొలమూ, గొడ్లూ కలిసివచ్చి వోపినంత పాడీ, పంటా పుష్కలంగా వుండడంచేత అనువైన భోజనం చేయడమే కాకుండా మేచారాల కలవాటు పడ్డాడు. అదివరకైనా యెన్నడూ కష్టపు భోజనం చేసినవాడు కాడు. ఉన్నదాంట్లోనే మాలక్ష్మి, తక్కినవాండ్ల సంగతి యెట్లావున్నా. రామదాసుకైనా కడుపు నిండా పెట్టాలె నని ప్రయత్నం చేసింది. కాని మాలక్ష్మికి వరుసగా మూడుపూటలు అన్నం మిగల్లే దని తెలిసి, వున్నఅన్నం తలా కాస్తా ఒక్కమాటే వడ్డించేటట్లుచేసి తన భాగానికి వచ్చింది మాత్రమే తాను దినేవాడు. వృద్ధాప్యానికి ఉపవాసాలుతోడై మనిషిబొత్తిగాక్షీణించి శల్యావశిష్టంగా వున్నాడు. అప్పాదాసుకు పనిపోయినతర్వాత అర్ధాన్నం కూడా దొరకటం కష్టమైనది. అప్పాదాసు స్వంతస్కూలు పెట్టినా దానివల్ల నేమీ కసరు జారడం లేదు. జీతం యియ్యమని గట్టిగా అడగంగనే మునసబూ, చౌదరయ్యా మొక్కలుపెట్టి పిల్లలను స్కూలుకు రాకుండా చేస్తున్నారు. పోయినవాండ్లు పోగా మిగిలినవాండ్లైనా సాధ్యమైనంత వరకు కుటుంబం చెదరకుండా వొక్కచోట వుంచవలెననే యోచనతో అప్పాదాసుకు ఉద్యోగం దొరికేవరకూ మంగళాపురంలోనే యేదోవిధంగా కాలయాపనచేయడానికి నిశ్చయించి చేతికందినపనికి అందరూ పోవలసిం దని ఇంట్లో అందరికీ చెప్పాడు. "కులవృత్తికి

సాటిలేదు గువ్వలచెన్నా!" అన్నాడు గనుకనూ, మాలక్ష్మికీ తనకూ బయటికి పోకుండా పని దొరుకుతుంది గనుకనూ నేతపని చేయడానికి నిశ్చయించి పైన వేలగట్టివున్న పూర్వోత్తరపు మగ్గం కిందికి దింపి ఊళ్ళో సుబ్బిశెట్టి ఇంటికి బోయి "నూలు యిచ్చి కూలికి గుడ్డలు నేయిస్తావా" అని అడిగాడు. సుబ్బిశెట్టి పెదవి విరిచి చేతి కంటిన చింతపండు గీకి అడకు అంటిస్తూ:

సు:- ఇప్పుడు నేతగుడ్డలు కట్టేవాడెవడు? వాటికోసం అడిగేదిక్కే లేదు. నా దగ్గర నిలవవున్న గుడ్డలు మొన్న గుంటూరు పోయి సగంలుగనానాకు పోకడపెట్టుకొని వచ్చాను.

రా:- అయితే నా కేదైనా జీవనాధారం చూపండి. కష్టకాలం వచ్చింది. మీరు చెప్పినపని నమ్మకంగా చేస్తా.

సు:- అయితే విను. గుంటూరులో గుడ్డలవర్తకుడు 'గుడ్డలు అమ్మకం నిమిత్తం పంపిస్తాను, యెవరినైనా బెట్టి ప్రతి పల్లెటూరిలోకి పంపించ' మన్నాడు. నివు తిరిగి అమ్మేటట్టయితే సరుకు తెస్తాను. నీకు మోకాలు నొప్పి కావాలేన్న!

రా:- నాకు దరిద్రం రాంగానే అన్నిరోగాలూ పోయినవి. జాడ్యాలను భాగ్యవంతులు పోషించగలరు గాని మాబోటి బీద వాండ్లెట్లా పోషిస్తారు? "సర్వే గుణాః కాంచన మాశ్రయంతే" అన్నందుకు రోగాలుకూడా కాంచనాన్ని ఆశ్రయించుకొనే వుంటవి.

సు:- ఇప్పుడు దరువు తీశావు. దూది చాలావరకు అమ్ముడు పోయింది. నాకీ బ్రార తగ్గేమాట చెప్పుదూ!

రా:- నీది వరహాలబొజ్జ. బ్రారలకూ భోగాలకూ దగ్గర చుట్టరికం. ఇప్పుడు మనిషిని ఖడ్డీపాకె కందెన పెట్టితే గాలు తిరుగుతున్నట్లు తిరుగుతున్నా.

సు:- నీవు సదానందుడవు. నీకు వచ్చిన చిక్కులు మాబోటివాండ్లకు వస్తే మంచంపట్టేవాళ్ళం. వారంలో కొత్తసరుకు వస్తుంది. రెండు వందల రూపాయల సరుకుమాత్రం నిలవవున్నది.

దీనితో రేపు ప్రొద్దుననే బేరం ప్రారంభించు. ఖర్చులుపోగా లాభం చెరిసగం చూసుకుందాం.

రా:- సద్గురూ! ఈ కాలానికి నీవు తారకమైనావు. రేపు ప్రొద్దుననే బయలుదేరుతాను. నాకు గంపం, తాటాకులూ ఇప్పిస్తే అమ్మకం వ్రాసి మీకు లెక్క చూపిస్తుంటాను. తర్వాత లెక్కలో కట్టుకుందురుగాని- మానెడు గింజలు దయచేస్తే యీ పూట గడుపుకుంటాం.

సు:- మానెడు గింజలతో యేమవుతుంది? ఒక రూపాయిపి కొల్చుకో. ఈ రూపాయి దారిబత్తానికి నీదగ్గరవుంచు. అమ్మిన పైకం మాత్రం ముద్దిసుద్ధిగా నాకు వొప్పగించి నీకు రావలసింది నీవు తీసుకో.

రా:- ఆవిషయంలో మీకు సందేహం వద్దు. పైకం యావత్తూ అగ్రాన అనబెట్టి మీకు వొప్పజెప్పుతుంటా. మీరే లెక్కచూసి నాకు రావలసినంతే యిస్తురుగాని.

సుబ్బిశెట్టి సరుకు బైటికి తెచ్చి జాబితా వ్రాసి రసీదు తీసుకొని దాసుకు వొప్పజెప్పాడు. రామదాసు వుత్తరీయంలో గింజలు కొలిపించుకొని వాటిని కుటుంబం రెండురోజులు కడుపార భుజించవచ్చునని ఆనందపడుతూ గుడ్డలమూట తలమీద పెట్టుకొని జాము పొద్దెక్కేటప్పటికి ఇంటికి వచ్చాడు. అప్పాదాసు ఉదయమే బడికిపోయి భాగ్యవంతుల పిల్లలను కొందరిని జీతాలు తెమ్మని ఇంటికి పంపాడు. ఒక రెడ్డి తన కొడుకు గత నాలుగు నెలలు చదువుకున్నందుకు పావలా తెచ్చి చేతిలోబెట్టి జీతాలిచ్చేకాడికి నీ మాల బడిలోకి రావడమెందుకు అని గొణుకుతూ పలకా పుస్తకాలూ తీసుకొని పిల్లవాడిని వెంటబెట్టుకుని కేకలు వేసుకుంటూ వెళ్ళిపోయినాడు. కూలీల పిల్లలుమాత్రం అప్పాదాసు బడిలోనే చదువుతూ తృణమో, కణమో యథాశక్తిగా ఇస్తూనే ఉన్నారు. గాని వారి జీతం అంతా కలిసి నెలకు నాలుగురూపాయలకు మించడంలేదు. పిల్లలను మధ్యాహ్నానికి వదిలి ఇంటికి పోయే

వరకు ఆలస్యం అవుతుం దని వొక పిల్లవాడిని కోమటింటికి పంపి పావలాకు జొన్నలు తెప్పించి ఇంటికి పంపాడు. జొన్నలు పట్టి బుర్రలు. మాలక్ష్మి రోటబోసి దంచంగనే పొద్దుంగావడంచేత అన్నం వండడానికి వీలుగా దని పిండి గొట్టి సంకటి చేసింది. ఇంతలోకి రామదాసు అంగలువేస్తూ వచ్చి రెండు మూటలూ నట్టింట దింపేవరకు అందరికీ ఆనందమైనది.

మా:- (యెగా దిగా చూచి) యెక్కడి వివి?

రా:- ఈ గుడ్డలు వూళ్ళల్లో అమ్మడానికి మూటబేరం కోసం సుబ్బిశెట్టిచ్చాడు. దానికి ఖర్చులకు వొక రూపాయి రొఖ్ఖం, వొకరూపాయి గింజలూ తరువాత లెక్కలో కట్టుకుంటానని అరువిచ్చాడు.

మా:- ఏమిటా! భగవంతుడి చిత్రచర్యలు! నువ్వు ఈ గుడ్డల మూటలు నెత్తిన వేసుకొని వూరూరా తిరగడం, అమ్మకరావడమూనా! డెభ్భైయ్యోయేడి జరుగుతున్నది, వాతనొప్పులతో యెన్ని వూళ్ళు తిరుగుతావు?

రా:- యెంత పిచ్చిదానవు! పని చేసుకుంటే తప్పేమున్నది? స్థితిగతులు మారినప్పుడు కాలాన్ని అనుసరించి పోక తప్పదు. యీ స్థితిలోగూడా దేవుడాజ్ఞ తొక్కకుండా న్యాయమార్గాన పోతుంటే గౌరవం యెప్పటికీ చెడదు. మంచిస్థితిలో వున్నప్పుడు మార్గచ్యుతి లేకుండా వర్తించడంకంటె దారిద్ర్యంలో వుండి ధర్మంలో చరించడమే వాసి. ధనికులకంటె దరిద్రులకే ధర్మాచరణం సులభసాధ్యమని పెద్దలు చెప్తారు. భగవంతుడు ప్రత్యక్షమై తపస్సుకు మెచ్చి వస్తువాహనాలిస్తానంటే వొద్దని కొందరు ఋషులు దారిద్ర్యాన్నే కోరుకున్నారు. భగవత్సాన్నిధ్యం పొందడానికి దారిద్ర్యమే దగ్గిర త్రోవ. అది కలిగినప్పుడే సువాసన బయలుదేరుతుంది. కష్టంవల్లనే పురుషునికి సద్గుణాలు అలవడతవి; కీర్తి ప్రకాశిస్తుంది. కష్టములే భగవంతుడు మెచ్చినవారి కిచ్చు వరాలు. కాని వానిని త్రోసిపుచ్చక వుపయోగపర్చుకొనడమే

మనకర్తవ్యం. ఒకరి పద్దీలోవుండి నౌకరీ చెయ్యడంకంటె యిటు వంటి స్వతంత్ర వ్యాపారంవల్ల జీవించడమే యెక్కువ గౌరవం. ఓపిక వున్నంతవరకు తిరిగి అమ్ముకొని సాధారణంగా ప్రాయం త్రానికి యింటికి చేరవచ్చు. ఈ విధంగా కొంతకాలం రోజులు దొర్లిస్తే తరువాత చూచుకుందాం.

మా.- మగ్గం యేకులరాట్నం పెట్టుకుంటే యింట్లో ఆడవాం డ్లకు గూడా పనివుంటుంది. జోతి యేకులు వడికితే నేను పడుగు చెయ్యవచ్చు. యింట్లో పనికికూడా భంగ ముండదు.

రా:- ఆమాటే యోచిస్తే సుబ్బిసెట్టి యిప్పుడు నేతగుడ్డలు ఖర్చు లేవన్నాడు. నూలు వడికమాత్రం యేమి చేసుకుంటాం?

మా:- పనిలేకుండా కూర్చుంటే నాకూ కష్టంగానేవున్నది. జోతిగూడా యేదైనా పనికి పోవాలంటున్నది.

రా:- నా బేరంసంగతి యేదో తేలనియ్యి. నీ విప్పు డేమి కూలి చేస్తావు? పిల్లవాడిని బెట్టుకొని యింట్లో యేదోపని చేస్తుండు. జోతిమాట యేమిటి? ఈ భారం వదిలించుకుంటే మంచిది.

మా:- అప్పుడే పెండ్లో?

రా:- ఇప్పుడు వాడి పెండ్లి కేమితొందర వచ్చింది? పరియాయితీన వాడికి నౌకరీ కుదిరిన తరువాత చూసుకుందాం.

మా:- జోతికి తగిన సంబంధం యిప్పటి స్థితిలో యెక్కడ దొరుకుతుంది? దాని కిప్పటి కాధారణే లేదు. అప్పుడు చేసు కుంటాడేమో కనుక్కుంటావా? వాడి తల్లిగూడా దాన్ని చేసుకోవలె నని మోజుపడుతుండేది.

రా:- ఒక యింట్లో పెరిగి "ఏమిరా" అనుకుంటూ చనువుగా వుండడంచేత వుభయులకూ వాద్దిక కుదురుతుం దని తోచదు. వాడిదగ్గిర కావ్యాలు చెప్పుకుంటున్నా వొక తర గతిలో చదువుకుండే పిలల నోనగగా వుంటారు గాని గుడు

శిష్య సంబంధంకూడా వున్నట్టు కనబడదు. అయినా జ్యోతితో నీవు హెచ్చరించి చూడు.

జామున్నర పొద్దెక్కింది. అంతా భోజనం చేశారు. రామదాసు నిద్రపోయినాడు. దాసు మళ్ళీ స్కూలుకు పోయి పెందరాడే యింటికి వచ్చాడు.

జ్యోతి:- బావా! యీరోజు పాఠం నా కప్పుడే వచ్చింది. పాండురంగ మాహాత్మ్యం యీరోజు ఆఖరుపాఠం. దీనితో పంచ కావ్యాలూ ముగుస్తవి. ఈ రోజు వూరగొండమీది జారు బండమీదికి పోయి పాఠం వొప్పజెప్తాతా.

ఇద్దరూ పుస్తకాలు తీసుకొని జారుబండకు పోయి యీరెండలో కూర్చున్నారు. చల్లనిగాలి తోలుతున్నది.

అ:- జ్యోతీ! ఇప్పటికి చాలా గ్రంథాలు చూచావు. ఎవరి కవిత్వం నీవు వుత్తమమైం దనుకుంటావు?

జ్యో:- దాసూ! ఇది చాలా కఠిన ప్రశ్న. ఆంధ్రమాత షడ్రసోపేతాలైన చూత, నారంగ, పనస, శర్కరకేళీ, దాడిమ, అనాస, నారికేళ, సీతాఫలములు ఫలించి తన యనుంగుపుత్రుల కెట్లు వివిధ రుచులూ నేర్పిందో, అటులనే పెక్కురు కవితల్ల జులం గని నవరస భరితమునూ, బహుభావ సంయుతమునూ, సహస్రాలంకార భూషితమునూ అయిన వాఙ్మయ ప్రపంచాన్ని సృష్టించి ఆంధ్రులను రసికాగ్రగణ్యులను చేసింది. ఆంధ్రవాఙ్మ యకోదసిని సప్త వర్ణములం బోలుపొందే సప్తాశ్వంబులం బూన్చిన రథం బెక్కి దివ్యప్రభలతో వెలిగే సహస్రకిరణుంబోలి కవిబ్రహ్మ ప్రకాశిస్తున్నాడు. పోతన రాకాసుధాకరుడు. తక్కిన కవిసార్వ భౌములు నైజతేజంబుతో పెనుచుక్కల వలె మిరమిట్లు కొలుపు తున్నారు. పేర్లుపెట్టి వర్ణించడం అపచారమని మానాను.

అ:- జ్యోతీ! అత్యాత్తుగా కవితా రసం గురిపించావు. నీకు విద్యాగురువు నైనందుకు ధన్యుణ్ణి. నాకు గురుదక్షిణ యేమిస్తావు?

జ్యో:- నీవు కోరిం దిస్తాను.

అ:- నీ హృదయం—— (అని మెల్లగా జారవిడిచి తల వంచుకున్నాడు.)

జో:- (ప్రకంపితురాలై——) అంతకంటె యెక్కువ అడగవు గదా ?

అ:- (కొంత ధైర్యంతో) అడగను.

జో:- (నిదానంగా) అయితే అది యిదివరకే నీది.

అ:- నేను నిన్ను ప్రేమించకపోతేనో ?

జో:- ఆ ప్రశ్న నా కవసరంలేదు. ఆ సంగతి తెలుసుకోవడానికికూడా ప్రయత్నించను. నిర్గుణ బ్రహ్మాన్ని ప్రేమించినట్టు నిన్ను ప్రేమిస్తాను.

అ:- నీవు నా బంగారు రాధవు. నా కృష్ణుడవుగూడా నీవే. రాధ కృష్ణుని ప్రేమించినట్టు నిన్ను ప్రేమిస్తాను. మోక్షప్రదాయినివి. నీవే నా ముక్తికాంతవు.

జో:- (ఆనందపరవశురా లయి బాష్పధార లొలికి కపోలముల ప్రవహింప చేతులు సాచి) నీవు నా మోహనకృష్ణుడవు. నేను చిన్ని గోపికను. ఆ బాల్యం నా మనస్సు నీయందే లగ్నమయి వున్నది. నీవూ గోపికవై సహవాసకర్తవై నాతో ఆడుకున్నావు. షికారుగా వూరగొంగ డెక్కాం. రాళ్ళమీద వొత్తిడిగొన్న నా పాదాలు నీ హస్తకమలాలతో వొత్తావు. నీ పాదకమలాలు నా హృదయకమలంలో ధరిస్తూనే వున్నా. నీ వెప్పుడూ నా కానందదాయకుడవే. నీమీద నాకు ప్రేమ క్రొత్తగా అంకురించలేదు. నా హృదయంలో బీజరూపంగా వుండి యెప్పుడు మొలకెత్తి తీగెలువేసి అల్లుకొన్నదో తెలియదు. ఇప్పుడు రెండూ పెనుసుకొని బలపడ్డవి.

అ:- (అడ్డంవచ్చి——) ప్రేమ క్రొత్తగా పుట్టదు. శృంగార రసస్వరూపిణియగు రాధామాత చరాచరములయిన సర్వభూతముల యందూ త్రిమూర్తులలోనూ అంతర్యామియై వర్తిస్తున్నది.

ఆ జగన్మోహనరూపం నీలో నాకు ప్రత్యక్షంగా కనుపడుతున్నది. నీద్వారా రాధతో సంధానం నాకు గల్గింది. నీవే నా రాధవు.

జో:- ఐహిక ప్రేమ ఆముష్మిక ప్రేమకు మూలవేరు. ఐహిక ప్రేమవాహిని నాధారం చేసుకొని ఆముష్మిక ప్రేమామృతసముద్రంలో చేరవచ్చు.

అ:- ప్రేమే ఐహికాముష్మికాలకు సంబంధ కారకురాలు. సంబంధమూ అదే.

జో:- ప్రేమ వినా యిహమే లేదు.

అ:- ప్రేమ వినా ఆముష్మికమూ లేదు.

సాయంకాలమైంది. నీడలు పొడుగ్గా వేసివో గుర్తుపట్టడానికి వీలు లేకుండా వున్నవి. సృష్టి దీర్ఘశ్రమ చాలించి విశ్రమించబోతున్నది. ఆకసం రక్తకమలాకారం వలె యెఱ్ఱవారింది. కమలమిత్రుడు చాందినీ వెండీ, కడానిబంగారూ కలిపి కరిగి ముద్దచేసినట్టు కళకళ కాంతులతో చిత్రవర్ణ సముద్రములో తేలి అతిరయమున కాలగతికి లోనై అంతర్ధానమవుతున్నాడు. సప్తవర్ణములు అతి చమత్కారంతో పాళ్లు కలిసి లక్షలకొలది మిశ్రవర్ణములై బింబాన్ని చుట్టుకొనివున్నవి. అస్తమయ సమయ మాసన్నమైన కొలదీ క్షణానికొక్క నూతన రంగం ప్రదర్శించబడుతున్నది. ఒక క్షణంలో ద్రవరూపమున చలించుచున్న కాంతిపిండము ముప్పాతికై సగమై కొంతవడికి పీసమై మరుగైంది. దానిస్థానం వొక వన్నె యెఱ్ఱదా అతిశయించి పూదారంగు గుమిగొని ఆక్రమించుకొన్నది. నభోమణిని పోగొట్టుకొన్న యెఱ్ఱచేత ఆకస మింకా జేవురించే వున్నది. సంకీర్ణవర్ణము లింకనూ పూదారంగు నావరించుకొని చిత్రదృశ్యముల జూపుతున్నవి. రంగా లత్యంత త్వరితంగా మారుతున్నవి. ఒకవన్నె నీలిమ అతిశయించింది. కొంతసేపు జోతీ అప్పాదాసులు నిశ్శబ్దంగా విభ్రాంతిపడి చూచారు. ఆశ్చర్య మతిశయించినప్పుడెల్లా వొకరొకరి మొగములవంక చూచి నేత్రకాంతులతో సంతసాన్ని వెలిబుచ్చారు. అనిర్వాచ్యములైన

రంగులరంగముల రామణీయకము ననుభవించుతూ కూర్చున్నారు. అంధకారపుజవనిక క్రమక్రమంగా మందమై దృశ్యముల అస్పష్టం చేసి కడకు మరుగుపరిచింది. రంగస్థలం పడమరనుండి తూర్పుకు మారింది. పాల్కడలిపట్టియైన జగన్నాటక సూత్రధారుడు పైకి జరుగుతున్నాడు. బ్రహ్మాండభాండ మంతా వెన్నెలపాలతో నిండింది. సమస్తచరాచర భూతసంతతీ అమృతపు వెల్లువలో మునిగి తేలుతున్నది. చందమామ వెన్నముద్దవలె తేలి ఆడుతున్నది. వెన్న కుదపలు కట్టినట్టు రిక్కగమి బ్రహ్మాండ మావరించి వున్నది. అద్భుతమైన ఈసృష్టివైభవమును జోతీ అప్పాదాసులు హృదయాల చూరగొంటూ కొంతవడి కూర్చుండి మెల్లగా దిగడం ప్రారంభించారు. జోతి అప్పాదాసుచేతిపై మొగ్గి మెల్లగా అడుగులు పెట్టుతున్నది. ఉభయులసాన్నిధ్యం అన్యోన్యమానంద దాయక మైంది. ఇరువురికీ ముచ్చ్చ లైకుక్కవైనవి. ఇతరులకు చప్పగావుండే కథలన్నీ వారి కింపుగొల్పుతున్నవి. రెండుఫర్లాంగుల దూరం కబుర్లు చెప్పుకుంటూ యింటికి వచ్చేటప్పటికి గంట సేపైంది.

జో:- అమ్మా! ఏమిచేస్తున్నావు ?

మా:- అన్నం వండుతున్నా. ఎక్కడికి పోయినావే యిది వరదాకాను ?

జో:- ఆడుకోపోయినా.

మా:- ఏ మాటలే యింత పొద్దు పోయిందాకాను ?

జో:- మాట్లాటలు. బావా నేను గుంటిమీదికి పోయినాం. పాఠంచెప్పించుకొని వస్తున్నా. యీరోజుతో పాఠం పూర్తైయింది.

మా:- ఇక చదువు పూర్తి అయినట్టేనా?

జో:- పూర్తెక్కడికి? పాఠాలు చెప్పించుకోవడం పూర్తి అయినట్టే.

మా:- నీ చదువు బ్రహ్మప్రళయం అయిపోయింది. యిప్పటికి గట్టున పడ్డాం. యిక్కడ కూర్చుందువుగాని రా.

జో:- యిదుగో వచ్చా.

మా:- ఎన్నిగుర్రాలమీద వచ్చావు ?

జో:- జోడుగుర్రాలమీద. చెప్పరాదూ ?

మా:- కూర్చో.

జో:- ఊఁ- చెప్పు.

మా:- నే నొక్కమా టడుగుతా చెప్పుతావా ?

జో:- రెం డడిగినా చెప్పుతా.

మా:- నీవు పెండ్లెప్పుడు చేసుకుంటావు ?

జో:- మగ డేడే?

మా:- ఎంత సిగ్గుమాలినదానవే!

జో:- పెండ్లికొడుకు లేనిదీ పెండ్లెట్లా చేసుకోమంటావే?

మా:- ఉంటే చేసుకుంటావా?

జో:- నీకు అన్నలూ తమ్ములూ యెవరైనా వున్నారా? మీ నాయనున్నాసరే. నీపుట్టింటి వాళ్లెవరైనా చేసుకుంటా. మీ వంగసం మంచిది. నన్ను కూర్చోపెట్టి పనిచేయాలే. అప్పుడప్పుడు యెత్తుకొని తిరగాలె.

మా:- నాకు పుట్టింటివాళ్ళెవరూ లేరమ్మా; ఉన్నా నీమోస్తరు గయ్యాళితో వాండ్లు నిభాయించలేరు.

జో:- నేను గయ్యాళి నటే?

మా:- గయ్యాళిన్నర. వచ్చేవాణ్ణి వేధిస్తావు.

జో:- అయితే నా కెనడూ రావద్దు.

మా:- అసలే మానుకుంటావా ?

జో:- నాకా పెళ్ళే వద్దు.

మా:- ఎగతాళిమాటల కేమిగాని అప్పాదాసును పెళ్ళి చేసుకుంటావా ?

జో:- ఛా.

మా:- ఛా యేమిటే నీకు పాఠాలు చెప్తుంటేను.

జో:- దానికి బదులా ?

మా:- అతను మంచి బుద్ధిమంతుడు.

జో:- అతనికి పెట్టింది అతనే తింటాడు.

మా:- అతని కంచాన కెగపడి సగం నీవే తింటావు, యెంగిలెని అనకుండా.

జో:- అతని యెంగిలి రుచిగా వుంటుంది కాని నేను పెండ్లి మాత్రం చేసుకోను.

మా:- అతడు వద్దా? యెవరినీ చేసుకోవా?

జో:- నాకు పెండ్లే వద్దు.

ఇంతలోకి రామదాసు లోపలికి వచ్చాడు జోతి దొడ్లోకి వెళ్ళిపోయింది.

రా:- ఏమంటున్నది ?

మా:- మీ యింట్లో అందరికీ తలా వొకరకం వేదాన్తం.

రా:- మంచిదేగా.

మా:- మంచిదే. దానికి పెండ్లే అక్కర లేదట.

రా:- దాని యిష్టం. పూర్తిగా అక్కర లేకపోతే పోనీ.

మా: పోనియ్యాక యిదివరకు ఎవరిని పట్టుకున్నాం? మీ తిరుమాళిగలో మీ శుశ్రూషవల్ల అప్పయ్యకు కూడా పట్టిందేమో కనుక్కో!

రా:- మావాండ్లు తెలివితక్కువవాండ్లెవరూ కారు. ఏదో వొక కొత్తపంథా. అన్నానికి లేతాం. పిల్లవాడన్నం దిన్నాడా ?

మా:- ఆఁ. ఆయనపోరు చల్లార్చి పడుకోబెట్టా; తక్కినవారంతా రండి.

మాలక్ష్మి మూడుపళ్ళేలు తెచ్చిపెట్టి వడ్డన ప్రారంభించింది. జోతి తనపళ్ళెం అప్పాదాసు పక్కకు లాక్కొని కూర్చున్నది.

రా:- నీకు అన్నం వేరే తీసుకున్నావా?

మా:- మిగులుతుంది లే.

రా:- ముందు తీసివుంచు. మే మంతా ఘోడుఘోడు మంటున్నాం.

మా:- సరే కానియ్యండి.

రా:- బిక్కనీ ళ్లున్నవా?

మా:- నిన్నటినుంచీ సానంవారికి తొక్కు కడుగుతున్నా. వారు మంచివే పోస్తున్నారు. చిక్కనివే వున్నవి.

జో:- బావా! యిదిగో ముద్ద. బాగా "ఆ" అను.

అ:- చదువు ప్రారంభిస్తున్నావా, పెట్టు. ఆహా! ఎంత రుచిగా వున్నది!

జో:- ఆ గుజ్జు నాకు దే.

గుజ్జు జోతినోట్లో పెట్టి తన వేళ్ళను అప్రయత్నంగా తన పెదవుల కంటించుకున్నాడు. ఆదీ యిదీ యితరులు గమనించ లేదు.

మా:- జోతీ! మీరు చిన్నపిల్లలా! వొకరి యెంగిలి వొకరు తినడానికి?

జో:- మేము పెద్దవాళ్ళమాటే? నాకు బదులు ముద్ద పెట్టవే మబ్బాయ్?

అ:- గుజ్జు పెట్టలేదా?

జో:- దానితో సరిపుచ్చుదా మనుకున్నావం? పెట్టు.

అప్పుదాసు జోతినోటిలో ముద్ద పెట్టాడు. ఉభయులకూ ఆనందం గలిగింది.

రా:- అప్పడూ! నీకు పెళ్ళీడు వచ్చిందికదా! నీ అభిప్రాయ మేమి?

జో:- మనయింట్లో అందరికీ పెండ్లి పిచ్చెత్తింది.

రా:- చెప్ప వేమి?

అ:- నా కప్పుడే పెళ్ళేడా?

రా:- నీవు త్వరలో పెళ్ళిచేసుకోవడం నా అభిప్రాయం.

అ:- నాకు పెళ్ళి చేసుకోవలెనని లేదు.

రా:- అభిలాష కలిగినప్పుడు భార్యా యెట్లా వస్తుంది?

అ:- ఆ కోరికే కలుగుతుందని తోచదు.

రా:- వివాహం ధర్మార్థ కామమోక్షాలనే చతుర్విధము లైన పురుషార్థాలను సాధించడానికి అవసరమై వున్నది. పురుషుడు విధిగా వివాహం చేసుకొని తీరవలయును.

అ:- ఈ పురుషార్థాలు పుష్పకం వంటివి. వీటిలో అన్ని యిమిడి వుంటవి. వివాహంవల్ల సమస్త లాభాలు సాధించవచ్చు ననేది కేవల అర్థవాదం. ప్రేమ మోక్ష సాధనం గనుక మోక్షం సంపాదించినవానికి అన్ని వున్నట్లే లెక్క. మోక్షసాధనమైన ప్రేమ తప్పక భార్యమీద కుదురుతుం దనడానికి సాధ్యం కాదు. ఒకస్త్రీయందట్టి ప్రేమ కుదిరినా ఆమెతో వివాహం అవసరమనీ నాకు తోచదు.

రా:- నీవు చెప్పినదాంట్లోనుంచి అనేకప్రశ్నలు బయలు దేరుతున్నవి. వివాహం సంతానాపేక్షను పురస్కరించుకొని వుంటుందా? ప్రేమకూ వివాహానికీ సంబంధ మెంతవరకున్నది?

అ:- ఈ రెండు ప్రశ్నలతో అర్థం యీవత్తూ తేలుతుంది. వాటికి వివరంగా జవాబు చెప్పు.

రా:- ప్రేమకూ వివాహానికీ సంబంధం నిర్ధారణచేయడం కష్టం. ప్రేమ కలుగకుండానే వివాహమూ, కేవల పశుధర్మా న్ననుసరించి సంతానమూ కలుగవచ్చు. మనుష్యేతరసృష్టిలో కేవల పశుధర్మంవల్ల సంతానం కలుగుతుంది. ఒకవిధమైన కామంకూడా వుంటుందని చెప్పవచ్చు. మనుష్యులలో పితా పుత్రాది సంబంధాలు కలిగి నిర్ధారణకొరకు వివాహ మేర్పర చారు. సంగమం కేవల కామపూర్తికేకాక సంతానప్రాప్తికై

కూడానూ. కామమూ, తన్నివారణార్థం భోగమూ సంతానోద్దేశంతోనే యేర్పరచబడ్డవి.

అ:- కొందరు స్త్రీపురుషులకు సంతానాపేక్ష లేకపోతేనో?

రా:- లేనట్టయితే కేవల కామపూర్తికే భోగించవలసి వుంటుంది.

అ:- పశువులు భోగించునప్పుడు సంతానాపేక్ష వున్నదా?

రా:- సంతానం కలిగినప్పుడు ప్రేమిస్తవి కాని భోగించేటప్పుడు సంతానదృష్టి లేకపోవచ్చు. సృష్టిక్రమాన్ని పట్టి చూస్తే సంతానోద్దేశ్యంతోనే కామం సృష్టించబడ్డదని చెప్పవచ్చు.

అ:- కనుకనే ప్రేమ లేకనే కామమూ, వివాహమూ, భోగమూ, సంతానమూ కలుగవచ్చు. వీటికి ప్రేమ చేరినా చేరవచ్చును. ఇవి లేకనే ప్రేమా వుండవచ్చును. పైజెప్పిన లాభాలు కోరకనే నాయకీ నాయకులకు ప్రేమ వుండవచ్చు. గోపికలు శ్రీకృష్ణుని ఆ ప్రకారమే ప్రేమించారు. ప్రేమకు సంగమం ప్రతిబంధకం కాదు. సహాయకారి కావచ్చును. కాని అవసరమని చెప్పడానికి వీలులేదు. ప్రేమ వీటిని పవిత్రం చేస్తుంది. ఇవి లేకపోతే ప్రేమ శుద్ధమైన భావరూపకంగా వుంటుంది.

రా:- బిడ్డలను కని పెంచి ప్రేమించుట ఆత్మోపలబ్ధికి మార్గం గాదా?

అ:- పున్నామ నరకాదులవిషయం అటుండనిచ్చి పుత్రులను ప్రేమించి ప్రేమ స్వరూపుని చేరవచ్చు. అటులనే నాయకీ నాయకులునూ, అన్యోన్యం ప్రేమించి ఆత్మతేజమును పొందుతారు. ఒండొరులయందు రాధాకృష్ణులను గుర్తించ గలిగిరేని ఐహికాముష్మిక భేదములు వారికి నశించి భూతలస్వర్గమును అనుభవిస్తారు. ఈ ప్రేమకు కామోపభోగాదులతో నవసరం లేదు.

రా:- నీవు చెప్పేది వాస్తవం. ఇక నీ స్వవిషయమై యేమి నిర్ధారణ చేసుకున్నావు?

అ:- "ఇక ప్రేమించి వివాహం చేసుకోవలెనా? వివాహం చేసుకున్న తరువాత ప్రేమించవలెనా?" అనేది స్వల్ప విషయం. వివాహం చేసుకోవని వాండ్లను ప్రేమించడానికి నీ కేమధికార మున్నదని కొందరు ప్రగల్భంగా ప్రశ్నిస్తారు. దీనికి ప్రతిగా ప్రేమించనివారిని వివాహం చేసుకోవడానికి నీ కేమధికారం వున్నదని మరి కొందరు వాదిస్తారు. కాని ప్రేమించడం, వివాహం చేసుకోవడం రెండూ ఒకటే. ఊరేగింపూ, తాళిగట్టడం మొదలైనవన్నీ ప్రేమబంధానికి బయటిగుర్తులు. సాక్ష్యంకోసం వుద్దేశించబడ్డవి. పుత్రుకు లౌరసు లనడాని కాధారం. కాని బాహ్యచిహ్నాలన్నీ చాలావరకు తప్పుసాక్ష్యాలుగానే పరిణమిస్తవి. ప్రేమబంధ మేర్పడకముందే సాక్ష్యం సృష్టిస్తున్నారు. ఈ సాక్ష్యం పుట్టినతర్వాత దాన్ననుసరించి ప్రేమ బంధం పుడుతుందని కొందరి వాదన. అది మరింత హాస్యాస్పదం. కాకతాళీయన్యాయంగా తాళిగట్టిన దంపతులకు ప్రేమ గలుగవచ్చు. కాని అది విశేషవిధి.

ఇక నా స్వవిషయాన్నిగూర్చి చెప్పవలసివున్నది. విశేషం లేదు. నేను వివాహం చేసుకోదలచ లేదు.

రా:- (సందేహిస్తూ) నీ వెవరినైనా ప్రేమిస్తున్నావా?

అ:- నేను ప్రేమించినా బాహ్యసాక్ష్యంతో పనిలేదు. కనుక యితరులు తెలుసుకోవలసిన అవసరంలేదు.

రా:- మజ్జిగ పొయ్యి.

మా:- (మజ్జిగ పోస్తూ) జోతికి వెళ్ళవసరం లేదట.

రా:- నా కర్థమైంది.

మా:- నీ మామూలుపద్ధతే అంతేగా!

రా:- బలవంత పెట్టుకుంటావా?

మా:- దేనికీ లేనిది దీని కెందుకు? కావలసింది లోకమానము.

౨

## కోమటింట కన్నము

రామదాసు తెల్లవారుఝామున జాము పొద్దుండగా లేచి కాల్యములు తీర్చుకొని భోజనంచేసి పల్లెబేరానికి పయాణమైనాడు. మాలక్ష్మి గుడ్డలమూట తలకెత్తి నెట్టూర్పు విడిచింది. రామదాసు వుత్సాహంతో ప్రయాణమై పోయినాడు. ఊర కొండ బోడుదాటి రామదాసు రయిలుకట్ట దాకొన్నాడు. కట్ట సమీపంలో వాగుమీద కళింగి కట్టారు. దానిదగ్గర వున్న గుంటలో దాగి ముగ్గురు మనుష్యులు లేచి నిలుచు మన్నారు. రామదాసు భయపడి మూట దింపాడు.

దొంగలు:- మూట దింపావేమి? యెత్తుకొని కంది చేలోకి రా.

రా:- అయ్యా! మీరు నన్ను కొట్టవద్దు. ఈ మూట నేను మెత్తుకోలేను, కాస్త చెయి వెయ్యండి.

౧ వ దొంగ:- యిట్లా నాకెత్తరా! త్వరగాపోదాం. ముసలివాణ్ణి పట్టకరా?

రా:- మూట దీసుకున్నారుగా యింకా నే నెందుకు?

౨ వ దొంగ:- అరవకుండా మాతో రా. నోరెత్తావా అంటే దెబ్బపడుతుంది.

రా:- (వణుకుతూ దొంగలవెంట కందిచేలోకి పోయినాడు)

౧ వ దొంగ:- యీ గుడ్డలెక్కడివి?

రా:- సుబ్బిశెట్టివి. పల్లెటూళ్ళల్లో అమ్ముకొని వొకపావు మిగిలితే చెరొకభవలం తిందాం అనుకున్నాం. జడ్డిగంలోనే మిడత పొడిచింది. ఆ మహారాజును చూడడానికి మొగం చెల్లదు. పాపం, దయదలచి నాకు బతుకుతెరువు చూపాడు. కాని ఇట్లా తటస్థించింది.

౧ వ దొంగ:- ఊరికే వాగక నడువు. నీవి కావంటే వదులుతారనుకున్నావా?

౨ వ దొంగ:- అమ్మబోతున్నావుగదా వీటి ఖరీ దెంత?

రా:- జాబితాదాఖలా ఖరీదు సుబ్బిశెట్టి వేసియిచ్చాడు. నా జన్మలో ఆ బాకీ తీర్చలేను.

3 వ దొంగ:- మేము యితరులదగ్గర కొనుక్కుంటే రెట్టింపు ఖరీదుగిడుతుంది. కనుక ఆ ఖరీదిస్తాం తీసుకొనిపో. ఊరికే తీసుకుంటే నీయేడుపు మాకు కొట్టేటట్టున్నది.

రా:- అన్యాయం యెందుకు? వాటిఖరీదు రెండువందలు రూపాయలిస్తే చాలు. అందులో నాకు ముప్ఫైరూపాయలు లాభం వస్తుంది. నా లాభంకూడా తగ్గించుకొనే యివ్వండి.

3 వ దొంగ:- ఊరికే అరవక ఆ నాలుగువందల రూపాయలనంచీ తీసుకొనిపో.

రా:- అయ్యా! మీచర్యచూస్తే ఆశ్చర్యంగా వుంది. మీ రెవరు?

దొంగలు:-రాజాధిరాజు తక్కెళ్ళ జగ్గడుగారి వత్తాసులం.

రా:- తెలియక అడుగుతాను. క్షమించండి. రాజాధిరాజైతే యీ పనెందుకు?

3 వ దొంగ:- రాజాధిరాజంటే దేవుడు. అసలుదేవుడు పరిపాలించడం చేతగాక ప్రపంచపదార్థాలన్నీ తారుమారు చేసి వుక్కిరిబిక్కిరి లాడుతున్నాడు. డబ్బంతా కొందరు పోగుచేసుకొని బీదవాండ్లను బాధిస్తుంటే జగ్గడుగారు పాతదేవుణ్ణి తోసిరాజని సక్రమమైనపాలన ప్రారంభించారు. మారాజుపాలనలో బీదల బాధలు తొలగి అంతా అన్నదమ్ములవలె వుంటారు. బీదవాండ్ల కెందరికైనా పని చూపిస్తాడు.

రా:- మీరాజుగారు చూపించేపని దేగా?

3 వ దొంగ:- కొంతకాలంపాటిదే. భాగ్యవంతులు సరియైనమార్గానికి రాకపోతే కొంతకాలం యీ యుద్ధం జరిపి సంపాదించిన ధనంతో బీదలకు వృత్తు లేర్పరుస్తారు.

రా:- ఇంతకంటె న్యాయమార్గం లేదా ?

3 వ దొంగ:- ప్రయోజనకరమైన న్యాయమార్గం మరొకటి లేదు. ఈ మార్గమైనా న్యాయవిరుద్ధం కాదు.

రా:- నేమాత్రం మీతో యేకీభవించను. మీరు సృష్టిక్రమమే మారుస్తామంటారు.

3 వ దొంగ:- అది తప్పు. సృష్టిక్రమమే మేము గావలెనంటాం. మీ రవలంబించేదే అస్వాభావికమైనపద్ధతి. అయినా ఆ వాదన ఇప్పుడు తేలేది కాదు. నీవు వెళ్లు.

రా:- ఇంకొక్క సంగతి. తక్కెళ్ళ జగ్గడుగారు కాలం చేశారు కామాలెనే ?

3 వ దొంగ:- అని మీ దేశంలో అనుకున్నారు. వారు యీ పదిసంవత్సరాలనుంచీ నైజాము దేశమంతా కట్టుబాటు చేశారు. ఊరూరా మావత్తాసు లున్నారు. ఇప్పుడు తూర్పుకు మొగ బాకుతున్నాం. నీవు వెళ్ళు. ఊళ్ళోకి పోయేవరకు మా పేరెక్కడా యెత్తవద్దు. ఇంకా సామాను తెస్తావా ?

రా:- నేను యికరాను.

ముగ్గురు దొంగలూ వెళ్ళిపోయినారు. రామదాసు కొత్త దొంగల పద్ధతులు విని ఆశ్చర్యపడ్డాడు. కాలాలు మారిపోతున్న వనుకున్నాడు. "గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్" అని అన్నారుకాని అది యెంతవరకు వాస్తవమో చెప్పడానికి వీలు లేదనుకున్నాడు. "యీకాలపువాళ్ళ బుద్ధులు మంచివే కాని లోకవిద్దూరంగా ఉన్నవి. ఆచరణలో పెట్టడం సాధ్య మవుతుందా ? ఒకపర్యాయం భాగ్యవంతులాస్తి పంచిపెట్టినా స్వల్ప కాలంలో పరిస్థితులు మళ్ళీ యథాస్థితికి రావా? బీదలు సోమరులై

పనిపాటలు విడిచి వూరుకోరా ! స్వశక్తినిబట్టి భాగ్యవంతులు గావడానికి ప్రతివాడికీ అవకాశం వుండడం న్యాయంగాని యీ దోపిడిపద్ధతులు సర్వసామాన్యం అయితే కష్టపడి జీవించే వెర్రివాళ్ళెవ రుంటారు ? రానురాను స్వయంకృషికంటే చౌర్యమే మేలని భావించే దుస్థితి దేశానికి పట్టబోతుందేమో” అని వితర్కించుకుంటూ యింటికి వచ్చాడు. అప్పటికింకా బాగా తెల్లవారలేదు. అప్పాదాసు లేచి మందిరంవైపుకు వెళ్ళాడు. భోజనం లోగా రాడు. మాలక్ష్మి, జోతీ జొన్నలు తొక్కుతున్నారు. పిల్లవాడు నిద్దర లేవలేదు. చెల్లెలు సుబ్బలక్ష్మి తాలూకు మలీతపడ్డ యీాన మోసింది. వెనక జున్నుబాల కథంతా జ్ఞాపకం వచ్చింది. ఆమె మరణకారణం తలంపుకు వచ్చి పంచముల దుస్థితి మూర్తీభవించినట్లు పొడగట్టింది. అప్పటి తన కాపురపు స్థితీ, ఇప్పటి హైన్యమూ తలచి వొక్కక్షణం కించపడి మళ్ళీ మనస్సు నిబ్బరించుకున్నాడు. ఇప్పుడు తన చేతికి వచ్చిన నాల్గువందల రూపాయలూ యేమి చేయవలెనో తెలియలేదు. యెక్కువ యివ్వబడిన రెండువందల రూపాయల్లో తన కేవిధమైన హక్కూ లేదని నిశ్చయించుకున్నాడు. తన భాగానికి క్రమప్రకారం రాదగిన ముప్పది రూపాయల లాభం తానేమీ శ్రమ పడకనే రావడంచేత తాననుభవించవచ్చునా అని సందేహపడుతున్నాడు. ఎక్కువ వచ్చిన ధనం యావత్తూ సుబ్బిసెట్టియొక్క మూలధనంవల్ల వచ్చినదే గనుక అతని కిచ్చివేయడమే న్యాయమనీ, తాను ముప్ఫై రూపాయల లాభం పొందడానికి యింత శ్రమ పడవలసిం దని నిర్ధారణ లేదుగనుక ఆ మొత్తంమాత్రం తీసుకోవచ్చుననీ నిశ్చయించుకున్నాడు. ఇంతలో మాలక్ష్మి, జోతీ తొక్కు తీసికొని వచ్చారు. వారికి యావత్తు సంగతులూ వినిపించి పైకం విషయమై తన నిశ్చయం తెలిపాడు. మాలక్ష్మి యింతపైకం యింట్లో భరించడం కష్టం, వెంటనే పోయి యిచ్చి రమ్మన్నది. మూట చంకన పెట్టి వుత్తరీయం గప్పుకొని సుబ్బిసెట్టింటికి పోయినాడు. అతడు యెవరితోనో రహస్యంగా మాట్లాడుతున్నాడు.

రా:- సుబ్బయ్యగారూ !

సు:- నీవు కాసేపు వాకిట్లో నిలుచో - ఇక రావచ్చు. ఊరికి పోలేదా ?

రా:- కొంతలెక్క పోయినాను. గుడ్డలన్నీ అమ్ముకొనే వచ్చాను. మూలానికి రెట్టింపుపైగా లాభం వచ్చింది. ఇదిగో! మూట.

సు:- (ఆనందపడుతూ) యేదో దేవత నీకు ప్రత్యక్షంలా గున్నది. ఇంకా గుడ్డలు కావలె నన్నదా ?

రా:- కావలె నన్నారుగాని నేను వాళ్ళకు అమ్మదలచ లేదు. వాళ్లు దొంగలు. దేవత గాదు. దేవుడి దొంగలుట.

సు:- వా ళ్ళెవరయితే మన కేమి? కొంటా మంటే అమ్మదాం.

రా:- క్రమమైన ధరకైతే ఆమా టనుకోవచ్చు. డబ్బు మీాదపడవేసి పోతే యే మనుకొంటావు ?

సు:- వాళ్ళు గుడ్డలు లేక యిబ్బందిపడుతున్నా రనీ, యేబాడిశకైనా కొనడానికి సిద్ధంగా వున్నారనీ అనుకొంటాను. ఈ డబ్బు సంగ తెట్లా.

రా:- మొదట టనుకొన్నప్రకారం మీా లెక్క చెల్లుపెట్టు కొని నాకు రావలసింది యియ్యండి.

సు:- ఇందులో నీవు కష్టపడ్డ దేమున్నది ?

రా:- నీవు మాత్రం చాలా కష్టపడ్డావు.

సు:- డబ్బు పెట్టింది నేనుకదా ! దొంగలు యెత్తుకొని పోయినట్టయితే నేను నష్టపడేవాణ్ణేనా ? నీదగ్గర యెట్లా వసూ లవుతుంది ?

రా:- అయితే యేమంటావు !

సు:- పై రెండువందలలో వొక్క కానీ నీకు రాదు.

రా:- దాంట్లో నాకు వొక దమ్మిడీకూడా వద్దు. ఈ సంగతంతా నే చెప్పక గుట్టుచక్కంగా పైకం దాచుకొంటే నీ వేమి చేసేవాడవు ?

సు:- అటువంటివాడివి కావనే నమ్మి సరుకిచ్చా! ఇదివరకు లెక్కపోను మిగిలిన యిరవైయెన్మిదిరూపాయలకూ నీ కిష్టం వచ్చిన సరుకు తీసుకో.

రా:- ఒక బస్తా జొన్నలూ, వొక అరబస్తా బియ్యం యిప్పించు. తక్కిన దానికి వెచ్చం తీసుకుంటాను.

సు:- ఒక వందరూపాయల సరుకున్నది. పొద్దున్నే వేసుకొని పోతావా ?

రా:- యిక గుడ్డలు వద్దు. చిల్లరసరు కిప్పించు.

సు:- పదిరూపాయలకైతే మనిషి మోతవుతుంది. ఏమి లాభం వస్తుంది ?

రా:- సాయంత్రం లోగా అవి అమ్ముకుంటే చాలు. నా భాగానికి వొక అర్ధరూపాయి గిట్టకపోదు.

సు:- పెద్ద లాభ్లేమీ రావడానికి వీలులేదు. చిల్లరసరుకు యెన్నాళ్ళమ్మితే ముప్పైరూపాయల లాభం వస్తుంది ?

రా:- వచ్చినంతవరకే ఆయె. ఆశకు పోకూడదు.

సు:- మీ కూలీలు వట్టి సోమారులు. రూపాయి చేతిలో కనబడితే అది ఖర్చయ్యేదాకా పని చెయ్యరు. నాకేమి పొట్ట జరక్కనా ఈ పాకులాడటం ? వ్యవహారం చేస్తూ వుండాలె. రేపు పొద్దుటికల్లా కొత్తరకం సరుకు తెప్పిస్తా. నీ మనస్సులో మలికితం యేమిటో చెప్పు. నింజిలి పెట్టుకొని మాట్లాడితే వ్యవహారం సాగదు. కటాపిటిగా వున్నసంగతి చెప్పాలె. నీకు అన్నం తక్కువైందని అడుగు. దాని మాటేదో చెపుతాను.

రా:- ఆ సందేహం నాకేమీ లేదు.

సు:- అట్లా అంటే నేవొప్పుకోను. డబ్బు చేదా యేమి ? పై లాభంలో నాలుగో వంతిస్తా. ఆలోచించుకో.

రా:- ఇం కామాట తలపెట్టవద్దు. ఆ చిల్లర వస్తువులు దయచెయ్యి. వళాసం వొక్కటిప్పించావంటే మోసకపోవడానికి వీలుగా వుంటుంది.

సు:- నోట శనివుంటే నేనేమి చేసేది? గింజలు కొలుచుకుంటావా?

రా:- బియ్యం గొలువు, యెత్తుకొని పోతా. జొన్నలు సాయంత్రం యిత్తువుగాని.

రామదాసు బియ్యపుగోనె యెత్తుకపోయినాడు. యింతా కటి కొత్తమనిషి చిరునవ్వుతో లోపలికి వచ్చి;

కో-మ:- సుబ్బయ్యగారూ! యేదో లాటుకొట్టారే-మీాదయ్యా సామ్మి!

సు:- ప్రాప్తం లేనిది వుట్టినే యెవరికైనా వస్తుందా? అయితే వొక్క సంగతి. వేళ్లు వంచందీ వెన్నపూస రాదు.

కో-మ:- ఆ మనిషి వట్టి చాదస్తుల్లా గున్నాడే? నేనైతే యిటువంటివి పదిలాట్లు కొట్టి హాయిగా కూర్చుందును. తరువాత మన నడిగేవా డెవడు? పదేండ్లలో పెద్ద సెట్టి నయ్యేవాణ్ణి.

సు:- అయితే నీవు ।వెళ్లితావా! ఇంకా రెండువందల రూపాయల సరుకుంది. నీ తావర మెక్కడనో తెలియకపోయెనే?

కో-మ:- సుబ్బయ్యా! వారంరోజుల నుంచీ వస్తున్నా గదా! నాలో తభావతు యేమైనా కనిపెట్టావా? మంచిచెడ్డలు ముందుగా నీకెట్లా తెలుస్తవి?

సు:- మొదటిసారి పైలాభంలో నీకు భాగం లేదు. అతనితోపాటు రెండోసారినుంచీ నాలుగోవంతు లాభం యిస్తా. ఈ తడవకు అతని మోస్తరుగా ముప్పైరూపాయిలు తీసుకో.

కో-మ:- నాకా షరతులు గిట్టవు. రెండోసారి లాభం వస్తుందని నిలుకేమున్నది? ఈసారిగూడా లాభం యియ్యవలసిందే. లేకపోతే నాపల్ల కాదు.

సు:- సరే, సరుకు తీసుకో. నాకు ముఖమాట మెక్కువ. మొదుట గట్టిగా లేదనలేను.

కో-మ:- జాబితా తయారుచేయండి. రేపు తెల్లనారే వరకు సంచి తెచ్చి వప్పజెపుతా.

సు:- (కూరికపాట్లు పడుతూ, జాబితా తయారుచేసి) మూటకట్టుకో, మళ్ళీ రావడ మెందుకు? ఇకమీద చీకట్లో వచ్చిపోతూ వుండు.

కో-మ:- రాత్రి నిద్దిరలేదా ఏమయ్యా?

సు:- రాత్రి వొంటిగంటకు నే పడుకోవటం. మేఁ ఇట్లా కష్టపడుతాం. కూలివాండ్లు మాడబ్బు బెల్లపొప్పడిగా [illegible] లంటారు.

కో-మ:- మా ఆడకూతురు పనే ముట్టుకోదు. అన్నం పోయిమీద పెట్టడమే దానికి కష్టం. రాత్రింబగళ్లూ నిద్ర పోతుంది.

సు:- చూశావా. మా ఆడకూతురు యిందాకటివరకూ మేలుకొనే వున్నది.

కో-మ:- తెల్లవార్లూ యిట్లా నిద్దర్లు కాయకపోతే మంచి యినపపెట్టె తెప్పించరాదూ? మేమొక జమీందారీవ్యవహారంలో నాలుగు యినపపెట్టెలు లేపేశాం. ఒకటిప్పిస్తా పుచ్చుకుంటావా?

సు:- రాత్రిపూట చేరిపిస్తే పుచ్చుకుంటా. అక్కడికి నా సెమ తీరిపోతుంది.

కో-మ:- వచ్చే ఆదివారం నీ స్వంతబండి పంపితే తోలి పెట్టిస్తా. నూటయాభై రూపాయలపెట్టె డెబ్భయి అయిదుకు తెగ్గొట్టుకో.

సు:- యాభై యింటికి పైన నేను పెట్టలేను. ఆ ప్రకారం ఫైసలు చేయించు.

కొ-మ: మళ్ళీ వస్తాగా. మా నాయకుడు నల్లగాదంటా డేమో? గట్టిమాట రేపు పొద్దున చెప్పుతా. మాటఅంటే చెల్లిం చుకొనేటట్టుగా వుండాలె.

సు-: ఇక యెత్తుకో. నా దగ్గిర మూడురూపాయలే నిలువ వున్నది. లెక్క మరచిపోయేవు. ఆనికె బాగుండదు.

కొ-మ:- బాగుండక—తగవు లాడవచ్చానా? యెతు బారీమీద పోవలెగాని వీటితో అవుతుందటయ్యా?

కొత్తమనిషి మూటెత్తుకొని నిమిషంలో అంతర్ధానం అయి నాడు. మళ్ళీ కనబడలేదు. మరుక్షణంనుంచి సుబ్బిసెట్టి కెందుకో అనుమానంగా వున్నది. పొరపాటు జరిగినందుకు పస్తాయించాడు. తాటిచెట్టంతవాడికి తలదన్నేవాడుంటాడని అనుకున్నాడు. ఆరోజు పగలంతా అదే ఆలాపనగా వున్నది. కొత్తమనిషి తిరిగి రావల సిన గడువు కొన్ని గంటలున్నా రాడని నిశ్చయం చేసుకున్నాడు. పట్టలేక భార్యతో కూడా చెప్పాడు. మధ్యాహ్నం ఆమె దిగులుపడి అన్నం తినలేదు గుడ్లలు కండ్లలో మెదిలినవి. గోరంచుదోవతి పెనిమిటి కట్టుకుంటాననంటే యెందుకు వద్దంటినా పాడుదాన్ని అని విచారపడ్డది. జరిగినమోసం యెవరికీ చెప్పుకోలేదు. దొంగలలో షరీకు అయితే వాళ్లు మోసంచేసి పోయినారని పోలీసులకు తెలిస్తే చిక్కులు వస్తవని భయపడ్డాడు. రామదాసు తెచ్చిన లాభానికి యీనష్టం సరిపోయిందని వుభయులూ మనస్సు కుదుర్చుకున్నారు. రామదాసుకు అన్యాయం చేయకుండా కొంతభాగం అతనికికూడా ఇచ్చినట్టయితే యీమోసం జరిగేవుండదని చంద్రమ్మన్నది. ఈ నష్టంకింద రామదాసు కిస్తానన్న జొన్నలబస్తా బిగబట్టుకో వలెనని మొదట అనుకున్నాడుగాని చంద్రమ్మ రామదాసుకు అక్రమం చేస్తే బెడిసికొడుతుందని భయపడడంచేత ఆ వుద్దేశం వదులుకొన్నాడు సాయంత్రం పల్లెబేరం కాంగనే దుకాణంమూసి వుభయులూ భోజనంచేశారు. చంద్రమ్మ వెంటనే పడుకున్నది. సుబ్బిసెట్టి కొంతసేపు రామదాసు చరిత్రా, మరికొంతసేపు కన్యకా

పురాణం రాత్రి రెండు ఝాములుదాకా చదువుకున్నాడు. ముతరాచుపాలెంలో కుక్కలరుస్తున్నవి. నడివీధిలో రెండుకుక్కలు ఘోడవడం మొదలుపెట్టినవి. కొండమీద గుడ్లగూబలు అరుస్తున్న శబ్దం వినబడ్డది. దొడ్లో అలికిడి అయినట్టుగా వుంటే సుబ్బిసెట్టి లాంతరు తీసుకొని దొడ్లోకి పోయినాడు. లాంతరుకు మూడు వైపులా అద్దాలు పగిలిపోవడంచేత దీపం నిలవలేదు. దొడ్డితలుపు గొళ్ళెం కదిలించి చూచి నాగవాసంలో పుల్ల దోపాడు. మూడు వైపులా యిండ్లు వుండడంవల్ల యిల్లు పెట్టెవలె వున్నది. ఉత్తరం వీధితల. నీలిషం దమ్మకంబాపతు పదివేల రూపాయలు యింట్లో నిలవ వుండటంచేత మనిషికేమీ తోచడంలేదు. రూపాయికంటే వడ్డీ తక్కువ వచ్చినా ప్రస్తుతం వడ్డీకిచ్చివేయడమే మేలనుకున్నాడు. తగినాసామి యెవ్వరా అని యోచించాడుగాని స్ఫురించలేదు. చంద్రమ్మకు సరిగా నిద్రపట్టలేదు. గుడ్డలు యెత్తుకొనిపోయినట్టూ, పోలీసులు వచ్చినట్టూ ఆలాపనగా వున్నది. వొంటిగంటయ్యేవరకు లేచి కూర్చున్నది. సుబ్బిసెట్టి పంచాదిలోకి పోయి పడుకున్నాడు. చంద్రమ్మ లేచివచ్చి తూర్పింట్లో స్తంభాని కానుకొని దీపందగ్గర కూర్చున్నది. యెప్పుడైనా భయంచేత నోట మాట రాకపోతే శబ్దంచేసి పిలవడానికి వొక వోటి తప్పెలా, పగిలిన బొంగుకర్రా దగ్గర పెట్టుకున్నది. దీపం కాగడావలె వెలిగి చమురు పీలుస్తున్నదని కొండెంతదీపం చేసింది. కొంతసేపటికి కునికిపాట్లు వచ్చినవి. అవి పోవడానికి నిన్నటి సెనగపప్పు కాసిని నవిలి నీళ్లు తాగింది. కండ్లమబ్బు పోలేదు. స్తంభానికి తల మోటించి పిల్లికూతలు పెడుతూ నిద్రపోయింది. ఇంటి సమీపంలో కుక్క వొకమాటు మొరిగిందిగాని దొంగలు దానికి బెల్లం, మాంసం లంచం పెట్టారు. ఒకదొంగ ముతరాచుపాలెం వైపున రాళ్ళకుప్ప పేర్చుకొని కావలిగాస్తున్నాడు. ఇద్దరు రెండరుగులపక్కనా నక్కి రెండువైపులా కనిపెట్టివున్నారు. అరుగుమీద గడ్డలుపడ్డ చప్పిడి వినబడకుండా గోనెగుడ్డలు మెత్తగా పరిచి కన్నగాడు మొదటి యిటికె దీశాడు. ఇటికె బెందడుతో గట్టడంచేత ఒక్కటి

రాంగానే తక్కినవాటిని అచ్చులనలె వొల్చి పట్టమీద పెడుతు న్నాడు. కన్నానికి అడ్డం రాకుండా రెండనవాడు యిటికెలన్నీ అరుగుకిందికి దింపాడు. కన్నం పూర్తిఅయింది. ఒకడు కన్నంలో గుండా కాళ్లుచాచి లోపలికి ప్రవేశించాడు. తూర్పింటి తలుపు దగ్గరకు పోయి దానిమీద రెండు చిన్నదెబ్బలు కొట్టాడు. చంద్ర మ్మకు మెళుకువ రాలేదు. తూర్పింట్లోకి పోయి వీధితలుపు గొళ్లెం దీసి చేరవేసివుంచాడు. మరిద్దరు లోపలికి ప్రవేశించారు. దీపం పడకటింట్లోకి తీసుకొనిపోయి వంకెనున్న తాళపు చేతులు తీసు కొని భోషాణం తెరిచేవరకు దాంట్లో వొకపెద్ద చందూకావున్నది. చందూకా నిండా నగలున్నవి. అది వొకడినెత్తిన పెట్టంగనే వాడు వాకిట్లో యింకొకడికి అందించాడు. వాడది యెత్తుకొని సంకేతస్థలానికి వెళ్ళాడు. భోషాణం పక్కన నేలతట్టి చూస్తే బొతక్కుమన్నది. కత్తితో నూటువేసి పైపెళ్ళ లేవదీస్తే రూపా యల బిందెలమీద సిబ్బులు మూసివున్నవి. అవివొకడు వాకిట్లోకి అందించి వచ్చాడు. ఇంకొక కావటిపెట్టె భోషాణంలో వుంటే యెత్తుకొని అంతా బయలుదేరారు. చంద్రమ్మ యింకా కునుకు తూనే వుంది. వీధిలో వొకకుక్క కవ్వించి మొరుగుతున్నట్టు సుబ్బిసెట్టికి వినబడ్డది. అతడులేచి తూర్పింట్లోకి వచ్చి చూస్తే దీపం లేదు. దీపం మలిగిందేమే అని అడిగాడు. వీధితలుపు ఓర వాకిలిగా తీసివున్నది.

సు:- ఏమేవ్? నీ తోడబుట్టినవాళ్ళు వచ్చినట్టున్నారు.

చం:- నీతోడబుట్టినవాండ్లు వచ్చారేమో!

సు:- దీప మేది? వీధితలుపు తీసివున్నది.

చంద్రమ్మ:- 'పడమటింట్లో కెట్లాపోయింది? నే నిక్కడే పెట్టానే! ఇంకే మున్నది. కొంప పోయిం'దని అరిచింటగాని పైకి వినబడలేదు. ఇంకా యేమో చెప్పబోయింది. నోట మాటరాలే దు. కర్రతీసుకొని తప్పెలవాయించబోతే చేతులు తడబడ్డవి. దెబ్బ

తగలలేదు. రెండునిమిషాలు కొట్టినతరువాత నాలుగుదెబ్బలు విన బడ్డవి.

సు:- నే లేచేవున్నా. యెందుకు తప్పేల కొడతావు? (అంటూ నిప్పుపుల్ల గీచాడు పుల్లారంగా పుల్లగీస్తూ) గదిలోకి పోయి దీపం తీసుకొనిరా.

చం:- వాళ్ళందులో వున్నారేమో? నీవు కూడా రా.

సు:- దాని కిద్దరు కావలెనా? ముందు తలుపుమీద కొట్టు.

చంద్రమ్మ ఇశ్శో ఇశ్శో! అని తలుపుమీద కొట్టింది. ఏమీ చప్పిడిలేదు.

సు:- కర్రతో తలుపు నెట్టు.

చం:- లోపలివాళ్ళకు దారిదేగా?

సు:- అటు దారిచేసుకోకుండా వున్నారా? యిద్దరం లోపలికి పోదాం పద.

ఇద్దరూ మెల్లెగా లోపలికి అడుగులు పెట్టారు. యెవరూ లేరు. గోడకన్నం. నేలకన్నం మాత్రం కనబడ్డవి. భోషాణం చూస్తే నగలపెట్టె లేదు. చంద్రమ్మ గుండెలు బాదుకొన్నది.

చం:- ఇంకేమున్నది? అంతా గుండంవేశారు.

సు:- మన రాతేమైనా తీసుకొనిపోయినారా?

చం:- మనకు మిగిలింది రాత వొక్కటే. తక్కినదంతా పోయింది.

సు:- పిచ్చిదానా! అదొక్కటి బాగుంటే చాలు. మూడు రోజులలో పోయిందంతా సంపాయిస్తాను. నీవు తొందరపడి అందరితో వెలితిగా మాట్లాడవద్దు. మనం యివ్వవలసినవాళ్లు రేపే వచ్చి కూర్చుంటారు.

ఈ సందడికి యిరుగుపొరుగువాళ్ళంతా గలభాగా పోగైనారు. కన్నం పరీక్షిస్తున్నారు. కన్నం వేయడంలో గొప్ప పనితనం చూపించాడని గంగాధరుడన్నాడు. యితడు లాలూచీ

అయివుంటా డని కొందరు చెవులో వూదుకొన్నారు. "వెన్నెట్లో దొంగలు పడ్డారేమయ్యా తమాషాగా" అని ఖరింబీ అన్నది.

ఖ:- నీవు నిద్రపోయేదానవు కాదుకదా! యెట్లా జరిగించబ్బా యింతపని!

చం:- కాలం ముగించుకొని వచ్చేవరకు అన్నీ వాన కూడుతవి.

గం:- సొక్కుపొడి చల్లుతారట. అది మీదపడంగానే మత్తు వస్తుందట.

ఖ:- సుబ్బయ్యా! యేమైనా పోయిందా?

సు:- ప్రాప్తం దీరింది పోయింది. తీరంది వుంది.

గం:- ప్రాప్తం యేమాత్రం దీరిందీ?

సు:- ఇంట్లో యేమీ లేదన్నా!

గం:- ఇంట్లో యేమీ లేనిది దొంగలు పడినానికేనా; పడక మునుపా?

సు:- నీ దంతా వేళాకోళం!

మునసబు:- సుబ్బిసెట్టీ! నగలేమైనా పోయినవా?

సు:- యేమీ పోలేదండి. దొంగలు వచ్చారు, పోయినారు. మేము వెంటనే లేచాం. వ్యవదానం యేదీ?

ము:- యేమీ పోలేదని వాజ్మూలం ఇయ్యి.

సు:- ఇంకా వాజ్మూలం యెందుకు? చెప్పేగా వ్రాసుకోండి.

ము:- నిదస్కతు కావాలె.

సు:- పోయింది పోగా ఈ బెడదంతా యెందుకండీ మాకు?

ము:- ఇప్పుడేమీ పోలేదంటివే?

సు:- ఇప్పుడుమటుకు పోయిన వని చెప్పానా?

ము:- సరే. దస్కతు పెట్టు.

సు:- ఊఁ. సరేనా? పోలీసులట్టాలు నే పడలేను.

ము:- కేసు కమిస్మా చేతువుగాని——

అంటూ వెళ్ళిపోయినాడు. యింతలో కోమటి వెంకాయి వచ్చి,

వెం:- మునసబుంకో నీకు తగాదా యెందుకురా? బెదిరిస్తూ పోతున్నాడు. వచ్చినకర్మానికి దోడు పైగా యిదెందుకు; యేమన్నా పోయిందా?

సు:- యేమి వున్నదక్కా యింట్లో? రావడం చూశామా? పోవడంచూశామా? యేమి తీసుకపోయిందీ యెట్లా చెప్పగలం?

వెం:- అంతే నన్నావూ? నే పోయివస్తా. చంద్రమ్మా! దిగులుపడబోకు.

గం:- దొంగలు లోపలికి వచ్చారా సుబ్బయ్యా?

సు:- మాకు లోపల యెవరూ కనబడలేదు. బయటివాండ్లు బయటనే పోయినారు. వాళ్ళకు చాలిగూడా గిట్టినట్టులేదు. పడుకోండయ్యా పోయి! యెంతసేపని మేలుకొంటారు?

అంతా వెళ్ళిపోయినారు. కన్నానికి పాతతలుపు చెక్క లడ్డం పెట్టి తలుపు వేసి యింట్లోకి వెళ్ళారు.

తెల్లవారేవరకు ఫూరిపిల్లలూ, పెద్దలూ సుబ్బిసెట్టి యింటి చుట్టూ చేరారు. సత్తెనపల్లినుంచి పోలీసుసూపరెండెంటు, డిప్యూటీకలెక్టరు వగైరా వుద్యోగస్థులు, కొండపీటి కొండకు పోవలెనని వస్తూ తెల్లవారేవరకు మంగళాపురం వచ్చారు. రాత్రి సుబ్బిసెట్టి సొమ్మేమీ పోలేదని వాఙ్మూల మిచ్చినా మునసబది నవెూనామీద వ్రాయలేదు. ఉద్యోగస్థులు దడబడగా రావడంతోనే పెద్ద వుద్యోగులు తనసొమ్ము పట్టి యిప్పిస్తారేమో అని ఆశతో మునసబును లోగట్టుకొని పూర్వపు వాఙ్మూలం తొలగించి యిరవై వేలరూపాయల ఆస్తి పోయినట్లు నిజమైన వాఙ్మూలం యిచ్చాడు. ఈ కేసు పూర్తిగా విచారించి పత్తా తీయవలసిం దని యిన్స్పెక్టరుకు ఖండితమైన వుత్తరువు లిచ్చి

భోజనం అయినతర్వాత వుద్యోగస్థు లందరూ బయలు దేరారు. వీరిలో డజన్ మంది పోలీసుజవాన్లు తక్కెళ్ళ జగ్గడి తాలూకు ఒకగుంపు తుమ్మలపాలెం సమీపంలో కొండవండలలో ఆడ వాండ్లతోసహా దిగివున్నారని తెలిసి రెండు పార్టీలుగా బయలు దేరి గుంపును బట్టుకోవలెనని యేర్పాట్లు జరిగినవి. డిప్టీ సూపరిండెంటు డజన్ పోలీసులతో బయలుదేరి యనమదల రస్తాను తెల్లవారే వరకు వచ్చేటట్టు వుత్తరువు లయినవి. రాత్రులు కొంగతనం చేసి తెల్లవారే వరకు దొంగ లంతా కొండలోయలలో జేరి నిద్రపోతుంటా రనే నిశ్చయంతో బయలు దేరారు. సారా దుకాణాలకుపోగూడదని, వూళ్ళల్లో బోగంవాళ్లతో సంబంధాలూ పెట్టుకో గూడదనీ, జగ్గడు నిబంధనలు చేయడం చేత పోలీసులకు ఆమూకీ చెప్పేవా ళ్ళెవ్వరూ కనబడ లేదు. సత్తెనపల్లినుంచి వచ్చేపార్టీ కోటదగ్గరనుంచి కొండెక్కి లోయలోకి దిగవలెననీ, గుంటూరుపార్టీ లోయలోకి కిందినుంచి యెక్కవలెననీ యేర్పాటు సూపరిండెంటు జగ్గడిని పట్టుకోవలెననీ ఉత్సాహ పడుతున్నాడు. దొంగలగుంపు యెంతపెద్దదో పోలీసువారికి తెలియదు. చుట్టుపల్ల గ్రామోద్యోగులు తాముకూడా వస్తామని పోలీసువారితో చెప్పారుగాని జనం యెక్కువ అయితే అల్లరై తమజాడలు ముందుగా గుంపుకు తెలుస్తవనీ, యీ వచ్చే వాళ్ళలో కొందరు గుంపుతో లాలూచీ అయి వుండవచ్చుననీ, సందేహించి యెవండ్లనూ రానియ్య లేదు. పోలీసుల జాడలు చూవత్తూ కొండపేటి మునసబువల్ల గుంపుకు పూర్తిగా తెలిసినవి. సత్తెనపల్లి పార్టీ వచ్చే జాడలన్నీ కనిపెట్టి కురవదారి ప్రక్కన నక్కి వున్నారు. తుపాకులు, కత్తులతోసహా ఇటువచ్చిన దొంగల పార్టీ యాభైమందికి మించుతారు. పోలీసుపార్టీ కురవదగ్గరకు వచ్చేవరకు యింకా చీకటి వున్నది. పోలీసులు తమమీద తుపాకులు కాల్చడానికి అవకాశంలేకుండా యాభైమందీ పేష్కబ్జలతో గుంపుమీద పడి పట్టుకొన్నారు. సూపరిండెంటూ, డిప్టీకలె

క్టరూ సహా ౧౪ మందిని చొక్కాలు తీసివేయించి చెట్లమొదళ్ళకు కట్టి తుపాకులు వూడదీసుకుని యనమదలవైపుకు బయలుదేరారు. యనమదల పోలీసుపార్టీకి నాయకుడుగావున్న అయ్యంగారు దొంగలు భయపడడంకోసం ముందుగా అదుగుదెబ్బలు కాల్పించాడు. అందువల్ల పోలీసువారి మందుసామాను ఖర్చుకావడమే కాకుండా జాడలు వెల్లడి యైనవి. పోలీసులు తేపా తుపాకులు కాలుస్తుండడంచేత వారిమీద పోయి పడితే సన్నీలుపయోగిస్తారేమో నని దూరంనుంచే అరవై తుపాకులను బారుచేసి వొక్క పర్యాయం పోలీసులమీద కాల్చేవరకు కొందరికి బలమైన గాయాలు తగిలినవి. సూపరింటెంటు అయ్యంగారు 'పోలీసులను కాల్చవద్ద'ని వుత్తరువు చేసి 'మేము లోబడ్డాం. మమ్మల్ని కాల్చవద్ద'ని కేకలు వేశాడు. గుంపు నాయకుడైన చెంచు రామానాయకుడు వారందరూ తుపాకులు చప్పిడయ్యేటట్టుగా విసిరి దూరంగా పారేసి బోర్లపడుకోవలసింది దని వుత్తరువు చేశాడు. పోలీసులు ఆ ప్రకారమే జరిగించారు. రామానాయకుడు పిచ్చుకత్తులుగల అయిదుగురు అంగరక్షకులతో ముందుకు వచ్చి "శరణాగత రక్షక బిరుదాంకిత రాజాధిరాజ తక్కెళ్ళ జగన్నాథంగారి ఆజ్ఞానుసారంగా అభయమిస్తున్నాను. మీరు లేచి వెళ్ళిపోం"డని గంభీరంగా ఉత్తర్విచ్చాడు. అంతట అయ్యంగారూ, తక్కిన పోలీసులూ లేచి బయటపడ్డారు. అంతట రామానాయకుడి సైనికులందరూ యెవరి పీలువెంబడి వారు యీ సాయంత్రమే వెళ్ళిపోవలసిందనీ సంకేతస్థలం చేరవలసిందనీ సాయంత్రం వరకూ యెవరూ గుంపుగా వుండగూడదనీ ఉత్తర్వు చేయడంతోటే గుంపు యావత్తూ తుపాకులు సంకేతస్థలంలో పాతివేసి చెదిరిపోయింది.

# 3

## దొంగల కోవలు

జిల్లాసూపరిండెంటునూ, సిబ్బందినీ జగ్గడి గుంపు పట్టుకొని చెట్లకు కట్టివేసి పోయిం దని కొండవీటి గ్రామస్థులకు తెలిసి కావలివాండ్లనూ, వూరి జనాన్ని తోజు చేసుకొని తగినన్ని వస్త్రాలతో కుగవదారిన బోయి బందీలను కనిపెట్టి విడిపించి పైకి గుడ్డలిచ్చి మెల్లగా నడిపించుకొని రెండుజాము లయ్యేటప్పటికి ఊళ్ళోకి తెచ్చి మజ్జన భోజనాదులు చేయించారు. డిప్యూటీ సూపరిండెంటు అయ్యంగారు, తానూ సిబ్బందీ దొంగలతో హోరాహోరీ పోట్లాడామనీ దొంగల గుంపు అతి పెద్దది కావడం చేత మెళుకువతో తన సిబ్బందిని రక్షించుకొని సగౌరవంగా వచ్చామనీ తగినంత సిబ్బంది వత్తాసిగా వుంటే యావత్తు గుంపును పట్టుకుంటా నని జిల్లాకలెక్టరు ఫీల్డుగారికి వ్రాశాడు. సూపరిండెంటుగారిని కట్టివేశా రని కబురు రావడంతోనే కలెక్టరుగారు మద్రాసు గవర్నమెంటుకు తారిచ్చి అయ్యంగారి ధైర్య సాహసాలనూ, చాకచక్యమునూ పొగుడుతూ రెండువందలమంది మూలబలాన్ని, యాభై మంది పోలీసులనూ ఇచ్చి నాయకుడుగా జేసి అయ్యంగారిని పంపించారు. కలెక్టరుగారు కొండవీటి గ్రామ మునసబుకు సర్కారుకు సహాయంచేసి తన రాజభక్తిని ప్రకటించినందుకు రావుసాహేబు బిరుదు సిఫార్సుచేసి డిప్యూటీసూపరిండెంటుగారి రెండవ దండయాత్రలో సహాయం చేయవలసిందని తాఖీదు పంపాడు మర్నాటి సాయంకాలం అయ్యంగారు సిబ్బందితోసహా ౯ గంటలకు సత్తెనపల్లి స్టేషనులో దిగి తెల్లవార్లూ అక్కడ పడుకున్నాడు. క్రిందటిరోజు మోస్తరుగా చీకట్లో బయలుదేరితే దొంగలు మాటి కాలుస్తారని బాగా తెల్లవారిన తరువాత ఫలహారాలుచేసి కొండ రిజర్వు యావత్తూ పరవంజి మునుములుపట్టి వెదకడం ప్రారంభించారు. మధ్యాహ్నం పొతూరు అమీన్ బాదా గ్రామాలలో భోజనంచేసి వెంటనే

కొండలూ, అడవులూ వెతకడం ప్రారంభించి పొద్దుకూకేవరకు వొకభాగం తుమ్మలపాలెం, రెండవది కొండవీడు, చేరారు. అంతట యుద్ధం చాలించి వుదయం యథాప్రకారంగా బయలు దేరి రెండుజాము లయ్యేవరకు చనుగొండ మొకిరె చేరారు. అప్పటికి వెతకడం పూర్తయింది అయ్యంగారు వల బాగానే వొడ్డాడుగాని జెల్లపిల్లకూడా దొరకలేదు. జిల్లాకలెక్టరూ, సూప రిండెంటూ ఆ సమయానికి అక్కడికి వచ్చారు. దొంగలు వొక్కరూ చిక్కకపోవడానికి కారణా లందరూ కలిసి యోచించి కొండ యావత్తూ వొక్కరోజులో వెతకడం సాధ్యం కానందున మొదటిరోజు రాత్రి దొంగలు వెదకిన భాగంలోకి పోయి అయినా వుండాలె, లేక చుట్టుపక్క గ్రామాలవాండ్లుకూడా ఆ గుంపులో చేరివుండి వాళ్ళ సహాయంతో ఝుడితి ప్రారంభించక పూర్వమే తప్పించుకపోయైనా వుండాలె నని నిర్ధారణచేశారు. సోదా చేయడంవల్ల భయపడి దొంగలు పరుగెత్తిపోయినదీ లేనిదీ నిదానంమీదగాని తెలియదనీ ప్రస్తుతం దొంగలను పట్టుకోవడం చాలించి మూలబలానికి బత్తా యిచ్చి పంపివేశారు. దొంగ తనాలు యథాప్రకారంగానే జరుగుతూ వున్నవి. జిల్లాలో ధన వంతులని పేరుగల వర్తకులూ, భూస్వాములూ, ప్లీడర్లూ గోల పెట్టుతూ వున్నారు. నాలుగైదు జిల్లాలలో గుంపులు పేరుచెప్పి కన్నాలు వేస్తున్నారు. దార్లు గొడితే హీనమని యెంచే తెగల వాళ్ళను కన్నాలు వేయడానికి పంపారు. దార్లు గొట్టడమే మొగ సిరి అని కొందరు కన్నాలు వేయడానికి యెక్కువ తెలివితేటలు గావలెనని కొందరూ వివాదపడడంచేత ఏ శాఖలో అభిరుచిగల వాళ్ళను ఆ శాఖకు నియమించ వలసిందని జగ్గడు త్తరువుచేశారు. యేటి నానుకొనివున్న నైజామిలాకా గ్రామాలలోకూడా దోపి డిలు జరగడంచేత నవాబుగారి పోలీసులుకూడా ఇంగ్లీషు పోలీసు లకు సహాయమైనారు. కర్నూలుజిల్లా సూపరిండెంటు స్పెన్సరు గారు యెక్కువ తెలివితేటలు కలవాడని అధికారం వారికిచ్చి నాయకునిగా నియమించారు. చాలాచోట్ల దొంగలు పట్టుపడ్డారు

గాని జగ్గడియొక్క నేర్పరితనం చేతనూ, గోపనా శక్తి చేతనూ యావత్తు గుంపుయొక్క యేర్పాట్లు, లోతుపాతులు నాయకులకు తప్ప సామాన్యులకు తెలియకపోవడంచేతనూ, వొక కోవలో వాళ్ళ జాడలు రెండవ కోవ వాండ్లకు తెలియక పోవడంచేతనూ, పట్టుబడ్డవాండ్లు పోలీసులెంత బాధపెట్టినా తమ కోవకు సంబంధించిన యెనిమిదిమంది పేర్లు తప్ప తక్కిన వాళ్ళవి బయటపెట్టలేదు. పది జిల్లాలలో బందిపోట్లు నడిపిస్తున్నా జెగ్గడి చెహరా చెప్పగలవాడు వొక్కడూ దొరకలేదు. అయిదారు కోవలవాళ్లు కొన్ని చెహరాలు చెప్పారుగాని తాబెల్లువేసి చూస్తే వొకదాని కొకటి పొసగలేదు. అయిదు జిల్లాలనుంచి జగ్గణ్ణి పట్టు కన్నామని రిపోర్టులు వచ్చినవి గాని కేసులు విచారణకు పెడితే అసలు జగ్గడు దొరకలేదని తేలింది. పదిసంవత్సరాల క్రింది జగ్గడి చెహరా ప్రకారం పరీక్షిస్తే అటువంటివాడు వాళ్ళకంతే చిక్క లేదు. కర్నూలు జిల్లా యెర్రమలలో జగ్గడు దొరికాడని చివరకు నిర్ధారణయింది. నెల్లూరుజిల్లా జడ్జిగారిని అతనితో దొరికిన యెనభై మంది గుంపునూ విచారించడానికి నియమించారు. మూడువందల మంది సాక్షులు యిరవై తాలూకాలనుంచి వచ్చారు. అయిదు నెలలు కేసు విచారణ జరిగింది. జగ్గడినీ, యిరవైమంది తోడుదొంగలనూ పదేసిసంవత్సరాలు బందిపోటు సెక్షన్ కింద శిక్షించారు. జగ్గణ్ణి పట్టు కొన్న పదిమంది పోలీసులకు బహుమతులూ, వున్నతోద్యోగాలూ యిచ్చారు. కర్నూలుజిల్లా సూపరిండెంటుకు కమీషనరుపని ఖాయంచేసి గుంటూరులో మకాం యేర్పరచుకొని జగ్గడి అను చరులనుపట్టి రూపుమాపవలసిం దని సర్వాధికారం యిచ్చారు. ఇవన్నీ జరిగిన పదిహేనురోజులకు కమీషనరుగారు పదిహేను మంది సిబ్బందితో పల్నాడుతాలూకా శ్రీగిరిపాడు అడవులలో సంచరిస్తుంటే యాభైమంది దొంగలగుంపు వచ్చిపడి యావత్తు మందినీ పట్టుబడీ చేసి కమీషనరుగారూ, డిప్టీసూపరిండెంటు అయ్యంగారూ, మరి యేడుగురు ఇతరపోలీసులూ జగ్గడివత్తాసులను

నిజం రాబట్టడంకోసం శరీరంలో యినుపముండ్లు గుచ్చి, రాళ్ళతో మోకాళ్ళమీద, మోచేతులమీదపొడిచి హింసించారనీ నేరాలు మోపి మారువేషంతో తెల్లవాండ్లదుస్తులు ధరించి జగ్గడు కోర్టు పెట్టి విచారణచేసి పెద్దవుద్యోగస్థులకు రెండు డజనులూ, చిన్న వాండ్లకు డజన్ దెబ్బలూ చొప్పున ముక్కోణానికి కట్టించి చింత మల్లెలతో కొట్టించి పంపివేసినట్టు ప్రచురమైంది. పత్రికలన్నీ పోలీసుపరిపాలనయొక్క దౌర్బల్యాన్నీ, అసమర్థతనూ ఖండిస్తూ వ్యాసాలు వ్రాసినవి. గవర్నరుగారు ప్రతికలెక్టరుకూ, సూపరిం డెంటుకూ, పదిహేనురోజులలోగా నేరాలు ఆపి జగ్గణ్ణి పట్టుకొనే టందుకు తగినయేర్పాట్లు చేయించవలసిందని తాఖీదులు పంపారు. కలెక్టరుగారు గ్రామవుద్యోగుల కందరికీ అనుమానస్థులమీద పూర్తిగా నిఘా వుంచాలిసిందనీ, నేరపుతెగల సంచారాలు రిపోర్టు చేయవలసిందనీ ఖండితంగా తాఖీదులు పంపారు. ఇన్ని ప్రయ త్నాలు జరుగుతున్నా బరంపురం మొదలు కడపమండలంవరకూ, పడమట హైదరాబాదు వరకూ నేరాలు జరుగుతూనే యున్నవి. దొంగలు పడమటిజిల్లాలకు కూడా వ్యాపిస్తున్నారు. వీళ్ళ కోవలు ప్రతిగ్రామంలోనూ యేర్పాటు చేయడంకొరకు జగ్గడు ఏజంట్లను పంపి ప్రచారం జరిగిస్తున్నాడనీ, ఈ వస్తాదులు అనేకవేషాలతో పడమటిజిల్లాలలో తిరుగుతున్నారనీ, ఆ జిల్లాలలో వర్షాలు కురవక పంటలు పండనందున బీదలు గుంపులు గుంపులుగా కోవ లేర్పడుతున్నారనీ బళ్ళారి అనంతపురం జిల్లాల కలెక్టర్లు గవర్నరు గారికి తెలియజేశారు. మైసూరురాజ్యంలోకూడా కొన్నిచోట్ల జగ్గడి ఏజంట్లు ప్రచారం చేస్తున్నారనీ, బీదలకు ముఠాదలాగా కోవకు నూరురూపాయలవంతున డబ్బు భోజనం నిమిత్తం యిస్తు రన్నానే సమాచారం తెలిసిందనీ, దేశభక్తులందరూ ఈవుద్యమం తమరాజ్యములో వ్యాపించకుండా ప్రభుత్వానికి సహాయం చేయ డం ధర్మమనీ దివానుగారు వుపన్యాసం యిచ్చారు. హైదరా బాదు, మదరాసు, మైసూరు ప్రభుత్వాల తరపు యేజంట్లు కలిసి

జాయంటుగా పనిచేసేనిమిత్తం గుంతకల్లువచ్చి కొన్నియేర్పాట్లు చేశారు. వాటి ననుసరించి మూడుగవర్న మెంట్లవారూ తమపోలీసు సిబ్బందిని రెండు రెట్లధికం చేసి జాగ్రత్తగల వుద్యోగులను అన్వేషణ శాఖాధికారులుగా నియమించారు. రైలుకంపెనీలు తమపోలీసుసిబ్బందిని ముబ్బడిచేసి ప్రయాణీకులను ఖరాఖండీగా పరీక్షించవలసిందనీ వుత్తర్వులు జరిగినవి.

౪

బుజ్జి కథ

ఒకరోజు తెల్లవారేవరకు ఆంధ్రదేశంలోవున్న అన్ని రైలుపెట్టెలలోను పందలకొలది ప్రకటనలు కుప్పతిప్పలుగా వెదజల్లబడ్డవి. ఆ కాగితాలే ప్రతి వుద్యోగస్తుడికీ పోస్టుద్వారా వచ్చినవి. ప్రయాణీకులు గుంపులుగా జేరి కాగితాలు చదువుతున్నారు. "రాజాధిరాజ, శరణాగతరక్షణ సర్వమతస్థాపనాధికార, తక్కెళ్ళ జగన్నాథం గారి ప్రకటన" అను శీర్షికతో "మా అనుచరులను శత్రువులు పట్టుకున్నప్పుడు న్యాయశాస్త్రం ప్రకారం శిక్షించకుండా మానాయకుల పేర్లు చెప్పవలసిందనీ, మా సంఘంయొక్క యేర్పాట్లు బయటపెట్టవలసిం దనీ నిర్బంధపెట్టి అంగీకరించనివాండ్లనుహింసించి ఇనుపఖడ్డీలతో కాల్చిచిత్రవధలు చేస్తున్నట్టూ మాసైనికుల తాలూకు స్త్రీలను తమభర్తల జాడలను జెప్పవలసిందని బాధించి అవమానపరుస్తున్నట్టూ మాకు తెలియవచ్చింది. ఇకముందు యిట్టి అక్రమచర్యలు పోలీసులుగాని, వారి యిలాకావారు గాని జరిగించేయెడల అట్టివాండ్లకు మాచట్టాలప్రకారం కఠినశిక్షలు విధించుతామని తెలుసుకోనేది. మాస్త్రీలను దుర్మార్గులు అక్రమంగా అవమానపరిస్తే దానికి ప్రతిక్రియగా శత్రుస్త్రీలను అవమానపరచడానికి మాధర్మాలు అంగీకరించవు గనుక యితర శిక్షలు మాత్రమే విధించబడుతవి. సనాతనులైన

మా అనుచరులు మా ధర్మానికి వ్యతిరేకంగా స్త్రీలను అగౌరవ పరిస్తే మాకు వెంటనే తెలుపగోరుతాము.

—తక్కెళ్ళ జగన్నాథం."

అని వ్రాయబడివున్నది. వాండ్లు చేసేవి అక్రమాలైనా క్రమంగా విచారించి శిక్షించవలెగాని బాధించడం పోలీసులది తప్పని కొందరూ, వాండ్లు స్త్రీలగౌరవం కాపాడినంతవరకు పట్టు పడరని కొందరూ, వాండ్లు ధర్మానికి కట్టుపడి పనిచేయడంచేత యింతపని జరుగుతున్నది గాని ధర్మవిరుద్ధంగా వర్తిస్తే ఆరంభం లోనే దొరికేవాండ్లని మరికొందరూ తమకు దోచినట్లల్లా వాదిస్తు న్నారు. జగ్గడు తను సంపాదించిన డబ్బంతా బీదలకు పంచిపెడతా డనీ, మారువేషముతో వచ్చి బీదలకు సంతర్పణలు చేయించి వస్త్రాలు పంచిపెడుతున్నాడని, విశాఖపట్టణం జిల్లాలో కొన్ని కన్యాదానాలు చేయించా డనీ, ఏజన్సీ తాలూకావాళ్ళందరూ అతనికి అనుచరులై నైజాంలో కొన్ని తాలూకాలు స్వాధీన పరు చుకున్నా రనీ, జగన్నాథ మనేపేరు తగేవున్నదనీ పలువురు పలు విధాలుగా చెప్పుకుంటున్నారు. ఈ ప్రయాణికులలో మారువేషా లతో కొందరుపోలీసులూ, కొందరు సంతానులూకూడా వున్నారు. ఒకరోజు పట్టణం పాస్యెంజరైలు బెజవాడ దాటంగానే రైలులో కూర్చున్న యిద్దరు జంగాలు బిచ్చం అడుక్కొనే నిమిత్తం రెండు కీర్తనలు పాడిన తర్వాత జగన్నాథంగారి ధర్మతత్త్వాలని కాగి తాలు పంచిపెట్టి బుర్రకథ ప్రారంభించారు.

రామరామ శ్రీరామా రామా - రామా రఘురామా
తక్కెళ్ళజగ్గని ధర్మబోధలు - తలపున నిలపండి
ఆదికాలమున అందరు జనులు - అన్నదమ్ములండి
నదులు వనంబులు నానామృగములు - నాల్గుసంద్రములును
కొండలు వండలు జలములు పొలములు - కుంటలు సెలయేళ్ళు
కాయలు పండ్లు పాడిపంటలు - ఘనమయినా యిండ్లు
అంతరువులా భేదము లేక - అందరి సొమ్మండి

కుడవాగట్టా వాకరికి బెట్టా - కొదవే లేదండి
నా నీ భేదము లేక లోకము - నడుస్తువుండేది
మనసులోపలా చీకుచింతలు - మందుకైన లేవు
తొత్తులదొరల భేదములేని - తోడుబంటు లండి
అందలమెక్కే మోసేభేదము - లసలే లేవండి
ధనికుల పేదల తారతమ్యముల్ - తలలు చూపలేదు
అరుకువ ఆకలి బాధ లప్పుడు - అంకురించలేదు
ధనమును గొల్చే దుష్టరోజులు - దాపరించలేదు
తిరిపెపుకొరకై ధనికుల బీదలు - దేవురించలేదు
కూటికి గుడ్డకు గుడ్డికుంటులు - గోడు చెందలేదు
మాపులు రేపుల మలమలమాడుచు - మాల లెండలేదు
భోగము లొక్కట పస్తులొక్కట - పొందియుండలేదు
దొరలు మత్తులై నీచభోగముల - దొర్లుతుండలేదు
పాటుపడడమే పరువు తక్కు వను- భ్రాంతిలో పడలేదు
రామరామ శ్రీరామా రామా - రామా రఘురామా
తక్కెళ్ళ జగ్గని ధర్మబోధలు - తలపుల నిలపండి
కృతయుగమందలి ధర్మము లెల్ల - క్రిందుమీదు గాగ
పాపముతోటీ కలియుగ మంత - పండిపోయెనండి
పాపధర్మములు లోకమంతట - పరిసిపోయెనండి
యెక్కడ జూచిన ఆర్భాటములే - యెక్కడ ఘోషములె
యెక్కడ జూచిన పోటీలండి - యెక్కడ కలవరమె
సన్మార్గంబున జీవయాత్రలు - సలుపుట దుర్ఘటము
లోకమందున చక్రవర్తియై - లోభు డేలుచుండు
లోకములోని ద్రవ్య మంతయు - లోభుల పరమయ్యే
అంతా నాదే అంతా నాదే - అందురు జనులండి
అంతా మనదే యనెడు రోజులు - అంతరించెనండి
పరుగిడు కాకులు యిండ్లమీదుగా - పార వెలచునండి
యెంగిలిచేయీ కాకులవైపు - విసరదు యిల్లాలు
నారాయణమ్మలు యిల్లే యంటు - సడతురు యింటింట
యెవరో కొందరు అరువుకొందురు - యెల్ల ద్రవ్యములను

కోటి కొక్కరై వున్నారండి - కోటీశ్వరు లంటు
కుచేలు లందరు అయినా రండి - కోట్లకొలదిగాను
కోటీశ్వరుల కునిష్టిబిడ్డలూ - కోట్లకు కర్తలట
మనుమలెగాదూ మనంతరాలూ - మారుహక్కు లంట
అరువు జెప్పితె అడ్డిగకూలి - పనికి పాతికెంట
రామరామ శ్రీరామా రామా - రామా రఘురామా
తక్కెడజగ్గని ధర్మపన్నముల్ - తలచి బ్రతుకరండి
ధనికులు బొర్రల నిమురుకొందురు - తలప రొకరిబాగు
చేతులవేళ్ళ పనులు ముట్టక - చెడి సోమరు లయిరి
కాలిమీదనె కాలువేసుకొని - కాలం బుచ్చేరు
భాగ్యవంతులకు బీదలెల్లరు - బానిస లయినారు
పొద్దుగూకులు చాకిరి చేస్తురు - బొక్కెడు కూటికిగా
యెంత చేసినా తృప్తి లేదయా - యజమానుల కెల్ల
రోగం రానీ నొప్పి రానీ - నాగా దప్పదంట
కూలికి విలువ గలదని మీరు - గుట్టు తెలుసుకొండి
కూలికి దగిన విలువ పుచ్చుకునే - కూలికి మరిపోండి
నీళ్ళ కూలికి వొప్పుకుంటిరా - నెనరు చెరుపుకొంద్రు
పనివాండ్లందరు యేక మైతిరా - ప్రపంచమే మీది
ఐకమత్యమే అన్ని పనులకు - ఆధారము సుండి
శ్రేణులు గట్టి సమ్మె గట్టితే - చెల్లును మీ మాట
కొట్టావద్దు తిట్టావద్దు - కోర్కెలు నిడివేరున్
అసహాయయోగము తరుణము చూచి - అవలంబించండి
దానికి మిగిలిన మంత్రతంత్రములు - ధరలో లేవండి
శంకలు దక్కి మీర లెల్లరు - శపథము చేయండి
సమతాధర్మం ప్రపంచమందున - స్థాపించురుగాని
కృతయుగధర్మం లోకమంతటా - కుదుట బెట్టగలరు
రామరామ శ్రీరామా రామా - రామా రఘురామా.

ఒక ప్రయాణీకుడు:- ఆయన చదివిన తత్త్వంతో వొకటీ అసత్యం గనపడలేదు. అయితే కొందర రంగీకరించరు.

రెండో ప్రయా:- "యధార్థ వాదీ లోక విరోధీ" అని, వున్న సంగతులు చెబితే లోకకంటకంగానే వుంటుంది. ఆ సంగతులు తప్పని యెవరు వాదిస్తారో రండి. శుద్ధమైన వేదాంతాన్ని బట్టి నేను నే సమర్థిస్తాను. "శ్లో. ఆత్మవత్సర్వభూతాని యఃపశ్యతిస పండితః" అన్నాడు. ఈ కాలంలో వట్టి బోధలు వినేవాండ్లెవరు? ప్రభువు సమర్థిస్తాడా అంటే యీ కాలపు ప్రభుత్వాల్లో ధనవంతులే ప్రభువులు. తలలో మట్టిముద్ద వున్నా ధన ముంటే సరి-వాడే మహానుభావుడు. చెప్పి వినిపించే నాథుడు లేకపోబట్టే వొకడు నే నున్నా నని బయలుదేరాడు.

మూడవ ప్ర:- ఈ రోజులలో కొందరు పోలీసులు వేషాలతో వుంటారట. మహా వుపన్యాసా లిస్తున్నావు. కాస్త ఆచి మాట్లాడు!

రెం-ప్ర:- ఆచి మాట్లాడకపోతే ప్రళయం వస్తుందా? ఆ తత్త్వంలో జెప్పిన సంగతులు అబద్ధ మని ఆ పోలీసులను వచ్చి వాదించమను, నా తడాఖా చూతువుగాని.

ర-వ ప్ర:-దొంగతనం మంచి దంటావా? అయితే యీ రాత్రే మీ యింటికి వచ్చి కన్నం వేస్తా.

౨-వ ప్ర:- దొంగతనం మంచి దని నే నంటే యింకా కన్న మెందుకూ? దానమే యిచ్చిన ట్టాతుంది.

ర-వ ప్ర:- అయితే నేను నీతోనే రైలు దిగి వస్తా. నీ ఆస్తీ స్వాధీనపర్చుకుంటా. నీ వేమీ ఆక్షేపణ చెప్పకూడదు.

౨-వ ప్ర:- నా ఆక్షేపణ యేమీ వుండదు. కాని,

ర-వ ప్ర:- అదుగో "కాని" అని యేదో అడ్డం పెడుతున్నావు.

౨-వ ప్ర:- నీ కడ్డం వచ్చేకాని గాదు. నీ యాస్తిగూడా తీసుకరా, కలిపి పంచుకుందాం.

ర-వ ప్ర:- అయితే నీ ఆస్తి సున్నేనా? నాది కలిపితే హాళ్ళీ అవుతుంది.

3-వ ప్ర:- మొండిచేతుల పెండ్లానికి మోరుగాళ్ళ మొగుడు. మీ రిద్దరూ గలిసి అవల్ రకం సంతానులు గావచ్చు.

౧-వ ప్ర:- సనాతను లంటే అర్థ మేమి ?

జంగం:- సనాతను లంటే ఆదిపురుషులు. సృష్ట్యాదిలో ఆస్తులూ, సంపాదనలూ యెక్కడ వున్నవి ? యెవరికి గావలసినవి వార లనుభవించారు. అప్పు డందరూ భాగ్యవంతులే. ద్రవ్యం దాచుకోనని భాగ్యవంతులు. నాది అనే అహం బయలుదేరి నప్పటినుంచీ ప్రపంచ దుస్థితి ప్రారంభమైంది. అహం చస్తేనే కాని సర్వసమత్వ మేర్పడదు. అహం చావనివాడు సర్వభూత ములూ తానుగా భావించుకోలేడు.

బండిలో కూర్చున్న వొక స్థూలకాయుడు సంభాషణంతా వ్రాసుకుంటున్నాడు. అది వొకడు చూచి యితరులకు కన్ను గీటాడు. చిత్తజల్లు నిలిచినట్టు సంభాషణ ఆగిపోయింది. బుర్ర కలథవాండ్లు కనుమొరిగారు గాని వారచూపుల స్థూలకాయుడి వంక చూస్తూనే వున్నారు. అతడు కొంచెంసేపు బండిలో వాండ్లను పరీక్షించి చూచి చెక్క కానుకొని నిద్రపోయినాడు. బండి తెనాలి వచ్చింది. బుర్రకథలవాండ్లు మెల్లగా జారారు. బండి కదిలింది, వడెక్కింది. స్థూలకాయుడు లేచి తెనాలి ఇంకా యెంతదూర ముంటుం దని ప్రయాణీకులను అడిగాడు. వెనకకు బోతే పావుగంటదూర ముంటుం దని వొకడు జవాబు చెప్పాడు. నన్ను యెగతాళి చేస్తున్నారా అని స్థూలకాయుడు కోపపడ్డాడు. మరి వొకడు 'అయ్యా! మీకు కోప మెందుకు ? అతడు తెలి యక చెప్పాడు. ముందుకు బొయ్యేటట్టయితే కొన్ని వందల మైళ్లు రైలుప్రయాణం, కొన్ని వేలమైళ్లు వోడప్రయాణం, మరి కొన్ని వేలు కాలిప్రయాణం చేస్తేనేగాని తెనాలి రాద'న్నాడు. అంతా నవ్వి చప్పట్లు గొట్టారు.

స్థూలకాయుడు:- (అదిరిపడి) బుర్రకథలవాండ్లేరీ ?

ప్ర:- వాండ్లు తెనాలిలో దిగిపోయినారు.

స్థూ:- అరే! మోసంచేశారే! దిగి సోదాచేయింతా మనుకున్నాను. వాండ్లు అదృష్టవంతులు, తప్పించుకొని పోయినారు. లేకపోతే యీపాటికి బేడీలు పడేవి. (అని మునమునలాడుతూ కూర్చున్నాడు:)

జగ్గడి ప్రకటన వెల్లడి కావడంతోటే గవర్నరుగారు దొంగల నెవరినీ కేసు వెల్లడిచేయడానికి నిర్బంధించగూడ దని కఠినమైన వుత్తరువులు చేశారు. జగ్గడి అనుచరులు బాధించడం తప్పిపోవడంవల్ల వేలకొలది మైళ్ళకు పోవడానికి సంసిద్ధులై విచ్చలవిడిగా సంచరించి కన్నాలు వేస్తున్నారు. చోరీలు జరిగించేటప్పుడు అనవసరంగా యెవరినీ గాయపరచగూడదని జగ్గడి వుత్తరువులు. యెవరికీ గాయాలు తగలడంగానీ ఖూనీలు జరగడంగాని లేదు. కేసులన్నీ బందిపోటూ, కన్నందోపిడీ మొదలైన సెక్షనుల క్రిందనే వస్తున్నవి. ఈ కేసులు విచారించడానికి ప్రతి జిల్లాలోను రెండుమూడు కొత్తకోర్టులు స్థాపించారు. జెయిళ్ళన్నీ బీద జనులతో నిండిపోతున్నవి. వేలకొలది బీదలకు భోజన యేర్పాట్లు చేసేభారం ప్రభుత్వం వారిమీాద బడ్డది కడప, అనంతపురం జిల్లాలలో కరువు వ్యాపించడంచేత జెయిళ్ళన్నీ ఆ జిల్లావాండ్లతో నిండిపోతున్నవి. అందరిచేతా పనులు చేయించడానికి వృత్తులు కనబడడం లేదు. జెయిళ్ళనిండా వేలకొలది రాటాలుపెట్టి నూలు వడికించి గుడ్డలు నేయిస్తున్నారు. యింకా కొత్తజయిళ్ళు కట్టించడం అవసర మవుతున్నది. బీదవాండ్లందరిచేతా నూలు వడికించి గుడ్డలు నేయిస్తే దేశమంతా స్వదేశీ గుడ్డలతో నిండిపోతుందనే భయంగూడా వున్నది. జగ్గడి అనుచరులు కొందరు కావలీ, బాపట్లా మొదలైన సెటిల్‌మెంట్లలో ప్రవేశించి అక్కడి వాండ్లను సంతానులలో జేర్చుకోవ లేర్పరచారు. సెటిల్ మెంటువాండ్లు తమకు క్రమమైన కూలి చూపించకపోతే లేచిపోతా మని కలెక్టర్లకు పిటీషన్‌లు పంపారు. తమకు క్రమమైన పని చూపవలసిం దనీ, అట్లా చూపలేకపోతే తమను

నిర్బంధంగా సెటిల్‌మెంట్లలో వుంచినంతకాలం తమకు సాధారణమైన భోజనమునకుదగినంత సర్కారు ఖజానాలోనుంచి ఇప్పించవలసిం దనీ, ఆ ప్రకారం పదిహేను రోజులలో జేయకపోతే సెటిల్‌మెంటు విడిచి వెళ్ళిపోతా మనీ గవర్నరుకు తంతి పంపారు. అందుమీద సర్కారువారు సైన్యం దెచ్చి రెండుచోట్లా బెట్టారు. నిరాఘాటంగా జరుగుతున్న బందిపోట్లను ఆపడానికీ తగు ఉపాయాలను యోచించడానికీ గవర్నరుగారు కలెక్టరులనూ, ఆ యా జిల్లాలలో వుండే ప్రముఖులనూ పిలిపించి సభ చేశారు. అనుమానస్థు లందరిదగ్గరా జామీనులు పుచ్చుకోవలసిం దనీ, నేరపు జాతులలో జేరినవాండ్ల నందరినీ సెటిల్‌మెంట్లలోనుంచి, వాటికి సమీపంగా సేనలను నిలుపవలసిం దనీ, మాల మాదిగెలనుగూడా నేరపుజాతులలో జేర్పించమనీ, సర్కారువారు ధనప్రాణాలను రక్షించడానికి అశక్తులు గావడంచేత గ్రామానికి ౨౦ వంతున తుపాకు లిప్పించి వారికి కవాదు నేర్పించవలసిం దనీ సిఫారసు చేశారు. సర్కారువారు మొదటి మూడు సిఫార్సులూ ఆమోదించారు గాని నాలుగవది తోసివేశారు.

పోలీసువాండ్లందరూ ప్రతి వూళ్లోనూ వుండే అనుమానస్థుల పేర్ల జాబితాలు తయారు చేస్తున్నారు. కొందరు నిరుపేదలు పోలీసువారిని బతిమలాడి తమ పేర్లు చేర్పించుకున్నారు. కొందరు డబ్బిచ్చి పేర్లు తీసివేయించుకున్నారు. తయారైన జాబితాలనుబట్టి లక్షలకొలది జనానికి సర్కారువారు భోజనం పెట్టించవలసి వచ్చేటట్టు కనబడ్డది. అందుమీద గవర్నరుగారు తన పేరుతో 'దేశ రక్షక నిధి' అనే వొక చందా నిధి యేర్పరచి ధనికు లందరూ ఆ నిధికి చందా ఇయ్యవలసిందని కోరారు. తహసీల్‌దార్లు ఆదాపన్ను ఇచ్చేవాండ్లదగ్గర వారి సంవత్సరపు పన్ను మొత్తం నూరురూపాయలకు పైబడ్డ సిస్తు యిచ్చే రహితులదగ్గర సంవత్సరపు పన్ను మొత్తం వసూలు చేశారు. సన్నకారు రహితులూ, వర్తకులూ దొంగలవల్ల తమ కేమీ బాధ లేకపోవడం

చేత చందా లియ్యలేదు. ఈ నిర్బంధాలకు బీదలు చాలామంది లక్ష్యం చేయలేదు. కాని వారిలో మర్యాదస్తులకు చాలాకష్టంగా వుంది. బుద్ధిపూర్వకంగా వ్రాయించుకున్నవాండ్ల పేర్లు దప్ప తక్కినవాండ్ల పేర్లు బయట బడలేదు.

౨౫

## అమ్మ - నాయన

రామదాసు గుడ్డల బేరంలో వచ్చిన ముప్ఫైరూపాయలూ బడిమీద వచ్చే జీతాలూ దొంతరచేసి చన్నీళ్ళకు వేన్నీళ్ళుగా రెండునెల్లు గడిపాడు. గుడ్డల వ్యాపారం వదిలి చిల్లర వ్యాపారం పొరుగూళ్ళలో సాగించాడు గాని తినుబండారాలు చాతుర్వర్ణాలవారూ పంచముడిదగ్గర కొనుక్కునేదానికి సందేహించారు. సందేహించడం చేతనూ, బీదవాండ్లు కొనుక్కున్నా పంతులూ మునసబూ వర్ణసంకర మవుతుందని ఆక్షేపించడంచేతనూ కోమట్లు తమ వృత్తిలో యితర కులాలు ప్రవేశిస్తే పోటీ యెక్కువవుతుందని రామదాసుదగ్గర కొనేవాండ్లను తిరగదీయడంచేతనూ క్రమంగా రామదాసుదగ్గర ఖర్చుగాపడం ఆగిపోయింది. అంతట ఆ బేరం చాలించి ధాన్యం బేరం బెట్టించమని సుబ్బిసెట్టి నడిగాడు. దేశంలో దొంగల హడావుడి యెక్కువ గాపడంచేత పోయిన డబ్బుపోగా మిగిలిన గసి పోగుచేసి రొఖ్ఖరూపకంగా వుంచడం క్షేమం గాదని గింజల బేరం పెట్టడానికి నిశ్చయించుకున్నాడు. భారీగా వ్యవహారం జరగడంచేత రామదాసుకు నెలకు పదిహేనురూపాయలు గిట్టుతూ వచ్చినవి. యెక్కడికైనా పోయి వుద్యోగం సంపాదించవలె నని అప్పాదాసు పట్టుపట్టాడు గాని రామదాసు సాగనియ్యలేదు. మంగళాపురంనుంచి అప్పాదాసు వెళ్ళితే బడీ, సంగమందిరం మూలబడత వని రామదాసు భయం. జోతి పొరుగూరు ఉద్యోగానికి పోయేవిషయం తన ఘట మున్నంతవరకూ రామదాసు తలపెట్టవద్దన్నాడు. జోతి ప్రతిపొద్దూ సంగమందిరం పోయి

విద్యార్థులకు బోధిస్తూ వుండడంచేత అప్పాదాసుకు కొంత విరామం కలిగింది. రామానాయుడు కార్మికోద్యమంలో యెంత అభిమాన మున్నా తండ్రికి ప్రతివిషయంలోను ప్రతిఘటించడం యిష్టంలేక పంచమోద్యమానికి విశేషంగా సహాయం చేస్తూ సమ్మెలలో ప్రత్యక్షంగా జోక్యం కలిగించుకోవడం లేదు. లక్ష్మమ్మ గళ్ళైపారుమనిషి గావడంచేత పెద్దతనం రావడంతోనే మంచానబడి అవసానదశకు వస్తున్నట్టు కనబడుతున్నది. చౌదరయ్యకు కొడుకు అనుకూలుడు గాకపోవడం, కోడలు లేచిపోవడం, వెంకటయ్యకు మొగపిల్లలు లేకపోవడం, సాహు చనిపోవడం, వంశాంకురం లేకపోవడం, రామానాయుడు మళ్ళీ పెండ్లి చేసుకోకపోవటం వొకదానికొకటి మోపై మనిషిని కుంగదీసినవి. సాధారణంగా ఆయన సాహును తలుచుకోని రోజు లేదు. తల్లి లేచిపోయిన తర్వాత పిల్లవాడు తనకు మాలిమై యేది గావలసివచ్చినా తనను యిగ్గామొగ్గా తీసి తీసుకోవడం, తనచేత పద్యాలు చెప్పించుకోవడం జ్ఞాపకం వచ్చినప్పుడల్లా దుఃఖిస్తూవుండేవాడు. లక్ష్మమ్మ మంచానబడినతర్వాత తన హయాం గడిచిపోతున్న దని తలంచి పెట్టుబడి వ్యవహారమంతా కొడుకులకు వదిలిపెట్టి చేసినచేయి వూరుకోలేక పొలం విశేషంగా వెళ్లుతుండేవాడు. లక్ష్మమ్మకు కొంచెం నంజుచూపి శ్వాసగనుపించి అనాయాసంగా లేచిపోయింది. ఊళ్ళో దుఃఖించనివాళ్ళు లేరు. యేదో శాపంచేత కామధేనువు భూలోకంలో మనిషైపుట్టి మళ్ళీ తనలోకానికి బోయిందిగాని సామాన్యపుమనిషి గా దనుకున్నారు. పసుపు కుంకములతో శవాన్ని వూరిజనమంతా వొలలాడించారు. తమలపాకులు వీధులలో కుప్పలుపడ్డవి. మల్లెపూలు బుట్టలతో వీధులలో శవంమీదికి విసిరారు. పట్టుచీరెతో దహనంచేశారు. ఊళ్ళోవున్న గంధపుచక్కలన్నీ శవంమీద బేర్చారు. రామానాయుడు తన జన్మ కారకురాలైన మాతృదేవత తనను తల్లిలేని బిడ్డను జేసి పోతున్నదని దుఃఖించాడు. వచ్చినవాండ్లందరితోను సహజ గాంభీర్యం విడిచి వెర్రివాడివలె మాఅమ్మ మాఅమ్మ పోతున్న

దని చెప్పి ఏడ్వడం సాగించాడు. అమ్మశబ్దంలో అంతకారుణ్యా మున్నదని అదివరకెవరూ గ్రహించలేదు. అతను అమ్మా అన్నప్పుడల్లా అందరూ యేడ్చారు. సక్రమంగా రామానాయుడు వృత్త మోత్తమమైన మాతృయజ్ఞం చేశాడు పదిహేనురోజులూ అడిగిన వాండ్లకల్లా అష్టాదివర్ణమూ మృష్టాన్నం పెట్టారు. బతికి చచ్చీ కూడా లక్ష్మమ్మ అన్నసత్రాలు పెడుతున్నదని జనులు చెప్పుకున్నారు. చౌదరయ్య "ఆవిడ అదృష్టవంతురాలు. యేలోపమూ లేకుండా మల్లెపువ్వులాగు లేచిపోయింది. అంతభాగ్యం నాకు పట్టాలె గదా" అన్నాడు. అన్నా తమ్ముడూ ఆలోచించుకొని సంగమందిరానికి వేయిరూపాయలు చందా యిచ్చారు. పెద్దదినం వెళ్ళినప్పటినుంచీ చౌదరయ్య వీథిలోకి అడుగుపెట్టలేదు. పోషణలో యేవిధమైనలోపం లేకపోయినా మనిషి రోజులపేరట క్షీణిస్తున్నాడు. ఒకరోజు మామూలుప్రకారం ముంగిట్లోకి ముఖం గడుక్కునేటందుకు రాలేకపోయినాడు. ఆఫీసుగదిలో పడుకోవడం చేత అన్న మక్కడికే తెచ్చిపెడుతున్నారు. ప్రతిరోజూ గది శుభ్రం చేస్తున్నా అక్కడ పడుకోవడం చౌదరయ్యకే కష్టమని తోచింది. తనను పూర్వోత్తరపు యింట్లో పడుకోబెట్ట వలసిందని కోరాడు. ఒకరోజువుదయయం కుమాళ్ళనిద్దరినీ పిలిపించి కండ్ల నీళ్లు పెట్టుకుంటూ 'నాయనా! నా కవసానకాలం దగ్గరకు వస్తున్నదోయ్' అన్నాడు. కొమాళ్ళిద్దరూ దుఃఖించారు.

రామా:- మీకంత విశేషజబ్బేమీ లేదు.

చౌ:- అట్లాగాదు. లేచి కింద గూర్చుండే స్థితిగూడా యీరోజు తప్పిపోయింది. ఇంతవరకూ నేను తండ్రినీ. నీవు కుమారుడివి. ఇప్పటినుంచీ నీవు తండ్రివి. నేను కొమారుణ్ణి.

రామా:- అదేమి అలా అంటారు?

చౌ:- ధర్మమంతే. ఒకప్పుడు నీ మలమూత్రాలు ప్రియతమములైన వస్తువులుగా భావించి నేనూ నీతల్లీ అరిచేతులలో బెట్టుకొని నిన్ను అల్లారుముద్దుగా పెంచాము. నీతల్లి అదృష్టవంతు

రాలు గనుక వాళరిచేత చేయించుకోకుండా మల్లెపూవులాగ లేచిపోయింది. తనను గన్నవాండ్లన్నా, తాను గన్నవాండ్లన్నా చేయవలె. ఇది బాల్యవృద్ధావ్యాలస్థితి. నాకు కాళ్ళూచేతులూ స్వాధీనంలో లేవు. లేవశక్తిలేదు శిశువుకంటే హీనస్థితిలో వున్నాను. నన్ను శిశువును పోషించినట్టు ఆదరించి కడతేర్చవలసిన భారం నీది.

రామా:- (భోరున యేడ్చి) నాన్నగారూ! మీ కే విధమైన లోపమూ కలుగదు. ఈ శరీరంవల్ల సర్వవిధములయిన సేవలూ గ్రహించడానికి మీ కధికార మున్నది. ఆచింత మీ రేమీ పెట్టుకోవద్దు.

చౌ:- నాన్నా! నీవు లోపం చేస్తావని నే ననుకోను. నీవు నాకు కులదీపకుడవు. నే నెంత పాపినైనా నీవు నా గర్భవాసాన జన్మించడంచేత ధన్యురాలనైనాను. నా కొకచింత వున్నది. మనది పెద్దకుటుంబం. అనాదినుంచీ పెద్దపే రున్నది. వంశం అంతరించేటట్టు కనబడుతున్నది.

రామా:- దానివిషయమైన చింత మీరు పెట్టుకోవద్దు. మీ ప్రస్తుత స్థితిలో యే విచారమూ మీ మనస్సుకు జేరనీయవద్దు. మనవంశం నిలువవలసివుంటే సాహే బ్రతకేవాడు. భగవంతుని వుద్దేశానికి భిన్నంగా వర్తించీ ఫల ముండదు.

చౌ:- మీకంటే నే తెలిసినవాడను కాను. ఆ విషయం మీకే వదిలివేస్తా. నాకు ప్రక్క కుదరడంలేదు. ఆయాసంగా వున్నది.

రా-నా:- నారాయణ స్మరణతప్ప మరొక్కటి లేదు. అదే భవరోగాల కన్నిటికీ వుత్తమమైన మందు.

చౌ:- నారాయణ నారాయణ! నారాయణ శతకము లోనివి రెండు నుడుగు లను.

రా–నా:–

శ్రీరమాహృదయేశ్వరా। భక్తజన - చిత్తజలరుహ భాస్కరా।
కారుణ్య రత్నాకరా। నీవె గతి - కావవే నారాయణా.

చౌ:– నారాయణ!

రా–నా:–

ఒకటి పరిశుద్ధి లేకా నా జన్మ - మకట వ్యర్థంబాయెనూ
అకలంకమగు మార్గమూ జూపగదె - సకలేశ। నారాయణా।

చౌ:– ఎక్కడున్నావు తండ్రీ! శ్రీమన్నారాయణా!

రా–నా:–

చింతాపరంపరలచే చిత్తంబు - చీకాకు పడుతున్నదీ
సంతోషమున జేర్పవే - ముక్తిప్రపంచమును నారాయణా.

చౌ:– నారాయణ! నారాయణ! నారాయణ!

వెం:– దింపు కిందికి దింపు.

ఉభయులూ కండ్లనీళ్ళు పెట్టుకుంటూ కిందికి దింపారు.

వెం:– తమ్ముడూ! నీవు చింతపడవద్దు. అయ్యకు చక్కని మరణం వచ్చింది. చిత్రంగా ఆయనకు అవసానదశలో పశ్చాత్తాపం కలిగింది. నారాయణ స్మరణతో ప్రాణోత్క్రమణమూ అయింది. ఆయన పూర్వపుణ్యం. తన కత్తికి యెదురు కత్తి లేకుండా మహర్దశ అనుభవించాడు. సవ్యమైన మరణం కూడా దొరికింది. ఇంతకూ నీ జన్మే ఆయనకు తరణోపాయం.

రా. నా:– నీవు నన్ను స్తుతిచేయడం న్యాయంగాదు. నాన్నగారికి యెదురుచెప్పే సమయంగాదని వూరుకున్నాను.

వెం:– నిన్ను స్తుతిచేయడం నాది పొరపాటే. మనం సక్రమంగా పితృయజ్ఞం నిర్వహించవలసి వున్నది.

రా. నా:– మనం వారికి జేయగల అంత్యధర్మం యిదే. తనియా, మనియా బతికినవాడు. కావలసిన యేర్పాట్లు అన్నీ జరిగించు. వృషభోత్సర్జనం కూడా చేస్తే బాగా వుంటుంది.

యథాశాస్త్రీయంగా యావత్తు కర్మలూ జరిగించారు. బంధువులంతా వెళ్ళిపోయినారు. రామానాయుడు వెంకయ్యతో యేకాంతంగా:—

రా. నా:- అన్నా ! సంగ మందిరానికి యేమైనా చందా యిత్తామా ?

వెం:- ఈ చిన్న చందాలిచ్చి యేమి ప్రయోజనం? మనకు మగపిల్లలు లేరు. ఎనిమిది లక్షలు పైగా ఆస్తి వున్నది. ఆడపిల్లలకు తగుపాటి యేర్పాటు చేసి మన మనవర్తికి కొద్దిగా వుంచుకొని శేషించినది యావత్తూ మన వుద్యమానికి యిచ్చి వేయడం నా యభిప్రాయం.

రా. నా:- అన్నా ! నీ దెంత త్యాగబుద్ధి ! ఈ వుద్యమ మందు నీ కంత అభిమాన మున్నదని నే నెరగను. నాకు ఆశ్చ ర్యంగా వున్నది.

వెం:- నాలో యేమైనా సుగుణాలు వుంటే నీవల్లనే కలిగి నవి. నీవు అంగీకరించినట్టయితే అయ్యా మూడు లక్షల రొక్కా నికు వొప్పజెప్పేవాడు. ఆ రోజులలో పూర్వార్జితంలో నాకు రాదగిన యే తొంభై యకరాలో తీసుకొని మిక్కిలి సంతోషంతో వెళ్ళిపొయ్యేవాడినే. నీ న్యాయబుద్ధి నన్ను నాల్గులక్షల ఆస్తికి కర్తను జేసింది. దీంట్లో చాలాభాగం నాకు నీ ఔదార్యం వల్ల లంభించిందే. అందువల్ల నా యావదాస్తీ నీ యిష్టప్రకారం వుపయోగించడానికి నీకు అధికారం వున్నది. నా త్యాగబుద్ధిని నీవు ప్రశంసించవలసిన కారణంలేదు. ఇక వుద్యమ విషయంలో అభిమానం గలగడానికి నీవేకారణం. నీ త్యాగబుద్ధీ, కార్యదీక్షా, ధర్మచింతా నన్నీకార్యానికి అభిముఖుణ్ణి చేసినవి.

రా.నా:- అన్నా ! నీకు నాయం దెంతప్రేమ ! నీ వన్న వన్నీ ప్రేమవాక్కులుగా గ్రహిస్తాను. ఇక జేయవలసిం దేమిటి?

వెం:- రావలసినపైకం యావత్తూ వసూలు చేయవలసిం దని పంతులును నియమించడం నా అభిప్రాయం.

రా.నా:- పంతులువల్ల యీపని అవుతుందా?

వెం:- సందేహంలేదు. అతడు సమర్థుడు, విశ్వాసపాత్రుడు, యజమాని ఆజ్ఞను శిరసావహించి పనిచేస్తాడు. ఇదివరకు కార్మికోద్యమానికి ఆయన వ్యతిరేకంగా వుండడానికి కారణం అయ్య యొక్క విముఖతే. వెనుక యెంత పట్టుదలతో యెదిరించాడో యిప్పుడంత అభిమానంతో పని చేస్తాడు చూడు. పంచమోద్యమానికి ఆయన అనుకూలిస్తాడని తోచదు. ఆయన వ్యతిరేకించి చేసేది మాత్ర మేమున్నది?

రా. నా:- ఆయనను రప్పించి చెప్పవలసిన సంగతులన్నీ చెప్పు. నా కిప్పటికి బంధాలన్నీ వదిలినవి. ఇక పూర్తిగా వుద్యమంలో జేరిపోతాను. సంగదాసు ప్రారంభించిన వుద్యమాలు రెండూ అభివృద్ధికి రావడానికి నా యావచ్ఛక్తీ వుపయోగిస్తాను. ఆస్తి వసూలైన తర్వాత నీవే పాలకుడవుగా వుండి ధర్మం నిర్వహించవలసి వుంటుంది. ఆ పనికి నే నర్హుణ్ని గాను. ప్రతిష్ఠాపనను నిర్వహించడానికి సమర్థుణ్ని భగవంతుడు చూపించాడు. పంచమోద్యమానికి మన గ్రామం కేంద్రస్థానం కాగలదని నా కిప్పుడు ధైర్యం వచ్చింది. కార్మికోద్యమానికై నేను విశేషంగా పనిచేస్తా.

వెం:- నా శాయశక్తులా పని చేస్తాను. నడిపించే భారం నీవు పెట్టుకో. దారి చూపిస్తే చేసుకుని పోతుంటా. ఇంకా యీ వ్యవహారాలు నాకు కొత్త.

రా. నా:- నే జేయదగిన సహాయం యావత్తూ చేస్తాను. పైకం త్వరలో వసూలయ్యే మార్గం చూడు.

## ౬

### జామీను కేసు

వెంకటయ్య పంచమోద్యమ విషయమై పూర్ణమైన సాను భూతి చూపించడమే కాకుండా తన సర్వస్వమూ జీవితముతో సహా అర్పించడానికి పూనుకోవడం రామానాయుడికి అద్భుతా నందములను గల్పించినది. సంతోషం పట్టజాలక అప్పాదాసును తనతో వచ్చి మాట్లాడమని కబురంపించి సంగ మందిరంలో కూర్చున్నాడు. అప్పాదాసు రావడంతోనే ఆనందాశ్రువులు గారుస్తూ—

రామానాయుడు:- దాసూ ! మిక్కిలి సంతోషకరములైన వార్త లేమున్నవో కనుక్కోగలవా ?

అప్పాదాసు రామానాయుడు మొఖం వంక తేరిపార జూశాడు. ఆయన సంగ మందిరంలో సభలు జరిగినప్పుడు వస్తూ వున్నా తండ్రికి వెరచి యితర సమయాల్లో వచ్చేవాడు కాడు. ఈ రోజు ఆనందంగా వచ్చి కూర్చోవడం చూచి—

అ:- నాకు కొంతవరకు గోచారంలో ప్రవేశం వుంది. సాముద్రికం కూడా యెరుగుదును. ముఖ లక్షణాలనుబట్టి సంగతులు గ్రహించ గలుగుదును. పంచమోద్యమానికీ, కార్మికోద్యమానికీ మంచి రోజులు వచ్చినని. బుధుడు కార్యకారియై ౧౧ డింట వున్నాడు.

రా-నా:-గురికి బెత్తెడుయెడంగా దగిలిందిగాని సత్యంయీ వత్తూ గ్రహించలేదు. భగవంతుడు తనకార్యాలు నెరవేర్చుకునే పద్ధతి చూస్తే నాకు ఆశ్చర్యం వేస్తున్నది. అది నాకు తెలిసి నప్పటినుంచీ సంతోషం పట్టలేకుండా వున్నాను.

అ:- తమరు అనుభవించేఆనందం నాకుకూడా వెంటనే కలిగించండి.

రా-నా:- ప్రస్తుతం, యెవరికీ చెప్పవద్దని మొదట అనుకున్నానుగాని రామదాసుకూ, నీకూ మాత్రం చెప్పాదామని తర్వాత నిశ్చయించుకున్నాను. వెంకటయ్యా తన సర్వస్వమూ మన వుద్యమానికి యిచ్చి దాన్ని నడిపించడానికి పూనుకున్నాడు. అతడు మంచి వ్యవహర్త. సంగమందిరానికి అధ్యక్షుడుగా బెట్టామూ అంటే పని యావత్తూ తలమీద వేసుకుని యీదుతాడు.

అ:- మీ నాయనగారు కాలంచేయడం, వెంకటయ్యగారు యీ వుద్యమంలోకి రావడం సందిగ్ధసమయంలో గలిగినవి. మధ్యాహ్నం మామతో మాట్లాడుతూ మన వుద్యమానికి చెడు రోజులు వచ్చినవి; మంగళాపురంలో యీ వుద్యమం ప్రస్తుతం అంతరిస్తుందేమో అనికూడా సందేహించాం. అటువంటి సమయంలో మేఘాలలో మెరుపుమాస్తరుగా తమ రీ శుభవార్త తెచ్చారు.

రా-నా:- అదేమి అట్లా అన్నావు? మంగళాపురంలో వుద్యమం అంతరిస్తుందని అనుకోవడానికి కారణమేమి?

అ:- గవర్నమెంటువారు తక్కెళ్ళ జగ్గడి బందిపోట్లమూలంగా కార్మికోద్యమాన్ని నశింపు చెయ్యాలని ప్రయత్నం చేస్తున్నారు. చాలామందిమీద జామీను కేసులు పెట్టవచ్చు. మిమ్ములనుకూడా చేరుస్తారేమో నని భయంగా వున్నది.

రా-నా:- నీకు కొత్తసంగతు లేమైనా తెలిసినవా?

అ:- జామీను కేసు పెట్టడానికి యెవరిపేర్లు పైకి పంపిందీ బయటబడ్డవి. ప్రస్తుతం మిమ్ములను వదిలారు. ఊరూ, పల్లెలూ కలిసి షుమారు నూరుపేర్లు మంగళాపురానివి పంపారు. వీరందరి మీదా జామీను కేసు పెట్టడానికి వుద్దేశ్యం లేకపోయినా బెదురు పెట్టడానికి నామకుడైన ప్రతివాడి పేరూ యెక్కించారు. అందరి పేర్లూ తెలిసినవి. జగ్గడి అనుచరుల పేర్లు చాలామందివి చేరనే లేదు. చేర్చిన కొద్దిమందివీకూడా పోలీసులను మంచి చేసుకొని తమ పేరు తీసివేయించుకున్నారు. శేషయ్యా, ఆదం సాహెబూ,

వీరదాసూ, రంగదాసూ, మామా జాబితాలో జేరినవాళ్ళే. వీళ్ళేంతమాత్రం భయపడటంలేదు. పోలీసులను లోగట్టుకోడానికి వొప్పుకోరు. జామీను యివ్వడంలేదని చెప్పడానికి సిద్ధంగా వున్నారు. మామ పెద్దవాడు గావడంచేత జెయిలులో బడితే జీవించరని అంగరూ జామీను యియ్యాలిసిం దని బలవంతపెడుతున్నారు. పేర్లు బయటపడ్డప్పటినుంచీ మిషనరీలను బోధకులను వెంటవేసుకొని అజ్ఞానులను సన్మార్గానికి దిప్పవలెనని ప్రయత్నిస్తున్నారు. చాలా వూళ్ళవాళ్ళు ఖైదులో బెడతారేమోనని భయపడి మిషనరీలను ఆశ్రయించి పోలీసు సూపరిండెంటుకు శిఫార్సులు తీసుకొని తమమీద కేసులు పెట్టకుండా తప్పించుకుంటున్నారు. పాదిరీగారు జాగ్రత్త చేస్తామని చెప్పేయెడల వాళ్ళయిలాకావారి నందరినీ యుక్తమని తోస్తే వదిలిపెట్టవలసిందని కింది వుద్యోగులకు సూపరిండెంటుగారు సలహా చెప్పారు. ఈ సలహాను పోలీసువారు కఠినవుత్తర్వుగా గ్రహించి పాదిరీలు శిఫారసు చేసినవాం డ్లందరినీ వదిలిపెడుతున్నారు. జాబితాలో జేరిన నూరుమందీ శిఫారసు కోరారు. అందు కాయన 'అందరికీ చేయడానికి వీలుండదు. మా మతంలో ప్రవేశించి మంచినడవడిగలిగి వుంటామని వాగ్దత్తమిస్తే శిఫారసు చేస్తా'నని అన్నాడట. దాన్తో అందరికీ కాళ్లు చల్లబడ్డవి. మనవూరివాళ్ళెవరూ మతంలో కలవడానికి వొప్పుకోక తమ పాంగెముల వెంబడి శిఫార్సులు తెచ్చుకొని తంటాలుపడుతున్నారు.

రా-నా:- వారిమతంలో జేరకపోతే మంచినడత గలిగి వుండగూడదా ?

అ:- ఈమాటే శేషయ్య అడిగాడు. 'మీ రంతా అజ్ఞానులు కాబట్టేకదా యిటువంటిదుర్మార్గాలు మీరు చేస్తున్నారు. మామతంలో యిటువంటివి చేస్తే పాపమని వున్న ద'న్నాడట. ఆయ నింకా వూళ్లోనే వున్నాడు. మీరుకూడా వచ్చి మాట్లాడి చూడండి. రచ్చబండదగ్గర కూర్చున్నారు.

౭

## భారతకృష్ణుడు-భాగవతకృష్ణుడు

రామానాయుడువల్ల సంతోషకరమైన వార్తలు విన్నతరువాత అప్పాదాసు సరాసరి యింటికివచ్చి యావత్తుసంగతులూ రామదాసుకు వినిపించాడు. ఇంట్లో అందరూ ఆనందించి వెంకటయ్యరాకకు ఆశ్చర్యపడ్డారు. ఈ సంతోషంమీద భోజనాలు కూడా ఆలస్యం అయి అందరూ లేచేవరకు ౧౨ గంటలు అయింది. పనిపూర్తి అయ్యేవరకూ సంగతులు బయటబడగూడదనీ, యితరులకు తెలిస్తే విఘ్నాలు రావచ్చునసీ ఎంచి రహస్యం బయటికి రానివ్వలేదు. రామదాసు కొంచెంసేపు నిద్దరపోయి సాయంత్రానికి సంగమందిరం పోయినాడు. ఆరోజు పౌర్ణమి కావడంవల్ల ఆటవిడుపు. అప్పాదాసు సాయంత్రం యెండవడి తగ్గంగానే రాములవారి దేవాలయం దగ్గర చాపవేసుకొని కూర్చున్నాడు. జోతి దశమస్కంధం చేతబట్టుకొని బెళాయివలె అప్పాదాసుపక్కను వచ్చి కూర్చున్నది.

అ:- జోతీ! దశమస్కంధం పూర్తి అయిందా? నీకు గలిగిన సందేహాలకు జవాబులు కుదిరినవా?

జో:- ఆలోచించినకొద్దీ అగాధంగా వున్నది. విశేషగొడవ లేకుండా నాకు తెలిసేటట్టు విషయం చెపితే వింటాను. మధ్యమధ్య నా అభిప్రాయాలుమటుకు అడగవద్దు. నాకు తోచిన సంగతులు నీవు అడక్కుండానే చెపుతాను.

అ:- భాగవతకృష్ణుడికీ భారతకృష్ణుడికీ గలతేడా విచారింతాం. భారత కృష్ణుడు మానవవ్యక్తి. అచ్చటచ్చట అతిమానుష చర్యలు కనపడ్డా మొత్తంమీద వుత్తమ పురుషలక్షణాలు మాత్రమే కనబడతవి. ఉత్తముడైన చెలికాడు. మేనత్తకొడుకుల క్షేమానికై పాటుపడ్డాడు. తన మంత్రశక్తిచేత పాండవులను గెలిపించాడు. అవసరమైనపుడల్లా వచ్చి ఆదుకున్నాడు.

భాగవతకృష్ణుడు శృంగార రసమూర్తియై ఆవిర్భవించాడు. అది కేవల భావనారూపమే కాని అనుభవములో గనబడే విగ్రహం కాదు. ఆయనచర్యలు సాధ్యతా సాధ్యతలుగాని యోగ్యతా యోగ్యతలు గాని మానవ పరిమాణమునుబట్టి విచారించడానికి వీలులేదు. శ్రీరాముడిది కేవలం మానుషవిగ్రహం. అతిమానుష విగ్రహ మని తనకు చెప్పేవరకూ ఆయనకు తెలియదు. తెలిపినా అజ్ఞానం నిలిచేది కాదు. ఉత్తమములయిన పతిపుత్రాధిక ధర్మాలను తన జీవితంలో ప్రకటించి మనుష్యుల కాదర్శప్రాయుడైన అవతార మూర్తి. అందువల్లనే రామాయణంలోని పాత్రలయొక్క జీవితాలు హిందూజాతిలో ప్రతిఫలిస్తూ వున్నవి. భాగవత కృష్ణుని జీవితం అనుకరించడానికి మానవులకు సాధ్యంకాదు. యమునా సైకతరంగములలో అద్భుతక్రీడలు జరిపాడు. దివ్యగానం పాడాడు. జగన్మోహన రూపంతో ప్రకాశించాడు. లోకసమ్మోహనంగా తాండవ మాడాడు. గోపకులం అంతా ప్రేమ వర్షించాడు. గో గోప గోపీజనులకు వశ్యౌషధమై ఆకర్షించాడు. గోపికలను హృదయనాథుడై యేలాడు. మఱియును దేవరహస్య మొక్కటి కూడా గమనింపదగి వున్నది. 'సంఘే శక్తిః కలౌయుగే' అని అధికారమును నిరంకుశులనుండి తొలగించి ప్రజాసత్తాకముగ జేయుటయే యీ యవతార రహస్యముగ గన్పట్టుచున్నది. కంసుడు, జరాసంధుడు, శిశుపాలుడు, దంతవక్త్రుడు, నరకాసురుడు, కురుపాంచాలులు, యాదవులు, అభిమన్యు, ఘటోత్కచాదుల నెల్ల సంహరింపజేసి మొదటిమెట్టుగ అధికారమును అధికార కాంక్షలేని ధర్మబద్ధుడయిన ధర్మరాజులో నిలిపి క్రమముగ కలియుగమున ప్రజలకు సంక్రమించుటకు దారి యేర్పరచబడినది.

జో:- సీతారాములకూ రాధాకృష్ణులకూ గల ప్రేమకు భేద మేమి?

అ:- సీతారాముల ప్రేమ మానవులకు ఆదర్శప్రాయమైనది. స్వభావంచేత దివ్యమైనదైనా ఐహికములయిన హద్దులకులోబడ్డది.

శ్రీరాముని దివ్యసుందర విగ్రహాన్ని జూచి మోహించి తనివి చెందక మహర్షులు ఆలింగనం గోరారు. రామునకు వొక్కమాట, ఒక్క బాణం, ఒక్క భార్యా అనే నియమాన్ని పురస్కరించుకొని వారి మనోవాంఛలను తృప్తిపగచడానికి తన యశక్తతను వెలిబుచ్చాడు. కృష్ణావతారంలోకి హాయిదా వేశాడు. కృష్ణుడి ప్రేమ సామాన్య నైతికవిధులకు అతీతమైనది. రాముడు వుత్తమ పురుషుడైనా మానవుడివలె సీతను ప్రేమించాడు, వదిలివేశాడు. కృష్ణుడు తన నిజ స్వభావంతో బ్రహ్మాండము లంతటా నిండి నిబిడీకృతమైన ప్రేమామృత సముద్రములో "ఏకస్స్వాదు న భుంజీత" అనే ధర్మాన్ని అనుసరించి అందరినీ వోలలాడించాడు.

జో:- శ్రీకృష్ణుడు తన భక్తుల హృదయాలను కేవలము మానసికంగా రమించాడా ? దేహ సంబంధమైన ఆనందం గూడా యిచ్చాడా ?

అ:- భాగవతాది గ్రంథములలో కొందరు దైహిక మానసికానందము లని భేదం గల్పించ ప్రయత్నంచేశారు. శ్రీకృష్ణుని కైశోరమూ, అస్ఖలిత బ్రహ్మచర్యమూ వూతగా గొని దైహిక సంబంధ మసాధ్యమని నిరూపించారు. గ్రంథకర్తలు విశ్వప్రయత్నాలు చేసి శ్రీకృష్ణుని ప్రేమను భావనా ప్రపంచములో ప్రవాసం చేయించడానికి ప్రయత్నం చేశారు. నీళ్లు పల్లానికి పారినట్లు, పావురం గూటి కురికినట్లు కవులం గికురించి భావ ప్రపంచ బంధాలను ద్రెవ్వి ధూర్త గోపాలుడు గోపకన్యలతో సైయాటలాడాడు. దైహిక మానసిక ఆనందముల కభేదం నిరూపించాడు. శ్రీరాముడు తన విశ్వమయత్వం మరిచాడు. తాను విశ్వరూపుడను భావము విడుచుటచేత తన్ను గామించిన ఋషుల నానందింపజేయలేకపోయినాడు. స్వ పరకాంతాభేదం తెచ్చి పెట్టుకున్నాడు. మనుష్య వేషం ధరించి బాగా అభినయించాడు. కాని కృష్ణుడు విశ్వమయుడు సర్వసంగ పరిత్యాగినులైన గోపికలను తనతోడి దైహిక మానసిక సాంగత్యములచేత ముక్తలను జేశాడు.

ఆ. వె. "గోపజనములందు గోపికలందును
సకల జంతులందు సంచరించు
నా మహాత్మునకుఁ బరాంగన లెవ్వరు
సర్వమయుఁడు లీల సలిపెఁగాక."

అని భాగవతం చెప్పుచున్నది.

జో:- దేహ సాంగత్యం లేక శ్రీకృష్ణుని ప్రేమించుట సాధ్యమా? శ్రీకృష్ణ పరమాత్మ భావనారూపుడై యేల గోపికల రమింపలేదు?

అ:- శ్రీకృష్ణుని కసాధ్యమేమీ లేదు. మనము ప్రేమించినా ప్రేమించక పోయినా తన విధిగా చరాచరములైన సర్వభూతకోటులను ప్రేమిస్తాడు. గడ్డి మొలకనూ, పిపీలికమునూ, బ్రహ్మనూ సమానమైన జాగ్రత్తతోనే పెంచుతాడు. ప్రేమించడమే అతని స్వభావం. ఆ విధంగానే గోపికలనూ నిన్నూ నన్నూ ప్రేమించగలడు. మనము ఆయనను సాకారునిగానూ, నిరాకారునిగానూ ప్రేమించగలం. కొందరు రాధా లోలునిగాను, మరి కొందరు గోపికాజారునిగాను ప్రేమిస్తారు. కొందరిమనస్సులు వేణుగోపాలునియందు తగుల్కొంటవి. సంగభావ రాసమండలము లోని గోపికాంగనయై మాధవుల మధ్యవర్తియై ప్రేమించాడు. మరియు—

మ. "తరుణుల్గొందఱు మాలగేహముల నుద్దండించి రారాక త
ద్విరహాగ్నిం బడి తాపమొందుచు మనోవీథిన్ విభున్ మాధవున్
పరిరంభంబులు చేసి జారుఁ డనుచున్ భావించియున్ జొక్కి పొం
దిరి ముక్తిం గుణదేహమున్ విడిచి ప్రీతిన్ బంధనిర్ముక్తలై."

ఇట్లు మానసికంగా ప్రేమించుటలో యేమీ అసాధ్యం లేదు. మానవులు భౌతిక సౌఖ్యము లొసంగుటలో శక్తి తారతమ్యాల ననుసరించి పరిమిత మేర్పడవచ్చును గాని అపర్యాప్తమైన మానసికానంద మిచ్చుటకు ప్రతిబంధకా లుండవు. ఒక వ్యక్తి విశ్వమానవకోటినెల్ల సోదరులుగను, స్నేహితులుగను

ప్రేమించడానికి సాధ్యమైనప్పుడు కృష్ణుడు గోపికాబృందమును ప్రేమించుట కేల అసాధ్యము?

తేజస్వులైన యింద్ర చంద్రాదులకు వ్యభిచార దోషము లేదన్నారు. దీనిని బట్టి దైహికసంబంధం వలన వ్యభిచారదోషం సామాన్య వ్యక్తులకు ఆపాదిస్తుందని తేలుతున్నది. సామాన్య వ్యక్తి మానసికంగా పలువ్యక్తులను ప్రేమించడం వ్యభిచారమా? వ్యభిచారదోషం లేకున్నా ద్రౌపది పలువురకు నిజమైనప్రేమ చూపడానికి యెట్లు సాధ్యమైంది? ఆదికవి శ్రీరాముడి ప్రేమను పలువురికి పంచిపెట్టడానికి వొప్పుకోలేదు. తదితర కవులు తమ కథానాయకుల విషయమై చాలా ఔదార్యబుద్ధి చూపించారు. కాళిదాసు సహితం దుష్యంతుని ప్రేమను పంచిపెట్టాడు. ఈ విషయంలో ఆదికవి ప్రత్యేకమార్గమే త్రొక్కాడు. సామాన్యవ్యక్తులు పలువురిని సోదరులుగాను, స్నేహితులుగాను ప్రేమించ గలిగినప్పుడు నాయకీ నాయక ప్రేమ యేల వారికి దోషమైందో ఎరుగ సాధ్యంకాదు. అతి మానుష, మానుష విభేదములను గల్పించడం చేత మానసిక, దైహిక విభేదం కూడా వచ్చింది; అసలు ప్రేమ పవిత్రమైనది. అంతరాలు దానికి లేనేలేవు. అన్నిటా వొక విధమైన ప్రేమే వ్యాప్తమయింది. దైహిక సాంగత్యాం లేకనే అన్న విధాలైన ఆనందములూ అనుభవానికి రాగలవు. మరివొక విశేషం కూడా వున్నది. దైహిక మానసికానంద విభేదమే అజ్ఞాన జనకం.

జో:- దాసూ! నాకీ సిద్ధాంతాలన్నీ తెలియవు. నా అనుభవాన్ని బట్టి చెపుతాను. నిన్ను నేను ప్రేమిస్తాను. బాల్యంలో ఆడుకొన్నప్పుడు నీయందే నాకు ప్రేమ. నీవు పశువుల గాయడం చూచి ఆనందించేదాన్ని. పశువుల కొట్టం ఘూడుస్తూ నా మనస్సు హరించావు. నీ కావటిబద్దతో నా మనస్సు వుర్రూత లూగింది. నీ దగ్గర కావ్యాలు చదివినప్పుడు విజ్ఞానమూర్తివై తోచావు. నీవే నా మోహనకృష్ణుడవు. ఎప్పుడూ నాకు వొకవిధంగానే కనబడ్డావు. యెందుకు నిన్ను ప్రేమిస్తు

న్నానో నాకే తెలియదు. నిన్ను ప్రేమించక నే వుండలేను. నా ప్రేమ దైహికమో మానసికమో నాకు తెలియదు. నీవు నా మనస్సుకు గోచరించినప్పుడల్లా నా మనస్సూ శరీరంకూడా ఆనందం అనుభవిస్తూనే వున్నవి, నీ సాన్నిధ్యం పొందుటతో నే ఆనందపరవశురాలను అవుతాను. నీవల్ల యింతకంటె కోరదగిన సుఖం మరివొకటి లేదు.

అ:- జ్యోతీ! నీవు ముందువెనుకలు ఆలోచించడంలేదు. నేను పంచమ కార్మికోద్యమాలలో తిరుగుతుంటాను. ముం దనే కము చిక్కులు తటస్థిస్తవి. మామను జామీను కేసులో పెట్టబోతున్నారు. ఆయన కెవరైనా జామీను యిచ్చినా నేరపు జాతుల వాళ్ళ నందరినీ సెటిల్మెంటులో నుంచుతారు. మనలో యెవరిని విడదీస్తారో చెప్పలేము. అత్తా, మామా పెద్దవాళ్ళయినారు. నీవు యెవరినైనా వివాహం చేసుకోనడం క్షేమం. మామకూ, మా కందరికీ సంతోషం. దూరాలోచన చేయకపోతే ముందు పస్తాయించవలసి వచ్చునేమో?

జో:- నేను పోషణకోసం వివాహం చేసుకోను. నీవు యే వుద్యమంలోనైనా తిరుగు, యెక్కడనైనా వుండు, మా కే చిక్కులైనా రానియ్యి, యెక్కడనైనా వుంచనీ. నా కేమీ చింత లేదు. నిన్నెల్లప్పుడూ ప్రేమిస్తుంటాను. నీ రూపాన్ని మనస్సులో చిక్కబట్టుకొన్నాను. నా హృదయంలోనుంచి నిన్నెవ్వరూ తీసుకొనిపోలేరు. నీవూ తప్పించుకొని పోలేవు. రాత్రులు నీ రూపాన్ని చీకట్లో చూస్తాను. కలగంటాను. పగలు కండ్లు మూసుకొని నీ రూపాన్ని వూహించుకుంటాను. నీ భావనారూపాన్ని యెల్లప్పుడూ అనుభవిస్తుంటాను.

సాయంత్రం అయింది. సూర్యుడు అస్తమించాడు. చీకట్లు వెలుతురురేఖలను నులిపి మింగివేసినవి. ఆకాశవితానమున రంగుల బొమ్మలన్నీ తన నీలికొంగులో తుడిచి నిశాకాంత ముత్యాలు చల్లుతున్నది. పాలకడలి కందు యెర్రనిగుడ్డువలె తూర్పున వుద

యిస్తున్నాడు. జననకాలసమయపు కావిచారలు మెరుపువిచ్చి తెల్లబారుతున్నవి. వెన్నెలకందు చిరునవ్వులు నవ్వుతూ పారకాడి పైకి వస్తున్నాడు. పగలంతా యెండకు కాగి సుడిబడ్డ సృష్టి సుధాంశుని చల్లదనముచేత తెప్పిరిల్లుతున్నది. సంతాపమువల్ల మరిగిన హృదయాలు శాంతిల్లుతున్నవి. శరత్కాల చంద్రుడు షోడశకళా పరిపూర్ణుడై నిజకరంబుల రోహిణికరంబులం గీలించి వుప్పరంబున విహరిస్తున్నాడు. తేజస్వి కావడంచేత దోషాకరుడైనా దోషాకరుడు కాడు. బ్రహ్మాండ కటాహ మంతా వెన్నెలతో నిండిపోయింది. చంద్రు డాత్మప్రదక్షిణం చేస్తూ భూమిచుట్టూ వర్తులరేఖలో తిరుగుతున్నాడు. భూమి చంద్రుని వెంటవేసుకొని ఆత్మప్రదక్షిణం చేసుకుంటూ సూర్యుని చుట్టూ తిరుగుతున్నది. ఈ గ్రహమండలాలను వెంట వేసుకొని సూర్యుడు అల్లిబిల్లిగా తిరుగుతూ ఆకాశంలో పరుగెత్తుతున్నాడు. తక్కిన గ్రహమండలా లన్నీ వుపగ్రహాలను వెంట వేసుకొని దేనిచుట్టూ తిరుగుతున్నవి. అన్నిటిదీ వర్తులాకారమే. వాటి పరిధులుకూడా చాలావరకు వర్తులాకారములే. బ్రహ్మాండ మంతా వర్తులాకారమే. అణువు మొదలుకొని మహత్తత్త్వం వరకూ వర్తులాకారములే. చలనం వర్తులంగానే వుంటుంది. బ్రహ్మాండాని కంతా యెక్కడనో కేంద్రస్థాన ముంది. ప్రతి రేణువూ, సమస్త జీవరాసులూ కేంద్రాన్ని ఆధారం చేసుకొని సంచరిస్తుంటవి. మహత్తత్త్వానికి వొక్కటే కేంద్రం. బీజరూపాన వున్న విశ్వకుండలి సృష్టి వికసించినప్పుడు కోట్లకొలది భిన్న కేంద్రములు గల వ్యక్తులుగా పరివ్యక్త మవుతుంది. పరివ్యక్తమైన సృష్టి తిరిగీ సంకుచితమై అవ్యక్త ప్రకృతి అవుతుంది. సృష్టియొక్క సంకోచ వికాసాలు అనంతంగా జరుగుతుంటవి. వ్యక్తి కేంద్రాలు మహాకేంద్రంతో యేకత్వ మొందినప్పుడే ఐక్యసంధానమవుతుంది. గోపిక లందరూ శ్రీకృష్ణుని ప్రేమించి యేక కేంద్రగతు లయినారు. భక్తు లందరూ శ్రీకృష్ణునితో కేంద్రైక్యమును పొందుతారు. బ్రహ్మాండ మంతటా ప్రకాశించే

మండలా లన్నీ యేక కేంద్రగతము లైనప్పుడు సృష్టి మేళవించి వుంటుంది. ఆ మహాశక్తులు వొండొంటిని ప్రతిఘటింపకయే మేళవించి ఆనందమును కలుగజేస్తవి. పండు వెన్నెల సృష్టిని మేళవింప జేస్తవి. జోతీ అప్పాదాసులు అన్యోన్య సంభాషణా కర్షణచిత్తులై కొంత వడి విశ్వాన్ని మరిచారు. సుధాకరుడు వారి హృదయాలను మేళవింపజేశాడు. ఉభయులూ యేక కేంద్ర గతు లైనారు. అప్పాదాసు ప్రేమచే వుత్తరంగితము లవుతున్న భావనాతరంగములలో వోలలాడుతున్నాడు. ప్రేమ మోక్షమును సమకూర్చింది.

అ:- జోతీ! నిన్ను ప్రేమించాను. నా ప్రేమసౌరభం బ్రహ్మాండ మంతటనూ గుప్పించి తావులు వెదజల్లుతున్నది. ఆనంద గీతమై అంతటా రమిస్తున్నది. ఆ సౌరభమూ గానమాధుర్యమూ నా హృదయానికి గోచరిస్తున్నవి. నా ప్రేమ పండు వెన్నెలలో వ్యాపించి వున్నది. పుష్పములలో వ్యక్తమై ప్రసరిస్తున్నది. నదీప్రవాహముల చిరుతరగలతో గుసగుసలాడుతున్నది. నా రాధవైన నీయందు విలీనమై నిలిచింది.

జోతి ప్రేమగీతమును విని తెలిగన్నులతో ఆనందిస్తున్నది. ఉభయుల హృదయాలూ యేకమైనవి. అప్పాదాసు హస్తం ప్రకంపించి జోతి హస్తమును గ్రహించ బోయింది. అతని పెదవులు సంచలించినవి. అంతా అనుభవించినట్లే అయింది. నిశ్చేష్టులై వుభయులూ ఘడియసేపు నిలుచున్నారు. వారి యోగ సమాధికి భంగం కలుగలేదు. అనంతగా అట్లా నిలవబడేవాళ్లే! రామదాసు పిలువవచ్చి యీ దృశ్యంచూచి ఆశ్చర్యపడ్డాడు. కొంతసేపటికి అన్నానికి పిలుచుకొని పోయినాడు.

# ౮

## బ్రహ్మలు నశించినా మన వివాహసంబంధం చెదరకుండునుగాక

అంతా భోజనానికి వచ్చారు. మాలక్ష్మి అందరకూ పళ్లేలుపెట్టి అన్నం వడ్డిస్తున్నది. అప్పాదాసు కొంచెం సిగ్గుపడి వంటయింట్లోకి పోయి రామదాసు యేమనుకుంటున్నాడో అని ముఖభావాలు పరీక్షించి చూచాడు. రామదాసు మనస్సు నిశ్చం చలమైనట్లు ముఖలక్షణములనుబట్టి గ్రహించి సంతసించాడు. జ్యోతి యథాప్రకారం అప్పాదాసుపక్క కంచం పెట్టుకొని భోజనం చేస్తున్నది. మాలక్ష్మి అన్నంతింటూ కంట తడిపెట్టి:

మా:- ఇప్పటికి యివే మంచిరోజు లనుకుంటుంటే యింతమాత్రం కూడా జరిగేటట్టు కనుపడదు. ఊళ్లో చాలా మందిని పట్టుకొని పోతారని అంతా అనుకుంటున్నారు.

జ్యో:- ఎవ రెవరిని ?

మా:- కర్మం చాలనివాండ్ల నందరినీ ! ఊళ్లోకి యే విలయం వచ్చినా మన యింటిమీదికి రాకతప్పదు.

రా:- విచారపడితే తీరేట ట్లున్నదా? యేది సంభవించినా మహాప్రసాద మని స్వీకరించడమే బుద్ధి.

మా:- నాయుడుగారు నిన్నుమాత్రం జామీనిచ్చి వదిలి పెట్టిస్తా నంటున్నాడట. నీ వెందుకు వొప్పుకోవు ?

రా:- అందరూ ఖైదుకు పోయేవాండ్లూనూ నేను మాత్రం బయటుండే వాడినీనా ? కారాగృహప్రాప్తే వుంటే నాయుడు గారు తప్పించవలెనంటే పోతుందా ? లేకపోతే రాజుమాత్రం నన్ను పెట్టించగలడా ? దేవుడుసహా ప్రారబ్ధాన్ని మారుస్తాడని తోచదు.

అ:- మామా! నాయుడుగారు యీసంగతి నీతో మాట్లాడ మన్నారు. మనవూళ్లో యిరవైమందిమీద జామీను కేసులు దాఖలుఅయినవి. ఎవరూ నీతో వొంతుపెట్టుకోవడం లేదు.

నాయుడుగారి అభిప్రాయప్రకారం నీవు వెళ్ళడం మంచిది. ఈ వయస్సులో ఖైదుకు పోతే చేతికిరావు.

రా-దా:- అవన్నీ నే నొప్పుకోను. కళ్ళం యెక్కడవుంటే అక్కడి కీడుస్తుంది. కొమరవయస్సులోవున్న సంగడు యేఖైదులో చచ్చాడు? చావులేనిస్థలం చూపించండి, అక్కడ దాక్కుంటాను. నా యభిప్రాయం నాయుడిగారితో పొద్దున్నే చెప్పాను.

మా:- నీవు ప్రతిదానికీ పట్టుపట్టవద్దు. తక్కినవాళ్ళు నీతో పొంతు పెట్టుకోనప్పుడు యింతాలోచన యెందుకు? నిన్ను విడిచి నే నెక్కడుండేది?

రా:- నీవు నే పుట్టినప్పుడు పుట్టావా? పుట్టినప్పటినుంచీ నన్ను కనిపెట్టుకొని వున్నావా? కాలప్రవాహంలో రెండు కట్టెలు యీపొద్దు జతైతే రేపు విడిపోతవి.

మా:- అది నే నంగీకరించను. పూర్వకర్మఫలంచేత నే జత కూడుతవి గాని ఆకస్మికంగా జేరవు. కల్పాంతాన బ్రహ్మ నశించినా మనవివాహబంధం చెదరకుండును గాక!

రా:- మాలక్ష్మీ! అద్భుతమైన జవాబు చెప్పావు. ప్రస్తుతం నాతో కారాగృహప్రవేశం నీకు సంభవించకపోయినా నాబదులు జోతీ నీవూ పనిచేయండి. నేను కారాగృహం వెళ్ళడమే మనవుద్యమానికి క్షేమమని తలుస్తాను.

అ:- చెన్నపట్టణపు కార్మికనాయకుల దగ్గరనుంచి కూలీ లెవరూ జామీ నియ్యగూడదని వుత్తర్వు వచ్చినతర్వాత నాయుడుగారు నీసంగతి వ్రాశారు. వారి అభిప్రాయాన్ని బట్టి మన మంతా నడుచుకుందాం.

రా:- వారుమట్టుకు భేదం లేనిభేదాలను అంగీకరిస్తారా? జవాబు రానియ్యి చూతాం.

అంతా భోజనంచేసి పడుకున్నారు. అప్పాదాసుకు నిద్దర పట్టలేదు. జోతియొక్క భావిస్థితినిగూర్చి విచారగ్రస్తుడైనాడు. ఆమె నిష్కలంకమైన ప్రేమకు ఆశ్చర్యపడ్డాడు. ఆత్మోపలబ్ధి

ఆమెకు యిదివరకే కలిగింది. రాధాకృష్ణు లిదివరకే వరం ప్రసాదించారు. ఆమెకే చింతలూ లేవు. "ఓ కృష్ణా! నాయందు అనాదర మెందుకు? యేల యీ మాంద్యం? యెందుకు నీయందు విశ్వాసం కుదర్చవు? ఆమె యేది చెప్పినా హృదయపూర్వకంగా రసవంతంగా వుంటుంది. నాకు వాగాడంబరమే కాని వాక్కులు శుష్కములు. జోతికి నాయందుగల ప్రేమకు సన్నర్హుని జెయ్యి," అని ప్రార్థించాడు. జోతి తెలిగన్నులూ నిర్మలమైన ముఖారవిందమూ మనోగోచరమైనవి. గుటకలు మ్రింగుతూ ఆస్వాదించాడు. ఆ రూపాన్ని మనస్సులో పెట్టుకొని నిద్రపోయినాడు.



## ఏటివొడ్డున యిల్లు కట్టుకుంటా

తెల్లవారి రెండుఘడియల పొద్దెక్కేవరకు గుంటూరు డిప్టీ మేజస్ట్రీటువారి కోర్టునుంచి పోలీసులు వచ్చి వారంట్లు తెచ్చారు. ప్రథమనోటీసు "సివగైరాలు కార్మికసంఘాలేర్పరచి చోరులకు తోడ్పడుతున్నట్టూ, నీకు యితరులకు కనబడే జీవనాధారం లేనట్టూ, చోరీలు వగైరా నేరాలు చేస్తున్నట్టూ లేక చేయించుతూ వున్నట్టూ సమ్మకంగా తెలియవచ్చినందున నీవు గుంటూరు ౧వ తరగతి మేజస్ట్రీటువారి యెదుట హాజరు అయి, మంచినడతతో వర్తించేటట్టు వొకసంవత్సరంపాటు నూరేసి రూపాయీలకు యిద్దరు జామీనుదారుల నియ్యవలసిందనీ, అదే మొత్తానికి స్వంతజామీ నియ్యవలసిందనీ యెందుకు కోరగూడదో కారణము ౧౭వ నవంబరు తేదీని తెలుపవలసింది. అట్లు తెలుపనియెడల యీ వుత్తరువు ఖాయపర్చడ మవు నని తెలుసుకోనేది" అని రామదాసూ రంగదాసూ వీరదాసూ శేషయ్యా వగైరాలు యిరవైమందికి జారీ అయింది. పోలీసులు వచ్చారన్నసంగతి తెలిసి మంగళాపురపు కూలీసంఘపు సభ్యులంతా సభచేసి నోటీసులో సంగతులన్నీ అబద్ధ మని వాదించి ఆప్రకారం సాక్ష్యమిప్పించ వలసిందనీ మేజస్ట్రీటుగారు మూర్ఛించి వుత్తరువు ఖాయపరిచే యెడల జామీ

నియ్యక అందరూ ఖయిదుకు పోవలసిందని ఆంధ్రమహాకార్మిక సంఘమువారి సలహాప్రకారం తీర్మానించారు. రామదాసు గారికి కడమభాగం వర్తించదని సవరణ దెచ్చారు గాని ఆయన కోపంతో దానిని నిరాకరించినందున సవరణ వదులుకోబడ్డది. సభ కాంగనే అందరూ కలిసి బుద్ధిపూర్వకంగా పోలీసువారికి స్వాధీనపడ్డారు. అందరికీ అరదండాలువేసి మధ్యాహ్నం నాలుగుగంటల బండి మీద గుంటూరు తీసుకొనివచ్చి సబుజయిలులో ప్రవేశపెట్టారు. అనేకవందలజనం మంగళాపురంనుంచి బయలుదేరి గుంటూరు వచ్చారు. ప్రతిరయిలుకూ అనేకగ్రామాలనుంచి వందలకొలది ముద్దాయీలను జామీను కేసులుపెట్టి తెస్తున్నారు. సబుజైలు చాల లేదు. ప్రతిగదిలోను నియమిత సంఖ్యకంటె యెక్కువమందిని వుంచుతున్నారు. ఇతర కేసులలో వాళ్ళను జామీనుమీద విడుదలచేయవలసిందని కలెక్టరుగారు మేజస్ట్రీటుతో చెప్పారు. రామదాసు కేసు విచారించే మేజస్ట్రీటుగారు దివ్యజ్ఞాన సమాజకులు. కయిజరును ఆవహించి యూరపును వినాశంచేసిన దుష్టపిశాచం హిందూదేశంలో కార్మికోద్యమాన్ని నడిపిస్తున్నదని ఆయన నమ్మకం. రామదాసు వేదాంతి అని ఆయన కెవరో చెప్పారు. విచారణ నాటికి హాజరు అయ్యేటట్టు సొంత పూచీఖత్తుమీద వదిలాడు. ప్లీడర్లు చాలామందికి చేతినిండా పని దొరికింది. భాగ్యవంతులైన ప్లీడర్లు ముద్దాయీలతరఫున వకాల్తులు పుచ్చుకోమన్నారు. తమ యిండ్లకు కన్నాలు పడకుండా వుండడానికి కొందరు పుచ్చుకున్నారు. కేసులు వెంటనే విచారణలు ప్రారంభమైనవి. మోతుబరు లంతా పోలీసువాండ్లు కోరినట్లల్లా సాక్ష్యాలు చెపుతున్నారు. ముద్దాయితరఫు ప్లీడర్లు సవాళ్లు వేయబోతే మోతుబర్లు 'అబద్ధం చెప్పవచ్చారా, అనవసరపు ప్రశ్నలు అడగవద్ద'ని కోర్టువారు యే ప్రశ్నలూ అడగనియ్యడంలేదు. ఫిర్యాదుతరఫు సాక్ష్యం త్వరలోనే ముగింపునకు వచ్చింది. ముద్దాయీలతరఫున వందలకొలది సమనులు చేయించవలసిందని కోరారు. కూలీసాక్షులను యెవరు నమ్ముతారని మేజస్ట్రీటుగారు ముందుగానే చెప్పారు.

కూలీవుద్యమంలో అభిరుచిగల మోతుబరులు సాక్ష్యానికి వచ్చారు గాని వారిని 'మీరు దొంగలను చేరదీస్తున్నారు గదా. చోరీ సొత్తులు కొంటారుగదా?' అను మొదలైన ప్రశ్నలడగటం ప్రారంభించారు. ముద్దాయీలప్లీడర్లు 'మోతుబర్లను యిటువంటి ప్రశ్నలడగగూడద'ని ఆక్షేపిస్తే 'వున్న సంగతులడిగితే తప్పేమ'ని కోర్టువారు ఆక్షేపణలను తోసివేశారు. ముద్దాయీల తరఫు సాక్ష్యం పూర్తి అయింది. ముద్దాయీలతరఫున సీనియర్ కౌన్సెలుగా వున్న చింతాగారికి అప్పుడే టెంపోరీ గవర్నమెంటుప్లీడరు పని అయినందున ముద్దాయీలతరఫున సరియైన హియరింగు జరగలేదు. వేరే ప్లీడరును పెట్టుకోవడానికి వాయిదా యివ్వలేదు. మేజస్ట్రేటుగారు వెంటనే తీర్పుచెప్పి మంగళాపురం ముద్దాయీలలో రామదాసునుమాత్రం వదిలి తక్కినవాళ్ళకు జామీను వుత్తర్వు ఖాయపరిచారు. అందరిని నిడదవోలు సెంట్రలుజైలుకు పంపారు. రామదాసు తనను అక్రమంగా వదిలిపెట్టారని కోర్టువారికి మనవిచేసి గునుస్తూ యింటికి పోయినాడు.

వుండవల్లి సెటిల్మెంటుకు క్రొత్త సూపరింటెండెం టయిన బ్రాన్‌సన్‌గారికి రామదాసును వదిలిపెట్టినసంగతి తెలిసి కలెక్టరుగారిదగ్గరకు వచ్చి డిప్టీకలెక్టరు నేటీవు కావడంచేత రామదాసును వదిలిపెట్టాడనీ, మంగళాపురపు దొంగలకూ కూలీలకూ అతడే గురు వనీ అతనిని వూళ్ళో వుంచకుండా భార్యాపుత్రులతోసహా సెటిలుమెంటుకు పంపవలసిం దనీ కోరాడు. కలెక్టరుగారు డిప్టీకలెక్టరు వెంకట్రావుగారిని ఖాయపర్చని అయిన తహశ్శీలుదారు పనికి తగ్గించి రామదాసు కుటుంబాన్ని సెటిలుమెంటులో వెంటనే చేర్పించవలసిం దని పోలీసులకు వుత్తరువు పంపాడు. పోలీసులు మంగళాపురం పోయి కలెక్టరుగారి వుత్తరువును రామదాసుకు తెలియపర్చారు. ఊరంతా మాలపల్లెదగ్గర మూగింది. పోలీసులు తుపాకులు కాలుస్తామని భయపెట్టారు. రామానాయుడు అల్లరి జరుగకుండా సర్దుతున్నాడు. అప్పాదాసు తననుకూడా తీసు

కొనిపోవలసిం దని కోరాడు. కాని పోలీసులు వుత్తరువులు లే వన్నారు. జోతి మెదలకుండా వూరుకున్నది. మాలక్ష్మి ఆస్తి వేలంబడ్డ మొదటిరోజులలో, వూరు విడిచి పోవలె నని అనుకుంటేది గాని మర్యాదకు భంగం లేకుండా కుటుంబం జరుగుతుండడం వల్ల, రామానాయుడూ వెంకటయ్యా స్వతంత్రించి వుద్యమానికి పూనుకోవడంవల్ల వూరు విడవడ మంటే కష్టంగా తోచింది. దానికితోడు అప్పాదాసు తమతో వుండడానికి వీలులేకపోవడం, సెటిల్మెంటులో అస్వతంత్ర జీవితం చేస్తూ కూలీపని చేసుకొని జీవించవలసి వుంటుందని అందరూ చెప్పడం ఆమెను భయపెట్టినవి. మాలక్ష్మి దుఃఖిస్తూ "కూలీకి పోవడం తప్పిపోతుందేమో అనుకున్నాను. రక్షకుడు దానికికూడా నిన్ను లోబరుస్తున్నాడు. బిడ్డకూడా కూలి చేయవలసి వుంటుందిగాఁవాలె" నని అన్నది.

రా:- ఓసి పిచ్చిదానా! కూలిచేసుకుంటే యేమీ తప్పు లేదు. దేశంలో జనం చాలా భాగం కూలివల్లనే జీవిస్తారు. మనం ముగ్గురం అయినా కలిసి వుండడానికి భగవంతుడు అవకాశం యిచ్చాడు. యిక్కడికిదే మహాప్రసాదం. నేను వొక్కణ్ణే ఖైదులోకి పోవడంకంటె యిదొక విధంగా మేలుగదా! కాని నీకుకూడా శ్రమ కలిగింది. ఒక్కందుకుమాత్రం పరమానందంగా వున్నది. తోటి ప్రచారకులు ఖైదులో వుంటే మనం స్వేచ్ఛగా వుండడం న్యాయంకాదు. నా కించ యిప్పటికి తీరిపోయింది.

మా:- మన కష్టాలు యింతటితో అంత్యమైన వనడానికి వీలులేదు. యేమి వచ్చినా మెడ లొగ్గడమే మన పని.

జో:- యేదైనా మంచికే వస్తుంది. మంచీచెడుగులు మనం అనుకోవడంలో వున్నవి.

పోలీసులు:- వేదాంతాలు చాలించి పదండి.

అంతా బయలు దేర బోతున్నారు. అప్పాదాసు జనంలో మెక్కడనో నిలుచున్నాడు. ఇంతవరకు యేమీ మాట్లాడ లేదు. మనస్సులో యేమో గొణుగుతూ పెద్దపెట్టున యేడ్చాడు.

రామానాయుడు:- దాసూ ! యేమిటిది? నీవు కూడా దుఃఖిస్తే వోదార్చేవా రెవ్వరు ?

దాసు మాట్లాడ లేదు. నేలమీద చతికిలపడి భూమిమీది కొరిగాడు. అంతా బయలుదేరి పోతున్నా లేవలేదు. జోతి వెనుకకు దిరిగిచూచింది. అప్పాదాసు ఆకారమంతా తనమనోఫలకం మీదికి రూపెత్తింది. పదిలంగా దాచి పెట్టుకున్నది. రూపురేఖలన్నీ ఆమె మనస్సుకు అంటుకొనిపోయినవి. నిదానించి చూచినకొద్దీ మాంసలమైన సుందర విగ్రహమేర్పడి హృదయరంగాన్ని ఆక్రమించుకొన్నది. కురంగంవలె అడుగులు పెడుతూ తల్లి పమిటె కొంగు పట్టుకొని పోతున్నది. ఆమె కప్పు డేచింతా తోచ లేదు. బ్రహ్మాండ మంతటా అంతర్యామియై ప్రవహించే ప్రేమ ప్రవాహం యొక్క కెరటాలు ఆమె హృదయానికి విసిరికొడుతున్నవి ! ఆ తరంగాలమీద కలహంసవలె ఆనందంగా ఆమెహృదయకమలం వుయ్యాల లూగుతున్నది. ఆ కమలం మీద నిశ్చంచలమైన వాక భావనారూపం చిరునవ్వుతో కూర్చున్నది.

రామదాసు వూరు విడిచి వెళ్ళుతుంటె దయాసత్యశౌచాలు వూరిని వదిలిపెట్టి పోతున్నట్టే కనబడుతున్నవి. శరీరం బొత్తిగా క్షీణించి వున్నది. ఈ గుంపు వేదాంతం కోటమ్మగారింటి దగ్గరకు వచ్చేవరకు ఆమె వారుపోయించి "అరుంధతీ వశిష్ఠూ మన వూరినుంచి వెళ్ళిపోతున్నారు. ఈ జ్ఞానానందుడు శీఘ్రకాలంలో బంధరహితుడై మనవూరు తిరిగివచ్చుగాక" అని దేవుడిని ప్రార్థించింది. ఇంతలో దాసుకు స్మృహ తెలిసి పరుగెత్తుకుంటూ వస్తున్నాడు.

రా:- నాయుడుగారూ ! తమరు దాసును నిలిపి దుఃఖోపశమనం చెయ్యండి. అతనిని తమకు వొప్పచెప్పి పోతున్నా.

అ:- నేనా— యీావూళ్ళో వుండను.

రా:- యెక్కడికి బోతావు? సెటిల్ మెంటులో నిన్ను వుండనియ్యరు.

అ:- అవసరం లేదు. యేటివొడ్డున యిల్లు కట్టుకుంటా. పూలూ ఆకులూ కొమ్మలూ దెచ్చి అలంకరిస్తా. యెప్పుడూ ఆడు కుంటూ వుంటా.

రా:- నాయుడుగారూ! తమరు అతణ్ణి ఆపి శాంతిపరిస్తేనే కాని దారికిరాడు. మనసు బొత్తిగా చలించినట్లు కనబడుతున్నది. ఈ కర్మంలో అదిగూడా తటస్థిస్తుందేమో!

అ:- మా మయ్యా! యెంత క్రూరుడవయ్యా! నన్ను రానియ్యవూ? మీాతోటే వస్తా. ఇక్కడ నాకేమి పని? (అని యేడ్చాడు.)

రా:- బాబూ! అప్పడూ! సంగబావ పూనుకొన్న పని నెరవేర్చవద్దా? నీ విక్కడనే వుండు.

అ:- నే నెందుకు? తనపని తానే నెరవేర్చుకుంటాడు. నేనుకూడా బావను చూడడానికి వస్తా. నన్ను వచ్చి చూడని య్యవూ?

రా:- అయ్యా, నాయుడుగారు! అంతకూ తమరే వున్నారు. అప్పడి విషయం శ్రద్ధవహించాలె.

రామానాయుడు అప్పాదాసును చెయిపట్టుకొని నిలిపాడు. అప్పడు పకపక నవ్వుతూ "నా హృదయాన్ని పట్టుకోగలరా? ఓ- నాహృదయాన్నికూడా యెత్తుకొని పోతున్నావు. నన్నుమాత్రం వదిలిపెట్టి పోతావా?"

జ్యోతి తనమనస్సులో "నిన్ను వదిలి పోతానా? మన మిద్దరం కలిసే పోతున్నాం," అని అనుకున్నది.

మలకాచెరువుకట్టదాకా వూరిజనం వెంబడించారు. రామదాసు "మీారంతా వుండండి. అప్పణ్ణి కనిపెట్టండి" అని అందరిసీ నిలిపాడు. మాలక్ష్మి మాలపల్లీ, వూరగొండలూ చూచి

నిట్టూర్పు విడిచింది. యెవరివంకా చూడలేదు. యెవరినీ మాట్లాడించలేదు. పోతాననైనా యెవరితోను చెప్పలేదు. పిల్లవాడు వెనుకపడుతుంటే చంకవేసుకొని పమిటెచెరుగు తలమీద వేసుకొన్నది! జనమంతా "మాలక్ష్మి మేముంటా" మన్నారు. దుఃఖం పొర్లివస్తూవున్నది. నోరెత్తి మాట్లాడితే ప్రవాహం పైకి వచ్చేటట్టు కనపడ్డది దుఃఖం యీవత్తూ మింగి వూరుకొన్నది. జనం అది గ్రహించారు. "ఆ యిల్లాలికి ప్రజమొఖం చూడటానికి కూడా మనసు వొప్పడంలేదు. దుఃఖం భరించలేకుండా వున్నది." అని వెనుకకు తగ్గారు.

రామదాసూ, పోలీసులూ చెరువుకట్ట దాటారు. వెంకటయ్య కలియవచ్చి 'రామదాసు కేమైనా పైకమియ్యవచ్చునా?' అని పోలీసులను అడిగాడు. వారు కలెక్టరుగారి వుత్తర్వు పొందనిదీ వీలు లేదన్నారు.

వెంకటయ్య:- మీరు భోజనానికి శ్రమపడకుండా వుండేటట్టు కలెక్టరుగారి వుత్తర్వు పొంది చేస్తాం. మీ రేమీ చింత పడవద్దు.

రా-దా:- ఇతరులకు యిన్నివిధాల శ్రమకు కారణమైన యీ జీవితం నా కెందుకు?

వెం:- రామదాసూ! నీ జీవితం పవిత్రమైనది. లోకసంగ్రహార్థం అప్పుడప్పుడు యిటువంటివాండ్లు పుట్టి దీపాలవలె లోకానికి మార్గదర్శకు లవుతారు. లేకపోతే ప్రపంచం అంధకారంలో మునిగిపోతుంది.

రా-దా:- మీమాట లతిశయోక్తులు. మీమోస్తరుగా అందరూ మంచివాళ్ళని మీరు అనుకుంటారు. మీ త్యాగం అద్వితీయం.

పోలీసులు:- పౌలు రైలుస్టేషన్ దగ్గర వున్నాడు. ఆయనను కట్టుకుంటే మీకు యెన్ని పనులైనా అవుతవి. కలెక్టరుదాకా పోనే అవసరం లేదు. మేమూ బీదవాండ్లం; జీవిస్తాం.

రా-దా:- ఆయనకు వుత్తర్వు లెయ్యడానికి అధికార వున్నదా ?

పోలీసులు:- అధికారం లేకపోతే నేమి ? ఆయన యే చేయదలుచుకున్నా కాదనేవాండ్లు వుండరు. ఒకరికి తెలియ వలసిన అవసరం లేదు.

రా-దా:- వీలైతే తమరు కలెక్టరుగారి ద్వారా కొద్దిగ యేర్పాటు చేయించండి. కాకపోతే మా రెక్కలే వున్నవి.

వెం:- శాయశక్తులా ప్రయత్నం చేస్తాను. ఇక నే నుంటా. అప్పడిభాగం మాది.

వెంకటయ్య వెనుకకు తగ్గేడు. మధ్యాహ్నం రెండు గంటలు కావచ్చింది. "రైలు తప్పిపోతుందేమో కాలు సాగ నియ్యం"డని పోలీసులు అన్నారు. మాలక్ష్మి పిల్లవాడిని చంక మార్చుకుంటూ యెత్తుకొని నడుస్తున్నది. పిల్లవాడికి అగ్గిచేత బిక్కమొగం పడ్డది. జోతికి నడవడం వుత్సాహంగా వున్నది. మాలక్ష్మి కొంతసేపటికి తిప్పుకొని:

మా:- యింకా యెంతదూరము నడవాలె ?

పో- యెన్నడూ రైలెక్కలేదా ?

రా:- దాని కేమిపని రైళ్ళతో ? యీ కాలానికి నెత్తిన చెంగు వేసుకొని బయలుదేరిందిగాని.

మా:- అమ్మాయీ ! వీడిని కాస్త చంకను వేసుకో. నాకు బొత్తిగా జారిపోతున్నాడు.

రా:- ఆమె నడిస్తే చాలులే. ఇట్లా నా బుజాన కూర్చోపెట్టు.

రా:- అయ్యా, సార్జంటుగారు ! మా కక్కడేమైనా యిల్లుంటుందా ?

పో:- అక్కడ అన్ని వసతులూ వుంటవి. నీవు దొంగ తనాలు మాని వొళ్లువంచి పనిచేసుకుంటే యేలోపమూ వుండదు.

రా:-- చిత్తం. అక్కడున్న వాళ్లుగూడా చోరీలు చేస్తూనే వుంటారుటే !

సా:- ఉన్నమాట కేమిగాని అడపా దడపా యిదివరకు చేస్తూనే వుండేవారు. ఈ పోలుగాడు వచ్చిన తర్వాత నిక్కచ్చిగా ప్రతిరోజూ చేయిస్తూనే వున్నాడు. సెటిల్మెంటులో కొందరు సంతానులు చేరేరంటారు. బెజవాడ పొట్టున లేచి పోతూ వున్నది.

రా:- ఇదా సెటిల్మెంటంటే? కూలి దొరుకుతుందంటిరే, పని చేసుకొనే వాళ్ళకు ?

సా:- రోజూ యింతమందికి కూలెక్కడ దొరుకుతుంది ? వరికోతలై నూర్పిళ్లుకూడా పూర్తి అయినవి. మిరపలూ పత్తీ వొక నెలకు పైగాగాని ఆరంభం చెయ్యరు. అటుతరువాత దొంగతనమే జీవనం.

రా-దా:- పోంగనే మాకు భోజన మెట్లా? ఒక్కరోజు బత్తెంమాత్రం మాదగ్గర వున్నది.

సా:- రైలుకట్ట వెంబడి రోడ్డు వేస్తున్నారు. మట్టిపని వున్న దనుకుంటాను. మీకు పనిముట్లు వుంటే సరే. లేకపోతే సర్కారువారు మీ కిచ్చి మీ కూలీలోనుంచి బిగపట్టుకుంటారు.

రా:- ఆ మట్టిపని అయిపోతే పనిముట్లు మా కెందుకు ?

సా:- పనిముట్లు చేతిలో వుంటేనేగా యెప్పటికైనా పనికి వస్తవి. నాలుగు రకాల పనిముట్లుంటే పని తియ్యకుండా దొరుకుతుంది.

మా:- ఆడవాండ్ల కేమిపని యిస్తారు ?

సా:- మగవాళ్లు మట్టి తవ్వుతుంటే ఆడవాళ్లు మోస్తారు. మీరు తల్లీ బిడ్డా కలిసి ఆరణాలకు మోసుకోవచ్చు.

రా:- నైషధం చేతపట్టుకొన్నప్పుడు యెంత చాకచక్యం చూపావో తట్ట పట్టుకున్నప్పుడూ అంత చురుకుతనం చూపించాలె.

జో:- ఓ! నే బాగా మోస్తా.

రామదాసు:- (సంతోషంతో) నా బిడ్డలను యే పనిలో బెట్టినా సురకత్తులే! రంగడికికూడా రెక్కలు వస్తే మాకు చింత వుండదు. సార్జంటుగారూ! దగ్గరలో మా పిల్లవాడికి బడేమైనా వుంటుందా?

సా:- సెటిల్మెంటులో లేదు. చేరువలోనే తాడేపల్లిలో వున్నదిగాని మీ పిల్లలను రానియ్యరేమో!

రా:- అయితే జోతి చెప్పాలిసిందే. రెండక్షరా లతికితే యెక్కడైనా బతుకు తెరువు చూసుకుంటాడు. అక్షరంమీద బతక వచ్చు.

మా:- నీ వింత చదువుకున్నందుకు అక్షరంమీద బతుకు తెరువు కుదిరిందా?

రా:- అదంతా ప్రాప్తంలే. ఎల్లకాలం ఇట్లాగే వుంటుందా? దారిన మిట్టలూ లేక, పల్లాలూ లేక యేకరాసిన పోవడం యెవరికీ సాధ్యంకాదు.

మా:- కాలం మారినకొద్దీ మనపని తీసికట్టుగా వుందిగాని వేసికట్టుగా లేదు.

రా:- యే స్థితు లెట్లా మారినా రాశికి కలిమిలేములు కాపడికుండలే! సుఖదుఃఖాలు యెప్పుడూ పులగంపెట్టే కాని కలగలపులు లేకుండా సుఖం వుండనేరదు. అదిగాక కష్టాలు లేని సుఖాలకు రుచి తక్కువ.

మా:- ఆమాట నిజమే. మన కాపురం మూడు పూవులు, ఆరు కాయలుగా వున్నప్పుడు చెట్టంటిబిడ్డ చావలేదా? యెన్ని కష్టాలువస్తే మన కేమి? సంగన్న వుంటే చాలదా? తోచక అనుకోవడమేగాని కష్టసుఖాలకు యెప్పుడూ లంకే. ఒకటి విడిచి వొకటి వుండలేదు.

రైలుస్టేషనుకు వచ్చారు. పౌలు యెదురుగా వచ్చి రామదాసును కౌగలించుకొని—

పౌలు:- మీ రిది కష్టంగా యెంచుకోవద్దు. దేవుని సమీపానికే వస్తున్నారు.

రా:- (వెడిగెలగా నిలుచొని) దేవు డింకా ఎంత దూరములో వున్నాడు ?

పౌ:- సత్యమతాన్ని సమీపిస్తున్నారని నా యభిప్రాయం.

రా:- సత్యమతానికి నే నెప్పుడూ సమీపంలోనే వున్నా. సత్యమని తోస్తే స్వీకరించడానికి యెప్పుడూ వెనుదీయను.

పో:- యిదిగో, రామదాసూ! నీవు మతంలో కలిశావా అంటే అన్ని చిక్కులూ తీరుతవి. పౌలుగారు మీ కేలోపం లేకుండా చేస్తారు.

పౌ:- వారి యిష్టప్రకారం పోయేవాడినే; కాని వ్యతిరేకించేవాణ్ణి కాదు. జోతీ! ఆ బండమీద కూర్చో. అయ్యా! మీ రిట్లా కూర్చోండి. సార్జంటుగారూ, మీరు టిక్కెట్లు తెప్పించండి. గంటగొట్టి శానా సేపైంది. వీరు పారిపొయ్యేవారు కారు లెండి. సందేహించ నక్కరలేదు. రామదాసుగారూ! నాకూ తలిదండ్రు లెవరూ లేరు. పాదిరీగారే పెంచి విద్యాబుద్ధులు చెప్పించారు.

రా:- విద్య చెప్పించారూ ?

పౌ:- అవును. చెప్పించారు. యింత నవుకరీకూడా ఇప్పించారు. మర్యాదగా యింతడబ్బు దొరుకుతున్నది.

రా:- డబ్బు సంపాదిస్తున్నారనే వింటూవున్నా.

పౌ:- వింటున్నారుగద! ఇంత డబ్బు వస్తున్నదనే మాటే కాని, అనుభవించేవాళ్ళు లేరు. అంతా బ్యాంకులో నిలవచేస్తున్నా. యెవరి కిది ప్రాప్తమున్నదో? మీ కుటుంబములో నన్ను వొకణ్ణిగా భావించుకొని నా కింత అన్నం వండిపెడితే నాకు పూటా చెయి కాల్చుకోవడం తప్పిపోతుంది. మీకు కష్టం లేకుండా సంసారం జరపగలను.

రా:- మా తంటాలు మేము పడతాం. మీ కెందుకు లేని పోని శ్రమ?

పౌ:- నాకు శ్రమేమున్నది? మీబోటి పెద్దలు దొంగల కోసం వేసిన గుడిసెల్లో వుండగలరా? నాకొక పెద్దయిల్లిచ్చారు. ఒక గదిలో నే నున్నా. మరొక గదిలో పనిచేసేమనిషి పడు కుంటుంది. తక్కిన దంతా ఖాళే. పరాఖత్తుగా మీ రుండవచ్చు. అదేమని అడిగేవాళ్లు లేరు. దొరగారికి మస్తరుగుమాస్తా కావలసి వున్నాడు. ఎవరికీ యీయకుండా అట్టేపెట్టివుంచా.

మా:- జీత మే మిస్తారు.

పౌ:- ప్రస్తుతం పదిరూపాయ లిస్తారు. త్వరలో పన్నెండు చేయిస్తా. దొరగారి అనుగ్రహం సంపాదిస్తే యెంత సహాయమైనా చేస్తారు.

రా:- క్రైస్తవులు కానివారి కిస్తారా?

రా:-మీరుక్రైస్తవులు కారా? మీది క్రీస్తుయొక్క జీవితం వంటిదే! పేరు మార్చుకోవడం తప్ప యేమార్పూ అవసరం లేదు. వెంటనే దొంగల జాబితాలోనుంచి తీసివేయించి వుద్యోగ స్థుణ్నిగా యేర్పాటు చేయిస్తా.

రా:- దానికి కలెక్టరుగారి వుత్తరువు కావాలంటే?

పౌ:- అ దెంతలోది! దొరగారు నిమిషంలో చేయిస్తారు.

రా:- చేర్పించడానికి అధికార మున్నప్పుడు తీసివేయించ డానికిమాత్ర ముండదా?

పౌ: అక్రమంగా యెవరినీ చేర్పించరు. ఇక్కడికి వచ్చిన వాళ్ళను చాలామందిని దొరగారు బాగుచేశారు. అమ్మా! మీ రిద్దరూ కూర్చోండి. యెంతసేపని నిలుచుంటారు? అబ్బాయీ! నీవు కూర్చో.

మా:- యెందుకులెండి.

పౌ:- నా కథ మధ్య చాలించాను. నాకు లక్షణంగా జీవించడానికి అవకాశమున్నా 'నా' అనే దిక్కు లేకుండా

వున్నాను. నా మేనమామ వుంటూ వుండేవాడు; ఈ మధ్యనే కాలం చేశాడు. ఆయన మూడుమూర్తులూ మీరే. మిమ్మల్ని చూచినప్పుడల్లా ఆయన జ్ఞాపకం వస్తాడు. మిమ్మల్ని మంగళాపురంలో తటాలున చూడంగనే "మామా" అనే మాట పెదవులదాకా వచ్చింది. అజ్ఞానులను "మామా" అని పిలిస్తే దొరగారు కోపపడతారేమో అని ఆచుకొని వూరుకున్నా. ఎప్పుడైనా మరుపు చొప్పున మాట జారి మిమ్మల్ని "మామా" అని పిలిసే కోపపడకండేమి!

రా:- పొరపాటుగా పిలిస్తే కోపమెందుకులెండి. మాకు ఒక రోజుకు సరిపడ మాత్రమే భత్యమున్నది. వెంటనే కూలి దొరుకుతుందా?

పా:- అయ్యో, మీరు నన్ను కొత్తవాణ్ణిగా భావిస్తున్నారు. మీకు సాధ్యమైనంతవరకు త్వరలో నౌకరీ కుదిర్చే భారం నాది. అందాకా మీరు నా యింట్లో వుండి మీరంతా భోజనం చేసి నాకింత పెట్టండి. నేను చుట్టం వస్తే మొఖ మొఖాలు చూచుకుండే రకం కాదు. ఎవరైనా రావడమే సంతోషం. చుట్టాలకోసం మొఖం వాచివున్నా. దూరపువాళ్లైనా దగ్గరవాళ్లైనా చుట్టాలంటూ వస్తే చాలుననిపిస్తుంది. మీబోటి సధర్ములు వస్తే మా గృహం పవిత్రమవుతుంది.

రా:- మీరు బంధుప్రియులే కావచ్చును కాని అంతలపొంతలవాళ్లు పొరుగిళ్ళమీదికి వచ్చి తిష్టవేయడం క్రమంగాదు. భాగ్యవంతులిళ్ళకు బీదవాళ్ళం చుట్టాలమని అంగలారుస్తూ రావడం సాధారణమే. మీ సెటిలుమెంటులోకి వచ్చేవాండ్లు చాలామంది మీకు కుల చుట్టాలే అయివుంటారు. ఎవరికని మీరు సత్రాలు పెడతారు? తమకు వీలైతే కాస్త తేలికైన పని రేపు వుదయం చూపిస్తే యెల్లుండి ఆకటికి వస్తుంది. మీకు అభిమానం వున్నందుకు ఆ మాత్రం దయచేయించండి.

పౌ:- తమరు నామీద యేదో ఆగ్రహం వహించారు. మీ మనస్సులో యేదో కళంకు వుండబట్టే అరవిడిచి మాట్లాడడం కూడా లేదు. క్రమంగా నా సంగతి తెలుసుకుంటారు. ఇప్పుడు పని అగ్గవగా దొరకడం లేదు. నూరు నుగ్గబెట్టయినా రేపే పని కుదురుస్తా. ప్రారంభంలో కొంచెం కష్టపు పని చేయవలసి వుంటుంది. తేలిక పనులన్నీ అంతా ఆకట్టుకున్నారు. బావి తవ్వే పని రోడ్డు పోసేపనీ మాత్రం ఖాళీగా వున్నవి. తేలికైనదేమీ దొరక్కపోతే వాటికే పోదురుగాక; మీకు తోచినంత పని చెయ్యండి; కూలి పూర్తిగానే వేయిస్తాను.

రా:- అట్లా వేయించ నక్కరలేదు. ఇంకొకరి నోటికాడి అన్నం మాకెందుకు? చేసినంతవరకే యిప్పించండి. కాకులను కొట్టి గద్దలకు వేయడం న్యాయంగాదు. నష్టం యీ రోజు వొకరి వంతైతే రేపు మావంతే కావచ్చు.

పౌ:- మీరు కేవలం సత్యకాలపు మనుష్యులు. మీ సాంగత్యమువల్ల క్రమంగా మేమూ సన్మార్గానికి వస్తాం. తమ రాగ్రహించక మమ్ములను దగ్గరకు రాబట్టి బుద్ధి నేర్పండి. ఈ పూట మా యింట్లో యింత వుదకం పుచ్చుకోండి. కాదంటారా, యెప్పటికి ప్రాప్తమో అప్పటివరకూ కనిపెట్టుకొని వుంటాను. అదుగో! చెక్క వంగింది, లోపలికి పదండి. అత్తగారూ! రండి.

మాలక్ష్మి మొగము చిట్లించుకొని బయలుదేరింది.

పౌ:- అబ్బాయి! యిటురా అమ్మ! జనం తొక్కుతారు, నా చెయి పట్టుకో?

మా:- నా చంకను వుంటాడులెండి.

పౌ:- యేమోయ్ బావా! తరిపిమూడాలె తేపా చంకకు యెక్కుతావు? నీ యీడువాండ్లు బాగా పరిగెత్తవద్దా?

అంతా రైలెక్కారు. రామదాసును పౌలు చేయిపట్టి యెక్కించాడు.

సా:- (రహస్యంగా) యేమి, పౌలు! వుచ్చులు తెగపన్నుతున్నావు? పిట్ట చిక్కేనా?

పౌ:- ముసలికోడి అనుమానం కట్టింది. యెంత భోకొట్టినా దూరంగానే వుంటున్నది.

## ౧౦

## క్రైస్తవులయింట్లో అజ్ఞానులు

అంతా తాడేపల్లి స్టేషన్లో దిగారు. సందెచీకటి కావడం చేత కన్ను పొడుచుకున్నా కనబడడంలేదు. పౌలు యెద్దుబండిని మాట్లాడి అందరినీ యెక్కమన్నాడు. రామదాసు వద్దని నెల పొడవంగనే బయలుదేరుదా మన్నాడు. పోలీసులు తమను సెటిల్మెంటులో దింపి తిరిగీ తాడేపల్లి భోజనానికి వచ్చేవరకు భోజనం దొరకదని బతిమిలాడుకుంటే నలుగురూ బండెక్కారు. అర గంటలో పౌలు కాపురం వుండే పెంకుటింటిదగ్గరకు వచ్చారు. పోలీసులూ దస్కతు తీసుకొని వెళ్ళిపోయినారు.

రా:- మమ్మును మా గుడిసెలదగ్గరకు తీసుకొని పోండి.

పౌ:- మిమ్ములను యేగుడిసెలో వుంచేదీ దొరగారు నిర్ధారణ చేయవలసి వుంటుంది. ఆయన యిప్పుడు రారు.

రా:- ఇతరులు యీ రైలుకు వస్తే యేమి చేస్తారు?

పౌ:- సాధారణంగా అంతా పగలే వస్తారు. గుడిసె యేర్పాటుచేస్తే బాగుచేసుకొని అందులో వుంటారు.

రా:- మమ్మును యిప్పుడే తేవడానికి కారణ మేమి?

పౌ:- అది పోలీసుల పొరపాటు. నేను మావూరు పోయి వస్తుంటే స్టేషన్ దగ్గర కనబడబట్టి మీ కీయేర్పాట్లు చేయగలిగాను. ఖండితంగా పోలీసులు మాకు రేపు వుదయం స్వాధీనపర్చవలసి వుంటుంది. ఈ రాత్రంతా కాపలాచేయడం కష్టమని వాండ్లు నామీంద తోసిపోయినారు. మీ యిష్టం వుంటే మా యింటో తినండి. లేకుంటే వేరే వంట చేసుకోండి.

రా:- ఈ రాత్రి మీరు కష్టపడి వంట చేయించడంకంటే మేమే పొయిమీద పెట్టుకుంటాం.

పౌ:- మాయింట్లో తయారుగానే వున్నది. మా బంధువులను యీ రైలుకు తీసుకొని రావడానకి వెళ్లాను. యీ రోజు వాండ్లు రాలేదు. వాండ్లకోసం చేసివున్న వంటే మీకు ప్రాప్తముంటే భోజనం చేయ్యండి. లేకపోతే పొద్దున యెవరికో పారవేస్తాం.

రా:- మీకు బంధువులు లేరంటిరే ?

పౌ:- యెరుకకె మనుష్యులు సెటిలుమెంటులో చేర్పించి సహాయం చెయ్యమని వొక్కమోయిను పేడిస్తుంటే వెళ్లాను. ఇంకా వారంరోజులదాకా వాండ్లు రావడానికి వీలైందిగాదు.

రా:- ఈ రాత్రికి మీ యింట్లోనే వొదుగుతాం.

పౌ:- పస్తు పడుకుంటారా ?

రా:- వంట చేసుకుంటాం.

పౌ:- అంతవరకైనా అనుగ్రహించారు. సంతోషమే ! కట్టెలూ, నీళ్లూ, యితర వస్తువులూ ఆ గదిలో వున్నవి, తీసుకోండి. కులస్థులు వచ్చారు గనుక హాజరుగావున్న వంట భోజనం చెయ్యమన్నాను. మీ చిత్తంవచ్చినట్లు కానియ్యండి.

మా:- వారంత బలవంత పెడుతుంటే కాదనడం మూర్ఖపుపట్టుగా వుంటుందేమో ! యేమంటావు ?

పౌ:- వారు యెట్లా సెలవిచ్చినా సంతోషమే. మూర్ఖపుపట్టు అనేమాత్రపు వాణ్ణిగాను. అనుగ్రహించి మా యింట్లో భోజనం చెయ్యండని ప్రాధేయపడవలసిన వాణ్ణేకాని వారి నాక్షేపించడానికి నా కర్హతలేదు.

రా:- సరే, మీ యింట్లోనే భోజనం కానియ్యండి.

పౌ:- అమ్మయ్య ! ఇప్పటికి మామగారి మనస్సు కుదిరింది. జానమ్మా ! అన్నం వడ్డించు.

జా:- (మొగం మాడ్చుకొని) అందరినీ వొక్కమారే లెమ్మను. తలా వొకమాటు వస్తే నే తిరగలేను.

రా:- ఆ మెవరు ?

పా:- ఆమె బంధువురాలే. పోషించేవారు లేక నా కన్నం వండిపెట్టుతూ వున్నది.

రా:- యెవరూ లేరా ఆమెకు ?

పా:- భర్త యీమధ్యనే కాలంచేశాడు. బంధువులెవ్వరూ చేరనియ్యడం లేదు. ఈకాలంలో బంధువులను ఆదరించే వారెవరు ?

జా:- ఊళ్ళో వాళ్ళ గోలంతా మీ కెందుకయ్యా? తిని మీదారిన మీరు పోక !

రా:- మంచిమాట చెప్పావు. లేవండ్రా వొక్కమాటు !

జో:- నా కాకలిగా లేదు. అన్నం వద్దు.

జా:- ఈమెను మళ్ళీ ఒకజాము సాగదియ్యాలె గాఁవాలె. ఈమేనా రేపు కాబోయే దొరసాని ?

రా:- అదేమిటి ఆమె అట్లా అంటుంది ?

పా:- ఆవిడెకు పిచ్చిలెండి. ఆమాటలు మీరుపాటించవద్దు.

జా:- నాకు పిచ్చి నీకు మదం. వచ్చేవాళ్ళు త్వరగారండి.

జో:- నాకు ఖండితంగా వద్దు.

తక్కిన ముగ్గురూ మిగలా అన్నందుకు లేచారు. ముండ్ల మీద కూర్చున్నట్లు కూర్చొని యెంగిలిపడి వారికి చూపించిన గదిలో పడుకున్నారు. జానమ్మ తెల్లవార్లూ సణుగుతూనేవున్నది. పౌలు మెదలకుండా తనగదిలో పడుకున్నాడు.

రా:- ఇంట్లో సరాగం బాగానేవున్నది.

మా:- ఉంచుకున్న మని షనుకుంటాను. యెప్పుడూ ముస ముసలాడుతూనే వుంటుంది.

రా:- పైపోటీ వచ్చిందని ఆమె తగాదా.

మా:- ఇక్కడినుంచి పొద్దున్నే లేవడం మంచిది. యెక్కడికి బోయినా బాధలు అంతమయ్యేటట్టు లేవు.

రా:- సద్గురుడే వున్నాడు.

మామూలుగా రామదాసు చీకటితో లేచి రామస్మరణ చేశాడు. జానమ్మ క్రైస్తవులయింట్లో అజ్ఞానుల దేవతలను కొలవగూడదని కేకలు వేసింది. రామదాసు మనస్సులో ధ్యానం చేసుకొని కాల్యాలు తీర్చుకొని పౌలుతో మాట్లాడవలెనని యింట్లోకి వచ్చాడు. ఆయన యింకా లేవలేదు. జోతి "పిళ్ళ నీళ్లు పెట్టి మొఖం కడుక్కో" నని కూర్చున్నది. రాత్రి దాహంకూడా తాగలేదు. పిల్లవాడు అన్నమని జానమ్మ యెదుట అడిగాడు. జోతి అడగగూడదని సౌజ్ఞ చేసింది. జానమ్మ మిర్రి చూపులు చూస్తూ మీరీపూట యిక్కడవుంటే మీరు వంటచేసే నవుకర్లు లేరన్నది. మాలక్ష్మి విని వూరుకున్నది.

జా:- బెల్లంకొట్టిన రాయివలె పలకవేం! ఇక్కడనుంచి కదిలేటట్టు లేదే!

మా:- మే మొక్కనిమిషం వుండమమ్మా మీయింట్లో. ఆయన లేవడంకోసం చూస్తూవున్నాం.

జా:- మీరు చూస్తుంటేనేకాని ఆయన లేవడాయేమి? రోజూ లేస్తూనేవున్నాడు. ఆ గుడిసెలదగ్గరకు పోయి కూర్చోండి. లేవంగానే వస్తాడు.

రా:- మమ్మ్మలను వుంచేది వాటిలోనేనా?

జా:- అవే మీ మేడలు సిద్ధంచేసి పెట్టారు. దొంగముండాకొడుకులు వూళ్ళోకొంపలు దోచేదీసి, గుంపులుగా యిక్కడ చేరేదీని. యెక్కడికి బోయినా వూళ్లోవాండ్ల కొంపలకే వెసరు!

రా:- మారోజులు మేము గడుపుకొని పోయేంవాండ్లమే కాని మావల్ల యెవరికీ యేబాధా వద్దు.

జా:- మాటలు తులసివుండలు వూడిపడతవి. వెంట వొక దొమ్మరసానిని దెచ్చావు.

రా:- నీతో మా కేమీ పోటీ లేదు. నీ కడ్డం రాము.

జా:- నా కేమిఅడ్డం? ఈ సన్యాసి కాకపోతే యింకొకడు! దొరతో సంగతు లన్నీ చెప్పి లేచి చక్కాపోతా.

రా:- మీసంగతి ఆయనకు తెలియదా?

జా:- వంటచేసేవాండ్లకు యేమిసంగతు లుంటవి? దొంగా మనిషివంటి వాడే.

రా:- సరే. మేము వెళ్ళుతున్నాం. ఆయన లేవంగనే మేము అక్కడ కూర్చున్నామని చెప్పు.

పౌ:- (వొక అరగంటకు లేచి) రాత్రివచ్చిన వాండ్లు లేచారా?

జా:- వాండ్లకు నీయింట్లో వుండడం కంపరమెత్తినట్టుగా వుంది. ఆచిచింద్రీ యీయింట్లో నొక్కనిమిషం వుండనని కూర్చున్నది. ఆయన నిద్రలేచినతర్వాత చెప్పిపోవడం మర్యాదగా వుంటుందని బ్రతిమిలాడితే సాగదీసినకొద్దీ బిగిసి ఆ గుడిసెలదగ్గర కూర్చున్నారు.

పౌ:- నీమాటలు నిజమేనా?

జా:- నా కేమీ పోరాలు వెయ్యవద్దు. పోయి కనుక్కో!

పౌ:- నీళ్ళిటదే. అల్లరిమనిషివిగద. నీమర్యాదా దక్కించుకోవు, యెదటివాండ్ల మర్యాదా దక్కనియ్యవు. చేసినదానివీ అయితివి, మాటా చెడగొట్టుకొంటివి.

జా:- వీండ్ల మొహమాను నా కేమీ అవసరంలేదు. వారిని గృహప్రవేశం చేయించి రా. ఇక్కడికి వాండ్లు మళ్ళీ అడుగు పెడితే నే వోర్చను.

పౌ:- (గుడిసెల దగ్గరకు పోయి) యేమండీ మామగారూ! యెండలో చలి గాచుకుంటున్నారా?

రా:- ఖులాసాగా వుంటే కూర్చున్నాం. మా కొక కుటీరం చూపిస్తారా ?

పా:- మీ కిష్టంవచ్చిన కుండలు యేరుకోండి. ఉన్న వాట్లోకి యీ గుడిసే మెరుగు. ఎండ కడ్డంగాని వానకు గావు. కప్పంతా కూలిపోయింది. మా మరదలకు అలకడం చేతౌనా ? నేనైనా సహాయం చేస్తా.

రా:- మా కేదోపని చెప్పిస్తే వెళ్లుతాం.

పా:- అంతా పనికి వెళ్ళిపోయినారు. ఈ పూటకు వేళ తప్పింది. దొరగారు వచ్చి పని నిర్ధారణ చేయాలె. తొమ్మిదింటికి వస్తారు. యీలోగా మీరు నాస్తా గానియ్యండి. మధ్యాహ్నం నుండి పనులకు పోదురుగాని.

మాలక్ష్మి పోయి అమర్చి నీళ్ళు తెచ్చేవరకు జోతి పుల్ల లేరుకొని వచ్చింది. రామదాసు చుట్టుపట్ల చెత్తాచెదారం పోగు చేసి గుడిసెమీద కప్పు లేచిపోయినచోట వెంటిదోపి కొప్పుమీద రాయి పెట్టాడు. మాలక్ష్మి యిల్లు శుభ్రంచేసి అన్నం పోయి మీద బెట్టింది. దొర వచ్చేవేళైందని అన్నం కళిపెళ్ళాడంగనే దింపి ఆ వుడుకే తలాకాస్త తిన్నారు.

రా:- పాలుగారూ ! ఆమే డెవరిది ?

పా:- అది దొరగారు కాపుర ముండేది.

రా:- ఈ తోటలోని రెండూ యెవరివి !

పా:- ఒకటి సెటిల్మెంటు ఆసుపత్రి. రెండోది డాక్టరుగా రుండేది.

రా:- ఈ సెటిల్మెంటు పెట్టి యెన్నాళ్లైంది ?

పా:- ఇప్పటికి షుమారు అయిదు సంవత్సరాలైంది. గవర్నరుగారూ, రాఘవేంద్రరావు పంతులుగారూ దీని విషయమై చాలా కృషి చేశారు. రక్షక సైన్యంలో చేరిన బొంబయి గవర్నరుగారు దీనికి పునాది. చాలా సెటిల్మెంట్లు రక్షక సైన్యంవారే [illegible] కట్టించుకొన్నారు. మా మిషన్ వారు కూడా చాలా శ్రమపడి

దీని మేనేజిమెంటు సంపాదించాడు. మా దొరగారి మాటంటే కలక్టరుగారు జవదాటరు.

రా:- మీ మిషనువారు శ్రమపడడానికి యిందులో వారి కేమి లాభం ?

పౌ:- వారికేమీ లాభం లేదు. ఇంకా వారే డబ్బు ఖర్చు పెడతారు. ప్రభునయిన యేసుక్రీస్తు యొక్క రాజ్యం స్థాపించడమే వారి యుద్దేశ్యం.

రా:- ఈ గుడిసెలలో యెన్ని కుటుంబా లుండవచ్చు ?

పౌ:- అయిదువందల కుటుంబా లుండవచ్చు. మొదట చాలా భాగం నిండిపోయింది. కొందరు యుద్ధంలో చేరితే వాండ్ల కుటుంబాలను వదిలివేశారు. కొందఱు జ్ఞానమతం పుచ్చుకొని మంచివాళ్లైతే దొరగారు శిఫారసుచేసి వదిలిపెట్టించారు. ఇప్పుడు మిగిలినవి గరిపోయిన గింజలు. కొరుకుడూ మింగుడూ కూడా పడవు. అదుగో దొరగారు వస్తున్నారు సలాం చెయ్యి.

రా:- సలామండి !

బ్రౌన్:- సలాం ! వచ్చినావా రామదాసూ ? నీవు చాలా తెలివిగలవాడవు. తప్పు మార్గంలో వున్నావు. ఇల్లు యెరుకున్నావా ? పౌలుగారు మీకు బంధువులు గాఁవాలె.

రా:- కుల చుట్టాలండి. మా కేమైనా పని దయచేయిస్తారా యివ్వాళ ?

బ్రౌన్:- ఏమైనా పని వున్నదా ?

పౌ:- రెడ్డిగారి కుంట తవ్వడం ప్రారంభం చెయ్యాలె. ఇంకొక చిన్న జట్టును పీండ్లకు జతచేస్తే వాబ్బడిగా తవ్వేసుకుంటారు. దొంగదాసరి పుల్లప్ప పనికి పొమ్మంటే పోలేదు. ఇంట్లోనే వున్నాడు. తమరు చెప్పి అతని కుటుంబాన్ని వీండ్లతో జత చేయించండి.

బ్రౌన్:- పిలుచుకొనిరా పుల్లప్పను ! అతడు యెప్పుడూ తొందర చేస్తూనే వుంటాడు.

పుల్లప్ప (వచ్చి) :- అయ్యా! ఎందుకో పిలిపించారట.

ఖాన్:- సలాం!

పు:- మాకు సలామెందుకు లెండి, చెప్పండి.

ఖాన్:- వీరూ మీరూ గలిసి రెడ్డిగారి కుంట తవ్వండి.

పు:- నే దవ్వను. లోకంలో యెక్కడ పట్టినా కుంట తవ్వకానికి గజానికి రెండణాల వంతున సాధారణంగా యిస్తున్నారు. పోలు కమీషన్ కొట్టి అణాకానీకి కుదిర్చాడు. అందులో మేము గజానికి కానీ కమీషన్ యియ్యాలె. ఈ పనివల్ల మాకు కడుపు నిండదు. పస్తైనా వుంటాంగాని నీళ్ళ కూలికి నేను పని చెయ్యను. తనకు కమీష నియ్యనన్నానని నన్ను కట్టపనికి పంపకుండా నిలిపివేశాడు.

పో:- ఇవన్నీ శుద్ధ అబద్ధాలు. ఇతడు రాత్రులు గుడిసె విడిచి బయటికి పోతున్నాడని నాకు అనుమానంవేసి కాపలా చేయిస్తున్నా. ఎటు అశాడక యీ పన్నాగం యెత్తాడు.

పు:- నీకు భాగం పంచిస్తే రాత్రులు పోవడం తప్పులేదు! నీ యిష్టంవచ్చినన్ని కావించు.

ఖాన్:- అయితే నీ వా పనికి పోనంటావు?

పు:- నే పోను. న్యాయం మీ రెందుకు విచారించరు?

ఖాన్:- ఈ బేరం నే దగ్గరవుండి యేర్పాటు చేసిందే.

పు:- పోలూ, రెడ్డీ ముందుగా మాట్లాడుకొని మీ దగ్గరకు వచ్చారా లేదా?

ఖాన్:- పని లేకపోతే మీరు కష్టపడతారని పోలు రెడ్డిని బలవంతపెట్టి పని కల్పించాడు.

పు:- అదంతా నటన. రెడ్డికి చేలో కుంటవసరం. తోటల కోసం వేవిలి వుంచాడు.

ఖాన్:- రామదాసూ! నీవు వెళ్ళు.

రా:- మేము కట్ట పొయ్యడానికి వెళ్ళుతాం. కాకపోయినా కుంటపని మా వాకల్లకలా కాదు.

బ్రాన్:- ఆరంభించి చేస్తుండండి. తొందరగా ముగించవలెనని నిలుకు లేదు.

రా:- అడుగులోనే హంసపాదా? రావడంతోనే పైపోటీ పోవడం నా కిష్టంలేదు.

పౌ:- పుల్లప్ప అందరి బుద్ధులూ చెడగొట్టుతున్నాడండీ.

పు:- ఆ రామదాసంత సత్యవంతులను దెచ్చి నీవు చెడగొట్టకుంటే చాలు. నీవు చేసే కేపుమారీ లన్నీ నేను చూస్తూనే వున్నా.

బ్రాన్:- నీ వెంతకాలంనుంచి యిక్కడ వున్నా మంచి బుద్ధి పట్టుబడలేదు.

పు:- పట్టుపడుతుంది. పోయిన దొర జ్ఞానస్నానం అని నీళ్ళలో ముంచి కొందరిని వదిలిపెట్టించాడు. వాళ్లు బైటికి పోయి సత్తుగా దోస్తున్నారు. కావాలంటే నాకూ మంచిబుద్ధి పట్టుపడేదే. యింకా వెరుస్తున్నా.

బ్రాన్:- రెడ్డిపని మిగలా వొప్పుకున్నందుకు పెద్దమనిషి చేత మాట రాకుండా కొద్దిగా నష్టమైనా పని పూర్తిచేయడం మంచిది.

పు:- రెడ్డి మహా పెద్దమనిషే. ఈ సెటిలుమెంటు దోచే దాంట్లో సగం సొమ్ము అతను కొంటాడు. యేదోకాస్త కుంటపని అడ్డం పెట్టుకొని పౌలుతో మాట్లాడడానికి వస్తుంటాడు. అతనికి బైట కుంటతవ్వేవాండ్లు దొరక్కకాదు. అతడింట్లో బంగారం తియ్యకుండా కరుగుతుంటారు. ఇప్పుడు వెళ్ళి సోదా చెయ్యండి, మొన్న నూతక్కిలో పోయిన నగలు కరుగుతుంటారో లేదో. ఇంతకుముందే పౌలుదగ్గిరనుంచి తీసుకొనిపోయినాడు.

బ్రాన్:- పోలీసులకు కబు రంపకూడదా?

పు:- కబు రెందుకు! ఒకడు దగ్గర వుండి కరిగిస్తుంటాడు. వాండ్లుమటుకు యీ పౌలును నమ్మతారా?

బ్రౌన్:- రామదాసును మధ్యాహ్నం నుంచి కట్టపనికి పంపు. నీవు బుద్ధిమంతుడువుగా వుంటే త్వరలో విడిచిపెట్టు మని సిఫారసు చేస్తా.

పు:- త్వరగా మతంలో గలువు. అదే బుద్ధంటే. నన్ను కూడా కట్టపనికి పంపించండి.

పౌ:- అక్కడివాండ్లనుకూడా చెడగొడతాడు.

బ్రౌన్:- ఈరోజు వీరిద్దరినీ కలిపి పంపు. రామదాసుకు పని ముట్లు లేవుగాఁవాలె. గడ్డపారా, సెలగపారా, తట్టలూ యిచ్చి దస్కతు పెట్టించుకో. వాటి ఖరీదు రూపాయిన్నర. రోజుకు అణా వంతున కూలిలో పట్టుకొంటాం.

పుల్లప్ప, తల్లీ, భార్యా రామదాసుగుడిసెదగ్గరకు వచ్చి వాండ్లను వెంటబెట్టుకొని బయలుదేరారు. రామదాసు గడ్డపార బుజాన బెట్టుకొని పనితో సమానమైనది యేదీ లేదంటూ బయలు దేరాడు. అతడి వుత్సాహంవల్ల జోతి సెలగపార దీసుకొని చిరు నవ్వుతో బయలుదేరింది. రామదాసు కూలికి పోతుంటే మాలక్ష్మి కళ్ళనీళ్ళు గుక్కుకొని తట్ట చేతబట్టుకొన్నది. రంగడు వుత్సా హంతో రెండోతట్ట నెత్తినబెట్టుకొని నాతో రండని అందరికంటే ముందు నడిచాడు. పనిచేసేచోటు గుడిసెలకు ఫర్లాంగుదూరంలో వున్నది. పౌలు వచ్చి కలుసుకున్నాడు.

౧౧

## చింత చచ్చినా పులుసు చావలేదు

కూలీలంతా అన్నాలు తిని పొద్దు వాటాలంగనే తిరిగీ పనికి ప్రారంభిస్తున్నారు. పౌలు రావడం చూచి కంట్రాక్టరు కుమారుడైన సోమసుందరం కట్టదగ్గరకు వచ్చాడు.

పౌ:- చిన్న కంట్రాక్టరుగారూ! ఈ రోజు ముగ్గురు కొత్త కూలీలను మీకు తెచ్చాను.

సోమ:- మీకు తెచ్చానంటే నాకు అర్థంకాలేదు. నా దాకా రానిచ్చేటట్టు కనపడ దంటున్నారే.

రామదాసూ, మాలక్ష్మి తెల్లబోయినారు.

పౌ:- మీ కెప్పుడూ సరసమే! మీ నాయనగారు వస్తారా యీవేళ?

సో:- రారు - నేను యీరాత్రి తాడేపల్లిలోనే వుంటా. లాభించేనా?

పౌ:- "వేగిరింప నెదియు విషమ మగును" అన్నాడు. చిన్నప్పుడు చదవలా?

సో:- "ఆలస్యా దమృతం విష"మని కూడా యింకొక డన్నాడు.

పౌ:- కనుకనే నడిమిదారిన పోతుండాల్లే. పుల్లప్పా? నీవు పోయి తవ్వు. వీళ్ళ ముగ్గురికీ కట్టకు దగ్గరగా ప్రతి పెట్టించు. నే కూడా సహాయం చేస్తా. కాయకష్టం చేస్తే ఆరోగ్యమట.

సో:- ఎందుకైనా మంచిదే. నీవు సాయపడి వాళ్ళకు పని తగ్గిస్తే వారు చేయకుండానే నేను కూలిస్తా.

పౌ:- ఇక్కడ ప్రతి ప్రారంభించండి. గడ్డపా రిటు తేండి చెపుతా.

సో:- పాత చుట్టాలా, కొత్త చుట్టాలేనా?

రా:- నే నిక్కడ సమీపంలో పెట్టుకోను. నలుగురూ తవ్వే చోటనే తవ్వుతా.

సో:- పౌలూ! నీ వప్పుడే బెదరగొట్టావు. నీకు యెక్కడ లేని ఆత్రం. ఈ ముసలాతడికి మొగకూలి పడదు. మూడణాలే బాగా పనిచేస్తే. వీ రేమాత్రం పనిచేస్తారో చూడాలె.

రా:- పరీక్షించి మా పనికి తగినట్టే యీయండి.

రామదాసు వెడిగెలగా ప్రతి పెట్టి బెడ్డలు విరవడం ప్రారంభించాడు. మాలక్ష్మి తట్టలోకి సెలగపారతో యెత్తింది. జోతి

తలమీద పమిటకొంగు చుట్ట చుట్టుకొని మోయడం ప్రారంభిం చింది. వొక్క గజం తవ్వారు. పొద్దున్న తిన్న వుఫుకూ బెడుకూ అరిగిపోయింది. చేతులు చచ్చుపడ్డవి. రామదాసు తవ్వుతుంటే నూటు దిగడంలేదు. జోతి తాను గడ్డపార తీసుకొని తట్ట తండ్రి కిచ్చింది. గబగబ నూట్లు వేసింది గాని తడవకు ఒకచోట పడు తున్నది. క్రమంగా అలవాటైంది. రెండు యిండెలు పెట్టి అర గజం తవ్వారు. జోతికి చేతులు మంటపుట్టినవి. వొళ్లు అలసి పోయింది. మాలక్ష్మి గడ్డపార తీసుకొని సెలగపార జోతి కిచ్చింది. ప్రతి యెక్కి దిగడంలో రామదాసుకు నడుం కలుక్కుమన్నది. తట్ట జోతి కిచ్చి కూర్చొని సెలగపారతో మట్టి యెత్తడం ప్రారం భించాడు. కొంచెం సేపటికి సెలగపార వీలుగాక దోసిడితో మట్టి యెత్తుతున్నాడు. ఆసాంతానికి 1 3/4 గజాల ప్రతి నిలవతవ్వారు. పుల్లప్ప కుటుంబం మూడుగజాలు తవ్వింది. రోజుకు మూడణాల కూలి ప్రకారం వొంటిపూటకు రామదాసు కుటుంబానికి నాలుగు అణాలన్నర రావలసి వున్నది. వాండ్లు చేసినపని సగమే.

సో:- అవసరమైనవాండ్లకు యిప్పుడే బట్వాడా చేస్తాను. రామదాసుకు క్రమంగా రావలసింది బేడాకానైనా పావలాఅర్ధణా యిచ్చివేస్తాను.

రా:- నా కక్కరలేదు. రావలసినంతే యియ్యండి.

సో:- చింత చచ్చినా పులుసు చావలేదు. కానీ వాలం టరీకింద పోతే బేడే రావలసింది.

రా:- వాలంటరు యిక్కడకూడా వున్నదా ?

సో:- మూడులోకాలా గుమాస్తాపేచీ వుండకతప్పదు.

పు:- వాలంటరు తగ్గిస్తే మీరు తీసుకోవద్దు. మేము తీసు కోకుండా వారం రోజులనుంచి తిరగబడి యీవత్తూ వసూలు చేసుకుంటున్నాం.

రా:- బీదకూటికి బిక్కదేవు డని యిందులో తిపిరీ యెందుకు ? ఆ కానీగూడా దయచెయ్యండి.

పో:- ఇచ్చివెయ్యి.

సో:- ఓ—పో. తక్కినవాండ్లు యిటు రండి. లెక్క ప్రకారం ముట్టిందా? రేపు ఆరువందల కూలీలకు పనిలేదు. వొక వందమందితో పని ముగించుకొంటా.

అంతా యిండ్లకు బయలుదేరారు. సెటిల్‌మెంటుకు వచ్చే వరకు యేను కూకుతున్నది. రామదాసుకు నడుముకలక బల్లమై చాప వేసుకొని నట్టింట పడుకున్నాడు. జోతికి చేతులు బొబ్బలు పొక్కి వొళ్లు పులికతగిలింది. మాలచ్మి వెచ్చం కొనడానికి షాపుకు పోయింది.

వర్తకుడు:- ఏమి మహాలచ్మి! నీ కూతురిని మా అన్నకు ఇయ్యరాదూ? అంతకంటె యెక్కువ మనువు తెస్తావా?

మా:- మీ అన్న యెవరు?

వర్త:- పోలు మా చిన్నాయన కొడుకు. అతనికి బాగా సంపాదన వున్నది. ప్రతిదాంట్లోనూ రసిమి బాగా తీస్తాడు. యీ షాపుకూడా అతనిదే. నామకా నా పేరుతో వున్నదిగాని, నా దెంత-వొక పీసపాలు!

మా:- యెవరికి వ్రాసిపెట్టివుంటే వాండ్లకు అవుతుంది. ఇప్పటి మా స్థితి పెళ్ళిసంబరం అనుభవించేటట్టుగా లేదు. ఒక దీపపుబుడ్డీనీ, దానితో నూనె యియ్యండి.

వ:- వత్తితోకూడా వొకఅణా. ఇంకేమి గావాలె?

మా:- ఈ అణాకు వుప్పూ, మిరపకాయా, చింతపండూ, కట్టెలూ యియ్యి.

వ:- అన్నీ టోకుబేరాలు మొదలుపెట్టావు.

మా:- నేనూ అన్ని బేరాలూ చేసినదానినే! ఇప్పటికి యిట్లా అయింది.

మాలచ్మి యింటికి వచ్చి కృష్ణకుపోయి రెండు కడవలు నీళ్లు తెచ్చి మిగిలివున్న బియ్యం పొయిమీదబెట్టి రామదాసుకు నడుములు పిసుకుతూ కూర్చున్నది.

రా:- అప్పుడు యింటిదగ్గర యెంత అలమటిస్తున్నాడో !

మ్హా:- ఇప్పటికి పదిపన్నెండేండ్లనుంచి నా చేతిమీదుగా అన్నం పెట్టా. ఈ కాలానికి యెడమైనాడు. అన్న మమురు తున్నదో లేనేలేదో.

రా:- ఆ పెట్టినవాండ్లు వాణ్ణికూడా కలిపైనా పెట్టక పోయిరి. యే కలో తాగుతూ అంతా వొకచోటనే పడివుందుము. అమ్మా ! నిద్రపోతున్నావా ?

మా:- వొళ్ళు అలిసి పడుకున్నది. జోతీ ! కాస్త పుల్లలు యెగసన దొయ్యమ్మా !

జో:- నే లేవలేనే వొళ్ళంతా విరగ్గొట్టినట్టు నొప్పులుగా వున్నది. వొళ్ళు వెచ్చగా వున్నదేమో చూడు.

రా:- బడలికచేత, వొక కుండెడు నీళ్లు కాచు. మసిలేనీళ్లు స్నానం చేస్తే తగ్గుతుంది.

మా:- పుల్లలేవీ ? వొక కానీవి తెస్తే అన్నం వుడికేందుకే అస్తూ బిస్తూగా వున్నవి.

రా:- అమ్మా ! జోతీ ! నే లేచి రాలేనుగాని నా పక్కలో వచ్చి పడుకో. తమ్ముడేమి చేస్తున్నాడు ?

జో:- తమ్ముడు నిద్రపోతున్నాడు.

రా:- అయ్యో ! అన్నం దినకుండా నిద్రపోతున్నాడా ? పక్కేమన్నా వేశావా ?

జో:- అమ్మ కాళ్లు తుడుకోక సగం పక్క వేసి సగం కప్పా. తల నాదుగా వున్నదని పడుకున్నాడు.

మా:- ఈ నీళ్ళు పళ్ళే వాడికి. రొంప పట్టింది. మధ్యా హ్నంనుంచి కుస్కూ కుస్కూ మంటున్నాడు.

రా:- ఇట్లా నా పొట్ట నానుకొని కూర్చో—(తలమీద చెయ్యిపెట్టి నిమురుతూ) మా పిచ్చితల్లి కెన్ని కష్టాలు వచ్చిన వమ్మా !

జో:- (తండ్రి మొగంలో మొగంపెట్టి యేడ్చి) అయ్యా! నా కష్టాలొక లెక్కా? వేళపట్టున యింత అన్నం తిని కృష్ణా రామా అనుకుంటూ పడుకోవలసిన రోజుల్లో నీ కీ స్థితి తటస్థించింది. ఎందుకు మే మింతమందిమి పుట్టి? అంతా పండితులమే పెద్దతనంలో అక్కరకు రానివాళ్ళం.

రా:- అమ్మా! నా గర్భవాసాన పుట్టబట్టి మీ కిన్ని తిప్పలు వచ్చినవి. మీ రెంత ప్రయోజకులైనా, నాది ఆఖరు రోజులలో నిర్ధన జాతకం.

మా:- అందరికీ వొక్కర్రాత వుండబట్టే అందరు దరిద్రులమూ వొక్కచోట చేరాం. ఇంత మందిలో వొక్కరిది మంచిగీత కాగూడదూ!

రా:- ఈ భాగ్యాలకూ దరిద్రాలకూ యేమిగాని ధర్మం మనం తప్పకుండా వుండవలె. "స్వధర్మే నిధనం శ్రేయః" అని భగవంతుడు చెప్పాడు. మానం పోతే ప్రాణం యెందుకు?

జో:- నీ గర్భవాసాన జన్మించిన వాండ్లకు ధర్మచ్యుతి యెప్పుడూ వుండదు. ఆ సందేహం నీవు పెట్టుకోవద్దు.

అమ్మా! నేను నడుము పిసుకుతా, నీవు పొయిదగ్గరకుపో.

రా:- అన్నంలో కేమైనా వున్నదా?

మా:- వీధిలో రోలున్నది. చింతపండు కారం నూరుకొని వస్తా.

రా:- నీళ్ళ జలుబు చేస్తవంటున్నావుగా. కారములో వెల్లిపాయ వేసి నూరు. వున్నదా?

మా:- ఆ. గంజి వంచాగాని వొక్కరవ్వ దాళిమంట తగ్గించు. ఇగిటా రేలోగా నే వస్తా.

జో:- అయ్యా—వొక్క కారంతో నీ వన్నం యెట్లా తింటావే?

రా:- పిచ్చిదానా! ఆ కారం కూడా లేనివాండ్లు యీ సెటిల్మెంటులో యెందరున్నారో విచారించు. గంజిలోకి వుప్పుంటే ఘనం అనుకునేవాండ్లు అనేకమంది వున్నారు. మనం యీ సెటిల్మెంటులో వుండే చాలామంది కంటె యిప్పటికి మంచి స్థితిలోనే వున్నాం. మనకు నిన్నటి బియ్యం వుండబట్టి సరిపోయింది కాని అన్నిటికీ ఆ బేడే అయితే గంజి తాగమా?

మా:- (కారం నూరుకొని వచ్చి) రేపు పనిలేదని జనం అంతా లబ్బట్లాడుతున్నారు. మన కేమైనా పని దొరికేనా?

జో:- దొరికితే నీవు చేస్తావా? అయ్య అడ్డం పడ్డాడుగదా!

రా:- తెల్లవారేవరకు అన్ని నొప్పులూ సర్దుకుంటవి. నీ చేతులు చూతాం దీపం తీసుకొనిరా?

జో:- ఇప్పుడు నా చేతు లెందుకులే.

రా:- ఎందుకులే అంటున్నావు, పెద్ద బొబ్బలు పోయినవా యేమి?

మా:- (దీపం దెచ్చి) వోసి నీ కడుపుడకా! ఎంత బొబ్బలు పోయినవే! రేపు నీవు చేతులు కదల్చగలవా?

జో:- ఇంత మాత్రానికేనా? అంతగా అయితే తట్టలు మోస్తా.

రా:- అంతా అన్నానికి వొక్కమాటే లేవండి. బాబును లేపు. చన్నీళ్ళుపెట్టి కండ్లు తడుపు. కారపు ముద్దలు నాలుగు తింటే జలుబు హరిస్తుంది.

మాలక్ష్మి అందరికీ అన్నం వడ్డించింది. పొద్దుననంగా అన్నం దినడంచేత అందరికీ ఆకలి కరకర లాడుతున్నది. వడ్డించేదే ఆలస్యంగా అందరూ భోజనం చేశారు. జోతి రోజుతున్నది.

రా:- పొద్దుగూనా కారంఅన్నం తింటే కడుపులో మంట పుడుతుంది. చివరకు కాస్తన్నం వుంచుకొని నీళ్ళలో పిసికి తాగండి. దానితో చల్లపడుతుంది. కొంచెం వుప్పు వేసుకోవాలె. వున్నదా?

మా:- తెచ్చింది కాస్తా పచ్చట్లోనే వేశా.

రా:- ఉప్పు లేకపోతే తియ్యంగా వుంటుంది. తాగండి.

అంతా సర్కారువా రిచ్చిన చాపలు వేసుకొని పడు కొన్నారు. మాలక్ష్మి మాట్లాడుతూనే నిద్రపోయింది. అందరూ నిద్రానందంలో మునిగి తేలుతున్నారు.

## ౧౨
## సెటిల్‌మెంట్లు క్రీస్తుదేవాలయాలు

జ్యోతి బడలికచేత పక్కవాల్చంగనే కనుమొరిగినా కొంత విశ్రాంతి కల్గినతరువాత మెళుకువ వచ్చింది. పగటిసంగతు లన్నీ జ్ఞాపకానికి వచ్చి మనస్సు చింతాసముద్రంలో మునిగిపోయింది. కంట్రాక్టరూ పౌలూ జరిగించిన సంభాషణ మనస్సుకు దుర్భరమై తోచింది. ముం దింకా యేమి దుర్మార్గాలకు తలపడతారో నని భయం గలిగింది. తా నేదైనా సాహసకార్యం చేసుకుంటే వృద్ధాప్యములో ముసలివాండ్లు నిరాధారు లవుతారేమోనని సంకోచించింది. తన కష్టపుజన్మ వీండ్ల దుష్టతలంపులకు అవకాశ మిచ్చింది గదా అని ఖేదపడ్డది. ముసలివాండ్లు ప్రస్తుతం పడేకష్టాలకు తానే కారకురాలని తపించింది. ఇంకా నావల్ల వీండ్లకు ఎన్ని కష్టాలు రాబోతున్నవో! తా నొక్క-నిమిషం కన్ను మూసుకుంటే ముసలి వాండ్ల బాధలన్నీ విరగడై సుఖపడతారని నిశ్చయపరుచుకున్నది. 'నేను అపకీర్తి తెస్తానేమో అని అయ్యకు అనుమానంకూడా తోచింది. యెందుకీ జన్మ? ఇక సందేహానికే అవకాశం లేదు. వీండ్ల కష్టాలు అంతమొందింతా' మని దృఢం చేసుకొని లేచి కూర్చున్నది. రామదాసు త్రుళ్ళిపడి లేచాడు. జోతి నేత్రాలు జ్యోతులవలె వెలుగుతున్నవి. మొఖం తీండ్రిస్తున్నది. సర్వాంగాలూ బిగుసుకొనిపోయినవి. పమిట కంఠానికి చుట్టుకొంటున్నది.

రా:- అమ్మా యేమే! అఘాయత్యానికి తలపడ్డావు?

అని నడుమునొప్పికూడా మరిచి లేచి పోయిపట్టుకున్నాడు. ఇంతలోకే మాలక్ష్మి లేచి గడగడలాడుతూ దగ్గరకు వచ్చింది.

మా:- యేమైనా పీడకల వచ్చిందేమో!

రా:- లేదు, యదార్థం.

జో:- లోకానికి బాధకరమైన యీ జీవితాన్ని అంతం చేస్తా.

రా:- వృద్ధాప్యంలో యీ పక్షుల కాధారమై కడతేరుస్తా వనుకుంటిమిగదే, అమ్మా! అక్కరకువచ్చిన యిద్దరుపిల్లలూ చెరోకదారీ అయిపోయిరి.

ఈ మాటలు జోతిహృదయాగ్నికి వారుణాస్త్రమై తాకినవి.

జో:- ఈ కష్టా లన్నీ మీకునావల్లనే వచ్చినవి. ఇంకా ముందు చాలా వస్తవి.

రా:- పిచ్చితల్లీ! కష్టాలు యెవళ్ళ కర్మచేత వాండ్లకు వస్తవమ్మా! ఈ మార్గాన మమ్ములను పక్షులను చేయడం తప్ప మా కష్టాలు పోగొట్టగలవా! ఈ సాహసానికి నీ కంత కారణ మేమి వచ్చినది?

జో:- అందరికీ గౌరవభంగమే.

రా:- నేను కుటుంబకర్తను. నీ గౌరవాన్ని కాపాడవలసిన భారం నామీద వున్నది. నా గొంతులో వూపి రున్నంతవరకు నీ కగౌరవం కలుగదు. నేను నీ గౌరవం కాపాడలేని వ్యర్థుడ నైతే నీవు ఆత్మహత్య చేసుకోవచ్చు. నీ కగౌరవం కలగడానికి ముందు నా శిరసు నేలబడవలె. ఆ వరస నీవు తప్పించగూడదు. తప్పిస్తే నా కపకీర్తి. నేను అప్రయోజకుడ నని నీవు తలచి ముందుగా సాహసం చేస్తే నీ మర్యాద కాపాడలేని నా జీవితం వ్యర్థ మని నీవెంటనే వచ్చితీరుతా.

మా:- నీవు పోతే మే మెందుకే అమ్మా?

జో:- అయ్యో! నన్ను వదిలిపెట్టవే!

రా:- నేను నీ గౌరవం కాపాడదగినస్థితిలో వుండగా నా ఘటం నేల బడందీ సాహసకార్యం చేసుకోనని నీవు వాగ్దత్త మియ్యి.

జో:- ఇచ్చా.

రా:- ఈ జరుగుతున్న 'చర్యలవల్ల నాకు తలగొట్టినట్టుగా లే దనుకున్నావా? రేపు మనవూరినుంచి యెవరైనా రానేవస్తారు. నాయుడిగారి సలహా తీసుకొని తర్వాతపని జరిగింతాం.

జో:- అబ్బా! మిమ్ముల నెంత ఆయాసపెట్టానర్రా. పడుకోండి, నేనూ పడుకుంటా.

మా:- మా కాయాస మేముంది? ఇప్పటి కదృష్టవంతులమే.

అందరూ పడుకున్నారు. జోతి అప్పాదాసువిగ్రహాన్ని మననంచేసి ఆనందమయకోశములో నిలిపి సుషుప్తి చెందింది. తెల్లవారేవరకూ లేవలేదు. తెల్లవార్లూ యెవళ్లో గుడిసెవాకిటి దగ్గరకు వచ్చి తొంగిచూచి పోతున్నారు. రెండుసార్లు పిలిచారుగూడాను. తేపా లేపడంచేత నిద్రచెడి మళ్ళీ నిద్రపట్టలేదు. మాలక్ష్మి మసులుతూనే పడుకున్నది. తెల్లవారుజామును కాస్త కూరుకుపట్టింది. మళ్ళీ వొకడు వచ్చి పిలిచాడు. నిద్రమబ్బున రామదాసు పలకలేదు. చేలాంతరు వెలుతురు గదిలోకి ప్రసరించింది. "యెవ రింట్లో?", అని కేక వినబడ్డది. రామదాసు లేచి కండ్లు నలుచుకుంటూ బైటికి వచ్చాడు.

రా:- యెవరయ్యా తమరు?

ఒకడు:- వారు యినస్పెక్టరుగారు. నేను ఫారా జవానును.

రా:- తెల్లవార్లూ "ఆలీజ్ హెల్లు"ని కేక వేస్తూవుండేవారు తమరేనా?

జ:- ఫారా మారుతుంటుంది.

యి:- ముసలివాడా! యింగ్లీషు చదువుకున్నావా?

రా:- అయ్యా! లేదండీ.

యి:- ఆలీజు హెల్లంటే యేమిటి?

రా:- నాకు తెలియదండి.

యి:- అంతా నరక మని అర్థం.

రా:- సెటిల్మెంటువర కేనండి నరకం.

యి:- "ఆలీజు వెల్లం" టాము. అంతా క్షేమమని దాని కర్థం.

రా:- ఆత్మార్థానికి సరిపోయిందండి. స్వర్గనరకాలు రెండూ తుచ్ఛములే. రెండూ అస్థిరములే గనుక పోక దర్జావే!

యి:- అసాధ్యుడవులా గున్నావే! పిలిస్తే పలకలేదేమి?

రా:- ఇప్పుడే కునికానండి. నిద్రమబ్బున తమ పిలుపు వినబడలేదు.

యి:- ఇప్పుడు నిద్రపట్టడమేమి? తెల్లవార్లూ యెక్కడి కైనా పోయివచ్చావా?

రా:- తమ సెలవు లేందీ యెట్లా పోతాం? తెల్లవార్లూ కాపలా చేస్తుంటిరికదా!

యి:- ఉన్నవాళ్ళకు కాపలాగాని, లేచిపోయినవాళ్ళకు యేమిచేస్తాం?

రా:- అందరికీ తమకే అండ. అయ్యా! మా కేమైనా పనిచిక్కునా?

యి:- పౌలుగారిని ఆశ్రయిస్తే అన్ని పనులూ మీవే. లేక పోతే యేవీ గావు.

రా:- అంతే నంటాడు తమరు పెద్ద సరదార్లుగదా! న్యాయపాలనం చెయ్యలేరూ?

జ:- అప్పుడే సాడీలు ప్రారంభించావూ?

యి:- దీంట్లో చాడీ యేముందోయ్? నే నేమీ చెయ్య లేను. మేము నోరెత్తితే దొర నొక్కుతాడు. గనుక అంతా పోక

దారిన పోతున్నాం. పౌలు నీ కల్లు డౌతా డంటున్నారే. ఇక నీ కేమి కొదవ?

రా:- అటువంటి దురాశలు అతనిని పెట్టుకోవద్దని చెప్పండి. అందని పండ్లకు యెందుకు అర్రులు చాచడం? తీపు చేటు.

యి:- కుక్కాకి గుండ్రాతితో తీర్చావే. మహా ముసుస్తున్నాడులే రెండురోజులనుంచి. జవానూ! చెప్పవోయ్! అతడితోటి. అక్కడికి బులుపు అణుగుతుంది.

పోలీసులు వెళ్ళారు. రామదాసు బహిర్భూమికి బయలుదేరుతున్నాడు. పుల్లప్ప వాకిట్లోకి యెదురుగా వచ్చి,

పు:- అయ్యా! దణ్ణమండి.

రా:- రామార్పణం. యేమి, పొద్దున్నే వచ్చావు పుల్లయ్యా!

పు:- పౌలుగాడు చేసిన మోసం చూశారా? మీకూ మాకూ కట్టపని లేకుండా చేశాడు. కావలిస్తే కుంటపనికి పోవాలట. లేకపోతే కొలనుకొండ రాళ్లు కొట్టబొమ్మన్నాడు. దాంట్లో లావైన మొనగాడికే పావలా కూలి గిట్టదు.

రా:- కొండదగ్గిర చేసే పనేమిటి?

పు:- నేల తవ్వి గోడలకు రాళ్లు దియ్యాలె. కంకరనేల గడ్డపారకు మారు మసులుతుంది. లేకపోతే ముక్క-రాయి గొట్టాలె. మీకు సుత్తె లున్నవా?

రా:- ఈ రెంట్లో యేది సులువు?

పు:- కాస్త ముక్క-రాతిపనే నయం.

రా:- ముక్క-రాతిలో కూలి యేమాత్రం గిట్టేను?

పు:- మీా రేమి కొట్టగలరు? పొద్దాకా రెక్కలు విరుచుకుంటే మా ముగ్గురికి అర్ధరూపాయి గిట్టేది. మీా ముగ్గురుకీ అరణాలు పడితే మంచిరేటే.

రా:- అన్నట్టు మాకు సుత్తెలు లేవుగా.

పు:- మా ముసలిది యివ్వాళ లేవలే. మే మిద్దరమూ రాళ్ళే తీస్తాం. కావలసివస్తేంటే మా మూడుసుత్తెలూ తీసుకోండి.

రా:- పిల్లకు చేతులు బొబ్బలు పోయినవి. సుత్తె పట్ట లేదు. ఇక మేమిద్దరమే తంటాలు పడాలె. పుల్లయ్యా! పది రూపాయల వస్తువున్నది మాదగ్గర. అది పోకడపెట్టే ప్రయత్నం చేస్తావా?

పు:- అమ్ముకొని యెన్నాళ్లు తింటావు? ఏదో వొకదారి చూసుకోవాలెగాని.

రా:- ప్రస్తుతం యేమిచెయ్యను? ఇక్కడి స్థితిగతులకు పనపడితే తరువాత ఆలోచించుకుందాం. అదిగాక మావాండ్లు యీవేళ రావాలె. సామాను బండి వస్తుంది. నెలసరిన పైకం గూడా పంపే యేర్పాటు జరుగుతున్నది.

పు:- నీ నగ నా దగ్గెర కుదువపెట్టు. నాలుగు రూపాయ లిప్పిస్తా. పైకం రాంగనే విడిపించుకోందువుగాని.

రా:- ఇది మా పూర్వార్జితపు వుంగరం. శౌరీ యెత్తు వుంటుంది. దీనిమీద నీ యిష్టం వచ్చినంత యియ్యి.

పు:- మీరు బయటికి పోయి వచ్చేవరకు పైకం తెస్తా పదండి.

రా:- నే నీ కృష్ణలో స్నానం చేసి రావచ్చునా?

పు:- త్వరగా రావాలె. బోధకు అందుకోకపోతే మాట వస్తుంది.

రా:- క్రీస్తు బోధగూడా జరుగుతుందా యేమి?

పు:- రోజూ మందు పోసినట్టు పోస్తారు. నే నెగబెట్టదలుచుకొన్నా, మీ రేమంటారు?

రా:- నీవు పైకం తీసుకరా. మళ్ళీ వచ్చి మాట్లాడతా.

రామదాసు కృష్ణలో స్నానంచేసి యింటికి వచ్చేవరకు పుల్లప్ప పైకం దీసికొనివచ్చి చేతిలో బెట్టాడు. రూపాయిల శబ్దం విని మాలక్ష్మి వాకిట్లోకి వచ్చింది.

రా:- ఇది రహస్యమా వెల్లడిపనేనా ?

పు:- ఇందులో యేమీ రహస్యం లేదు. మన స్వంతడబ్బు పెట్టుకొని మనం భోజనం చెయ్యవచ్చు.

రా:- కలక్టరుగారి వుత్తరువు కావాలె నంటునా్నరే !

పు:- పూర్వం ఆ రూలుండేది. ఇప్పుడు పైకం మనం తెప్పించుకొని భోజనం చెయ్యవచ్చు.

మా:- అట్లాగా ! యీ పైక మెక్కడిది ?

రా:- ఉంగరం పెట్టి తెప్పించా. మనం పైకం రాంగనే విడిపించుకొందాం.

మా:- అయ్యో ! ఉంగరం యెందుకు పెట్టావు? మీ అయ్య దాన్ని వదలవద్దని చెప్పెగదా. పుల్లయ్యా ! దానికి బదులు నా తీగె వుంచుకోలేవూ ? దానికంటే యెక్కువ ఖరీదే.

పు:- నా కేదైతే నేమి ? మీ కనువమానంగా వుంటే అదే యియ్యండి.

రంగడు:- అమ్మా ! నాకు బువ్వ !

మా:- జోతీ ! వీడికి అన్నం పెట్టమ్మా ! ఆనికే మనం తిందాం.

జోతి:- అయ్యో ! అన్నపు కుండేదీ ?

మా:- ఏమైంది ? నే నిక్కడనే పెట్టానే . రాత్రి. కుక్క యెత్తుకొని పోయినదేమో ?

పు:- కుక్కలు కాదులెండి. రాత్రి అన్నంలేక యెవంట్లో యెరుకలవాండ్లు యెత్తుకొనిపోయి వుంటారు. పోలీసులకు రిపోర్టు చేయండి.

రా:- ఛెశ్! కడుపాత్రాన యెవరో కక్కుర్తి పడ్డారు. వాడే చెడ్డాడులే. జోతీ! పట్టె అన్నం కూడా లేనివాండ్లున్నారని తెలిసిందా?

మా:- ఒక రాత్రివేళ కడుపు మండింది గాఁవాలె, వచ్చి చొరబడ్డారు.

పు:- బియ్యంగాని అన్నంగాని యేమీ నిలవవుంచవద్దు. యేపూట కాపూట తెచ్చుకోండి. మాబోటి వాండ్ల యిండ్లలోకి రావడానికి భయపడతారు. మీరు నిద్దరపోతున్నారు గాఁవాలె. అందినంతవరకు వొడుపుకొని చక్కా పోయినారు. నయమే మెళ్ళో చెయ్యి పెట్టలే!

రా:- పదిరూపాయిలు తెచ్చుకొన్నా గుండె నిమ్మళంగా జీవించే ఆస్కారం లేదను!

పు:- అదుగో గంట కొడుతున్నారు. బంగాళాదగ్గరకు బోధకు పదండి.

రా:- యెవరు బోధించేది?

పు:- దొర యింగ్లీషులో చెపితే పాలు చేతులు తిప్పుకుంటూ తెలుగున చెపుతాడు.

జోతి:- నే రాను. బియ్యం దెచ్చి అన్నం వండుతా.

పు:- బోధయ్యేవరకూ షాపు తియ్యరు.

మా:- అన్నం తినందీ పనికెట్లా పోతాం?

రా:- ఇవ్వాళిటికి పట్టిదే! బండి యీపూట వస్తే మధ్యాహ్నం నుంచి పనికి పోదాం.

పు:- మధ్యాహ్నం పోలీసులు కొండదగ్గరకు తీసుకొని పోరు. అది దూరం.

రా:- అయితే రెండుపూటలా సెలవే! బోధకు పోదాం పదండి.

జోతి:- నే రాను. అబ్బాయీ, నేనూ యింటిదగ్గర వుంటాం.

పు:- నే నడిగినమాట యేమిచేశారు? రేపటినుంచీ నే పొదలుచుకోలేదు.

రా:- అక్కడ సందర్భం యీవాళ చూచివత్తాం. తక్కిన వాండ్లతో కూడా హెచ్చరించు, పోమనేవాండ్లు వుంటారేమో!

పు:- మా దొంగదాసరిగూడెం యీవత్తా నే వద్దంటే పిలిచిపోయేదే. యెరుకలవాండ్లది వేలంవెట్టి. యెటుదిరిగితే అటే. దొమ్మరులనూ, యేనాదులనూ, ద్వారపూడి పచ్చపువాండ్లనూ కనుక్కుంటా. ద్వారపూడివాండ్లు నిలవవచ్చు. వాండ్లకూ కంటుగానేవుంది. కలిచేటిలోకూడా వాండ్లు దొరను గొట్టారని కొందరిని యిక్కడికి దోశారు.

రా:- అక్కడ ఆరాగా రానివాండ్ల లెక్క తేలుస్తారా?

పు:- అదేమీ లేదు. కొంత జనంవస్తే చాలు. బొత్తిగా రాకపోతే పోలీసులను బంపి పిలిపిస్తారు.

రా:- పోలీసుల కేమి సంబంధం?

పు:- వాండ్లూ మన దొంగలేగదూ! మనలోనుంచి యేరి పోలీసువుద్యోగా లేర్పాటుచేశారు.

రా:- వాండ్లకు జీతమూ?

పు:- జీతం లేకేమి? నెలకు పదిహేను రూపాయి లిస్తారు. వీండ్లే కొందరు ముఠాలుగట్టి దోయిస్తారు.

రా:- వాండ్లంతా యిక్కడికి మనవలె వచ్చినవాండ్లేనా?

పు:- యాభైమంది పోలీసులలో నలభై యెనిమిదిమంది అటువంటివాండ్లే. రోజుకొకరిని పనిలోనుండి తొలిగిస్తుంటారు.

రా:- యెందుకూ?

పు:- వాండ్లూరుకుంటారా, గ్రంథసాంగులు? వాండ్లమీాద కాస్త అనుమానం కలగంగనే బుట్టకింద పెట్టిస్తారు. అదుగో రెండోగంట కొట్టారు, పదండి.

మా:- నేనూ రాను. వాడు చెపితే యేమిటి వినేది?

రా:- మనం పోదాము రా, పుల్లప్పా! తమాషా చూచి వత్తాం.

ఇద్దరూ వెళ్ళి జనంలో కూర్చున్నారు. జనమంతా మూడువందలమంది వుంటారు. బ్రౌన్సనుగారూ, భార్యా వచ్చి కుర్చీలమీాద కూర్చున్నారు. పక్కన పౌలు నిలువబడి యేసు రక్షకుడని కీర్తనపాడాడు. తరువాత బ్రౌన్సనుగారు లేచి ప్రసంగం యింగ్లీషులో చేస్తుంటే పౌలు తెనుగులోకి మార్చి చెప్పాడు. జనం అయిదునిమిషాలు విని తరువాత మాట్లాడుకోవడం ప్రారంభించారు. ఉపన్యాసం అయిన తరువాత పౌలు "మీాలో యెవరైనా యేసును స్వీకరించేవాం డ్లున్నారా?" అని అడిగాడు.

రా:- (లేచి) నేనేమైనా చెప్పవచ్చునా?

బ్రౌన్సన్:- ఇతర మతములను గురించి చెప్పగూడదు.

రా:- సందేహాలు అడగవచ్చునా?

బ్రౌన్:- అడగండి. త్వరగా ముగించవలె.

రా:- ఈ సెటిల్‌మెంటు గవర్నమెంటువారు పెట్టించినది గదా, మేమంతా హిందువులం. మమ్ములను యిక్కడికి నిర్బంధంగా తెచ్చివుంచి క్రైస్తవమతం మాకు బోధించడం క్రమమా? హిందువులకు హిందూమతం బోధించడం న్యాయంగాదా?

బ్రౌన్:- మీా హిందువులను తమమతం బోధించకుండా యెవరు వద్దన్నారు?

రా:- నే జెప్పుతానంటే వొద్దంటిరే!

బ్రౌన్:- వీండ్లంతా హిందువులా? హిందూమతం వీండ్లకేమాత్రం దెలుసు?

రా:- మీ దేశంలో కూలీలకు క్రైస్తవమతం యేమాత్రం తెలుసు? పెద్దవాండ్లకే అంతంతమాత్రమే!

బ్రౌన్:- మా కూలీలలో క్రీస్తువుపేరు విననివాండ్లరుదు.

రా:- ఈ కూర్చున్న మాల, మాదిగ, యెరుకల యేనాదులలో రామకృష్ణులకు సంబంధించి పేర్లు యెన్నివందల కున్నవో కనుక్కోండి. వీండ్లలో శిఖలేనివాండ్లెవరైనా వున్నారా?

బ్రౌన్:- మీరు మాబోధ విననలసిందని సర్కారువారి బలవంతం లేదు. ఇష్టం వున్నవాండ్లే వినవచ్చు.

రా:- అట్లయితే నా ఆక్షేపణ లేదు. రేపటినుంచీ వినదల్చు కున్నవాండ్లకు హిందూమతం నేను బోధిస్తాను. మీకుకూడా యిష్టంవుంటే వినవచ్చు.

భార్య:- దొరగారు—ప్రశ్న లడిగితే —జవాబులు— చెప్పగలవా?

రా:- వారికి ధైర్యంవుంటే అడగమనండి!

వు:- క్రీస్తుమతం వినడానికి యిష్టం లేనివాండ్లు యిక్కడికి రానవసరంలేదట. అటువంటివాండ్లు లేచిపదండి.

జనమంతా లేచి కేకలువేస్తూ అందరూ తమ గుడిసెలకు వెళ్ళిపోయారు.

బ్రౌన్:- రామదాసును యిక్కడికి తీసుకొనిరావడం తప్పయిందే.

పౌ:- ఇత డెక్కడున్నా తప్పే. పుల్లప్ప వొకడు యితనికి తోడైనాడు. గోల మొదలుపెట్టారు.

బ్రౌన్:- నిన్న తేలికయిన పని యియ్యడం మన పొరపాటు.

పౌ:- ఈరోజు మట్టిపనికి యితరులను పొమ్మన్నాను. రామదాసూ, పుల్లప్పా కుంటపనికో, రాళ్ళుకొట్టడానికో పోవలసి వుంటుంది.

బ్రౌన్:- సరే పంపు. దానితో అన్నీ అణుగుతవి. ఇతనికి డబ్బిచ్చేవాండ్లెవరైనా వున్నారా? అన్ని సంగతులూ ఆలోచించి తగినమార్గం వెతుకు. ఫుల్లప్పకూడా మనకు అడ్డమే వస్తున్నాడు.

పౌ:- అన్ని సంగతులూ యోచిస్తాను.

బ్రౌన్:- అతనికూతురు విషయం యేమైంది? జతపడితే అన్నిచిక్కులూ వదులును. ప్రయత్నం చేయరాదా?

పౌ:- సులభంగా వంగేటట్టు లేదు. యేదో బెట్టుసూత్రం ఆలోచిస్తేనే కాని తేలదు.

బ్రౌన్:- పో, యీవేళకు! యేసంగతీ ఆలోచించు.

పౌలు గుడిసెదగ్గరకు బోయి నవ్వుమొగంతో,

పౌ:- మామగారూ! మతం అంటే మీకెంత పట్టుదలండీ! మీకున్నంత పట్టుదల నాకుంటే బాగుండు ననిపిస్తుంది. భోజనం అయింబా?

రా:- వంట అవుతున్నది.

పౌ:- పనికి వేళకందలేరె. జనం బయలుదేరుతున్నారు. రాత్రే వంట చేయించకపోయినారా?

రా:- అన్నం మిగిలితే రాత్రి వస్తున్నవాండ్ల కిచ్చివేశాం. అదిగాక రాత్రి అన్నం అక్కడికి కట్టుకొనిపోయేటందుకు బాగుండదు. రేపటినుంచీ పెందరాళే వంట చేసుకుంటాం. ప్రార్థనకు రానవసరం లేదుగనుక భోజనం త్వరగానే కావచ్చు.

పౌ:- ప్రార్థనసంగతి తమతో తరువాత మనవిచేస్తా. కాని పనికి బోవడం విషయంలో యేమాలోచించారు?

రా:- ఈ పూట అందుకోలేను మధ్యాహ్నానికి వస్తా.

పౌ:- మిమ్ములను తీసుకొనిపోవడానికి జవానుండడు. కొలనుకొండ రాతిపనికి పోవాలే. యెంతప్రయత్నం చేసినా మట్టి

పని మీకు యేర్పాటు చెయ్యడానికి వీలుపడ్డది కాదు. ప్రతిదానికీ అంత పట్టుదలెందుకు ? కుంటపనెత్తుకోండి.

రా:- నేను నలుగురుపోయే దారిన పోవలసినవాడిని గాని కేటించి పనిచేయడం నావల్లగాదు. రాతిపనికే పోతా.

పౌ:- రాతిపనికి మధ్యాహ్నంనుంచీ పోవడానికి వీలుండదు.

రా:- లేకపోతే పోనియ్యండి.

పౌ:- మరి మీకు భోజనం ?

రా:- దేవుడే వున్నాడు.

పౌ:- దేవుడు అన్నం తెచ్చిపెడతాడా ?

రా:- నమ్మితే తప్పకుండా పెడతాడు. కాకపోతే "దేవుడా! ప్రతిరోజూ మాకు రొట్టె పెట్టు!" అని మీరు ప్రొద్దున యెందుకు ప్రార్థించారు ?

పౌ:- మామగారూ ! యెప్పుడూ పెడసరంగానే మాట్లాడుతారు గదా!

రా:- ఈ కాసేపటిలో మామగారూ అని రెండు మాట్లన్నారు. మూడవమాటంటే తగినశాస్తి చేస్తా!

పౌ:- (తెల్లబోయి)—అబ్బా! మీది యెంతకఠినవాక్కండీ! దొరగారిమీంది కోపం నామీందికి దొర్లింది. మీరంత తీక్షణంగా మాట్లాడితే నేను సహించలేను.

రా:- ఈ నాటకాలన్నీ నాకు తెలుసు. కాని మీరు నాతో మర్యాదగా మాట్లాడండి. మళ్ళీ యింకోకమాటు నాచేత చెప్పించుకోవద్దు.

పౌ:- ఏ దుడైనా రే! మీపని సంగతడగ వచ్చునా? పనికి పోయే యేర్పాటేమి ?

రా:- దానికి జవాబు అదివరకే చెప్పా. వంకపెట్టుకొని నాతో మాట్లాడవద్దు.

పా:- ఈ సంజాయిషీ అంతా దొరగారికి నే జెప్పాలె. ఆయన నన్ను వేధిస్తాడు.

రా:- భోజనం లేకపోతే వారేర్పాటు చేస్తారా?

పా:- యేదైనా పని చూపిస్తారు.

రా:- రాత్రి వస్తున్నవాండ్లందరికీ ఆయన యేమిపని చూపించాడు?

పా:- పని చేయకపోతే మేమేమి చేస్తాం?

రా:- బయట యిచ్చేకూలి యిప్పిస్తారా? పొద్దుగూకులూ పని చేసినా వొచ్చే కూలి వొంటిపూట భోజనానికే చాలదు. అర్ధాన్నంతో యెంతకాలం పనిచేస్తారు?

పా:- డబ్బు వారి చేతినుంచి పెట్టమంటారా?

రా:- కడుపునిండే కూలి యిప్పించలేనివాండ్లు వీండ్లనంద రినీ యెందుకు పోగుచేశారు?

పా:- ఊళ్ళో దొంగలు వొస్తుంటే యిక్కడ బెట్టారు.

రా:- ఇక్కడ మీరు చేయిస్తున్న దేమిటి? మీ దొరగారు 'వీండ్లందరికీ భోజనం యెట్లా జరుగుతున్నద'ని మిమ్ముల నడిగితే 'చేతనైనవాండ్లు కన్నాలువేసి బతుకుతున్నార'ని చెప్పండి.

పా:- అయితే మీ కీరోజు పనక్కరలేదా?

రా:- మధ్యాహ్నానికి అక్కరవుంది.

పా:- అట్లా వీలులేదు.

రా:- లేకపోతే పోనియ్యండి.

పా:- ఈ సంగతులే దొరగారితో చెపుతా.

రా:- నిరభ్యంతరంగా చెప్పవచ్చు. ఇంతకంటె యెక్కువ చెప్పవద్దు.

పా:- పాదరీ మీమీద యిదివరకే కోపంగా వున్నాడు.

రా:- ఎందుకో, వారి తాతతండ్రులను సంహరించానా?

పౌ:- యెందుకైనాగానీ, క్రోధాలు మరీ పెంచుకోవడం అవుతుంది. పెద్దవాండ్లతో జగడం పనికిరాదు.

రా:- ఇంత్కకంటే నన్నేమి చేస్తారు ? నేనూ చిగురువరకూ చూడదలుచుకొనే వున్నా.

పౌ:- మీరు పంగనామాలు పెట్టడానికి వీలులేదు. ఇవన్నీ నే నంటున్నా ననుకోండి.

రా:- యెవరన్నా యిబ్బందిలేదు. నేను పెట్టేతీరుతా !

ఇంతలో ఫుల్లప్ప వచ్చి,

ఫుల్లప్ప:- మా జనమంతా నామాలు బెట్టుకుంటారు. నామం దొరక్కపోతే యే తెల్లమట్టయినా రాచుకుంటారు.

పౌ:- ఇట్లా అల్లరిచేస్తే మీరే కష్టపడతారు.

ఫు:- మమ్మును కష్ట పెట్టి మీరు పూరాపడ్డప్పటికీ చూస్తాను.

పౌ:- కొడతావా ?

ఫు:- నీ వేమిచేస్తావు ?

పౌ:- న్యాయప్రకారం శిక్ష వేయిస్తాం.

ఫు:- నీవు చేసేపనులకు నేనూ అంతే చేయిస్తా. నీకంటె నేను యెక్కువ నేరాలు చేయడంలేదు.

రా:- మనకు దౌర్జన్యం వద్దు. న్యాయప్రకారం పోదాం.

పౌ:- సరే కానియ్యండి—

పౌలు వెళ్ళిపోయినాడు.

## ౧౩

### మత సమ్మెలు

రామదాసూ, ఫుల్లప్పా మాట్లాడుతూ గుడిసెదగ్గరకు వచ్చి నిలవబడ్డారు. వంట చేస్తున్న మహాలక్ష్మి వాకిట్లోకి వచ్చి,

మా:- పుల్లన్నా! షాపులో యేది కొనబోయినా పెట్టు ధరలుగా వున్నవి. ధరలు రెట్టింపు అయితే యెంతకాలం కొనగలం? వుండవల్లి పోయి కొనుక్కోకూడదా?

పు:- వల్లగాదు. ఆషాపు యీ పోలుగాడే పెట్టించాడు. దొరకు వాడు చెప్పినంత కద్దు. షాపువల్ల తనకు నష్టమనీ, తాను పెట్టడానికి యిష్టంలేదనీ నటించి షాపు పెట్టమని దొరచేత బలవంత పెట్టించుకున్నాడు. బయటివాళ్లెవరైనా పల్లెబేరానికి అనేకులు రావడానికి సిద్ధంగా వున్నారు. వాళ్లు దొంగలతో షరీకు అవుతారని దొరను భయపెట్టాడు. బయటివాళ్ళ నెవ్వరినీ యీ చాయల రానివ్వడు. 'మేమంతా వొక్కమాటు యేఆదివారమో పోయి కొనుక్కొంటాం, మాతో పోలీసులను పంప' మంటే అదీ వల్లగాదన్నాడు.

మా:- మాకు డబ్బు పంపే యేర్పాటు జరిగితే రొక్కం తీసుకునేదానికంటే సరుకే తెమ్మంటే బాగుండు.

పు:- అది మీరు వొక్కరే పెట్టుకుంటే నెగ్గలేరు. యెరుకల గూడెపువాళ్లు వొక్కరాత్రి దులుపుకొని చక్కాపోతారు. దాని కన్నికట్టుబాట్లు చేసుకోవాలె.

రా:- ఈ పోలీసు లంతా యేమౌతారు?

పు:- వాళ్లూ వుంటారు వొకమూల. దొంగలుపోయిన తరువాత వచ్చి అందరినీ అదలాయిస్తారు. అమావాస్య రోజులలో పెద్దలాట్లు వచ్చేచోట్ల బాతిసీచిక్కితే కొందరు పోలీసులుకూడా ఫారా ఇతర్లకు వొప్పజెప్పి దొంగతనం స్వయంగా నడిపిస్తారు.

రా:- దొంగ లంతా వాళ్ళ వెంటనే వుంటే యిక్కడ ఇంకా ఫారా యెందుకు?

పు:- ఆ సమయంలో బయటివాళ్ళు వచ్చి తనిఖీచేస్తే కుళ్లు అంతా బయటబడుతుంది.

రా:- దానికి అధికారులు పూనుకోవాలె.

పు:- అధికారులు న్యాయం చేయదలుచుకుంటే ఈ సెటిల్ మెంటు ఇట్లా యెందు కుంటుంది? దానికొక యెనగా డున్నాడు తాడేపల్లిలో. మునసబుతమ్ముడే రామిరెడ్డిని, బలే హాషుమీ దున్నాడు. దొంగలు బయటికి బోయేరోజున మనవల్ల బాతిసి కనుక్కొని రెండువందల జనంతో వచ్చి కమ్ముతాడట.

రా:- దొంగలు యేరోజు పోయేదీ మనకు దాఖలా యే ముంటుంది?

పు:- రాత్రి బయటికి పోయేరోజున వాండ్లు సాధారణంగా పగలు బయటికిపోరు. రహస్యాలోచనలుకూడా యెక్కువే అవుతవి. నాలుగురోజులనుంచి రామిరెడ్డి రాత్రి రెండుజాము లప్పుడు దొంగలు బయలుదేరిన సంగతి కనుక్కొని పోవడానికి మనిషిని పంపిస్తున్నాడు. నేను మాగుడిసె వెనుకవున్న కటకటాల దగ్గరకు పోయి చెప్పివస్తా.

రా:- ఇన్‌స్పెక్టరు ఇల్లు మీ ఇంటిదగ్గర కాదవటెనే! నీవు మాట్లాడడానికి వీలవుతుందా? ఆయన మంచివా డంటారు.

పు:- ఆయన వొక అగవంథం. మంచివా డని పేరు, యేమి మంచి? కామంచి. సమర్థత లేనిమంచితన మెందుకు? మంచివా డంటే వ్యర్థు డని అర్థం. పోలుగాడిని చూస్తే యీాయనకు భయం. చోరీసొత్తులో వాడు దయవచ్చి యిచ్చినంత తీసుకొని వూరు కుంటాడు.

రా:- అశక్తమూ, దుర్జనత్వమూ రెండూ వున్న వన్న మాట.

పు:- రేపు సమ్మెకట్టించడం నిశ్చయమేనా? మీారందరూ కలిసివస్తే సరే. లేకపోతే నేనైనా మానివేస్తా. మీారు మనమతం బోధిస్తారా? పొద్దున అక్కడ బోధసమయానికి యిక్కడ పోటీ మకాణం పెడదాం.

రా:- మన మెవ్వరం బోధకు పోకపోతే నిర్బంధించడానికి వీలులేదు. మతంలో మనం కలవకపోయినా వినేవాళ్ళయినా లేక పోతే యీ సెటిల్మెంటే తీసివేస్తారు. ఇవి సగం అందుకు బెట్టినవే!

పు:- బోధకు కాకపోతే పాదిరీలు సెటిల్మెంటు తీసివేస్తా రని అందరకూ బాగా బోధిస్తా. నలుగురినీ వొకరేవుకు తేవడానికి వేదన్నా వుచ్చిలి పుట్టించాలె. వీళ్ళంతా చెట్టుకొకరూ పుట్టకొకరూ పుట్టి వచ్చినవాండ్లు. వీళ్ళందరినీ ఒక రేవుకుదేవడం సామాన్యమా?

రా:- అవును బాగానే వున్నది. వెనుక భూము లిస్తామని మిమ్మును యిక్కడికి తీసుకొని వచ్చారుగదా, యెవరికైనా యిచ్చారా?

పు:- మంచివాళ్ళ కిస్తారట. మంచివాళ్ళంటే యుద్ధం లోకి పోయేవాళ్లూ, మతంలో కలిసేవాండ్లూను.

రా:- కొన్ని సెటిల్మెంట్లల్లో యితరులకుకూడా యిచ్చా రటే?

పు:- దాని కెంతో గడబిడచేస్తే యిచ్చారు. ఇక్కడ నలుగురినీ కూడగట్టే తల కనబడలేదు. మీరు వచ్చారుగనుక మాకు ఆలనా పాలనా గలగాలె.

రా:- మతబోధకు తోడు భూములసంగతి కూడా కలిపి బోధించు. మూడవది బడిగూడా యిక్కడ పెట్టించి చేతిపనులు నేర్పించమని అడుగుదాం. మనకు జీవనమైనా కలుగుతుంది. యేమీ లేకుండా ఈ పోలీసులమీదా దొరలబంగళాలమీదా డబ్బు వృధాచేయడ మెందుకు?

పు:- ఈ మూడూ ముప్పిరిన బెట్టామా అంటే పెనుసు కుంటుంది. మనిషి బీరుపోకుండా సమ్మెలో చేరుతాడు.

రా:- ఇక్కడ సెటిల్మెంటే పనికిరా దందాం. చుట్టూ వ్యవసాయానికి లాయకైనబంజ రున్నచోట బెట్టాలెగాని యీ

పరశురామక్షేత్రంలో మన మెందుకు ? కొన్ని సంవత్సరాలల్లో సెటిల్మెంట్లన్నీ వూళ్ళయ్యేట ట్లుండాలె.

పు:- అడవులలో మంచి కండగలభూము లున్నవి. ఈ జిల్లాలో వందల సెటిల్మెంట్లు పెట్టవచ్చు. మొదట భూము లిస్తామని అల్లించి బెల్లించి తెచ్చి మాకు భూము లియ్యందీ వెళ్ళిపోతా మంటే తుపాకులు పెట్టి కాల్పించే స్థితిలోకి వచ్చారు.

రా:- సెటిల్మెంటులో భూము లిస్తామంటే మనవా ళ్ళెట్లా నమ్మివచ్చారు ?

పు:- అసలు మనది పిచ్చిజనం. భూము లిస్తామంటే ఆశ పడ్డారు. పెడతా మంటే ఆశ యెవరికైనా వుండేదే. ఆలోచన పడడానికి నలుగురం వొకచోటినుంచి వచ్చామా ? దొరికినచోట నల్లా పట్టుకున్నారు.

రా:- ఈ కారణా లన్నీ వాళ్ళమనసు కెక్కించు. సంగతులు పూర్తిగా తెలియందీ ముందుగానే సమ్మెకడితే మన యిద్దరినీ యింకొకచోటికి తోసివేస్తారు. ఉద్దేశాలు వెల్లడైతే అంతా నిలుస్తారు. ఈ పోలీసులనుగూడా మనం కొందరిని చేర్చుకోవాలె.

పు:- పై. కారణాలన్నీ యెక్కజెప్పితే బుట్టలు మర్నాడు పారవేస్తారు. భూములసంగతి పెడితే అంతా చేరేవాండ్లే. మూడు రోజులకు వొకమాటు పోయే ఈ వుద్యోగాలమీద యెవండ్లకూ ఆశ లేదు. చూస్తుండండీ ! కిరస్తానీలుగూడా మనలో చేర్తారు !

రా:- ముందు పోలీసువాండ్లతో మాట్లాడవద్దు. గుంపుపెద్ద లంగీకరిస్తారా, సగం పని అయినట్టే ! వాండ్లద్వారా జనాన్ని స్వాధీనం చెయ్యి.

పు:- అది పద్ధతి కాదు. జనానికి నచ్చజెప్పితే పెద్దలు వద్దన్నా మానరు. లేకు పెద్దరికం నిలుపుకోడానికి జనులతోపాటే వారూ వస్తారు. పనికి పోవడానికి జనం అంతా పోగవుతున్నారు. చాలాభాగం కొండకే వస్తుంది. ఇవ్వేళ వొకమాటు అందరికీ వలి

గలుపుతా. మధనపడుతుంటారు. రేపు ఆదివారం అంతా యిండ్ల దగ్గరనే వుంటారు. రెండోవృగ్గ బోధించినతరువాత, చాలామందిని రేపే కట్టులో చేర్చవచ్చు.

రా:- యావత్తూ రహస్యంగా జరగనియ్యి. అంగీకరిస్తే యేవిధంగా పోవలసిందీ ఆలోచించుకుందాం.

పుల్లప్ప వెళ్ళాడు. రామదాసు లోపలికి వచ్చి "వంట యిందా?" అన్నాడు.

మా:- అయింది. పప్పు యెనపడమే ఆలస్యం. యెనగలవడం లేదు.

రా:- అప్పుచేసి పప్పుకూడు తిందామనుకున్నావా?

మా:- వొకరోజుకే బయటబడతావెందుకూ? రంగడు పప్పుని యేడుస్తుంటే "గోచికంటె గొప్పదరిద్రమా" అని యివ్వాళ వేశా!

రా:- అమ్మాయికూడా పప్పు కావలె నన్నదా?

జో:- నే ననలేదయ్యా! నామీదికి వస్తున్నావు.

రా:- నీవు మంచిదానవమ్మా!

మా:- యేమి మంచో! చేతిబొబ్బలు నీరుపోసి సలుపుతున్నవట. వొక్కపూట పనికే మూలబడ్డది.

రా:- నాలుగురోజులు అలవాటైందాకానే యిబ్బంది. తరువాత నలుగురితో పాటు మనమూనూ. చేతులు కాస్త గట్టిపడాలె.

మా:- సమ్మెలు కట్టిస్తున్నావని మనను యింకెక్కడికైనా మారుస్తారేమో!

రా:- మార్చనీ! ఇది మనపూర్వార్జితమా? అది కాకపోతుందా? నీళ్ళరుణమున్న చోటికే పోతాం.

అంతా భోజనాలు చేశారు. ద్వాదశపుండ్రాలూ పెట్టి రామదాసు చాపమీద కూర్చున్నాడు. [బాన్‌సన్ గారి నవుకరు

వచ్చి, "దొర మిమ్ములను పిలుస్తున్నాడు. యెక్కడిదో బండి వచ్చింది."

మా:- మనవూరిదే అయివుంటుంది.

రా:- వెంకటయ్యగారు వస్తానని చెప్పినతరువాత తప్పుతారా?

రం:- అయ్యా! నేనుకూడా వస్తా.

న:- దొరగారు పిలువమన్నది నిన్నొక్కణ్ణే! ఆ పిచ్చిబొట్లన్నీ యేమిటి? దొరగారు చూస్తే కర్రతీసుకొని వెంటబడుతారు.

రా:- అయితే యేమిచెయ్యమంటావు?

న:- ఆ పట్టెలు కడిగివెయ్యి. లేకపోతే దొరగారే కడిగిస్తారు?

రా:- ఆయనే కడిగిస్తే నాకిక్కడ శ్రమ యెందుకు? యెట్లా కడిగిస్తాడో చూతాం పద.

నవుకరు రామదాసును తీసుకొనిపోయి బ్రౌన్‌సన్‌గారి పంచాదిలో నిలువబెట్టాడు. ఇంతలో రామానాయుడూ, వెంకటయ్యా, జీతగాడూ అక్కడికి వచ్చారు.

వెం:- రామదాసూ! నీ మనసెప్పుడైనా ఖేదపడుతుందా?

రా-దా:- స్త్రీలకు మానభంగం కలిగినప్పుడు తప్ప నామనసు మరొకప్పుడు ఖేదపడదు. (అని తీక్షణంగా చూచాడు)

వెం:- నీ కష్టా లింతటితో అంత్యం కాలేదా?

రా-దా:- అవుత వని తోచదు.

ఇంతలో బ్రౌన్‌సన్‌గారి భార్య వచ్చి "జార్జ్! యీ పిచ్చివేషం చూచావా? యేమి టాపీఠ మొగం?"

బ్రౌన్:- నీ వదంతా తుడిచివెయ్యి.

రా-దా:- మీ నవుకరు మీరే తుడిపిస్తా రని చెప్పాడే. అయినా చూతా మని వచ్చా.

బ్రాన్:- యెందు కట్లా పూసుకొన్నావు?

రా-దా:- దానికి సవాలక్ష గ్రంథ మున్నది. మీ కంత సులభంగా బోధపడదు.

బ్రాన్:- నాకు తెలియదా? ఇది మీ జాతిభేదాలను తెలియపర్చేగుర్తు.

రా-దా:- కాదు. అన్నిజాతులూ పెట్టుకోవచ్చు

బ్రాన్:- దాని పేరు కాస్టుమార్కు కాదా?

రా-దా:- కాదు. దాని పేరు బొట్టు. దానికి ఆత్మార్థం చాలా వుంది.

బ్రాన్:- దొరసానిగారు అసహ్యపడుతున్నారు, తుడిచి వెయ్యి.

రా-దా:- మీకు ఉపేక్షణ లేదుగదా?

బ్రాన్:- నే నటువంటివి లెక్కచెయ్యను. దొరసానిగారు కోపపడుతున్నారు.

రా-దా:- ఆమె కెందువల్ల అయిష్టం?

భా:- యేమి టావికారరూపం?

రా-దా:- కొత్తవన్నీ వికారంగానే కనబడతవి. మాకు పరిపాటి అయిపోయింది. మీరు మంచి వనుకొనే ఆచారాలు మాకూ కొన్ని అసహ్యంగానే కనబడతవి.

భా:- వీడు అధిక ప్రసంగిలా గున్నాడు. ఆనందం! తుడిచి వెయ్యి!

రా-దా:- ఇది నేర మవుతుంది. దొరసానిగారికీ, నీకూ కూడా శిక్ష జరుగుతుంది. ఆలోచించుకొని మరీ పనిచెయ్యి!

ఆనందం సందేహించేవరకు "నీవు భయపడితే నేను తుడుస్తా" నని దొర మీదికి వచ్చాడు.

వెంకటయ్య:- (కఱ్ఱ పైకెత్తి) - నిలు వక్కడ, బొట్టంటుకున్నావంటే దెబ్బ పయన బడుతుంది. జాగ్రత!

బ్రౌన్:- (వెనుకకు తగ్గి) - నీ వెందుకు వస్తావు ?

వెం:- నీ వెంగుకు వచ్చావు ?

బ్రౌన్:- దొరసానిగారు ఆ జొట్టు చూచి సహించలేరు.

వెం:- నీవు చేసే దుర్మార్గం చూసి నే సహించలేను.

రా:- మనం వ్యవహారం ప్రకారం పనిచేసుకుందాం. మీరు వుభయులూ శాంతించండి.

వెం:- వ్యవహారంతో నాకేమీ పనిలేదు. కావలసివుంటే ఆయననే జరుపుకోమను.

బ్రౌన్:- ఆనందం ! వీళ్ళను బయటికి తరుము.

వెం:- రండి, మీ యిద్దరినీ చుట్టబెడతా. ఆయనను చూచేటందుకు వుత్తరు విచ్చావు. చూచికాని వెళ్ళం !

బ్రౌన్:- త్వరగా చూచి వెళ్ళండి.

వెం:- అట్లా దారికి రండి.

రా-దా:- అయ్యా ! మీరు నాకోసం యెంత శ్రమ పడుతున్నారు !

రా-నా:- ఈ రాక్షస మధ్యంలో లోకంకోసం మీరు పడే శ్రమలో మా శ్రమ యెన్నోవంతు? మేము పాత్రసామానూ, మంచాలూ, గుడ్డలూ తెచ్చాం. ఇంకా యేమయినా కావలెనా ?

రా:- అప్పడి వాళ్లు యెట్లా వున్నది? మీతో రాలేదేమి ?

రా-నా:- నిమ్మళంగానే వున్నది. ప్రస్తుతం ప్రయాణం చెయ్యడం కూడదంటే అతనితో చెప్పకుండానే వచ్చాం. భోజనం మనింటిదగ్గర జేసి మందిరంలో పడుకుంటున్నాడు.

రా:- మందిరం సాగుతున్నదా ?

రా-నా:- శేషయ్యకొడుకును పంతులుగా యేర్పాటు చేశాం. అప్పాదాసు గ్రంథాలయము చూస్తూ పైక్లాసులకు చెపుతుంటాడు.

రా:- రామన్న చురుకయిన కుఱ్ఱవాడే! తండ్రి చిక్కులలో వున్నప్పుడు కుటుంబానికి ఆధార మయినాడు.

వెం:- ఈ యిరవయి రూపాయలూ దగ్గర వుంచుకో. కూలికి బోవడం పెట్టుకోబోకు. ఈ తడవ వచ్చినప్పుడు మళ్ళీ యిస్తాను. డబ్బువిషయమై యేమీ చిక్కులు పడవద్దు.

రా:- మీకు సమస్కారం చెయ్యడంతప్ప యేమి ప్రత్యుపకారం చెయ్యగలను?

వెం:-మా ధర్మం మేము నెరవేరుస్తున్నాం. దానికి ప్రత్యుపకారం అవసరంలేదు.

రా-దా:- ప్రత్యుపకారంమాట యెత్తడమే తప్పు.

బ్రాన్:- డబ్బు నాచేతి కియ్యండి. వృధాగా ఖర్చు చేస్తారు.

వెం:- ఆయనదగ్గిర వుంచుకోవచ్చునకే!

బ్రాన్:- కూడ దని కాదు. వృధా ఖర్చవుతుం దని.

వెం:- అట్లా చేసేవాడు గాదు. ఆయనదగ్గిరనే వుండనియ్యండి.

రా-నా:- నారాయణరావుగారితో మాట్లాడాను. స్వంత డబ్బు ఖర్చుపెట్టుకోడానికి యెవరి వుత్తరువూ అవసరం లేదుట. మిమ్మును సెటిల్‌మెంటులోనుంచి తొలిగించే సంగతి కలెక్టరుగారితో మాట్లాడుతా నన్నాడు. వర్తనవిషయమై నొప్పించవచ్చు. జామీను కేసులు ప్రారంభమైనప్పటినుంచీ చోరీలు చిత్తవట్టుగా జరుగుచుండడంచేత వాదంరోజులు ఆగి మాట్లాడడం మంచి దన్నాడు. మిమ్ములను సులభంగానే వదిలిపెట్టవచ్చు నని అంటాడు. భగవదనుగ్రహం యెట్లా వున్నదో!

రా:- యెట్లయినా నా కొకటే! యీ పౌలు పిల్లవిషయంలో దురాగతం చేసేటట్టున్నాడు.

రా-నా:- అంటే?

ౘాన్:- మీ యిష్టంవస్తే వివాహం చేసుకుంటాడు. కాదంటే మానుకుంటాడు. దాంట్లో దురాగత మేమున్నది?

రా-దా:- క్రమంగా తెలుస్తుంది.

వెం:- అటువంటివి జరగడానికి గుండె లున్నవా?

ౘాన్:- ఇస్తే వివాహం చేసుకుందామని తప్ప వేరే వుద్దేశ మతని కుండదు.

రా-దా:- సరే తెలుస్తుంది. సెటిల్‌మెంటు యొక్క స్థితిగతులు చాలా అన్యాయంగా వున్నవి. మనము బయట వినే సంగతుల కంటె యెక్కువ దున్నయాలు జరుగుతున్నవి. నింద యావతూ నివాసులమీద పెట్టడానికి వీలులేదు. సంగతులు యావత్తూ క్రమంగా అవే బయటబడుతవి. ఇన్నాళ్లు దుర్నయాలు జరుగుతుండడానికి మనవాండ్ల అలసత్వమే కారణం. ఈ సెటిల్‌మెంట్లవల్ల దేశానికి మహోపకారం జరగబోతుంది. స్వరాజ్యం వస్తేనేకాని మనదేశ కష్టాలు తీరవని సంగడు చెపుతుండేమాట వాస్తవం. సేసలోకి మనుష్యులను చేర్చుకొనడానికీ, క్రైస్తవ మతం వ్యాపింపజేయడానికీ తప్ప యీ సెటిల్‌మెంట్లవల్ల యితర ప్రయోజనం లేదు. స్వరాజ్యం వచ్చిన తరువాత పద్ధతు లన్నీ మార్చి వీటిని గ్రామాలుగా చేయవలసి వుంటుంది. ప్రస్తుత మివి వున్న స్థలాలు యిందుకు పనికిరావు.

ౘాన్:- మీ కిచ్చిన కాలం ముగిసింది. ఇక వెళ్ళవలసింది.

రా-దా:- ఈ సెటిల్‌మెంట్లేర్పరచడంలో ప్రభుత్వంవారికి చేదోడైన రాఘవేంద్రరావుగారు తిరిగీ వీటివంక చూడడంలేదు. దేశనాయకులు తమ దృష్టిని వీటి మీదికి తిప్పడం అవసరం. ఒకమాట సత్యం.

ౘాన్:- ఇక మీరు వెళ్ళండి.

రా-నా:- ఇంకా అయిదునిమిషాల గడువున్నది. గడియారం చూస్తూనే వున్నా.

వెం:- చేత తీసివేసేది కాదుగాని నీ దుఃఖం మేమూ కొంత భరిస్తూనే వున్నాం. నీ వీవతుగా వుండడం చూచి యింటికి పోవడానికి కాళ్లాడడంలేదు.

రా-దా:- ఎక్కడ వున్నా మీ అనుగ్రహంవల్ల ఖులాసా గానే వుంటాం. వీరి నిర్బంధములవల్ల నా దేహానికి పారతంత్ర్యం గలిగిందిగాని ఆత్మ సర్వస్వతంత్రంగానే వున్నది.

వెం:- నీకు భగవత్పారతంత్ర్యం దప్ప యితర పార తంత్ర్యం లేదు.

రా-నా:- భగవంతుడిలో అక్రమం గనబడితే ఆయనను గూడా ధిక్కరిస్తా వనుకుంటాను.

రా-దా:- అయ్యా! నా కొక గొప్ప విషయం బోధించారే. మీ మాటలవల్ల వెంకటదాసు నా దృష్టిలో యిప్పుడాకాశమెత్తు పెరిగాడు.

రా-నా:- రామదాసు యెదట వుంటే జ్ఞానవర్షం కురుస్తూనే వుంటుంది. ఇక మేం వెళ్లుతాం.

రా-దా:- చిత్తం. కాసేపు మంగళాపురం చూపించారు.

వెంకటయ్యా, నాయుడూ, జీతగాడూ వెళ్లుతున్నారు. ఒకరి నొకరు పలకరించుకోలేదు. సెటిల్‌మెంటు ఆవరణపు వాకిలి దగ్గరకు పోయేవరకు వెంకటయ్యకు భ్రమవచ్చి నుచ్చిళ్లు ప్రారంభమయినవి. రామానాయుడు పట్టుకొని కొంచెంసేపు నిలిపి——

రా-నా:- అన్నా! కాస్త కూర్చో.

వెం:- తిప్పుకున్నదిలే! పద. ఈ మహాయోగికి యెందుకు వచ్చిన ఏ కష్టాలంటాను! మనోవాక్కాయ కర్మలా హింసా వర్జితుడే!

రా:- ఆ ప్రశ్న కాయనే జవాబు చెప్పాలే. ప్రారబ్ధం అనుభవించక తప్పదు. కాని యెన్ని కష్టాలు వచ్చినా ఆయనకు ఆత్మ తేజానికే తోడుపడుతున్నవి. వాటికింద ఆయన మణిగి

పోవడం లేదు. అన్నీ వరప్రసాదా లవుతున్నవి. ఇనుము జిర్రకాక కాచి నీళ్ళలో ముంచితేనేకాని కరుకెక్కదు.

వెం:- సాధారణపు జనులు దుఃఖభారంకింద కుంగిపోతారు.

రా:- ఆయన ఆత్మ వంగేదీగాదు, కుంగేదీగాదు. పెచ్చు యెండినకొద్దీ విత్తనానికి బిగివి చిక్కినట్టు శరీరం కృశించినకొద్దీ ఆయన ఆత్మకు బిగివెక్కుతున్నది. జన్మలెత్తడం యొక్క ప్రయోజన మంతే కదా!

వెం:- జన్మవల్ల ప్రతివానికీ లాభమున్నదన్న మాటేనా?

రా:- కొద్దో గొప్పో వుండక తీరదు. పండి జారిన కాయలకూ, రాలిన పూబిందెలకూ తారతమ్యం వుంటుంది.

వెం:- మనిషి బొత్తిగా తడపైపోయినాడు.

రా:- ముఖంలో తేజ మెక్కువయింది. తీగ తిరగబారంగనే గడ్డకు బలమెక్కినట్టు వొంటిలో జవంతా ఆత్మలో గడ్డగడుతుంది.

వెం:- మరణంవల్ల పంచభూతాలూ పంచత్వం పొందడం గాకుండా దేహమంతా ఆవరించివుండే ఆత్మశక్తికూడా జన్మలో సంపాదించబడ్డ కర్మఫల మంతా మూటగట్టుకొని స్వస్థానం చేరుతుంది.

రా:- దేహంలో పంచభూతాలను పట్టి వుంచిన ఆత్మశక్తి పట్లు విడవంగనే అవి చతికిలబడి వూరుకుంటవి. మరణంవల్ల నిజంగా జరిగేది షష్ఠత్వంగాని పంచత్వం గాదు.

వెం:- మరణమంటే పండిన పంట కయిలు చేసుకోవడం. పని దీరిన, చెత్తను వేరుపరచి, పంటను అనుభవానికి తెచ్చుకోవడమే. బాగా పండితే సంచితంగూడా వృద్ధి అవుతుంది.

రా:- ఆ పంటలో పాపమూ పుణ్యమూ కలిసే వుంటవి.

వెం:- వడ్లల్లో సంకులు లేకుండా వుంటవా?

జీతగాడు బండి గట్టాడు. అంతా తాడేపల్లిలో భోజనం చేసి వూరికి బోయినారు.

## ౧౪

### నా సృష్టి

నాయుడు వగైరాలు వెళ్ళిపోంగనే రామదాసు సామాను యింటికి మోసుకుంటున్నాడు. భార్య యెదురుగా వచ్చి అందు కున్నది. కొంతసేపటికి బ్రౌన్నుగారి భార్య వచ్చి,

భా:- నీవు యిక్కడినుంచి త్వరగా వెళ్ళిపో. నీ ముఖం తెల్లగా అసహ్యాం వేస్తున్నది.

రా:- సామాను తీసుకున్న తరువాత వొక్క నిమిషముం డను. ఇదుగో చూడండీ! వొళ్ళంతా తెల్లగా వుంటే అసహ్యాం లేనిది నా ముఖంమీది కాస్త తెలుపేమి చేసింది?

భా:- జార్జ్! వీడి కావరం చూడు!

బ్రౌన్:- నీవు లోపలికి రా. వాడు 'నీ వెం'తని యెది రించే స్థితిలో వున్నాడు. కావలసిన పని పోలు చేస్తాడు. నీవు వోపిక పెట్టుకో.

రామదాసు యింటికిపోయి చాపమీద కూర్చున్నాడు. జోతి తండ్రి మోకాటిమీద గడ్డం ఆనించి ఆనాదంగా తండ్రి మొగం చూస్తున్నది.

మా:- సంగతులేమో వరసగా జెప్పు. అప్పడి వొంట్లో యెట్లా వుంది?

రా:- ఒంట్లో నిమ్మళంగానే వున్నదిగాని వైద్యులు ప్రయాణం చేయవద్దన్నారుట. అంటే బాగా ఖులాసా లేదని అర్థం. మనను యిక్కడనుంచి విడిపించడానికి ప్రయత్నిస్తారుట.

మా:- మన మెప్పటికయినా మంగళాపురం చూడడం తటస్థించేనా?

రా:- మనం వచ్చి నాలుగు రోజులు కాలేదే!

జో:- కాల వ్యవధికంటె పోలేమనే నిరాశే యెక్కువ బెంగ పుట్టిస్తుంది.

మా:- 'ఎప్పటికైనా పోలేకపోతామా' అనే ఆశ వుంటే రోజులు లెక్కపెట్టుకుంటూ కాలం గడపవచ్చు. ఆస కోసులు దాటిస్తుంది.

రా:- కాకపోతే మట్టుకు యిప్పుడక్కడ మించిపోయే దేమున్నది ?

మా:- రోజూ మన కొండరాళ్ళవంక చూడడం, అలవాటైన వీధులలో నడవడం, మనసు కలిసినవాండ్లతో మాట్లాడడం, ఆఖరుకు పగవాండ్లవైనా పాత మొగాలు చూస్తుండడం కంటే భాగ్య భోగ్యాలు యెక్కువ ఆకర్షిస్తవా ? నేను ముప్పై యేండ్ల నుంచీ వొక్క కవ్వంతో చిలికా. రోజూ మసెలమీది నుంచి కవ్వం దింపడానికి నే పట్టుకుండే చోట అరవడి పడ్డది. నా మనసులో మాత్రం కవ్వం అరవడి గట్టదా ?

రా:- సన్యసించి అడవులలో కూర్చున్నవాండ్లకు కూడా 'నే కూర్చుండే చెట్టూ' 'నా చుట్టుపట్ల అల్లుకున్న తీగా' అని మమకార మేర్పడుతుందట !

జో:- భగవంతుడికి 'నా సృష్టి' అనే మమకార ముండదా?

రా:- మమకారం మనుష్యులకు బంధమైతే ఆయనకు మాత్రం కాదా ?

మా:- మనతో సంబంధంలేని భగవంతుడితో మనకు మాత్రం సంబంధం యెట్లా వుంటుంది ?

జో:- మనను ప్రేమించనిదీ నిర్గుణబ్రహ్మమైనా మనం ప్రేమించవలసిన స్వభావమూ ధర్మమూ గూడాను.

మా:- ఆయనకు మన విషయమై యే ధర్మం లేకపోతే మన కాయన విషయమై ధర్మాలేముంటవి ? ధర్మాలెప్పుడూ అన్యోన్యాశ్రయాలే ! ప్రేమించడం మన స్వభావమని నీ వన్నందుకు ప్రేమించే స్వభావం ఆయనకు లేనిదీ మన కెక్కడనుంచి వస్తుంది ? ప్రేమ యెప్పుడూ అన్యోన్యమే !

జో:-ఎదటివారిలో లేకపోయినా ప్రేమ ప్రేమను పుట్టిస్తుంది.

రా:- రెండూ ప్రేమించే స్వభావం కలిగినవైతే.

మా:- కాకపోతే ప్రేమించడానికే వీలులేదు. అయినా యీ వాదాలన్నీ నా కెందుకు? షాపుకు బోయి సామాను కొనక్కరావాలె. పనికి పోవలసి వస్తుందేమోనని సాయంత్రానికి తేలేదు. ఇంట్లో పెట్టి పోవడానికి భయంగా! వాకిలి కేమయినా అడ్డ మేర్పరిస్తే బాగుండు.

రా:- తడికె కుక్కల కడ్డంగాని మనుష్యుల కడ్డమా? సత్తె యుగంలో వాకిండ్లకు తలుపు లుండేవి కావట.

మా:- దొంగలు రాకపోతే మనమూ తీసే వుంచవచ్చు.

రా:- వెంకటయ్యగారు యిరవైరూపాయి లిచ్చారు. ఇవి యెవరి దగ్గర దాచను?

మా:- నా తీగె విడిపించుకొని మిగిలినవి మన మగ్గురి దగ్గరా తలా అయిదు రూపాయిలు వుంచుకుందాం. మిగిలిన రూపాయి పెట్టి సామగ్రి తెస్తా. మనం వొకరం యింటి దగ్గర వుంటూ, యిద్దరం పనికిపోతే బాగుండు. కాస్త కోనగావలి లేక పోతే బాగుండదు.

రా:- మీ యిద్దరూ రోజుమార్చి రోజు యింటి దగ్గర వుండి వంట చేయండి. నాతో వొకరు పనికి రండి.

జో:- "అయ్యా కెత్తరా కోళ్ళగం ప"ని నీవు రోజూ పనికి బో!

రా:- నాకు వంట చేయడంకంటే కూలికి పోవడమే సులువు. అదిగాక నే లేకుంటా మీ రంత దూరం పోవడం నా కిష్టంలేదు.

జో:- ఇంటో వొంటరిగా వుండడంమటుకు మంచిదా?

రా:- ఇక్కడ పరవాలేదు, సామానుకు నే బోయి వస్తా. నీళ్ళకు నీవు పో.

## ౧౫

## కన్నీళ్ళలో కాలు జారేను

కూలికి బోయినవాం డ్లందరూ యిండ్లకు వస్తున్నారు. పొద్దున కొందరు గంజి తాగి పోయినవాండ్లు, మరికొందరు చద్దెన్నం తిన్నవాండ్లు. కొంతమంది పట్టినే పోయినారు. మధ్యాహ్నం యెవరికీ అన్నం లేదు. పొద్దుగూకులూ పనిచేసి ఆకలికి ప్రాణాలు వెసబోయివున్నవి. అప్పుడు జొన్నలు దంచి వండుకోవడానికి వోపిక లేక అందరూ బియ్యమే తెచ్చుకున్నారు. వాండ్లకు జొన్నన్నం తింటే దిండుగా వుంటుంది. కాని అప్పెసం వరిమెతుకులు తినడంచేత మనుష్యులు వూలపోతున్నారు. పొయిలోకి చిన్నకట్టలు గట్టి తుత్తురుపుల్ల లమ్ముతారు. అవి యెన్ని గాల్చినా బుస్సున పోతవిగాని జొన్నన్నం వుడుకైనాపట్టదు. ఆటి కాలే గట్టిపుల్లలు వుంటేనేకాని వుడకదు. సగం వంటచెరుకు లేకనే జొన్నలు మానుకున్నారు. అందరూ భత్యాలు తెచ్చుకొని అన్నం కాంగనే నిప్పులమీద నీళ్ళు చల్లినట్టు తలా కాస్త తిన్నారు. అన్నం తిన్నతరువాత గుంపుల నాయకులను పోగు చేసుకొని వుల్లప్ప రామదాసుయింటికి వచ్చాడు.

వు:- రామదాసుగారూ! గుంపుల నాయకులంతా వచ్చారు. మీరు చెప్పినప్రకారం పోవడానికి సిద్ధంగా వున్నారు. మీతో మాట్లాడవలెనని వాండ్లకు కోరికె. మీ భోజనమైందా?

మా:- వంట అయింది. మాట్లాడడం పొద్దుపోయేటట్టయితే త్వరగా తినే కూర్చోవచ్చు.

వు:- పొద్దుపోయేవరకు కూర్చోవడానికి వీలేలేదు. యెనిమిది గంటలకు గస్తీ ప్రారంభం అవుతుంది. ఆపైన యెవరి గూంట్లో వాండ్లు దూరక తప్పదు.

రా:- బయట సంచరించే గుంపులు దప్పా!

వు:- వాండ్లు దొరతే అయిరి. మన మాటలన్నీ వొక గంటలో ముగించాలె ఇతడు దొమ్మరగూడానికి నాయకుడు.

పదిమందిగల కుటుంబం. ఇంటిదగ్గర వ్యవసాయం, వొక వంద సన్నజీవాలూ వున్నవాడు. ఇక్కడికి చేర్చడంచేత అవన్నీ అమ్ముకొని ఆ డబ్బు కరుసొక్కొని తింటున్నాడు. ఇంకొక యేడదికి సెట్టి మిగులుతాడు. తరువాత యీ గుంపు యెట్లా బతకాలనో తెలియదు.

రా:- ఇప్పుడు కూలి చేయడంలేదా ?

పు:- ఈ పదిమందిలోనూ యేడుగురు వొళ్లు దాచుకోకుండా పని చేసేవాండ్లు. వీండ్లకు వారపు మొత్తంమీద వచ్చే కూలి మూడురోజులకు హాసీహాసీగా సరిపోతుంది. తక్కిన నాలుగు రోజులకూ యింటిదగ్గరనుంచి తెచ్చుకుని తినాలె.

రా:- నీ పేరు ?

దొమ్మర నాయకుడు:- రాము డంటారండి.

రా:- నీవు వచ్చి యెన్నాళ్ళయింది ?

రాముడు:- మేము వచ్చి నాలుగేండ్లకు పైన అయింది. మాగోడు యింకా సానా వుంది. ముందు మేము యింటిదగ్గర కమ్మగా పాడి తాగినవాండ్లం. ఇక్కడికి వచ్చినప్పటినుంచీ తెల్లనీళ్ళ మొగమైనా చూడలేదు. మాపిల్లల ఘోష యెవరికి తగలవలసినదో తెలియదు.

రా:- ఆయ నెవరు ?

పు:- అతను యెరుకల కిష్టడు.

కి:- అయ్యా! మా యెరుకలగుంపు వంద గడప వున్నది.

పు:- వాళ్ళ గుడిసెలకుమటుకు గడపలు లేవు.

కి:- ఉండవయ్యా నీదంతా చమత్కారం! మా దరిద్రానికి తోడు ప్రతివాండ్లకు గుంపెడు పిల్లలు. రెక్కలు విరుచుకొని పనిచేస్తాం. మా కిచ్చేకూలి వొంటిపూటకు చాలదు. కూలి దొరకనిరోజులలో మేము పొట్ట నాయగట్టుకొని పడుకున్నా పిల్లలు పస్తుపడుకుండడం చూడలేక జాలిగుండెగలవాం డ్లంతా సంచా

గాలు మొదలుపెట్టారు. నాబోటి కటికిగుండెలవాండ్లం యింకా ఁటిస్తానేవున్నాం. నేను ముగ్గురిపెట్టు బరువులు మోస్తా. ఇద్దరి పెట్టు తింటా. నేనుగనక గడ్డపార తీసుకుంటే రాయి వణకాలె !

పు:- రాములవారు బాణం తీసుకుంటే సముద్రం వణికినట్టు.

రా:- పుల్లప్పా ! యీ కథ లన్నీ యెప్పుడు చదువుకున్నా రోయ్ ?

పు:- అయ్యా ! నేను వొక అందాన చెడ్డానా ?

రా-దా:- బాగుంది, నీ కథ గాని !

కి:- నిత్యం నావల్ల పని దీసుకుని పావలాడబ్బు లిచ్చే నాథుణ్ని చూపించండి. నేను నీలిమోపులు గుత్తకు మోసుకొని ముబ్బడి కూలి సంపాయించేవాణ్ని. నేను చోరీ యిదివరకు చేసి నట్టుగాని, యిప్పుడు చేస్తున్నట్టుగాని వొక్కరిచేత అనిపించండి. ఎరుకలవాడినై పుట్టినందుకు యిక్కడ దొంగల గూడెంలో తగుదు నంటూం పెత్తనం చేస్తున్నా. ఇంటిదగ్గర చక్కగా జీవించేవాడిని యిక్కడ బెట్టి చంపుతున్నారు. నేనే గనుక దొంగతనాలు సాగిస్తే వూళ్ళూ వూహాలూ గూడా ఆగవు. ఇంకా పస్తా యిస్తున్నా.

రా-దా:- ఇక్కడింత కూలి తక్కువ గిట్టడానికి కారణ మేమి ?

కి:- ఇక్కడ యింతమంది జనానికి యేమిపని వున్నది ? మామూలంగా చుట్టుపట్ల వూళ్ళలో కాపురం వుండే కూలీలకు జీవనం పోయింది. వాండ్లు దొంగ జాతులలో చేరినవాండ్లు కారు గనుక బయట వుండే దొంగతనాలు ప్రారంభించారు. సమీప గ్రామాలలో యెవరూ యిప్పుడు కూలి సరిగా యివ్వరు. వీండ్లంతా యిక్కడ తేరగా వచ్చి పడ్డారని పోలీసు లోగట్టుకొని వాండ్ల యిష్టం వచ్చినట్టు గుత్త కేర్పాటు చేసుకుంటారు. అందులో యీ కొత్త దొరగారు వచ్చిన తరువాత కూలీల నోట మట్టే ! పోలు బ్యాంకులు నింపుతున్నాడు !

పు:- మమ్ముల్ని అసలు మోసంచేసి తీసుకొని వచ్చారు కర్నూలు జిల్లాలో వొక డిప్యూటీ కలక్టరు 'మేమంతా రా'మః తిరగబడితే మా ఆడవాండ్ల సందరిసి 'అమ్మా, అప్పా' అః మంచి మాటలాడి మొహవాను పొందేటందుకు స్వంత ఖర్చుతో గాజులు తొడిగించి చీరలు కొనిపెట్టి తోడబుట్టినవాడి మోః రుగా వాండ్లను లాలించి వొప్పించాడు. మా మగవాండ్లతో కోరుకున్న భూము లిస్తామనీ, సర్కారువారు దయదల్చి మా దరిద్ర విచ్ఛిత్తు చేయడానికి పూనుకున్నారనీ చంక బిడ్డల జాః దీసే మాటలతో మా దాసరి గూడేలను లేవదీశాడు. ఆయనః మాటలు నమ్మి మా కున్న పొలాలూ, యిండ్లూ, చరాస్తీ అమ్ము కొని యిక్కడ సేద్యాలు వెలిగింతామని వచ్చాం. ద్వారపూః పచ్చపువాండ్లకు కూడా వుచ్చులు అట్లాగే తగిలించారు. సెటిల్ మెంటులో అడుగు పెట్టాం, పస్తులు ప్రారంభమైనవి. చేతిలో మెల్లా వున్నవాండ్లు వచ్చినంతవరకు ఖర్చు పెట్టుకొని తిన్నారు. ఆకాస్తా అయిపోంగనే లగ్గలకెక్కారు. మాపోరణచడానికిదక్షిణాఃః కాఫీతోటలకు పట్టించారు. ఆ కొండనిండా నీళ్లు. కాలు పెట్టే వరకు జలగలు పట్టుకుండేవి. మా వొంట రక్తమాంసా లుంటేగా! తరిపి దూడలవలె కాసేపు గుంజి వూరుకుండేవి. జనానికి రోగాలు మోపై చాలామంది నశించారు. రోజూ పీనుగలు వెళ్ళుతున్నా తోటల దొరలు యేడ్చే పెండ్లాలనూ, బిడ్డలనూ పనులు చేయః మని వేధించేవాండ్లు. 'యెట్లాగైతేనేమి, చావడాని' కని గుండె రాయి చేసుకొని యావన్మందిమీ 'జాఃపరమేశ్వరా' అని చెప్ప కుండా లేచాం.

రా-దా:- యెక్కడికి ?

పు:- ఏలేందుకు లేవుగాని యెత్తుక తినేందుకు వూళ్ళు చాలా వున్నవి. తిడితే తప్పుగాని తిరుచుకుంటే తప్పులేదు. బిహార్లు లేచేవరకు తోటల దొరలు తుపాకులు దీసుకుని మా వెంట బడ్డారు. మేము రాళ్ళు దీసుకొని వానరయుద్ధం ప్రారంభించే

వరకు దొరయ్యాలు యెళ్లోయెళ్ళు! వాండ్లేం వూరుకున్నారా? కలక్టరును రిజర్వు పోలీసులను బంపమని అడిగారు. ఆయ నెవరో మంచివాడట. వాండ్ల యిష్టంవచ్చిన సెటిలుమెంట్లుకు పంపవల సిందని ఆర్డరు వేశాడట.

రా-దా:- చాలా గొప్ప వరమే!

పు:- అప్పటి కల్లాగే అనుకున్నాం. దిక్కుతోచక తలా వొక సెటిల్మెంటు పేరు చెప్పాం. పెనంమీదనుంచి మంగళం లోకి దూకినట్లైంది. ఇక్కడ దూకడానికి కూడా వీలులేదు. కొలనుకొండంతా యానాం అయి మూపాలబడ్డది. మేము వాటికీ లొంగం, అవి మాకూ లోబడవు. కొండరాళ్లూ మేమూ ద్వంద యుద్ధం చేస్తున్నాం. ఇదివరకు దొంగతనం యెరగనివాండ్లు కూడా కొందరు—

ద్వారపూడి నాయకుడు రాఘవులు:- ఆ సంగతి యిప్పు డెందుకోయ్, పెద్దమనుష్యులతో?

పు:- యేమి చెపితే? తల తుంపుతారా? పాలించేవారు వచ్చినప్పుడు యావత్తు సంగతులూ చెప్పవలసిందే.

రాఘు:- ఇప్పు డేమిచేయవలెనని నీ యభిప్రాయం? నీవు మేమి చెయ్యమంటే అది చేస్తాం. తిరుగు లేదు.

యానాది సుబ్బడు:- తెగదెంచుకొని పారిపోదా మని!

రా-దా:- ఎక్కడికి పోతారు?

సు:- గడిదాటి పొమ్మంటే పోతాం.

రా-దా:- పోలీసులు అందరినీ పట్టుకవస్తే సెటిల్మెంటు చట్టంకింద తలావొక సంవత్సరం వొడ్డుతారు.

పు:- మొదట ఖైదంటే కాస్త వెరిచాం, యిప్పుడా చలి తీరింది. ఈ సెటిల్మెంటుధర్మాన అందరికీ కొత్త తీరింది. రాజు గారి రొట్టెలు చాలాభాగం రుచిచూచాం. మేమూ దాసంగా లలో ధప్పళాలు కొట్టినవాండ్లమే!

రాముడు:-కాళ్ళకట్ట తాడుకోశారు. అంత్యానికి వచ్చింది. నీతి నియమాలు విడిచాం. కూడు లేక యెంతకాల మని మాడుతాం? 'జైలుకు పోతే నామోషీ' అన్నమాట పోయింది.

రా-దా:- అయ్యో! అన్యాయం! అ దేమి?

పు:- సెటిల్మెంటుకాంపౌండు దాటితే నేరం. మొదటిసారి ఆరునెలలూ, రెండోసారి సంవత్సరం, ఆపైన అంతస్తులుగా శిక్ష పొడిగిస్తారు. నీతికి భంగం లేని పను లన్నీ నేరాలుగా జేసి జైళ్లు చూపించారు. చాలాభాగం తెల్లకుళాయీల మల్లా నల్లకుళాయీల మైనాం. ఆవరణపుగీత దాటినందుకు దొంగల మని శాశ్వతపు పట్టా లిచ్చారు. నల్లకుళాయీలవెంట యెర్రకుళాయీలను తగిలించారు. జవానులను వెంటపెట్టుకొని జమీందారు సెకలు వెళ్ళబోస్తున్నాం. ఇప్పు డెక్కడికి దేలామంటే, యేదో వొక వంక పెట్టుకొని ఖైదుకు పోవడం. ఆరునెలలు పోయిరావడంతో జైలు సౌకర్యాలు తెలుస్తవి. వేళ కింతన్నం, కట్టుకోను, చల్లాడం, కప్పుకోను కంబడి, గచ్చుటిండ్లు. అక్కడ మా వొక్కకిటికీ కుండే యినుపసామాను గొప్పవాండ్ల మేడలకు సరిపుచ్చవచ్చు! నిద్ర లేవడానికి మేలుకొలుపులు, తూర్యారవాలు. రాజదండం చేత పట్టుకొని యెప్పుడూ వెంట జవాను, వందలుదినే డాక్టర్లు, అడిగేవూ మా వైభోగం! చుట్టూ కోటగోడ. రాజలాంఛనాలు వృష్టిపడుతుంటవి. మా ఆడవాండ్లకుకూడా యిదే మోస్తరు ప్రత్యేక యేర్పాట్లు వుంటవి. నవాబుగారి జనానాకంటెకూడా యెక్కువ ఖాయిదా. మేము సెటిల్మెంటువచ్చి నాలుగేండ్లయింది. మా ఆడవాళ్ళకు గుడ్డ కొనిపెట్టినపాపాన పోలేదు. వొక పూట అయినా అన్నం పెట్టలేనివాళ్లం గుడ్డ లేమిస్తాం? సగం యీ మానభంగం సహించలేకనే ఖైదుకు పోతున్నాం. ఖైదులో ఆడవాండ్లకు వొళ్లునిండే గుడ్డయినా యిస్తారు.

రా-దా:- ఈ సెటిల్మెంటు చట్టంవల్ల జనంలో ఆత్మగౌరవమూ, నీతిగౌరవమూ చంపా రన్నమాట.

దాసరినాయకుడు కేశవులు:- పుల్లప్పా! నీ వాగరా! అయ్యా! నే నిప్పుడు తొంభై యో పడిలో వున్నా. మా అయ్య కాలంచేసి ఇప్పటికి అరవై సంవత్సరాలైంది. ఆయన చావంగనే నాకు ఇరవై అయిదో సంవత్సరం వెళ్ళుజాత కుల పెద్దను చేశారు. డబ్భైయేండ్లనుంచీ మా కులచరిత్ర బాగా యెరుగుదును. చాలామందిమి వ్యవసాయదారులుగా వుండే వాండ్లం. రాను రాను ముప్పాతికె వంతుకు కూలిజీవనమైంది. ఇప్పటి కిరవై యేండ్ల క్రిందట నాలుగుకులాలతో పాటు తప్ప మా వాండ్లల్లో విశేష దొంగతనం లేదు. ఈ నడుమ కొంచెం సంఖ్య హెచ్చినమాట వాస్తవమే. దానికి కారణం కూలి దొర కకపోవడమే. ఇప్పటికీ నలుగురితోపాటు మర్యాదగా జీవించేవాళ్లు సగానికి యెక్కువగా వున్నారు. మాకు సర్కారువారు దొంగల జాతి అని పేరు పెట్టారు. వైష్ణవదాసరులమల్లా దొంగదాసరుల మైనాం. మాబైసు బయట బడ్డది. నేనూ నా కొడుకూ వేళ కెవ రైనా వస్తే గుక్కెడుగంగపోసే స్థితిలోనే ఇప్పటికీ వున్నాం. నా బిడ్డ పొద్దుగూకితే గడపదాటి యెరుగడు. దొంగదాసరుల మని ఈ సెటిల్మెంటులోకి తెచ్చారు. ఇక మమ్మును పెద్దమనిషనే వాడు యెవడూ వుండడు కదా? మే మిప్పుడు కొత్తగా దొంగ తనం చేసి పేరు చెడగొట్టుకొనేది లేదు. బిరుదు యే ద్రోహమూ చేయకుండానే సంపాయించుకున్నాం. ఇక మంచివాండ్లం కాబో యేది లేదు. 'సత్యంగా వుంటేమనకు వొరిగేదేమున్నది? రాత్రిళ్లు కన్నాలకు బయలుదేరుతా' నని మా పిల్లవాడు నన్ను రోజూ గోకాడుతున్నాడు. ఎర్రపిల్లవాండ్లను ఆడవేషాలకు పిలిచినట్టు బక్కపలచగా వుండడంచేత కన్నంలో దూరడానికి బాగా పనికి వస్తాడని పోలుగారు పిలిపిస్తున్నారు. పొమ్మంటావా? వద్దా?

రా-దా:- వ్రతం యెట్లాగూ చెడ్డది. సుఖమెందుకు దక్కించుకో గూడదంటావు? ఇతర మార్గాలు ఆలోచించు కుంటున్నాంగా.

కే:- సరే ఆలోచించు.

రా-దా:- నిర్భయంగా జైళ్ళకు పోవడానికి తయారైతే అన్ని పనులూ చక్కపడతవి.

కే:- అంతేకదా నీకు కావలసింది? మేము యింకో కందుకయినా జైలుకు పోవడానికి సిద్ధంగా వున్నాం. ఇప్పుడు జైలుకు పోవడం సులభమే. సర్కారువారు చాలా సదుపాయం చేశారు. ఈ ఆవరణం దాటి అవతల అడుగు పెడితే జైలుప్రాప్తే. దూరం కూడా పోనవసరం లేదు.

రా-దా:- ఈ సెటిల్మెంట్లన్నీ కిరస్తానీ మతాలు. మనం ప్రార్థనకు పోకపోతే యీ పాదిరీలు మనకొక సగాం పెట్టి లేచి పోతారు. దున్నడానికి వీలైనచోట సెటిల్మెంటు పెట్టి అక్కడుండమంటే మన ముండడం, లేకపోతే మనదారి మనం చూచుకోవడం. పారిపోతే పోలీసులను పెట్టి కాలిపిస్తామంటారు. దానికేమి చెపుతారు?

పు:- దానికీ మనం తయారు కావలసిందే. యెంత మంది ఆడవాండ్లనూ, పిల్లలనూ కాలుస్తారో చూతాం!

రా-దా:- చావుకు వెరుస్తామని కాదు. ముందుగా కన్నుపొడ్చ్యేటంత కాటుక పెట్టుకోవడ మెందుకు? రేపు పొద్దున యావత్తు మందిమీ ప్రార్థనకు పోవడము మానివేతాం. దానిమీద కదలిక పుడుతుంది. మన బాధలు యావత్తూ తెలుపుకుందాం. ప్రయోజనం లేకపోతుందీ, యీ కాంపౌండు బయట బిడారులు దింపుదాం. గవర్నమెంటువారు మెదలకుండా వుంటారూ, ఎవరి దారిన వాండ్లం పోదాం. వృథాగా చంపితే చంపనియ్యండి. మనం యెవ్వరమూ దౌర్జన్యానికి దిగవద్దు.

దా-కే:- బాగానే వుంది. మొండివాడు రాజుకంటే బలవంతుడు.

రా-దా-: ఇక అందరినీ ఖైదుకు పొమ్మంటే అందువల్ల మనకు నామోషీ లేదు. అన్న వస్త్రాలిచ్చే దాతలుంటే చేత

నైనంతవరకు వొక అతుకు అతుకుతూ లక్షణంగా అందరం అక్కడనే వుందాం. అక్కడి సంగతులు యావత్తూ యిందాకా మన పుల్లప్ప వర్ణించాడు. దొంగది, సగం ప్రభువంశ అనేది వాస్తవంగానే వున్నది. 'హరిః ఓం' అని రేపు పొద్దున ప్రార్థనకు పోవడం మానివేతాం. మీ అందరికీ అంగీకారమేనా?

కే:- ఇంకా రెండో మాటా!

రా-దా:- ఇంకొక సంగతి! మనకు యావత్తు సంగతులూ బోధపడ్డవి. నన్ను గాని మీ గుంపు నాయకులనుగాని ఖైదులోకి పంపితే వెంటనే కొత్త వాళ్ళను నాయకులుగా యేర్పరుచుకుండేదీ, రంగం సాగిస్తుండేదీని. తెంపు లేకుండా యీపని జరగాలె.

క్రి:- మంచిమాటే!

రా-దా:- మనలోనుంచి యెవరైనా చీలిపోయి లోబడ్డా తక్కినవాళ్లు లెక్కచేయగూడదు.

రాఘు:- కోసకోళ్లు లేకుండా వుంటవీ? నిల్చినవే లెక్క!

రా-దా:- సరి.

గస్తీ ప్రారంభించే సమయ మైంది. పోలీసులు తిర్గాడుతున్నారు. కులపెద్ద లంతా లేచి తమ గూడేలకు బోయినారు. పాలు యేదో ఆలోచన జరుగుతున్న దని పసికట్టాడు. సంగతి ఫలానా అని తెలియలేదు. దొరగారితో యోచించి ప్రార్థనకు రాకుండా సమ్మె కట్టుతున్నా రని అనుకున్నాడు. పాలు "మత విషయం యీ జనానికి పట్టుపచ్చిందా! చివరకు యేమీ జరగ" దన్నాడు. "మాలలు కొందరు చేరినా మనము మెదలకుండా ఊరుకుంటే అదే సమసిపోతుం" దని పాదిరీగా రన్నారు. అంత వుభయులూ వెళ్ళిపోయినారు. రామదాసు భోజనానికి లేచాడు. అందరూ అన్నంముందు కూర్చున్నారు.

జో:- అయ్యో! నీ కెక్కడి వోపికే? రెండుగంటలనుంచీ వాండ్లతో సతమతమవుతున్నావు.

మా:- యెక్కడికి పోయినా పూరుకునే ఘటం కాదు. యేదో వొక రచ్చ జరుగుతుండాలె.

రాం-దా:- ఊరుకోదలుచుకుంటే యిందాకా రావడ మెందుకు? దేనితోనూ సంబంధం లేదనుకుంటే యింటిదగ్గిరనే వుందుం. సంగతులన్నీ విన్నారుకదా! మీకేమి తోస్తున్నది?

జో:- లోకమంతా ఆనందమయం అనుకున్నాను. ఇప్పుడు దుఃఖమయమని తోస్తున్నట.

రా-దా:- అయితే రెండో మెట్టుకు వొచ్చావు. రెంటికీ సమన్వయం కుదిరితే సత్యంలో నిలుస్తావు.

మా:- మొదటి మెట్టు సుఖమా: దుఃఖమా?

రా-దా:- ఎటు ప్రారంభమైనా వొకటే. మూడవమెట్టు యెక్కినవాండ్లు ధన్యులు.

మా:- నేను సుఖందాటి దుఃఖములో వున్నా.

రాం-దా:- కన్నీళ్ళలో కాలు జారేను. జాగ్రత్త!

## ౧౬

### రెండు బృందావనాలు

తెల్లవారంగనే మామూలుప్రకారం జనమంతా లేచారు గాని అలబల మంతగా లేదు. ఉన్నవాండ్లు మధ్యాహ్నం కట్టుక పోయేటందుకు అన్నం వండుకుంటున్నారు. ప్రార్థనకు మొదటి గంట కొట్టంగనే పుల్లప్ప రామదాసు దగ్గరకు వచ్చి,

పు:- నలుగురినీ పోగుచేసి మంచిమాటలు యేమైనా చెప్పుతారా? యేదో శాస్త్ర తతంగం జరుపుతుంటే జనం అంతా యిక్కడనే పోగుపడివుంటారు.

రా-దా:- వాండ్లు యే మెత్తుకు వచ్చేదీ చూచి అవసర మైతే మనం సాయంత్రం పెట్టుకుందాం. ఈ సమయంలో ప్రతి రోజూ కృష్ణకు బోయి స్నానం చేసేటందుకు వుపయోగింతాం. ప్రతిరోజూ స్నానం చేసే అలవాటు మనం నేర్చుకోవాలె. కొల్ల లుగా దగ్గెర నీళ్ళు వున్నప్పుడు మనం తప్పకుండా స్నానం చెయ్యాలిసిందే.

పు:- అట్లయితే జనం చద్దెన్నం దినకముందే స్నానం చేతాం. రేపటినుంచీ ప్రారంభించవచ్చు.

రా-దా:- రెండోగంట కొడుతున్నారు. మనం పోకపోతే పెద్దవాండ్లను పిలిపిస్తారేమో?

పు:- అక్కడికి మన కేమి పని? యిక్కడికే రమ్మన మందాం!

రా-దా:- ఎట్లైనా సరే కాని మనం వొక్కొక్కండ్లం యే విధమైన మాటా యియ్యవద్దు. నలుగురితోనూ మాట్లాడందే జవాబు చెప్పడానికి వీలులే దందాం. మనం నలుగురం సంప్రదిం చుకొనే యే సంగతీ చెప్పవచ్చు. ఈసంగతి నాయకులందరితోను చెప్పు.

పు:- వొంటరిగా పిలిపిస్తే పోయి యీ మాట చెప్ప మంటారు.

రా-దా:- పోతే తప్పేమున్నది? నమ్మె 'ప్రస్తుతం బోధకు రా' మనేగా! నీవు మీ యింటికి పో.

సాధారణంగా రెండోగంట కొడుతుండంగనే జనం చేర బారుతుండేవాండ్లు. పాదిరీగారు దుస్తులు వేసుకొని కిందికి వచ్చి భోజనం చేస్తున్నారు. జనం రాకపోవడంచేత దొరగారితో చెపుదా మని పోలు వచ్చి తొంగిచూచి అన్నం తింటున్నా రని వెనుకకు బోయి పంచాదిలో నిలువబడ్డాడు. దొరగారు కాఫీ తాగి వచ్చి,

బ్రౌన్:- పోలూ! యెవరూ రాలేదా?

పో:- ఒక్క పురుగుకూడా రాలేదు. కుట్ర జరుగుతున్న దని తమ కప్పుడే మనవిచేశానుగా!

బ్రౌన్:- వారికి దేవుని మతం అక్కరలేకపోతే ఈ సెటిల్మెంటు తీసివేయింతాం.

పో:- అయ్యా! తొందర పడగూడదు. రామదాసూ, పుల్లప్పా చేసేపనికి అందరినీ శిక్షించటం బాగుండదు. ఒకరిద్దరి దుర్మార్గంవల్ల అందరినీ సత్యమతానికి దూరంచేయటం న్యాయమా?

బ్రౌన్:- నాయకులను నలుగురినీ పిలిచి మాట్లాడుదామా?

పో:- బెట్టుతక్కు వని నా అభిప్రాయం. ఇప్పటి బిగువు మీద పిలిస్తే రామంటారేమో! యిన్స్పెక్టరుగారు కేసు పెట్టడానికి వొప్పుకున్నారు. ఆ రెండు కుటుంబాలనూ పనికి పంపకుండా వుంచివేసి తక్కినవాండ్ల నందరినీ కొలనుకొండ పంపివేస్తా. ఇంత మందిలో అరెష్టు చేయడం కూడా కష్టం. అడివిజనం తిరగబడితే అపాయం. మధ్యాహ్నం రైలుమీద దెక్కించి గుంటూరుకు తీసుకొని పోవచ్చు.

బ్రౌన్:- సాక్షు లున్నారా?

పో:- ఒప్పుకొన్న నలుగురు పోలీసులనూ యిక్కడ ఫారా వుంచుతా. జనులలో నాకు ముఖ్యమయినవాండ్లను హెచ్చరించిచూ స్తే తమవల్ల కాదన్నారు. తమరు సాక్ష్యంగా వుంటే పకడుగా వుంటుంది.

బ్రౌన్:- ఎబ్బె! నే రావడం వెలితిపని. తాడేపల్లిపోయి రెడ్డిని తీసుకొనిరా. నీతో కలిపి ఆర్గురు సరిపోతారు. తక్కిన జనాన్ని యిక్కడ వుండకుండా చూడు.

పో:- ఒక రిద్దరు జబ్బువాండ్లు మిగిలివున్నా కొండదగ్గర మస్తరు వేయిస్తా. రెడ్డిని యిక్కడికి తీసుకొనిరానా?

బ్రౌన్:- నాదగ్గర కెందుకు? తప్పకుండా రైలుకురమ్మను. సాక్షు లంతా హాజరులో వుంటే విచారణ వెంటనే ప్రారంభం

అవుతుంది. మంగళాపురం తెలియకుండా చూడు. వాండ్లు వచ్చి విడిపించుకొని పోతారేమో?

పౌ:- ఇక అది వట్టిమాట. కేసు పెట్టినతర్వాత కలెక్టరు గారు విడిపించరు. డిప్టీకలెక్టరుగారు కేసు విచారణలో యేమి చేస్తారో? తమ రెకుగుదురుగాంవాలెనే!

బ్రౌన్:- యిప్పుడు శివయ్యగారు వచ్చారుగదా! నాకు ముఖ్యుడే! సాక్ష్యం కనీసం రేపైనావిచారణ జరిగేటట్టుచూడండి. మన యిన్స్పెక్టరుతో నే మాట్లాడవలసి వుంటుందా?

పౌ:- కేసు పెట్టడానికి వొప్పుకొన్నాడు గాని తప్సీళ్ళల్లో మెలికెలు పెడుతున్నాడు. తమరు పిలిపించి కేసులో పోలుసలహా ప్రకారంపోతే బాగుంటుం దనిమాత్రం అనండి. లోతుకుబోవద్దు.

బ్రౌన్:- నీపనిమీద నీ వుండు. నే పిలిపించి చెపుతా. ఈ వుత్తరం సాయంత్రం యింటికి పోయి డిప్యూటీకలెక్టరుగారికి యియ్యి. తప్పక పని చక్కపడుతుంది. నీవు నోటిమాటలతో కూడా కేసుసంగతి చెప్పు.

పౌ:- తమదర్శనం మళ్ళీ గుంటూరునుంచి వచ్చే! వీళ్ళను అరెస్టు చేశారని వినంగనే జనం అంతా దంగిపోతారు. రేపు మామూలుప్రకారం ప్రార్థనకు వస్తారనుకుంటాను.

బ్రౌన్:- రేపు నీవు పనిపూర్తి చేసుకొని వస్తే మర్నాడు ప్రార్థనకు రమ్మందాం శిక్ష వేశారని తెలిస్తేనేకాని బెదురు పుట్టదు. దానిమీద క్రమంగా మెత్తబడి లోబడతారు. పని నెమ్మదిగా సాధించాలె.

పౌలు పాదిరీయింటిదగ్గర నుంచి అతివేగంగా తాడేపల్లి పోతున్నాడు. ఆనందం పట్టలేక ఇనస్పెక్టరుయింటికి వచ్చి ఆయనను పాదిరీయింటికి తీసుకొనిపోయినాడు. ఫుల్లప్ప యోవమనిషి. యోవలు తీస్తూ శత్రుసంచారం కనిపెట్టి వున్నాడు. ఇనస్పెక్టరు గారు తిరిగిరావడం చూచి యెదురుగా బోయి దండం పెట్టి

"యేమి స్వామీ! మీరు దయగల ప్రభువులు. వాండ్ల అక్రమా లకు లోబడి మాబోటివాండ్లకు అన్యాయం చెయ్యకండి."

యి:- యేమిరా! నే నేమిచేసేది? పొట్టకూటికోసం మీ వాండ్లు కన్నాలు వేస్తుంటే మేమూ అందుకే మీకంటే యెక్కువ దుర్మార్గాలు చెయ్యవలసి వస్తున్నది.

పు:- అయ్యా! మీమాటలను పట్టిచూస్తే మా కేదో అక్రమం జరిగేటట్టుగా వుందే!

యి:- తినబోతూ రుచి అడగడం యెందుకు! వొకగంటలో అంతా తెలుస్తుంది.

పు:- అక్రమకేసు పెడతారుగాఁబోలె?

యి:- అటువంటిదే చేస్తారు.

పు:- నావొక్కడిమీద నేనా!

యి:- పాపం! రామదా సుండక తప్పదు. దొర బైటికి వస్తాడేమో, నీవు వెళ్లు. మనం మాట్లాడుతుండగా చూస్తే లాలూచీ అయినా మంటాడు.

పుల్లప్ప:- (రామదాసింటికి పోయి) అయ్యా! వ్యవహారం బెడిసిందే!

రా-దా:- నాకు అరికాళ్లు దురదగా వున్నవి. ప్రయాణం తగిలేటట్టుగా వున్నది.

పు:- మనమీద కేసు పెట్టబోతున్నా రని యిన్స్పెక్టరు గారు చెప్పారు. పోలు తాడేపల్లి పోతున్నాడు. వొక గంటలో యావత్తు సంగతీ తెలుస్తుందట. యేమి ఆలోచన?

రా-దా:- మన కేమి ఆలోచన వున్నది? వాండ్లపనిగనుక ఆలోచించుకుంటారు. మనం నిర్విచారంగా వుందాం.

మా:- మనం యేమితప్పు చేశామని కేసు పెడతారు?

రా:- ఓసి పిచ్చిదానా! ఇప్పుడు చెయ్యాలెనా? యెప్పుడు చేసిందో? యేమీ లేకుండా యింతమంది పెద్దలకు బుద్ధి పుట్టి యీపనికి పూనుకుంటారు? వాండ్లు వూరికే నిమిత్తకారణం!

పు:- వాండ్లుచేసేది కేవల కల్పనకదా! మన వుసురు తగలదా?

రా:- తగల కేమి? వాండ్ల పూర్వజన్మ దుష్కర్మ యీరూపంగా పండి ఫలం యింకొకప్పుడు అనుభవిస్తారు. అనుభవానికి యీజన్మలోనే రావచ్చు.

పు:- కేసు యేమని పెడతారో?

రా-దా:- కేసా? మనం తప్పించుకోని పోతున్నట్టూ పట్టుకున్నట్టూ బనాయింపు చేస్తారు. పొరుగూరి మోతుబరి ఆసామీ రెడ్డిగూడా సాక్ష్యమవుతాడు. నలుగురు పోలీసులుకూడా వున్నారు కదా! మనవాండ్లంతా పనికి పోవడంచేత మనకు సాక్ష్యంకూడా వుండదు. నడకయీావత్తూ యింతే.

పు:- పోలేమటుకు సాక్షులు యెట్లా చెప్పమంటే అట్లా చెపుతారు.

రా-దా:- పైగా అదొక టెందుకు? వాండ్ల పేర్లన్నీ మస్తరులో కెక్కుతవి. వాండ్ల సాక్ష్యంవల్ల మనకు ప్రయోజనం లేకపోగా వాండ్లుకూడా తప్పుసాక్ష్యం కింద యిరుక్కుంటారు.

పు:- అయితే మనకు తప్పనట్టేనా?

రా-దా:- ఆహా, ఆరునెలలు శిసలే! నాకు చెక్కబిళ్ళ గతి. నీకు సత్తు బిళ్ళిస్తారు.

పు:- మీ కేమో ఆటగా వుందేమయ్యా!

రా-దా:- దిగులుపడితే తప్పుతుందా? మన మంతా ఖైదుకు పోవడానికి తయారైందేనా? నీవు వర్ణిస్తివికూడాను. మాలక్ష్మి! మనకు ఈ సాయంత్రంనుంచీ రాజుగారి భోజనమే.

పు:- మన ఆడవాండ్లనుకూడా చేర్చారా?

మా:- చేరిస్తే యేచిక్కూ లేకుండాపోను. చేర్చకపోతే (అని పడిపోయింది)

జ్యోతి వచ్చి పట్టుకొని విసిరింది. రామదాసు చన్నీళ్ళు దెచ్చి ముఖాన చిలకరించాడు. కాస్త తెప్పరిల్లి కండ్లుదెరిచి చూచి మళ్ళీ దుఃఖం తెరగా వచ్చి జ్యోతిచేతిలోకి వొరిగింది.

జ్యో:- (కొంగుతో విసురుతూ) అయ్యా! అమ్మ బతికేనా?

రా-దా:- యేమీ పరవాలేదమ్మా! ఊరికే భ్రమ వచ్చింది. వట్టి జాలిపేగులది!

మాలక్ష్మి:- (కాస్త తెప్పరిల్లి) నీవు కైదులోకి పోయి మళ్ళీ నాకు దక్కా!

రా-దా:- అభయం నీకేమీ వద్దు. ఇంకా పదేండ్లుదాకా రాళ్ళుబాదించినా నాకు చావులేదు. నాకు జాతకం నా మేనమామ వ్రాశాడు. అక్షరం తప్పకుండా జరుగుతున్నది.

మా:- నీ కండ్ల యెదుట పోయేభాగ్యం నాకు ఉన్నదా?

రా-దా:- నీవు అదృష్టవంతురాలవు. ముత్తైదువుగా వెళ్ళిపోతావు.

మా:- ఇక నాకు కావలసిం దేమున్నది? పెద్దపిల్లవాణ్ణి చూచేనా?

రా-దా:- పెద్దపిల్లవాడిచేతిలో పోయేప్రాప్తం నాకు లేదు. రంగడికి ముందు మంచిరోజులు వస్తవి.

మా:- యెంతవరకు ప్రాప్తమో అంత!

రా-దా:- నీవుకూడా ప్రయాణంకట్టు. పుల్లప్పా! మీ వాళ్ళను చేర్చకపోతే యెవరిద్వారానైనా మా వూరికి కబురంపే వీలు చూడు. రేపైనా గుంటూరులో గుప్పు మనకమానదు. నాయుడుగారు వినంగానే పరుగెత్తుకొని రానేవస్తారు. అన్నిటికీ ఆయనదే భారం. నాకు చింత వొక్కటే. అప్ప డీ సంగతి వింటే చేతికి వచ్చేది అబద్ధం.

మా:- నీవు లేచి కాస్త ఎంగిలిపడు. ఈ యోచన బాగానే వున్నది. అంతా భోజనానికి లెండి. పుల్లయ్యా! నీవుకూడా లేవ రాదూ? మీ ఇంట్లో హాజరుగా వున్నదో లేదో!

పు:- ఉన్నది. పనికి పోదామని మధ్యాహ్నానికికూడా వండారు. మా వాళ్ళకు కబురుచెప్పి నేనూ తయారవుతాను.

రా-దా:- అమ్మా! జోతీ! నీవు నా దగ్గిర అన్నానికి కూర్చుందువుగాని రా. వాండ్లు యేమి కొంటెతనం చేస్తారో? మనను విడదీస్తారేమో? కలిపివుంచారా అదృష్టవంతులమే. రంగడూ! అమ్మదగ్గిర కూర్చో. జోతీ! నా వంక చూడు. యెందు కేడుస్తావు? హృదయదౌర్బల్యం పనికిరాదు. ధైర్యంగా వుండు. తిను. నే కలిపినముద్ద తిను. నాకు సంతానంవల్ల దుఃఖం సంభవించినా అగౌరవం మాత్రం కలుగలేదు. యెక్కడ వున్నా హృదయానందం అనుభవించగలవు. యెబ్బే! యేడుస్తారూ, అట్లా? (అంటూ పమిట పైకి లాగాడు.)

జో:-మీరు నాకు మళ్ళీ కనబడుతారా?

రా-దా:-అమ్మా! అది పెద్ద ప్రశ్న. ప్రస్తుతం మన కంత విషయ మీ విచారంలో పనిలేకపోయినా యిదివరకు మనకు యెన్ని లక్షలు జన్మలు అయినవో తెలియదుగదా! ఇకముందు యెన్ని కావలసివున్నవో! యెందరు తలిదండ్రులో, యెందరు భార్యాభర్తలో, యెందరు పిల్లలో లెక్కించడం సాధ్యమవుతుందా?

జో:- ఈ విషయం నాకు చాలాకాలంనుంచి సందేహంగా వున్నది. నిన్నడగడానికి ప్రమేయము దొరకలేదు. 'ఇదివరకు యెందరు తల్లిదండ్రులు, యెందరు భార్యాభర్తలు, యెందరు బిడ్డలు, యెందరు స్నేహితులు అయినారో? వీండ్లతో నా కేమి పని?' అనే సిద్ధాంతం ఆముష్మిక ప్రేమకు మూలమైన కుటుంబ ప్రేమను పూర్తిగా ఛేదిస్తున్నది.

రా-దా:- కుటుంబప్రేమ ఆముష్మిక ప్రేమకు మూలమా?

జో:- పోనియ్యి. ఆముష్మికప్రేమే మూలం. ఆ అశ్వత్థం, ఆ న్యగ్రోధం అతి పరివ్యక్తమై కుటుంబప్రేమగా వికసించింది. వికసించిన ప్రేమకు వినాశ మెట్లా గలుగుతుంది? గుణపరిణామ

సిద్ధాంతంయొక్క ప్రయోజనమే పోయిందే! తరులతాగుల్మములు వికసించినట్లు ప్రేమ వికసించి పోతుందా?

రా-దా:- చరాచరములైన సకలభూతాలకూ ఆయాజన్మలలో సమకూరినకర్మ ఫలం జన్మాంతరమందు సంచితములో చేరుతుంది.

జో:- లేక, జీవునియందు జతించి సంస్కారరూపంగ వుంటుంది.

రా-దా:- అది వొక అభిప్రాయం.

జో:- అట్లయితే కర్మసన్యాసం వలన మోక్ష మనే సిద్ధాంతం నాకు పనికిరాదు కర్మరాహిత్య మనగా దుష్కర్మ రాహిత్య మనే అర్థం. బహు జన్మాలవలన దుష్కర్మరహితమై సుగుణరాశి కావడమే పరమావధి. ఈ వూహాప్రకారం సృష్టి మాయగాని భ్రాంతిగాని కాదు. సుగుణములపెంచడాని కేర్పడ్డ కర్మక్షేత్రం. ఆనందమే ఫలం. కష్టసుఖాలరెంటికీ ఆనందం పెంచడమే గమ్యస్థానం. ఇహపరలోకాలు రెండూ బృందావనాలే. రెంటియందూ ప్రేమేరాజ్యం చేస్తుంటుంది. వింటున్నావా?

రా-దా:- కానియ్యవే అమ్మా! వినడానికి ఆనందంగా వున్నది.

జో:- అవును పిల్లలమాటలు తల్లిదండ్రులకు ఆనందంగా వుంటవి. ఆనందంగా వుండకపోతేమట్టుకు పిల్లలు చెప్పకుండా వూరుకుంటారా? విను.

రా-దా:- వింటూనేవున్నానే. నీవు చెప్పేసంగతులు వినడమేకాకుండా ఆలోచించవలసివస్తున్నవి. అందువల్ల పరధ్యానంగా వున్నట్టు కనబడుతున్నా.

జో:- యదార్థం యెట్లావున్నా కోట్లకొలదితల్లిదండ్రులూ, భర్తలూ, భార్యలూ వుండడం నాకు అసహ్యంగా వున్నది. నే నొకమాట చెప్పనా? నీవూ ఆ కూర్చున్న అమ్మా యెన్ని జన్మాల

నా అయ్యా అమ్మలు కావడమే నాకిష్టం. నేను బిడ్డను కావ
ం మీ కిష్ట మవునా? కాదా?

రా-దా:- నాకు ముద్దు పెట్టవే అమ్మా!

జో:- నే నంటే ఆ అమ్మికి యిష్టం కాదుకాబోవాలె. బుద్ధి
ంతురాలుగా కూర్చున్నది.

మా:- అమ్మా! నాకు నోరు రావడంలేదే. (అని పెద్ద
పెట్టున యేడ్చింది.)

జోతి తల్లిని కావలించుకొన్నది. యెందుకని వొకరి నొకరు
డగలేదు.

రా-దా:- అమ్మా! యింకా చెప్పు. మీవంటిపండితులు
న్మజన్మానా మాబోటి దరిద్రులకు పుట్టకపోతే భాగ్యవంతులకు
ట్టవలె నని కోరుకోరాదూ?

జో:- నేను మంచికర్మ చేస్తేకదా భాగ్యవంతులకు బిడ్డగా
యింకొకజన్మలో పుట్టడం. అట్లయితే నా మంచికర్మవల్ల నివే
టీశ్వరుడవై నీకే బిడ్డను కావలె నని కోరుకోవడం నాకు
యెక్కువయిష్టం.

రా-దా:- ఒప్పుకున్నా.

జో:- తల్లి సగంవియ్యపురా లన్నారు. నీకు యింకొకరిని
చేసుకోవలె నని వున్నదేమో చెప్పవే!

మా:- అయ్యో! పిల్లా! యేమిపోకిళ్లు పోతావే! వొకపంట
నవ్వు, వొకపంట యేడుపూగా వున్నది నాపని. మీ అయ్యకు
యింకొకరిని చేసుకోవలె నని వున్నదేమో అడుగు.

రా:- ముందు తననడిగితే నన్ను చెప్పమనడం యెందుకు?
ఇదంతా యెందుకు గాని యెప్పుడూ నీవు మా అమ్మవుగా వుండ
వలసిందే.

జో:- అయితే జన్మకొకరిని ప్రేమించడంకంటే బంధు
జాలం యావత్తూ మారకుండా వుండి ప్రతివాడికీ పూర్వజ్ఞానం
వుంటూవుంటె బాగుండదా?

రా-దా:- ఈ జన్మలో కొకరికి బిడ్డగా పుట్టినవాడు మళ్ళీ అతనికే బిడ్డగా పుట్టిన ప్రయోజన మేమి?

జో:- ఇంకొకడికి పుట్టినందువల్ల యెంత ప్రయోజనమో మళ్ళీ ఆ తల్లిదండ్రులకు బుట్టినా అంతే ప్రయోజనం. సుగుణాల వృద్ధిపరుచుకొని దుర్గుణాలు పోగొట్టుకోవడమే జన్మయొక్క పరమార్థం. కాబట్టి యిప్పటి బాంధవ్యాలు ప్రేమవృక్షం పెంపొందడానికి కారణ మవుతూ దుర్గుణాలు నశించి సుగుణపుంజవలకు స్థానాలై నిత్యలీలావిభూతిలో పాల్గొంటూ బృందావనంలో వుండడం నీ కిష్టమేనా?

పోలీసులూ, పౌలూ పుల్లప్పను బేడీలతో తీసుకొనివచ్చి మాలక్ష్మినీ, రామదాసునూ "లేచి వాకిట్లోకి రం"మ్మన్నారు. వాండ్లు మెదలకుండా బయటికి రాంగానే "మీమీద క్రిమినల్ కేసు వచ్చింది. మిమ్ములను అరెస్టుచేసి గుంటూరు తీసుకొనిపోడానికి వచ్చాం" అన్నారు.

రా- దా:- మామీద కేసు యేమని?

పో:- అదంతా విచారణలో తెలుస్తుంది.

పు:- అక్షరాలా మీరు చెప్పినట్లే బనాయించారు.

రా-దా:- పిల్లలు మా వెంట రావచ్చునా?

పో:- నీకూతురు సెటిల్మెంటు లెక్కదాఖలా యిక్కడి నివాసురాలు. కనుక అది రావడానికి వీలులేదు. కాబట్టితే పిల్ల వాడిని జైలులో మీతో వుంచుకోవచ్చు.

రా-దా:- మాతో బాటు వాడికి కారాగృహవాస మెందుకు? ఆయుష్యముంటే స్వతంత్రుడై బతుకుతాడు. మాలక్ష్మి చిక్కాం మనమిద్దరం చివరకు. సద్గురూ! నడువు!

పో:- నీకు బేడీలు వెయ్యానియ్యి.

రా-దా:- వెయ్యండి.

పో:- యిక పదండి.

జోతి యేడుస్తూ కావలించుకోవచ్చింది. పోలీసులు నెట్టారు.

జో:- నన్నీ అడవిలో వదిలిపెట్టి పోతున్నావటే!

మా:- భగవంతుడే రక్షకుడు.

రా-దా:- శ్రీకృష్ణుడు నిన్ను రక్షిస్తాడు. అతడే శరణాగతి.

మా:- మా అమ్మా! జోతీ! రంగణ్ణి కాపాడు

రం:- అమ్మా! నే వుండను.

మా:- పట్టుకో వాణ్ణి.

రా-దా:- అమ్మా! గౌరవం కాపాడు మని నీకు చెప్పనవసరం లేదు.

జో:- చెప్ప నవసరం లేదు. లేదు. లేనే లేదు.

ఫుల్లప్రభార్యా, తల్లీ రామదాసు గుడిసెదగ్గర ఆగారు. గోలపెట్టి యేడ్చే రంగణ్ణి జోతి పట్టుకొని నిలువబడ్డది.

పోలీసులూ, పౌలూ, ముద్దాయిలూ రైలుస్టేషనుకు పోయినారు. మూడుగంటలకు గుంటూరులో దిగి డిప్యూటీమేజస్ట్రేటు కోర్టుకు పోయినారు. సబుయిన్స్పెక్టరూ, ముద్దాయీలూ, ఆ రోజు మధ్యాహ్నం సెటిల్మెంటు విడిచి పారిపోయినా రని పోలీసు వారికి తెలిసి పౌలుతోసహా ముద్దాయీల వెంటబడి తాడేపల్లి కాపురస్థుడు రామిరెడ్డి చేసదగ్గర పట్టుకున్నామని సి. టి. ఆక్టు క్రింద చార్జిషీటు దాఖలుచేసి ముద్దాయీలను హాజరుపెట్టారు.

మే:- యెన్ని రోజులు రిమాండు కావాలె?

పు:- మాకు జామీను యిప్పించండి.

మే:- మీకు జామీ నేమున్నది? ఇదివరకే సెటిల్మెంటులో నిర్బంధంలోనే వుంటిరి.

యి:- సాక్షులు యిప్పుడే హాజరుగా వున్నారు. ఈ రోజే విచారించవచ్చు.

మే:- ముద్దాయీలకు కష్టం లేకుండా సాక్షుల నందరినీ యినస్పెక్టరుగారు యిప్పుడే హాజరుపెట్టారు. కేసు తొందరగ ఫయిసలు అయితే మీకే మంచిది.

పు:- ప్లీడరును పెట్టుకుంటాం. వాయిదా యిప్పించండి

మే:- మీ సెటిల్మెంటువాండ్లు ప్లీడరును పెట్టుకోగ భాగ్యవంతులా?

కోర్టులో హాజరుగా వున్న వొక ప్లీడరు:—సెటిల్మెంటు చుట్టూ చోరీలు బలమైనవి. ఆస్తికొనేవాండ్లు వీళ్ళ వెంట వచ్చి వుండాలె. వాండ్లే అన్ని యేర్పాట్లు చేస్తారు.

పు:- ఆ ఆస్తి మీ ప్లీడర్లకుకూడా కొంత చెందు తున్నదిగా!

మే:-వీ డెవడో గడుసువాడండీ!

ప్లీ:- యిదివర కెన్ని శిక్షలు పడ్డవో?

మే:-వీరు కోర్టులో హాజరుగా వున్నారుగా! వీరిని పెట్టు కోరాదా? కేసు యివ్వాళనే పరిష్కార మవుతుంది.

పు:- అయ్యా! వారు మాకు వద్దు. కొనితెచ్చుకోవడ మవుతుంది.

రా-దా:- వా రెవరో మే మెరగమండి.

మే:- రేపటికి తెచ్చుకోండి. వాయిదావేస్తా.

ముద్దాయీలు:-చిత్తం.

## ౧౨

వానప్రస్థం

డిప్యూటీ కలెక్టరాఫీసునుంచి ముగ్గురు ముద్దాయీలనూ సబుజయిలుకు తీసుకొని పోతున్నారు. దారిలో యెవరైనా మంగళాపురపువాండ్లు కనబడతారేమోనని చూచాడు. యెవరూ కనబడలేదు. లాయరు మేడదగ్గర నారాయణరావుగారి గుమాస్తా

మెనుసుపడితే పంతులుగా రున్నారా అని అడిగాడు. అందుకు వారు "సత్తెనపల్లి క్రిమినల్ కేసునిమిత్తం వెళ్ళారు. ఎనిమిది గుంటలరైలుకు రావలె. వస్తే వురయుం తప్పకుండా పదిగంటల లోగా సబుజయిలుకు వచ్చేటట్టు చేస్తా"నని చెప్పేరు. ఆయన గారు రాకపోతే యింకొకరిని యేర్పాటు చేయమని చెప్పబోయి నాడు గాని "అయిదుగంట లైనది, లిమిటేషను కాగితాలు దాఖలు చేయవలె"నని వెళ్ళిపోయినాడు. రామదాసు జయిలులో అడుగు పెట్టేవరకు ఠాం ఠాం అని అయిదుగంటలు కొట్టారు. అందుకు సంతోషించి వార్డరును బతిమాలుకొని ఒక రూపాయి యిచ్చి కూలిమనిషిని యేర్పాటుచేసి మంగళాపురం కబురుపంపాడు. వార్డరుతో మాట్లాడవలె నని అప్పుడే సబుజయిలుకు వచ్చిన పోలు అనుమానపడి కూలిమనిషి వెంబడే అతనియింటికి వెళ్లాడు.

పో:- బెజవాడ పోవడానికి యెవరైనా మనిషి దొరుకు తాడా ?

కూ:- మంగళాపురం పోవడానికి యిప్పుడే కూలికి వొప్పు కున్నా. తొమ్మిది గంటల రైలుకు పోతున్నా.

పో:- యేమాత్రం కూలి తీసుకుంటారు బెజవాడకు ?

కూ:- మంగళాపురానికి ఖర్చులతో సహా రూపాయికి వొప్పుకున్నా.

పో:- నాకు బెజవాడకు పొద్యేమనిషి నేర్పరుచు, రెండు రూపాయి లిస్తా. పొద్దున తొమ్మిదిగంటలకు రావచ్చు. ఖర్చులు పోను రూపాయిన్నర మిగులుతుంది.

కూ:- అయ్యో! మిగలా వొప్పుకుంటినే. అం—— యే మంటారు ?

పో:- పొద్దున తొమ్మిదిగంటలకు సరాసరి రైలుమీందనే మంగళాపురం పోదువుగాని రెండుకూలిభత్యాలూ నీకే దక్కుతవి. నాఫుత్తరం తీసికొనిపోవలసిన మనిషి స్టేషన్ దగ్గర మార్యాడే

స్త్రతంలోనే వుంటాడు. పోయి అక్కడ పడుకో. తెల్లవారేవరకు అక్కడికి వస్తాడు. రాంగనే ఆయన కిచ్చి రైలుకు రా.

కూ:- నాకు రైలు అందుతుందా?

పో:- అందకేమి? నాలుగుగళ్ళ పొద్దెక్కిగాని బండి బయలుదేరదు. తిరుగుజవాబు తెచ్చావా అంటే రూపాయి బహుమతి యిస్తా. నాది చాలా అవసరమైన పని. అన్నం దిని రైలుకు బయలుదేరు. నేను రైలుదాకా వచ్చి యెక్కిస్తా.

కూ:- సరే.

కూలిమనిషిని యేర్పాటు చేసుకొన్నతరువాత రామదాసుకు ధైర్యం వచ్చింది. అతినినీ, పుల్లప్పనూ, మరి నలుగురు యెరుకలవాండ్లనూ కలిపి వొకగదిలో వేశారు. మాలక్ష్మి నొక్కదానినీ వేరేగదిలో వేశారు. అందరికీ ముంతలూ, అన్నపుమల్లలూ యిచ్చారు. జొన్నన్నపుముద్దా, చప్పని పులుసుకూరా భోజనం పెట్టారు. పుల్లప్ప తినడం చూచి తన కిచ్చినపడి యావత్తూ తిన్నాడు. మాలక్ష్మి వొంటరిది గావడంచేత తినలేకపోయింది. లఘుగురుశంకల నివర్తికోసం రెండుముల్లలూ, పడుకోవడానికి కొబ్బరినారచాపా, గొంగడీ ప్రతివాళ్ళకూ యిచ్చారు. భోజనం కావడంతో ఓ కొట్లో పెట్టి తాళంవేశారు. ఖైదీ లందరూ కాసేపు లోకాభిరామాయణాలు చెప్పుకొని చీకటిపడంగానే చుట్టలుముట్టించారు. కొందరికి పొగాకు నార్డరే తెచ్చి యిచ్చాడు. పుల్లప్ప బొడ్డులో దాచుకున్న పెట్టె వొక పొగాకుతుంపు కొసుక్కొని నోట్లో వేసుకున్నాడు. గది పొగతో నిండి రామదాసుకు కొరపోయింది. చుట్టలు కాల్చిన తర్వాత కొందరు సంగీతాలు మొదలుపెట్టి బూతుపాటలు సాగించారు. ఒకడు తాను జేసిన దొంగతనాలన్నీ వర్ణిస్తున్నాడు. రామదాసు గదిలో వున్న ఎరుకలవాండ్లు వొకరి పొగా కొకరు దొంగిలించుకొని కొట్లుకున్నారు. సంగీతాలు పూర్తి అయ్యేవరకు పదిగంట లయింది. మధ్య మధ్య పోలీసులు వచ్చి అదమాయించారు గాని వాళ్ళమాట లెవ్వరూ

లక్ష్యపెట్టలేదు. అందరూ వుచ్చమల్లలు నింపి క్రమ క్రమంగా నిద్రపోయినారు. గది యెరుకలవాండ్ల నోంటి కంపూ, మూత్రపు కంపూ, పొగకంపూ కలిసి రామదాసుకు దుస్సహమైంది. పుల్లప్ప మాత్రం తొమ్మిదిగంటలకల్లా నిద్రపోయినాడు. "వుత్తరం మంగళాపురం చేరి వుంటుందేమో? అప్పాదాసుకు యెట్లా వున్నదో? జోతీ పిల్లవాడూ పస్తు పడుకున్నారేమో? యింకా యేమి అల్లరులు జరుగుతున్నవో? సెటిల్మెంటులో జనం అంతా భయపడ్డారేమో!" అని కలగలుపులుగా ఆలోచనలు వస్తూ వుంటే యోచించుకుంటూ ౧౨ గంటలవరకూ నిద్రపోలేదు. ఒంటిగంట వినబడ్డది. దోమలు కుట్టుతుంటే గొంగడి కప్పుకున్నాడు. ముఖాన కుట్టడం ప్రారంభించినవి. గొంగడి ముఖాన కప్పుకోడానికి చాలలేదు. వత్తిగిలి ముడుచుకొని పడుకుంటే చెమట ప్రారంభించింది. గొంగడి యెన్నాళ్ళనుంచో యెంతమందో కప్పుకున్నారు. ఎన్నడూ ఉతికిన పాపాన పోలేదు. నీళ్ళలో ముంచితే వున్ని అంతా వూడిపోతుంది. రాలిపోతున్న బొచ్చు ఘాటు కంపుతో నోట్లో ముక్కులో జొరబడుతున్నది. గది కెక్కడా గాలివచ్చేవైపు కిటికీలు లేవు. చేతుల కందకుండా కప్పుకు ఆనుకొనివున్న చిన్న కిటికీని జల్లెడ రేకుతో మూశారు. వాకిటి దగ్గరకు జవాను వచ్చి లోప లెవరో మేలుకొన్న సడి విని గోడకు రంధ్రం చేస్తున్నారేమో అని చే లాంతరు వెలుతురున పరీక్షించి అందరినీ లెక్కపెట్టుకున్నాడు. సర్కారు పడీ ప్రకారం కూరలో నువ్వులనూనె పోయడంచేత రామదాసుకు కడుపులో కళపెళ్లాడడం మొదలు పెట్టింది. నూనె తిరుగుమోతలో వెయ్యవలసినా వచ్చి నూనే పోశారు. బహిర్భూమికి పోవలసివచ్చి తన మల్లలు దేవులాడుకున్నాడు. మూత్రపు మల్లలో చెంబు పడ్డది. దాని ధర్మాన నీళ్ళయింత బొర్లపడలేదు. ప్రక్షాళనమైన తర్వాత మిగిలిన నీళ్లు తాగడం యింకా అలవాటు కాలేదు. ఉక్కకు దప్పికై నిలవలేక ఆ నీళ్ళే తాగాడు. కసక్కసుమల్ల యెత్తుగా

వుండటంవల్ల కూర్చోవడం కష్టమై నేలకు చేతు లానించి వొంగ న్నాడు. ప్రతూళనం చేసుకోబోతే మసకపడ్డది. అందరూ కద క్కుంటే గది వరదగట్టుతుందేమో అనుకుంటే తక్కిన వాళ్లు వట్టి ముంతలే తెచ్చి లోపల బెట్టుకున్నట్టు జ్ఞాపకం వచ్చింది. ఎవరిని నీళ్లు తెచ్చుకోనియ్యలేదు. నీళ్ళ గంగాళం వొట్టిది కూడా అయింది. గదిలో వాసన వ్యాపించకుండా వొక మల్లమీద రెండ వది మూత పెడదాం అనుకుంటే వొకటి చిన్నదై దూరిపోయింది పెద్దది మూత పెడితే డొర్లి గది కళ్మలం అవుతుందేమో అని తెరిచే వుంచాడు. తెల్లవారుజాముకు దోమలపోడు కొంచెమణిగి కూసుకు పట్టింది. ౪ గంటలైంది. ఒకరి తర్వాత వొకరు అందరూ అనుమానం తీర్చుకోవడం ప్రారంభించారు. ఎవరూ నీళ్లుపయో గించినట్టు కనబడలేదు. ౧౭ చిప్పలలోనుంచీ దుర్గంధం రేగింది. సార్జంటు వుదయం అందరినీ లెక్కపెట్టుకోవడం కోసం వచ్చి ముక్కుకు గుడ్డ అడ్డం పెట్టుకొని చేలాంతరు పెట్టి అందరినీ వుండ జూచుకున్నాడు. లాంతరు వెలుతురున ౨౦ మళ్ళ బరువుగల యినప తలుపు పుల్లప్ప చేసిన జైలు వర్ణనను జ్ఞాపకానికి తెచ్చింది. గది వారజూశాడు. కడపరాళ్లు, సున్నంతో బిగించిన రాతిగోడల మీద లేకు తనాబీలు, గుంటూరులో యే భాగ్యవంతుని భవ నానికీ అంత చక్కగా అమర్చలేదు. అవి చూచి రామదాసుకు సంతోషం కలుగలేదు. ఆరుగంటలు కొట్టంగనే తలుపులు దీసి అందరినీ బయటికి రమ్మన్నారు. అందరూ మూత్రపురీషపాత్రలు తీసుకొని బయలుదేరుతుంటే పిచ్చుకత్తులూ, తుపాకులూ తీసు కొని జవానులు కాపలాకు వెంట వస్తున్నారు. రామదాసుకు నవ్వు వచ్చింది.

రా:- అయ్యో! ఖజానా పెట్టెలకు కూడా యింత బందో బస్తుగా కాపలా చెయ్యరే! ఈ మల్లలకు పిచ్చుకత్తుల ఖారా లెందుకో ?

పు:- వాటికోసం కాదు. మనం పరిగెత్తి పోతామని ...యం!

అందరూ పాకీనొడ్డి దగ్గర దింపారు. అందరినీ పాకీదొడ్లోకి ...మ్మన్నారు. రామదాసు "నేను ముంత తెచ్చుకోలేదు. బహి ...ర్భూమి కెట్లా పోవడం?" అన్నాడు. "మాలపోతుకు నీళ్లు ...కావలసివచ్చిందా?" అని పోలీసువాడు తుపాకీ మడిమెత్తో పొడవ ...వచ్చాడు. ఒక యెరుకలవాడు "ఈ మాలనాయుడికి కొట్లోపడ్డా ...ళ్లు కావలసి వచ్చిం"దని యెగతాళి చేశాడు. అందరూ వొక ...వరణంలోకి పోయినారు. లజ్జారహితులై వొకరి బుజాల కొకరు ...నుకొని కూర్చున్నారు. రామదాసుకు మనసొప్పలేదు. ఊరక ...లవబడ్డాడు. నీళ్ళు కూడా లేక పోవడంచేత వూరకుందామను ...కున్నాడు. అందరూ "నాయుడుగారు నిలుచున్నారే!" అని యెగతాళి చేశారు.

నాలుగైదు నిమిషాలయింది. బయటనుంచి పోలీసులు "లెండి" అని వుత్తరువు చేశారు. అందరూ లేచి బయటికి వచ్చారు. "లోపలికిబోయి ముంతలూ, బువ్వ మల్లలూ తెచ్చుకోను పదండి" అని వుత్తరు వయింది. అందరూ తెచ్చుకొని బొగ్గుపొడి పెట్టి కొందరు పండ్లు తోముకున్నారు. తలా ముంతెడు నీళ్ళిచ్చారు. రామదాసు బొగ్గు నూరుకుండేవరకు గంజికి రమ్మన్నారు. మొగం కడుక్కుంటూ ఆలస్యం చేశాడని పోలీసువాడు తుపాకి మడిమెత్తాడు. నిన్నటి పోటుకు గూడమీద కట్టిన కదుం యింకా పోలేదు. లేచి నలుగురితో పరిగెత్తాడు. అందరూ గంజి పోయించుకొని తాగడానికి కూర్చున్నారు. రామదాసు నోటిలో వేసుకున్న బొగ్గు పోవడం కోసం నోట్లో నీళ్ళు పోసుకొని "దూరంగా పోయి వుమ్మివేసి రావచ్చునా?" అని పక్కన కూర్చున్న పుల్లప్ప నడిగాడు. లైను వదలగూడదని అతడన్నాడు. అందువల్ల మెల్లగా కింద వుమ్మి వేసేవరకు పక్కనుంచి వార్డరు చూసి అన్నం దినేచోట గలీజు చేస్తున్నావని ప్రహరించాడు.

అందరితోపాటు గంజి తాగడం ముగించడానికి తొరగా తా
వరకు కోవమారింది. అంతా మల్లలు కడుక్కొని మిగుల్చుకున్న
నీళ్ళు దీసికొని కొట్లల్లోకి నడిచారు. తాళాలువేసి పోలీసుల
విశ్రాంతి తీసుకుంటున్నారు. పోలీసు హడావిడి అణిగిన తరువాత
రామదాసుకు స్వస్థచిత్తం గలిగింది. పుల్లప్ప ఖైదులో అనుభవం
గలిగినవాడు గనుక వార్డరును పని వున్నవాడివలె పిలిచి "నారా
యణరావుగారు అనే ప్లీడరుగారు వచ్చారా?" అని అడిగాడు

వార్డరు:- వారు యిప్పుడెందుకు వస్తారు? కేసులుంటే
మేజస్ట్రేటుగారు వచ్చిన తరువాతగాని రారు.

రా:- వారిని ప్లీడరుగా కుదుర్చుకోవలెనంటే యేమి
చెయ్యాలె?

వా:- పందరూపాయి లిట్లియ్యి, నే కుదిర్చిపెడతా.

రా:- మీరు పంపిన మనిషి వస్తేగా?

వా:- మరి ప్లీడరు మాటలతో వస్తాడా?

రా:- నారాయణరావు పంతులుగారు నన్నెరుగు. నే నీ
అవస్థలో వున్నానంటే తప్పకుండా వస్తారు. అన్నిటికీ నేను సమ
ర్పకం చెప్పుకుంటా.

వా:- నేను బయటికిపోతే మీరంతా పస్తు పడుకోవాలె.
మీ వాండ్లకు మనిషిని పంపించావుగదా. వాండ్లు వస్తే వాండ్లే
మాట్లాడుతారు. లేకపోతే పెద్దమనుష్యుల నెందుకు శ్రమపెట్టడం?
ఒక గంటలో రైలు కూడా వస్తుంది.

రామదాసు తన చాపమీద యేదో ఆలాపనగా కూర్చుని
యేమీ తోచక పడుకొని నిద్రపోయినాడు. రాత్రి నిద్ర లేకపో
వడంచేత బాగా నిద్ర పట్టింది. కొంతసేపటికి లేచి "పుల్లప్పా!
రైలు వచ్చిందా!" అని అడిగాడు.

పు:- ఏ రైలు?

రా:- పడమటినుంచి యెనిమిది గంటలకు వచ్చే రైలు.

పు:- ఈపాటికి బెజవాడపోయి వుంటుంది.

రా:- నా కోసం యెవరూ రాలేదా ?

యెరుకలవాండ్లు:- గొప్ప ఉద్యోగస్థులంతా "మాల నాయుడుగా రున్నారా ?" అని అడిగితే వారు నిద్రపోతున్నా రనీ, లేపడానికి వీలు లేదనీ చెప్పాం. మళ్ళీ వస్తామని వెళ్లారు.

రా:- యెందుకయ్యా అయినదానికీ, కాని దానికీ నన్ను మీరు యెద్దేవ చేస్తారు ?

యెరు:- కాకపోతే మాలపోతుకు నీ కీ పోకిళ్ళేమిటి ? ఎవరో మహా నీ కోసం వచ్చేటట్టు వారు వచ్చారా వీరు వచ్చారా అని ప్రశ్నలు వేస్తుంటావు. అంతా నిన్ను జూచి బెమిసి పడుతున్నా రనుకున్నావా ?

రామదాసుకు నాయుడుగారు రావడం విషయమై ఆదుర్దా పోయి మనస్సు ఆత్మ పరీక్షలో మగ్నమైంది. "ఈ యెరుకల వాండ్లు నే నిక్కడికి వచ్చినప్పటి నుంచీ అకారణంగా నా మీద కంటుగా వున్నారు. నన్ను జూచి హేళనగా మాట్లాడుతారు. నిందాస్పదమైన విషయం నాలో యేదో వాండ్లకు కనబడు తున్నది. మహోద్యమాలతో నాకు సంబంధం వుండడంవల్ల తద్వారా పెద్దవాండ్లతో నాకు పరిచయం గలుగుతున్నది. నేను నా స్థితిగతుల్నిబట్టి వారిస్నేహానికి అనర్హుడనైనా, నాకు లభించిన వుత్తమ పురుష సాహచర్యంవల్ల నేను గర్వించి ఆ గర్వాన్ని నా మాటలలోనూ, చర్యలలోనూ నిశ్చయంగా కనబరుస్తుండబట్టే భగవంతుడు నన్ను బాగుచేయడంకోసం యెరుకల ద్వారా యెరుక గలిగించాడు. ఇక నాయుడుగారు వచ్చే విషయం నేను యోచించను. వా రెందుకు రావాలె ? లేకపోనిశ్రమ వారి కెందుకు ? ఇంతవరకూ నా కాత్మ పారిశుధ్యం రాలేదు. నేను కర్మ సాపేక్షకంగా చేస్తున్నాగాని సంగ రహితుణ్ణిగాలేదు. నాతో జోతినీ, రంగణ్ణీ దేవుడు విడదీశాడు. నిస్సంగత్వం యింకా నాకు కుదరదా ? ప్రపంచంతో నా కింకా యేమి సంబంధం వున్నది ?

అయితే సన్యాసానికి నే నర్హుడనా ? మాలక్ష్మి సెటిలుమెంటులో వుండక యిక్కడికి కెందుకు వచ్చింది ? యింకా కొంతకాలం వానప్రస్థుణ్ణిగా వుండవలసి వున్న దేమో ! గార్హస్థ్యానికీ, సన్యాసానికీ మధ్య వొకమెట్టు వున్నది. ఈ మెట్టు దాటేరోజులు నా కింకా రాలేదు. కాని యీ రోజునుంచీ వానప్రస్థుడనే. కారాగృహావాసం వనవాసానికి బదులుగా వచ్చింది. ఆహా ! భగవానుడా ! ఏమి నీ అద్భుతచర్య ! నీ బిడ్డల వర్తన మెంత చక్కటి మార్గాల దిద్దుతావు ! పైకి ఆపదల మోస్తరుగా తెచ్చిపెట్టి వాటిని మహావరములుగా మారుస్తావు.”

రామదాసు యీ అవస్థలో వుండగా పుల్లప్ప యెరుకలతో రామదాసు చరిత్ర చెప్పాడు. ఎరుకలవాండ్లు స్టూవర్టుపురం సెటిల్ మెంటులో వుండేవాండ్లు. తప్పించుకొని పోయిన ఆరునెలలకు కర్నూలుజిల్లా నల్లమలలలో తక్కెళ్ళజగ్గడి గుంపుతో చేరి చోరీలు చేస్తూ పట్టుపడ్డారు. నేరాలు చేసినట్టు సాక్ష్యం కుదరక సెటిల్మెంటులోనుంచి తప్పించుకుని పోయినందుకు విచారణ జరుగుతున్నది. వాండ్లు రెండు నెలలనుంచీ రిమాండులో వున్నారు. ఇప్పటికీ విచారణ పూర్తికాలేదు. ఈ యేడుగురిలో నాయకుడు జగ్గడిసి స్వయంగా యెరిగినవాడు. వాడి చర్యలన్నీ రెండు నెలల నుంచీ ఖైదీలకూ, పోలీసులకూ వర్ణించి చెప్పుతున్నాడు. వాడికి తోచిన సంగతులు చెప్పడంతప్ప జగ్గడిని గురించి యితరు లడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పడు. ఎంతసేపూ అతణ్ణి పొగడడం తప్ప జాడాలు తనకు తెలియవంటాడు. రామదాసు దిగువతరగతుల కోసం పని చేసేవాడనీ సెటిల్ మెంటు వాస్తవ్యుల కష్టాలు నివారించడం కోసం పని చేస్తూ ఖైదుపాలైనాడనీ తెలిసి యెరుకులు తమ రాయనను వ్యాఖ్యానం చేసినందుకు చింతపడ్డారు. పదిగంట లయింది. భోజనం కోసం గంట కొట్టారు. రామదాసు యింకా తన ధోరణిలోనే వున్నాడు.

పు:- రామదాసుగారూ ! భోజనానికి వేళయింది.

రా:- అట్లాగా, లేతాం. ఏదో పరధ్యానంగా వున్నా.

ఎరు:- (సాగిలపడి) సామీ! తెలియక తప్పుచేశాం. ఈ తప్పుగాయి సామీ! (అని చెంపలు వేసుకొంటున్నారు)

రా:- నాయనా! మీరేమీ తప్పుచేయలేదే? మీరు నాకు గురువులు. మీరు నమస్కారం చేయకూడదు.

ఎ:- సామీ! ఈ తప్పు కాచానంటేనే లేస్తాం. లేకపోతే బువ్వ లేకుండా యెన్నాళ్ళయినా యిట్లాగే పటిస్తాం.

వార్డరూ పోలీసులూ వచ్చి తలుపు తీశారు. ఈ దృశ్యం చూచి విభ్రాంతి పడిపోయినారు. రామదాసు తెల్లపోయి గాబరా పడుతున్నాడు.

వార్డరు:- ఏమిటిది?

పు:- ఆ మహానుభావుణ్ణి హేళనచేసి తప్పు తెలుసుకొని పశ్చాత్తాపపడి తప్పు గాచమని వేడుకొంటున్నారు.

వార్డరు:- చూడూ వాండ్ల మోటుభక్తి! ఈయన యెవరు?

పు:- మంగళాపురం. రామదాసుగారని, మహాజ్ఞాని.

వార్డరు:- సంగదాసు తండ్రా యేమి!

పు:- అదేమో నాకు తెలియదు.

వార్డరు:- అడుగు. ఆయనా దుఃఖపడుతున్నారే!

పు:- వాండ్ల పశ్చాత్తాపం చూచి ఆయనకూ ఆశ్చర్యం వేసింది. ఆ కన్నీళ్ళు ఆనందంచేత. అయ్యా! రామదాసుగారూ! సంగదాసుగారుట మీకు బంధువుడా?

రా:- ఏదో! మాగర్భవాసాన జన్మించాడు. దానికి మా యోగ్యతేమీ కారణంగాదు.

వార్డరు:- అయ్యా! మా జైలు పవిత్రమైంది. మళ్ళీ రామదాసుగారే ఖైదులో బడ్డారు. మా తప్పులు క్షమించండి. మాకుగూడా తమరాకవలన తరణోపాయం గలిగింది.

రా:- అయ్యా! తమ మంచితనంచేత ఆమాట లంటున్నారు. నాయందంత యోగ్యత లేదు. మీరు లేవండమ్మా, మీవల్ల నాకు మహోపకారం గలిగింది.

వార్డరు:- వాండ్లపట్టే పట్టూ. మోటుభక్తిలో అంతబల మున్నది. క్షమించా లనండి.

రా:- లెండమ్మా! మీరు చేసినతప్పే లేదు.

ఎ:- (చెంపలు వేసుకుంటూ యేడుస్తూ) చేశాం సామి! అపచారం చేశాం సామి!

రా:- ఆహా! యేమి వాండ్ల పశ్చాత్తాపం! అటువంటి నిష్కల్మషబుద్ధి నా కుండరాదూ? మీరంతా రామా అనుకోండి. మీతప్పు లన్నీ పోతవి.

ఎ:- రామ! రామ! చాలు సామి! మంత్రం దయ చేశారు.

రా:- (పరవశుడై)

కీర్తన

అంతా రామమయం యీ జగ-మంతా రామమయం

అంతరంగమున ఆత్మారాము డ-నంతరూపముల వింతలు సలుపగ. అం॥

(అంటూ నృత్యం చేశాడు.)

పోలీసులూ, వార్డరూ, పుల్లప్పా, యెరుకలూ పరవశులై అంతా నృత్యం చేశారు. జైలు రామనామంతో ప్రతిధ్వనించింది.

రా:- అయ్యా! మనకు వేళవుతున్నది. ఎవరిపని వారు చూసుకోండి. ఒక్క క్షణం ఆలస్యం చేయవద్దు.

వా:- అయ్యా! నాయుడుగారు వచ్చినట్టు లేదే! రైలు వచ్చి చాలా సేపయింది. కనుక్కొని మళ్ళీ మనిషిని పంపనా?

రా:- అవసరం లేదు. వారితో యిప్పుడేమీ పనిలేదు.

వా:- ప్లీడరును యేర్పాటు చేస్తాం.

రా:- అవన్నీ డబ్బుతో జరగవలసిన వ్యవహారాలు. అవసరం లేదు.

వా:- ఏదో వొకవిధంగా యేర్పాటుచేస్తే సరిగా! నారాయణరావు పంతులుగారు తమ సంగతి వింటే యేమీ అవసరం లేకుండా వస్తారు.

రా:- వద్దు. వారితో యీ విషయం కూడా చెప్పవద్దు. కారాగృహవాసముంటే యెవరూ తప్పించలేరు. లేకపోతే ఎవరూ అవసరంలేదు.

ముగ్గురు ముద్దాయీలనూ వెంటనే వార్డరు స్నానం చేయించి పూటకూలింటినుంచి భోజనం తెప్పించి పెట్టాడు. రామదాసు అక్కరలేదన్నా వార్డరు వినలేదు. భోజనం కాంగనే పదకొండుగంట లయ్యేసరికి ముగ్గుర్నీ కోర్టులో హాజరు పెట్టాడు. పోలు సాక్షులను తయారుచేసుకుని కోర్టుకు హాజరైనాడు. క్రిందటి రాత్రి పోలు వుత్తరం దీసికొనిపోయి మేజస్ట్రీటుగారికి చూపించి నందువల్ల ఆయన కోర్టుకు వచ్చిన వెంటనే మొదట యీ కేసే యెత్తుకున్నాడు.

మేజ:- ప్లీడరుగారు యేరీ?

పు:- లేరండి. కుదిర్చేవాండ్లెవరూ లేకపోయినారు.

పోలు:- లేకేమండి! చోరీసొత్తులు కొనేవాండ్లు వచ్చారు. కొందరికి కబురు కూడా పంపించుకున్నాడు. కోర్టువారికి అనుమానంగా వుంటుందని యెవరూ లేనట్లు నటిస్తున్నాడు.

కోర్టు:- అంతమాత్రానికే మేము మోసపోతామా?

రా:- కోర్టువారిని మోసం చేయడానికి నేప్రయత్నించను. న్యాయం చేయవలసిందని మిమ్ములను తక్తుమీద కూర్చోబెట్టారు. న్యాయం చెయ్యండి.

కోర్టు:- చాలా అతిశయంగా మాట్లాడుతున్నావే. నీకింకా ప్లీడర్లెందుకు? ఆరితేరినట్లే కనబడుతుంది.

పు:- తమ చిత్తం వచ్చినట్టు కానియ్యండి. అవతల దొరగారు అన్యాయానికి తలపడి కూర్చున్నాడు. దానిమీద మా మాటలేమి ఆనుతవి.

కోర్టు:- నోరుముయ్యి! నిన్ను ప్రాసిక్యూషన్ చేయిస్తా, మళ్ళీ మాట్లాడితే. సెటిల్మెంటొకటి అడ్డం పెట్టుకొని లూటీలు కొట్టడం అనుకున్నావా? యిన్స్పెక్టరుగారూ! సాక్ష్యం పెట్టండి.

పోలుసు మొదటిసాక్షిగా విచారించారు. ముద్దాయీలు తప్పించుకొనిపోతున్నారని తెలిసిపోయి పట్టుకున్నామని చెప్పాడు.

కో:- సవాళ్ళు వేసుకోండి.

పు:- మేము యెంతదూరం పోయింతరువాత మీకు తెలిసింది?

పో:- ఒక ఫర్లాంగు పోయినారు.

పు:- అంతదూరం యెట్లా వచ్చి మమ్మును కలుసుకోగలిగారు?

పో:- ముసలివాడు పసగెత్తలేకపోయినాడు. వాణ్ణి ముందు పట్టుకున్నాం. తరువాత పగ్గంమేరదూరంలో మట్టిమేరువ పోసివుంటే యెక్కి జారిపడ్డావు. మా కేకలు విని రెడ్డి వచ్చి కిందబడ్డ నిన్ను పట్టుకున్నాడు.

పు:- ఇదంతా వట్టి కల్పనండి!

కో:- అవునులే కానియ్యి.

పు:- నా భార్యా, తల్లీ మీ సెటిలుమెంటులో యిప్పటికీ వున్నారా?

పో:- ఉన్నారు.

పు:- నేను వాళ్లను వదిలిపెట్టి యెట్లా పోతున్నాను?

కోర్టు:- ఆ సంగతి అతని కెట్లా తెలుసు?

పు:- అసలు నేను యెందుకు వదిలిపెట్టి పోతానండి?

పౌ:- అయ్యో! వీడు సోదారకం. వీడు వదిలితే, కూలి చేసుకొని నిమ్మళంగా బతుకుదా మని వాండ్ల వుద్దేశం. వీడు పోయినా డని వాం ళ్లెవరూ విచారపడడం లేదు.

పు:- రామదాసుగారు తనకూతురిని నీ కియ్యామంటే వల్లగా దన్నాడుగాదూ?

కోర్టు:- ఆ సంగతి అత నడుగుతాడులే! ఇంకా యేమైనా వున్నవా?

పు:- లేవు.

కోర్టు:- రెండవ ముద్దాయీ! నీ వేమైనా అడుగుతావా?

రా:- అడిగి యేమి ప్రయోజనం? నా కేమీ ప్రశ్నలు లేవు.

కోర్టు:- పై ప్రశ్నకు జవాబు చెప్పు.

పౌ:- నే నడగనూ లేదు; ఆయన యివ్వననూ లేదు.

కోర్టు:- మూడో ముద్దాయీ! నీవేమైనా అడుగుతావా?

మాలక్ష్మి:- నాకు తెలియదు.

కోర్టు:- రెండో ముద్దాయీ! పౌలు నిన్ను నీ కూతురు నియ్యమని అడిగాడా?

రా-దా:- నన్ను ప్రత్యక్షంగా అడగ లేదు.

తక్కినసాక్షులు చాలాభాగం యింతే చెప్పారు. ఒకకాని స్టేబిలు సవాళ్ళకు మొదటిసాక్షి చెప్పిన జవాబులు ముందుగా పరుగెత్తిపోయి తక్కినవాండ్లకు నేర్పి వచ్చాడు. పరస్పరభేదాలు అంతగా కనబడ లేదు.

కోర్టు:- సాక్ష్యం విన్నారుగదా, యేమి చెప్పకుంటారు?

ము:- కేసు కల్పించారండి.

కోర్టు:- యెందువల్ల?

ము:- విరోధం.

కో:- యేమివిరోధం?

ము:- పౌలు చెప్పినమాటకు యెగర్తిస్తా మని.

కోర్టు:- మీమీద నేరం చేసినట్లు మోపుదల చేశాను. యేమి చెపుతారు?

ము:- యిందాకా చెప్పినవే.

కో:- సాక్షు లున్నారా?

ము:- దేనికి?

కో:- మీవాదం రుజువు చేసుకోవడానికి.

ము:- లేరు.

కో:- (తీర్పు వెంటనే వ్రాసి) ఒకటో ముద్దాయి పుల్లప్పకు వొక సంవత్సరం. రెండుమూడు ముద్దాయీలకు చెరి ఆరునెలలూ కఠిన శిక్ష విధించాను. తీసుకొనిపొండి.

ముగ్గురు ముద్దాయీలనూ సబుజైలుకు తీసికొనిపోయినారు. మరురోజు ఉదయమే నిడదవోలు జిల్లా జైలుకు తీసుకొనిపోవడానికి ముగ్గురినీ యెనిమిదిగంటలకు బయలుదేరే బెజవాడబండికి తీసుకొనివచ్చారు.

## ౧౮

## రాగమా రోగమా?

త్రాలూకా జయిలు వార్డరు రామదాసుకు శిక్ష పడ్డదని తెలియడంతోటే దుఃఖించి రామానాయుడు రాకపోవడానికి కారణం కనుక్కోవలెనని కూలివాడి యింటి దగ్గర విచారిస్తే వాడా రాత్రి జబ్బుచేసి మంగళాపురం పోలేదనీ పగలు పన్నెండు గంటలకు పోయినాడనీ తెలిసింది. సంగతి తెలియంగనే రామానాయుడూ, వెంకటయ్యా, అప్పాదాసూ, యితర కూలీ నాయకులూ రాత్రి యెనిమిదిగంటల బండికి గుంటూరు పోవడానికి బయలుదేరారు. కోటమ్మ మొదలైనవాళ్ళు "మహానుభావుడు దూరంగా బోతున్నాడు. దర్శనం అయినా చేసుకొని వత్తా"మని

బయలుదేరారు. గుంటూరు వచ్చి వార్డరును కనుక్కుంటే వుదయం బెజవాడ బండికి తీసుకొని పోతారని చెప్పాడు. జనం అంతా రాత్రి తాలూకా ఆఫీసుకు యెదురుగా రోడ్డుమీద "మహాత్మాగాంధీకీ జయ్! రామదాసుకూ జయ్!" అంటూ పడుకొని ముద్దాయీలను రైలుకు తీసుకొనిపోయేటందుకు బయటికి దీయంగనే గుమిగూడి వాళ్ళ వెంబడే రైలుస్టేషనుకుబోయినారు. రామదాసుతో అప్పాదాసునూ రామానాయుడూ వెంకటయ్యలనూ మాత్రం మాట్లాడనిచ్చారు. రామదాసు తాను సెటిల్మెంటులో ప్రవేశించినప్పటినుంచి అప్పటివరకూ జరిగిన సంగతులు యావత్తూ తెలియబరిచాడు.

వెంకటయ్య:- మీరు చేసిన ప్రయత్నాలూ, యీ పర్యవసానం మీ జీవితానికి కిరీటమని భావిస్తాను.

రా-నా:- ఈ కష్టాలు మీ ఆత్మబలబ్ధికి తోడ్పడుత వనుకుంటాను.

వెం:- అప్పీలునల్ల యేమైనా ప్రయోజనం వుంటుందా?

రా-దా:- ఏమీ వుండదు. మా తరఫు సాక్ష్యం లేదు. వాండ్ల తరఫున వచ్చినవాండ్లు బాగా తయారై చెప్పారు. సవాళ్లు కూడా విశేషం అడగలేదు.

వెం:- ఇప్పుడు మేము చేయవలసినదేమి?

రా-దా:- జోతి కషాయం జరగడం నిశ్చయం. వెంటనే పిల్లల నిద్దరినీ అక్కడనుంచి తొలిగించే సదుపాయం చూడండి. అప్పడి ఆరోగ్యం యెట్లా వున్నది?

వెం:- (నవ్వుతూ) అప్పడికి రోగమైందీ, రాగమైందీ తెలియలేదు.

అప్పడు:- ('హా హా' అని నవ్వి) తత్సంబంధమే!

రా-దా:- నాయుడుగారూ! పిల్లలను ముగ్గురినీ కాపాడే భారం మీదే.

అ:- ఇక్కడ నేను వుండను. ఏటి వొడ్డున యిల్లు కట్టు కుంటా.

"నీకు నీ వారు లేరు, నాకు నా వారు లేరు
యేటి వొడ్డున యిల్లు కడదం పదరా."

మామా! పదం బాగుందా?

రా-దా:- సద్గురూ! నీ దయ యెట్లా వున్నదో!

రా-నా:- పిల్లలు స్వాధీనపడడానికి కలెక్టరు దగ్గర పిటీషన్ పెట్టించుతా. అది ఫయిసలు అయ్యేవరకు కొన్నాళ్లు పట్టవచ్చు. వీలైతే తీర్పు చెప్పేవరకూ మైనర్లను కోర్టువారి స్వాధీనంలో వుంచుకొనేటట్టు కోరుతాం. అందాకా యెవరినైనా జతచేసి దాసును తాడేపల్లిలో వుంచుదామని చూస్తున్నా.

అ:- ఏటివొడ్డున యిల్లు కట్టుకుంటా. యేమి మామయ్యా?

రా-దా:- ఏదో చూడండి. నావల్ల అయ్యే దేమున్నది?

వెం:- నీవు ఆశీర్వదిస్తే అన్నీ నెరవేరుతవి.

అంతా రైలుస్టేషన్ దగ్గరకు వచ్చారు. జనాన్ని లోపలికి రానియ్యలేదు. జనం పెండెం నెట్టుకొని లోపలికి రావలెనని చూశారు. రామదాసు నిలిపి అందరి దగ్గరా సెలవు పుచ్చు కున్నాడు. కోటమ్మ మేరువమీద నిలవబడి "రామదాసూ! నేను నిలుస్తా"నన్నది.

రా-దా:- కోటమ్మగారా! నమస్కారం. ఈ యేడు అయ్యగారి ఆరాధనకు నేనుండనుగదా! (అని కేకవేసి చెప్పాడు)

జనం అంతా ఆగిపోయింది. రైలు కదిలేవేళ అవుతున్న దని పోలీసులు తొందరించి బండిలో యెక్కించారు. నాయుడూ, దాసూ, వెంకటయ్యా అలవాలు తిరిగి లోపలికి వచ్చారు. రైలు కదిలే సమయం అయింది.

రా-నా:- ఏమమ్మా మహాలక్ష్మీ! యేమి చెప్తావు?

మా:- ఆ పిల్లవాణ్ణి చూస్తే గుండె దరించుకొని పోతు న్నది. మళ్ళీ మన లోకంలో పడేనా?

అ:- ఊఁహు. నాకీ లోకంతో పనిలేదు. వెళ్ళుతా, యిదే సెలవు.

వెం:- పరవాలేదు. మహాలక్ష్మి! పిల్లల నిద్దరినీ తీసుకొని వచ్చి అందరినీ వొకచోట వుంచుతాం.

అ:- పిల్లలను తెస్తారు నేచూస్తా.

మా:- యేమిపరవో! మహాలోకంలో వున్నాడు.

వెం:- నే మం దిప్పిస్తాగా!

అ:- రాగానికా? రోగానికా? ('ఆహాహా' అని నవ్వాడు.)

వెం:- పైక మేమైనా అవసర ముంటుందా?

పు:- లోపలికి పైకం తీసుకపోనియ్యరు. నేను వ్రాసిన చిరునామాకు పదిరూపాయలు పంపండి. ఆయనకు అన్ని వసతులూ నే కుదురుస్తా.

రా-దా:- అవన్నీ మీరేమీ పెట్టుకోవద్దు.

రైలు కదులుతున్నది. రామానాయుడు నమస్కరించాడు.

రా-మా:- అమ్మా! యెంతపని చేశారు.

రామానాయుడు తల వంచుకున్నాడు. కన్నీళ్ళు ధారలై నేలమీదపడ్డవి. వెంకటయ్య మొఖంమీద గుడ్డపెట్టుకొని "ముసలివాడిని ఖైదులోకి పంపి మేమంతా హాయిగావున్నా" మని పిల్లవాడివలె యేడ్చాడు. రైలు వంతెన దాటింది. వెంకటయ్య యింకా రైలువంక చూస్తూనేవున్నాడు. కనుచూపు మేరవరకూ చూచాడు.

వెం:- తమ్ముడూ! మొన్న మనం చూచినప్పటికంటె రామదాసు మొఖంలో కళ యెక్కువ కాలేదా?

రా-నా:- చాలా తేడావున్నది. యిందాకా కోటమ్మగారు కూడా ఆమాటే అన్నారు. మనిషికి వైరాగ్యంకూడా యేర్పడ్డది.

వెం:- ఇకముందు జరగవలసినపని యేమి?

రా-నా:- నేను కోర్టుపని చూస్తా. నీవు వుండవల్లి దాసును తీసుకొని వెళ్ళు. తొందరపడవద్దు. నీవూ, దాసూ వచ్చినట్టు జోతికి వెంటనే తెలియపర్చు.

వెం:- వీరదాసు కొడుకును దాసుతో వుంచివస్తా. అన్న మైనా వండిపెడతాడు.

రా:- యెరికలపూడి పంపుదామా?

వెం:- జోతిని చూస్తూవుంటే కొంతభోగణి తగ్గుతుం దను కుంటాను. ఒంటరిగా వుండడంచేత మరీ మనస్సు చలిస్తుంది. అయినా కోర్టు వ్యవహార మేమిటో తేలితేగదా!

రా-నా:- మీరు అన్నం దిని వచ్చి రైలెక్కండి. నే వూళ్ళోకి పోతా!

రామానాయుడు యెకాయెకీన నారాయణరావుగారి యింటికి వెళ్ళాడు. వారు లోపల ఫలహారంచేస్తూ పంచాదిలో ఆకు చెప్పుల చప్పుడువిని యెవరో కనుక్కొని రమ్మనమని వంటవాడిని పంపించారు. వాడు ఫలానా అని తెలిసి,

నా:- నాయుడుగారూ! ముఖమార్జన మైందా? లోపలికి రండి.

రా-నా:- (చెప్పులు బైట విడిచి హాలులోకి వచ్చి) నమస్కారమండి.

నా:- వారికి ఫలహారం తీసుకరావయ్యా! యేమి పొద్దు న్నే వచ్చారు?

రా-నా:- రామదాసు కథంతా యిట్లా యిట్లా జరిగింది. మాకూ రాత్రివరకూ తెలియ లేదు. తమరుకూ వూళ్ళోలేరట. ఇప్పుడే యేలూరురైలుకు యెక్కించి వచ్చాం.

నా:- అయ్యో! నాకు తెలియనేలేదే! దర్శనం అయినా చేసేవాణ్ణి. అప్పీలు దాఖలుచేతామా?

రా-నా:- కేసంతా అపస్మారకం అయిపోయింది. అప్పీలు దాఖలు వేసికూడా ప్రయోజనం లేదని యిప్పుడే బెంచిగుమాస్తా

గాను చెప్పారు. అయినా సకళ్ళకు దరఖాస్తు చేయించండి. యిప్పుడాయిద్దరు పిల్లలను స్వాధీనపర్చుకునే మార్గం చూడాలె. లేకపోతే. జోతి ప్రాణత్యాగం చేసుకుంటుంది. పౌలు చాలా దురాత్ముడు. పాదిరికి వాడు చెప్పినంత.

నా:- మనం యిక్కడ పనిచేస్తుందాం. అక్కడికి వొకరిని పంపితే పిల్లలకూ ధైర్యంగా వుంటుంది. వాడూ పెచ్చరిల్లడు. దాపున మనుష్యు లున్నారంటే కాస్త బెరు కుంటుంది.

రా-నా:- మా అన్నా, దాసూ యిప్పుడు రైలుకు వెళ్ళుతున్నారు. మసిపిని తోడిచ్చి వుండవల్లిలో దాసును వుంచి వస్తాడు. అదిగాక ఆరోగ్యం సరిగాలేదు. మనసు కొంచెం యిగాచిక్కుల మూలంగనే చలించింది.

నా:- అయ్యోపాపం! చూడండి. మీ వెంకటయ్యగారు పంచమోద్యమంలో పూర్తిగా ప్రవేశించారటే? వారు మీ అంత వుత్సాహంగా వున్నారట. నాకు ఆశ్చర్యంవేసింది.

రా-నా:- అతడిది మొదటినుంచీ స్థాపైన మనసు. మంచి వుత్సాహం, కార్యనిర్వాహణశక్తీ రెండూ వున్నవి. కూలీఉద్యమంతప్ప పంచమోద్యమాన్ని గురించి నేనేమీ అంటించుకోవడం లేదు. ఆ పని యావత్తూ వెంకటయ్యే యీదుతున్నాడు. సంగమందిరానికి సంబంధంగా దిగునజాతులకు కర్మవిద్యాలయం పెట్టించవలెనని విశ్వప్రయత్నం చేస్తున్నాడు.

నా:- రెండులక్ష లుంటే మంచి విశ్వవిద్యాలయం పెట్టించవచ్చు.

రా-నా:- చాలదు. నాలుగువందలమంది విద్యార్థులకు వసతిగృహం పెడితే అయిదు లక్షలు కావలసి వుంటుంది. ఆ మొత్తం మా ఆస్తివల్లనే వస్తుంది. ఇంకా మూడులక్ష లయితే నే వేసుకున్న అంచనాకు సరిపోతుంది. ఆ విద్యాలయ మేర్పడితే పంచములలో మంచిమార్పు గలిగించవచ్చు. చాలమంది మర్యాదగా జీవించడానికి వృత్తివిద్యల నేర్పించవచ్చు.

నారాయణరావుగారు యోచిస్తూ వూరుకున్నాడు.

రా-నా:- తమ రేదో యోచిస్తున్నారే!

నా:- యేమీలేదు. నాకు దిగ్భ్రమ గలిగింది 'నే వినేది కలా? వాస్తవమా?' అన్నట్టుగా వున్నది.

రా-నా:- యేడులక్షలతో పని పూర్తి అవుతందని నా నమ్మకం. ఒక లక్ష వృత్తులు అభివృద్ధి చేయడానికి మూలధనం క్రింద వుంచితే లోపంలేకుండా చాలాపని సాగవచ్చు. పైకం రాదనేభయం నాకులేదు. తగినవాండ్లు పూనుకుంటే యెంత ద్రవ్యమయినా పోగవుతుంది. కార్మికోద్యమం ముందు యేస్థితి లోకి వస్తుందో నాకు తెలియదు. గోదావరీకృష్ణాజిల్లాలలోగూడా ముఖ్యమయిన అన్నిగ్రామాలలో సంఘా లేర్పడ్డవి. తక్కెళ్ళ జగ్గడివుద్యమాన్ని వంకపెట్టుకొని ప్రభుత్వంవారు కార్మిక సంఘాలను నిర్మూలం చేయవలెనని చూస్తున్నారు.

నా:- స్వరాజ్యం రానిదీ యేవుద్యమాలూ సాగవు. ఈ మోస్తరుగా ప్రభుత్వము సాగితే మనదేశములో బోల్‌షెవిజం వ్యాపిస్తుందని నా అనుమానం.

రా-నా:- సంతానోద్యమం బోల్‌షెవిజానికి వామశాఖని నా అభిప్రాయం. తమ రన్నట్లు స్వరాజ్యం మన చేతుల్లోకివస్తే బీదల ఆర్థికస్థితి బాగుచేస్తే సంతానోద్యమాన్ని ఆపవచ్చు. శిక్షలువేసీ శెటిల్‌మెంట్లుపెట్టీ దీన్ని అణచడం వట్టిమాట.

నా:- తమరు వాస్తవం గ్రహించారు. స్వరాజ్యం వచ్చే ప్రయత్నం అంతాచేదాం. గాంధిగారి వుద్యమంలో నాకు బాగా నమ్మకం కుదరక అజ్ఞాయిస్తున్నా యింతవరకూ. "యీ తొట్టి స్నానపు చికిత్సవల్ల యీ దీర్ఘరోగం కుదిరి వచ్చిందా?" అనుకొన్నాను గాని మన జాత్యాపకి యీమందు బాగా పట్టింది. ఈ రామదాసు పిటీషనే ఆఖరుది. ఇక కొత్తకేసులు పట్టను. పాతవికూడా సాధ్యమయినంతవరకు వదులుకొంటా. నాతో యింకా కొంతమందికూడా వదులుతారు.

రా-నా:- కానియ్యండి. మా కార్మికసంఘా లన్నీ మీ ఖద్దరుపని చేస్తున్నవి. కలెక్టరుకు నామీద సగం కంటు అదే! వెంకట్రావుగారు మా తాలూకాబోర్డు ప్రెసిడెంటుపని వదులు కుంటే నన్ను తీసుకోవలసిందని సిరస్తాదారుగారిద్వారా అడిగించారు. అంగీకరించి, 'అన్నిస్కూళ్ళలో ఖద్దరు పెట్టింతామా' అని ఆలోచించానుగాని కాంగ్రెసుకు వ్యతిరేకంగా బోవడం మంచిది గాదని మా వెంకటయ్య వద్దన్నాడు. అంతటితో సంతోషించుకున్నాం. తమ కీరోజు యేకోర్టులో పనివున్నది?

నా:- నా కేసులు వాయిదాపడేవే. మీ వ్యవహారంలోనే యీరోజంతా వుంటా.

రా-నా:- మనవ్యవహార మనండి. తమరు యితరులు రాకపూర్వమే సావకాశంగా పిటీషను తయారుచేస్తే తరువాత యితరపనులు చూసుకోవచ్చు.

నా:- ఇక్కడనే కూర్చుందాం. ఆఫీసికా తీసినట్టులేదు. చెప్పండి. పిటీషను యెవరిచేత దాఖలు చేయింతాం.

రా-నా:- అప్పాదాసుచేత చేయింతాం. ఇంట్లో వుండే వాడు, మేనత్తకొడుకూనూ.

నా:- అతని కిప్పుడు మనసు బాగా లేదంటిరే? కుర్రవాణ్ణి గార్డియన్‌గా పెడితే, కలెక్టరుగా రాక్షేపిస్తారు.

రా-నా:- మా వూళ్ళో వాండ్లకు బంధువు లెవరూ లేరు. నే వుండమంటే వుంటా.

నా:- మీకంటే వాండ్లకు ఆప్తులు లేకపోయినా కులభేదం వల్ల పనికిరా రంటారు. అప్పాదాసుకు పిల్లవాడిని స్వాధీనపరుస్తారుగాని అతడెంత మంచివాడైనా ఆ అమ్మాయిని స్వాధీనపరచమని చెప్పడం నాకే భావ్యంగా లేదు.

రా-నా:- అయితే గడబిడ్డకపు వ్యవహారమైందే! యెవరూ దొరకకపోతే కలెక్టరు యేమిచేస్తాడు?

నా:- యేమిచేయగలడు? యిదివరకు పాదిరే చూస్తున్నాడు. కనుక తనపిల్ల కాదంటేతప్ప ఆయన స్వాధీనంలోనే వుంచుతారు. పిల్లవాణ్ణిగూడా అప్పదగ్గరనే వుండనియ్యమంటారు.

రా-నా:- ఇదేదో ప్రాణాంతకానికే వచ్చింది.

నా:- యేమి అలా అంటారు? సంగతి పూర్తిగా చెప్పండి.

రా-నా:- ఇంకొక రహస్య మున్నది. అప్పాదాసూ, జ్యోతీ వొకరి నొకరు ప్రేమిస్తారు.

నా:- సరే పెండ్లి చేసుకుంటాంఅనమనండి. తక్షణం వదిలి పెట్టిస్తా.

రా-నా:- అది సాధ్యం గాదు. పెండ్లి చేసుకోరు. చేసుకుంటా మని పైకి కూడా అనరు. ఆ ప్రేమను భావనారూపంగానే వుంచదలచుకొన్నారు.

నా:- చిత్రంగానే వున్నది. మీమాలపల్లి చిత్రకూటంగా వున్నదే! వొకసంగతి చెప్పండి. ప్రేమ కేవల భావనారూపంగా వుండడం సాధ్యమా?

రా-నా:- సాకారునిగా ప్రేమించినా, నిరాకారునిగా ప్రేమించినా భావనారూపంగానేకదా దేవుణ్ణి ప్రేమించడం. భావనారూపంగా మానవుల నేల ప్రేమించరాదు?

నా:- ప్రేమించవచ్చు. సందేహం లేదు.

రా-నా:- అయితే వొకసంగతి యోచించి చెప్పండి. భార్యాభర్త లన్యోన్యం ప్రేమించారు. కొన్నికారణాలచేత భార్య ప్రేమ సంచలిస్తుంది. కాని అత్యంతంగా పశ్చాత్తప్తురా లవుతుంది. వారిద్దరికీ భావనారూపంగా ప్రేమ సాధ్యమవుతుందా? లేక భర్తయొక్క ప్రేమే సంచలించి తరువాత నతనికి పశ్చాత్తాపం కలిగితే వారిద్దరికీ నిష్కల్మషమైన ప్రేమ కుదురుతుందా? భార్యాభర్తలలో వొకరు తమ ప్రేమను విభజించడానికి సాధ్యమా?

నా:- మీ రడిగిన అన్ని ప్రశ్నలకూ నాకు తోచినంత వరకు వొక్కటే జవాబు. అసాధ్య మేమీ లేదు. భావనారూపంగా సాధ్యమైతే దైహికంగాకూడా సాధ్యమే అవుతుంది. నా స్నేహితు లు కొందరు భార్యాభర్తలు జాయింటుగా ప్రేమిస్తూవుండేవారట!

రా-నా:- నేనేమో పెద్దప్రశ్న అనుకొని అడిగితే నిముష ములో తేల్చివేశారే! ఫీజు యియ్యకుండా లాయరుగారిని సలహా లడిగితే యిటువంటి జవాబులే వస్తవి.

నా:- మరెందుకువచ్చిన ప్రశ్న లివి ?

రా-నా:- జోతీ అప్పాదాసులు తమ ప్రేమను భావనా రూపంగానే వుంచదలచుకొన్నారు. ఆమెను సెటిల్‌మెంటు పాదిరీ దగ్గరి బోధకుడు పెండ్లి చేసుకోమని వేధిస్తున్నాడు. ఈ కేసు యీావత్తూ రామదాసుగాని జోతిగాని ఆసంబంధానికి వొప్పుకోక పోవడంవల్లనే బనాయింపు చేయబడ్డది. ఈ సందర్భాలలో ఆ పిల్ల సెటిల్‌మెంటులో వుంటే యేమవుతుందో ఆలోచించండి.

నా:- ఆత్మహత్య జరుగుతుంది.

రా-నా:- ఈ సంగతు లన్నీ పిటిషనులో వ్రాయడం వీలుగాదు.

నా:- వ్రాయకతీరదు. కొంచెంసేపు తమరు నిదానించండి. పిటిషను తయారుచేస్తా.

రా-నా:- అప్పాదాసునే గార్డియనుగా పెట్టుతున్నా, జోతీ అప్పాదాసులకున్న ప్రేమనుగూర్చి వుదహరించవద్దు.

నా:- సగం బలం పోతుంది.

రా-నా:- దైవగతి యెట్లా వున్నదో! మనము చేయగలది లేదు. పయిగా అతడిక్కడ లేడు.

నా:- అత డంగీకరించకపోవడం నిశ్చయమేనా ?

రా-నా:- సందేహం లేదు.

నా:- అయితే మిమ్మునే గార్డియనుగా పెడతా.

రా–నా:- కానీయండి.

అని బల్లమీదిపుస్తకం తీసి చదువుకుంటూ కూర్చు న్నాడు. యేదో ఆలోచన పోయింది. తా నడిగినప్రశ్నలు అస మంజసంగా వున్న వనుకున్నాడు. సంగతులు వీరికి తెలిసివుండునా? ఆమె కడపటి చరిత్ర లోకాని కేమి తెలుసు? మొదటిప్రశ్న తనకు వర్తిస్తుందని అనుకోవడానికి అవకాశం లేదు. ఆ కథెవరూ వినివుండకపోవచ్చు. "అయినా నే నడిగింది అవకతవక ప్రశ్నే. నాలుక జారింది."

నా:- అబ్బాయ్! యేమిటిరా ఆ అల్లరి!

రా–నా:- తమకు పిల్ల లెందరండి?

నా:- నలుగురు. తమకు పిల్ల లెందరండి?

రా–:- నాకు లేరండి!—(నా కుటుంబ చరిత్ర వీరికి తెలి యదు.)

నా:- అన్నట్టు తమ ఆస్తంతా వుద్యమాని కిస్తున్నారు గాదూ? వెంకటయ్యగారికికూడా లేరా?

రా–నా:- ఆయనకూ మగపిల్లలు లేరు. ఉభయులం పెంపుడు చేసుకోదలచ లేదు. లాయర్లకు ఫీజు తగ్గించదలుచు కొన్నాం. ఏ దత్తయినా తగవుకు కోర్టుకు రాకుండా వున్నదా?

నా:- సాధారణంగా దత్తమంటే తగాదా దత్తమే.

రా–నా:- తగాదాలేని పెంపకమే లేదు.

నా:- వ్రాశాను. తమరు భోజనం చేసివస్తే యీ లోపుగా సాపు వ్రాయిస్తాను. తర్వాత దస్కతు చేతురుగాని. ఉభయులం కలిసే కలెక్టరాఫీసుకు వెళ్ళుదాం.

పదకొండు గంటలకు వుభయులూ కలిసి కోర్టుకు వెళ్ళారు. నారాయణరావు పిటీషను చేతికియ్యంగనే కలెక్టరుగారు చదువు కొని,

క:- నారాయణరావుగారూ! గార్డియను యీ సుందరుడేనా? ఈ పిల్లను ఆయనకు వొప్పజెప్పడం క్షేమమని మీరంటారా?

నా:- వీరిని చాలాకాలంనుంచి నే నెరుగుదును. అదిగాక ఆ పిల్లకు మేనత్త కుమారుడున్నాడు.

క:- హిందువులలో మంచి వరసే! సమవయస్కుడేనా? అతడికి వివాహ మయిందా?

నా:- లేదు.

క:- ఇంకెవరయినా వున్నారా?

నా:- దగ్గర బంధువులు లేరు.

క:- బ్రౌన్సుగారిని నే నెరుగుదును. వారి దగ్గరనే ప్రస్తుతం వున్నారుగదా! ఈ అమ్మాయిని అక్కడ వుంచడానికి మీ అభ్యంతర మేమి?

నా:- ఆయన మతాంతరుడు కావడం మొదటి ఆక్షేపణ.

క:- ఇంతవరకు ఆ మతాంతరుడేకదా వాండ్ల తలిదండ్రులకు గూడా శరణ్యమయినాడు.

నా:- ఆయన శరణ్యమే యీ స్థితికి తెచ్చింది.

క:- ఆ విషయమే డిప్యూటీ మేజస్ట్రేటుగారు నిర్ధారణ చేశారు. విచారించింది శివయ్యగారని మీకు తెలుసునా? బ్రాహ్మణులు, న్యాయస్థులు.

నా:- పాదిరీకంటె యీ పిటీషనరు దూరస్థుడా, ఆ పిల్లకు?

క:- ఇంతవరకు దూరస్థుడే. ఈ యౌవనుడికి ఆ పిల్లను స్వాధీనపరచడం నా కిష్టంలేదు.

రా-నా:- బ్రౌన్సుగారు నా కంటె పెద్దవారా?

క:- వారిని స్వయంగా యెరుగుదును.

రా-నా:- వారు తెల్లవారు గావడంవల్ల, క్రైస్తవులు గావడంవల్ల నా కంటే అధికులే!

క:- నారాయణరావుగారూ! నీ క్లయంటు యిక యిట వంటి మాటలు మాట్లాడితే కోర్టు నవమానించినందుకు శిక్షిస్తా

రా-నా:- కానియ్యండి.

క:- నారాయణరావుగారూ! బ్రౌన్సనుగారు గార్డియనుగ వుండడానికి మీ ఆక్షేప ణేమి?

నా:- ఆయన దగ్గెరి బోధకుడు మంచివాడు గాడుట.

క:- ఆయనకింద అనేకమంది బోధకు లుంటారు. వాండ్లు మంచివాండ్లు కాకపోతే ఆయన అనర్హుడెట్లా అవుతాడు?

నా:- ఈ బోధకుడు వాండ్లమీద అధికారం చెలాయించే వాడు. ఆ పిల్లను పెండ్లి చేసుకోవలెనని కోరుతున్నాడు.

క:- పిల్ల కిష్టంలేని వివాహానికి బ్రౌన్సనుగా రంగీకరిస్తారా?

నా:- పౌలు బలవంతపెట్టి యిష్టం సంపాదించవచ్చు.

క:- కేవలం సెటిల్మెంటుకు సూపరింటెండెంటుగా వుండడమే కాకుండా కోర్టుతరఫున మయినర్లకు గార్డియనుగా యేర్పరిస్తే తన ధర్మం నెరవేర్చి పిల్లలను కాపాడడా?

నా:- ఈ పిల్లవిషయంలో కాపాడలేడని నా అభిప్రాయం.

క:- మీరు కారణాలు కనబరచలేదు.

రా-నా:- పంతులుగారూ! తమరు వృధాగా యెందుకు వాదించడం?

నా:- నే మాట్లాడుతున్నాగా; మీరు వూరుకోండి.

క:- (బెంచి గుమాస్తాతో) బ్రౌన్సనుగారు యీ పిటిషనులో వుదాహరించిన పిల్లలకు గార్డియనుగా వుండడానికి వొప్పుకొంటారేమో స్వయంగా వచ్చి తెలియజెయ్యమను. సత్తెనపల్లి సబుయిన్స్పెక్టరు కింద వున్నాడేమో పిలువు. ఆయన మంగళాపురపు కార్మిక సంఘాన్ని గురించి పంపిన రిపోర్టు యిటు దే.

ఇన్స్పెక్టరుగారు వచ్చారు.

క:- కార్మికోద్యమానికి నాయకుడనీ ఆ చుట్టుపట్ల సంఘాలు సంతానులకు ఆశ్రయమిస్తున్నవనీ మీరు తెలియబరిచారు. ఇతనిని గురించేనా?

ఇ:- చిత్తం.

క:- ఈ సంగతులను గురించి సాక్ష్యం యెన్ని రోజులలో తేగలరు?

ఇ:- ఒక క్రిమినల్ కేసులో ఆ వూరి మునసబూ, వొక షాహుకారి ఆసామీ యీ రోజు వాయిదాకు హాజరుగావున్నారు. వా రిద్దరూ యిందులో సాక్షులే. ఇప్పుడే విచారించవచ్చు. లేక పోతే తమరు వేసే వాయిదాకు పూచీఖత్తులు పుచ్చుకున్నా సరే. ఈయన బలవంతుడు గనుక తిరగదీస్తారని కూడా అనుమానం.

క:- ముద్దాయికి ఆక్షేపణ లేకపోతే యీ రోజే విచారిస్తాను. (గుమాస్తాతో) రిపోర్టును ఉదహరిస్తూ రు ౧౦౦౦లకు ఆరు నెలలకు స్వంత జామీనియ్యమని అతనికి యిప్పుడే నోటీ సియ్యి.

నా:- అంత తొందరేమి?

క:- నోటీసు జారీచేసేపని క్లుప్తం గావడానికి.

రా-నా:- నోటీసు చూచుకున్నట్టే! తమరు చెప్పే సంగతులు వింటూనే వున్నా.

క:- నోటీసిచ్చి దస్కతు తీసుకో. అరగంటలో పిటిషనులు కాంగనే పిలుస్తా. ఇన్స్పెక్టరుగారూ! నోటీసిచ్చి ముద్దాయిని మీ స్వాధీనంలో వుంచుకోండి.

ఇ:- చిత్తం.

నా:- ముద్దాయితో నేను మాట్లాడవచ్చునా?

క:- మాట్లాడండి. హాజరులో వున్నారుగనుక వకాల్తు పుచ్చుకోండి.

నా:- నే నిందాకటి పిటీషనే ఆఖరుదిగా పుచ్చుకొన్నాను. నా ప్లీడరుపని ప్రస్తుతం ఆపివేశాను.

క:- సహాయనిరాకరణం చేశారా? అయినా మీరు మాట్లాడటానికి వుత్తరువిచ్చాను. అరగంటలో పిలుస్తా. అవతలకు వెళ్ళి మాట్లాడవచ్చు.

నా:- చిత్తం. (అవతలికిబోయి)-వ్యవహారం పెడదిరిగింది.

రా-నా:- సజావుగానే వున్నది. కానియ్యండి.

నా:- ఇంకొకరిని ప్లీడరుగా యేర్పరుచుకోండి. నే నిక వకాల్తా పట్టదలచలేదు.

రా-నా:- నాకు ప్లీడరేవద్దు. వాదించుకోనని చెప్పివేస్తాను.

నా:- ఖయిదుకు పోతారా ?

రా-నా:- కార్మికోద్యమంలో పని చెయ్యనని జామీ నియ్యమంటారా ? నా జీవితమే దాని కర్పిసినిగదా !

నా:- మిమ్ములను పట్టుకుంటే మీ ప్రాంతాలలో వుద్యమం ఆగిపోతుందేమో ?

రా-నా:- నూరురెట్లెక్కువవుతుంది. కేసు పిలుస్తున్నారు.

క:- నారాయణరావుగారూ ! మీరు వకాల్తు పుచ్చుకోనట్టేనా ?

నా:- అంతే ! మానుకున్నాను.

క:- అతని పేరేమి ?

గు:- రామానాయుడు.

క:- నోటీసు చూచుకున్నావా ?

రా-నా:- చూచుకున్నా.

క:- ప్లీడరును తెచ్చుకుంటావా ?

రా-నా:- తెచ్చుకోను.

క:- కార్మికోద్యమానికి నాయకుడవా ?

రా-నా:- అంతగౌరవం నాకులేదు. పనిమాత్రం చేస్తున్నా.

క:- మీ సంఘాలు దొంగలకు సహాయం చేస్తున్నవా ?

రా-నా:- నాకు తెలిసినంతవరకు చేయడంలేదని నా నమ్మకం.

క:- ఏమని నీ వాదం ?

రా:- నే వాదించుకోను.

క:- సాక్ష్యం పిలువు !

ఇ:- నేనే మొదటి సాక్షిని.

ప్రమాణం చేసి సాక్ష్యం చెప్పాడు. అన్నీ అబద్ధాలే.

క:- సవాళ్లు అడుగుతావా ?

రా-నా:- అడగను.

ఈ ప్రకారంగానే యితర సాక్షుల విచారణా అయింది.

క:- ఇంకా యేమయినా చెప్పుకుంటావా ?

రా-నా:- యేమీ లేదు.

క:- సాక్షు లున్నారా ?

రా-నా:- విచారించుకోను.

క:- ప్రథమ వుత్తరువు ఖాయపరిచాను. జామీను నియ్యి.

రా-నా:- జామీను నియ్యను.

క:-జామీను నిచ్చేవరకూ ఆరు నెలలు విడిఖయిదులో వుంచేటట్టు వుత్తరువు చేశాను. నిడదవోలు సెంట్రలుజయిలుకు పంపిస్తున్నా. ముద్దాయిని తీసుకొనిపొండి.

పోలీసులు రామానాయుడిని తాలూకాజెయిలుకు తీసుకొనిపోయినారు.

౧౯

## సహగమనం

వెంకటయ్యా, అప్పాదాసూ, కమలాదాసూ, యెనిమిది గంటల బండికి బయలుదేరి తాడేపల్లిలో దిగి జరిగిన వృత్తాంతం యావత్తూ జోతికి తెలియజేశారు. సెటిల్‌మెంటుకు కూతవేటు దూరంలో వుండవలి మాలపలికి అనుకొనివున్న చిన్న బంగాళా

అద్దెకు తీసుకుని దానిలో ప్రవేశించి అక్కడ వంటచేసి రోజు జోతికీ పిల్లవాడికీ పంపేటట్టు సూపరింటెండెంటు వుత్తరువు పొందారు. తల్లిదండ్రులను పట్టుకొనిపోయిన తరువాత జోతి ధైర్యం దెచ్చుకొని పిల్లవాణ్ణి వోదార్చి మధ్యాహ్నం తినగ మిగిలిన అన్నం యిద్దరూ తిని పుల్లప్పయింట్లో పడుకున్నారు సూపరింటెండెంటు భయంగా వుంటే తన బంగాళాదగ్గర పడుకో మన్నాడు గాని జోతి వొప్పుకోలేదు. చీకటితో లేచి పుల్లప్ప యొక్క తల్లితో గలిసి స్నానాదికంనిమిత్తం కృష్ణనైపుకుబోయి తెల్లవారేవరకు యింటికి వచ్చారు. కులపెద్దలు సభ చేసి కేస పర్యవసానం దెలిసేవరకూ యేచర్యా తీసుకోకుండా నిలిపి వుద్రేకు లైన కుర్రవాండ్లను సమాధానపరచి ప్రార్థనకు పోకుండా నిలిచి పోయినారు. పాదిరీ మామూలుగా గంటలుకొట్టించి యెవరూ రాకపోవడం చూచి సర్దుకొని వూరుకున్నాడు. కేసు పర్యవసానం తెలుసుకోవడంకోసం మరునాడు యెవరూ పనికిపోలేదు. పౌలు మరునాడుకూడా రాలేదు. సాయంత్రం బండికి పోలీసులువచ్చి కేసుఫలితం చెప్పారు. పౌలు వచ్చినతరువాత ప్రార్థనకురమ్మంటా రేమో చూచి బలవంతపెడితే సమ్మె విస్తరింపజేతామని కుల పెద్దలు యోచించుకున్నారు. మరునాడు రామానాయుడి కేసు సంపూర్తి కాంగనే అతిసంతోషంతో జోతి తనకు దక్కినట్టుగానే భావించుకొని పిల్లలతరపున గార్డియనుగా వుంటానని పాదిరీచేత వొప్పించి ఆయన అంగీకారం వెంటనే కలక్టరుకు తెలియపరతా మని పౌలు వెంటనే బయలుదేరాడు. సెటిల్మెంటుకు రాంగనే రామదాసుయొక్కయు రామానాయుడుయొక్కయు కేసులపర్యవ సానం అందరికీ శ్రుతపరచి పాదిరీదగ్గరకు బోయి సవిస్తరంగా సంగతులు చెప్పంగనే ఆయన సంతోషించి—

బ్రౌన్సన్:- పౌలూ! రామదాసును యెన్నాళ్ళకుగెల్చాం!

పౌలు:- గెలిచామంటారు. అందులో నాప్రయోజకత్వ మేమున్నది? అంతా తమచలవే. తమకుతెలుచుకుంటే యేది నెర

నేరదు? తమరుపంపిన చీటిముక్కను చూచుకొని డిప్టీకలక్టరు ఆల్ రైటు ’ అన్నాడు.

బ్రౌన్:- యేమైనా అడిగారా?

పౌ:- యేమైనాఅడిగి కాస్తసందిస్తే కేసుసంగతియావత్తూ చెపుదామనుకున్నా. యేమీఅడక్కుండానే దొరగారికి సలాములు చెప్పమన్నారు. అంతట వచ్చా—నా-మనవి-వొక్కటున్నది.

బ్రౌన్:- చెప్పు.

పౌ:- పిల్లలకు మిమ్మల్నే గార్డియనుగా యేర్పరుస్తారు. తమరు సరేననడమే తరువాయి. తరువాత యీబీదపౌలును మరిచి పోతారేమో ?

బ్రౌన్:- నాచేతనైన సహాయంచేస్తా. వ్యతిరేకంగా చెప్పే వాండ్లు యెవరూ వుండరుగనుక నీశక్తి వుపయోగించి పిల్ల వొప్పు కునేటట్లు చేసుకో. మీవుభయులూ సమ్మతిస్తే యితరాటంకాలు యేమీ లేకుండా చేస్తా.

పౌ:- పిల్ల వొప్పుకుండేటట్లు కనబడదు.

బ్రౌన్:- దానికి నే నేమిచేసేది? నీసొమ్ముగాదని వూరుకో.

పౌ:- గార్డియను తమరుగదా, తమయిష్టప్రకారం వివాహం చేయడానికి వీలు లేదా ?

బ్రౌన్:- లేదు. పిల్లచేత తల యెగరవేయిస్తే అన్నీ చక్కబడుతవి. పుల్లప్ప యింట్లో యిప్పుడు పడుకుంటున్నది. అతనితల్లి యింద్రజాలి. దానిద్వారా పనిచేయి.

పౌ:- చిత్తం.

పౌలు పుల్లప్పయింటివైపుకు బోయినాడు. జోతీ, పుల్లప్ప భార్యా యెక్కడికో వెళ్లుతున్నారు. గుడిసె చాటు కాంగనే యింట్లోకి బోయి—

పౌ:- అదెమ్మా! యేమిచేస్తున్నావు?

అ:- యేమయ్యా యిట్లా వచ్చారు? మామీద కచ్చపట్టా రెందుకు నాయనా? బీదవాండ్లం, యెట్లా బతుకుతాం ?

పౌ:- మీకేమీ యిబ్బంది లేకుండా చేస్తా. ఈ అయిద రూపాయిలూ పెట్టి ప్రస్తుతం గడుపుకోండి.

ఆ:- (ఆనందంతో) యేమో పనిమీద వచ్చావు?

పౌ:- మనమడు పెండ్లీ పేరంటం లేకుండా దిక్కుమాలిన పక్షిలా గున్నాడు. నీమనమరాలిని యిప్పించి నన్ను వొక యింట వాణ్ణి చెయ్యి. నీవు శాశ్వతంగా నా దగ్గరవుండి యింట్లో పె నం చేతువుగాని.

ఆ:- యేదో మాటసామెతగా యీసంగతే వచ్చి 'పెండ్లి చేసుకోరాడా లచ్చనంగా!' అని అన్నా. యేమీ సందుపెట్టలే

పౌ:- యేవో పాచికలు వెయ్యాలె నీవు. నాకు స్వాధీనప చావంటే నీకు మెళ్ళో గళ్ళాపట్టెడ చేయించిపెడతా. నాకు బ్యాంకులో మూడువేలరూపాయి లున్నవి. ఇప్పుడు వెయ్యి రూపాయిలనగలు పెడతా. యెట్లా వొప్పిస్తావో.

ఆ:- నే నీపూట మాట్లాడి సాయంత్రం వొకచిట్కా చెప్తా రా. దానితో కుక్కపిల్లై నీవెంట తిరుగుతుంది. తరువాత పెండ్లి నీయిష్టంవుంటే చేసుకుందువుగాని.

పౌ:- అనేకవ్యవహారాలు చూసినదానివి. యేదో వొక దారి చూపు.

ఆ:- అదెంతపని? బాగా మబ్బు పడ్డతరువాత రా. యేమి చెయ్యవలసిందీ చెప్తా.

పౌలు యింటికి బోయినాడు. కాని యేమీ తోచలేదు. హిందూదేవతలకు మొక్కుకున్నాడు. గదిలో పడుకొని నిద్రపో వాలె నని చూచాడు. నిద్ర పట్టలేదు. లేచి షికారు పోయినాడు. చిన్నప్పుడు నేర్చుకొన్న లిల్లాయిపదాలు పాడాడు. అవైనతరు వాత యేసుకీర్తన లెత్తుకున్నాడు. అవి రుచిగా లేవు. వొళ్లు దెలి యక కొంచెంసేపు నిలువబడి జోతిని మననంచేసి నిట్టూర్పు విడిచి ఉన్నత్తుడై మచ్చరించిన ఆబోతువలె పొలాలమీద సంచరిం చాడు. తాపం తగ్గలేదు. సాయంత్రం అయింది. చల్లగాలి

చింత నిప్పులమీద వడగాలి వోలినట్టు తాపజ్వరాన్ని హెచ్చించింది. సంధి ప్రారంభమైంది. ఉన్మత్తప్రలాపాలు ప్రారంభించాడు. "వో చెలియా! వోమగువా! వోలలనా! వోసకియా!—యెంత క్రూరురాలవే! నా ప్రాణాన్ని నిలువునా తీస్తున్నావు. ఓ జోతీ! నీ అందం వెలిగిపోతున్నది. ఆహాహాహా! నాజోతి యెంత మంచిదయ్యా!

నన్ను పెండ్లాడవే చెంచీతా!
నీకు బహుపుణ్య ముంటాదె చెంచీతా!

నేను నరసింహస్వామిని, వోముద్దు చెంచీతా, నన్నేలుకోవే!—(అని సుద్దులరాగం తీశాడు)

అంతామంచివాండ్లే! మాటలుమట్టుకు మంచివి. లాటులాటు కొట్టాడు. దావీదూ సలోమోనూ మహానుభావులు కాకపోయినారా? ఛూ!— మధ్య యిదెందుకు?

యెందు బోతివె, యెందు బోతివె,
యెందు బోతివె చెలియరో!

ఇదుగో! దొరికావు నాసామి రంగా? (అని పట్టుకోబోయి) యేదీ—దుబికించి పోయిందే. అస్సి నాపలవపిల్లా! లేడిపిల్లాల యెగిసిపోయింది.

నేను తాళలేను యిగను
తాళలేనే భామా నేను తాళలేనే భామా।

(అని నాట్యం చేశాడు.) ఎవరైనా వొక చెలికత్తె వుంటే బాగుండు. ఓ ఆడెమ్మ చెలియా! నాకేదో మార్గం చూపించవమ్మా. లేకపోతే నేనికృష్ణలో పడతా. యేదో త్వరగా తేల్చు. ఆలింగనానికి నీకు ఆరుకాసులిస్తా. మాటమని. అవతే మొక్కులు గావు సుమా. వచ్చేదా? వేళయిందా? నీకు దణ్ణం పెడతా. నీకాలు మొక్కుతా. హాయిదా శానాదూరం వేసిందయ్యా దీని సిగాగోయ్యా. మబ్బుపడవలెనట! పగలైతే పనికిరాదుగాంనాల. యేమి మబ్బుపడకపోతే కొంప మునిగిందా? యెవడు నా కష్టం

వచ్చేది? యిప్పుడే పోతా" అని లేచి పుల్లప్ప యింటికి బోయి—

పౌ:- అవ్వా!

ఆ:- వచ్చావా మనవఁడా! నొప్పుకొని నొప్పుకోనట్టుగా వుంది. వొక్కటే మందు. నేనూ అదీ అయిదుగంటలకు కృష్ణ రేవుకు స్నానానికి వస్తాం. కొన్ని గుర్రాలు కళ్ళెం పెట్టనియ్యవు. ఒక్కమాటు ఏదోవిధంగా స్వాధీనం చేసుకున్నావా తరువాత అన్నీ చక్కబడతవి. చలి దీరాలె. అర్థం అయిందా? యెవరు ఇక్కడ నీకు అడ్డం వచ్చేది?

పౌ:- తీసుకొని వస్తావా?

ఆ:- నాదీ భారం. నా మాట మరిచిపోయేవు.

పౌ:- నాతో యిన్నిమాటలా! మనసు వచ్చిందా అంటే మొహ యిచ్చేదే.

ఆ:- చీకటితో రావాలె. తెల్లవారితే వీలుగాదు.

పౌ:- తెల్లవారుఝాముదాకానా? గొటకొయ్యాలు నెత్తిమీదికి రాంగనే లేచి గమిడీ కాస్తా.

పౌలు వెళ్ళిపోయినాడు. ఆదెమ్మ లోపలికి బోయింది. కోటలూ జోతీ యింకా రాలేదు. అన్నం వుడుకైనా పట్టలేదు. మాటలసందట్లో అన్నం పొయిమీద పెట్టినసంగతే మరిచిపోయింది. మంట చల్లారి నిప్పు కరుగుపడ్డది. దీపం ముట్టింతామంటే నిప్పుపెట్టె కనపడలేదు. కుమ్ముదీసేవరకు సిగురుకప్పిన రవ్వలుంటే చిదుగులువేసి వూది మంటచేసి దీపం ముట్టించింది అన్నం వార్చి దింపేవరకు కోటలూ, జోతీ వచ్చారు.

రంగడు:- అవ్వా! నా కన్నం.

ఆ:- రాండి అన్నానికి, కమ్మని పచ్చడి నూరాం.

జోతి:- రంగడూ నువ్వూ తినండి. నా కాకలిగాలేదవ్వా!

ఆ:- [illegible]

కోడలు:- మన కేమిహొరిగింది? ఇవ్వాళ వాళ్ళ బావతో మాట్లాడింది గనుక కడుపు నిండినట్లుగా ఉంది.

ఆ:- బా వెవరే?

కో:- బావంటే యెరగవ్? మేనత్త కొడుకు. పోలిక లిద్దరివీ వొకటే!

ఆ:- మనివి అడిగి మాట్లాడడానికి వచ్చారా యేమి?

కో:- రేపు మనివి అడుగుతారట; యివ్వాళ కటకటాల దగ్గిర చూశాం. ఇంవకెకో అబ్బీసీ, వీండ్లబావా వచ్చారు. ఒక్క రోజేకా అమ్మా! మా ఇంట్లో నీ అన్నం తినేది! రేపటినుంచీ వండించి పంపిస్తామనే అనిరి.

ఆ:- యెవరే ఆ వచ్చినవాండ్లు? నిజమేనా వాండ్లు చెప్పిన మాటలు?

కో:- వాండ్లబావ మాలవాడివలె వున్నాడా? దానికంటే గూడా నాజూకుగా వున్నాడు. జవరమైన మనిషి. ఏమి సంబర పడ్డాడే! నిన్ను జూచి, గంతులువేశాడు. లే అన్నానికి.

జో:- మా అమ్మా అయ్యా యెక్కడ వున్నారో! అన్నం తిన్నారో? లేదో? కొడుతున్నారేమో అవ్వా! ఖైదులో ప్రతి పూటా అన్నం పెడతారా?

ఆ:- ఓ. వేళయ్యేవరకు సంకటిముద్దలు తెచ్చి ఇస్తారు. మావాడు మునుపు గుంటూరు జైలులో వుండగా చూచా.

జో:- మా అమ్మ రెబ్బపాయవంటి మనిషి. ఒక పాళాన దసిలేది కాదు. కాని మా అయ్య బొత్తిగా లుగచెడ్డాడు. మా అయ్యను నేను మళ్ళీ చూచేనా, అవ్వా?

ఆ:- చూడ కేమి? ఆరు నెల్లూ మూడు మాసాలలో తిరిగి వస్తవి. అందరూ అన్నానికి లేవంది. నీవు లేవకపోతే నేనూ తినను.

కో:- జోతీ! లే. పిల్లవాడు ఆవలిస్తున్నాడు, తిని పడుకుందాం.

అంతా అన్నానికి కూర్చున్నారు. జోతి పట్టివేస్తునే తిన్నది.

ఆ:- కష్టాలు మనుష్యులకు రాక మాకులకు వస్తవా? వచ్చినప్పుడు వోపిక పెట్టుకొని భరించాలె. ఒక్క-పిల్లవాడినీ వదిలి పెట్టుకుని యీ అభాపురిలో యెందుకున్నాం? ఇట్లాగే రోజులు తోసేది. భత్యం తీరంగనే యే చెట్టుకిందనో రాలిపోయేది.

జో:- రేపు స్నానానికి పోవద్దా, అవ్వా?

ఆ:- అట్లాగే పోదాం. ఇంట్లో వుండిచేసే దేముందీ? ప్రార్థనకు బోవడం లేదుకనుక విడిపను లెన్నైనా చక్కబెట్టుకో వచ్చు. ఇంతకూ ఆ మహారాజు యీ సదుపాయం చేసిపోయినాడు. అదివరకు ప్రార్థనలోగా అన్నీ ముగించుకోవలసి వుండె. ప్రతి దానికి వురుకులూ పేరాలే.

జో:- అక్కడికి స్నానానికి బోతే యెవరూ వద్దనరుకద?

ఆ:- నీమోస్తరుగా మంత్రాలు చదువుతూ స్నానం చేస్తే వద్దంటారేమో! అంతవర కెందుకు? అన్నీ చీకటితోనే ముగించుకుందాం. ఒక గడియ ముందుగా బోతే సరి.

జో:- పెందరాళే లేపు. ఇక పడుకుందాం లెండి!

అంతా లేచి పహారాంవచ్చి పోగానే పడుకున్నారు. పోలీసులు గస్తీ దిరుగుతున్నారు. పౌలు వున్మత్తభ్రాంతంవలె పుల్లప్ప వీధిన తెల్లవార్లూ తిరుగుతున్నాడు. రెండుగంటల కొకసారిచొప్పున అయిదు పహారాలయినవి. ఆరవపహారా ప్రారంభించగానే యింటికి పోయి చక్కగా దుస్తులు వేసుకొని కృష్ణవైపుకు బయలుదేరి దారి పక్కవున్న కయ్యలో నక్కాడు. ఆదెమ్మనాలుగు గంటలకే లేచి పౌలువెళ్లాడో లేదో చూతామని వాకిట్లోకివచ్చింది. పౌలుజాడ కనబడలేదు. కాసేపు తారట్లాడి లోపలికిబోయి జోతిని లేపింది. జోతికి రాత్రి సరిగా నిద్రపట్టలేదు. తల్లిదండ్రులు జ్ఞాపకం వచ్చి చాలాసేపు అదే ఆలాపనగా, వున్నది. అప్పాదాసు జ్ఞాపకం వచ్చాడు. తన మనస్సులో అచ్చుపడ్డరూపాలను సాయంత్రం గనబడ్డ ముఖవైఖరితో తాజెళ్ళు వేసి చూచింది. రెండూ బింబప్రతిబింబంగా సరి

పోయినవి. తెల్లవార్లూ ఆ రూపాన్ని మనసులో చిక్కబట్టుకొని ఆనంద కెరటములలో హంసవలె వుయ్యాల లూగుతూ పడుకున్నది. ఆదెమ్మ లేపేవరకు, నిర్మలసరస్సులో ప్రతిబింబించే చంద్రమండలం నీళ్లు గదలంగనే చెదిరిపోయినట్లో స్తరుగా జోతి హృదయసరస్సులో విహరిస్తున్న మనోహరరూపం చలించింది.

జో:- అవ్వా! నన్నిప్పుడు కదిలించబోకూ! వొక్క అరగడియలో లేస్తాను.

ఆ:- రోజూ వేళకు స్నానంచేయడం మంచిది. అలవాటు తప్పించగూడదు. దబ్బునపోయివత్తాం లే.

జో:- కాసేపు వుండు. అవ్వా! యింకా చాలాపొద్దు వున్నది.

కో:- మీబావను కలగంటున్నావా? లేపినా ముసుగుదన్ని పడుకుంటున్నావు.

జో:- అబ్బా! నన్ను నిద్దరపోనియ్యరు రా మీరు. అవ్వా! నీకెంత పాపమనుకుంటున్నావు. పొద్దున్నే లేపావుగదా! పద వస్తా.

కో:- పోనియ్యి, యింకా కాసేపు పడుకో.

జో:- అవ్వ రాకాసిలాగు వెంటబడ్డట. ఒరే అబ్బాయి! లే పోదాం, స్నానానికి.

ఆ:- వాడి నెందుకు లేపుతావు చీకట్లో? యెండలు బాగా ముదరనీయి.

జో:- నీవుగూడా రారాదుటమ్మా, పొద్దెక్కినదాకా పడుకోకపోతే!

ఆ:- దానికి చన్నీళ్లు పోసుకుంటే జబ్బు చేస్తుంది, పద.

ఉభయులూ బయలుదేరారు. గుడిసెలుదాటారు. ఆదెమ్మ దారిపక్కల చూస్తూ పోతున్నది. ఎందుకో భయపడుతున్నది. ముందు నడిచేదల్లా వెనుకకు దిగబడ్డది.

జో:- యేమవ్వా! వెనుకబడ్డావు?

ఆ:- ఆఁ. ఏ మున్నది ? నే ముసలిదాన్ని. నీవు పడుచ దానవు. పద, నీతో రాలేకపోతానుటలే. ఇప్పుడు దొంగలు వస్తే యేమిచేస్తావే ?

జో:- ఇక్కడికి .దొంగ లెవరు వస్తారు ?

ఆ:- దొంగ లెవరు వస్తారా ? యెక్కడనుంచి రావాలె వున్నవాం డ్లందరూ దొంగలైతే !

కయ్యదగ్గరకు వచ్చారు. మనిషి లేచి నిలబడ్డట్టుగా వున్నది. తెల్లంగా దుస్తు లున్నవి. దారివైపుకు వస్తున్న ట్లున్నది. మగవాడివలె వున్నాడు. బాగా సమీపించాడు. దారిలోకి వచ్చి అడ్డంగా నిలువబడ్డాడు. జోతి తొలిగిపోబోయింది. యెటు తిరిగితే అటు వచ్చాడు.

జో:- యెవ రబ్బీ నీవు, అల్లానికి తలపడ్డట్టున్నావు ?

పౌలు:- నీ గులాపువాడిని. నీ వనుగ్రహించకపోతే నే జీవించను. ఎందుకు నన్నిట్లా బాధించడం ? నా కేమిలోప మున్నది ? నీకు లక్షణంగా జరుపుతా. ఈ సెటిలుమెంటు వాండ్లంతా నీకు నౌకర్లై పనిచేస్తారు. నీకు అడుగులకు మడుగు లొత్తుతారు.

జో:- తొలుగు దారి ! నేను వొంటరిగా వున్నా, నను కొన్నావేమో ? జాగ్రత్త ! పిచ్చిమాటలు మాట్లాడవద్దు.

పౌ:- నాకు జవాబు చెప్పి పో. నేను భరించలే-లే-ను. (అని చెయి పట్టుకున్నాడు.)

జో:- ఛీ. న న్నంటుకోవద్దు. (అని చెయ్యి విదిలించికొట్టి దారిప్రక్కన నిలవబడ్డది.)

ఆ:- యేమే ! అట్లామాట్లాడుతావు ? నీ దర్జాకు తగడా ? నీ వేమి బంగారు బొమ్మవా ?

జో:- ఇవా నీవు చెప్పేమాటలు ! చాలులే !

ఆ:- యేమిటి చాలేది? అశ డంత భంగపడుతుంటే? ఇంకా నీ అదృష్టమనుకో. పట్టుకోవయ్యా మహా శానాతనం పోతుంది.

పౌలు వాటువేసి పట్టుకోబోయినాడు. జోతి 'కృష్ణా!' అంటూ కృష్ణవైపుకు పరుగెత్తింది. ఇద్దరూ వెంటబడ్డారు. చెరొక వైపునా కమ్మారు. నీళ్ళలోకి దిగింది. వాండ్లూ దిగారు. మోకాళ్ళలోతు నీళ్ళలోకి బోయింది. వాండ్లిద్దరూ ఆగలేదు. 'ఓ దాసూ! యెక్కడున్నావు? దబ్బునరా' అని కేక వేసింది. వాగ్రూపకమైన జవాబేమీ లేదు. అంతా దాసుమయమైంది. ఇద్దరూ ఇంకా దగ్గరకు వస్తున్నారు. పౌలు రెండుచేతులతోనూ నొడిపి పట్టుకోబోయినాడు. రాహువు పట్టు తప్పించుకొన్న చంద్రబింబంవలె చేతులనుంచి దూసుకొని పరుగెత్తింది. మళ్ళీ కేకవేసింది. ఇతరులకు వినబడలేదు. కృష్ణ వడిగావచ్చి లోపలికి లాక్కున్నది. కనబడకుండా కెరటములలో దాచుకొన్నది. బుడ బుడశబ్దం వినపడ్డది. పౌలూ, ఆదెమ్మ ఆగి చూచారు. తప్పించ వలెనని ప్రయత్నించారు. గాని తెలలేదు. ప్రవాహంవడికి నిలవ లేక గట్టుకు వచ్చారు. పదహుగులలో సుడిగుండమున్నది. జోతి గిర్రున తిరిగింది. ప్రవాహం గట్టుకు తోసింది. ఇసుకలో మేట వేసింది. జోతి సగానికి పూడి కూర్చున్నది. పౌలు చూడలేదు. పరుగెత్తి ఇంట్లో దాక్కున్నాడు. పోలీసులకు తెలిస్తే పట్టుకొని కొట్లో పెడతారని భయపడ్డాడు. ఆదెమ్మ కోడలితో చెప్పింది. ఆ మాటలు పిల్లవాడు విని కేకలువెయ్యటం మొదలెట్టాడు. ఆదెమ్మ తానూ జోతీ స్నానానికిపోతే యెవరో వచ్చి జోతిని లాక్కొనిపోయినారని గోల పెట్టింది. సబుయిన్స్పెక్టరు వచ్చి దానిని ముందు అరెస్టుచేయించి నిజము చెప్పమని బలవంత పెడు తున్నాడు. కోడలు మని షెవరో చెప్పవలసిం దని అత్తను బల వంతపెడుతున్నది. సెటిల్మెంటంతా గోలయింది. పౌలునుకూడా అరెస్టు చేయిస్తే నిజం బయటబడుతుం దని కుల పెద్ద లంటు న్నారు. అతడు వుడాయించాడు. కృష్ణవైపుకు పరుగెత్తాడు.

యెటు పోయిందీ కనబడలేదు. పరారీఅయినాడని పోలీసులు రికార్డు చేశారు. ఆదెమ్మను వెంటబెట్టుకొని రేవువైపుకు బోయినారు. జవానులను నీళ్ళలో దింపి కొంతవరకు వెతుకులాడించారు. కొందరు పరవగా బయలుదేరి కృష్ణగట్టున వెదుకుతున్నారు. తూర్పురేఖలు తెల్లబారినవి. ఇసుకలో యేదో కూర్చున్నట్టు కనబడ్డది. జోతేనని కేకలువేస్తూ పరుగెత్తారు. చుట్టూ ఇసుకతీసి మెల్లిగా బయటకులాగి పడుకోబెట్టారు. పరీక్షించి చూచారు. శ్వాసాడించడానికి చేతులు లాగారు. నాడి పరీక్షించారు. ముక్కు దగ్గర వేలుపెట్టి చూచారు. పొట్టమీద చెయ్యిపెట్టి మెల్లెగా అదుముతుంటే నీళ్ళు బయటికి వస్తున్నవి. చాలానీళ్ళు పోయినవి. పొట్టతీసింది. జోతిమాత్రం లేదు. అదివరకే పోయింది. గుడ్డగప్పి పడుకోబెట్టారు.

దొర వచ్చి చూచాడు. ఇనస్పెక్టరూ, ఆయనా కలిసి ఆదెమ్మను బంగాళాకు తీసుకొని పోయినారు. వెంకటయ్యా, అప్పాదాసూకూడా వచ్చారు. దాసు శవందగ్గర పడుకున్నాడు. ఎవరు లెమ్మన్నా లేవలేదు. సూపరింటెండెంటు వాండ్లిద్దరినీ పిలిపించాడు. దాసు రాను పొమ్మని పూవులు గోసితెచ్చి జోతిని అలంకరిస్తున్నాడు. వెంకటయ్య దొరదగ్గరకు బోయినాడు. జనమంతా దూరంగా కూర్చున్నారు. అప్పాదాసు పూవులతో అలంకరించి పకపక నవ్వాడు.

"నీకూ నీవారు లేరు నాకూ నావారు లేరు
యేటివొడ్డున యిల్లు గడదాం పదరా."

అని పాడుతూ గబామని యెత్తి బుజంమీద వేసుకున్నాడు. నీళ్ళలోకి పరుగెత్తాడు. జనం వెంటబడ్డారు. చిక్కలేదు. ప్రవాహంలోకి పోయినాడు. వడిచేత కాలానలేదు. ఈదగలవాండ్లెవ్వరూ లేకపోయినారు. ఇంకా పోతున్నాడు. కాళ్ళకు పూనిక చిక్కలేదు. ఉభయులూ ప్రవాహానికి అడ్డం పడ్డారు. మునిగారు. తేలారు. కొట్టుకొని పోతున్నారు. జనం కేకలు వేసే

వరకు వెంకటయ్యా, పోలీసులు వచ్చారు. ఉభయులూ ఆలింగనంలోనే ఉన్నారు. పూవులు వాండ్ల వెంబడే కొట్టుకొని పోతున్నవి. ప్రవాహం వాండ్లను వొడ్డుకు నెడుతుందేమోనని జనం కట్టవెంబడి పరుగెడుతున్నారు. ఈదగల వాండ్లు దిగి సత్తువకొద్దీ యీదుతున్నారు. ప్రవాహం వాండ్లకంటే వేగంగా పోతున్నది. జంట తేలిపోతూనే వున్నది. కొంతసేపటికి చూపు మేరకు దాటింద. చూపుల కందకపోయిన తరువాత అంతా ఆగారు. దిగాలపడి శూన్యాన్ని చూస్తున్నారు.

కృష్ణ గునగునలాడుతూ సంగీతం పాడింది. ఇంకా పాడుతూనే వున్నది.

"మనిద్దరీమన సాక్షులైతే మల్లెపూల తెప్పగట్టి తెప్ప మీదనే తేలిపోదం పదరా." అని శబ్దిస్తున్నది.

## ౨౦

### కొరడా దెబ్బ

జోతీ అప్పాదాసుల మరణం ఆంధ్రదేశంలో కల్లోలం కలిగించింది. పెద్దశీర్షికలతో పత్రికలు రామదాసు కుటుంబంయొక్క చరిత్ర, రామానాయుడు కేసుయొక్క వివరాలు, రామదాసు కేసుయొక్క కల్పనాకథలు, సెటిల్మెంటులో వుండే కష్టాలూ విపులంగా ప్రకటించినవి. జోతీ అప్పాదాసుల ప్రేమయొక్క చిత్రచరిత్ర జనులలో విస్మయం కలిగించింది. పౌలు పరారీకావడంవల్ల అనుమానం యెక్కువ అయింది. పాదిరీ రామదాసుకేసుకూ, పౌలు దుర్వర్తనానికీ సంబంధం లేదని జనులను మభ్యపెట్టడానికి ప్రయత్నించాడు గాని సత్యం దాగలేదు. మతబోధవిషయమై రామదాసు సమ్మోకట్టించడం వల్ల పాదిరీప్రోత్సాహం చేత రామదాసుకు జైలుప్రాప్తి అయిందని జనులు నమ్మారు. పౌలుయొక్క దుష్ప్రవర్తనం, జోతీ అప్పాదాసుల ఘోరమరణం, సెటిల్మెంటు వాసులలో కల్లోలం పట్టించినవి. జనమంతా సెటిల్మెంటు నిబంధనలను యొగర్త్రించి గుడిసెలు విడిచి ఆవరణం వెలుపల కృష్ణకట్ట

పొడుగునా నివాసమేర్పరచుకున్నారు. మరణాలసంగతీ సమ్మెలసంగతీ కలెక్టరుకు తీగె యివ్వంగనే ఆయన మూలబలంతో తాడేపల్లిస్టేషన్ లో దిగాడు. కేసులను పూర్తిగా విచారించవలసిందని పోలీసువారికి తాఖీదిచ్చి సెటిల్మెంటువాసులను వెంటనే గుడిసెలలో కాపురం వుండకపోతే తుపాకులతో కాల్పిస్తామని కలెక్టరుగారు బెదిరించారు. తాము పరుగెత్తిపోదలచుకో లేదనీ, తుపాకులతో కాల్చిచంప వచ్చుననీ, మూడురోజులలో తమకు తగిన జీవనవసతి చూపించక పోతే లేచిపోతామనీ లిఖితపూర్వకంగా తెలియపరచారు. ఈసంగతులు యితర సెటిల్మెంట్లలోకూడా కదలిక పుట్టించినవి. రాఘవేంద్రరావు పంతులుగారిచేత గవర్నమెంటువారు చట్ట నిర్మాణ సభలో సెటిల్మెంట్లు యెట్లా పనిచేస్తున్నవో విచారించి తెలియపర్చడానికి వొకసంఘం యేర్పరచవలసిందని తీర్మానం పెట్టించారు. ప్రతినిధిసభ్యులలో చాలామంది "సంఘాలేర్పరచడ మంటే మాకర్థం తెలుసు. ఈ వుద్రేకసమయంలో ప్రస్తుతపు అడావడి ఆపేకొరకే సంఘా లేర్పాటుచేసి అది అణిగిపోయిన తర్వాత మెదలకుండా వూరుకోవడం అంతా యెరిగినసంగతే. వెంటనే సెటిల్మెంటుకష్టాలకు తగినచికిత్స చేయవలసిం" దని పట్టు పట్టారు. గవర్నరుగారి సలహాతో పంతులుగారు మామూలు ప్రకారం తమతీర్మానాన్ని వుపసంహరించుకో బోయినారు. ప్రతి నిధి సభ్యులు సెటిల్మెంటుసమస్య సక్రమంగా పరిష్కరించకపోతే తాము సభవిడిచి లేచిపోతామని బెదిరించారు. తర్వాత ఉభ యులూ రాజీపడి ప్రస్తుతం వుండవల్లి సెటిల్మెంటు తీసివేసి అక్కడి వాండ్లందరికీ పల్నాటితాలూకాలో పూర్వం బేచిరాకుగా వుండి తర్వాత ఫారెస్టులో కల్పబడ్డ భూములను దరఖాస్తులకిచ్చి వూరు కట్టించడానికి వెంటనే యేర్పాటు చేయవలసిందనీ తక్కిన సెటి ల్మెంటు సంగతులు విచారించడానికి చట్టనిర్మాణ సభవారు తమలో కొందరిని సంఘంగా యేర్పరచి వారు నివేదిక పంపే వరకూ కొత్తవారి నెవ్వరినీ సెటిల్మెంట్లలో చేర్చకూడ దనీ రాజీ యేర్పరచుకున్నారు. కొందరు ధనికులైన ప్రతినిధిసభ్యులు కొత్త

వాళ్ళను సెటిల్మెంట్లులో చేర్చకపోతే సంతానులపోడు అధికమవు తుందని రాజీకి వొప్పుకోకపోయినా యెక్కువమంది అంగీకరించారు. కొత్తవూరికి రామదాసుపురం అని జనులు పేరుపెట్టారు.

వెంకటయ్యా, జోతీ అప్పాదాసుల మరణంవల్ల కుమిలిపోయినాడు. రామానాయుడి కేసు సంగతి ఆయన కింకా తెలియ లేదు. పాదిరీ పిల్లవాడిని వెంకటయ్యతో పంపాడు. యేమి చెయ్యడానికి తోచక గుంటూరువచ్చి రామానాయుడి ప్రయత్నాలు శృంగభంగమైనవని తెలుసుకున్నాడు. రామానాయుడు జైలులో బడ్డసంగతి తెలియంగనే వెంకటయ్యకు యెక్కడలేని ధైర్యమూ వచ్చింది. మనస్సుకు యేవిధమైన భేదం కలుగలేదు. సరాసరి రామానాయుడితో మాట్లాడడానికి జైలుకు వెళ్ళాడు. సూపరింటెండెంటు వుత్తర్వు పొంది లోపలికి పోయి—

వెం:- తమ్ముడూ ! చింతపడ్డావా ?

రా-నా:- నాకేవిధమైన చింతాలేదు. జోతీ అప్పాదాసుల మరణం తప్ప మరియొక విచారం లేదు. రామదాసూ, మాలక్ష్మి యీ దుఃఖమెట్లా భరిస్తారో చెప్పలేను. రామదాసు లోకాతీతుడైనాడు. సుఖదుఃఖాలాయనకంటుకోవు. ఇంతవరకు జోతివిషయం ప్రతిబంధకంగా వుండె. అదీ తీరిపోయింది. నన్నూ ఆ జైలుకే పంపిస్తారనుకుంటాను.

వెం:- అయితే మాట్లాడి ధైర్యము చెప్పు. పిల్లవాడివిషయంలో నా ఆడపిల్లలతోపాటు యేర్పాటు చేయవలసిం దని నా అభిప్రాయం. నీవుద్దేశ్య మేమి ?

రా-నా:- సరళమైన నీవుద్దేశ్యాలతో నా కభిప్రాయభేదం యెట్లా కలుగుతుంది ?

వెం:- ఆ సంగతి మాలక్ష్మితో చెప్పు. పిల్లవాణ్ణిప్పుడు మనయింటికి తీసుకొనిపోతున్నా. జతపడివస్తే నాలుగోపిల్లకు పెండ్లిచేసి అత్తవారింటికి పంపిస్తా. నా భారం తీరిపోతుంది. అదట్లా

వుండనియ్యి. నీవు వచ్చేవరకు నే జేయవలసిం దేమి? నా కేమి సందేశం?

రా-నా:- నే బయటికి వచ్చే ఆరునెలలలోగా స్వరాజ్యం వచ్చి తీరుతుంది. నారాయణరావుపంతులుగారి సలహా పుచ్చుకుంటూ తగినప్లాను వేయించి కార్మిక కళాశాలాభవనాలు తయారు చేయించు. వసూళ్లు కురదలా ఉంటే పూర్తిచేయించు. నేను జైలులో మరణించడం తటస్థిస్తే వుద్యమానికి లోటు వస్తుందనే సందేహంలేదు. నాకంటె వుత్సాహపరుడవు, సమర్థుడవు అయిన నీ చేతులలో పడ్డది. నిన్ను పొగిడాననుకోవద్దు. మనం అనుకున్న ప్రకారం జరిగించు.

వెం:- నీవు చెప్పింది యావత్తు శిరసావహించి నెరవేరుస్తాను. ప్రతి నెలాఖరున యెంతపని జరిగిందీ తెలియపరుస్తుంటా. ఇక్కడనుంచి ప్రయాణ మెప్పుడు?

రా-నా:- యింకా రెండుమూడురోజులదాకా తీసుకొనిపోరు.

వెం:- అక్కడ నీచే తేమైనా పని చేయిస్తారా?

రా-నా:- విడికైదే. నాదుస్తు లుంచుకోవచ్చు. యిక్కడికి నేను తెచ్చుకొన్న పడకగుడ్డలు మేజస్ట్రేటుగారికి చూపి వారంగీకరించినవి నాకు పంపు. రెండు పాత్రలుగూడా అవసరం. ఆయన అంగీకరించనివి సెంట్రలుజైలు సూపరింటెండెంటుగారు చూచుకొని నా కిచ్చేటట్టు పంపితే ఆయన అంగీకరించవచ్చు.

వెం:- ఫరవాలేదు. ఈయన అన్నీ అంగీకరిస్తాడనుకుంటా.

రా-నా:- నాకు నమ్మకం లేదు. ఇతనికి భయం. దాస్యంలో వున్నవా డెప్పుడూ దేనికీ సాహసించలేడు. అయినా ప్రయత్నించి చూడు.

పోలీసు:- అయ్యా! యిక పదండి. మేజస్ట్రేటుగా రింతసే పెందు కుంచారంటారు. కావలసివుంటే సాయంత్రంవచ్చి మాట్లాడండి. యేర్పాటు చేస్తా.

వెం:- తమ్ముడూ! నిన్ను ఖైదులో వుంచి నేను హాయిగా యింటికి వెళ్ళుతున్నా. నేను నీతో యెందుకు రాగూడదు?

రా-నా:- అన్నా! మనం రణరంగంలో వున్నాం. నేను గాయపడ్డాను. హాయిగా వుంటాను. బయటవుండి నీవే యెక్కువ మనస్సులో బాధపడుతావు. నీవుకూడా వస్తే పని యెట్లాసాగాలె? నీవు పూర్తి చేయించకపోతే అంతా ఆరూ మూ డవుతుంది. నే నిప్పుడు ఖైదులో పడకపోతే మనయేర్పాట్లు యీాడి కెకిందపడేవి. ఇది మన కొకకొరడాదెబ్బ. సమర్థుడవు నీవు బయటవుండి నేను యిక్కడ వుండడమే మేలు.

వెం:- తమ్ముడూ! నీతో పోలిస్తే నే నెంతవాణ్ణి!

రా-నా:- ఆ విషయమై నీవు జవాబు చెప్పవద్దు. నిన్ను పొగడలేదు. నన్ను క్షమించి మరియొకవిషయ మెత్తుకో.

వెం:- పంతులుగారిని మనవూ రొకమారు తీసుకొనిపోతే బాగుండు. ఇప్పుడు రమ్మంటే వస్తారా?

రా-నా:- వారు పనికూడా ఆరంభలచేశారు. మన ఆలో చనలన్నీ చెప్పాను. ఉదయం చాలాసేపు మాట్లాడిపోయినారు. స్పష్టంగా చెప్పలేదు గాని ఆయనవల్ల మనకు యెక్కువసహాయం అవుతుం దనుకుంటాను. ప్లాను ఆయన అంగీకరించందీ మొదలు పెట్టవద్దు.

వెం:- అయితే యీారోజు ఆయనను తీసుకొనిపోతా. నీవు నిడదవోలు వెళ్ళేలోగా మళ్ళీవస్తా.

రా-నా:- అ దంతా పెట్టుకోవద్దు. పోయి పని వెంటనే ప్రారంభించు.

వెం:- యిప్పటి కింతే చూపు. పని సాగించి పదిహేను రోజులలో వచ్చి అన్నిసంగతులూ మాట్లాడుతా. కేవలం వుత్తరాలవల్ల తేలదు. అక్కడనుంచే రాజమహేంద్రవరం పోయి కలప తేస్తా.

రా-నా:- సరే కానియ్యి. ఇంతే నమస్కారములు.

పోలీసులు:- అయ్యా! మేజస్ట్రీటుగారు వచ్చేవేళయింది. దయచేసి పదండి!

అంతట వెంకటయ్య వెళ్ళిపోయినాడు.

౨౧

## దాస్యం రుచిస్తే ముక్తిలేదు

వెంకటయ్య వెళ్ళిపోయిన తర్వాత రామానాయుడు భోజనంచేసి నిశ్చింతగా పడుకున్నాడు. సంగదాసు హత్యా, కమలయొక్క చిత్రచర్యా, సాహూ చౌదరయ్యల మరణం, జగ్గడి బందిపోట్లు, వెంకటయ్య వుద్యమంలో కలియడం, రామదాసు వగైరాల కారాగృహప్రవేశం, జ్యోతీ అప్పాదాసుల విచిత్ర ప్రయాణం, శ్రీకృష్ణ జన్మస్థానానికి తనయాత్రా, మొదలైన వన్నీ యేదో సర్వజ్ఞత్వంగల వ్యక్తి మహోద్దేశంతో నడుపు తున్నట్లు కనబడ్డది. ధర్మాధర్మాలు వొకదాని నొకటి జయించడానికి చేస్తున్న మహారణరంగంలో యివన్నీ అంతర్భాగాలైన స్వల్ప కథలుగా తోచినవి. లోకచరిత్ర పారజూస్తే సత్పథం పొడుగూనా సత్పురుషుల రక్తసిక్త మయ్యే కనబడ్డది. ఇది మహాయాగం. యజ్ఞ పురుషుడు యీమహాహోమంలో తనొక్క యింధనంగా స్వీకరించినందుకు ఆనందపడ్డాడు. పావకుడు తనను అగ్నిపరీక్షకు లోబరచినందుకు ధన్యవాదం చేశాడు. తనయందు అజ్ఞానజన్యమైన అహంకారము నశించడానికి సాధనం చూపించినందుకు భగవంతుడికి కృతజ్ఞతా పూర్వకవందనాలు చేశాడు. ఒళ్ళు జలదరించింది. లేచి కొబ్బరినారచాపమీదను కూర్చున్నాడు. “అశ్రాంత హరిభావనారూఢచిత్తుడై యుద్ధతుడై పాడు నొక్కచోట” అన్నమో స్తరుగా నరసింహారావుగారిదగ్గిర నేర్చుకున్న:

“భజో మధుర హరినామ నిరంతర
భజో మధుర హరినామ్
హరిహీ సుఖహై - హరిహీ శాంతి - హరిహీ
ప్రాణారామ్.”

అనే కీర్తనను గొంతెత్తి అవ్యక్త మధుర ధ్వనితో పాడుతున్నాడు.

ప్లీడరు నారాయణరావు మళ్ళీ రామానాయుణ్ణి చూడడానికి వచ్చాడు. జైలులోకి అడుగు పెట్టంగనే భక్తిరసప్రవాహం యొక్క కెరటాలు యీడ్చికొడుతున్నవి. కొండలుకూడా ఆగేటట్టు లేదు. బండలు చెమర్చినవి. చెట్లు మోసులెత్తినవి. గాలి మందగమనంతో తూలుతున్నది. క్రిమికీటకాదులు సొమ్మసిల్లినవి. నారాయణరావు మునివేళ్ళమీద నడిచివచ్చి కమ్ములు పట్టుకొని నిలువబడి అద్భుతదృశ్యంలో ఐక్యమై పోయినాడు. గానం పూర్తి అయిపోయింది. రామానాయుడు కన్నీటికాల్వలలో దొప్పదోగుతున్నాడు. నిశ్శబ్దకుహరంలోనుండి వాక్కు–వాక్కు వినబడ్డది.

"శ్లో: సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః." అని

నారాయణరావు శిరస్సు వంచాడు. రామానాయుడికి సర్వం నారాయణమయం అయిపోయింది. ఇండ్లూ, వాకిండ్లూ, రాళ్ళూ, పోలీసులూ, వుద్యోగులూ, ఖైదీలూ నారాయణుని యొక్క ప్రకారాంతరాలుగా కనబడ్డారు. "సహ నౌ భునక్తు" అను మహావాక్యప్రకారం అన్యోన్యభోగ్య భోక్తృత్వసంబంధం నిరూపణ మైంది. "ఏష సర్వస్వభూతాత్మా మే పరిష్వంగో హనూమతః." అను ప్రమాణప్రకారం సహభోజనం ప్రాప్తించింది. అన్నిలోకములకూ వ్యాపించిన యీసత్రయాగం కొంతసేపటికంతర్ధానం అయింది. రామానాయుడూ నారాయణరావూ ముఖాముఖీగా నిలువబడ్డారు.

రా–నా:– అయ్యా! నమస్కారం.

నా:– తమకు నమస్కారం చేస్తున్నారా?

రా–నా:– పెద్దలకు నమస్కారం చెయ్యడం ధర్మంగదా!

నా:– తమకు వ్యతిరేకంగా జెప్పడంలేదు. ఆశీర్వాదంగా స్వీకరిసాను. ఇక్కడికి నేను పనివుండి వచ్చినా మీతోడి సాంగ

త్యంవల్ల నాజన్మసాఫల్యకారైనచూపు లభ్యం అయింది. సహ భోజనం ప్రాప్తించింది. నాకింతేచాలు. ఈ దినం వెంకటయ్యతో మాట్లాడాను. మహాత్మాజీ చెప్పినప్రకారం స్వరాజ్యం రాక తప్పదు. నేను తిరిగీ పోలీసుద్యోగంలో ప్రవేశింపవలె ననేవుద్దేశ్యం లేదు. స్వరాజ్యం వచ్చేవరకూ దేశస్వాతంత్ర్యానికై పనిచేయ డానికి నిశ్చయించుకున్నాను. అటుపైని మీ మంగళాపురంలో ప్రవేశించి పంచమకార్మికోద్యమాలలో దేనిలోనైనా మీరు చూపిన పని చేయడానికి సిద్ధంగా వున్నాను. తమతో మరిఒక విషయంకూడా మాట్లాడవలసివున్నది.

రా-నా:- నేను యితరవుద్యమాలలో కొంత జోక్యం కలి గించుకొని తిరుగుతుండడంచేత ప్రత్యక్ష్యంగా రాజకీయవ్యవహారా లలో ప్రవేశం కలిగించుకోలేదు. కార్మికసంఘాల నన్నిటినీ దేశ స్వాతంత్ర్యానికి పూర్తిగా పనిచేయవలసిం దని ఖండితంగా చెప్పి వచ్చాను. సభికు లందరూ త్రాగుడు మానివేశారు. సంఘాలున్న అన్ని గ్రామాలల్లో సారాయిదుకాణాలు మూశారు. మాల మాదాలవున్న రాటాల బూజంతా దులుపబడినది. గ్రామాలల్లో యెక్కడ చూచినా దూదేకులవాండ్ల కమానుల గుబదెబలూ-- రాటాలయొక్క సంగీతం, విరివిగా వినబడుతున్నవి. యెక్కడ జూచినా ముతకనూలుగుడ్డలే. కార్మికసంఘా లన్నీ తమసభ్యుల కుటుంబాలు ఖద్దరుబట్టలే వుపయోగించాలె నని తీర్మానాలు చేసినవి. పట్టణాలకుకూడా యెగబ్రాకింది. పన్నులవిషయంలో పూర్తిగా తగు అవసరం వచ్చినప్పుడు పని జరుగుతుంది. అవసరం వస్తే ఖైదుకు పోవడానికి యెవరూ వెనుదీయరు. నేను ఖైదుకు రావడం కూడా వారిని పురికొల్పుతుంది. స్వయంగా మీతో కలిసి పనిచేసేభాగ్యం నాకు లభించనందుకు చింతించుచున్నాను.

నా:- అయ్యా! మీ రిదివరకు చేసినపనంతా యిప్పుడు రాజకీయోద్యమానికి పునాది. కార్మిక పంచమోద్యమాలు రెండూ వృద్ధిపొందినప్పుడే మనదేశంలో నిజమైన ప్రజాప్రభుత్వం నెలకొల్పుతుంది. దిగువజాతులలో ప్రబోధం కలుగందే ధనిక

ప్రభుత్వం వుంటుందిగాని ప్రజాప్రభుత్వం వుండదు. ఇప్పటిరాజకీయాందోళనానికి విదేశప్రభువులు ముందుగా ఖైదులోకి పంపించడానికి తప్పకుండా మీరు అఖ్యాతి సంపాదించారు. మీరు చెమటోడ్చి సంపాదించిన గౌరవమే కాని వుట్టవుడియంగా వచ్చిందిగాదు. నేను మీతో మాట్లాడదలచిన యింకొకవిషయంలో ధర్మవిరుద్ధంగా అపనికి పూనుకున్నానేమో అని సందేహంగావున్నది. కలెక్టరుగారు మీతో కొన్నిసంగతులు ముచ్చటించమన్నారు. మిగలా వచ్చానుగనుక చెప్పిపోదామని నిశ్చయించుకున్నాను.

రా-నా:- దాని కేమి! వినదగు నెవ్వరుచెప్పిన. వినుకోవడం సంగతి వేరు. సెలవియ్యండి.

నా:- పొద్దున మీతో మాట్లాడివెళ్ళిన తర్వాత కలెక్టరు నాకు కబురంపించి మీవిషయమై మాట్లాడాడు. వారు నాతో చెప్పిన సంగతులు వారికిగాను మీతో చెప్పాతున్నాను. అది నా అభిప్రాయంగా యెంచవద్దు. మీరు జిల్లాలో చాలావరకు పలుకుబడిగల వారని తెలిసిగాంవాలె, మిమ్మును శిక్షించినందుకు పస్తాయిస్తున్నాడు.

రా-నా:- తప్పనితోస్తే సవరించుకోవచ్చుగదా. మిగిలిందేమున్నది?

నా:- అట్లా చేస్తాడా? లొంగితే గౌరవానికి లోపమనుకుంటాడు. మీ రేదో యెదిరించి మాట్లాడారని చర్య జరిగించాడు. ప్రస్తుతం కార్మికోద్యమాన్ని గురించి పనిచేయనని వాగ్దానమిస్తే ఆర్డరు రద్దుచేయిస్తాడట.

రా-నా:- గౌరవహానికోసం చూస్తున్నాడని నేను నమ్మను. కంపెనీప్రభుత్వం మారిపోయినా వర్తకసరళి మారలేదు. బేరానికి దిగాడు. పోనియ్యి గౌరవహానే అనుకుందాం. తనను యెదిరించానను కుంటే క్షమాపణ కోరుతాను. కార్మికోద్యమంలో పనిచేయనని వాగ్దానమెందుకు? అది నిర్ధారణ చేసుకోవడం నా పనిగాని తనదిగాదు. యెదిరించి మాట్లాడానేది వొకసాకు. అయినా వొక

సంగతి చెపుతాను. తమ అభిప్రాయానికి భిన్నంగా చెప్పకూడదని పాలకజాతులకుండే అహంకారం. దానిని గర్హించడం మనవిధి.

నా:- స్వరాజ్యంకోసం పనిచేస్తున్నాంగా. దానితో అన్నీ తేలుతవి. ఇప్పుడు మనం ప్రతిఘటించి చేసే దేమున్నది ?

రా-నా:- అది పొరపాటు. ధర్మమెప్పుడూ అధర్మాన్ని ప్రతిఘటిస్తుండవలసిందే. అధర్మం వొకప్పుడు గెలిచినట్టు కనబడ్డా ఆ గెలుపే ధర్మోద్యమానికి వూపు యిస్తుంది. ధర్మం గెలవక తప్పదు. ధర్మపక్షాన పోరాటమే లేకపోతే యెప్పటికీ జయంలేదు. పురుషప్రయత్నం లేకుండా ధర్మం గెలుస్తుందని నేవూరుకోను. స్వాతంత్ర్యాభిలాష చచ్చి దాస్యం రుచి స్తే జాతికిగాని, వ్యక్తికిగాని యిక మోక్షం లేదు. కానిస యెప్పుడూ తనమోక్షానికై కలహిస్తూ వుండవలసిందే. ఎవడైనా భావదాస్యానికి పరుడైన తర్వాత జాతీయదాస్యం అసహ్యించుకొని జాతీయమోక్షానికి పోరాడగల డని నే నమ్మను. కాబట్టి ప్రతిపాదనా దాస్యానికి పన పడకూడదు. వ్యక్తి మోక్షానికి పోరాడడం జాతీయదాస్యానికై చేసేపోరాటానికి అడ్డం వస్తే స్వార్థత్యాగం చెయ్యవచ్చు. అంతకు తప్ప దాస్యవిమోచనానికై పాటుపడకుండా వుండడం మానవ ధర్మం కాదు. తాత్కాలికాపజయాలు ధర్మవిజయానికి మెట్లే అవుతవి. విఘ్నాలు వస్తవని సత్పురుషు లెవరూ ప్రయత్నాలు మానరు. “యత్నేకృతే యది నసిద్ధ్యతి కోత్ర దోషః”—

ఇంతలో కలెక్టరాఫీసుగుమాస్తా బైసికులు వేసుకొని పరుగెత్తుకుంటూ వచ్చి “పంతులుగారూ! తమతో మాట” న్నాడు.

నా:- యే మంతతొందర ?

గు:- కలెక్టరుగారు తమతో మాట్లాడమనిపంపారు. కాస్త యిటు దయచేయండి.

నా:- ఇక వెళ్ళండి. పగవాంలేదు.

గు:- నాయుడిగారితో కలెక్టరుగారు చెప్పమన్న మాటలు చెప్పవద్దన్నాడు. ఆ ప్రకారం జరపడానికి వీలు లేదట.

నా:- యేమి! ఇంతలోనే యింతమార్పు!

గు:- అదంతా రహస్యం లెండి.

నా:- చెప్పవయ్యా! అన్నీ రహస్యాలే.

గు:- వాళ్ళ వుప్పూ పులుసూ తింటున్నాంగా యింకా.

నా:- యెవళ్ళది? మీకు కలెక్టరుగారు వాళ్ళ దేశాన్నుంచి వుప్పు తెచ్చి మీకు పెట్టుతున్నారా?

గు:- తేవడం లేదనుకోండి. చివరకు వాండ్ల చేతిమీదుగా మాకు వొస్తున్నదిగా.

నా:- అదికూడా తప్పే. జవాను యెంచి నీ చేతిలో పెడుతున్నాడు. కలెక్టరుకు వాడే యిస్తాడు. కాబట్టి వాడు మీకు వుప్పూ పులుసూ పెడుతూవున్నట్టా? ప్రభుత్వంవారు ప్రజల తరఫున ధర్మకర్తలు. వారిస్తున్నా ప్రజలిస్తున్నట్టే. ఇది ధర్మం.

గు:- అధర్మ మేది?

నా:- ధర్మకర్త సొమ్ము నా దనడం. మీ రంతా ప్రజల నవుకర్లం గాము, ధర్మకర్త నవుకర్లమనడం.

గు:- మీకు నేను జవాబు చెప్పలేనండి. సంగతి యిది. నే చెప్పానని యెవరితోను అనవద్దు. ఇప్పుడు కర్నూలునుంచి టెలిగ్రాం వచ్చింది. తక్కెళ్ళ జగ్గడు ఈ మంగళాపురపువాడట. అక్కడి వాళ్లుకూడా కొందరు వాడితో షరీకైనట్టు తెలుస్తున్నదట. అందువల్ల యీ మార్పు.

నా:- సరే వెళ్ళండి. రోగీ పాలే కోరాడు, వైద్యుడూ పాలే చెప్పాడు. నాయుడుగారూ! వింటున్నారా, సరాగం?

రా-నా:- విన్నా. నాకూ చిత్రంగానే వున్నది. మావూరుంబా లేలలో తక్కెళ్ళ వాళ్ళెవరూ లేరు. జగ్గ డని పేరుగల వాడుకూడా వున్నట్టు కనబడదు.

నా:- అది మారు పేరేమో?

రా-నా:- కావచ్చు. ఈ విషయమై విశేషాలు తెలిస్తే నాకు కబురంపండి. మరిచిపోవద్దు.

నా:- అట్లాగే. నే సెలవు పుచ్చుకుంటా.

రా-నా:- చిత్తం.

## ౨౨

### వీర హనుమాన్

జగ్గడిచరిత్ర కొంతవరకు చెప్పి దిగవిడిచాం. కొందరు పనులవల్ల వెంటనే యెత్తుకొన వీలుగలుగనందుకు చదువరులు మన్నింతురుగాక! యింతవరకు బందిపోట్లు అనర్గళంగా సాగుతూనే వున్నవి. నల్లమల కీకారణ్యాలలో తావర మేర్పరచి పర్ణశాలను కట్టి సంతానుల భార్యలనూ, బాక్కసమునూ అక్కడ వుంచాడు. సైనిక సంతానులు అక్కడే నివాసం. ఉత్తరాన పాపి కొండల లోనూ, నెల్లూరిజిల్లాలో రాపూరికొండలలోనూ, వుపనాయకులు కొందరు నిలవరం యేర్పరచుకొని తమచుట్టు ప్రదేశములలో బందిపోట్లు జరిపిస్తున్నారు. ప్రతిజిల్లాలోనూడా జిల్లానాయకులుండి వ్యవహారాలు నడిపిస్తారు. సంతానులను నాయకులుగా నియమించక పూర్వం వొకమాసం రోజులు నల్లమలఅడవులలోవున్న సంతానపురంలో జగ్గడివల్ల ధర్మశిక్షను గ్రహించవలసి వుంటారు. జగ్గడి యోచనాబలం, నిర్మాణశక్తి, కార్యదక్షతా, ప్రజానురాగం అతని వుద్యమానికి తోడ్పై మద్రాసు, హైద్రాబాదు, మైసూరు రాజ్యములలోని ఇన్వెస్టిగేషన్ శాఖవారి తెలివితేటలను బేలుపుచ్చి నిరాఘాటంగా బందిపోట్లను సాగిస్తున్నవి. దేహంలో ప్రాణం యిక్కడ వున్నది, యిక్కడలేదని నిర్ణయించడానికి వీలులేని పెరాస్తరుగా జగ్గడు యెక్కడవున్నా అంతటా అతడున్నట్లే పనిజరగడంచేత అతని స్థిరనివాసం యేదో నిర్ణయించడానికి పూడు సంఘాలలోనూ సాధ్యంకాలేదు. ఈ నాడు హిందూస్థానంలో సుప

సిద్ధ అన్వేషకశాఖాధికారి దివాన్‌బహదూర్ రామసింగు జి. సి. ఐ. యి. గారిని మూడు ప్రభుత్వాలవారూ అధిపతిగా నియమించి కర్నూలు సూపరింటెంటును సహాయంగా ఇచ్చారు. రామసింగు శాంతియాభిల్లును పట్టినవాళ్ళలో మొనగాడు. చంద్రయ్య పితూరీలో పనిచేయవలసిందని మద్రాసు ప్రభుత్వంవారు కోరితే తాను రానవసరం లేదని కొన్ని ఉపాయాలు సూచిస్తే వాటి ననుసరించి సుప్రసిద్ధుడైన ఒక ఆంగ్లగూఢచారి అతని గుంపును పట్టుకొన్నాడు. రామసింగు పత్రికలలో జగ్గడి చిత్రవిచిత్రచర్యలు చదివాడు. మద్రాసు ప్రభుత్వంవా రతనిసలహా కోరారు. జగ్గడిబుద్ధి తన కందలే దనీ స్వయంగా సంచారంచేసి స్థల విమర్శనచేయందీ సలహా చెప్పలే నసీ తన్ను నియమిస్తే సంతోషంగా పనిచేస్తాననీ తెలియపరచాడు. ఇండియా ప్రభుత్వంవారు ఆయనను సర్వాధికారంతో నియమించారు. కర్నూలుజిల్లా సూపరింటెండెంటు స్పెన్సరుగారు బ్రహ్మంపురంలో వచ్చి కలుసుకున్నారు.

స్పె:- సింగ్జీ! సలాం.

రామ:- సలాం, మిష్టర్ స్పెన్సర్!

స్పె:- ఇక మనం చేయవలసినపనేమి?

రామ:- జగ్గడికి నివాస మేదని మీ రనుకుంటారు?

స్పె:- పాపికొండలలో నివాస మేర్పరచుకొని వాడు విశేషంగా రైలు ప్రయాణం చేస్తుంటా డని నమ్మకం.

రామ:- యెవరికన్నా కనబడ్డాడా?

స్పె:- లేదు.

రామ:- ఈ రెండుసిద్ధాంతాలూ సరియైనవి కావు. బందిపోటునాయకులు సాధారణంగా ప్రయాణంచెయ్యరు. ప్రధాన స్థానంలో వుండి యావత్తుచర్యా నడుపుతుంటారు. ఇంతసమర్థుడైన నాయకుడికి తగినసహాయకారు లుండుండాలె. పాపికొండలలో సహాయకుడుమాత్రమే వుంటాడు. రెండవది యీ కొండ

మూలగా వున్నది. అన్ని భాగాలకూ అందికలో లేదు. అయినా వైఖరిచూచి చెపుతాను.

స్పె:- కొండ వందమైళ్ళపొడుగున వ్యాపించివుంది.

రాము:- నాకు ఆంధ్రదేశములోనికొండ లన్నిటిప్లానూవేసి చూపండి. తర్వాత అవసరమైనభాగాలు చూతాం.

స్పె:- ఇది మోస్తరు.

రామ:- పాపికొండలలో యీభాగంలో అడవు లేమాత్ర ముంటవి? అక్కడ వైశాల్య మే మాత్రం?

స్పె:- ఈ కొండలలో వెడల్పు విశేష ముండదు.

రామ:- అయితే ఈకొండలలో వుండడు.

స్పె:- ఇవి రావూరికొండలు.

రామ:- అక్కడ లేడు. నల్లమల అడవుల వైఖరి యెట్లా వుంది?

స్పె:- కొండల చుట్టూ పెద్ద కీకారణ్యం వుంటుంది.

రామ:- ఈ భాగంలో కొండ లెన్ని వరుస లున్నవి?

స్పె:- నాలుగైదు వరుస లున్నవి. అడ్డంగాకూడా కొన్ని కొండ లున్నవి.

రామ:- నీటివసతుందా?

స్పె:- దొనలూ, చెరువులూ కావలసినన్ని వున్నవి.

రామ:- ఇంకా యే జిల్లాలో పెద్దకొండ లున్నవి?

స్పె:- కడపలోవి షుమారైనవి.

రామ:- అక్కడ లేడు. బ్రిటీషు రాజ్యంలో వుంటే నల్లమలలో వుంటాడు. ఈ భాగంలో వుండాలె. దానిని ముట్టడింతాం. మన తాబేదారు లెవరికీ యీ సంగతులు తెలియగూడదు. ఇంకొక సంగతి. వాండ్ల ఆడవాండ్లజాడ లేవైనా కనబడ్డవా? ఇండ్లకు వస్తూపోతూ వుంటారా?

స్పె:- భోగం వాండ్లిండ్లకు రారు. ఉంపుడుకత్తె లెవరికీ లేరు. సొంత యిండ్లకు వస్తుండవచ్చు. అదైనా తక్కువే.

రామ:- వాండ్ల భార్యలు తప్పకుండా నల్లమల అడవులలో వుంటారు. మనకు పదివేల సైన్యం కావాలె. నాలుగు భాగాలు చేసి కమ్ముకొని రావాలె నేను యిటుపోయే భాగంతో వుంటాను. మద్రాసుకు టెలిగ్రాం పంపించండి. అయిదు రోజులలో యావత్తు సైన్యమూ రావాలె. తరువాత వొక వారంలో యావత్తూ ముగించాలె. నల్లమలలో లేకపోతే నైజాంలో వున్నట్టే లెక్క.

స్పె:- అతడు వొకవేళ తప్పించుకొన్నా ఆడవాళ్ళు చిక్కితే మనం గెల్చినట్టే. అయితే వాండ్లను అతి జాగ్రత్తతో కాపాడుతుంటాడు. ఆడవాండ్లు చిక్కడం కష్టం.

రామ:- అయితే నా భాగంలో మూడువేల సైన్యం వుంచండి.

స్పెన్సరుగారు వెంటనే మదరాసుకు టెలిగ్రాం యిచ్చారు. గవర్నరుగారు మైసూరుకూ, హైదరాబాదుకూ తంతి పంపారు. మదరాసునుండి ఆరువేల సైన్యం, హైదరాబాదు మైసూరునుండి చెరివేయి సైన్యం బయలుదేరి కర్నూలులో దిగింది. జగ్గడికి ప్రభుత్వంవారి సైన్యముల నడకలన్నీ తెలిసినవి. చుట్టు ప్రక్కల నున్న సైనిక సంతానుల నందరినీ మూడు రోజులలో చేర్చారు. అవసరంవుంటే సంపాదక సంతాను లందరూ పోరాడుటకు రావలసి వుంటుందని జిల్లా నాయకులకు వుత్తరాలు వ్రాశాడు. యుద్ధ ప్రకారం నిశ్చయించడానికి సైన్యాధిపతుల సభ చేసి సమూహ యుద్ధం పనికిరాదనీ, కేవల దొమ్మియుద్ధం చేతనే అడవులలో శత్రు నాశనం చేయవలెననీ నిశ్చయపరుచుకొని ప్రతి శత్రు సైన్యము అంబుదువందల సైన్యంగల సంతాన పటాలా లమిర్చి శత్రువులతో యెక్కడా యెదిర్చి పోట్లాడకుండా చుట్టు ప్రక్కల కమ్ముకొని వస్తూ మధ్య మధ్య ముచ్చిలిగొని ధనప్రాణముల

గొంటూ దీర్ఘకాలం యుద్ధం జరుపుతూ వున్నాడు. సంతానులిదివర కెన్నడూ యుద్ధాలు చేసినవాళ్లు కారు. జగ్గడు వట్టి మూకలను నెలరోజులలో కూటయుద్ధ విశారదులుగా తయారు చేయ గలిగాడు. యుద్ధంలో జగ్గడి పక్షంవాళ్ళెవ్వరూ పారిపోలేదు. ఒక్కడూ అధర్మయుద్ధం చెయ్యేడు. కష్టంలో వున్న శత్రువు తమ చేతుల్లో చిక్కినప్పుడు ఔదార్యంతో పంపివేసేవాండ్లు. నాయకులకూ, సంతానులకూ అత్యంతమైన అన్యోన్యం. కొందరు యుద్ధంలో పడిపోతున్నారు. మిత్రులు కొలది శత్రువుల వెంటనంటి వేధిస్తున్నారు. జగ్గడు మెరికెలవంటి అయిదువందల సంతానులను యేరి మారుదారిన బొక్కసమును, స్త్రీలను దాటవేయడానికి దారి దీశాడు. రామసింగు తన మూడువేల సేనలోను, పదిహేను వందల మందిని సంతానులతో పోట్లాడడానికి వదిలి వాండ్లకు తెలియకుండా తక్కిన పదిహేను వందలూ చీలదీసి జగ్గడి వెంటనంటి కూటయుద్ధం ప్రారంభించాడు. స్త్రీలనూ, బొక్కసమునూ కాపాడవలసిన భారం జగ్గడిమీద పడ్డది. ఒక కోటి రూపాయలను వొకచోట పాతివేసి వట్టి పెట్టెలను మాత్రం మోసుకొని పోతూ వుండవలసిందనీ తమ ప్రాణాలున్నంతవరకు స్త్రీలను కాపాడవలసిందనీ వుత్తర్వు చేశాడు. స్త్రీలూ, సైన్యమూ కాకులు దూరని కారడవిలో ప్రవేశించారు. రామసింగు ప్రాణానికి తెగించి వెంటబడి తుపాకులతో అగ్నివర్షం కురిపిస్తున్నాడు. స్త్రీలు రాత్రింబవళ్లు మూడు రోజులు తియ్యకుండా నడిచారు. ఒకచోట నిలిచి వంట చేసుకోవడానికి అవకాశంలేక పస్తులున్నారు. పిల్లలు బొత్తిగా వేలబడి పోయినారు. సాధ్యమైన చోట కొద్దిగా వండి పిల్లలను మాత్రం బతికించుకుంటూ నడుస్తున్నారు. రామసింగు సైన్యానికి ప్రతిరోజూ పక్కవూళ్ళనుంచి సప్లయిలు వస్తున్నవి. ఒకరోజు జగ్గడి సైన్యం శత్రువుల భోజనాన్ని దొమ్మిచేసి పట్టుకో గల్గింది. శత్రువులు వొకపూట భోజనంలేక వెనుకంజవేసిన సమయంలో జగ్గడు రెండు రోజులు తగిన భోజన పదార్థం వండించుకొని ప్రయాణం సాగించాడు.

జగ్గడి సైన్యానికి మందుగుండు సామగ్రి తక్కువైంది. అది కని పెట్టి రామసింగు సమీపించి కాల్చడం ప్రారంభించాడు. కొందరు స్త్రీలూ, పిల్లలూ గుండ్లదెబ్బలు తగిలి మరణించారు. ఇక యుద్ధం యెక్కువకాలం జరిగిస్తే స్త్రీలను రక్షించడం అసాధ్య మని తోచింది. తన నాయకులను సలహా అడిగాడు. వారు స్త్రీలను వదిలివేసి మనం తప్పించుకొనిపోతే స్త్రీల కేమీ అపాయం జరగ దనీ, యెక్కువ సైన్యాన్ని జేర్చుకొని మళ్ళీ యుద్ధం ప్రారం భించవచ్చుననీ సలహా యిచ్చారు.

జ:- స్త్రీలను అవమానించి బాధించరని మీ కేమిధైర్యం?

నాయకులు:- సాధారణంగా ఆడవాండ్లను బాధించరనే అనుకుంటాం. మరీ నీచులు ఆ పనికి దిగవలెగాని వాండ్లలోనైనా గౌరవంగలవాండ్లు చేయరు.

జ:- అవమానం జరిగేకాడికి యెవరివల్లనైతేనేమి? ఆడ వాండ్లను రక్షింపజాలక పోతిమనే అగౌరవం మనకు తప్పదు. ప్రస్తుతం మనం తప్పించుకొని పోయినా ఆడవాండ్లను చేతికి చిక్కించుకొని మనం లోబడకపోతే వాండ్లను బాధిస్తామంటారు. అప్పుడైనా లోబడక తప్పదు. అప్పటికి మనకు మిగిలేది అగౌ రవం వొక్కటే.

నాయకులు:- మీరు చెప్పేది వాస్తవమే. మీ సలహే చాయగా వుంది. పోట్లాడడమే ప్రధానం. అవసరమైతే మాలో వొకడికి నీపేరు పెడతాం. నీవుమాత్రం బయట వుంటే వ్యవహా రం కొనసాగించగలవు. అది మాలో వొక్కళ్ళవల్లా అయ్యే పని కాదు.

ఆడవాండ్ల మానరక్షణసందర్భం లేకపోయినట్టయితే నే నాపని చేసివుండేవాడినే. స్త్రీలను శత్రువులచేతులలో వదిలి నా ప్రాణం రక్షించుకుండేదా? ఎంత హైన్యపు బతుకు! జగ్గడెప్పుడూ అటువంటి నీచకార్యం చెయ్యలేదు.

నాయకులు:- సరే మా కొకటి తోస్తున్నది. మనదగ్గిర మందుగుండుసామాను తగ్గింది. చేతులలో సన్నీలు, బాకులు మటుకున్నవి. సంకులయుద్ధమే మనకు శరణ్యం. మన స్త్రీల నెట్లాగూ మనము రక్షించలేము. మనం తప్పించుకొని జీవించి వుంటే, వాండ్లకు బాధ యెక్కువ. శత్రువు లిప్పుడు మనకు షుమారు అరమైలు దూరమున వున్నారు. ఇంత సమీపంలో మనము వున్నామని వాండ్లకు గమనం దగిలినట్లు కనబడదు. తెలిస్తే ఫిరంగులు ప్రారంభించేవాండ్లే. ఆడవాండ్లూ మనమూ మాడిపోయి వుందుము. వాండ్లు గాలిస్తున్నారు. ఆడవాండ్లను యిక్కడ వదిలి వాండ్లకు యెదురునడిచి మెల్లగా వాండ్లను సమీపించి మీదబడదాం. వాండ్లకు తుపాకులు నిరుపయోగమవుతవి. జగ్గడి సైనికుల చేతిబలం చూపి అధమం కాయకు రెండుకాయలైనా బలిదీసుకొని పడిపోదాం. మనము పడిపోయినతర్వాత శత్రువులు స్త్రీలదగ్గిర సొమ్ముంటే తీసుకొని వదిలిపెట్టిపోతారు. మనము పడిపోయినతర్వాత వాండ్లకు క్రౌర్యముండదు. ఉద్యోగస్థులుకూడా గౌరవం సంపాదించుకోవలెనని చక్కగా ప్రవర్తిస్తారు. మన స్త్రీలగౌరవం, మన గౌరవంకూడా కాపాడినవాండ్లమవుతాం. మనము జీవించివుండగా మన స్త్రీలు శత్రువులచేతులలో పడకుండా చేసినవాండ్లం అవుతాం. జగ్గడిసైనికు లని అనిపించుకోవలెనని మాకు కోర్కె వున్నది

జ:- సరే. ఆడవాండ్లతో చెప్పి వాండ్లను నిలిపి బయలు దేరి రాండి. ఇంతలో కత్తులు నూరుకుంటాను. మానధనులవలె చావడానికి బయలుదేరుదాం. ఆలస్యం చేయవద్దు.

అయిదునిమిషములలో సంతాను లంతా బయలుదేరి వచ్చారు. శత్రువులకు యాభైగజాల దూరంలోకి వచ్చేవరకూ వాండ్లు గ్రహించలేదు "వీరహనుమాన్" అని జగ్గడు సింహనాదం చేశాడు.

జ:- తమ్ములూ! నా దొక్క కోరిక.

సం:- యే మది ?

జ:- సింహాన్ని నాకు వదలండి.

సం:- సరే.

అంతా వొక్కుమ్మడిన మూకారు. సమీపంలో అయిదు వందల సైన్యం వున్నదని రామసింగు సైనికులు తలంచలేదు. తుపాకులు నిరుపయోగమైనవి. పేష్కబ్జులు తీసుకొని సన్నద్ధులయ్యే వరకు ముందుసిలిచినవాండ్లు రెండుమూడువరుసలు పడిపోయినారు. రామసింగుసైనికులు యుద్ధములలో ఆరితేరిన వాండ్లయినా జగ్గడి సైనికుల వుత్సాహం, నిస్పృహత్వం, స్త్రీలమానధనం రక్షించవలెననే కాంక్షా ముందర నిలువలేకపోయినారు. జగ్గడెవడో శత్రువులకు తెలియదు. సాధారణసైనికునకంటే మెరుగైనదుస్తులు లేవు. అందరూ సంతానులే. స్పెన్సరు సైన్యముఖానికి రాక, పక్కగా వుండి యుద్ధం చేయిస్తూ జగ్గడికత్తికి బలి అయినాడు. రామసింగు వెనుకడుగు వేస్తున్న సైనికులను పురికొల్పుకుంటూ చెదరిన సైన్యాన్ని అర్ధచంద్రవ్యూహంగా అమర్చి సంతానుల చిన్న సైన్యాన్ని కమ్మి పట్టుకోవలెనని తిప్పుకొని వస్తున్నాడు. జగ్గణ్ణి ప్రాణంతో పట్టుకోవలెనని అతనికోరిక. వెనుకనుంచి సైన్యాలను నడుపుతుంటాడని అతనితలంపు. అర్ధచంద్రవ్యూహానికి నడుమ రామసింగుండి రక్షిస్తున్నాడు. జగ్గడు వెనుక లేడు. అతనిసైన్యం మట్టసంగా వొక్కచోటవున్నది. జగ్గడు రామసింగువైపు నడుస్తూ క్రోల్పులివలె వొక్కదాటున పట్టవలెనని చూస్తున్నాడు. రామసింగు అర్ధచంద్రవ్యూహం అతిపొడుగై సన్నగిలింది. జగ్గడది కనిపెట్టాడు. "వీరహనుమాన్" అని కేక వినబడ్డది. "వీర్! వీర్!" అని కేకలువేస్తూ పెనువీకతో దాకి అయిదుచోట్ల చంద్రరేఖ తెంపారు. బ్రిటిషు సైన్యం చికాకు పడ్డది. పీనుగులు కుప్పతిప్పలైనవి. రామసింగుకూ, జగ్గడికీ చేతులు కలిసినవి. రామసింగు సాములో మేటి. జగ్గడు మేటి పోటరి, దేహబలం మత్యంతం. మనిషి చువ్వవలె వంగి వేట్లు తప్పించుకో గలడు. శరీరలాఘవం

గలిగి చిరుతపులివలె దూకుతాడు. సింగుకు నడివయస్సు మిగిలింది. ఎంత కసరత్తు చేస్తున్నా భోగముల కలవాటు పడ్డాడు. చాలాసేపు దమ్ము పట్టలేడు సింగు తన ప్రత్యర్థి జగ్గడని గ్రహించాడు. ఆనందపడ్డాడు. కొంతసేపు సరిసమానంగా పోరి ఛడీలో నైపుణ్యాలు చూపించారు అనేకమార్లు తోడి చేశారు. కొంతసేపటికి సింగుకు అలుపు వచ్చింది. జగ్గడు కవ్వించడం, సింగు కాచుకోవడంలోకి మారింది. సింగు ఆజానుబాహువు. కాలి చలనం యొక్క లోపాన్ని పొడుగు చేతులు తీర్చినవి. చుట్టూ వున్న వుభయ సైనికులూ విచిత్రం చూస్తూ నిలవబడ్డారు. సింగు, తానోడిపోవడం నిశ్చయమనుకున్నాడు. ప్రాణంతో పట్టే ఆశ వదులుకున్నాడు. ఇతరులు తోడు రమ్మనడానికి తన క్షాత్రానికి నామోషిగా తోచింది. పారతంత్ర్యములో సగం చచ్చినా క్షాత్రం అడ్డం వచ్చింది. చేతికొద్దీ తల్వారు విసిరాడు. అది కనిపెట్టి జగ్గడు చప్పున పక్కకు దాటినా కంఠందప్పి కుడిచెయ్యి గూడా తెగి నేలబడ్డా పడ్డ చేతివేళ్లు కత్తి కోసం తడివినవి—జగ్గడు ఎడమ చేతితో చేతికొద్దీ మెడ కుటికి పట్టివేశాడు. రామసింగు కంఠం తెగి తల నేలకు దొర్లింది. వెంటనే తల దీసుకొని చంకలో యిరికించుకొని సింహనాదం చేశాడు. రామసింగు అనుచరులు సింగు తల తీయడంతోటే——తల దీసినట్లై తల తీసుకొని పోకుండా చెయ్యవలెనని వొక్కుమ్మడిన ముట్టడించారు. జగ్గడు యెడమచేతితో కత్తి తిప్పుతూ సవ్యసాచివలె శత్రువులను కోసి పోదెలు పెడుతూ గుంపులోనుంచి వెగిలి బయటబడి బ్రిటిషు జండావంక పరుగెత్తాడు. ఆంగ్ల సైనికులు వెంటబడ్డారు. సంతానులు వెనుదగిలి శత్రువులను నరికి చొప్పకట్టలవలె నేల పరవంజుతున్నారు అడుగుపెట్ట సందు లేకపోయింది. జగ్గడి వొంటిచేతి పెట్టుకు బ్రిటిషు సిడము తెగి నేలపడ్డది. సింగు తల దక్కించుకోవడం అసాధ్యం అని తోచింది. చేతికొద్దీ సంతానుల వైపుకు విసిరివేసి "ఎత్తుకొనిపో" అని కేక వేశాడు. ఒక యావన సంతానుడు పైది పైనే పట్టుకొని యెవరికీ అందకుండా పరుగెత్తాడు. "జండా దక్కించుకో"

అని మళ్ళీ కేక వినబడ్డది. ఒక సంతానుడు తమ హనుమద్ధ్వజ మెత్తుకొని తోలిగాడు. బ్రిటిషు సైనికులు కపిధ్వజం కోసం పరుగెత్తారు. "వీరహనుమాన్" అనే నాదం అడవులలో ప్రతిధ్వనించింది. ప్రాణాలకు తెగించి సంతానులు వొక్క పెట్టున దగిలి జండాకోసం పరుగెత్తే గుంపును మరలించారు. ఆంగ్ల సేనాని తన సైనికుల సంఖ్యను జూచుకొని పోటుకు పురిగొల్పాడు. జగ్గడు వొంటిచేతి పోటుతో సేనాని వక్షం పెకల్చాడు. వెనుకవున్న వొక ఆంగ్లేయ కెప్టెను కత్తితో జగ్గడి కాలు నరికాడు. కాలు దెగి నేలబడీ తన కంఠం నరుకనుంకించి సమీపించిన కెప్టెనును జగ్గడు పడగొట్టాడు. జగ్గడు పడడంతోనే సంతానులకు వెఱ్ఱెత్తింది. పతివాడూ నాయకుడి మోస్తరుగా "వీరహనుమాన్" అని కేకలు వేశాడు. భటులవలె "వీర్ ! వీర్ !" అని అంటూ శత్రు సైన్యంలో జొరబడ్డారు. కత్తులు వొండొంటిందాకిన ఖణఖణ ధ్వనులు హెచ్చు పెరిగినవి. మిణుగురులు సైన్యములను ముట్టడించినట్లు ఒరిపిడికి నిప్పురవ్వ లెగురుతున్నవి. సంతానులసంఖ్య తీసిపోతున్నది. కాని శౌర్యంతీసిపోలేదు. వారి సంఖ్య నూరై పదై వొకటై సంపూర్ణమయింది. హతశేషులే లేరు. జగ్గడూ, మరివొక సంతానుడూ మాత్రం బలమైన గాయాలతో బ్రతికి వున్నారు. ఇద్దరినీ పట్టుకున్నారు. సంతానుడు శత్రువుల స్వాధీనం గావడానికి యిష్టంలేక దగ్గర పడివున్నతనకత్తితో ఆత్మహత్య చేసుకొన్నాడు. జగ్గడు దూరంలోబడివున్న తన కత్తి కోసం నడుములు విరిగిపడ్డ నల్లతాచు వలె పాకుతున్నాడు. మేజరు అది కనిపెట్టి పట్టుకొని చెయి కట్టి వేయించారు. రెండువందల ఆంగ్లసైన్యం మాత్రం మిగిలింది. మేజరు ముందు ఆడవాండ్లను స్వాధీనం చేసికొని తరువాత సంతానుల నివాసం స్వాధీనపరుచుకోవలె నన్నాడు. వాసస్థానంలో యింకా సైన్యముంటుందేమో నని సందేహించి జగ్గడు దొరికాడని సమీపసైన్యాలకు తెలియపరిచారు. తక్కిన అయిదు భాగముల సైన్యంలో మూటిని కూటంయుద్ధంలో సంతానులు పూరిగా నశింపచేశారు. సంతానుల గుంఫులలో వొకటి కొండ

లోయలో జిక్కి విధిలేక సమూహ యుద్ధంలో దిగి రెట్టింపు శత్రుసైన్యమును హతంచేసి పూర్తిగా నశించింది. అయిదవ దానికి శత్రుసైన్యంతో తాకిడి కలుగనేలేదు. ఆంగ్లనాయకుడు అడవిలో దూరడానికి సాధ్యంగాక తనసైన్యాన్ని వెనుకకు మరల్చుకొని చివరకు జగ్గడితో బోరిన హతశేషులతో కలుసుకున్నాడు. సంతానుల గుంపులలో ఒకదానిగతి రెండవ దానికి తెలియలేదు. ఒకటి తన బాటకు వేసిన ఆంగ్లసైన్యాన్ని ధ్వంసంచేసి జగ్గడిగుంపుతో కలపవలె నని వెదుకుతూవచ్చి స్త్రీల సమూహమును జూచి జగ్గడిగుంపుయొక్క పరియవసానం విని అతనిని విడిపించుకొని రావలెనని ప్రయత్నించింది కాని అంతకు కిందటిసాయంత్రమే రెండువందల బ్రిటిషుసైనికులు జగ్గడిని అడవిలో నుంచి తొలగదీసుకొనిపోయి కర్నూలుజైలుకు పంపినట్లు తెలిసింది.

అంతట సంతానులు యోచించుకొని స్త్రీలను సురక్షితంగా అడవిబయటికి చేర్చి తమ పోలతులవెంబడి సమీప గ్రామాలకు పంపివేశారు. హతశేషుల నందరిని పోగుచేస్తే యుద్ధం చేయగల వాండ్లు అయిదువందలు మిగిలారు. విచారిస్తే జగ్గణ్ని కర్నూలు జైలులోవుంచి రిజర్వుపోలీసులు కాపలా చేస్తున్నారని కొందరూ, నంద్యాల సబుజైలులోవుంచి రెండువందల సైన్యంతో కాపాడుతున్నారని కొందరూ జాడలు చెప్పారు. సంతానులు రెండు గుంపులై వొకటి కర్నూలుజైలునూ, రెండవది నంద్యాల జైలునూ ముట్టడించడానికి పొద్దుకూకంగనే బయలుదేరి మూడు జాములపొద్దు పోయేవరకు కర్నూలు, నంద్యాల చేరి జైళ్ళుముట్టడించి తాళాలు బద్దలుచేసి ఖైదీలను విడిపించారు. జగ్గడుమాత్రం లేడు. విచారిస్తే మధ్యాహ్నపు రైలుమీద గుంటూరు విచారణ కోసం తీసుకొనిపోయినట్లు ఖైదీలవల్ల తెలిసింది. నంద్యాలకు పోయిన గుంపును యెవరూ యెదిరించలేదు గాని కర్నూలుగుంపు మీదికి రిజర్వుపోలీసులు వచ్చారు. పోలీసులతో యుద్ధంచేసి చావ

సం కంటే జగ్గడిని విడిపించడం వుత్తమమని పోలీసులతో పోరుకు ముగ్గకుండానే పరుగెత్తిపోయి సంతానులందరూ జగ్గడిని విడిపించడానికి గుంటూరు పోవలసివుంటుంది గనుక కొండవీటికొండలకు చేరవలసిం దని అక్కడ పటాలంగా యేర్పరచి గుంటూరు పంపుతామనీ తెలియపరచారు. అందరూ చెదిరి గుంటూరుకు బయలుదేరారు. బొక్కసం యావత్తూ మూటలుగట్టి చాలాభాగం సంతానులద్వారా కొండవీటికొండలలోవున్న జిల్లానాయకుడికి పంపబడ్డది. యావత్తుధనం పైసాలు వారలేకుండా గుంటూరు చేరింది.

## ౨౩

### రవర

నారాయణరావుదగ్గర గుమాస్తాగావున్న వెంకట్రావు, అతడు ప్లీడరుపని ఆపివేసిన తరువాత కర్నూలు సబుమేజస్ట్రేటు కోర్టులో కాపీస్టుగా వున్నాడు. జగ్గణ్ణి ధడబడలుగా జైలుకు తీసుకొని వచ్చినతరువాత వెంకట్రావు అతనిని చూచి యితడు జగ్గడు కాడనీ, మంగళాపురం కాపురస్థుడు వెంకటదాసు అనే మాలవాడు అనీ మేజస్ట్రేటుగారితో చెప్పాడు. కలక్టరుగారికి వెంటనే సదరు సంగతి రిపోర్టయి ఆయనవచ్చి గుమాస్తాను విచారించి జగ్గడిని "మంగళాపురం కాపురస్థుడవు కావా ?" అని అడిగాడు.

జగ్గడు వాస్తవం చెప్పితే యిదివరకే చిక్కులలోవున్న తల్లిదండ్రులకు తనవల్ల చింతాకంత వుపకారం లేకపోగా కష్టాలెక్కువవుతవేమో నని కొంచెంసేపు అజ్ఞాయించాడు. తనను బాగా యెరిగిన గుమాస్తా చెప్పినతరువాత యితరులను తీసుకొని వచ్చి గుర్తింపుచేయిస్తారు. ఎట్లయినా యిక దాగేదికాదని స్థిరపరచుకున్నాడు.

జగ్గడు:- నేను తక్కెళ్ళ జగ్గడిని. యెందుకు మీ రనుమానించడం ?

కలక్టరు:- తక్కెళ్ళ జగ్గడనే బందిపోటుదొంగ యిప్పటికి పదియేండ్లకిందటనే హైదరాబాదు జైలులో చనిపోయినట్లు మాకు నిశ్చయమైన సంగతి తెలిసింది. ఇంకా నీవు దాచడ మెందుకు?

జగ్గడు:- నేను జగ్గడిని కానిమాట వాస్తవం. ఫలానా అని తెలియకుండా మీరు కేసు తీర్మానించుకోలేరా?

క:- సాధ్యమైనంతవరకు ప్రయత్నంచేసి గుర్తింపుసాక్ష్యం దొరక్కపోతే పేరులేకుండానే వ్యవహారం జరిగిస్తాం. అయినా నీవు పేరు దాచుకోవలసిన అవసరం కనబడదు. ధర్మబద్ధమైన చోరుడవు. వాక్యరహస్యం. నీ అభిప్రాయాలతో నేను చాలావరకు యేకీభవిస్తా. నీవు యేదో వాకమార్గాన యీ జైలులోనుంచి తప్పించుకొని పోయేమార్గం చేయగలను. కాని నీవు వెళ్ళడం దుర్లభం. కాలూ చేయీ పూర్తిగా బోయినవి. చికిత్స బాగా చేయవలసిం దని డాక్టరుగారితో చెప్పాను. కాలు కోసి వెయ్య వలసివస్తుం దంటాడు. కోస్తే అసలే జీవించవేమో నని ఆయనకు అనుమానం కూడాను. ఇట్టి సందర్భాలలో నీవు తప్పించుకొని పోయీ ప్రయోజనం లేదు. కరిచీ కాటుపడకుండా పోతుంది. నీవు యథాప్రకారం నీ వుద్యమం సాగించుకోవడానికి అవకాశ మన్నా వుంటే అనుకోవచ్చు. అదిగాక సరియైన వైద్యాలూ దొరకరు. నిడదవోలులో జిల్లాసర్జను లేకపోయినా సూపరెంటెం డెంటే మంచి డాక్టరు. కృష్ణాజిల్లా సర్జనుకూడా అప్పుడప్పుడు వచ్చి చూస్తూవుంటాడు. ఆయన నాకు స్నేహితుడు. గొప్ప శోధకుడుగూడాను. జైలు సూపరెంటెండెంటుతో మాట్లాడి అవసరమైతే వారిద్దరూ కలిసి శస్త్రం చెయ్య మని చెప్పుతాను. నన్ను మీ తాలూకు బందిపోటు కేసులన్నీ విచారించడానికి గుంటూరు పంపుతున్నారు. రేపే నా ప్రయాణం. నీ కేసే మొదట విచారణకు వస్తుంది. వెంటనే శిక్ష వేయవలసిం దని గవర్నరు గారి దగ్గరనుంచి రహస్యపు వుత్తరువులు వచ్చినవి.

జగ్గడు:- నా కేసు మీ రేమిచేస్తారు?

కలక్టరు:- నీ కేది వుత్తమ మని నాకు తోస్తుందో అది చేస్తాను. నీ యభిప్రాయ మేమి?

వెంకటదాసు:- నా కేది వుత్తమమో నాకు తెలియదు. ఆ సంగతి మీ కే వదలిపెడతాను. ఇదివరకు సైనికునివలె విచారించవలసిం దని కోరదలచాగాని యిప్పుడు మానుకుంటాను. సాధారణపు సంతానుని మోస్తరుగా నన్ను విచారించడమే నా కిష్టం. మీరు నన్ను వదిలిపెడతా రనే ఆశతో గాదు. ధర్మం పాలిస్తా రని నానమ్మకం. అంతే నాకు చాలు.

క:- నీవు ధర్మాత్ముడ వైనచోరుడవు. మహావీరుడ వనిపించుకున్నావు. పదివేలసైన్యాన్ని నుగ్గునూచం చేశావు. నీ సిద్ధాంతా లంగీకరించకపోయినా పత్రికలన్నీ నీకీర్తిని ఘోషిస్తున్నవి. నీ విచిత్రయుద్ధ మంతా పత్రికలలో వ్రాస్తున్నారు. ఇంకా నీకు కావలసిన దేమున్నది?

వెం:- చావంటే భయం లేదుగాని వురెంటే నా కసహ్యం. అందుకనే సైనికునివలె విచారించి కాల్చమని కోరుదామనుకున్నా.

క:- జ్ఞాపక ముంచుకుంటాను. ఈపూట నిన్ను గుంటూరుకు పంపిస్తున్నాను. ఒక డాక్టరు నీతో గుంటూరుదాకా వస్తాడు. నీకు బాధగా వున్నదా?

వెం:- నా కేబాధా కనబడడంలేదు.

క:- భోజనం వసతిగా జరుగుతున్నదా?

వెం:- డాక్టరు పెట్టించే భోజనం అనుకూలంగానే వుంది. ఇంకొక్కసంగతి. నాకు జీవితాశ లేదు. కాలూ, చెయ్యీగూడా పోయినతరువాత యీ కునిష్టి బతుకు నా కెందుకు?

క:- బలవన్మరణం చేసుకోవద్దు. నీవాఙ్మూలములో నీ ధర్మం నీవు చక్కగా వెల్లడించు.

వెం:- చిత్తం. అప్పటికి నాకు మనోదారుఢ్యం వుంటుందో వుండదో? త్వరగా విచారణ పూర్తి అయితే బాగుండు. నాకు

వాక్కటే ఆశ వున్నది. నేను చనిపోయేలోగా నాతలిదండ్రులను చూడవలె నని వున్నది. అది లభించేలాగు చూడండి.

క:- దాని కేమి. వారిని ఆవూరిలోనే వుంచినట్లు పత్రికలో వేశారు. వారు నీ కుపచారం చేస్తూవుండేటట్టు సూపరెంటెండెంటు ద్వారా యేర్పాటుచేయిస్తాను. ఇక నే వెళ్లుతా - ఒక గంటలో నీకు ప్రయాణం. డాక్టరుగారు ప్రయాణమై వచ్చిన ట్లున్నది.

వెం:- చిత్తం. మీరు నాయందు చూపినదయకు మీకు నమస్కారం.

క:- దయ యే మున్నదీ? నేను మీ సంతానులలో చేర దగినవాడ నని చెప్పడానికి వచ్చా. నమస్కారం.

వెం:- పెద్దలకు నమస్కారం.

క:- నీపేరు వెంకటదాసేనా?

వెం:- అవును. దాపరిక మెందుకు? సిగ్గుపడ నవసరం లే దనుకుంటాను.

క:- గర్వపడదగిన దనుకుంటాను.

వెం:- కావచ్చును. సిద్ధాంత మందరూ అంగీకరిస్తారు. సాధనల విషయంలోమాత్రం అభిప్రాయభేద మున్నది. నూతన ధర్మం జనామోదం బడసినతరువాత సర్వమార్గాలే అవలం బించవచ్చు.

క:- అ దెప్పటికో! మనజీవితంలో ఆచరణలోకి వస్తుం దని తోచదు.

వెం:- ఇప్పటి దుస్సిద్ధాంతాలు మనకు దాపరించి యెన్ని వేలయేం డ్లయిందో. ఇవి మారడానికి కొన్ని తరాలుపట్టినా ప్రపంచచరిత్రలో అవి దీర్ఘకాలం గావు.

క:- నీవు చెప్పదలుచుకున్న సంగతు లన్నీ నీవాదంలో చెప్పావో. ప్లీడరునుబెట్టి విచారించుకుంటావా?

వెం:- ప్లీడరును బెట్టి యేమి ప్రయోజనం? కేసులో నే లేదనే దేమున్నది? వాఙ్మూలముమీటు కిచ్చి వూరుకుంటాను.

క:- నీ యిష్టం వచ్చినట్లు చెయ్యి. నేను చేయబోయే వాంట్లో ధర్మప్రతిరోధక మేమయినా వుంటుందా?

వెం:- స్వవిషయం గనుక చెప్పగూడదు గాని ఈ ధర్మాలను పోషించవలసిన బాధ్యత మనకు లేకపోగా వీటి నముల్లో బెట్టడం తప్పని నా అభిప్రాయం. ఇవి ధర్మాలు గావు. ధర్మము యొక్క ఆభాస. ప్రారంభంలో యీ ధర్మాలుకొన్ని అనుష్ఠేయములుగా వుండవచ్చు. ఇప్పుడు వాటికి ధర్మముయొక్క వాలకమే పోయింది. తమ చిత్తంవచ్చినట్లు చేయండి. తమ సందేహాలు తీర్చేమాత్రపు వాడినా?

క:- నా సందేహం కొంత తీరింది. ఈ కేసును పూర్తి కాంగనే యీ నవుకరీ వదలిపెడతాను.

ఇంతలో డాక్టరుగారు వచ్చి:

డా:- సలామండి.

క:- ఏమండీ వెంకట్రావుగారూ! యెట్లా యితనిని తీసుకొనిపోవడం?

డా:- కట్టు కదలకుండా యీ మంచమే యెత్తుకొనిపోయి వాక కంపార్టుమెంటులో బెడితే బాగుంటుంది. మాతో కొందరు పోలీసులుగూడా వస్తారుగదా.

క:- అవును. వాకదాదీ, ౧౦౦ మంది పోలీసులూ వస్తారు. ప్రయాణం చేయగలస్థితిలో వున్నాడమో మళ్ళీ పరీక్షించండి.

డా:- ఇప్పటి కేమీ జబ్బు లేదు. చెయి క్రమంగా కుళ్లుతుందేమో? తుంటిమీద శస్త్రం కష్టమే. అంతవరకు బోకుండానే చేతా మని ప్రయత్నిస్తున్నా.

క:- పోలీసులు వస్తున్నారు. వార్డరూ! త్వరగా నలుగురు కూలీలను చూడు.

వా:- సూపరెంటెండెంటుగారు యిదివరకే యేర్పాటు చేశారు. హాజరులో వున్నారు.

క:- పిలిచి యెత్తించు.

జగ్గణ్ణి పదిగంటలబండికి తీసుకొనిపోతారని వూళ్ళోవదంతి పుట్టి వేలజనం స్టేషన్ దగ్గరా తాలూకా ఆఫీసుచుట్టూ మూగారు. కూలీలు మంచ మెత్తుకొని బయలుదేరారు. పోలీసులు నాలుగు వైపులా విచ్చుకత్తుల పహరా యిస్తున్నారు. పోలీసుసూపరెంటెండెంటు ముందూ కలెక్టరు వెనుకా గుర్రాలెక్కి వస్తున్నారు. స్టేషనుదగ్గరకు పోయేవరకు చెక్కవంగింది. మూడుపెట్టెలు ఖాళీచేసి యావత్తుమందీ యెక్కారు. డాక్టరూ, సూపరెంటెండెంటూ ఇన్‌స్పెక్టరూ వెంకటదాసు కంపార్టుమెంటులో కూర్చున్నారు. గుంటూరు పోయేవరకు ఉదయం యెనిమిటగంటలయింది. జగ్గడు బండిలో వస్తాడని వూళ్లోనూ దగ్గరపల్లెలలోనూ తెలిసింది. జగ్గడు మంగళాపురపు మనిషని ఉద్యోగులకు మాత్రమే తెలిసిన రహస్యమయినా బయటికి పొక్కింది. జనాన్ని మైదానంమీదికి రానియ్యలేదు. పదివేలజనం చుట్టూ మూగింది. మంచం యెత్తుకొని కూలీలు నడుస్తున్నారు. పోలీసులకు చుట్టూవున్న జనవత్తిడి బలమయింది. ప్రయాణం అడుగు సాగలేదు. కలెక్టరు అందరినీ దారియ్యవలసిందని కోరాడు. ఒక్క పర్యాయం అతనిని చూపితే వెళ్ళిపోతామని జన మన్నారు. దాసు మెల్లగా లేచి కూర్చొని అందరి వంకా చూచాడు. వేల చూడ్కు లతనిమీద వ్యాపించినవి. చప్పట్లు మారుమోగినవి. వెంకటదాసే అనే కేకలుగూడా వినబడ్డవి. అయిదునిమిషాలు దాసు కూర్చుండి తరువాత పడుకున్నాడు. జనం క్రమంగా చిలకబారి దారియేర్పడ్డది. పోలీసులు సాగారు. తాలూకా జయిలుకు వచ్చేవరకు గంటపట్టింది. కటన్నాలు, సందియాల జయిళ్ళు సంతానులు బద్దలుగొట్టారని తెలిసి అయిదువేల సైన్యాన్ని తాలూకా ఆఫీసుచుట్టూ రాత్రింబగళ్ళు కాపలా పెట్టారు.

విచారణవాయిదా యింకా మూడురోజు లున్నది. మరు

[illegible]

ప్రాకిగుండ్ల వర్షం గురిసింది. అంతాగబ్బ గీము. వెలుతురు ప్రస
రపజేసి పరీక్షించాపు. మనుష్యుల జాడాపోబట్లు కనబడలేదు.
ప్రాకులగుండ్లు పస్తూనేవున్నవి. ఒకటీ తప్పిపోవడం లేదు.
రాంతర్ల వెలుతురు సంతానులకే యెక్కువసహాయ మయింది.
రాంతర్లచుట్టూ సైన్యం కళ్ళాలుగా పడిపోయింది. దీపాలు ఆర్పి
సైనికులు కూడా కాల్చడం ప్రారంభించారు. కొంతసేపటికి మందు
ఏందుసామా నయిపోవడంచేత సంతానులు వెళ్ళిపోయినారు.
రాక్కొని మళ్ళీ కాల్చడానికి వొత్తు వొత్తారేమో నని సైనికులు
వెంబడించలేదు. సంతానులు యెవండ్ల యిక్కలకు వాండ్లు చేరిన
తరువాత సైన్యం వెతకడానికి బయలుదేరింది. సంతానులపొళుకువ
యెక్కడా కనపడలేదు. అందరూ తిరిగివచ్చి తాలూకాఆఫీసు
చుట్టూ అంతా క్షేమమని పహరా యిస్తున్నారు. తెల్లవారి పడి
పోయినవాండ్లనందరినీ లెక్కపెడితే అయిదువందలశవాలూ,
వేయిమంది వికలాంగులూ తేలారు. చుట్టుగుంటదగ్గర సైనికుల
కర్హమయిన వీరగౌరవములతో శవాలను ఖననంచేశారు.

మరునా డుదయం యేడుగంటలకు కొరిటేపాటినుంచి కూర
గంపలు వస్తున్నవి. కొందరు అత్తల నాడిపోసుకొంటున్నారు.
వొకముసలిది కాయలగంప మొయ్యలేక సోమారికోడలిమీద
వేష్టపడుతున్నది. కొందరు ముసలివాండ్లు గంపలబరువుకింద అణిగి
అడుగులు తియ్యలేక మెడలుపడి బాధపడుతూ పోతున్నారు.
ఒకతవర శోటకూరగంప తలమీద బెట్టుకొని, తాము మోసే
కాయల కావిళ్ళభారం సహితం మరచి యెకసక్కెములాడు జవ్వ
నంపు కోడెసరసులను చిరునవ్వువెలుగుతో కలసిన కోరచూపులచే
కసరికొట్టుతూ గజ్జలగుఱ్ఱంవలె కదనుపోతున్నది. కంచుమట్టెలూ
కడమవేళ్ళను తగరపుచుట్లూ బోలుకడియాలూ కాళ్ళ నలంక
రించినవి. వాటిపై జీరాడుతూ గుమ్మటంతిరుగు గులాబీపూలచీర
గూడకట్టు కట్టుకొన్నది. రంగుబిగించిన వొడ్డాణానికి అతికిన వెండి
గొలుసుకు దగిల్చిన తాళపుచెవులగుత్తి వేలాడుతున్నది. వేళ్ళకు
పంచలోహాల వుంగరాలూ, సందిట వెండికడియం, చేతుల బిళ్లారి

గాజులూ, చెవులకు బొట్లులూ, మెడలో మువ్చిబంగారపుగుండ్ల పేరూ, కుడికొప్పుమీద చేమంతిపువ్వూ ఆమె సొగసుకు త్తై చాటుతున్నవి. రవికె వొరుసుకుంటున్నది. కనుకొలుకుల ప్రక్క కాటుకగీరా, ముఖాన నల్లకుంకుమా చామనచాయగల దేహాని అలంకారంగానే వున్నవి. పమిటెచెరుగు కుడిరొండిన దోపి వెకి నవ్వుతో నడిరోడ్డుమీద తాలూకా ఆఫీసున కెదురుగా నిలు బడ్డది. రోడ్డుపక్కనున్న మేడలోనుండి—

ఒక స్త్రీ:- కూరమ్ముతారా ?

ర:- వాండ్లంతా మార్కట్టుకు పోతారు. నాదగ్గర తోట కూర వున్నది.

స్త్రీ:- అరుగుమీద దించుకో, వస్తున్నా. దేని కమ్ము తావు ?

ర:- డబ్బులకూ, బియ్యానికీ, కొనేవాండ్లనుబట్టి వూరికే గూడాను.

స్త్రీ:- దిగివచ్చి--పెట్టు--కాసినికూసినిగావు, అరసోలెడు బియ్యం.

ర:- ఎన్నైయినా మీచాటలోనే వున్నవిగదా !

స్త్రీ:- ఊరికే అట్లా యెదురులా వెందుకు ? చేతికి రానే రాదేమి ?

ర:- పట్టమ్మా ! కొంటే రానిది కొసిరితే వస్తుందెట ?

స్త్రీ:- యేమిపట్టు? చేతికి రాదేమి? ముల్లు గుచ్చుకుండేను.

ర:- తినేటప్పుడు మీనోట్లో గుచ్చుకోరాదూ! నాచేతిలో యెందుకు గుచ్చుకోవాలె ?

స్త్రీ:- నీకూర నీవు తీసుకో. బియ్యపుకుప్పంతయినా లేక పోతే !

ర:- కూర వూరికేనే వస్తుందటమ్మా ! నీళ్ళు పొయ్యలేక అడవలు తెగుతున్నవి. మహారాజులకు మాకష్టాలు యేమి తెలు స్తవి ? పట్టండి ! పొద్దున్నే బోణీచేశారు. తగాదా యెందుకు ?

బియ్యం మూటగట్టుకొని తాలూకా ఆఫీసువంకపోయి గేటుదగ్గిర పహరాయిస్తున్న తురక సిపాయితో—

ర:- ఏమయ్యా! మీా రెవ్వరూ కూరలు కొనుక్కోరా? (అని కన్నుగీటింద.)

ఆచూపు తూపై తాకింది సాహెబుకు.

సా:- పిల్లా! నా కొకకాని కూర పెట్టు.

ర:- నీకు కానీకూ రెందుకు? లోప లెవరూ కొనేవాండ్లు లేరా? అమ్ముకొని మళ్ళీ వచ్చేటప్పుడు నీకు కావలసినకూర వుట్టినే తీసుకొందువుగాని.

సా:- పిల్లా—ఘోడా మోస్తరుగా కదనుపోతావు. పో, లోపలికి బో! అరగంటసేపు అమ్ముకొని బయటికి రా—యెనిమి దింటికి ఆఫీసర్లు వస్తారు.

ఒయ్యారం వొలికిస్తూ రవర లోపలికి నడిచింది. సాహెబు వెఱ్ఱిచూపులు చూస్తూ వూరుకున్నాడు. లోపలవాకిటిదగ్గిర వొక నాయుడు పహరాయిస్తున్నాడు.

నా:- యెవరు నీవు? జవాబు చెప్పి కదులు.

ర:- నీకు నేను జవాబు చెప్పలేకపోతానా?

నా:- అసాధ్యురాలవుగా వున్నావే?

ర:- సాధ్యం కాకపోను. ఈ పక్కనే మాయిల్లు. సిన్న నీవు షికారు వచ్చావే? ఆఫీసరులకు కూరకొనేటందుకు వార్డరు పిలవమన్నాడుట. గేటుదగ్గిరవున్న సాహెబు రమ్మన్నాడు.

నా:- సాహెబు రమ్మంటే వస్తావా?

ర:- అంటేమాత్రం నిన్ను నేనే అడుగుతున్నాగా? వాసి చూపించానా లేదా?

నా:- వార్డరు లోపల వున్నాడు. మళ్లీ యిటేరా.

లోపలికి బోయి వార్డరుకు సలాం పెట్టింది.

ర:- తమరు మంచివాండ్లని వింటాను. వెంకటదాసుకి నేను భార్యను. ఆయననుచూచి యెన్నాళ్ళో అయింది. కండ్ల జూచి పోవాలె నని వచ్చాను. ఈ వందరూపాయలూ తమ దగ్గర వుంచి అతని కేమయినా కావలిస్తే యిప్పించండి.

నా:- త్వరగా మాట్లాడు. కూరగంప యిచ్చిపో. ఎవ రయినా అడిగితే కొనడానికి నే కబురంపా నను. అరగంటలో ముగించాలె.

క:- ఇతరు లెవరూ రాకుండా చూడు.

వా:- నేను గేట్లో వుంటా పో.

ర:- జై సంతాన్! ఆహా! జగ్గడా యీ స్థితిలో వున్నావు!

వెం:- రామన్నా! నీవా? గుర్తు పట్టలేకుండా వున్నావు. ఇట్లారా - ఇట్లారా. ఈ కమ్ములల మధ్యగుండా నాచేయి తాకు. రాత్రి ముట్టడించింది నీ సైన్యమేనా? నీవు రాత్రి బ్రిటిషు పటాలాన్ని నాశనం చేశావుటే? స్త్రీలను కాపాడిన గౌరవం దక్కింది మనకు.

ర:- ఆ గౌరవం నీదే. మా కుత్తరు వేమి?

వెం:- నాయకు లెంద రున్నారు?

ర:- నేనుదప్ప సైనిక నాయకు లంతా రణరంగంలో పడి పోయినారు. జిల్లా నాయకులుమాత్ర మున్నారు.

వెం:- వాం డ్లెవరూ నాకు నచ్చలేదు. ఇక జరగవలసిన దేమని నీ అభిప్రాయం?

ర:- నీ ఆజ్ఞ శిరసావహిస్తాను. అయిదారు రోజులలో యీ పదివేల సైన్యాన్ని పురమాయిస్తాను. మందుగుండు సామగ్రి యావత్తూ యిక్కడికి చేర్పించా.

వెం:- ఇక నే నెందుకూ పనికిరాను. ఈ స్థితిలో జీవించడం నా కిష్టంలేదు. బహుశా నే జీవించననే డాక్టరు లంటు న్నారు. మొన్నటి యుద్ధం వరకూ జీవహత్య మన మెక్కడా

చెయ్యలేదు. సైనికు లంతా మనబోటి బీదవాండ్లే. జీవనం లేక ప్రాణా లమ్ముకున్నారు. యుద్ధం చేయడం మన వుద్దేశం గాదు. చేసి ప్రయోజనమూ కనుపడదు. వృథా జీవహింస మన కెందుకు?

ర:- నాకూ అట్లాగే తోస్తున్నది.

వెం:- ఇంతవరకు మనం పుట్టించిన ఆందోళనవల్ల ధనికులూ ప్రభుత్వం వారూ ప్రస్తుత స్థితిగతులు మార్చక తప్పదని అభిప్రాయ పడుతున్నారు. ఇకమీద పాత పద్ధతులు ఆపి కొత్త పద్ధతు లవలంబించండి. మన దగ్గర అన్నిచోట్లా అయిదుకోట్ల పదిలక్షల ధన మున్నది. దాంట్లో అయిదుకోట్లు సంతాను లంతా సమానంగా పంచుకొని, న్యాయజీవనం చెయ్యండి. శేషించిన పదిలక్షలలో - పెన్న లిట్లియ్యి. ఈ విధంగా ధర్మాని కుపయోగించండి. మీ రందరూ కార్మిక సంఘాల సభికులుగా జేరి పని చెయ్యండి. త్వరలో మనకు స్వరాజ్యం వస్తుంది. విద్యా, వృత్తులూ, తప్పక అభివృద్ధిపొంది బీదలస్థితి తప్పక బాగుపడుతుందని నా నమ్మకం. మీరు పార్లమెంటుకు సభికులను పంపి అక్కడి మన సంఘముయొక్క స్థితి బాగుచేయడానికి ప్రయత్నించండి. రాముడూ! ఈ చెప్పిన ప్రకారం జరిగించు. ఇక వెళ్ళుతావా? నా శరీరం వొకమాటు మళ్ళీ తాకు. అయ్యో! యెంతమంది సంతానులు హతులైనారు! నాయకు లంతా ప్రాణా లర్పించారు. సంతాను లందరినీ నే కావలించుకున్నా నని చెప్పు. నా తప్పులు క్షమించండి. రాముడూ! నే బోయిన తరువాత జగ్గడు వురఫు వెంకటదాసు జ్ఞాపక ముంటాడా?

రా:- నీవు వెంకటదాసువా? ఈ అద్భుతశక్తి మంగళాపురంలో మొలకెత్తిందేనా? ఆశ్చర్యం సంతానుడా! నీ ఆజ్ఞలు శిరసా వహించి నెరవేరుస్తాం. ఇంక సంతానుల కెవ్వరికీ నీదర్శన భాగ్యం లేదుగదా. నేనే అందరిలోనూ అదృష్టవంతుణ్ణి. నీపాదాలు వొక్కమారు అంటుకోనియ్యి.

వెం:- అది మన ధర్మవిరుద్ధం. సంతాను లందరూ సమాన ప్రతిపత్తి గలవారే. మళ్ళీ నీ చెయ్యి నా కందియ్యి. సంతానుడి

స్పర్శసుఖ మనుభవిస్తాను. ఇంతకాలం నుంచీ స్వేచ్ఛా చక్ర వర్తినై సంతానులతో గలిసి గాలివలె అడవులలో సదా సంచరించాను. ఇప్పుడు కాళ్ళుచేతులు లేని అవిటినై జీవించడంకంటే హైన్య మేమున్నది? ఈ జన్మ చాలించి తిరిగీ పంచమ సంతానుడనై పుట్టి మన వుద్యమానికి తోడ్పడుతాను. శ్రీరాముడికి కపులు తోడైనట్టు మీరంతా మళ్ళీ సంతానులై పుట్టి మన వుద్యమాన్ని నిర్వహింతురుగాక!

ర:- యేజన్మ యెత్తేదీ మన చేతిలో వున్నదా? విధినిర్ణయ మెట్లా వుంటుందో? అది అలంఘనీయంగదా!

వెం:- నే నమ్మను. మన విధిని మనమే నిర్ణయించుకుంటాం. కర్మ బంగారుతీగె వంటిది. కార్యకారణ మార్గాన యెటు మలిపితే అటు తిరుగుతుంది. మన చేతిలో వున్న పనికి మఱివొకరి ప్రాజాపత్య మెందుకు?

ర:- నీ రాజ్యంలో దేవుడికి ప్రవాసగతేనా?

వెం:- దేవు డనేవా డొక డుంటే అంతేగతి. చేతకాని తనాని కది శిక్ష. మళ్లీ నే వచ్చేలోగా పరీక్షలలో తేరి వుద్యోగార్హత పొందివుంటేతప్ప అసమర్థత క్రింద తొలిగిస్తాను. ప్రస్తుతమతనిని సస్పెండుచేసి అతని పాత చట్టాలన్నీ మూలదోయించాను. నేను లేనప్పుడు వాటి నతడు మళ్లీ తీసి తగిన మరమ్మతు చేయిస్తేనేతప్ప వొక దానినీ వాడనియ్యను.

వార్డరు:- ఏమమ్మా! ఆఫీసర్లు వచ్చే వేళయింది.

ర:- సంతానుడా! నే వెళ్ళనా?

వెం:- ఇక సంతాను లెవరూ నా కండ్లకు గనబడరు గాఁవాలె. మళ్ళీ వొకమాటు నాచెయ్యి ఆలింగనం చెయ్యి. ఆలింగన మన్యోన్యం కుదురుస్తుంది. ఆహా! యిక వెళ్ళు.

తోటకూర వార్డరు కిచ్చి రవర బయలుదేరింది. మొదటి పహరా దగ్గరకు వచ్చింది.

నాయుడు:- సాయంత్రం నిజమేనా!

ర:- ఇంకా అబద్ధమా! కనిపెట్టుకొని వుంటా. మంచి బహుమతు లియ్యాలె.

వాలుగంటి చూపులతో నాయుడిని సంహరించి కదను దొక్కుతూ సాహెబున్న గేటు దగ్గరకువచ్చి చిరునవ్వు నవ్వింది. మచ్చు చల్లినట్టు సాహెబు వెఱ్ఱిచూపులు చూస్తూ వూరు కున్నాడు. తోటకూర సంగతి మరిచిపోయినాడు. రవర గేటు దాటి కొరిటేపాటిరోడ్డు పట్టింది. కొంతసేపటికి మచ్చు దిగి రవరవైపు చూచాడు. బిగ్గరగా కేకవేశాడు. ఆ కళ్ళాలు తిరిగి చూచిన పాపాన బోలేదు. సాహెబు జాగ్రత్తగా పహరా యిస్తూనే వున్నాడు.

## ౨౪

## కేసు

వెంకటదాసు కేసు విచారణరోజున దూరపు జిల్లాలనుంచి కూడా వేలకొలది జనం గుంటూరులో దిగారు. మంగళాపురం నుంచి పసిబిడ్డ బాలాదీ వచ్చి వెంకటదాసు ముఖావలోకనం చేసుకోవలె నని ఆదుర్దా పడుతున్నారు. వెంకటదాసు చేయించి నవి బందిపోట్లే అయినా వాటివల్ల స్వల్పసంఖ్యాకులగు ధనికులకే నష్టం గలిగిందిగాని జనబాహుళ్యానికి సంబంధం లేదు. బీదలు బహిరంగంగా దాసుయొక్క వుద్యమాన్ని పొగడకపోయినా యిష్టాగోష్ఠిగా మాట్లాడేటప్పుడు ప్రశంసించని వాండ్లు లేరు. నిజం చెప్పితే నిష్ఠూరంగాని దాసు వుద్యమం లోకానికి క్షేమకర మయిందనీ, ఆయన ధర్మం అవలంభిస్తే సర్వసోదర భావ మేర్పడు తుందనీ పలువుర వాదిస్తుండేవారు. సాధారణపు కుటుంబాల వాండ్లు విద్యావంతులు సహితం బందిపోట్లు సరియైన వని వాదిం చకపోయినా ఆషామాషీగా మాట్లాడేటప్పుడల్లా జగ్గడి ధర్మం అవలంభించడానికి మాకేమీ అభ్యంతరం లేదని అంటూ వుంటారు. ఉద్యమ మంతవింతగా కనుపడడం లేదు. కొందరు

ధనికులు విద్యావంతుల బుద్ధిని కొని పత్రికలు ప్రకటించడాని కుప యోగించి నూతన ధర్మం వ్యాపించకుండా చేయవలె నని ప్రయ త్నిస్తున్నా కాలమహిమ యేమోకాని వాటిని చదివేవాండ్లు కనపడరు. దేశంలోని పరిస్థితులు విషమావస్థను బొందిన వనీ కార్ఖానాలు మిల్లులు చెక్కా పల్లాలు పూడ్చనిదీ స్థితిగతులు మరింత ఘోరస్థితికి వస్తవనీ చాలామంది అంగీకరించారు. ఈ అభిప్రాయ బలంచేత భాగ్యవంతులూ మిట్టలు చెక్కడాని కొప్పుకోకపోయినా పల్లాలు పూడ్చే ప్రయత్నం అందరూ కలిసి చేయవలసిందే నని సిద్ధాంతీకరించారు. కూలీలకు సరళమయిన కూలి యియ్యవలసిం దనీ వాండ్లస్థితి బాగుచేయవలసిం దనీ యంత్రశాలలు స్థాపించి చేతిపనులు వృద్ధిచేసి బీదలకు జీవనం కల్పించవలసిం దనీ అందరూ అంగీకరించారు. వృత్తులు వృద్ధిచేసే ప్రయత్నాలు ప్రస్తుత ప్రభుత్వంవారు చేయకపోవడమే కాకుండా కొన్ని విషయములలో బుద్ధిపూర్వకంగా ఇంగ్లండుయొక్క క్షేమానికై దేశవృత్తులను అణ చడంచేత అలగాజనానికి జీవనంపడిపోయి బందిపోట్లు వృద్ధిగావ డానికి ప్రబలహేతు వని యోచనగల వాండ్లంతా గ్రహించారు. "కలౌ సంఘే బలీ" అను ప్రమాణం ప్రకారం కలియుగంలో స్వల్ప సంఖ్యాకులగు పాలక సంఘాలకూ గురువర్గానికీ ధనిక శ్రేణు లకూ రయితు సమాజములకూ హస్తగతమైన అధికార మూండదనీ అగ్రజాతులనుండి తొలిగి జనసామాన్యంయొక్క వరమౌతుందనీ కాలజ్ఞులు నిశ్చయంగా కనిపెట్టడమే కాకుండా కాలపరిపాకానికై వేచివున్నారు. శీఘ్రపరిపాకానికి తోడ్పడుతున్నారు కూడాను. రాజకీయపరిస్థితులు పూర్తిగా మారి పాలనాధికారం దేశీయుల చేతిలోనికి రానిదీ దేశం ఏ విషయమునా అభివృద్ధి చెందడానికి వీలులే దనీ నిశ్చయించి స్వరాజ్య స్థాపనకై విశ్వప్రయత్నాలూ జరుగుతున్నవి. కాలం కర్మం తోనగూడినట్లు ప్రపంచవాతావర ణంలో గలిగిన మార్పుల కనుకూలంగా దేశమం దడగివున్న శక్తుల నన్నిటినీ పొందుపరచి జయమొనగూర్చదగిన మహాపురుషులు జన్మించి వివిధోద్యమాలను పెంపొందించి ఉడికొలుపుతున్నారు.

కొత్తా పాతా యావత్తూ ఒకమూసనబడి కరిగి సమ్మిళితమై ఒకనూతనశక్తిగా విజృంభించి జగన్నాథుని రథంవలె పరిభ్రమిస్తున్నది. ఇది నిజంగా జగన్నాథునిరథమే. ఈ త్వరను యీ మహాశక్తిని యెదిరించడానికి యెవరికి సాధ్య మవుతుంది? యెవడాప సాహసిస్తాడు? స్వార్థపరులు మూర్ఖించి యెదిర్చినా వినాశనానికే కారణ మవుతుంది. ఈ వినాశం స్వార్థపరత్వానికే కాని స్వార్థపరులకు కాదు. వారూ పునీతులే అవుతారు.

మొదటిరోజున సంతానులు కావలిసైన్యాన్ని ముట్టడించి నష్టం గలిగించడంచేత తిరిగీ ముట్టడించేయెడల జననాశం గాకుండా వుండడానికి యోచనలు జరుగుతున్నవి. ఆఫీసుకు ఫర్లాంగు దూరాన చుట్టూ మెరుపుసారముతో గూడిన తీగెలు కంచె వేయించి మరఫిరంగులు పెట్టించడానికి 1000 మరఫిరంగులు పంపించమని చెన్నపట్టణానికి తీగెయియ్యగా చాలినన్ని వారిదగ్గర లేనందున యితరరాజధానులకు తారిచ్చి తెప్పిస్తున్నారు. అరండల్ పేటా, బ్రాడీపేటలలో యిండ్లన్నీ కాళీ చేయవలసిం దని వుత్తరువు లయినవి. ఈ సంగతు లన్నీ వెంకటదాసు విని కలెక్టరును పిలిపించుకొని వృథా జనహింసకు హేతువు లయిన ముట్టడులు యిక జరుగకుండా తాను బందోబస్తుచేసినాననీ, జనులు వృథాగా యిండ్లు విడువవలసినకారణం లేదనీ తాను దిట్టపరచినందుకు ఆ రాత్రి ముట్టడిలేకపోవడమే కారణ మనీ చెప్పి వొప్పించి ప్రయాసలు మాన్పించాడు. కొండవీటికొండలమీద మిడతలదండు వాలినట్టు యెక్కడ జూచినా దొంగలపుట్టని గొల్లుగాసేవాండ్లు గ్రామాలలోకి కబుర్లు దెచ్చారు. కాని గాలిమళ్ళంగనే పురుగులు లేచిపోయినట్టు దొంగ లంతా రెండవరోజుసాయంత్రానికి మాయమైపోయినారు. కొండన దొంగలజాడలు లేవని తెలియపరచంగనే కొత్తసేన అవసరం లేదని టెలిగ్రాములు పంపి సైన్య మాపివేశారు.

నాయిదారోజున జనం వూరంతా కిటకిటలాడుతున్నది. [illegible] కలెక్ట రాఫీసుకు తీసుకొనిపోవడ మసాధ్య

మని తోచి తాలూకాఆఫీసులోనే విచారించవలసిం దని కలెక్టరు జడ్జీగారికి కబురంపాడు. ప్లీడర్లు చాలామంది తమకు వకాల్తునా మాలు వస్తవని ఆశపడ్డారు గాని వెంకటదాసు వకీళ్ళను పెట్టుకో లేదు. వెంకటదాసును మంచంమీద జయిలునుంచి తాలూకా ఆఫీసులోగుండా తీసుకొనివచ్చారు వేలజనం తిరునాళ్ళ ప్రజలవలె అరండల్ పేటా, బ్రాడీపేటలనిండా మూగివున్నది. కోర్టుపాటి రోడ్డుమీద రహదారీ ఆగిపోయింది. రణగుణధ్వనిగా గోలపుట్టి కోర్టులో విచారణ సాగలేదు. పోలీసులను పంపినా జనం కదల లేదు. హెండర్సనుగారు విచారణ ఆపి జనాన్ని తోసుకొని వాకి ట్లోకివచ్చి అందరూ వెళ్ళిపోవలసిందని కోరాడు. వెంకటదాసును వొక్కమారు కండ్ల జూడందీ పో మని పట్టుపట్టారు. అంతట మేజస్ట్రేటు ఆఫీసు ఆవరణంలో యెత్తుగా బల్లలు వేయించి వెంకట దాసుమంచం వాటిమీద బెట్టించాడు. దాసు లేచి కూర్చు న్నాడు. ఆంధ్రదేశా న్నల్లకల్లోలంచేసిన మహాశక్తివంతుడు వికలాంగుడై వుక్కుచెడి మంచంలోపడి వుండడంచూచి జనం దుఃఖించారు. ఇత డెవరో విచిత్రపురుషు డని విస్మయపడ్డారు. మంచం దింపి ఆఫీసులోకి తీసుకొనిపోంగనే జనం గాలికి మేఘాల మోస్తరుగా విచ్చిపోయినారు. విచారణ ప్రారంభ మయింది.

కో:- నీ పేరు వెంకటదాసా? జగ్గడా?

వెం:- నా పేరు వెంకటదాసు వురఫు, జగ్గడు.

కో:- జగ్గడా? జగన్నాథమా?

వెం:- జగ్గడే. అదే నాకు ప్రియమైన పేరు.

ఫిర్యాదితరఫు విచారణ ప్రారంభమయింది. కృష్ణాజిల్లాలో జమీందారీ యిండ్లలో జరిగిన రెండు బందిపోట్లను గురించీ, కర్నూలులో వొక వర్తకునింట్లో జరిగిన కన్నపునేరమునుగురించీ సాక్ష్యం పెట్టారు. ఈ మూడు కేసులలోను జగ్గడు స్వయంగావుండి చేయించినట్టూ అతనిని గుర్తించినట్టూ సాక్ష్యం వచ్చింది. మూడు చోరీలలోను షుమారు 10 లక్షల సొమ్ము పోయింది.

మొయ్యలేక వెండినగలు పారవేసిపోయినారు. ఇనపపెట్టెల తాళాల దగ్గర మెరుపుసారం ప్రయోగించి గోడయిటికెలు దీసినట్టు ఇనప బెచ్చికలు తీసి పారవేసివున్నవి. లండను పారీసునగరాలలో చోరాగ్రేసరు లుపయోగించేసాధనా లుపయోగించారు. రషియా దేశమునుంచి బోల్షెవిక్కు లివి సప్లైచేసివుంటారని ఫిర్యాదితరఫున సూచించారు. "శేషించిన ధనాన్ని సంస్థానాల ఆదాయములనూ, మోటారుబండ్లకూ దాసీలకూ బోనగత్తెలకూ సారాయిలకూ వుప యోగించి పాడుచెయ్యక కొంతభాగ మయినా బీదల కుపయో గించకపోతే మళ్ళీవచ్చి దర్శనంచేస్తామని జగ్గడు యింటివారిని లేపి చెప్పిపోయినా"డని యిద్దరు జమీందారులూ సాక్ష్యం చెప్పారు. వర్తకుడు తాను చోరీ జరిగినప్పుడు ముద్దాయిని బాగా చూచాను గాని యిప్పుడు గుర్తించలే నన్నాడు. సొత్తుమాత్రం వొక కేసులోనూ చిక్కలేదు.

కో:- ఇన్నెస్పెక్టరుగారూ? ఈ నగలన్నీ యితరుల కమ్ము కోకుండా యేమి చేస్తున్నారు?

ఇ:- నల్లమలకొండలలో జగ్గడు టంకసాల పెట్టించి కాసులూ శౌరీలూ చేయించిన అచ్చులు సోదాలలో దొరికినవి. వాయిదా యిప్పిస్తే అవి తెప్పించి దాఖలు చేయిస్తాను.

కో:- ఈ కేసుకు సంబంధ మేమున్నది? నగలలోవుండే రత్నా లేమయినవి?

ఇ:- అవి ఊడదీసి అమ్ముకుంటే గుర్తుపట్టటం కష్టం. సంతానులు చేసిన అన్ని చోరీలలో రిపోర్టుదాఖలా పదిలక్షల రూపాయిల ఖరీదుగలరాళ్ళు పోయినట్టు తేలుతుంది. ఒక్కరాయి గూడా మాకు చిక్కలేదు.

కో:- సాక్ష్యం పూర్తి అయిందా?

ఇ:- చిత్తం.

కో:- వెంకటదాసూ-ఆ పేరునే పిలవడం నా కిష్టం. నీ తల్లిదండ్రులు పెట్టినపేరు యెందుకు మార్చుకుంటావు?

వెం:- చిత్తం. వెంకటదాసే నా పేరు. మధ్య వచ్చిన పేరు మధ్యనే పోనియ్యండి. ఆలోచించుకుంటే నా చరిత్ర యావత్తూ లోకానికి రజ్జుసర్ప భ్రాంతిగా వుండకపోదు.

కో:- వేదాంతివిగూడానా ?

వెం:- వేదాలను అంతమొందించేవా డని ఆ మాట అర్థ మిచ్చేట ట్టయితే వేదాంతినే.

కో:- వేదాలనే అంతము చేస్తావా ?

వెం:- లోకకంటకములయిన ధర్మా లందులో వుంటే వాటిని.

కో:- సాక్ష్యమంతా విన్నావుగదా, ఏమి చెపుతావు ?

వెం:- సాక్ష్యమంతా నిజమే. కొన్ని కొత్తసంగతులు చెప్పుకోవలసి వున్నవి. వుత్తరువు దయచేయిస్తే చెపుతాను.

కో:- దేనినిగురించి ?

వెం:- ఫిర్యాదీ, ఇండియా చక్రవర్తి నే జేసినవి దొంగతనా లంటాడు. నే కాదంటాను. ఆసందర్భంలో నే జెప్పేది సాకల్యంగా వ్రాసుకోవలసిం దని నాకోరిక.

కో:- చెప్పుకోవచ్చు. యావత్తూ వ్రాస్తాను.

వెం:- సృష్ట్యాదిన హక్కు స్వత్వాలు లేవు. జనులు సోదరభావంతో భూదేవి యిచ్చిన పంటను అస్వాస్తనికభావంతో అందరూ అనుభవిస్తూ వుండేవారు. గ్రామంలో నిలువచేసిన ధాన్యాల పాతళ్ళు, గాదెలు, కొట్లు, గ్రామసంఘాలు గ్రామ సమూహమునకై వుపయోగిస్తూ ఉండేవాండ్లు. జను లందరికీ సంఘ సేవదప్ప రెండవ సేవ లేదు. ఆహారపదార్థాలే ద్రవ్యం. ధనకాంక్ష పుట్టలేదు. వెండి, బంగారు పెంకులకింకా విలువలేదు. అహోరాత్రాలు వాటిని కాపాడేకాలం గాదు. అంతా పని చేసుకుండేవాండ్లు. ఆరోగ్యవంతులై అనుభవించేవాండ్లు ఆ రోజులలలో సంపాదన అనుభవించడంకోసంగాని, దాచుకొని కాపాడడంకోసం

గాదు. మనసుకు తృప్తివుండేది. వ్యాకులమూ, తొందరా, పోటీలూ లేవు. జనులు నిర్మలమనస్కులై ఆనందమనుభవిస్తూ వుండేవాళ్లు. అందరూ భాగ్యవంతులే. దారిద్ర్యమే లేదు. స్వర్గం భూమిమీదనే వుండేది. అంతవరకూ దేవుడు చక్కగా పాలిస్తూ వుండేవాడో లేక అప్పటికి దేవుడింకా పుట్టనేలేదో, పుట్టినా మయినార్టీ కాలమో, వెళ్ళినా పట్టాభిషేకం కట్టుకోలేదేమో. ఇట్లా వుండగా ఈశ్వరుడు వచ్చి ప్రపంచమంతా నాదన్నాడు. నేను గొప్పవాడిని గనుక నాకంతా మీరు సేవచెయ్యండన్నాడు. తనకు మేడలుగట్టమన్నాడు. తనను రథమెక్కించి మొయ్యమన్నాడు. ఈశ్వరుడి ఐశ్వర్యం చూచి చిన్న దేవుళ్ళు బయలుదేరారు. త్రిమూర్తుల మన్నారు. దిక్పాలకుల మన్నారు. చివరకు మహా గణితం ముప్పైమూడుకోట్ల న్నారు. ఇంకా పెరిగింది. గ్రామదేవతలూ గృహదేవతలూగూడా పుట్టారు. జనుల సంఖ్యకంటె దేవతలసంఖ్య యెక్కువయింది. కొలుపులు సాగినవి. వీండ్లను జూచి కొందరు జనులకుగూడా నోళ్ళూరినవి. గురువులు భూదేవతల మని బయలుదేరారు. పుడమిదెయ్యాలై ఐశ్వర్యవంతులు పుట్టారు. యథాశక్తిగా దేశాలూ, గ్రామాలు, క్షేత్రాలు, ధనధాన్యాలు ఆక్రమించు కొన్నారు. మనుష్యులను బానిసలుచేసి పశుత్వమిచ్చి, వారిమీద సైతం స్వామ్యం సంపాదించారు. అందలా లెక్కుతున్నారు. పోటీదార్లెక్కువ గావడంచేత గాంవాలె, ఈశ్వరుడు స్వర్గాన్ని హరించి భూమిమీదనుంచి యెత్తుకొనిపోయి యెక్కడనో పెట్టు కున్నాడు. స్వర్గంభూదేవతలకూ ధనికులకుకూడా దూరమే అయింది. ఎవరయినా అక్కడి కడుగుపెట్టగలరు. గాని వీండ్లకు సాధ్యం గాదు. అది తెలిసి ఐశ్వర్యవంతులు తక్కిన వన్నీ అనుభవిస్తున్నారు. స్వర్గం భూలోకం విడువంగనే నరకమూ, దుఃఖమూ, అత్యాశా, అతృప్తీ, లోభమూ, దారిద్ర్యమూ, పస్తులూ, ఆక్రమించినవి. ఇసుకమేట వేసినట్లు ధనం యేకొద్దిమంది దగ్గరనో చేరింది. ఒక చోట పల్లం చేస్తేనే కాని వేరొకచోట మిట్ట యేర్పడదు. భూమి కుంగి చెరువయితే పక్కన కొండ వొకటి పైకుబుకుతుంది.

ఒకద్వీపం మునిగి మరొక ద్వీప మేర్పడుతుంది. అశేషజనులూ దరిద్రులై యెవరో కొందరు భాగ్యవంతులయినారు. భాగ్యవంతులకే భాగ్యం, దరిద్రులకే దారిద్ర్యం నిలకడయింది. రెండూ పెంపుగూడా అవుతున్నవి. సమర్థులయి యితరుల ధన మపహరించినవారికే గాక అప్రయోజకులయిన వారిసంతానానికే వారసత్వ ప్రకారం ధనం రావలసిందని చట్టాలు చేసుకున్నారు. కష్టపడి పంటలు పండించి చేతిపనులు చేసి అమర్చిన పదార్థ మంతా ధనవంతు లపహరించి తిని తొక్కి తొంబాడిచేసి శ్రమపడి పనిచేసే వాండ్లకు ఆహారము లేకుండా చేస్తున్నారు... ... ... ... ... ... వీటి కనుకూలంగా చట్టాలుకూడా చేసుకున్నారు. భాగ్యవంతులు బీదలను దోచుకుంటే దాని పేరు వ్యవహారం. బీదలు తమ హక్కును తీసుకుంటే చౌర్యం... ...బీదల దగ్గరనుంచి మోసము చేసి ఆకర్షించిన ధనం మరల బీదలు లాక్కుంటే యెట్లా తప్పు యిందో కోర్టువారు నిర్ధారణ చేయగోరు తున్నాను. ఇటువంటి అక్రమ చట్టాల ఔరస సంతానమే బీదల నేరాలు. అశాస్త్రీయ చౌర్యములకంటె శాస్త్రీయ చౌర్యములే లోకాని కెక్కువ హాని చేస్తున్నవి. భాగ్యవంతుల కుపయోగించేది చట్టసమ్మతం. కానిది నేరం. భాగ్యవంతుల ప్రాణానికి విలువ యెక్కువ. బీదవానికంటె భాగ్యవంతుని శునకమే అతిశయం. బీద లోడ్చిన చెమటా రక్తమూ కరుడుగట్టి ధనికుని భాగ్య మవుతుంది. కాని ఇది భాగ్యవంతు డంగీకరించడు. భాగ్యవంతుడు పేదవాని కెంత అవసరమో పేదవాడు భాగ్యవంతుని కం తవసరం. కాని భాగ్యవంతు డది గుర్తించడు. బీదవాండ్లను భాగ్యవంతుల క్షేమానికే భగవంతుడు సృష్టించా డనే వాండ్ల నమ్మకం. అంతేను తప్ప బీదల జన్మలు ప్రయోజనకారులు గావు. అందువల్ల భాగ్యవంతుల కుపయోగ పడని బీదవాండ్లుండనవసరము లేదు. ఇది కలియుగధర్మం. మత కర్తలీ కలియుగ ధర్మాల నంగీకరించరు. మత కర్తల బోధలు వారి అనుచరుల కక్కర లేదు. వారి ధర్మాల కనుగుణ మయిన కృతయుగ ధర్మాలను పునరుద్ధరించవలె నని నా ప్రయ

త్నము. కలియుగంలో రాక్షసులు లేరంటారు గాని ధనికులే కలియుగ రాక్షసులు...మా సంతానుల చర్యలవల్ల ధనికుల భారం తగ్గుతుంది. బీదలకు సుఖం కలుగుతుంది. దేశమాత ప్రసాదించగల సౌఖ్యాలు ఆమె సంతాన మంతా సమానంగా అనుభవించడాని కవకాశం గలిగి యిహమే స్వర్గ మవుతుంది. దేవరాజ్యం భూమిమీద తిరిగీ పునస్థాపితం గావడమే నా పరమావధి. నా పరమావధే నా దేవుడు. దానిని పొందడమే నా కానందం.

కో:- స్వర్గలోక భోగాలు నీకవసరం లేదా?

వెం:- వాటి సంగతి నాకు తెలియదు. ఇంతవరకు యెవరికీ తెలియదనే నా అభిప్రాయం. దాని విషయమై విచారించిన వాండ్లంతా తలా వొక అభిప్రాయం చెప్పారు. పరలోక విషయాలు అక్కడికి పోయినప్పుడు విచారించుకోవచ్చు. ఇప్పుడీ లోకం బాగుచేతాం. ఇంతమాత్రం చేయగలిగితే చాలు. మేఘాలను నమ్మి చెరువు తెగగొట్టుకొన్నట్టు అనుమానాస్పదమయిన పరలోకం కోసం యిహాన్ని త్యజించవద్దు.

కో:- ధనధాన్యాలూ, సుఖదుఃఖాలూ పూర్వజన్మ కర్మలవల్ల మానవులకు లభింపవా? తక్కువ నోములు నోచి యెక్కువ కోరికలు కోరితే యేమి ప్రయోజనం?

వెం:- పూర్వజన్మ కర్మలవల్లనే లభిస్తవనుకోండి. భాగ్యవంతులకు ప్రాప్తముండే వారు బీదల ధనాన్ని అపహరించారు. ఇప్పుడూ పూర్వజన్మ కర్మఫలం చేతనే బీదలు తమ న్యాయార్జితాన్ని తిరిగి పొందుతున్నారు.

కో:- అయితే సంతానులు శిక్షించబడు తున్నారుగదా.

వెం:- అవును. భాగ్యవంతుల బాటు సాగినంత వరకు శిక్షింపబడుతూనే వుంటారు. భాగ్యవంతులు తమ వర్తనను మార్చుకోకపోతే బీదలే చట్టాలు మార్చి లోకంలో భూతలస్వర్గం స్థాపిస్తారు. ఈ ధర్మం నెరవేరడానికి దయాసత్య శౌచాలు సాధనంగా తీసుకొంటాం. నా హయాంలో జరిగిన వొక్క బంది

పోటులో గూడా హత్యలు జరగలేదు. నా అనుచరులు మద్య పానం వ్యభిచారం విడిచిపెట్టినారు. నా ధర్మ ప్రభుత్వంలో పంజాబు దురంతాలు జరగడం సాధ్యం గాదు. నాది హృదయ రాజ్యం. నా రాజ్యం నశించదు. నే బోయిన తరువాతగూడా అది నిలిచే వుంటుంది. జనుల హృదయ పీఠాలలో నా సింహాసనం నిలిపాను. నా ధర్మాలు అమలులోకి రాకతప్పవు. పాలనా పద్ధతులు అవసరాన్ని బట్టి మారుతుంటవి.

కో:- ముగించావా ?

వెం:- ముగించి నట్టే. ఆయాసంగా వుంది. ఇప్పటికే గ్రంథం పెరిగింది.

కోర్టు:- తీర్పు—వెంకటదాసు వురఫు జగ్గడు అనే బంది పోటు నాయకుడు విచిత్ర పురుషుడు. దయా సత్యశౌచాలు తన వుద్యమానికి ఆధారము లంటాడు. తనమీద వచ్చిన సాక్ష్యమంతా సత్యమే నని అంగీకరించి సత్యం యెడల తనకు గౌరవ మున్నదని నిరూపించాడు. అతని అనుచరులవల్ల అనేక బందిపోట్లు జరిగించినా వొక్కచోట కూడా హత్యలు జరిగించలేదు. వా రందరూ అది వరకు దుర్ వృత్తులు గలవారైనా అతని అదుపుచేత మద్యపానాది దురభ్యాసాలు వదిలిపెట్టినందుకు పోలీసు సాక్ష్యమే రుజువు. దీనివల్ల ఈ బందిపోటు నాయకుడు మానవులను సన్మార్గంలో నడిపించడానికి యెంత సమర్థుడైందీ తేలుతుంది. ఇతడే వొక పీఠాధిపతో లేక రాజో అయితే లోకానికి మహోపకారం చేసేవాడేమో ! ఈ విషయమై అతనిని ప్రశ్నిస్తే తానుగూడా లౌకిక గురువులు రాజులతోపాటి వాడినే అయ్యే వాణ్ణని చెప్పేవాడు. ఇతని వర్తనం పీనల్‌కోడ్డు మూడువందల తొంభై అయిదవ సెక్షను ప్రకారం నేరం. అయినట్టు నిర్ధారణ చేశాను. అయినా యితడు సర్వోత్కృష్టమయిన వుద్దేశములతో తాను చేసేది లోక సేవనీ, తన ధర్మాలు కొంత కాలానికి సర్వ జనులచేతనూ అంగీక

రింప బడతవనీ, నమ్మి బందిపోట్లను జరిగించడం నిర్వివాదాంశం. రాబోవు తరాలవారు యితని వర్తన నెట్లు భావిస్తారోగాని ప్రస్తుత చట్టాల ప్రకారం యితడు నేరస్తుడనకతప్పదు. పై కారణాలచేత సరళభావంతో అయిదు సంవత్సరములు విడిక్కైదుపహాత్రం విధించాను. ఇతనిని నిడదవోలు సెంట్రల్ జైలుకు పంపడమవును.

ఎ. జి. హెండర్‌సన్, ఐ. సి. ఎస్,
దండనాథుడు. ౮-౨-౨౨, రాత్రి తొమ్మిది గంటలు.

———

# మాలపల్లి

## నాల్గవ భాగము

### ౧

### జైలు

రామదాసునూ, ఆయన స్నేహితులనూ, వెంకటదాసునూ సెంట్రలుజయిలుకు బంపారు. వారిజైలుజీవితం చెప్పకపూర్వం జైళ్ళలోనియేర్పాట్లు కొన్ని తెలుపడం అవసరం. విడదవోలు సెంట్రలుజయిలు బ్రిటిషుప్రభుత్వములో మొట్టమొదట స్థాపించిన జయిళ్ళలో వొకటి. తొలింబ్రమలో చిన్నదిగా గట్టినా క్రమంగా విశాలం చేశారు. పాతభాగంలో ౨౮౮ వొంటికొట్లున్నవి. ఖైదీలందరినీ మునుపు వొంటరిగ వొంటికొట్లల్లో వుంచేవాండ్లు. దీనిలో తూర్పుపడమరల రస్తా పోతుంది. రస్తాకు దక్షిణంగావున్న నాలుగుబారకాసులలో ౧౮౦ గదు లున్నవి. దాని కుత్తరంగా అష్టకోణాల చిన్న ఆవరణం దాని కానుకొని నలుదిక్కులా వ్యాపించే ఆరుబారకాసులూ, డెభ్బైయెనిమిదిగదులూ వున్నవి. దీని కుత్తరంగా ౩౦ గదుల బారకా సున్నది. దీనికీ కొత్తభాగానికీ సంబంధం లేకుంటా మధ్య ప్రహారీ వున్నది. పాతజయిలు కానుకొని వాయువ్యంగా కొత్తజయిలు కట్టారు. సింహద్వారం తూర్పు కున్నది. దీనికి మధ్య గోపుర మనే పేరుగల మూడం తస్తులమేడలో సూపరింటెండెంటు ఆఫీసూ దానికి చుట్టూ ౮౦ గజాల వెడల్పుగల మెరాబా గుండ్రంగా వుంటుంది. ఈ మెరాబా చుట్టూ యేడుబారకాసులు వ్యాపించివుంటవి. ప్రతిబారకాసు చుట్టూ ఓపినంత విడిస్తలం చక్కగా వుంటుంది. ఐదవబార కాసులో రెండువరుసలు చీకటి వొంటికొట్లుంటవి. వొకవరుసలో మరణదండన పొందినవాండ్ల నుంచుతారు. రెండవది చీకటి కొట్లుగా వుపయోగించుతారు. తక్కిన ఆరుబారకాసులలో వొంటికొట్లు లేవు. ఒక్కొక్కదాంట్లో ౧౪ మంది పడుకొన

డానికి వీలుగా చానళ్ళుంటవి. ప్రతిసావిట్లో మలమూత్రాలకు చిన్న అరలుండేవి. ఇప్పు డవి తీసివేసి సావిట్లోనే బహిరంగస్థల ములో మలమూత్రభాండా లుంచుతారు. దానినిబట్టి ఖైదీలు పూర్వానికంటె నాగరికులయినా రని స్పష్టంగా చెప్పవచ్చు. ప్రతిబారకాసుకూ సంబంధించి ఆవరణలో వెడిగెలగా కక్కుసు యిల్లు వుంటుంది. రెండుజయిళ్ళకూ చుట్టూ వుండే ప్రహారీగోడ మూడునిలువుల యెత్తున 7గాజు పెంకులమదురు బోసివుంటుంది. తూర్పున రహదారీ తక్కినవైపుల జయిలుకు సంబంధించిన వేల కొలదియెకరాలతోటభూములూ వున్నవి. రహదారిలోనుంచి చీలి జైలులోకి రోడ్డుబోతుంది. ఈ చీలురోడ్డుకు కుడివైపున ౨౦౦ ఖైదీలను వుంచడానికి వీలయిన క్వారంటీను కట్టించారు. దీనిలో కొన్ని వొంటికొట్లూ సావిళ్ళూగూడా వున్నవి. సెంట్రలుజయి లుకు వచ్చేఖైదీ లందరినీ అంటురోగా లున్నవేమో పరికించడానికి సాధారణంగా పదిరోజులు దీంట్లో వుంచుతారు. దీనిలో వుండే వుతుకుష్టం తరువాత విపులంగా చదువుదురుగాని.

దీని కానుకొని ఆడవాండ్లక్వారంటీ నుంటుంది. ఈ రెంటికీ పడమరగా వురిమాను కట్టారు. ఈ యింట్లో యిద్దరుమనుష్యు లను ఒకేసారిగాని లేక వొకటి చెడిపోతే పని ఆగకుండా రెండవ దానికి కట్టి వురిదీయడానికిగాని వీలయ్యేటట్టుగా యేర్పాటు జేశారు.

రోడ్డుకు దాపట సివిలుఖైదీలను వుంచడానికి జైలుఖానా కట్టారు. దీనిలోకూడా ౨౦౦ మందిని వుంచవచ్చు. ఈ మూటికీ పెద్దజైలుకు మోస్తరుగానే గాజుపెంకుల మదుళ్లుబోసిన చుట్టు గోడ లుంటవి. జైలునిండా బ్రహ్మాండమయిన రావులూ, చింతలూ, వేపలూ పెంచారు. జైలుపొలాలలో ఖైదీలచేత వ్యవ సాయం చేయించి కపిలెల్లక్రింద అనేకరకాలపంటలూ, కూరగా యలూ పండిస్తారు. ప్రతిబారకాసుకు సంబంధించి కార్ఖానా లుం టవిగాని క్వారంటీనులోమాత్రం రాళ్లు పగలగొట్టడం, నాగానార దీయడమే చేయిస్తారు.

నిడదలోలు సెంట్రలుజయిలు పదహారువందల ఖైదీలు పట్టుతుంది. దీనిని రాజధానిలో మొదటిరకం జయిలుగా యెంచుతారు. ఆరితేరిన దొంగలతో నిండిన యీ పెద్దగ్రామాన్ని పాలించడం మహాకష్టపు పనే. ఇంతమందికి మూడుపూటలా భోజనాలూ వీండ్లందరిచేతా పనిచేయించడం, కాపలాజేసి అదుపులోవుంచడం, గుడ్డలియ్యడం, రోగమూ, నొప్పివస్తే బాగుచేయడం, కొత్తవాండ్లనుచేర్చుకుంటూ గడువుతీరినవాండ్లను విడిపించడం, ఆవరణంలో జరిగే నేరాలకు శిక్షించడం, యిటువంటి పనులెన్నో వున్నవి. వీటిని నిర్వహించడానికి శాఖోపశాఖలుగల అధికారవర్గమున్నది. ఇవి యిండియాలోని ఆంగ్లపాలనాపద్ధతి వలెనే రెండంతస్తులుగా వుంటుంది. సాధారణంగా గవర్నరు మొదలు కలెక్టరువరకూ తనిఖీ అధికారం యావత్తూ తెల్లవుద్యోగస్థుల చేతులలో నున్నట్లే సూపరింటెండెంటు మొదలు వార్డరువరకూ అధికారం చెలాయించే భాగం వొకంతస్తూ, ఖైదీవార్డరు మొదలు ఖైదీమేస్త్రీవరకు మన నేటివ్వు ఉద్యోగులను బోలిన రెండవఅంతస్తుగా విభజించవచ్చు. పైశాఖవాండ్లు స్వతంత్రులు. క్రిందిశాఖవాండ్లు అస్వతంత్రులు. సూపరింటెండెంటూ, జైలరూ, డిప్యూటీజయిలరూ, ఛీఫువార్డరు, చిన్నఛీఫువార్డరు, హెడ్‌వార్డర్లూ, వార్డర్లూ అని షుమారు నూరుమంది సర్కారువుద్యోగు లున్నారు. ఇదిగాక గుమాస్తావర్గం, భండారవర్గమని రెండుశాఖ లున్నవి. ఆఫీసులో పెద్దగుమాస్తాను శిరస్తాదారన వచ్చును. భండారంశాఖవారు జయలులో చేయబడే వస్తువుల క్రయవిక్రయాలు జరుపుతుంటారు. సూపరింటెండెంటు పాలకవర్గాధ్యక్షుడు. జైలరు అతనికి ప్రధాని. సాధారణముగా చేతిపనులూ, క్రయవిక్రయాలూ యితను జరిపిస్తుంటాడు. సహాయజయిలరు భోజనపదార్థాలు తయారుచేయించి సకాలములో ఖైదీలందరికి అన్నవస్త్రాలు తయారుచేయించి యిప్పిస్తుంటాడు. వార్డర్లకు పైఅధికారిగావుండి ఖైదీలను అదుపులో వుంచేపని ఛీఫువార్డరుమీాద వుంటుంది. ఖైదీలచేత పనులు చేయించుతూ అదుపులోవుంచడం కొంతవరకు ఫారావేయడం వార్డర్లపని.

వార్డర్లకు తరువాతివాండ్లు ఖైదీవార్డర్లు. పాతనేరస్థులు యే వుద్యోగాలకూ అర్హులుగారు. పెద్దశిక్షలుపడి మంచినడవడిక గల వాండ్లను ఖైదీవార్డర్లుగా నియమిస్తారు. వాండ్లకు చక్కని తెల్ల షరాయి, చొక్కాలు, నడుముకు టంగు, తెల్లటోపీ. యిత్తడి పొన్నులలాటి అధికారచిన్హాలు. నెలకొకరూపాయిజీతం, వరెన్నం, మంచం, తాగా కుడవా లోహపాత్రలు, ఖైదుకాలములోనుండి పనిజేసిన కాలానికి నెలకు ౮ రోజులవంతున తీసివేత, ఇవే వీండ్లకు కలిగేలాభాలు. రాత్రి రెండుమాట్లు తడవకు రెండుగంటలవంతున ఫారాయిస్తూ పగలు వార్డర్లతో కలిసి ఖైదీలచేత పనులుచేయిస్తూ వుంటారు. వీండ్లక్రిందివాండ్లు ఓవరుశీయర్లు, తెల్లలాగు, చొక్కా టోపీ వీండ్ల అధికారచిన్హాలు. నెలకు ఆరురోజులు తీసివేత. మంచి నడతగల ఖైదీలందరు యీవుద్యోగం పొందడాని కర్హులు. రాత్రి రెండుగంటలసేపు సావిట్లో ఫారాయిస్తూ పగలు ఖైదీవార్డర్లతో కలిసి పనిచేయిస్తుంటారు. వీండ్లకు నెలకు అర్ధరూపాయిజీతం. నైటువాచర్లు లేక మేస్త్రీలు ఓవరిశీయర్లకు తరువాతివాండ్లు. అధి కారానికి గుర్తుగా రెట్టన యిత్తడిబిళ్ళ కట్టుకుంటారు. వీండ్లకు నెలకు నాలుగణాలు జీతం, నాలుగురోజులు తీసివేత. ఖైదీవుద్యో గస్తు లందరికీ కాలికడియాలు తీసివేస్తారు.

జైళ్ళు సెంట్రల్‌జయిళ్లు, జిల్లాజయిళ్ళు తాలూకా లేక సబ్‌జయిళ్ళు అని మూడువిధాలు. సంవత్సరం లేక అంతకంటె యెక్కువశిక్ష పొందినఖైదీలు సెంట్రల్‌ఖైదీలు. కొన్నిజిల్లాలకు కలిసి వొకసెంట్రలుజయి లుంటుంది. కొన్నిజిల్లాలలో జిల్లాజైళ్లుం టవి. వీటిలో ఒకసంవత్సరానికి తక్కువశిక్ష పడిన ఖైదీలను వుంచు తారు. ఇవి లేని జిల్లాలనుండి జిల్లాఖైదీలను సెంట్రలుకే పంపు తారు. సబుజైళ్ళలో కేసు విచారణలో నున్నవాండ్లనూ, నెల లోపు శిక్షలవాండ్లను వుంచుతారు. ఇదివరకు జన్మఖైదీలను మొదట బంకోలుకు, తరువాత అండమాన్లకు పంపుతుండేవారు. ఇటీవల నీ పద్ధతిమార్చి వీండ్లనుకూడా సెంట్రలుజయిల్లోనే వుంచు

తున్నారు. ఇప్పుడు ఘాతుకనేరములు చేసిన రాజకీయఖైదీలను మాత్రము ద్వీపాంతరము పంపుతున్నారు.

ఖైదీలు సివిలుఖైదీలు, విడిఖైదీలు, కఠినఖైదీ లని మూడు విధాలు. బాకీలుచెల్లింపజేసే నిమిత్తం డిక్రీదార్లు అరెస్టుచేయించే వాండ్లు సివిలుఖైదీలు. స్మాలుకాజు డిక్రీక్రింద ఆరువారాలు, అసలు డిక్రీలక్రింద ఆరునెలలు వీండ్లను ఖైదులో నుంచవచ్చు. వీరి భోజనఖర్చు డిక్రీదారే భరించుకోవలసి వుంటుంది. వీరికి నిర్బంధం తక్కువ. నేరస్థులుగా యెంచబడరు.

సివిలు లేక విడిఖైదీలకు వరకంలేదు. వీండ్లను నియమిత కాలాలలో భోజనం మొదలయినవాటికి బయటికిదీసి మిగిలినకాలం చావళ్ళలో తాళాలువేసి వుంచుతారు. కఠినఖైదీలతోపాటు వీండ్లు గూడా పనిజేస్తే వీండ్లుకూడా సంవత్సరానికి నెలవంతున శిక్ష తీసివేత పొందవచ్చును.

కఠినశిక్ష వేయబడినవాండ్లు పనిచేయవలసి వుంటుంది. బాగా పనిచేస్తే సంవత్సరమునకు ఒక నెలవంతున తీసివేత యిస్తారు. దీర్ఘశిక్షలు వేయబడ్డవాండ్లకు త్వరలో తేలే తేలికపను లిస్తారు. ఖైదీ లందరికీ వాండ్లసంఖ్య, శిక్షవేసిన తేదీ, విడుదలచేయవలసిన తేదీ చెక్కించి మెడలో బిళ్ళలు కడతారు. సంవత్సరపు లోపు శిక్షలవాండ్లకు చెక్కబిళ్ళలు, ఆ పై వాండ్లకు సత్తుబిళ్ళలు, జన్మ ఖైదీలకు తుత్తునాగపు బిళ్ళలూ యిస్తారు. జన్మఖయిదీలకు ఎఱ్ఱ కుళ్ళాయి, పాతనేరస్థులకు నల్లకుళ్ళాయి తక్కినవాండ్లకు తెల్ల కుళ్లాయి గుర్తులుగా వుంటవి. విడిఖయిదీలు తమ స్వంతదుస్తులు తెచ్చి కట్టుకోవచ్చు. లేనివాండ్లయితే సామాన్యకఠిన ఖయిదీల కిచ్చే చల్లాడం చొక్కా కుళ్లాయి చేతిగుడ్డ గోచీ యిస్తారు. కఠిన ఖయిదీల కందరికీ కాళ్ళకు యినుపకడియం వేస్తారు.

కొత్తజైలుకు నైరుతిమూలన ఆడవాండ్లజైలున్నది. వాళ్ల కాళ్ళకు కడియం వుండదు. జన్మఖయిదీలు ఎఱ్ఱంచుచీర, పాత నేరస్థులు నల్లంచుచీర, సాధారణఖయిదీలు అంచులేని తెల్ల

జామూరు కట్టుకుంటారు. ఖయిదీవార్డర్లు మొదలైన వుద్యోగస్తులు ఆడఖయిదీలలోనూ వుంటారు. వీళ్ళకు ప్రత్యేకంగా ఆడమనిషి సూపరింటెండెంటు. వారర్డర్లూ ఆడవాండ్లే. వీళ్ళందరూ పెద్దజయిలు సూపరింటెండెంటు అధికారానికి లోబడి వుంటారు.

ఈ జయిలులో చేసేపనులన్నింటిలోను రత్నకంబళ్ళ నేత వలన విశేషంగా ఆదావస్తుంది. వేలకొలదిరూపాయిల విలువగల తివాసులు యూరపు మొదలైన ఖండాలకుకూడా పంపుతున్నారు. అనేకరకాల అనలువేసి రత్నకంబళ్లు నేస్తారు. ఈ జయిలులోనే ఉన్నికి అనేకరకాలరంగులు వేస్తారు. ఒక్కొక్కప్పుడు పనితూగక రాత్రులుకూడా ఖయిదీలు నేస్తూనేవుంటారు. ఎక్కువపని చేసినందుకు మంచిభోజనం ప్రత్యేకరుసుము లేక యెక్కువతీసివేత యిస్తుంటారు. రత్నకంబళ్ళ నేత చిత్రంగా వుంటుంది. ఒకడుపాట పాడుతూంటే రెండవవాడు ఆపాటప్రకారం నేసి కోస్తుంటాడు. ఒకపువ్వు నేసేటప్పుడు మొదటివాడు యీక్రింది విధంగా పాడుతూంటాడు.

"సంటర్ లోనే మాయ (నలుపు) వుండాట. మాయపైన్నె మాయ వొకటీ. ఆ మాయపైన్నె మాయపక్కలోనే మూడు బోలు (బ్లూ) వుండాదీ. మూడుబోలు పక్కలోనే రెండు యిడచీ బోలువొకటి వుండాదీ. బోలుపైన్నె ముందుకు మాయవుండాదీ. మూడు మాయకు రెండుమాయ ముందుకు పోయేటట్టు వొక్క మాయపైన మాయ వొకటీ మళ్ళీ మాయ పక్కలోనే నాలుగు విడిచీ ఎరుపు వొకటి వుండాదీ. తెల్లమాయ కోసినావా ?"

జవాబు:- "కోసినాను."

"రెండుమాయ మూసిపోయిందీ మళ్ళీ పక్కలోనే మూడు విడిచీ నాలుగు తెల్లమాయ కోసుకో. ఒక్క తెల్లమాయ ముందుకు పోతాదీ"

ఈ విధంగా పాటా, నేతా జరుగుతూంటుంది. ఈ పాట చదివితే అగోచరంగా వున్నా, దాని ప్రకారం అనవేసి నేస్తే

చక్కని పువ్వు యేర్పడుతుంది. రత్నకంబళ్ళ నేత విశేషంగ వృద్ధిచేస్తే మిక్కిలి లాభకరమైన వృత్తి కావచ్చు. కోరిక ప్రకారం వందల అడుగుల పొడుగూ నెరవూ పెట్టి తివాసుల తయారుచేసి వేలకొలది రూపాయల కమ్ముతారు.

రత్నకంబళ్ళకు తర్వాత విరివిగా జరిగేపని చెప్పులు కుట్టడం. ఖైదీలలో చాలామంది పంచము లుంటారు గనుక యీ పని విశేషంగా సాగుతుంది. ఇండియా సైనికులకు క్రోం చెప్పులు సరసమైన ధరలకు చేస్తారు. వీళ్ళకు క్రోం చవుకగా దొరకడం చేత యితరచోట్లకంటె చెప్పులు చవకగా దొరుకతవి. బహుశా కూలి వూరికే రావడంచేత నేమో. జయిలుకు వెలుపల యిటికా పెంకూ కాల్పించి మంచి లాభం తీస్తారు. ముక్కరాయి కొట్టించడం, గులకసున్నం కాల్పించడం, నూలు సంచులూ, చాపలు, నవారు అల్లడం, కొబ్బరితాడు పేనడం మొదలైనవి ఆదాయంవచ్చే యితరవృత్తులు.

వ్యవసాయంవల్ల ధాన్యంకూడా పండిస్తారు. వర్షాధారం కనుకనూ, భూమి సారవంతం కాని ఎర్రనేల కనుకనూ ఖైదీల భోజనానికి చాలినంత ధాన్యం పండదు. కపిలెల క్రింద కూర గాయలు అమోఘంగా కాయిస్తారు. గుమ్మడికాయలు పరిమాణం లోనూ రుచిలోనూ మిక్కిలి శ్రేష్ఠములు. బళ్లకొలదిగా చిక్కుడు కాయలూ, వంకాయలూ, రామాఫలాలు, ముల్లంగిదుంపలు, ఉల్లిగడ్డలు, ఆకు కూరలు కొల్లలుగా పెంచుతారు. ఇన్ని రకాల కూరలు అగ్గవగా దొరికినా ఖైదీలకు విశేషంగా వుపయోగ పడేది ముల్లంగిఆకే. తక్కినవి లాభానికి అమ్మినా బాగానే వుండును. చాలాభాగం ఖైదీల క్రింద ఖర్చువ్రాసి నడిపింటివాళ్ళే తింటారు. జైలులో చేసే వస్తువులు, పంటలు అమ్మడంలో చాలా లాభం ఉద్యోగస్తులు తింటారు. ఆహారపదార్థాలు కొనడంలో దోపిడీ జరుగుతుంది. కొన్ని పదార్థాలు చాలాభాగం మాయంకూడా అవుతవి. నాలుగోవంతుకు తక్కువగాకుండా వుద్యోగస్తు లపహ రిస్తా రనడంలో అతిశయోక్తి లేదు.

ఖైదీలు అస్వతంత్రులు గనుక దీని నాపలేరు. అమెరికా, జర్మనీ దేశములలోని జైలుపాలనా పద్ధతి అవలంభిస్తే నరక కల్యాలుగా వున్న మన జైళ్ళు విద్యాలయాలు చేసి ఖైదీల వర్తన మార్చి సరియైన పౌరులను జేసి విడిచిపెట్టవచ్చును. అన్ని ప్రభుత్వ శాఖలలోను సంస్కరణ మవసర మన్నమాట వాస్తవమేగాని జైలు పాలనాపద్ధతి సమూలంగా రద్దుచేయడం మొదటి సంగతి. ఇది దిద్దితే బాగుపడేది కాదు. ఈ పాలనా పద్ధతి వలన వేలకొలది ఆత్మలు కురూపమును పొందుచున్నవి. వికారరూపం పడుతున్నది. ఖైదీ లందరు జైలు ప్రవేశించేటప్పటికంటె వెళ్లి పోయే టప్పుడు అనేక విధాల క్షీణిస్తున్నారు. జైలులో తప్పక దుర్నీతి అలవడుతుంది, ఆత్మగౌరవం నశిస్తుంది, మతం పోతుంది, బూతు లలవాటు పడుతవి, దేహబలం తగ్గుతుంది, ముకోపితనం అలవడుతుంది.

ఖైదీలవర్తన బాగుచేయడానికై జైళ్ళేర్పడ్డవనే భావం పై అధికారుల మొదలు వార్డరువరకూ ఒక వుద్యోగస్తునికీ గమనంలో వున్నట్టు ఆచరణలో కనపడదు. ఇంతకంటె కఠినమైన మాటలే వుపయోగించ వచ్చు. జైలు వుద్యోగులు నరకప్రాయమైన ఖైదీలను పాడుచేయడమే గాకుండా తామూకూడా పాడవుతు న్నారు. వాళ్ళలో దయా సత్య శౌచాలు పూర్తిగా నశిస్తున్నవి. మనుష్యత్వం పోగొట్టుకొంటున్నారు. ఖయిదీలూ వుద్యోగులూ కూడా భారతీయులేగనుక వుభయులకొరకూ దుఃఖించవలసిందే. భారతీయులు కాకున్నా చెడిపోయే ప్రతిమానవునికొరకూ విచారించడం ధర్మం.

ఆదాయం తెచ్చే పనులుగాక ఖయిదీల స్వంత వుపయోగానికై అనేకపనులు జరపవలసి వున్నవి. బియ్యం దంచడం, రాగులూ గోధుములూ విసరడం, పప్పుచేయడం, గానుగాడడం, నీళ్లు పంపుచేయడం, కుండలుచేయడం, కొబ్బరినార చాపలల్లడం

గుడ్డలూ గొంగళ్ళూ నేయడం, చల్లాడాలు చొక్కాలు కుట్టడం వైద్యం మొదలైనవెన్నో వున్నవి.

ఈజైలులో పన్నెండువందలనుండి పదహారువందల వరకు ఖయిదీలుందురని చదువరులు మరువనద్దు. వీరందరికీ తెల్లవా ఆరున్నరకల్లా, రాగి గటకో, వరి గంజో యేర్పాటుప్రకారం యివ్వక తప్పదు. మధ్యాహ్నం పదకొండుగంటలకల్లా పడి ప్రకారం అన్నం రాగిరొట్టెలూ సంకటి సాంబారుచేసి యేబ్లాకులో వాండ్ల కక్కడ వడ్డన జరుగవలసివుంటుంది. సాయంత్రం అయిదు గంట లయ్యేసరికి అదేవిధంగా జరపక తప్పదు. ఆలస్యమైతే ఆరు గంటలలోపల అందరినీ గదులలోపలపెట్టి తాళంవేయడానికి వీలుండదు ఉదయం వొక్కొక్కరికి నాలుగౌన్సుల బియ్యం లేక రాగిపిండి వంతున గంజికాచి యిస్తారు. మధ్యాహ్నం పిడిఖయిదీలకు యేడౌన్సుల వంతుననున్నూ, సాయంత్రం అందరికీ యేడుఔన్సులవంతుననున్నూ, పిండిగాని బియ్యంగానీ యిస్తారు. మధ్యాహ్నం, సాయంత్రం రెండవున్సుల పప్పు, లేక కూర, అరవున్సు నూనె, వుల్లిగడ్డలు, మసాలా, వుప్పు వేసి సాధకం చేస్తారు. గోధుమరొట్టెల వాళ్ళకూ పై లెక్కనే పిండి ఆధరువూ యిస్తారు. ఈ ప్రకారంగా రాజుగారి మహాసత్రం ప్రతిరోజూ జరుగుతుంది. అవిచ్ఛిన్నమైన యీ సత్రయాగం జరుపుతూ వందలకొలది ఖయిదీలు, వార్డర్లు, ఖయిదీవార్డర్లు దంపడం, విసరడం, వంట, వడ్డనపనిమీద వుంటారు. ఇది యెంతకష్టపుపనో సంతర్పణాలలో మెదిగినవాళ్ళకు గాని తెలియదు. రాగులు విసరడం, గానుగాడడం, నీళ్ళపంపు త్రిప్పడం, రాళ్ళు గొట్టడం మిక్కిలి కష్టమైన పనులు. దంపడం, విసరడం, వండడం కష్టమైనా ఖయిదీలకు అవి యిష్టమైనపనులు. వాళ్లు యిష్టంవచ్చినంత తిని యితరులకు పెట్టి పలుకుబడి సంపాదిస్తారు. ధనాకర్షణకూ, పొగాకుసంపాదనకూ వీలైనపనులు. కొందరు లోలాయలు విసిరే పిండికంటే బొక్కేపిండే యెక్కువ. చాలామంది సహాయనిరాకరణ ఖయిదీలూ యీ రకంవాండ్లే. పూర్వం బియ్యం ఆడఖయిదీలే దంపుతూండేవాళ్లు. ఈపని వాళ్ళకు

తెమలకపోతే సంచులు నేయడం మొదలగు సన్నపను లిచ్చేవరకు ంపే ఆడఖయిదీలకు సగంవాళ్ళు తీసింది. ఖయిదీలందరికీ ంగళ్లా చాపలూ నేయడం, లాగులూ చొక్కాలూ టోపీలూ ట్టడంపని చాలామందికి పడుతుంది.

దర్జాగల విడిఖయిదీలకు, ఖయిదీవార్డర్లకూ పళ్లెములూ, టాలూ యివ్వడం మామూలు. ప్రతిబ్లాకులో అక్కడ పడు ండే ఖయిదీలందరూ భోజనం చేయడానికి చెట్లక్రింద ఒకఅడుగు నపరిమాణం గల గచ్చుతిన్నెలు వేసివుంటవి. యెవరితిన్నె గ్గర వారు కూర్చుండి తిన్నెమీద మల్లపెట్టుకొని భోజనంచేసి డిగి ముంత అరుగుమీదబెట్టి మల్ల బోర్లిస్తారు. లెమ్మని వార్డరు వుత్తర్వు చేయంగనే అందరూ ఫైలులో అనగా నలుగురేసి వరు గా కూర్చుంటారు. ఎవరిబ్లాకులోనే వారు పనిచేయవలసిన యమంలేదు. వార్డరు వుత్తర్వు యీయంగనే అందరూ లేచి యిలు తప్పకుండా యెవరికార్ఖానాలోకి వాళ్ళు వెళుతారు.

ఖయిదీలందరూ వారివారిపనులలో నియమించిన టాసు (Task) యివ్వవలసి వుంటుంది. ఈయనివాళ్ళకు శిక్షవిధిస్తారు. ఈపని పూరా మధ్యమ కనీసములని మూడువిధాలు. సాధారణంగా ప్రతికఠిన ఖయిదీ పూర్తిటాసు యీయవలసి వుంటుంది. అశక్తతా వృద్ధాప్యం మొదలైనవానిచేత ఖయిదీలవల్ల తక్కువ పని పుచ్చుకోవచ్చు. పూర్తిపని యీయవలసినవాళ్ళకు మెడలో తెల్లదారం కడతారు. నల్లదారం కట్టిన వాళ్ళకు సగంపని. కనీసపుపని యివ్వవలసినవాళ్ళకు ఎఱ్ఱదారం గుర్తు. కడపటివాండ్లపని పేరుకుమాత్రమే.

ఖయిదీలు అనుసరించవలసిన నియమాలు క్లుప్తంగా చెబ్తాను. జైలుపుద్యోగులకు తగిన మర్యాదలు చూపాలి. చౌర్యం వగైరా నేరాలు చేయకూడదు. ఇతరబ్లాకుల వాండ్లతో మాట్లాడకూడదు. సంగీతాలూ ఆటలూ పాటలూ పనికిరావు. పొగాకు యేరూపంగానూ వుపయోగించకూడదు. ఫయిలు తప్పి నడువ

రాదు. భోజనపదార్థాలు దొంగిలించరాదు, మార్చుకోను కూడదు. వుత్తరువు పొందనిదీ కాగితాలు మొదలైన వ్రాత సామాగ్రి పుస్తకాలు వుంచుకోకూడదు. ఉద్యోగులమీదగాని ఖయిదీలమీదగాని తప్పుడుపిర్యాదులు చేయకూడదు. నియమిత స్థలాలలో తప్ప మలమూత్ర విసర్జనం చేయరాదు. కావలెనని వ్యాధి పెంపుజేసి పొడిగించకూడదు. ఎవరైనా వుద్యోగస్తులమీద తిరగబడితే వుద్యోగస్తులకు తోడ్పడవలెను.

ఇట్టివే నిబంధనలు యింకా వున్నాయి. ప్రతిఆదివారం ఉదయం లెక్కకాంగనే నిబంధనలు క్లుప్తంగా చదివి వినిపిస్తారు యే సెంట్రలుజైలులోనైనా ఖయిదీలు యెక్కువగా వున్నా మరి కొన్నింటిలో తక్కువగా వున్నా, యే ఖయిదీలైనా వాళ్ళ సెంట్రలు జైలులో వుండడం అనుచితమని తోచినా భాషా వివక్షత లేకుండా మరివొక చోటికి మారుస్తారు. నిడదవోలు సెంట్రలుజైలులో వ్యవహారం నిర్వహించే వార్డర్లంతా తెలుగు వాండ్లే. ఖైదీలలో పంజాబీలు, ఓఢ్రులు, ఆంధ్రులు, అరవలు, మలయాళీలు, కన్నడులు, సబులుండాగా అందరూ వున్నారు. ఒకరిభాష ఒకరికి తెలియదు. ఇతర భాషలు తెలియని వాండ్లకు జీవితం దుర్భర మవుతుంది. భగవంతు డిచ్చిన వాణినికూడా వుపయోగించ వీలులేదు. ఖయిదీలను మాటలు వచ్చిన మనుష్యుల్నిగా భావించరు. కాగితాలమీద ఖయిదీలసంఖ్య కావలసింది. పని చేయించేటప్పుడు వార్డరు తెలుగులో వుత్తరువు యిస్తాడు. ఖయిదీవార్డరు తనకు వచ్చిన యే భాషలోనో అరుస్తాడు. ఇవి రెండూ ఖయిదీలకు తెలియకపోవచ్చు. అర్థంగాక పని చేయనందుకు బూతులు తిడతారు. అవీ అర్థంకావు. అంతట లాఠీదెబ్బలు పడతవి. ఈ బాధలు పడలేక ఖయిదీలు మరొక జైలుకు మార్చమంటారు. అధికారు లీకారణం చాల వంటారు.

ఖయిదీల స్వల్పనేరాలు శిక్షించడానికి సూపరెంటెంటుకు అధికారమున్నది. పెద్దనేరాలు జరిగితే ముద్దాయీలను మామూలు కోర్టుకు పంపవలసి వుంటుంది. ఖయిదీలను కొట్టడం మొదలైన

శిక్షలు విధించడానికి ఒక్క సూపర్నెంటుకే అధికార ముంది. ఆయన తాబేదారులకు లేదు. ముక్కోణాన కొట్టడం, చీకటికొట్లో పెట్టడం; కొట్లలో వొంటరిగా పెట్టి తాళాలు వేయడం, అడ్డబేడీలు, నిలువు బేడీలు, కఠినపుపని విధించడం, పస్తు పెట్టడం, తక్కువన్నం పెట్టడం, మందలింపు మొదలైన శిక్షలు సూపరెంటు స్వయంగా విచారించి విధించడానికి అధికారము వున్నది.

ఊళ్ళోవుండే పెద్దమనుష్యులను సూపరెంటుకు తోడ్పడడానికి ప్రభుత్వమువారు కొందరిని నియమించవచ్చు. వీరిని విజిటర్లంటారు. వీరు సాధారణంగా జీహుజూరులై వుంటారు. ప్రభుత్వ పద్ధతిలో తప్పులేమీ వీళ్ళకు కనపడకూడదు. ఎవరైనా సాహసించి దోషాలు కనపరిస్తే మళ్ళీ వాళ్ళను నియమించరు. వీరు ఖయిదీలకు భోజనాదులు సక్రమంగా జరుగుతున్నవో లేదో, విచారించి సూపరెంటుకు తెలియపరచ వచ్చును. ఖయిదీలను వుద్యోగులు కొడితే విచారించి శిక్షించడానికి తమకు కూడా అధికార మున్నదని వీళ్ళకు తెలియదు. స్వదేశీవాండ్ల తగాదాలలో ఈ సంగతి బైటపడ్డది.

జైలుకు సంబంధించిన ఒక చిన్నబడి, ఆస్పత్రి వున్నవి. బాల ఖయిదీలకు రోజూ వొకగంట చదువు చెపుతారు. చదువుకొని బాగుపడ్డ వాండ్లెవరూ కనపడరు. ఐ. జి. గారు సంవత్సరపు తనిఖీకి రాబోయే ముందు కొన్ని పిల్లలపేర్లు జేర్పిస్తే వాండ్లు విశ్రాంతిగా ఒక గంటసేపు వస్తూపోతూ వుంటారు. ఆసుపత్రులలో కొన్నిచోట్ల సూపరెంటే డాక్టరుగా వుంటాడు. దీనంత చెడుపద్ధతి మరొకటి లేదు. ఈయనకు సహాయంగా కొందరు సర్జనులు కాంపౌండర్లు వుంటారు. కొయినా, విరోచనాలమందు కట్టుగుడ్డలు మాత్రమే ఇక్కడ సమృద్ధిగా దొరికే ఔషధ సామగ్రులు. తక్కిన మందులు వెదుకవలసిందే.

అవతారికగా జైలు సంగతులు కొన్ని చెప్పబడ్డవి. వీటి సహాయంతో చదువరులు తరువాతి అధ్యాయములను ఓపికతో

చదివి మహాజనులు జైలు సంస్కరణానికి పూనుకొంటారని తలుస్తాను.

౨

సన్యాసం

రామదాసు, పుల్లప్ప, మహాలక్ష్మి ఉదయం యేడుగంటలకు నిడదవోలు స్టేషన్‌లో దిగారు. వారిని తీసుకొనివచ్చిన నలుగురు పోలీసులు ఉదయకాల్యాలు తీర్చించి యెనిమిదిగంటలకు సెంట్రలు జైలుకు తీసుకొనిపోయి వొప్పజెప్పారు. ఆడవాండ్లకు వేఱే జైలు వుంటుందనీ, భార్యాభర్తల వియోగంకూడా సంభవిస్తుందనీ నిడదవోలు వచ్చిన తర్వాత జవానులు చెప్పారు. రామదాసు సద్గురునామము సంస్మరించి యిప్పటికి పూర్తైయిందని అన్నాడు. మాలక్ష్మి అందరివెంబడి నడచి వచ్చిందన్నమాటే గాని తనపై తా నెఱుగదు. ఇటువంటి సమయములలో ఆమెకు మాట్లాడకుండా వూరుకోడం మామూలు. రామదాసు వంక కన్నెత్తి చూడలేకపోయింది. జయిలు దగ్గరకు రాంగనే వార్డర్లు ముగ్గురిని సాధ్వీనపర్చుకొన్నారు. రోడ్డుకు యెడమప్రక్కగావున్న అడ్మిషను ఆఫీసులో డిప్యూటీజైలరు కూర్చుని వున్నాడు. పెరియలు లాయపిళ్లె చాలా సర్వీసు గలవాడు. మనిషి పొడగరి. చామన చాయ. దేహం ముడతలు పడ్డది. సూటు తొడుక్కున్నాడు గాని ధోవతి కట్టుకున్నట్టయితే ఆయన కున్న అరవజాడ్యం మఱుగు పడేదే. కండ్లు చాలా యెఱ్ఱగా వున్నవి. సర్దుకొని కుర్చీలో కూర్చుండి కొత్త ఖయిదీలను తెమ్మని వార్డరుకు సైగ చేశాడు. మన ముగ్గురు ఖయిదీలనూ హాజరు పెట్టారు.

పిళ్లె:- దాన్ని ముందు తరాజులో యెక్కించు.

వార్డరు:- తరాజుమీద యెక్కు.

మాలక్ష్మికి తరాజు యెక్కడమంటే అర్థం కాలేదు. ఇటువంటి ప్రతాసు యెన్నడూ ఆమె చూడలేదు. తోచక నిలుచున్నది.

పిళ్ళ:- ఎక్కవేమే ?

మాలక్ష్మి:- ఎక్కడ?

పిళ్ళ:- ఆ లంజకు చూపించవే ఎక్కడ యెక్కుతారో.

దగ్గర నిల్చున్న వార్డరమ్మ కలుకుచూపులు పిళ్ళగారిపై నెగడిస్తూ మాలక్ష్మిని చెయిపట్టి టరాజుమీదికి యెక్కించింది.

పిళ్ళ:- దిగు. పేరు చెప్పు.

మాలక్ష్మి:- నాపేరు మాలక్ష్మి.

పిళ్ళ:- తీసుకపో యిక, దాన్ని క్వారంటైన్ లోకి.

వార్డరమ్మ నడవమన్నది. మాలక్ష్మి మెడ పక్కకు దిప్పి రామదాసువంక బిక్కచూపులు చూచి కండ్లు తేలవేసి " మళ్ళీ చూడడం వున్నదా ? " అన్నది.

రామ:- సద్గురూ, వాడిదయ ప్రకారం జరిగితీరుతుంది.

మాలక్ష్మి:- పిల్లలసంగతి తెలిస్తే, నాకు కబురుచెయ్యి.

వార్డరు:- చేస్తారులే పద.

పుల్లప్ప:- (రహస్యంగా) వీళ్ళను యేదోమాట చెప్పి లోగట్టుకోవాలి. ఆ యేర్పాటు తర్వాత నే జేస్తాను. డబ్బుంటే కొండమీది కోతి దిగివస్తుంది.

పిళ్ల:- ఆ ముసలివా ణ్ణెక్కమను. అ౦—౧౧౦ పౌనులు తూగావు. దిగు, నీ వెక్కు—౧౮౦ పౌనులు.

పుల్లప్ప:- నిన్న గుంటూరు రైలుస్టేషన్‌లో తూచుకుంటే ౧౯౦ పౌన్లు న్నాను. ఒక్క రోజుకే పదిపౌనులు తగ్గానా ?

పిళ్ల:- ఒరే వార్డరు ! నీ లాఠీ యేమైంది ?

వార్డరు లాఠీతో మోదాడు. పుల్లప్ప కొంచెంసేపు విల విల్లాడి ఘూరుకున్నాడు.

పిళ్ల:- ౧౮౦ పౌన్లు యెల్లా తూగావో తెలిసిందా ? జెయిలు పడి దిని ఘూరుదువుగాని. మీ యిద్దరికీగూడా రాగిపడి వేశాను.

పుల్లప్ప:- ఆ ముసలాయనకు తీర్పులో రైసుపడి వ్రాశా రండి. మే మెన్నడూ రాగి తినియెరగం.

పిళ్లే:- ఔనురా. మీరంతా మాలదొరలు. సన్నబియ్యం, చిన్నచేపలూ కావాలి.

వార్డరు:- (రహస్యంగా) ఆ సంగతంతా నేజెప్తాతా పదండి.

పిళ్లే:- తీసుకొనిపో.

వార్డరు యిద్దరినీ క్వారంటులోకి తీసుకొని పోయినాడు. పదకొండుగంట లైంది. బాగా యెండ గాస్తున్నది. గేటువార్డరు సోదాచేయించాడు. పుల్లప్ప గుడ్డలన్నీ విడిచి కుప్పపెట్టాడు. రామదాసు ధోవతి విడవడానికి సందేహిస్తున్నాడు.

వార్డరు:- విడవవేమిరా.

రామదాసు:- ఏదైనా గోచీ యిప్పించండి.

వార్డరు:- గోచీ గావలెనా? విడువు.

అని లాఠీయెత్తి గూడమీద పొడిచేవరకు యెముక కదిలింది.

రామదాసు:- సద్గురూ! ఈ అభిమానంకూడా యింతటితో వదిలిపోయింది. ద్రౌపదినీ గోపికలనూ యిట్టిస్థితికి దెచ్చే రక్షించావు. పుట్టినప్పటి స్థితిలోకి దెచ్చావు. బాలులకుండే నిష్కపటహృదయంకూడా దయచెయ్యి!

రామదాసుకూడా ధోవతివిడిచి దిగంబరుడై నిలువబడి అప్రయత్నంగా ఎడమచెయ్యి అడ్డం పెట్టుకున్నాడు.

వార్డరు:- బీడీ లేమైనా దాచిపెట్టుకున్నావా? చెయ్యి అడ్డం పెట్టుకుంటున్నావు.

రామదాసు:- స—రే—సద్గురూ—తీశా.

వార్డరు:- కూర్చోండి—లేవండి.

కూర్చోండి—లేవండి.

నీ పేరేమి? పుల్లప్పా. ఇరకబట్టుకొని కూర్చుంటా వేమి? చప్పున కూర్చో. లాఠీ విఱుగుతుంది.

పుల్లప్ప చప్పున కూర్చున్నాడు. ఎక్కడనుండో రెండు బేడలు కింద రాలినవి. ఓవర్సీయరు యేరుకొని నీళ్లుపెట్టి కడిగి ఒకబేడ గేటువార్డరు కిచ్చి రెండవది తానూ ఖయిదీవార్డరూ తర్వాత పంచుకున్నారు.

వార్డరు:- వీడిదగ్గర యింకా యెన్నివున్నవో నోరు పగల దీయించండి.

పుల్లప్ప:- ఇకనేమీ లేవండి సామితోడు.

వార్డరు:- సరే ఆగోచీ పెట్టుకోండి. గొరగరా వీళ్ళకు.

పుల్లప్పకు మంచిజుట్టు వున్నది. కుఁయి కఁయి మనకుండా కూర్చున్నాడు. కత్తి చిత్రంగా వుంది. దూదిబస్తాలకు చుట్టేరేకును ఒకపక్క రాతితో సాగగొట్టి రాతిపలకమీద పదును పెట్టారు. తల తడపలేదు. జుత్తు యెడంచేత లంకించుకొని ముందుకులాగి రేకు పెట్టి వెనుకకు దోకాడు. ఒకసారి పీతోలు వూడింది. గాట్లు పడ్డాయి. పుల్లప్పకు చేస్తూంటే రామదాసు పక్కనిలబడి చూస్తు న్నాడు. జుట్టుపట్టుకొని తలగొరగడం చూసి శిఖ మిగులుస్తారను కొన్నాడు. చుట్టూ పూర్తి కాంగనే గేటువార్డరు పరుగెత్తుకొని వచ్చి పుల్లప్పజుట్టు పట్టుకొని నిల్చున్నాడు. తనిఖీవార్డరుకూడా వచ్చి పట్టుకొన్నాడు. ఉభయులూ లాగులాడుతున్నారు.

పుల్లప్ప:- అయ్యా! నాప్రాణాలు పోతున్నవి. విడవండి.

రామదాసు:- అత డేమితప్పు చేశాడండీ?

ఎఱుకలమంగలి:- పోరా కామాటినాయీ! నీ కేం తెలుసు? అయ్యా! మీయిద్దరికీ తగాదా లేకుండా నే చెఱిసగంగా పంచి పెడతా.

వార్డరు:- నిన్న నా యిన్‌చార్జిఖైదీవి నేను కక్కసులోకి పోయివచ్చేటప్పటికి అంతా తను మూటకట్టుకొని బేడ కమ్ముకు

న్నాడు. దాంట్లో భాగం యిస్తే యిందులో సగం యిస్తా. లేకపోతే యిదంతా నాకు రావలసిందే. ఇందాకటి బేడలోది ముందు అణా యివతలపెట్టు. లేకపోతే రిపోర్టు చేస్తా.

గే. వా:- రిపోర్టుకు నే భయపడేవాణ్ణికాను. నిన్నటివి వట్టిబిఉసు వెంగ్రుకలు. ఇవి పట్టుకుచ్చుమోస్తరుగా వున్నవి.

పుల్లప్ప:- నాప్రాణం పోతున్నది. జుట్టు విడిచిపెట్టి భాగాలు తెగదెంపు చేసుకోండి. ఇంతకూ అసలువాడికి నాకేమీ భాగం లేకుండా జేస్తారా?

వార్డరు:- నీ డెవడో గడుసుముండాకొడుకురా. రేపు నీకు ఆరు బీడీ లిస్తాము.

పుల్లప్ప:- నోట్లోకో.

గే. వా:- చూస్తాములే.

పుల్లప్ప:- రెండు బేడలూ వూడబెఉక్కుంటిరి. ఈ పొద్దు గతేమి?

వార్డరు:- ఈవేళ సాధ్యంకాదు. తెచ్చిందైపోయింది. సాయంత్రందాకా బైటకుపోము. ఎక్కడైనా దొరికితే చూస్తాము. సోదాలో దొరికిన బేడలుకూడా రాసినజేర్చి అంతా చెరిసగం చూసుకుందాం.

మంగలి:- ఇవ్వాళ క్రీప్రకారం పోసీయండి.

ఉభయ వార్డర్లూ రాజీపడ్డారు. జుట్టునొరగంగనే గేటు వార్డరు పొదంగా జేర్చి మూటకట్టుకున్నాడు. పుల్లప్పకుమాత్రం పీడవదిలినట్లు తేలికగా వుంది. లేచినిలువబడి,

పుల్లప్ప:- నోరు తుత్తరవుగా వుంది. ఏమైనా పెట్టరా?

గేటువార్డర్లకూ పుల్లప్పకూ దోస్తీ కుదిరింది. పొగాకు ముక్క తుంపి చేతికిచ్చాడు.

పుల్లప్ప కనకం యిచ్చినట్లుగా సంతోషించి ఒకతుంపు విఉచి నోట్లోవేసుకొని రెండవది గోచిలో దాచిపెట్టుకున్నాడు.

రామదాసుయొక్క తలవూచి వూబచెత్తవలె నాలుగుపోచ లున్నవి. వాటికోసం యెవరూ తగాదా పడలేదు. మంగలి క్షణంలో యావత్తూ వరసబెట్టి దోకాడు. రామదాసుకండ్లకు నీళ్లు వచ్చినవి.

రామదాసు:- కొంచెమైనా శిఖ వుంచరా?

మంగలి:- ఖర్చు అయిపోతుందనా ఏడుస్తున్నావు! (అని అంటూ యావత్తు జుత్తూ గొరిగాడు.)

రా:- సరే యిక్కడికి సన్యాసం పూర్తైయింది. అయితే "తలలు బోడులైతే తలపులు బోడులా" అని వేమన్నగారు అన్నారు.

పు:- మీకు రెండూ బోడులే.

రా:- అయితే బలవంత సన్యాసం అయిందోయ్.

పుల్లప్ప:- అట్లాకాదు. కాయ పండి యెండి రాలింది. నేను మీ అండను చేరాను. ఎప్పటికైనా జ్ఞాపకం వుంచుకోండి.

తర్వాత యిద్దరికీ కాలికి యినపకడియం బిగించారు. "మీకు బిళ్ళ దెచ్చి మెళ్ళో గడతారు. అదీ కడియం తుప్పుపట్టకుండా తెల్లగా తోముతుండండి. నల్లబడితే లాఠీ విఱుగుతుంద"ని వార్డరు చెప్పాడు. ఇద్దరికీ చెరి వొకముంతా మల్లా యిచ్చి ప్రతిదినం కూర్చుని భోజనంచేసే తిన్నె చూపించాడు. రెండోమాటు బూర వూదారు. క్వారెంటులోవున్న నూటయేభై మంది ఖయిదీలు పని చాలించివచ్చి యెవరిముంతలు వాళ్ళు తీసుకున్నారు. క్వారంటువార్డరు 'రైజ్' అనీ, ఓవర్సీరు 'లేప్!' అనిఅన్నారు. రామదాసుకు అర్థం తెలియకపోయినా పుల్లప్ప తక్కినవాండ్లూ లేస్తే తానూ లేచాడు. మళ్ళీ వార్డరు 'డౌన్' అనేవరకు అందరూ కూర్చున్నారు. రెండుమాటలూ రామదాసు సందర్భాన తెలిసికొన్నాడు. వార్డరు ఫయిలని వుత్తరువు చేయంగనే అందరూ నాలుగుబార్లు తీరి కూర్చున్నారు. 'రైస్' 'మార్చ్' అనంగనే అంతా లేచి బయలుదేరారు. అందరూ

త్వరగా నడవడంలో రామదాసు కొంచెం వరస తొలిగాడు. ఫెడేలుమని లాఠీ భుజంమీదకి దిగింది. రామదాసు అదరిపడి నిలువబడి చూచాడు. జనం తోసుకొని వస్తున్నది. వార్డరు 'హాల్టు' చెప్పి లైను యెందుకు తొలిగావని కర్ర యెత్తాడు.

రామదాసు:- నాకు తెలియదు. చెప్పకూడదా?

వార్డ:- ప్రతి కొత్త గాడిదెకు చెప్పేవరకు నా నోరు నొప్పి యెత్తుతున్నది. నోటితో చెపితేమటుకు జ్ఞాపకం వుంటుందా? లాటీతో చెపితే మరిచిపోరు.

అంతా నీళ్ళకుండు దగ్గరకు బోయి ఒంటి బారుదీటి నిలవబడి అల్లరి లేకుండా ఒకరి తర్వాత వొకరు ముంచుకొని నలుగు రేసి ఫయిలులో నిల్చున్నారు. వార్డరు మార్చి చెప్పంగనే బయలుదేరి తిన్నెలదగ్గరకు వచ్చి ఎవరిచోట వాండ్లు కూర్చున్నారు. ఇనపమంచాలమీద గుడ్డలుకప్పి మోసుకొనివచ్చి దిమ్మెలదగ్గర అన్నమూ రొట్టెలూ దింపారు. వాటివెంటనే సాంబారు గంగాళం వచ్చింది. నూటయాభైమందికని రెంటిమీదా వ్రాసివున్నది. వార్డరు రైజ్ చెప్పంగనే అంతా వొంటిఫయిలున వచ్చి యెవరిపడి వాళ్ళు వరసగా తీసుకొని అక్కడనుంచి సాంబారు గంగాళందగ్గరకు బోయి తలావొక జొన్నపులుసు పోయించుకొని తిన్నెలదగ్గరకు వచ్చి కూర్చుని అన్నం దినడం ప్రారంభించారు. రామదాసుకూ పుల్లప్పకూ పడి రాలేదు. పుల్లప్ప వార్డరును అడిగితే యీ పూటకు కావలసిన సామగ్రి పొద్దున ఇచ్చారు. మీకు పడి సాయంత్రానికి కాని రాదన్నాడు. మంచంమీద ఒక రొట్టె మిగిలివున్నది. వార్డరు అది తుంపి చెరిసగం పంచిపెట్టి మిగిలినపులుసు చెరికాస్తా పోయించాడు. రామదాసుకు వుల్లిగడ్డ ఇష్టంలేదు. పులుసు గాలుకొట్టింది. అది ముల్లంగి ఆకు పులుసు. పుచ్చినవీ ముదిరినవీ కొన్ని ముల్లంగి దుంపలుకూడా అందులో వేశారు. తుంగా గటికె యేరి వెయ్యలేదు. తెల్లని పురుగులు పైన తేలుతున్నవి. పుల్లప్ప వార్డరుకు చూపించాడు. పుణ్యానికి

పుట్టెడి స్తే పిచ్చకుంచమని పోట్లాడుతున్నావా అని అన్నాడు. రామదాసు పులుసు వదిలి రొట్టె తిన్నాడు. అప్పుడే శెంట్రలు జైలులో రామదాసుకు ఒకపూట గడిచిపోయింది. వార్డరు 'రైస్' చెప్పంగనే లేచి మల్లలు కడిగి తిన్నెలమీద పెట్టి యే పనికి పోవలసినవాళ్ళు ఆ గుంపుగా ఫయిలు కూర్చున్నారు. రామదాసుకూ పుల్లప్పకూ పడి యేర్పాటు చేయలేదుగాని పని యేర్పాటు చేశారు. సుత్తెయిచ్చి ముక్కరాళ్ళు కొట్టమన్నారు. మొదటిరోజు గనుక 'టాసు' యిమ్మని బలవంతపెట్టలేదు. రెండు గంటలకు అందరినీ కక్కసుకు వదలారు. పాకీపనివాడు చెకుముకి రాతితో నిప్పుకొట్టి వుంచాడు. బీడీలు ముట్టించుకొని ఒకర్ని ఆనుకొని ఒకరు కూర్చుని సందేహ నివృత్తి చేసుకొన్నారు. రామదాసుకు మొదటి రోజులలో సందేహంగా వున్నది కాని మధ్యాహ్నం సోదా అయిన తర్వాత జంకు తీరింది. పాతజైలు పాకీదొడ్డిలో ఒకరొకరికి మధ్య అడ్డగోడ లున్నవిగాని కొత్త జైలులో ఆ పద్ధతిమార్చి అడ్డంలేకుండా ఒక్కటేగది యేర్పరిచి నేటీవుల మూఢాచారాలు పోగొట్టి నాగరికత నేర్పారు. కొత్త జైలులోకూడా పూర్వపు యేర్పాటుప్రకారం ప్రతిసావిట్లో దొడ్డికి అరగోడలు పెట్టిఉండేవి. ప్రతిసావిట్లో పదముగ్గురికి పడుకునేందుకు మట్టి అరుగులుంటవి. ఇప్పు డాపద్ధతి మార్చి మట్టి అరుగులబదులు చక్కటి పాలగచ్చు టరుగులు వేయించి దొడ్డి స్థలంలోగూడా మరి రెండరుగులు గట్టించి స్థలంలో పే స్తరుతీశారు. మానం పోయినా గచ్చుటరుగులు వచ్చాయి. మలమూత్రపు కుండలూ సావిట్లో బహిరంగంగానే పెడతారు. అందరి యెదటా కూర్చోవలసిందే. నిజానికి జైలుకు చోటు కఱవులేదు. వేలకొలది యెకరాలు చుట్టూవున్నవి. ప్రతిబారకాసు చుట్టూ విశాలమైన ఆవరణం వున్నది. దానిలో రస్తాలు, పూలచెట్లుకూడా వేస్తారు. ఇంత స్థలం వున్నా సావిళ్ళలో అధికార్లు సీతిబెట్టి స్థలం పెచ్చు దీస్తారు. స్థలలాభంకంటె నీతి ముఖ్యమైనదని మన వుద్యోగులైనా

చెప్పరు. ప్రారంభంలో వున్న మంచియేర్పాట్లు మార్చి దుర్నీతి నేర్పేపద్ధతులు కొత్తగా యెందుకు అవలంబిస్తున్నారో తెలియదు.

పూర్వం ఆంగ్లేయులు మన ఆచారాలు యెక్కువ గౌరవిస్తూండేవారా? లేక మనవిద్యాధికులు నాగరికులై కొత్తపద్ధతులు యేర్పరిపిస్తున్నారా? ప్రారంభంలో సోదాచేసేటప్పుడు దిగంబరులను చేయవలసిన అవసర మేమున్నది? అవసరమున్నా బహిరంగంగా యెందుకు చేయడం? గోచీలలో డబ్బు బీడీలు దాచుకుంటారని ఒకజవాబు చెప్తారు. ఇంత శల్యపరీక్ష చేసి ఒక కేసైనా రిపోర్టవుతున్నదా? జైలులో చుట్టతాగనివాం డ్లెవరు? ఉద్యోగస్థులు చేయకూడని పనైనా బహిరంగంగా జైలులో చుట్టలు తాగడంలేదా? నూటికి తొంభై మంది ఖైదీలు పొగాకు యేదో ఒకరూపకంగా రోజూ వుపయోగించేవాండ్లే. అదివరకు చుట్ట అలవాటు లేనివాళ్ళుకూడా జైలుకు వచ్చినానికె కొత్తగా చాలమంది నేర్చుకుంటారు. కులాసావస్తువని కదా జైళ్ళలో పొగాకు నిషేధించారు. పాతకమనిగాదు. గొప్పదుర్వ్యసనమూగాదు. ఖైదీ లనుభవించగల కులాసావస్తు విదియొకటే. "కౌపీనసంరక్షణార్థమయం పటాటోపః" అని జైలులో చుట్టతాగితే మేజస్ట్రీటువద్ద రెండు సంవత్సరాలు శిక్ష. ఒక కేసూ మేజస్ట్రీటుకు పోదు. పోనీ, ఆపగలిగారా?

ఈ జైలులోకి ప్రతిదినం యెంతలేదన్నా ఒక అర్థమణుగు పొగాకు, బీడీకట్టలు, నాలుగురూపాయిల పొడుమూ రానేవస్తున్నవి. నిర్బంధాలవల్ల ఖరీ దెక్కువకావడం, చట్టవిరుద్ధమైనది గనుక ఖయిదీలకు బాధలు తప్ప యీనిషేధంవల్ల ఇతరప్రయోజనం కనుపడదు. ఖయిదీలు మొదటవచ్చేటప్పుడు ఒకటిరెండు బీడీలు దాచిపెట్టుకుంటా రనుకోండి. అవి యెన్నాళ్ళు వస్తవి! పొగా కంతా వార్డర్లే తెచ్చి అమ్ముతారు. బైటిపనికి పోయేకూలీలు తెచ్చేది గేటులో సాధారణంగా ఆపవచ్చు. గేటువార్డరు నాయకా సోదా జేస్తుంటాడు; గాని వార్డర్లు కాని ఖయిదీలుగాని తెచ్చే

ొగాకు పట్టుకోడు. ఏ వార్డరైనా విరోధంచేత ఖయిదీదగ్గర ొగాకు పట్టుకుంటే ఖయిదీని శిక్షిస్తారుగాని అది యెక్కడనుంచి చ్చిందో నిగ్గదీసి విచారణ చేయరు. ఈ నిర్బంధములవల్ల ఖయి లను క్రిందివుద్యోగస్థులకు లోబరచడందప్ప మరొకలాభం కన డదు. కాస్త పచ్చిగల ఖయిదీ జైలులోకి రాంగనే వార్డర్లు మలో పోటీలుపడి అతనిని తమ ఖాతాదారుగా యేర్పర్చు ంటారు. ఖయిదీవార్డర్లు, ఒవర్సీయర్లు చిల్లరదుకాణదార్లని చెప్ప చ్చు. వీళ్ళకు వార్డర్లు సప్లయిచేస్తూంటారు. పచ్చిగల ఆసాము కు వార్డర్లు పెట్టుబడిపెట్టి యింటిదగ్గరనుండి తమపేర రహస్యంగా ుణియార్డర్లు తెప్పించుకుంటారు. వచ్చినపైకం చెఱిసగం. అంతా ార్డ రనుభవించడమూ కద్దు. చాలామంది వార్డర్లను నమ్మరు. ళ్ళకు పాకీవాడే కోశాధికారి.

ఒక సూపరెండెంటు ఒక న్యాయస్థుణ్ణి గేటుసోదాకు నియ ంచి పొగాకు దిగుమతి ఆపవలె నని చూశాడుగాని మూటలు గేటుద్వారా రావడంమాని రాత్రులు గోడలు దూకడం మొదలు పెట్టినవి. వెదురుగెడలకు మూటలు తగిలించి సంకేతస్థలములో ోడమీదుగా లోపల విడిస్తే లోపల పహరాచేసే ఖయిదీవార్డర్లు అందుకొని గెడ బైటికి వేసేవారు. ఉభయులకూ సాంకేతికపదా ుంటవి. వార్డర్ల కిది పెద్దవర్తకం. బాగా వ్యవహారం సాగేవాండ్లు ోజీలుగా తలా పదిరూపాయిలు సంపాదించుకుంటారు.

దీని నింతట సిలిపి పొగాకువల్ల యెట్టిబాధలు కల్గుతున్నవో పనిబడ్డప్పుడల్లా ముందు చెబుతాను. పుల్లప్పా రామదాసూ దొడ్డి పని దీర్చుకొనబోయినారు. ఆ సావిట్లో గట్టిన నీళ్ళ గచ్చుతొట్టి మూడుకావిళ్ళు బడుతుంది. పాకీవాడు తగినన్నినీళ్లు వుంచవలె. సాధారణంగా ఒక కడవనీళ్లైనా వుండవు.

రాము:- నీళ్లు లేవేమోయ్.

పాకీ:- మొట్టన గొట్టండిరా యీమాలనాయుణ్ణి. ఎవరికీ అవసరం లేనినీళ్లు యీమాలవాడికి కావలసివచ్చినవి. ఈ వచ్చిన నూరుమందికీ నీ వేమి తలకట్టువా ?

రామదాసూ పుల్లప్పా మెదలకుండా గోచీపెట్టుకొని వెళ్ళి పోయినారు. పుల్లప్ప యెక్కడిదో బీడీ సంపాదించుకొని తా తున్నాడు.

రామ:- ఎంగిలి బీడేనా ?

పుల్లప్ప:- కాదండి నాస్వంతమే. నే నొక బుద్ధితక్కువప జేసా. రెండుబేడలు రాలిపోగా యింకా వొకటి నిల్చింది.

రామ:- అసాధ్యుడవే. బీడి అంతా తాగినట్లు లేదే.

పుల్లప్ప:- సగం దాగి పక్కవాడి కిచ్చా. వాడు సాయ త్రం నాకో దమ్మిస్తాడు. మిగిలినతుంపు పాకీవాడి కిచ్చాము జైలులోకల్లా వాడిదే అదృష్టం. తాగినన్ని బీడీముక్కల దొరుకుతవి.

రామ:- అన్నట్టు వాడితో యేదో రహస్యం మాటాడ తున్నావు !

పుల్లప్ప:- యేదోలే పోనీయండి. తమకు చెప్పవలసినది కాదు.

రామదాసు:- చెప్పవోయ్. నాదగ్గ రెందుకు దాస్తావు సంగతులు తెలిసికోవాలె.

పుల్లప్ప:- యేమైనా చీవాట్లు పెట్టండి. చేసినతప్పు చెబుతాను. నిన్న అయిదురూపాయల బేడలు మింగా. రెండురోజు లలో అన్నీ బైటికి వస్తవి. పాకీవాడితో తీసి వుంచమని చెప్పా.

రామదాసు:- ఇదంతా నిజమేనా ?

పుల్లప్ప:- తమతో అబద్ధమా !

రామదాసు:- ఏం చిత్రం ! పాకీవాడు లేవంటేనో ?

పుల్లప్ప:- ఒకమాటు వా డాపనికివస్తే యితరులు నమ్మ తారా ? ముద్రసుద్దిగా తీసి వుంచుతాడు. లెక్క మనకు తెలి సిందేగా. పెట్టెలో దాచిపెట్టుకున్నట్టే. వాడికీ ఒకపావులాడబ్బులు ముట్టజెబుతా.

రామదాసు:- సరే పద. ఇది వొక కొత్త ప్రపంచం, క్రమంగా గాని ఏ లోకవ్యవహారాలైనా తెలియవు.

## 3

### ఎంత కఠినశిక్ష !

అర్ధభోజనంతో పొద్దుగూకులూ యెండలో పనిచేయడం చేత రామదాసు ముట్టగిలబడ్డాడు. సుత్తె లేవడంలేదు. ముఖం అగ్గివగిలింది. నడుమనడుమ అలుపు దీర్చుకుంటూ చేతనయినంత వరకు కొడుతున్నాడు. ఖయిదీవార్డరు వచ్చి,

ఖ-వా. అరే, కామాటినాయీ, కూర్చున్నావు లోలా యల్లో చేరుతావా ?

పుల్లప్ప:- ఆయన బతికిచెడ్డమనిషి. ఈ నాటి కీతిప్పలు వచ్చినవి. కడుపులో యెత్తులేనిదీ సుత్తె యెట్లా లేస్తుంది. మధ్యాహ్నం వస్తేఆయే.

వార్డరు:- మీ శిఫారసులు చూస్తె నాకు గొంతుమీదికి వస్తుంది. నాకిచ్చిన మనుషులనుబట్టి నే పని వప్పజెప్పాలె. రేపు నల్లదార మెయ్యమని దొర నడుక్కొంటమ్మను.

బూర వూదారు. రెండవసారి వూదేలోపల కురదలాలు పూర్తిచేసుకొని బంతిగా బయలుదేరి దిమ్మెలదగ్గరకుబోయి అంతా నీళ్ళు దెచ్చుకున్నారు. మిశ్రపడివాండ్లందరికీ ఆవేళ అన్నపుముద్దలు వచ్చినవి. రామదాసు అన్నముదీసుకొని పులుసు బోయించుకున్నాడు. వుప్పుడుబియ్యపు అన్న మెన్నడూ అతడు చూడలేదు. పత్తివిత్తుల కుడితిమోస్తరుగా పులుసున్నది. ముడి కందులు నానబోసి వడకట్టి ముద్దబడదంపి కాగేపులుసులో పిండి వేసి వండి నూనెపోస్తారు. పూర్వం పప్పుజేసి సాంబారుచేసేవారు. పొట్టుతో దింటే బలమని డాక్టర్లు శిఫారసు చేశారట. కందులు పొట్టుతో జబ్బని పెసలు పొట్టుతీస్తే జబ్బని అనుభవాన్నిబట్టి మనకు దెలుసు. డాక్టర్లు బతికివున్నవాణ్ణి చచ్చాడంటే మనము

వొప్పుకొని తీరవలసిందే. అప్పటికి నెలరోజులనుండి కొత్తపద్ధ అవలంబిస్తున్నారు. సగంమందికి పాసనాలు బుట్టినవి ఖయిదీలంత లగ్గలకెక్కారు. చాలామంది జబ్బుపడితే చెడ్డపేరు వస్తుంద దొరభయపడితే క్రమంగా అలవాటుపడి సర్దుకుటుం దంటాం పిచ్చయశాస్త్రి.

సూ:- మనకు కొత్తవాం డ్లెప్పుడూ వస్తూనేవుంటారు ఇద్దరు జాయాకూడా అయినారు.

పి:- ఈ జబ్బులు చాలా సటస. ఇంకా చూడాలె.

సూ:- ఇంతమంది జబ్బుపడ్డందుకు మనం పైకి సంజాయిషీ వ్రాయాలె.

పి:- వీండ్లది గహాణికింద చేర్చక జ్వరం తలనొప్పికూడ వున్నది గనుక వాటి ంద చేర్చుదాము.

సూ:- ఏదో మాటరాకుండా చూడు. అయినా కందు వుపయోగించమని వుత్తరువు లేదు. సరిపడుతుందేమో చూడవ న్నారు.

పి:- అంటే సరిపడేటట్టు చూడవలసిందనికూడా వుత్తరువ ధ్వనిస్తున్న . సరిప లేదంటే చాలదు. తగినన్ని కారణాలుకూడా చూపాలె.

అందుమీాదట కందులపులుసే ఖాయపరచారు.

రా:- ఈ బి ద్యం ఈదేశానివి గామాలె. గంద్ర మెతుకు లరిగేనా?

పుల్లప్ప:- కడుపులో కాలుతుంటే అరగక తిరుగమళ్ళ తనా? పులుసు తప్పక అడ్డంబడ వేస్తుం దంటారు. కసిపెట్టితినండి.

రా:- ఈ పీచుదుంప లేమిటి?

పు:- ముల్లం గిదుంపలు. పొద్దున వేసింద పీటికె కే. ఈ పసరే సగం రోగాలకు మూలమంటారు. ఈ దుంపలు చాలాకాలందింటే చెన్నపట్టణపుజబ్బు వస్తుందంటారు.

రామ:- ఇదేమిపులుసు? దీంట్లో ఉప్పు, పులుసు, కారము మూడూ లేవు. ఈభోజనంవల్ల ఇంద్రియనిగ్రహం సులభంగా పట్టుపడుతుంది.

పు:- ఆఁ. అన్నిధ్యాసలూ పోతవి. అసలు ఇచ్చే ఉభయాలలోనే వుప్పూ కారం మధ్యం. దానికితోడు కత్తిరింపు. వొట్టుకు మీరు మనకే లాభమంటారు. మనుష్యులనందరినీ సన్యాసం పుచ్చుకోమంటారా?

ఆకలి రుచెరగదు. కందులపులుసుతో వుప్పుడుబియ్యపన్నమంతా తిన్నారు. పుల్లప్పకు ఆగలేదు. మల్లిగిటి గుజ్జుదింటున్నాడు. వేళ్ళసందులు నాకాడు. నాలుక పెదవులు నెమకింది. అన్న మరుగుముఖమై తేపాడు. పొద్దుగూకుతున్నది. వార్డరువచ్చి లెమ్మన్నాడు. అందరూ లేచి సావిళ్ళముందు వరుసగా కూర్చున్నారు. వార్డరు లెక్కపెట్టుకున్నాడు. ఫక్తు క్వారంటుకు కొత్తగా వచ్చినవాండ్లను ౨౦ మందిని వొంటికొట్లలో వేశారు. అవి చాలక రామదాసునూ, పుల్లప్పనూ, ౨౦ మంది బయటపని చేసే ఖయిదీలను, సూపరింటెంటుగారి యింట్లో పనిచేసే వంతుకూలీలను కలిపి కాలికడియాలలోగుండా తీగెదూర్చి కట్టి పెదసావిట్లో వేశారు. చదువరులు మేకలను దొడ్లలో కట్టివేసేపద్ధతి ఎరిగే వుంటారు. ప్రతిమేకకూ మెడకు తమ్మెతాడు వుంటుంది. దాంట్లోగుండా పొడుగాటితాడు దూర్చి చివరలు కట్టివేస్తారు. మేకలన్నీ చెదరకుండా వుంటవి. గాడిదగుంపులను మఱొకవిధంగా కడతారు. చిన్నతాళ్లుపెట్టి ఒకదానికాలు రెండవదానికి కడతారు. అన్నిటికీ లంకెవేసి ఒకదానినిమాత్రం గుంజకు కట్టివేస్తారు.

కొత్తఖైదీలకెవ్వరికీ యింకా నారచాపలుగాని గొంగళ్ళుగాని దుస్తులుగాని యియ్యలేదు. కొత్తలు ముప్పదిమందికిగాను పదహేనుగురికి మాత్రం చింపిరిగొంగళ్ళిచ్చారు. వీండ్లలో పది మందికి ఒంటికొట్లిళ్లు దొరికినవి. తక్కిన ఐదుగురికీ చింపిచాపలు మాత్రమిచ్చారు. పుల్లప్పగండ్రగొండితనంచేసి చిన్నవైనాచాపా గొంగడీ సంపాదించుకున్నాడు. రామదాసుకు ఏమీదొరకలేదు.

పుల్లప్ప తనగొంగడి రామదాసుకిచ్చాడు. చాపకూడాయియ్యవస్సి పుచ్చుకోలేదు. అందరినీ సావిట్లోకి తీసుకొనిపోయి గోడవైపక తల పెట్టించి రెండువరుసలుగా పడుకోబెట్టారు. కాళ్లు చాపుకుంటె మయాన వొకగజం మెల్లా వుంటుంది. కాళ్ళ కడియాలగుండ పొడుగుపాటి గొలుసు దూర్చి రెండువైపులా కట్టివేశారు. రెండ బార్లవాండ్లకు కలిపి నలుగురేసిమందికి నడుమ అందికెలో వుండే టట్టుగా పెద్ద మలమూత్రపు మల్లలు రెండు బెట్టారు. బయట వెన్నెల వుందిగాని తలుపులు కిటికీలు భార్లాతీసిపెట్టినా లోపల గబ్బగీముగా వున్నది. అడివికి గాసినవెన్నె లయింది. నక్షత్ర రూపములు పొందిన భగవత్సంకల్పాలు ఖయిదీలహృదయాలలో సత్సంకల్పాలను జనింపజేయడానికి అవకాశం కలుగజేయడంలేదు. పండువెన్నెలలోగాని గాఢాంధకారములోగాని ఆకాశసౌందర్యా న్ననుభవించేభాగ్యం ఖయిదీలకు లేదు. ఎంత కఠినశిక్ష!

౪

## సొంత యిల్లు

వార్డరు తాళాలు వేయడమే తడవుగా ఖైదీలంతా చెకు ముకిబిళ్లలు గొట్టి బీడీలు, చుట్టలు ముట్టించారు. చీకట్లో జుంజుర్లు వెలిగినట్లు వెలుగుతున్నవి. రామదాసు కిటికీకిందుగా పడు కున్నాడు. ఇద్దరు ఖయిదీలకు తరువాత పడుకున్న పాతఖయిదీ యెవ్వడో కిటికీకి వెలుపల పడేటట్లు వెయ్యవలెనని కేకరించి వుమ్మాడు. అది అంత దూరము పోక కిటికీకింద పడుకున్నమనిషి మీాద పడడం చూచి పకపక నవ్వుతూ పక్కవాండ్లతో తానెట్లా తుపుక్కున వుమ్మివేసింది, అది దూరంబోక లప్పెదు ముసలివాడి మొగాన ఎట్లా పడ్డదీ; వాడు చపటపెద్దమ్మలాగు తుడుచుకొని వూరుకొన్నదీ రంగవలకు పలవలు చేర్చి వర్ణించి చెపుతున్నాడు. వాడు రాజమండ్రిజయిలులో మునుపు పుల్లప్పకు పాత స్నేహి తుడు. వాండ్లు కడుపుబ్బ నవ్వుతున్నారు. ఒకడు కోమటిహాస్యం చెబుతున్నాడు. మరికొందరు, వొకడు బంగారక్క, వొకడు

కేతిగాడు, వొకడు జుట్టిపోలిగాడు పాత్రలుగా ఎంచుకొని వాటికి తగిన వలపుపాటలు పాడుతున్నారు. "నిన్న దెచ్చిన నీలిచల్లాడం" అనే పదం కేతిగా డెత్తుకున్నాడు. చావిడంతా నవ్వులతో బద్దలయిపోయింది. ఆ పాట ముగియంగనే బంగారక్క యేంజేస్తున్నదని కొందరు రసికులు కేకలు వేశారు. బంగారక్క పాత్ర చివాలున లేచి "మొన్న దెచ్చిన మొగ్గలరవిక" అని చరణ మెత్తుకొని కీచుగొంతుతో పాడుతుంటే జనంలో రక్తి ఆకాశ మంటింది. వీధిభాగవతంలో మాధవి వేషం వేసిన ఒక గొల్లవాడు తన అరవంధం పెనిమిటిమీది పదాలు పాడితేనేగాని మజావుండదని లేచి పాడడం ప్రారంభించాడు.

"కొట్టొస్తడే నాకు నవ్వొస్తదే (యీడిజిమ్మడ)
కొట్టొస్తడే నాకు నవ్వొస్తదే
కూరుచుంటె లేవలేడు కూరచట్టి దింపలేడు. కొ॥

తక్కినవాండ్లు దరువు వేయడం మొదలుబెట్టారు. చప్పట్లు మిన్నుముట్టినవి.

పు:- నీవేనుట్రా కాముడూ, ఇంతసేపటినుంచీ యెవరో ననుకుంటున్నా.

కాముడు:- పుల్లప్పవా! మహారాజా హాజరయినావ్. మగసిరి అంటే నీదిరా. నా మనసువచ్చినవాడివి. నామర్దా పని చేసిరాలేదుగదా? దొంగదాసరివాడు చారెడోపిడిపని కెప్పుడూ దిగడు. ఎన్నేండ్లు వేయించుకొచ్చావు?

పు:- చెప్పుకోడానికి నాకే సిగ్గుగావుంది. సీటాట్టుకేసే. తొమ్మిదినెలలు వేశాడు. వాడి సొమ్మేమో పోయినట్టు.

కా:- సిగ్గులేక చక్కబిళ్ళ వేయించుకొని వచ్చావుటరా? నీవు రెండుసార్లు వేయించుకొన్న శిక్షగూడా మునుపు నాకు రిమిషన్ యిచ్చినంత లేదు. ఇప్పుడు మళ్ళీ రాజాగా పదేండ్లు వేయించుకొని వచ్చా. నన్నికకదిలించేవాండ్లు లేరు.

పు:- ప్లీడరును బెట్టుకొని వాదించుకున్నావా?

కా:- అటువంటి పనెన్నడూ చేయను. గాంధీమహాత్ముడు చెప్పినట్లే ప్లీడరును పెట్టుకోకుండా జడ్జీతో "నన్నేమీ అడగవద్దు. నీ యిష్టము వచ్చినట్టు చేసుకో" అని చెప్పా.

పు:- అవురాపులి! మొగాన గొట్టినట్టన్నావే!

కా:- మ ఱేమనుకున్నావు? వాడూ మొగాన గొట్టినట్టే పదేండ్లు శిక్ష చెప్పాడు.

పు:- గాంధిగారిని ఎవరూ పట్టుకో లేరుట.

కా:- మనిషి యెదర కనపడుతూనే వుంటాట్ట. పట్టుకుంటే చేతికి తగలడుట. బొంబాయి గవర్నరు గాంధిగారిని సముద్రపు గట్టున నిలుచోబెట్టి కొట్టితే తగలలేదట. సేనానాయకుడిని పిలిచి స్వయంగా కత్తితో నరకమని వుత్తరువిస్తే కత్తి ఎత్తేవరకు అట తాచుబాామంత మల్లెదండై చేతికి చుట్టుకున్నదట. ఆయన బుద్ధిపూర్వకంగా పట్టుబడిడేతప్ప నరమానవుడికి చిక్కడు.

పు:- ఒరే కామన్న, నీవు యిన్ని మంచిసంగతులు తెలిసినవాడివి యిండా కా పెద్దమనిషిమీద అట్లా వుమ్మేశావెందుకు? ఆయన యెటువంటివాడనుకున్నావు? ఏదో కర్మంబొసిగి వచ్చాడు గాని మనబోటివాండ్లం వెదకినా దర్శనం దొరకవలసినవాడు గాడు.

కా:- పొరపాటుపనే జరిగింది. అటువంటి వాండ్లంటే ముందుగా చెప్పవద్దా? స్వామీ! నే వెయ్యవలెనని వెయ్యలేదు. ఈ తప్పు గాయండి.

రా:- దాని కేమి. పొరపాటు ఎవరికయినా వస్తుంది. అందుకోస మింతగా ప్రాధేయపడడ మెందుకు?

కా:- చిత్తం. యోగులు వుమ్మేస్తే తుడుచుకొనిపోతా రంటారు. ఇదే కామాలె. అయ్యా గాంధిగారినిగురించి ఆగుబ్బగా జెప్పుకుంటున్నారు. మన కేమయినా లాభం చేస్తారా?

రామ:- మహానుభావుడు పూనుకున్నాడు. ఎవరిబాగు వాండ్లు చేసుకోవాలె. మనంకూడా ప్రయత్నం చెయ్యాలె.

ఇంతసేపటినుంచీ మీరు ఇన్నిమాటలు మాట్లాడుకున్నారుగదా. వాటివల్ల నోరు చెడడం తప్ప చింతాకంత లాభ మున్నదీ?

కా:- నిజమేకాని మాకు కాలం జరిగే దెట్లా? సందలు మాకంగనే లోపలికి బంపిరి. పొద్దు పొడిచేదాకా యెంతసేపని నిద్రబోతాం. ఎట్లాగో కాలం వెళ్ళబుచ్చుకోవాలె. మాలో కొందరం చదువుకున్న వాండ్లంకూడా వున్నాము. కాస్త తిల్లికె బెడితె గోరుకొయ్యలు నెత్తిమీదికి వచ్చిందాకా చదువు కొందుము. మీ బోటివాండ్లు యేవయినా మంచిసంగతులు చెపితే వినవచ్చు. ఏదీ వల్లకాదంటారు. ఉత్తరవులేకుండా రామాయణం వెంట దెచ్చుకున్నాడని యిప్పుడు ఒక భద్రరాజు ఖైదీ మీద కేసు విచారిస్తున్నారు.

రా:- ఈ జయిలుపద్ధ తేర్పాటుచేసినవాండ్లకు మతి వున్నట్లు కనపడదు. సెటిల్‌మెంట్లల్లోగాని జైళ్ళలోగాని వేలకొలది జనాన్ని బాగుచెయ్యడానికి అవకాశమున్నది. తెలియకడుగుతాను. నాకొక్కమాట చెప్పు. నీవు మీ వూళ్ళో కాలువకుపోతే శుద్ధి చేసుకోవడం అలవాటుందీ?

కా:- మా దాసర్లంతా చెంబుదీసుకపోవడం అలవాటున్న వాండ్లె. సీటాక్టు మూలంగా యెంతలేదన్నా మా వాండ్లను ౨౦౦ మందిని జయిలుకు బట్టించారు. అప్పటినుంచీ అలవాటు తప్పి పోయింది.

రా:- జయిలుకు వచ్చి నేర్చుకున్న మొదటిసంగతి ఇదా?

కా:- రెండోది స్నానం జెయ్యకపోవడం. పొద్దుగూకులూ చెమటబెట్టి పనిజేస్తాం. దంపు, మోట, మట్టిపని చేసేవాండ్ల వొళ్లు దుమ్ముకొట్టుకొని పైపై బేజారై వుంటుంది. దులుపుకొని పడుకుంటాం. వారానికొకమాటు ఆదివారం గుడ్డలుతుక్కోడానికీ, స్నానం చెయ్యడానికీ, యెడ మిస్తార్లుగాని నీళ్ళియ్యరు. భావిదగ్గర ఒకతొట్టిలో నీళ్ళుపోసి పాతికెమందని తొట్టిదగ్గర నిలువబెట్టి ఒక ఖైదువార్డరు తొట్టిలో నిలువబడి దోసిటితో మా

మీాదికి నీళ్ళుజిమ్ముతాడు. మనిషికి రెండుమూంతలయినా పయిన బడవు.

రా:- ఇదా వారస్నానం? లోపలకూడా యిదే మోస్తరా?

కా:- అంతా ఒకటే వరవడి. పశువుల మోస్తరుగా కట్టి వేయడం మాత్రం తప్పుతుంది. ఉదయం ఆరుగంట లయ్యేవరకు ఖయిదీలలెక్క తేలుతుంది. ఏడుగంటలలోగా బయలుకు పోవడం, నీళ్ళు తెచ్చుకోవడం, మొగం కడుక్కోవడం, భోజనం చెయ్యడం పూర్తిఅయి పనికి హాజరుకావాలె. గుడ్డివాండ్లు కాకపోతే ఇవన్నీ ఒక గంటలో యెట్లా అవుత వనుకుంటారు? రూలు ప్రకారం రాత్రులు విధిలేనప్పుడు తప్ప యితర సందర్భాలలో గదిలోపెట్టిన కుండలలో మలవిసర్జనం చేయకూడదు. రెండు కారణాలచేత ఈ రూ లెవ్వరూ పాటించరు. తాళాలు తియ్యకపూర్వమే అందరూ గదులలోనే విసర్జనం చేస్తే గంజి తాగేవేళకు పైలుకు అందుకోవచ్చు. పని యేడుగంటలకు ప్రారంభమవు తుంది. తాళాలు తీసిన తర్వాత బయలుకు పోవలసివస్తే వేళకు పనికి బోవడం తెమలదు. పాకిదొడ్లు కుస్సందులు. ఒకరినొకరు ఆనుకొని కూర్చున్నా ఒక పర్యాయం ౨౦ మందికంటె ఏ లుండదు. రెండు వందల మందికి తక్కువ లేని బ్లాకులో మానం బోగొట్టుకుని కూర్చున్నా కనీసం గంటబడుతుంది. అందరికీ పడకసావిట్లో నివర్తిచేసుకోవడం సాధ్యంకాదు. ఎవరికి యేవేళకు అవకాశం చిక్కుతుందో నిలుకులేదు. ఉదయం అవకాశం చిక్కని వాండ్లు తొమ్మిది గంటలకు విడిచినప్పుడు పోతారు. ఈ అకాల విసర్జనల వల్ల స్వాభావికమైన అలవాట్లు చెడి, ఆకలితగ్గి, విరేచన బద్ధకాలూ, గ్రహణిబాధలూ, పాసనాలూ అర్ధాన్నం తింటూన్నా తేపా వస్తూంటవి. నిబంధనలూ, ఖయిదీలబాధలూ, యెట్లా వున్నా వార్డరు తనకు మాటరాకుండా యేడుగంటల లోగానే భోజనాలు పూర్తి అయ్యేమార్గం చూసుకుంటూ ఉదయం పాకీ

దొడ్డికి తాళంవేసి వుంచుతాడు. రెండవ కారణంకూడా బలమైనదే. గదులలోనే నివర్తి చేసుకుంటే తోటీ పని చేయ నవసరం లేదు. పాకీదొడ్లో నీళ్ళు ఖర్చుకూడా వుండదు. ఉదయం లేవంగనే ఆయాగదులలో పాకీ కులాలకు సంబంధించిన వాండ్లందరూ కుండలు మోసుకొనిపోయి దిబ్బదగ్గర విడుస్తారు. 'దేవుడు వరమిచ్చినా పంబి వర మివ్వ'డని వార్డరు వాలాయుకం తీస్కోడానికి పదినిముషాలు తలుపుతీసినా తోటీ తన కిష్టులనుతప్ప తక్కిన వాళ్ళను చేరకుండా పొరకతో కొడతాడు. ఎక్కడికి బోయినా డబ్బులేనివాడు డుబ్బుకు కొఱగాడు. అదిగాక ఉదయం తొమ్మిది గంటలకు సూపరింటెండెంటు శుభ్రంగా వుండుస్తున్నదీ లేనిదీ తనిఖీచేయడానికి, అప్పుడప్పుడు వస్తుంటాడు. ఖయిదీలు వుదయం దొడ్డి వుపయోగిస్తే తొమ్మిదిగంటలలోపల శుభ్రచేయడం తోటీకి కష్టం. వార్డరుకు మాట వస్తుంది. అందువల్ల దొరవచ్చి చూచే వరకూ దొడ్లో కెవరినీ పోనీయరు.

రామ:- కొత్త పెద్దదొడ్లు కట్టి మరికొంత వ్యవధానం యిస్తే యీ చిక్కులు బోను.

కా:- వందలూ వేలూ జీతాలు తినడానికి తప్ప యీసంగతులు ఆలోచించేవాళ్ళెవ రిక్కడ ?

రామ:- నీ యిదివరకు ఖయిదు కెన్నిమాట్లు వచ్చావు ?

కా:- ఇది మూడోసారి.

రా:- ఏమినేరాలు చేశావు ?

కా:- మొదటిసారి కఱవురోజులలో ఒకపర్యాయం గడ్డిదిన్నా. దానికి బందిపోటు నేరమని మూడేండ్లు వేశారు. రెండోసారీ యీసారీ వట్టి అభాండాలు వేసి కేసులు పెట్టారు. నేరాలు జరిగినమాట వాస్తవమేగాని అవి మావల్ల జరుగలేదు. ఆ చేసిన వాళ్లు యిప్పటికీ దొంగతనాలు చేసి పంచుకుంటూనేవున్నారు. వట్టివాండ్లం యేడుగురం రెండోకేసులో వచ్చిపడ్డాము. ఈరెండు కేసులలోనూ ఆరుగురుమాత్రం యీకేసులలో చేయకపోయినా

అప్పుడప్పుడు సంచారం పోతున్నవాళ్ళే. నే ప్రమాణంచేసి చెప్పుతాను. ఈ కేసులో వృథాగా నాకు పాతనేరస్తుడ నని పదేండ్లు పడ్డది. అయితే నేను చింతపడడంలే దనుకోండి.

రా:- ఎందువల్ల?

కా:- మొదటి కే సయినతర్వాత నాపెళ్ళాం రెండేళ్ళు చూచి యింకొకణ్ణి తీసుకొని లేచిపోయింది. రెండోసారి అయిదేళ్ళు పడ్డప్పుడు మాఅమ్మ నాపద్నాలుగుయేండ్ల పిల్లవాణ్ణి పెట్టుకొని రెండేండ్లు నెట్టుకువచ్చి కాలం జేసింది. తర్వాత పిల్లవాడు చెడుసావాసాలు మరిగి యేదో దోపిడీ కేసులో యెవడో ఖూనీజేస్తే వీడుకూడా ఆ గుంపులో వున్నాడని పదేండ్లు వేశారు. వాడు కన్ననూరు జైలులో వున్నాడట. నాకు ప్రపంచంలో యిక నెవరూ లేరు. బైట నా కేం పని? మొదటి రెండుమాట్లూ గలసి తీసివేత పోను ఆరేండ్లు ఖయిదుచేశాను. బయట నలుగురిలో తలయెత్తుకొనితిరగడానికి మొగం చెల్లదు. చేసినా చెయ్యకపోయినా దొంగని నామొగాన వ్రాశారు. అడుగు కదిలించడానికి వీలులేకుండా వేటకుక్కల మోస్తరుగా పోలీసువాండ్లు వెంటబడతారు. పొరుగూరుపోతే మునసబుకు రిపోర్టుచేసుకోవాలి. ఇదంతా యెందుకు వచ్చినశ్రమ! మొదటిసారి యేమనుకున్నా ఈ మూడో తడవ రెండువేలజీతం తినే జడ్జీకీ, బంగారపు గడియారపు గొలుసులు వేసికొని వచ్చిన పంచాయతీదార్లకూ, పోలీసులకూ, తప్పుసాక్షులకూ వేయిదణ్ణాలు పెట్టుకుంటున్నా ఇక పదేళ్ళవరకు జైలువాళ్ళు పెట్టినంత దిని తోచినంతపని జేస్తూ గుండెనిమ్మళంగా ఉంటాను. నే నింకా బ్రతికి బైటికి బోతినా పోలీసువాండ్లకు దయవచ్చి నన్ను తిరగనిచ్చినంతకాలం ఇష్టంవచ్చినన్ని దోపిళ్లుజేసి పదరూపాయల చేమెల్లాతో మళ్ళీ నాస్వంతయింటికి వస్తాను.

అని చెప్పేవరకు కళ్ళలో తేజస్సు కళకళలాడింది. చీకట్లో యెవరూ గమనించ లేదు.

రామ:- నీసొంత యి ల్లెక్క డ?

కామడు:- 'రామాయణ మంతా విని రాముడికి సీత యేమి గావాలె' నని అన్నాడట నీబోటివాడు. ఇంతసేపటినుంచీ నే చెబుతున్న దేమిటి? బైట నా అన్నవాళ్లు లేరు. స్నేహితులు లేరు. ఉన్న నలు సొక్కడూ నామోస్తరుగానే జైలురొట్టెలు దింటున్నాడు. ఒకగుడిసె వుంటే మావూరు ఆసామీ మాఅమ్మ చావంగనే చొప్పదొడ్లో గల్పుకున్నాడు. నే వెళ్ళినప్పుడు అడిగితే నీపేరు గలవాండ్లు యెన్నడూ యీవూరిలో కాపురమే వుండలేదన్నాడు. నాకు అయినవాళ్ళంతా యిక్కడనే వున్నారు. ఇదే నాయిల్లూ, నావూరూ, నాలోకం, స్వర్గం నరకంగూడా యిదే. నేనుమాత్రం ఒక బుద్ధితక్కువపని జేశా. రెండో కేసైన తర్వాత నాలుగునెలలే పోలీసువాండ్లు బైట వుండనిచ్చారు. దీపం వుండంగనే చక్కబెట్టుకోవలసింది. మడిగట్టుకొని కూర్చుంటే నా వెంటబడ రనుకున్నా. నేను మావూరు బోంగనే మా మునసబు తినకు భాగం యిస్తే నన్ను రెక్కలు గప్పి కాస్తా నన్నాడు. చోరీలకు నే వొప్పుకోలేదు. ఆయనసలహా విని వ్యవహారమే సాగించినట్లైతే లక్షణంగా తిని తాగి పాతికరూపాయలు మిగుల్చుకొని జైలులోకి రాంగనే ఛీపువార్డరు మొగాన్న పదిరూపాయీలు పారవేస్తే నాయిష్టంవచ్చినట్లు లోలాయలాగా తిరగనిచ్చేవాడు. అర్ధరూపాయి పారవేస్తే రెండుపూటలా నెలరోజులు యెక్కువ ముద్ద లిస్తారు. నా కిచ్చేరాగిపడి అమ్ముకుంటే చుట్టపోరు గడుస్తుంది. అదీ చెడగొట్టుకున్నా. అయ్యా! ఒక్కమాట చెపుతాను. ఈ ప్రపంచంలో న్యాయానికి కూడులేదు. ఏదో విధంగా పదిడబ్బులు పోగుచేసుకున్నవాడే వుత్తముడు.

శ్లో॥ యస్యాస్తి విత్తం స నరః కులీనః స పండిత స్సశ్రుతిమాన్ గుణజ్ఞః
స ఏవ వక్తా సచ దర్శనీయః సర్వే గుణాః కాంచన మాశ్రయంతే."

అన్నాడు.

రా:- నీ వేమి చదువుకున్నావు?

కా:-మానాయన బాగా చదువుకొన్నవాడు. ఆయన వున్నంతవరకు అట్టహాసంగా వున్నవాళ్ళమే. నాకు తెలుగులో బాగానే

డొక్క-శుద్ధి అయింది. 'శతశ్లోకేన పండితః' అని పది శ్లోకాలు కూడా యేకరువుపెట్టా. అపండితులదగ్గిర పండితుడి ననిపించుకుంటూ పిత్రార్జితం కాస్తా అప్పులకు బెట్టి లోకంమీాద బడ్డా. ఇంత బడిచెప్పుకునా న్న జీవనం జరిగేది. దానికి పరీక్ష లైతేనేగాని వల్లకాదన్నారు. ఇప్పుడు నేనేం పరీక్షలకు బోతా? సరే మళ్ళీ నా కథ ప్రారంభిస్తా. ఇప్పటికైనా మించిపోయింది లేదు. మా అమ్మతాలూకు పూసాబుట్టా అమ్మినబాపతు యిరవై రూపాయిలున్నవి. వాటిలో పదిరూపాయిలు పిల్లవాడికి పంపి, అయిదు రూపాయలు ఫీపువార్డరు కిచ్చి తక్కినదానితో పొగాకుబేరం పెడతా. దానిమీాద నెలకు రెండు రూపాయలు తీయవచ్చు. అర్థరూపాయ ఖర్చుపెట్టానంటే రెండుపూటలా యెక్కి తొక్కుతున్న ఆ వరిబియ్యపు అన్నం. ప్రయోజకుడైతే యెక్కడైనా కాలం బాగానే గడుపుకుంటాడు. ఇదివరకు నా దగ్గిర ఒకలోపం వుండేది. అది దిద్దుకుంటా.

రా:- ఏమి టాలోపం?

కా:- న్యాయంగా పోవలె ననుకోవడమే. దానిమూలంగానే చెడ్డా. నా పూర్వకథ యెత్తుకుంటే యిది స్పష్టంగా రుజువౌతుంది.

'ఆల్ యీాజు హెల్' అని పారావార్డరు కేకవేశాడు.

రా:- సమయాని కన్నావు. నే నిదివరకు సెటిల్‌మెంటే నరకమనుకున్నా. ఇది దానిని మించివున్నది. దీనికే రౌరవ మని పేరు పెట్టవచ్చు.

కా:- కాసేపు వూరుకోండి. వాడు రౌండుదిరిగి వెళ్ళుతాడు. తర్వాత మళ్ళీ ప్రారంభింతాము.

౫

దేవుడి చరిత్ర

కా:- పోయినాడు. పారా మారిపోతుంది. రెండవవాడు వచ్చేవరకు స్వయంరాజా స్వయం మంత్రి. కాకపోతే మట్టుకు

వీడుచేసే దేమున్నది? వంగితే నెత్తి కెక్కుతాగు. అది ప్రపంచ స్వభావం. ఈ వాగ్దర్లది ౧౨ రూపాయల బండారం. దానికే పీండ్లకు మెడమీద తల నిలవదు.

రా:- అయ్యా! మీకు ఆక్షేపణ లేకపోతే మీ పూర్వ చరిత్ర విపులంగా చెప్పండి. మీ నామధేయ మేమి?

కా:- నా పూర్వపుపేరు కామా నాయుడు. అడిగారు గనుక పెద్దలు చెప్పుకుంటున్నా. పుణ్యమా పురుషార్థమా?

రా:- మానవుడి చరిత్రంటే దేవునిచరిత్ర. గడ్డిపూచ చరిత్ర కూడా అటువంటిదే. సృష్టిలో ప్రతి వస్తువూ గమనిస్తేచాలు గాని భగవంతుని చరిత్ర వెల్లడిస్తుంది. కవులు వ్రాసిన కృతిమ చరిత్రలు భగవల్లీల లని చదువుతారుగాని, మహాకవి రచించిన ఈ సృష్టికావ్యం చదవగలవాడికి ప్రతిఅణువూ భగవల్లీలలనే బోధిస్తుంది. చదువగలవాడికే కాదు; ఆ కవి ప్రతివాండ్లచేత తాను రచించిన మహాకావ్యం అనుక్షణం పారాయణచేయిస్తూనే వుంటాడు. ప్రతిక్షణానికీ వొక్కొక్క మెట్టెక్కిస్తూ గడ్డిపోచనూ, పిపీలికాన్నీ, మానవునీ, దేవతనూ తన దగ్గరకూ చేదుకుంటూనే వుంటాడు. ప్రతిఅణువూ చేదుకో కోటయ్యా అని అరుస్తూనే వుంటుంది. గనుక మీ చరిత్ర జ్ఞానబోధకం కాకతప్పదు.

కా:- అయితే వినండి. జయిలుకు వచ్చిన తరువాత కామా నాయుడు కాముడయినాడు. గుడ్డిగవ్వజెయ్యని యీ వార్డర్లంతా మోదుబర్లనుసహా యేమిరా అనేపిలుస్తారు. మా నాయన రెండు వేలు ఋణంచేసి చనిపోయినాడు. బాకీ లిమిటేషన్ పట్టింది. సాహుకారు పొరపాటు జరిగిందంటే తిరిగీ వాయిదాబంది పత్రం ఆస్తి అంతా తాకట్టుబెట్టి వ్రాసి యిచ్చాను. తరువాత అయి దేండ్లు కడుపు నాయగట్టుకొని పండినదంతా ఆజేలుగా వాయిదా లన్నీ చెల్లించి తీర్చాను. యావత్తు బాకీ తీసుకొని చెల్లులు కను పరచకుండా మూడువేలకు డిక్రీపొంది చెంబు బోకెలతో గూడా వేలం బాడించాడు. ఈ కర్మమంతా నే చేజేతుల దెచ్చుకొన్నదే.

మొదటన్యాయానికిబోయి కాలదోషంబట్టిన బాకీ తిరగవ్రాసిగాలికి బోయేదిగాలిమీదకు తోసుకున్నా. అన్యాయానికి తలచుకున్నట్టయితే కామానాయుడినల్లా యీపాటికి కామానాయుడిగారి నయ్యేవాణ్ణి. న్యాయానికిబోయి అన్యాయపు డిక్రీని మీదికిదెచ్చుకొని కామానాయుడినల్లా కాముడినయి చోటాకట్టెదెబ్బలూ, బూటుకాళ్ళతన్నులూ, కుక్కిరిమిక్కిరిలాషకుండా తింటున్నా. ఇచ్చిన డబ్బుయెందుకు చెల్లువేయించుకోకపోవాలె ? లోకంలో న్యాయమున్నదనుకోవడమే నాలోపం. ఆ స్తియావత్తు వేసుకోగా యింకా బాకీ నిల్వదేల్చి అట్టేపెట్టాడు. మొన్న జయిలులోనుంచి బయటికి పోయినప్పుడు నేనేమో పగదీర్చుకుంటా నని నన్ను వూళ్ళో లేకుండా వెళ్ళగొట్టడంకోసం డిక్రీబాకీ ఫయిసలు చేసుకోకపోతే హాజరువారంటు పెట్టిస్తానని బెదిరించాడు. అసలు నేను కొసవెర్రివాణ్ని. ముక్కోపంతో చేతిలోవున్నకర్ర యెత్తా. ఏ దేవుడో అడ్డపడ్డాడుగాని ఆ దెబ్బతో శిగస్సు లేవాలిసిందే. ఎందుకో అజ్జాయించా.

రా:- (నిట్టూర్పుతో) మీచరిత్ర చిత్రంగావుంది. ఇటువంటి చరిత్రలు ప్రపంచంలో చాలా వుంట వనుకుంటాను. కోర్టులో జరిగే అన్యాయంవల్ల యెంత బాధపడ్డారు! మీకుజరిగిన అన్యాయం తప్పుడిక్రీతో ప్రారంభమైంది.

కా:- అంతటితో పోయిందా ! నాది యెనిమిదివేల ఆస్తి: మూడువేలకు కొట్టివేయడం రెండవది. వేలం అన్యాయం అని పిటీషన్ పెట్టితే తోసివేయడం మూడవది. సరీగా వేలం వేయించుకుండేభారం నాదెట. సర్కారునౌకరు లంచం తిని తప్పుడు వేలం వేస్తే, దాని జవాబుదారీ సర్కారుకు లేదట.

రా:- రెండవసారి అయిదుసంవత్సరాలూ, మూడోమాటు పదిసంవత్సరాలూ, దానితో మీజీవితం ముగించడం, అక్రమపు తీర్పులవల్లా వేలములవల్లా మీసర్వస్వం జీవితంతో సహా నాశనం

చెయ్యడం చూస్తే ప్రభుత్వంవారి కార్యాలయాలకు న్యాయస్థానాలా అన్యాయస్థానాలా తగిన పేరు?

కా:- నాసంగ తేమిటిగాని బందిపోటుఖయిదీలను, కడప జిల్లా ఖూనీ ఖయిదీలను విచారించండి ఒక్కొక్క కేసులో పది మందికీ యిరవయిమందికీ పదిసంవత్సరాలు మొదలు యిర్వై సంవత్సరాలవరకూ శిక్షలు వడ్డిస్తూంటారు. ఆ ఖయిదీలను పిలిపించి వాస్తవం చెప్పమని అడగండి. ఆ న్యాయస్థానాలలో అబద్ధాలు చెప్పాలె గాని బయటచెప్పవలసిన అవసరంలేదు చేసిన వాండ్లు తమ ప్రతాపాన్ని వర్ణిస్తూ నిజం యావత్తు చెప్తాతారు. కేసుచేసినవాండ్లలో చాలామందిని పోలీసులు ముద్దాయిలుగానే చేర్చరు. చెయ్యనివాండ్లను చాలామందిని ముద్దాయిలను జేసి జన్మశిక్షలుకూడా వేయిస్తారు. ఇదంతా తెలియకచేసేది కాదు. బుద్ధిపూర్వకంగా చేసేపని. చేసినవాండ్లను వదిలివెయ్యడం, చెయ్యనివాండ్లను శిక్ష వేయించడంచేత కావేష్యాలు పెరిగి కొత్త కేసులకు కారణాలు అవుతవి. డబ్బిచ్చి తప్పించుకోవచ్చుగదా? అని కొందరికి అలుచు. కూనీచేసినవాండ్లు తప్పించుకోవడంవల్ల కొందరికి వుత్సాహం. శత్రువులను అక్రమంగా కేసులలో యిరికించవచ్చునని ఆశ. ఇవన్నీ వొకదాని కొకటి పెనుసుకొని కూనీలు జరుగుతవి. ఒకకేసు విత్తనంగా జరిగిందా వొకదాని కొకటి కొక్కీలు తగిలించినట్టు అవిచ్ఛిన్నంగా జరుగుతూనే వుంటవి.

రా:- ఇదివరకు నాకున్న అభిప్రాయాలన్నీ మీరు దృఢ పర్చారు. దిగువజాతులకు జీవనంజరిగేటట్టు పని జూపి, పోలీసు డిపార్టుమెంటు యెత్తివేస్తే చాలా కేసులు తగ్గిపోతవి. ఈడిపార్టు మెంటు తీసివేస్తే కలిగేనష్టంకంటే వచ్చేలాభమే యెక్కువని నా అభిప్రాయం.

కామానాయుడు కునికిపాట్లతో ఊఁకొట్టుతూ కొంతసేపటి కది చాలించాడు. రామదాసది కనిపెట్టి నిద్రవస్తున్నట్లున్నది. పడు

కొండని సగం గొంగడి పక్కకింద వేసుకొని రెండోసగం కప్పు కొని మెదలకుండా పండుకున్నాడు. ఉత్తరక్షణం కామానాయుడు త్రుళ్ళిపడి లేచి:

కా:- అయ్యా! మరుపువొప్పున చెప్పలేదు. ఒకటి మంచిది, రెండవది చింపిరిది నాకు రెండు గొంగళ్లున్నవి. మీకు పక్కను లేదుకావాలె. ఒకటి తీసుకోండి.

రా:- నాకున్న గొంగడితోనే సరిపుచ్చుకుంటా, మీచింపిరి గొంగడి పుల్లప్ప కియ్యండి. చాప వత్తుకుంటూ మొండెంవలె పండుకున్నాడు.

కా:- పుల్లప్పా! ఇదిగో గొంగడి. కాస్త రెక్కలమీద అడ్డం వేసుకో.

కామానాయుడు అయిదునిమిషాలకు గురక ప్రారంభించాడు. రామదాసుకు నిద్రబట్టలేదు. కామానాయుడిచరిత్ర చిత్రంగా కనబడ్డది. పాపమతడు స్వాభావికంగా మంచివాడు. దయార్ద్రహృదయం గలవాడుకూడాను. లోకులదుర్మార్గమూ, అన్యాయమూ అతనిలో క్రోధం పురికొల్పి ద్వేషపూరితుని జేసినవి. అతనికి లోకమంటేనే వాకరబుట్టింది. దానిని శత్రుస్థానంగా భావిస్తున్నాడు. మనుష్యులకు తృప్తి లేదంటారు. గాని యెక్కడికక్కడ మనసు కుదుర్చుకుంటూనే వుంటారు. అతడు భీపువార్డరు ప్రాపకం సంపాదించి భోగాకువర్తకంతో జీవనం హాయిగా గడుపవచ్చు ననుకుంటున్నాడు. ఆమాత్రం అవకాశంగూడా లేక, యితనినే అదృష్టశాలెని భావించేవాండ్లు యీజయిలులో యెందరున్నారో! కడుపునిండా అన్నం లేక పొద్దుగూకులూ పనిచేసి దెబ్బలు తిని దిగంబరులై నారచాపమీద పడుకొని కప్పుకోవడానికి గొంగడిపీచయినా లేక చలికి వణుకుతూ పడుకున్నా యీ ఖయిదీలు తమప్రస్తుతస్థితి యావత్తూ మరచిపోయి కేకిసలు గొడుతూ, సంగీతాలు పాడుతూ, ఆనందించడం చూస్తే మానవుడు యెట్టిహీనపరిస్థితులలోనూగూడా కష్టాలన్నీ మరచి సౌఖ్య

మనుభవిస్తూనే వుంటాడు. రామదాసు కీవిధంగా చాలాసేపు ఆలోచనలు పోతూనేవున్నవి. మాలక్ష్మి యే మవస్థ పడుతున్నదో, యే అమర్యాదలకు లోబరిచారో, సెటిల్‌మెంటులో పిల్ల లేవిధంగా వున్నారో, అప్పడికి వాంట్లో యెట్లా వున్నదో, నాయుడుగారు పిల్లలను స్వాధీనపర్చుకోవడానికి యే ప్రయత్నాలు చేస్తున్నారో ? మొదలయిన ఆలోచనలన్నీ పొద్దు కడ్డంవచ్చే మబ్బులవలె రామదాసు నిర్మలమయినహృదయాకాశాన్ని ఆవరిస్తున్నవి. తలంపులు మనసును పీకుతున్నట్లే వూరిక దోమలు వొళ్ళు పీకుతున్నవి. వీటిని తోలలేక దూరవిడిచి వూరకున్నాడు. వాటి ఇష్టమువచ్చినట్లు విహరిస్తున్నవి. కొంతసేపటికి దోమలు దేహరక్తంపీల్చి తృప్తిపడ్డవి గాని తలపులు సముద్రకెరటాలవలె ఎడాతెరిపీ లేకుండా వస్తూనే వున్నవి. పోనుపోను తలకు వేడెక్కింది. అర్ధరాత్రిదాటినా కంటికి కూరుకురాలేదు. లేచి కూర్చున్నాడు. మనసు స్వాధీనపర్చుకోవాలెనని ప్రయత్నించాడు. కట్టివేసినకుక్క గుంజుకుంటూ మొరిగి నట్లు, పరుగులు ప్రారంభించింది. కుక్కయినా కొంతసేపటికి అలుపు వచ్చి వూరుకుండేది. మనసు బంధించినకొద్దీ పలుపు పొడుగవుతున్నది. కాని ధీరుడిప్రయత్నానికేదీ అసాధ్యం లేదు. పద్మాసనంమీద కూర్చుందా మనుకుంటే కట్టివేసిన రెండవకాలు స్వాధీనం గాలేదు. మొదట నిస్పృహజెంది దృఢసంకల్పాలకు విఘ్నాలు అడ్డందావడమేమనే దృఢనిశ్చయంతో పద్మాసనం వేసుకొన్నట్లే భావించి వెన్నచేర్చినట్టు మనస్సును కూడదీసుకొన్నాడు. మనస్సును జయించినవాడికి లేనిదేమున్నది! సమస్తం వున్నది. "సర్వాణమపి దుర్వారం, అర్వాచీనాని కింపునః" అన్నట్లు మోక్షమే విధిలేకవచ్చి పడుతున్నప్పుడు మధ్యలాభాలు ఆగుతవా ? తెల్లవారు ఝామువరకూ అలాగేకూర్చున్నాడు. స్వాధీనమయినమనస్సును యికపట్టు విడువగూడదని సహస్రార బృందావనములోనో తప్పితే మధురాబృందావనంలోనోతప్ప యితరచోట్ల విహరించగూడదని కట్టుబాటు చేశాడు. కొంతసేపటికి పద్మాసనంనుంచి దిగి గొంగడికప్పుకొని నిద్రపోయినాడు.

పారావాండ్లు తిరుగుతూనేవున్నారు. రామదాసు స్వర్గంలో వున్నప్పుడుకూడా ఆలీజ్ హెల్-అంతా నరకమేనని పారావాండ్లు అంటూనేవున్నారు. అధికారి తారతమ్యాలనుబట్టి స్వర్గనరకాలు ఇహలోకంలోనే మానవులు అనుభవిస్తుంటారుగదా?

౬

## పెద్దయ్య

లోకమంతా నిద్రపోతున్నా గ్రహాలు తమపరిధులలో బీటు తిరుగుతూ మానవులకు సుఖదుఃఖా లొసగూర్చేవిధంగా క్వారంటీను నిశ్శబ్దంగా వున్నా వార్డర్లు వొకరితరువాత వొకరు గస్తీ తిరుగుతూనే వున్నారు. తలుపులూ కిటికీలూ పరీక్షించుకుంటున్నారు. వార్డులోపల పారాజేసే ఓవరుశీయర్లు వంతుల ప్రకారం ప్రతి అయిదునిమిషాలకు ఆలీజ్ వెల్ అంటున్నారు. దానిని ఆధారం చేసుకొని పారావార్డరు గేటులోవుండి కేకవేసే వార్డరుకు అంతా క్షేమమని జవాబు చెప్తున్నాడు. చిన్న ఛీఫువార్డరు జ్ఞానానందంనాయుడు రౌండుకు వచ్చాడు. ఆయన చాలామంచివాడు. జయిలులో ఆయన వుండబట్టి ఆప్రాంతాలలో వర్షం కురుస్తున్నది. లేకపోతే అక్కడ జరిగేఘోరకృత్యాలకు జయిలుమీద నుకు పడకపోయేను. క్వారంటులో రాత్రులు ఖయిదీవార్డర్లు పహరాచెయ్యాలి. వార్డర్లే గస్తీ తిరుగుతుంటారు. నాయుడు రౌండుకు వచ్చినప్పుడు వార్డరు మునిసామి పారా జేస్తున్నాడు. అతడు పాపభీతిగలవాడు. పదిసంవత్సరాలనుంచి నౌకరీ చేస్తున్నా ఛీఫువార్డరును ఆశ్రయించడంగాని తృణమోకణమో ముట్టజెప్పడముగాని జయిలులోసామగ్రి వుద్యోగులయిండ్లలో చేర్పించడంగాని, ఆఖరుకు ఖయిదీలవల్ల మామూళ్ళు పిండించడము గాని లేకపోవడంచేత తోటివాండ్లు వకటవతరగతివరకూ పైకి పోయినా అతడింకా వొకమార్కూ సంపాదించుకోలేదు. జయిలులో వున్న యెనభైమందివార్డర్లలోనూ యితడూ వెంకటాచలమూ మాత్రమే న్యాయస్తులు. ఇతనికి కొంతవరకు వేదాం

తంలో ప్రవేశంగూడా వున్నది. పారావేస్తూ అంతా క్షేమ మని కేకవేసి తత్వాలుపాడుకుంటున్నాడు చేలాంతరు వెలుతురున ప్రతి కిటికీలోగుండా చూచి పరీక్షిస్తూవచ్చి రామదాసు యోగసమాధిలో వుండడం గమనించి విభ్రమపడి జయిలు పవిత్ర మయ్యేటందుకూ, అహోరాత్రాలు యమకూపంలో బడి ప్రపంచమార్గాలే మరచిపోయిన తనబోటివాండ్లు తరించడానికీ అప్పుడప్పుడు మహాత్ములు జయిళ్ళకు వస్తుంటా రని సంతోషించాడు. నాయకుడు పారాలో కనపడి;

మునుసామి: కాకుల్లో కలహంసను చూచారా?

నాయకు:- అతడు పరమహంసే. మధ్యాహ్నం నేనిట్లా వస్తే అతనిచేత బండలు పగలగొట్టిస్తున్నారు. ఓపినంతవరకు వాళ్లు దాచుకోకుండా చేస్తున్నా వార్డర్లు వేధిస్తున్నారు. మనిషి దగ్గిర వచ్చి ఉన్నదేమో కనుక్కోవడానికి ఛీఫువార్డరు కొంటెతనం చేయిస్తున్నట్లు కనపడుతున్నది. రేపు వుదయం సూపరింటెంటుతో ఫయిలుకు వస్తే వృద్ధాప్యంచేత పని చేయలేననీ తీర్పులో వున్నప్రకారం రైసుపడి యిప్పించవలసిందని అడిగించు. నేను దొరతో మాట్లాడుతాను.

ము:- చిత్తం తమ రతనికి వుపకారం చేయడం గొప్ప సంగతి. అతని భార్యా ఆడజయిల్లో వున్నది, ఆమె విషయం గూడా యేదో పుణ్యం గట్టుకోండి.

నా:- పొద్దున దొరతో చెప్పకుండేటప్పుడు యేదో వాక సందర్భంలో తన భార్య కూడా జయిలులో వున్నట్లు చెప్పించు, ఆమె సంగతి గూడా మాట్లాడుతాను. ఆమె ముసలిదో కాదో?

ము:- వాండ్లు పొద్దున్న వచ్చినప్పుడు చూచాను. పెద్ద పాటు మనిషే, ఆఖరుకు నలదారం వేయించినా మెరుగే.

పారా పూర్తి అయింది. మునిసామి వెళ్ళిపోతూ సంగతులు యావత్తు ఫుల్లప్పతో చెప్పి 'ఇవ్వాళ తప్పితే వారంరోజులు

దాకా చిన్న ఛీఫువార్డరు దొరతో ఫైలుకు రాడు. తప్పక యివ్వాళనే అడిగించు'మని వెళ్ళిపోయినాడు.

రాత్రి మూడుగంట లయ్యేవరకు మూత్రపాత్రలు చాలవరకూ నిండి దుర్గంధం సావిడంతా వ్యాపిస్తున్నది మలపాత్రలు గూడా అసహ్యమవుతున్నవి ఆరో పారా ప్రారంభించగనే ఓవర్ శీయరు రైస్ చెప్పాడు. కొందరు లేచి విసర్జిస్తున్నారు. సావిట్లో వున్న నల్లభై పాత్రలూ అరోచకమైనవి. పుల్లప్ప లేచి కక్కసుకు పోయివచ్చి—

పు:- అయ్యా! తమరు అనుమానం తీర్చుకోరా?

రా:- నిన్న మధ్యాహ్నం రాగిరొట్టె తినబట్టిగావాలె కడుపులో కళపెళ్ళాడుతున్నది. ఇక్కడ నీళ్లు లేవుగా.

పు:- నీళ్ళెక్కడా లేవు. ప్రొద్దున తొమ్మిదిగంటలదాకా వార్డరు కక్కసుకు తాళం తియ్యడు. రూలు ప్రకారం కొట్లు తాళాలు తీసేవరకు కక్కసు తెరిచి వుంచాలె. రాత్రి సావిట్లో పెట్టిన పాత్రలు, అత్యవసరమైనప్పుడు తప్ప సాధారణంగా వుపయోగింపగూడదు. అదంతా పోనిచ్చి దొర తనిఖీచేసి పోయిన తరువాత తాళం దీస్తాడు.

రా:- దొర యింతమాత్రం కనుక్కోలేడా? మనం చెప్పుకోకూడదూ?

పు:- దొర యేమన్నని చూస్తాడు? తాబేదార్లు గమనించాలిగాని ప్రతిదీ పై అధికారి తెలుసుకోవడం కష్టం. ఖయిదీలు యెవడూ చెప్పడానికి దొమ్మ చాలదు. ప్రతివాడూ తన పబ్బం గడుపుకుండేవాడే. పాకీవాడితో స్నేహం సంపాదిస్తే సలక్షణంగా అన్నీ గడుపుకోవచ్చు. ఒకవేళ యెవడైనా మొండివాడుండి దొరకు చెప్పుకున్నా యీ ఖయిదీలంతా వార్డరు ప్రతిరోజూ తమను కొట్లు తీయగానే కక్కసుకు పంపిస్తున్నాడని సాక్ష్యం చెప్పుతారు. అటు తర్వాత తప్పుడు రిపోర్టు చేసినందుకు అడ్డబేడీలో నిలువు బేడీలో పడతవి. బేడీలుపడకపోయినా ఆ సాయం

త్రమో ప్రొద్దునో రిపోర్టు చేసినవాడి వీపున చోటాకట్టె విరుగు తుంది.

రా:- కొట్టినందుకు ఫిర్యాదు చేస్తేనో?

పు:- దీనికి లేనిసాక్ష్యం దాని కెక్కడ వస్తుంది? గాయం లేకపోతే కొట్టలేదంటారు. కనబడుతుంటే తాను పనిచేయకుండా వుండడానికి స్వయంగా గాయం చేసుకున్నాడంటారు. నిశ్చయంగా రిపోర్టు చేస్తాడని ముందుగా తెలిస్తే అధికారులను ధిక్కరించాడనీ లేక కొట్టవచ్చాడనీ ముందుగానే వార్డరు ఫిర్యాదు చేస్తాడు. సూపరింటెంటు యీ కేసు విచారణకు పిలిచేలోగా యితడు తనను వార్డరు కొట్టాడని చెప్పుకోడానికి పోనియ్యరు. వార్డరో ఖయిదీ వార్డరో వెంటలేనిదీ యే ఖయిదీ గూడా జయిలులో తన బారకాసు విడిచి పోగూడదు. తనమీద కేసు నిమిత్తం పిల్చినప్పుడు తనను కొట్టాడని చెప్పుకుంటే తప్పుడు వాదం చేశాడని కఠినంగా శిక్షించిన కేసులు అనేక మున్నవి. ఎదురు వాదం చేసుకుంటే యెక్కువ శిక్ష పడుతుందని తనను కొట్టిన సంగతి దాచుకొని తనమీద వచ్చిన అబద్ధపు కేసు నిజమేనని వొప్పుకొని సత్యవంతుడని దొరవల్ల మెప్పు పొంది తక్కువ శిక్షలు పొందిన వాండ్లనేకు లున్నారు. ఈ ప్రకారం కొన్నాళ్ళు జరిగిన తరువాత పర్యవసాన మేమవుతుంది? జయిలులో జరిగే వొక నేరమూ రిపోర్టుగాదు. ఒకడూ సాక్ష్యం చెప్పడు. పదహారువందలమంది దుర్మార్గులుండే ఖయిదులో వొక్క నేరం గూడా జరిగినట్టు నేరపు జాబితాలో వుండదు. ఖయిదీలను మంచి ఖాయిదాలో వుంచారనీ, జయిలు పాలన మంచి అదుపుతోనూ, సమర్థతతోనూ జరుపుతున్నారనీ, ఖయిదీలంతా సుశిక్షితులు కావడంచేత జయిలులో నేరములే నశించినవనీ, దొరగారి పాలనాశక్తి అద్భుతమనీ తక్కిన జయిళ్ళకు అధికారులుగా వుండే నేటివ్వులు నిడదవోలు సెంట్రలు జయిలు చూచి పాలనాపద్ధతి నేర్చుకోవలసిందనీ మద్రాసు ప్రభుత్వంవారు తమ సాంవత్సరిక ప్రకటనలో వుదహరించి వొక ప్రతిని తక్కిన జయిళ్ళకు పంపుతారు.

కా:- (లేచి కూర్చొని) ఈ మధ్య స్వరాజ్యపువాండ్లు కొందరు యీ జైలుకు వచ్చారు. పెద్దయ్యగారు కొన్ని కేసులు దొరకు రిపోర్టు చేశారు. విచారణకు వచ్చే రోజున జైలరు మొదలుకొని తక్కిన వుద్యోగులు యావత్తు మంది దెబ్బలు తిన్నవాండ్లను సాక్షులను తిరగదీసి అందరిచేత దెబ్బలు కొట్టలే దనిపించారు. డుబ్ జైలరు (డుబ్ = డిప్యూటియొక్క పొట్టి రూపం) తనమీద స్వదేశీవాడు అక్రమ కేసు పెట్టాడనీ బేడీలు వేయించవలసిందనీ వాదించాడు. తరువాత సూపరింటెండెండు పెద్దయ్యగారిని పిలిపించాడు. వార్డరు ఆయనను వెంటబెట్టుకొని తీసుకపోతుంటే, ఆయనను తప్పకుండా చీకటికొట్లో వేయిస్తా రని జైలంతా వుడికిపోతున్నది. ఆయనను వార్డరు సూపరింటెండెంటు దగ్గరకు తీసుకొనిపొయ్యేటప్పుడు యెదురుగావచ్చిన ఖయిదీవార్డర్లు ఖయిదీలు కండ్లనీళ్ళు పెట్టుకొని చాటుగా దణ్ణం పెట్టారు. సూప రింటెండెంటు దగ్గరకు ఆయన నిర్భయంగా వచ్చాడు. ఉద్యోగస్తు లంతా ఆయనముందు పిచ్చికలలాగు కనపడ్డా సూపరింటెండెంటు యేదో అడిగేవరకు ఖండితంగా జవాబు చెప్పారు. కోర్టులో హాజ రుగా వున్న దెబ్బలు తిన్నవాండ్లకూ సాక్షులకూ మొగాన కళ వచ్చింది. అప్పుడు యీమాటలు జర్గినవి.

సూ:- మీ కేసు అబద్ధమని తెలుస్తున్నది.

పె:- నిజమని నాకు తెలుసు. నే నీకండ్లతో చూచాను.

సూ:- అయితే విచారిస్తారా ?

పె:- విచారిస్తాను. ఒక్క సంగతి వున్నది. మీకీ కేసురిపోర్టు చేసినప్పుడు కొట్టిన వుద్యోగులకు తెలియకుండా దెబ్బలుతిన్న వాండ్లను సాక్షులు స్వయంగా పిలిపించి కనుక్కోమని కోరాను. ఆప్రకారం జరిగించారా ?

సూ:- లేదు.

పె:- ఈ కేసు విచారించేటప్పుడు ఆ సంగతిమాత్రం జ్ఞాపకం వుంచుకోండి.

సూ:- కానియ్యండి. యేకేసు ముం దెత్తుకోమంటారు?

పె:- శేషయ్యకేసు విచారిస్తాను. యేమయ్యా డుబ్ జైలరు గారు కొట్టారా?

శేషయ్య:- అయ్యా! కొట్టారండి మోకాళ్ళు, మోచేతులూ వాచినవండి.

సూ:- దేనితో?

పె:- దేనితో కొట్టారు?

శే:- చోటాకట్టెతో. రూళ్ళకర్రతోగూడా కొట్టారు.

సూ:- ఇందాకా యెందుకు లే దని చెప్పావు?

శే:- వీండ్లు అట్లా చెప్పకపోతే కొడతా మన్నారు.

డుబ్బుజయిలరూ, తక్కినవుద్యోగులూ, యీ మార్పు చూచి ఆశ్చర్యపడి చూస్తున్నారు.

సూ:- సాక్షులను మీ రేమయినా సవాళ్లు అడుగుతారా?

డుబ్బు:- అయ్యవారికీ నీకూ పరిచయము వుందిగదా?

శే:- మొన్న చూడడమే.

డు:- నీవు అయ్యవారికి చుట్టలు అమ్ముకుంటావ్రగదా?

పె:- నా కిప్పటికి నలభైనాలుగేండ్లు నిండవచ్చినవి. ఇదివరకు పొగాకు యేరూపానా వుపయోగించ లేదు. ఇక జయిలులో నేర్చుకోవాలె.

డు:- జవాబు చెప్పవేమి?

సూ:- ఆ ప్రశ్న వద్దు యింకొకటి అడుగు.

డు-జ:- ఇక లేవు.

పె:- ఇంకా సాక్షు లున్నారు.

సూ:- మీరు చూచారుగదా?

పె:- చూచాను.

సూ:- ఇక సాక్ష్యం అవసరం లేదు.

డు:- వాండ్లు తిన్నగా పని చేయకపోతే చిన్నగాకొట్టాను.

పె:- ఇదివరకు కొట్టనేలే దంటిరే?

సూ:- కొట్టడానికి నీ కధికారం లేదు.

డు-జ:- దెబ్బలు తిన్నవాడు వూరుకుంటే ఫిర్యాదుచేయ డానికి యీయన యెవరు?

పె:- ప్రతివాండ్లకూ అధికార మున్నది.

సూ:- ఆయనకు నే నధికారం యిచ్చా.

పె:- దెబ్బలు తిన్నవాడువచ్చి సాక్ష్యం యిచ్చాడుగదా?

సూ:- ఇక మీరు వెళ్ళవచ్చు. పిళ్ళగారూ! మీకు ప్రథమతప్పితంగా యెంచి పదిహేనురూపాయిలు జుల్మానావేశా.

అప్పటినుంచి స్వదేశీవాండ్లయెదుట దెబ్బలు కొట్టడం ఆగిపోయింది. అదివరకు పెద్దకఱ్ఱలతో పాతికదెబ్బలు కొట్టినకేసు లున్నవి.

రా:- యెందుకు కొట్టడం?

కా:- అనేక కారణాలుంటవి. పనిలో అశ్రద్ధ జరిగిందనీ, మాట్లాడుతున్నాడనీ, నియమించిన కాలానికి లోగా కక్కసుకు వెళ్ళాడనీ, బియ్యపు బస్తాలు మోయలేనన్నాడనీ, జయిలులో వార్డరు కందిపప్పు దొంగిలించి తెమ్మంటే తేలేదనీ, పొగాకు వొక వార్డరు దగ్గిర మాని యింకొకరి దగ్గిర కొంటున్నాడనీ, భోజన పదార్థాల విషయం, కంబళ్లు వస్త్రాల విషయం, ఫిర్యాదు చేశాడనీ ఫయిలులోనుంచి తొలిగాడనీ, ఇటువంటి కారణాలు యెన్నో వుంటవి. ఈ ప్రకారం కొట్టి కొట్టి ఖయిదీల మనుష్య స్వభావాన్నే చంపివేశారు. ఖయిదీ రిపోర్టు చేయడు. ఈ దెబ్బ లన్నీ మొదట తనకు వేసిన శిక్షలో భాగమనుకొని అనుభ విస్తాడు. జయిలరు మొదలు తనిఖీదారు వరకూ పెద్ద కఱ్ఱలు చేతబట్టుకొని పొద్దుగూకులూ పశువులను బాదినట్టు బాత్తూ పని చేయిస్తుంటారు. జయిలు వుద్యోగస్తు లందరినీ మూడు భాగాలుగా విడదీయవచ్చు. చిన్న ఛీఫువార్డరు, రెమిషన్ గుమస్తా, ఆసుపత్రి కాంపౌండరూ, వార్డరుమునిస్వామీ, వెంకటాచలమూ మనుష్యులే

కోటిలో చేరినవాండ్లు. సూపరింటెండెంటు మధ్యముడు, సద్భావాలు కలవాడు. తక్కినవాండ్లందరూ రాక్షసగణంలో చేరిన వాండ్లు. కొన్ని సంవత్సరాలు క్రింద హెడ్ వార్డరు బ్రహ్మానందం వొక ఖయిదీని కొట్టి చంపితే వందలకొలది ఖయిదీలూ వుద్యోగులూ యెరిగిన సంగతయినా, నేరస్తుని శిక్షించడానికి జయిలు వుద్యోగులు ప్రయత్నం చేయకపోగా డాక్టరు దెబ్బలు కావని, ఏదో పనిముట్టు తగిలి చచ్చాడనీ, సర్టిఫికెటు యిచ్చాడు. అదిగాక యీ మధ్య వొక స్వదేశపు ఆయనను చావుదెబ్బలు గొట్టారు. ఉద్యోగులు చాలామంది ముందుగా ఆలోచించి కొట్టించిందే. అనేకమంది కొట్టడం చూచారు. సూపరింటెండెంటు మొదలుకొని వార్డరు వరకూ, న్యాయం కనుక్కోవలెనని గాని నేరస్తులను శిక్షించవలెనని గాని ప్రయత్నమే లేకపోగా కండ్లారా చూచి, చూచినది చెప్పడానికి సిద్ధంగా వున్న సాక్షులను భయపెట్టీ, శిక్షించీ, బహుమతులిచ్చీ, బెదిరించీ చెప్పకుండా చేశారు. ఈ కేసులోనే యిట్లా జరిగితే యిక ఖయిదీల బిసాదెంత ?

ఓవరుసీరు:- మీ సోది చాలించి కక్కసుకు పోయిరాండి. తొమ్మిదిగంటల లోగా తయారు కాకపోతే చోటాకల్టె విరుగుతుంది.

శా:- తరువాత మాట్లాడుదాం మీ పని తీర్చుకొని రండి.

రా:- రామరామ ! నీళ్ళు లేకుండా యెట్లాగండి ?

"క. ఆ కలములు మృత్తికయును

అని తిక్కన్నగారు ఆపద్ధర్మంగా చెప్పారు. అదిగూడా గతిలేకపోయెను. దేహమున్నంతవరకు దేహధర్మాలు అవలంబించక తప్పదుగదా ?" అంటూ రామదాసు మెల్లగా లేచి గొలుసులాగి చిమ్మచీకట్లో తాళ్ళాడుకుంటూ భాండాల దగ్గరకు జరిగాడు. ఏ భాండం దేనికో తెలియక తడివి చూచేవరకు చేతులు అసహ్యమైనవి. చేతులు కుండకు తుడిచి అనుమానం తీర్చుకొనివచ్చి పడుకున్నాడు. కొంతసేపటికి చేతివాసన పోయింది. అంతట హెడ్

వార్డరు వచ్చి గొలుసులు విప్పించి అందరినీ బయటికి తెచ్చి భూలోకం చూపించి ఫైలు కూర్చోబెట్టి లెక్క చూచుకొని వెళ్ళిపోయినాడు.

రా:- పుల్లప్పా! ఇక్కడ వున్నన్నాళ్ళూ చుక్కలూ చందమామా కనబడవుగదా?

పు:- యమలోకంలో చంద్రుడూ చుక్కలూ పొడవవు. ఇది అభాపురి.

౨

పిడత

తెల్లవారింది. పుల్లప్ప నాకబలి పిడతకంటె కాస్త చిన్న పిడతనిండా బొగ్గుపొడి పోసుకొని పండ్లు తోముకొనేటందుకు రామదాసుకు తెచ్చి యిచ్చాడు. మహర్షికి లేడిపిల్ల దొరికినట్టుగా రామదాసు పిడతచూచి ఆనందపడుతూ,

రా:- ఈ బుడ్లు మనకోసం ఫుర్మాయించి చేయించినట్లున్నారు. వీటికోసం ప్రత్యేకం సువలబెట్టించారా?

పు:- పిల్లలాడుకోవడానికి బాగా పనికి వస్తవి. దీనిని భద్రంగా మీ పడక దగ్గిర దాచుకోండి.

రా:- గోచికంటె గొప్ప దరిద్రమూ అనే సామెత క్వారంటులో వుండే ఖయిదీలలో బుట్టినట్లున్నది. గోచిపాతరాయుడికి కుండపెంకు పోయినందువల్ల వచ్చే నష్ట ముండదు. అయినా యీ బుడ్డి ముద్దు వస్తున్నది. ఎత్తుకొని పోయేవరకూ దాచుకుందాం. (అని అస్తారుపొదంగా తీసుకొనిపోయి పక్కదగ్గిర దాచుకున్నాడు.)

అంతా గంజిదాగి యెవరిపనికి వారు పోయినారు. పుల్లప్ప, రామదాసు రాళ్లు గొడుతున్నారు. కామానాయుడు కపిలపనికి పోయినాడు. దొర తొమ్మిది గంటలకల్లా ఫయిలుకు వస్తాడన్నారు. ఎనిమిదిన్నరకే అంతా తిరిగి వచ్చారు. క్వారంటు ఖయిదీలలో షుమారు 30 మందికి గోచులు తప్ప దుస్తులుగాని,

చాపలుగాని, గొంగళ్లుగాని యియ్యలేదు. వీండ్లలో యెవరూ చే తడిగలవాండ్లు లేరు. తొందరపడి దుస్తుల కెవరూ మామూళ్ళియ్యలేదు. ఉద్యోగస్తులతోపాటు వాండ్లూ మొండిబడి కూర్చున్నారు. పై వేషాన్నిబట్టే కొందరిని వార్డరు కదిలించి చూచాడు గాని యెవడూ సందు పెట్టలేదు. దొరవచ్చే వేళవుతున్నది. చల్లాడాలు, చట్టలూ మాత్రం పిళ్ళగారు తెప్పించి దొరగారివల్ల వపట్కారాలు రాకుండా బొత్తిగా ఆశ లేదనుకున్నవాండ్లకు కొందరి కిచ్చి తక్కినవాండ్లను గదిలోబెట్టి తాళం వేయించాడు. తక్కిన అందరినీ అలంకరించి ఫయిలులో నిలువబెట్టించి దొరతో గలిసి ఫయిలు తనిఖీకి వచ్చాడు. దొర అందరి మొగాలూ చూస్తూ వెళ్ళిపోతుంటే వొకడు సలాం బెట్టంగనే నిలువబడ్డాడు.

కా:- మాది రాజమహేంద్రం. ఉప్పుడుబియ్యం మా కల వాటులేక విరోచనాలవుతున్నవి. పచ్చిబియ్యపుఅన్నం, స్వయంలో నుంచి పులుసూ యిప్పించండి.

సూ:- ఊరకే మార్చడానికి వీలులేదు. బాగాజబ్బుచేసి ఆసుపత్రికివస్తే పచ్చిబియ్యపు అన్నమిస్తారు. నీవు బ్రాహ్మణుడవు గావు గనుక స్వయంలోనుంచి యియ్యడానికి వీలులేదు.

కా:- బాగా జబ్బు చేసేవరకు యిదే తింటూంటే చివరకు నయంగాకపోతేనో ?

డు. జ:- ఎవడురా వీడు అధిక ప్రసంగి.

సూ:- (నవ్వుతూ) నయంగాకపోతే మార్పే అవసరంలేదు.

కా:- మీరు చెప్పేప్రకారం నయమయితేనూ అవసరం లేదన్నమాటే. బాగావుంది తీర్పు.

సూపరింటెండెంటుగారు ముఖం చిట్లించుకొని జవాబు చెప్పక ముందు నడుస్తున్నాడు. డుబ్ జయిలరుకు కొమ్ములు లేవు గాని తప్పక లూలులాయపిళ్ళే. సూటు వేసుకొని తొడుగు మోస్తరుగా జరుగుతూ దొర వెంబడి వస్తున్నాడు. చిన్న సర్జను షోకులబొమ్మ. ఎఱ్ఱగా పుల్లగా వుంటాడు. హృదయం మట్టుకు

కాఋనలుపు. దయాదాక్షిణ్యాలు లేవు. ఉపకారం చేయకపోతే మానె బుద్ధిపూర్వకంగా అపకారం చేస్తాడు. వేంబయ్యారు (వేప అయ్యారు) అనే పేరు జ్యోతిష్కుడెవడో యితని భావిచరిత్ర కని పెట్టే పెట్టాడు. టక్కు టక్కుమని బూటుకాళ్ళ చప్పుడుతో దొరపక్కగా ఆయన వస్తున్నాడు. హృదయ నైర్మల్యం ముఖాన వెలిబుచ్చే చిరునవ్వుతో జ్ఞానానందంనాయరు దొరకు కుడి ప్రక్క నిలువబడి రామదాసు కోసం ఫయిలులో వెతుకుతున్నాడు. ఎక్కడా కనుపడలేదు. అనుమానపడి,

జ్ఞా:- (డుబ్ జయిలరుతో రహస్యంగా) కొందరు ఫయిలులో లేనట్లున్నారే!

పి:- మీ కెవరుగావాలె. ఎవరయినా పనికి బోయినవాడు దాక్కున్నాడేమో? తర్వాత కనుక్కుందాములెండి.

జ్ఞా:- కాదు, ఫయిలులో సూపరిండెంటును కొన్ని సంగతులు తప్పకుండా యివ్వేళ అడుగుతా నన్నాడు.

పి:- నా డెవడు? యే మడుగుతాడు? వచ్చేసారి అడగ గూడదా?

జ్ఞా:- ఒక ముసలి మాలవాడు. అతని పేరు రామదాసు. ఏమీ పని చేయలేక బాధపడుతున్నాడు. అతనికి అన్నపుపడి వేయించి పని తగ్గించే యేర్పాటు చేయాలె.

పి:- ఓసి యింతేనా-అన్నప్పడి తీర్పులోనే వున్నది. వేసివేతాం. వచ్చే ఫయిలువరకూ పని లేకుండా చేయింతాం. ప్రస్తుతం వూరుకోండి. వాడికి గొంగళ్లు లేవు.

పు:- (ఉర్దుభాషలో) అయ్యా! సలామండి.

సూ:- యేమి చెప్పుకుంటావు?

పు:- రాత్రి నాకూ యింకా 30 మందికి చట్టలుగాని చాపలుగాని గొంగళ్లుగాని లేవు. చలికి బాధపడ్డాం. ప్రొద్దున కొంతమందికి కాలి చట్టలూ చేతిచట్టలూ మాత్రం వొక జత

యిచ్చి అలంకరించారు. అవి మళ్ళీ మీారు గోడ తిరుగంగనే పూడదీసుకుంటారు.

పి:- ఊడదీసుకుంటారని నీకెట్లా తెలుసు?

పు:- అది మామూాలే.

పి:- నీ వెప్పుడు వచ్చావు?

పు:- నిన్ననండీ.

సూ:- నిన్న వచ్చినవాడివి యిక్కడ జరిగే మామూాలు సంగతి యెట్లా చెప్పగలవు?

పి:- ఈ పూాట కొత్తగా యిచ్చిం దెవరికి?

పు:- ఈ పదిమందీ యీా పూాట యిచ్చినవాండ్లేనండి.

పి:- ఇవి మీాకు నిన్న కాదట్రా యిచ్చింది.

ఖై:- తమరు మాకు నిన్ననే దయచేశారండి.

పు:- ఇప్పుడు వీండ్లంతా భయపడి అబద్ధాలు చెప్పుతున్నారు. చట్టలు కొత్తమాసినవేమో చూడండి. అది పోనీయండి వీండ్లకు గొంగళ్లు చాపలు యిచ్చారేమో కనుక్కోండి.

సూ:- (ఇంగ్లీషులో) మీాకు గొంగళ్ళు చాపలు యియ్యలేదా?

పి:- (అరవంలో) - మీాకు నిన్న గొంగళ్ళు చాపలూ యిచ్చారు గదా!

చాలామంది అరవము తెలియని తెలుగువాండ్లు. ముగ్గురు అరవవాండ్లు. ఇచ్చారుగావాలె అన్నారు. పిళ్ళ 'యిచ్చారని చెప్పుతున్నాడు' అని యింగ్లీషులో తర్జుమా చేశారు.

పు:- మీారేమి అడిగారో వాం డ్లేమి చెప్పారో నాకు తెలియదండి.

పి:- నేను తప్పుతర్జుమా చేశానట. నీకు అరవంగాని ఇంగ్లీషుగాని వచ్చునా?

పు:- రాదండి.

పి:- నేను తప్పుతర్జుమా చేశానని అతడి కెట్లా తెలుసు! అరవం యింగ్లీషు తనకు రావట.

సూ:- తర్జుమా సరియైనదేనా?

జ్ఞా:- అరవం బాగా నాకు తెలియదు. నాది మలయాళం. చాలాభాగం ఖైదీలు తెలుగులో మాట్లాడుతుండడంచేత మీ సంభాషణే నా కర్థం కాలేదు.

సూ:- (యేమీ తోచక పుర్దుతో) తర్జుమా సరియైనదే. మావుద్యోగులను నేను నమ్ముతాను.

పి:- యేం పుల్లప్పా! నీవు తప్పుఫిర్యాదులు చేస్తున్నావు. యెందుకు శిక్షించగూడ దంటున్నారు దొరగారు.

పు:- నా కంఠం తీయిస్తా నన్నా భయం లేదు. మీరు దాచిపెట్టిన పదిహేనుమందినీ పట్టిస్తాను. నాతో దయచేయండి.

పి:- వాళ్ళంతా అబద్ధాలు ఆడుతున్నారట. పదండి వాడితో నేమి?

సూపరింటెంటు ముందుకు సాగి వెళ్ళుతున్నాడు.

పి:- ఓయి వార్డరు! పుల్లప్పను ౧౦ గంటలకు నా ఆఫీసుకు తీసుకొనిరా. బేడీలు వేయిస్తా. ఊరికె తీసుకొనిరాబోకు.

వా:- చిత్తం.

సూపరింటెంటు వెళ్ళిపోయినాడు. వార్డరు పుల్లప్పను చోటాకట్టెతో పిక్కలమీద మోకాళ్ళమీద కుమ్మాడు. కొట్టారని చెప్పుకున్నా విచారించే దిక్కుండదని విలవిలలాడుతు వార్డరు కాళ్ళమీద బడ్డాడు. పడ్డవాణ్ణి మరిరెండుబాదారు. రక్తమయమైంది. సూపరింటెంటుకు చూపుతానని లేచి పరుగెత్తుతున్నాడు. ఇంతలో ఛీఫువార్డరు యెదురుగా వచ్చి యిద్దరుఖయిదీలచేత పట్టించి ఆసుపత్రిలో రోగిగా చేర్పించకుండా గాయాలకు మందు వేయించి మళ్ళీ క్వారంటులోకి బంపాడు. రామదాసు మొదలైనవాండ్ల కందరికీ తెలిసింది. ఖయిదీ లందరూ వుద్యోగస్తులను

అయ్యా నాయనా అని బతిమెలాడుకోవాలెగాని వాండ్లమీద ఫిర్యాదు లేమిటని పుల్లప్పనే చీవాట్లు పెట్టారు.

పు:- నన్ను గొట్టడం మీరంతా చూచారుగదా? ఇప్పుడు ఫిర్యాదు చేసుకోవడానికి పోనియ్యకపోయినా మళ్ళీ ఫయిలులో చెప్పుకుంటాను. చూచినసంగతులు సాక్ష్యం చెప్పండి.

ఖయి:- ఉద్యోగస్తులమీద సాక్ష్యం చెప్పించి మాకు బేడీలు వేయించవలెనని చూస్తున్నావా? ఈ మాత్రంగా బతకనియ్యి. ఇది అసలే ఖయిదు. దీంట్లో దెబ్బలుకొట్టక ముద్దు పెట్టుకుంటారనుకున్నావా? యేదోకాలం వెళ్ళబుచ్చుకొని పోవాలె. ఒకవేళ ఫిర్యాదు చేస్తావే చూడవయ్యా, పడ్డదెబ్బలు మళ్ళీ వచ్చేనా? యేందోతోచనిపని. మమ్ములనుకూడా యిరికిస్తానంటా వెందుకు?

ఇంతలో పిళ్ళగారు మళ్ళీ లోపలికి వచ్చి-"యేడిరా వాడు. యింకా ఫిర్యాదుకు పోతానంటున్నాడా"-అన్నాడు.

వా:- దొరకు దెబ్బలు చూపిస్తాడట, సాక్ష్యం కుదుర్చుకుంటున్నాడు.

పి:- (వార్డరుతో)-నీకు యెన్నిమాట్లు చెప్పినా బుద్ధిలేదు. వాడు లేచి పోగలిగేటట్టుగానా కొట్టేది. ఏమిగా ఫిర్యాదుకు పోతావా?

పుల్లప్ప మాట్లాడకుండా తల వంచుకున్నాడు.

పి:- వీడు తప్పుడురిపోర్టు చేసినందుకు యీా పూటపస్తు.

పు:- అట్లని శిక్షలరిపోర్టులో వ్రాయండి.

పి:- వ్రాయవలెనా? వ్రాయకపోతే యేమి చేస్తావో చూతాం. సాయంత్రం గంజిమాత్ర మియ్యండి. అక్కడికి తిక్క చాలాభాగం వదులుతుంది.

పు:- నేను దొంగదాసరివాణ్ణి. ఇంతమాత్రానికి వంగే వాడిని గాదు.

పిళ్ళ చోటాకట్టెతో వొాకాళ్ళమీద రెండుదెబ్బలు గొట్టంగనే కొండ కేకలు పెట్టుతూ కిందపడ్డాడు.

పి:- చాలునా ?

పు:- చాలేదె? మీారోజులు మంచివైనవి. ప్రొద్దున దాచి పెట్టిన పదిహేనుమందిని దొరవచ్చేముందు యింకొకకొట్లో వేయకపోయినట్లయితే నాతడాఖా చూపించేవాడినే.

పి:- దొరగారికి చూపుతానంటివే చూపకపోయినావా ?

పు:- రెండోకొట్టు యేదో తెలిస్తే అంతపని చేసివుందును.

పి:- నీ కేమయినా మేస్త్రీపని యిప్పించమంటావా ?

పు:- ఏదో తగలవేయించండి.

పి:- కొత్తవాడివి. నెలరోజులు జరగనియ్యి. అందాకా లోలాయిగా వుండి గాయాలు నయంజేసుకో (తనలో) నల్ల కుళ్ళాయి వీడికి మేస్త్రీపని యెట్లా వస్తుందనుకున్నాడో ?

పిళ్ళ రామదాసు దగ్గరకువచ్చి 'సీకు అన్నపుపడి వేశాను. పని సంగతిలో——'

వా:- తక్కిన సంగతులు నే మాట్లాడి మనవిజేస్తాలెండి. కొద్దిరోజులలో వాండ్లవాం డ్లెవరో వస్తారట.

పి:- సరే. (రహస్యంగా) యీా దెబ్బలసంగతి స్వదేశీవాండ్లకు తెలియనియ్యబోకు. వాండ్లు సాక్షులను నిలవదీస్తారు. ప్రాణం మీాదికి వచ్చేను.

వా:- తలావొాక బీడీ పారవేశా. సాక్షు లెవరూ పలికే వాండ్లు లేరు.

డుబ్ జయిలరు కొత్తగా దుస్తులు యిచ్చినవాండ్ల నందరినీ పిలిపించి వరుసగా నిలవబెట్టి విడిపించి మూట గట్టించాడు. వాండ్లు లబలబ లాడుతుంటే గుడ్డలు కుట్టించి యిస్తానని సమాధానపరచి రామదాసుకు వొాకజోడు దుస్తులూ, కంబళీ, చాపా, యిప్పించి వచ్చే ఫయిలుదాకా తేలికపని యియ్యమని వార్డరుతో చెప్పి అన్నపుపడి వ్రాసి వెళ్ళిపోయినాడు.

౮

వెంకటదాసు

జయిలులో జనమంతా యెవడో బందిపోటుదొంగ శిక్షకు వస్తున్నాడని గలభాగా చెప్పుకుంటున్నారు. ఉద్యోగస్తులు రామం ఖాళీగా వస్తూ పోతూ వున్నారు. గేటుదగ్గిర వార్డర్లను విచ్చు కత్తులతో రెండు బార్లు దీర్చి నిలువబెట్టారు. ముందు డోలీ వస్తున్నది. పోలీసుఘూటు చుట్టూ కమ్మి నడుస్తున్నారు. వేలకొలది జనం వెంట వస్తున్నది. జయిలుకు గేటుకు ౨౦ గజాల ముందుకు వచ్చి జనాన్ని ఆగమని వుత్తరువుజేశాడు. జనం లక్ష్యపెట్టలేదు. అప్పుడు వెంట వస్తూవున్న డాక్టరు అక్కడ మేరువ పోసివుంటే యెక్కి 'జగ్గడు చాలా జబ్బుస్థితిలో వున్నాడు. (జగన్నాథమని కేకలు) జగన్నాథం లేచి కూర్చోగూడా లేడు. త్వరగా లోపలికి తీసుకొనిపోయి కట్టు కట్టితే కొంత బాధ తగ్గవచ్చు'నని చెప్పాడు. అంతట జనం గట్టుకు తగిలిన తరంగాలు మోస్తరుగా ఆగిపోయి 'జగన్నాథంకు జై' అని కేకలువేశారు. 'నిజంగా అతడు జగన్నాథుడే' అని కొందరన్నారు. 'అతడు ప్రపంచాన్ని యేలకపోయినా అతని ఆదర్శాలు మానవుల భావప్రపంచాన్ని యేలుతవని మరికొంద' రన్నారు. నిశ్శబ్దంగా డోలీ లోపలికి వచ్చింది. సరాసరి ఆసుపత్రికి తీసుకొనిపోయి పడుకోబెట్టి గాయాలు కడిగి కట్టుగట్టారు. అతనితో వచ్చిన సర్జను కర్నూలుజిల్లా కలెక్టరిచ్చిన పరిచయపు వుత్తరమును సూపరింటెండెంటు కందిచ్చి వారికి జగ్గడిపై వున్న అభిమానం దెలిపి వెళ్ళిపోయినాడు.

సూ:- నీ పేరు జగన్నాథమా ?

జ:- మొదటిపేరు జగ్గడండీ. జగన్నాథమనీ కొందరంటారు.

సూ:- కలెక్టరుగారు నీమీద చాలా దయగా వున్నారే !

జ:- వారు చాలా యోగ్యులు.

సూ:- నీవు చాలా జబ్బుస్థితిలో వున్నావు. నావల్ల నీకు కావలసిందేమి ?

జ:- మా అయ్య రామదాసు అనే ఆయన, మాలక్ష్మి అనే మా అమ్మ యీ జయిలులో వున్నారు. నేను వెళ్ళిపోయే వరకూ నా మంచం దగ్గిర వుండడానికి వుత్తర్వు యిప్పించండి.

సూ:- (పిళ్ళగారితో) వా రెవరో మీకు గుర్తేనా ?

పి:- గుంటూరునుంచి రెండురోజుల క్రిందట వచ్చిన వాండ్లా ?

జ:- అవును.

సూ:- వాండ్ల నిద్దరినీ ఆసుపత్రిలో వుంచు. ఈ దగ్గిర మంచాలు రెండూ వాండ్ల కియ్యండి. ఈ గదిలో యింకెవరూ వుండగూడదు. వాండ్లు మాట్లాడుకుండేటప్పుడు మీ రెవరూ సమీపంలో వుండనవసరం లేదు. వెంటనే పిలిపించండి.

పి:- చిత్తం.

సూ:- సర్జను లిద్దరు, వొకరు విడిస్తే వొకరు హాజరుగా వుండి యీ రోగిని చూస్తుండండి. శస్త్రచికిత్స చెయ్యడానికి వల్లవుతుందేమో రేపు పొద్దుటికి తేల్చండి. ఇప్పటికి వీలు లేదనే తోస్తుంది. కొద్దిగా మత్తుకూడా యేర్పడుతున్నదేమో గమనించండి.

రామదాసునూ మాలక్ష్మినీ పిలుచుకునిరావడానికి వెళ్ళిన వార్డరు వుభయులనూ వెంటబెట్టుకుని వచ్చి ఆసుపత్రిలో దిగవిడిచాడు. వాండ్లకు వెంకటదాసు వచ్చిన సంగతి తెలియదు. తక్కెళ్ళజగ్గడు మిమ్ములను చూస్తా నంటున్నా డనిమాత్రం చెప్పారు. రామదాసుకు అనుమానం తగిలి వెంకటదాసు అతని గుంపులో చేరి తనసంగతి చెప్పివుంటా డని అనుకున్నాడు. ఉభయులూ వెంకటదాసు పడుకున్న చావిట్లోకి పోయినారు. వెంకటదాసు కైవారం చేసినట్టు యతిరాజుకు వొంటిచేతితో నమస్కారం జేశాడు. మాలక్ష్మి దూరంనుంచి దిగాలపడి చూచి కౌగిలిలనుబట్టి

ష్కరించి 'నా వెంకడు, నా వెంక' డని పరుగెత్తివచ్చి కావలించు
కొని యేడుస్తూ వెఱ్ఱిదానివలె మళ్ళీమళ్ళీ ముద్దుబెట్టుకుంటున్నది.
స్తన్యంకూడా చేపురు వచ్చినవేమో చెప్పలేము. ఆమెపొందిన
ఆనందాన్ని వర్ణించడంకంటే అమ్మపొందే ఆనందం పొందిం
చటంటే చాలు. ఇతరమాటలతో చెప్పడానికే వీలులేదు. రామ
దాసు రిచ్చవడి చూస్తూ "నీవా జగ్గడివి? ఆశ్చర్యం. ధర్మదేవత
కనిపించుకున్నావు" అన్నాడు.

వెం:- అయ్యా! మీ యిద్దరికీ సంతానంవల్ల దుఃఖమేగాని
సుఖం కలుగలేదు.

రా:- నాబిడ్డలు కొంతవరకు చింతపడేటట్టు చేసినా సిగ్గు
పడేటట్టు వర్తించలేదు. జగ్గడిచరిత్ర యావత్తు వింటూనే
వున్నాను. నీవే జగ్గడి వని యిప్పుడు తెలిసింది.

వెం:- నీ బిడ్డలు వీరులు. వీరోచితమరణమే పొందారు.
పొందుతారు. సుఖదుఃఖాలకు నీ వతీతుడవు గనుక నీవిషయమై
నాకు యెక్కువచింత లేదుగాని అమ్మదే కష్టదశ.

రా:- అంతేకాదు. ఆమె మీఅమ్మ. ప్రేమవిషయంలో
అమ్మకూ అయ్యకూ హస్తిమశకాంతరం వారవుంటుంది.

వెం:- వాస్తవమేగాని అయ్యకు మించిన రక్షకుడు లేడు.

రా:- అమ్మ దేవత. సమస్తమూ అమ్మే. అటువంటి
వస్తువు యిహపరాలలో వెదికినా మరొకటి కనపడదు. కాని నీ
మాటలు దుఃఖవార్తను సూచిస్తున్నది.

మా:- దేనికయినా వొడిబట్టేవున్నా. పిల్లల సంగతేమి?

రా:- నాయుడుగారు క్షేమమా?

వెం:- నాయుడుగారు వొకవిధాన క్షేమంగానే వున్నారు.

మా:- జోతీ-అప్పడో?

వెం:- లేరు.

మా:- లేనేలేరా?

మాలక్ష్మి నేలకు జారింది. ఏమీ మాట్లాడలేకపోయింది. వెంకటదాసు తన వొంటిచేతితో కూర్చోబెట్టాడు.

రామదాసు వేదాంతం కాసేపు మూల గూర్చున్నది. ప్రేమకు మించిన వేదాంత మేమున్నది? ప్రేమరహితమైన జ్ఞానం చవిటి నేలవంటిది——

రా:- అమ్మా జ్యోతీ, ఈ ముసళ్ళను విడనాడి పోయినారా? మమ్ములను కడతేరుస్తానంటివే? మమ్ములను వదిలిపో వలసిన అవసరం వచ్చిందా? అప్పడి సంగతేమిటి?

మాలక్ష్మి వాల్చిన రెప్పలు తెరిచింది.

వెం:- జోతి ఆత్మహత్య చేసుకొన్న తరువాత అప్పడు ఆమెనే అనుసరించి శవముతో సహితం కృష్ణాప్రవాహగతుడయినాడు. పిల్లవాడిని మంగళాపురం వెంకటయ్యగారు తీసుకొని పోయినారు.

మాలక్ష్మి పడిపోయింది.

రా:- ఆహా! రామానాయుడుగారేమయినారు?

వెం:- పిల్లలను విడిపించే ప్రయత్నంలో కారాగారప్రాప్తిని పొందారు. వారంరోజులు ఖయిదులో వుంచినానికె కేసు ఫయిసలు అయిన తర్వాత ఆయనను నిర్దోషినిగా యెంచి విడిచి పెట్టించారు. రెండు మూడు రోజులలో యిక్కడికి వస్తారని వింటాను.

రా:- అప్పుడిది యెంత అద్భుతమైన సహగమనం? ఇది గదా నిజమైన ప్రేమ. వివాహబంధమూ దైహిక సంబంధమూ లేకనే అద్భుతమైన ఆత్మీయప్రేమ కనబరిచారు. అప్పడు జెప్పినట్లు ఐహికాముష్మికాల రెంటికీ ప్రేమ అనే రస్తావేసి యాత్ర జేశారు. వారు ధన్యులు.

వెం:- అదంతా నాకు తెలియదు. ప్రేమ అనేది యెక్కడా నాకు కనపడలేదు. ఒకచోట వుంటే రెండోచోట లేకుండాబోదు. ఇహ పరాలుండడమే నిశ్చయమయితే రెంటిలోను ప్రేమ

శూన్యమే. అమ్మను నా చేతిమీద నిలుపలేకుండా వున్నాను. జారిపోతున్నది. మనస్వాంతి లేదుగామాలె. ఇటు వచ్చి పట్టుకో.

రా:- ఇదే మిది? జావాలె చేతికి రావడంలేదు.

వెం:- నే లేవలేను. సజ్జనుగారిని కేకవెయ్యి.

సజ్జన్:- (ఈ మాటలు విని లోపలికి వచ్చి) ఏమది?

వెం:- మా అమ్మగారు కుమార్తెయొక్క మరణవార్త విన్నది. నాడి తప్పుతున్నట్టు కనబడుతున్నది. తమరు చూడండి.

రా:- (పరీక్షించి) ఇదివరకే తప్పింది. నీవు చాలా జబ్బులో వున్నవు. దుఃఖించవద్దు. మీ నాయనకు పెద్దతనంలో కష్టపురోజులు.

రామదాసు భార్య పొట్టలో తలపెట్టుకొని కూర్చున్నాడు.

వెం:- మా అమ్మ వెళ్ళిపోయిందా? ప్రపంచంలో ప్రేమ లేదన్నాను. తప్పకుండా అమ్మకడుపులో ప్రేమ వున్నది. అమ్మే దేవుడు. మరియొక దేవుడులేడు. అయ్యా, డాక్టరుగారు, మా అమ్మచెయ్యి నా చేతికి తగిలించండి వొక్కమాటు. నా హృదయ తాపం చల్లారుతుంది.

రా:- మాలక్ష్మి! నన్ను విడిచిపోయినావా?

ఇంతవరకూ నా నీడవలె వెంట వుంటుంటివి. యెట్లా విడిచి పోగలిగావు? వస్తువు లేకుండా ఛాయ వుండగలదా? ఛాయ లేకండా వస్తువూ ఉండదు. ప్రకృతీ పురుషలక్షణ మిదే. ఈ సృష్టికంతా భగవంతుడే సాక్షి. నిరావలంబనగా యీ సృష్టి నిలవలేదు. వియోగదుఃఖం మనకంటె ఆయనకే యెక్కువ. వ్యసని. నిన్ను వదలిపెట్టి యెలా వుండేది? కట్టితెచ్చుకున్న భర్యాం నా కింకా వున్నది. అదితెనిమరీ పోవాలె. నాకు విమోచనం కలుగలేదు. జ్యోతీ అప్పాదాసులు తరించిన ప్రేమమార్గం గూడా నాకు కనబడడంలేదు. వృద్ధాప్యం వచ్చినకొద్దీ జీవుడికి పంచేంద్రియములతో సంబంధం వొకటితర్వాత వొకటి వూడిపోతున్నవి. ఇవన్నీ బంధాలా? నీవు నాకు బంధానివా?

జోతి అప్పాదాసులూ వొకరి కొకరు తెప్పలయి తేలిపోయి నారే? నిన్ను నేను బంధ మనుకోవడం నా బుద్ధి జాడ్యమే. నా దౌర్బల్యమే నిన్ను భరించ లేక పోయిందని బలవంతంగా కూర్చో బెట్ట బోయినాడు. శరీరమంతా చైతన్య రహితంగా కనపడ్డది. గాని చేతులుమాత్రం కొంగర్లుపోయినట్లు చలిస్తున్నవి. కళేబరం కూర్చోబడక జారింది. ఆ జారడంలో చేతులు రామదాసు పాదాలను పుణికినట్లు స్పృశించినవి. పట్టుకున్నవి. స్థూలశరీరంయొక్క చేతులకు పట్టుచిక్క లేదు గాని సూక్ష్మహస్తాలు పాదాలను గట్టిగా పట్టుకొనే వుంటవి. చైతన్యం చేతులలోనుంచికూడా లేచిపోయింది.

సూపరింటెండెంటుకీ సంగతి తెలిసేవొచ్చాడు. శవాన్ని దహనంచేసుకుంటారా? ఖననం చేసుకుంటారా? అని అడిగితే వెంకటదాసు ప్రస్తుతం వొక పెట్టెలోపెట్టి పాతిపెట్టి వీలుప్రకారం ఆ పెట్టె తమ గ్రామానికి తీసుకుపోవడానికి వుత్తర్వులియ్య వలసిందని కోరాడు. చిన్న సర్జను అట్లా చెయ్యడానికి రూల్సు ఒప్పవని అనవచ్చాడు గాని సూపరిండెంటు ఆ ప్రకారమే చేసుకోవచ్చు నని ఉత్తర్వులిచ్చాడు. జయిలువెలుపల వొక ప్రత్యేక స్థలంలో ఖననానికి యేర్పాటుజేసి వెంకటదాసు కోరికప్రకారం అతని మంచంగూడా శవంతో సమాధిదగ్గరకు తీసుకొని పోయి నారు. అతని చేతిమీదుగా మొదటిసారి మట్టిజల్లి పూడ్చడం ప్రారంభించాడు. ప్రాప్తమున్నవాం డ్లంతా తోడ్పడి ధర్మమట్టి జల్లి పూర్తి జేశారు.

సూ:- వెంకటదాసూ నీవు చాలా జబ్బుస్థితిలో వున్నావు. నేరాలిక చేయలేవని సర్కారుకు వ్రాసి నిన్ను విడిపిస్తాను. అట్లా చేయవచ్చునా?

వెం:- తమరు విడిపిస్తే నా అభ్యంతరం యేమీలేదు. కాని నా వాండ్లంతా పరలోకానికి వెళ్ళిపోయినారు. ఇక మిగిలింది నా తండ్రి ఒక్కడే. తమ్ముడు పసివాడు. ఈయనను విడిచి బయటికి పోవాలనే ఆపేక్ష లేదు. ఆయననుకూడా వదిలిం

చడం సాధ్యం అయితే సరి. కాకపోతే నా శల్యాలనుకూడా మా వూరు తీసుకొని పోవడానికి వుత్తరువు దయచేయండి.

సూ:- ఆయనను వదిలిపెట్టమని వ్రాయడానికి నా కధికారం లేదు. ఆయన చేసింది నామకా నేరం గనుక వుభయులను గురించి వ్రాసి చూస్తాను. అనుకూలమైన వుత్తరువు వస్తే వుభయులను విడిచిపెడతాను. నీకు జబ్బునయమయినా నేరములేమీ చెయ్యగలవని తోచదు.

వెం:- మీకు ఉత్తర్వులు వచ్చేలోగా నేను మరణించకపోతే వెళుతాను. నేను మరణించినా మా నాయనగారిని వదిలిపెట్టండి.

సూ:- యెవరికి ఉత్తరువు వచ్చినా వొదిలిపెట్టడానికి ఆక్షేపణ ఏమీ వుండదు.

౯

## ఆచరణసాధ్యమే

రామదాసు జోడుపడిపోయిన పక్షివలె తన మంచంమీద ముడుచుకొని కూర్చున్నాడు. సాయంకాలం అన్నపు పడివచ్చింది. ఒక్కకణమైనా నోటికి పోలేదు. అన్నమంతా జాడుమాలి కిచ్చివేశాడు. ముప్పైసంవత్సరాలనుంచీ యే విధమైన దీర్ఘమనస్తాపాలు లేకుండా కలిసిమెలిసివున్న తన అర్ధాంగియొక్క వియోగం దుస్సహమై జోతీ అప్పాదాసుల మరణానికే విచారపడుతుంటే మాలక్ష్మి యొక్క ఆకస్మిక మరణము దుఃఖముయొక్క బాధనే తీసివేసింది. ఏమీ తోచక మానివలె మంచంమీద గూర్చున్నాడు. వెంకటదాసుకు దుఃఖంవల్లనో, నాలుగైదుమాట్లు లేవడంచేత కట్లు కదలడంవల్లనో గాయాలబాధ యెక్కువై నిద్రపట్టలేదు. ఉభయులూ అతికష్టముమీద రాత్రి వేగించారు. ఒకరొకరి క్షేమం విచారించుకోవడానికయినా మనస్వాస్థ్యం లేకపోయింది. రామదాసు మెదలకుండా పండుకున్నాడు. గాని వెంకటదాసు తెల్ల

వార్లూ మూలుగుతూనే వున్నాడు. మేలుకొనివుండి రామదాసది గమనించలేదు. క్వారంటుకంటె ఆసుపత్రిలో కొంత బాహ్యశుద్ధి వున్నా అక్కడి వైద్యులకు క్వారంటులోని వుద్యోగులకున్న మాత్రమయినా హృదయశుద్ధి లేదు. సర్జను లిద్దరూ బ్రాహ్మణులే. ఇదివరకు జెప్పిన రాక్షసగణంలో చేరుతారు. బ్రహ్మ రాక్షసులంటే రాక్షసులలో బ్రాహ్మణులా? బ్రాహ్మణులలో రాక్షసులా? వైద్యజ్ఞానం వుభయులకూ పూర్ణసంఖ్యే. దయా దాక్షిణ్యాలు అంటే వైద్యం చేసేటప్పుడు, రోగులను ఖయిదీలుగా భావించగూడదని వారికి తెలియదు. సూపరింటెంటూ, డాక్టరూ, వొకమనిషే కావడంచేత, డాక్టరు తన పూర్వసంస్కారం మరచి పోడు. ఆసుపత్రికి కంపౌండరు రామస్వామినాయుడే ఆధారం. ఆయన లేకపోతే రోగులు మురిగిపోవలసిందే. రూలుప్రకారం సర్జనులే రణాలు కడగాలెగాని జయిలాసుపత్రిలో అక్కడ వుండే ఓవరుశీయరే వ్రణచికిత్సకుడు. పూర్వపు సూపరింటెండెంటు వైద్యుడుగాడు. జిల్లా సర్జనుకు నెలకు రెండువందల రూపాయిలు యెక్కువిస్తే ప్రతిరోజు వచ్చి రోగులను చూచేవాడు. ఇప్పటి సూపరింటెంటును సీమలో పెద్దడాక్టరుపరీక్షలలో యేరుకున్నారు. ఈయన పూర్వము సేనలో డాక్టరుగా వుండేవాడు. పాపం వారిని జిల్లా సర్జనుగానైనా పంపక సూపరింటెంటుపని డాక్టరుపని వొక్కరికే యిచ్చే యేర్పాటు జేసి తద్వారా తెల్లపిల్లవాడికోసం పెద్ద వుద్యోగం సృష్టించి రెండు పనులకు రెండు ఆరువందల చొప్పున నెలకు ౧౨౦౦ లు జీతమేర్పరచి నియమించారు. ఖయిదీలవల్ల వచ్చే ఆదాయం యావత్తు యీ తెల్ల యేనుగుకు సరిపోతుంది. ఉద్యోగస్థుల కందరికీ యిండ్లు వుచితంగా యిస్తారు. సూపరింటెంటుగారి యింటి దగ్గిర రోజుకు ౧౧ మంది ఖయిదీలు వంతుల ప్రకారము పని చేస్తారు. డాక్టరు పని చేసినందుకు సూపరింటెంటుకు ౬౦౦ లు అదనంగా యిస్తున్నారుగదా? ఈ డబ్బంతా యెలా తేలాలి? ప్రతిసంవత్సరము జయిలు ఆదాతక్కువై ఖర్చు

అమితమైన లిటిగేషను తుంటే సూపరింటెండెంటు జీతం తగ్గించకుండా ఆసుపత్రి ఖర్చు తగ్గించారు. ఆసుపత్రిలో వాడేవి ముఖ్యమయినవి మూడే మందులు. ఏకమూలికా ప్రయోగం అనడంకంటె త్రిమూలికా ప్రయోగమంటే నిజం చెప్పినట్టు ఉంటుంది. విరేచనాల మందు మొదటి మూలిక, రెండవది కొయినా, నెత్తురుబంకకు పాడిపిళ్ళ మందు మూడవది. ముఖ్యంగా యీ మూటితో ఆసుపత్రి సాగిస్తున్నారు. ఇందువల్ల డాక్టరు జీతం చాలావరకు కూడి వస్తున్నది. పూర్వం జిల్లా సర్జను రోగులకు సరి అయిన పథ్యం పెట్టించేవాడు. బలహీనులకు పాలు, రొట్టె మొదలయిన ఆహారం అవసరాన్నిబట్టి యిప్పిస్తుండేవాడు. ఇప్పుడు అన్ని రోగాలకు వొకటే పథ్యం. లంకణాం పరమౌషధమన్నట్లు దెబ్బ తగిలినవాడికీ న్యుమోనియా వచ్చినవాడికి, విరేచనాలవాడికీ వరిగంజే పథ్యం. అన్నంబెట్టక మాడుస్తారని ఖయిదీలు తమ వార్డులో చావడానికైనా వొప్పుకుంటారుగాని ఆసుపత్రికి పోరు. అందువల్ల తోచినంతవరకు జయిలుకు పని చేస్తుంటారు.

డాక్టర్లకు పని తక్కువవుతుంది. మందు ఖర్చు లేదు. ఈ మధ్య స్వదేశీ ఖైదీలందరూ, ఈ సంగతులన్నీ కలెక్టరు మొదలైన విజిటర్లకు జెప్పి గోలబెట్టారు. ఇప్పుడు వాండ్లకు మాత్రం పాలూ, సబ్బుగంజీ, గోధుమగంజీ యిచ్చామనిపిస్తున్నారు. నిడదవోలు ఆసుపత్రి భాషలో పంచదార అంటే మురికిబెల్లం అని అర్థం. స్వదేశీవాండ్లు పంచదారంటే నల్లబెల్లంగాదు, తెల్లనిపొడి అని అర్థం జెప్పితే అప్పటినుంచి చక్కెర తెప్పించి పాలలోకిస్తున్నారు. ఈ పాలూ, గంజీ గూడా రోగుల అవసరాన్నిబట్టి యియ్యరు. కొత్త రోగికి పాలియ్యవలసివుంటే పాతవాళ్ళ కవసరమైనా వాళ్ళకిచ్చేవి తగ్గించి కొత్తవాళ్ళ కిస్తారు. అంటే తాము కొనదలుచుకొన్న పాలనుబట్టి పథ్యం పెడతారు. గాని పథ్యావసరాన్నిబట్టి పాలు గొనరు. డాక్టరు గొనే పాలనుబట్టి రోగాలు రావలసివుంటుంది. సామాన్యపు రోగులను ఆసుపత్రిలో వుంచరు. పొద్దుటిపూట వచ్చి మందు తాగి పొమ్మంటారు. జడ్జీగారు

వుత్తరం వ్రాయబట్టిగామాలె, వెంకటదాసుకు పాలూ రొట్టె యిస్తున్నారు.

తెల్లవారేవరకు అందరికీ గంజే వచ్చింది. రామదాసు గంజిదాగి వెంకటదాసువద్ద కూర్చున్నాడు. వెంకటదాసుకు సన్నని మబ్బులు వస్తున్నవి. సర్జను లిది గమనించలేదు. రామదాసుకు అనుమానం తోచింది.

రా:- నాయనా! కళ్లు మూసుకొన్నావేమిరా?

వెం:- ఏమీలేదు నిద్రవస్తున్నట్లుగా వున్నది.

ఇంతలో వాకిట్లో యేడ్పువినబడ్డది. రామదాసు గుమ్మంలోకి పోయి తొంగిచూచాడు. యెవడో రోగి విరోచనాలవుతున్నవని వస్తే సర్జను లిది నమ్మక కర్రబెట్టి వెనుక ముడ్డిలోబాడిచారు. రోగి కేకలు వేసి మొత్తుకుంటుంటే పిచ్చయ్య శాస్త్రి నవ్వుతూ 'విరోచనాలు కాకుండా యిదే మందురా?' అన్నాడు! ఇంకొకడు వచ్చి విరోచనాలకు మందియ్యమంటే కర్రదెబ్బలు కొట్టి దీనివల్ల విరోచనం కాలేదా? అని అడిగాడు. సకాలంలో ఔషధా లివ్వక రోగం ముదిరినాక ఆసుపత్రిలోకి తీసుకొని పోవడంచేత అధికబాధ ననుభవించిన రోగు లనేకులున్నారు. ఈ ఆసుపత్రులు వుద్యోగుల జీతాలు ముట్టడంకోసం బుట్టినవేగాని, రోగులవ్యాధులను కుదర్చడానికి కాదు. సూపరింటెంటూ, డాక్టరూ వొకడుగా వుండడం సర్వానర్థాలకు మూలం. ఈ ఆసుపత్రి చర్యలు జూచి తాను చిన్నప్పుడు చదువుకొన్న ధన్వంతరి పద్యాలలోని చికిత్స రామదాసుకు చాలా మెరుగుగా కనబడి పద్యాలు గుప్తికి తెచ్చుకొని;

"శ్లో. అర్కక్షీరే ఉసీక్షీరే శిలాచూర్ణేచ మర్దితమ్,
నేత్రద్వయేంజనం కుర్యాత్ పర్వతోపి నదృశ్యతే."

ఆ. గీ. "దగ్గుగల్గువాని డాకలి మెడగట్టి,
లోతునీటిలోన బాతిపెట్టి
ఒకటి రెండుప్రొద్దు లూరంగ బెట్టితే,
దగ్గు విడిచి వాడుదయ్యమౌను!"

అని చదువుకుంటూ లోపలికొచ్చాడు. రెండవ సర్జన్ వెంకట దాసును పరీక్షించి మంచందగ్గిర నిలువబడి చూస్తున్నాడు.

వెం:- ఈ మత్తుకు కారణ మేమి?

స:- నేనూ అదే అనుమానిస్తున్నాను. యెప్పటినుం చిది?

వెం:- నిన్న మధ్యాహ్నంనుంచి సూక్ష్మంగా అడపాదడపా వస్తూ, వుదయం వుండుండి యెక్కువగా వస్తున్నది.

స:- దొరగారు రెండుగంటలకు వస్తారు. మళ్ళీ వచ్చి చూస్తాం.

వెం:- మీరేమీ చికిత్స చేయలేరా ?

స:- వారి సలహాకూడా పుచ్చుకొంటే మంచిది.

వెం:- యెవరికీ? మీకా? నాకా మంచిది ? వెంటనే మంది వ్వడం నాకు మంచిదని తోస్తుంది. ఇప్పటికే చాలా ఆలస్యం చేశారు.

స:- వారి సలహా యెందుకయినా మంచిదే. ఈ కాస్తలో మిగిలిపోయే దేమున్నది?

వెం:- ఇక మిగలబోయే దేమీ లేదని నాకూ తెలుసు. వారి సలహా పుచ్చుకుంటే మీ జవాబుదారీ లేకుండా పోతుందని మీ వుద్దేశం. అదేకదా, మీరన్న మంచి.

స:- నీవిషయమై సూపరింటెంటుకు రిపోర్టు చేస్తా. అమర్యాదగా మాట్లాడుతున్నావు.

వెం:- మీరిపోర్టు నన్ను బాధించేయెత్తు దాటిపోయింది. రాత్రి నన్ను వొకమాటయినా చూడకపోతిరి. నిన్న పగలు చూచి నాయన సాయంత్రం రాలేదు. నిన్న ప్రొద్దున్నె యేర్పడ్డ మగత యింతవరకెవ్వరూ కనుక్కోలేకపోయినారు. మీమీద నే రిపోర్టు చేయదలచలేదు. మీ అశ్రద్ధ మిమ్మల్నే కొట్టనియ్యి.

సర్జను టకటకలాడుతూ వెళ్ళిపోయినాడు. మరొక అరగంట కల్లా మగత అధికమై సన్నగా శ్వాస బయలుదేరింది. రామదాసు

వచ్చి వెంకటదాసు ప్రక్కమీద కూర్చున్నాడు. మగత మంప్ప లుగా వస్తుండడంచేత అప్పుడు రెప్పలు మూతబడ్డవి. రామదాసు "వెంకడూ" అని పిల్చాడుగాని దేహం కదిలినా కండ్లు తెరిపిడి పడలేదు. అయిదునిమిషాలలో చక్కగా మాట్లాడాడు.

రా:- నాయనా! యెట్లా వున్నది?

వెం:- యెట్లా యేమున్నది? సమీపిస్తున్నది. ఇందాకటి మగతలో కొత్తమార్పు గోచరమయినది. ఆ అయిదునిమిషాలూ కొత్త ప్రపంచంలో వున్నట్టు కనపడ్డది. అయ్యో! నాకొక్క వ్యసనం వున్నది. నన్ను సృష్టించి అష్టకష్టాలూ పడ్డ నా అమ్మానాయనల ఋణం తీర్చుకోలేక పోతినికదా! మీకు బాకీదారుణ్ణయి వచ్చి మిమ్ముమ్మను బాధించి వెళ్ళిపోతూన్నాను.

రా:- నాన్నా! నీవు అట్లా అనవద్దు. పితాపుత్రసంబంధంలో ఋణసంబంధం లేదు ఈ సంబంధం మహాపవిత్రమై వుభయులకూ తరణోపాయమైనది. పుత్రుడిమీద దయలేని తల్లిదండ్రు లుండరు. పుత్రప్రేమచేతనే వారికి ఆత్మోపలబ్ధి కలుగుతుంది. ప్రేమస్వరూపాన్ని బొందుతారు. పుత్రోదయ మయినప్పటినుండీ తల్లిదండ్రులు చేసేసేవ సాధనచతుష్టయాలకంటే ఆత్మోపలబ్ధికి యెక్కువ సహాయ్యకారెవుతుంది. నాన్నా! నీవు మహోపకారం చేసి వెళ్లుతున్నావు. నీకేమీ ప్రత్యుపకారం చేయలేకపోయినాను

వెం:- యెవరు చేసినసేవకయినా విలువ గట్టవచ్చునుగాని తల్లిదండ్రులసేవకు విలువ లేదు. మానవులకు తల్లిదండ్రులకంటె వేరు దైవం లేదు. వారిసేవవల్లనే లోకానికి సమస్త శ్రేయాలూ కలుగుతవి.

మళ్ళీ మగత వచ్చింది. జ్వరంకూడా యెక్కువైంది. ఒకటి రెండు తబ్బిబ్బు మాటలుకూడా అన్నాడు. మాంద్యం పూర్తిగా వచ్చినతరువాత కండ్లు మూసుకొని పడుకున్నాడు. ఈ సారి మగతలో వ్రణబాధకూడా పడుతున్నట్లు లేదు. చాలా సేపటికి తెలివి వచ్చింది.

రా:- (గడ్డం పుణికి)—నాన్నా యెట్లా వుంది?

వెం:- క్రమంగా క్షీణించుకొని వస్తున్నది.

రా:- బాబూ! నా మాట విని వొక్కమాటు నారాయణా అనుకో.

వెం:- యెవ రాతడు?

రా:- దయామయుడైన భగవంతుడు తుస్కారంగా మాట్లాడగూడదు.

వెం:- భగవంతుడేమో గాని దయామయుడు మాత్రం గాడు. ఈ దయామయుడు లోకమంతా పంచమహాపాతకపట్నం చేశాడు. ఈ దేవుడనే ఆయన వొకడువుంటే జనమంతా ఆయన మీాద తిరుగబడి సన్మార్గ వర్తిని చేయడ మవసరం. యెన్నాళ్ళని ఈ ఊరుకోవడం? దీనివల్ల మనకు చాలా అగౌరవం.

రా:- యెట్లా అగౌరవం.

వెం:- మీా దేవుడు ఆలనా పాలనాలేని పరరాజువలె ఉన్నాడుగాని జనుల కష్ట నిష్ఠూరాలు యోచించే స్వదేశీ ప్రభువుగా లేడు. యెక్కడో స్వర్గంలో వున్నాడంటారు. చేతగాని వాడు అక్కడవుండి ఈ ప్రపంచపాలన యెందుకు నెత్తిన బెట్టుకోవాలె? దేశంలో దుర్మార్గ మింత యెందుకు ప్రబలాలె? మంచి చట్ట మొకటీ కనపడదు. దుర్మార్గ చట్టాలకు బుద్ధి హీనులుగాని లోబడరు. యెన్నాళ్ళని ఊరుకోవడం?

ఆస్తిక్య విషయంలో నీ కభిప్రాయభేద మున్న దనుకో. ఆ పవిత్రనామం స్మరించినందువల్ల నీకు నష్ట మేమున్నది?

వెం:- నష్టమా? అది ఆత్మవంచన మవుతుంది. "బహుధా విభజ్యమ ప్యేవం ననమేయంతు కస్యచిత్" చేయి విరిగింది. కాలు తెగింది, మిగిలిన మొండాన్ని వేయిగా విభజించినా యెప్పుడూ నా శిరస్సు వంచను. ఆ చీలికలుగూడా వంగవు.

వెంకటదాసుకు వుద్రేకంచేత ముఖం గాదరించి జేవురుగమ్మింది. నొసట వుబికి రక్తనాళాలు చెమర్చినవి.

రా:- (ముఖాన చెయిపెట్టి తుడిచి) పిచ్చితండ్రీ! కొంచెం స్వస్థపడు. నీ నమ్మక ప్రకారమే ఉండు. భగవంతునియందు నీకు నమ్మకం కలుగకపోతే నీ తప్పేమీ లేదు.

వెం:- నీకు వున్నంత ధర్మనిష్ఠ నాకు లేదు. ఊరికే నమస్కారాలు పెట్టి యేమి ప్రయోజనం? ఆత్మశుద్ధి వుండాలి.

మళ్ళీ తెర వచ్చింది. క్రిందటిసారికంటె త్వరగాకూడా వచ్చింది. చాలాసేపున్నది. తగ్గిపోంగనే కండ్లు తెరిచాడు.

రా:- నాన్నా! ఇందాకా పరిస్థితులు మారుతున్నట్లు కనబడ్డవన్నావే. ఇప్పుడెట్లా వున్నది?

వెం:- రంగమంతా మారిపోతున్నది. ఆఖరురంగంకూడా ముగింపుకు వచ్చింది. తెర పడబోతున్నది. నాటకం పూర్తిఅవుతున్నదిగదా! నే నెట్లా ఆడానో చెప్పు? నీవు నిజం చెప్పేవాడివని ఆత్మతృప్తికొరకై అడిగాను. (రామదాసు దీర్ఘాలోచనజేసి,)

రా:- నీది చాలా కొత్త నాటకం. నీ నాటకనియమాలు గూడా వేరే. కొత్తపంథా దొక్కావు. నేను మామూలుదారిని పోయినవాణ్ణి. నీది మార్గంకాదని చెప్పలేనుగాని, అంతా అవలంబిస్తే యెట్లా వుంటుందో చూడాలె. నీమార్గం నియమబద్ధం మటుకు అవును. ఆ నియమాలు చాలా వుత్కృష్టమైనవనీ, అమలులో పెట్టడం గష్టమేమో ననీ, చాలామందికి అనుమానం.

వెం:- ధర్మాచరణం ఎప్పుడూ కష్టమే. అలవాటుపడితే సులభమేఅవుతుంది. ఇదివరకు జయిలుజీవితంయొక్క యేర్పాట్లు నీకు దెలియవు. నేను యిదివర కొకమాటు మూడుసంవత్సరాలు శిక్షబడి మారుపేరుతో జయిలులో మూడు నెల్లుండి నాబదులింకొకణ్ణి బెట్టి వేలుముద్రలు సూపరిండెంటుకు యిచ్చి వెళ్ళిపోయినాను. ఇంకొకాయన సూపరిండెంటుగా వుండేవాడు. ఆ దొరపరీక్షయి ముఖ్యసమయాల్లో నన్ను బయటికి పంపడానికీ, నాయకులు వచ్చి నావల్ల సలహాలు పుచ్చుకోవడానికీ సదుపాయం చేసి తానుకూడా లాభం పొందుతుండేవాడు. నాసిద్ధాంతాలు ఆచరణ

సాధ్యమా గాదా యనిగదా నీకు సందేహం. ఈ జయిలుపద్ధతి చూస్తే నాసిద్ధాంతా లెందుకు ఆచరణయోగ్యాలు కావో తెలియకుండా వున్నది. ఇక్కడ జన్మఖయిదీ లున్నారు. యౌవనులూ, వృద్ధులూ, నడిపయస్సువాండ్లూ వున్నారు. కొందరు పిల్లలూ ఆడవాండ్లతో వుంటారు. ఖయిదీలే చాలామంది వుద్యోగస్తులుగా వుండి, జయిలుపని యావత్తూ నడిపిస్తున్నారు. అమెరికా జయిళ్ళలో సర్కారు వుద్యోగస్తులసంఖ్య చాలా తక్కువ. అక్కడ జయిళ్లు స్వరాజ్యం గల చిన్నచిన్న సామంతరాజ్యాలుగావుంటవి. సామంతరాజ్యాలన్నీ స్వపరిపాలనం గల జయిళ్ళనే చెప్పవచ్చు. జయిలురాజ్యంలో ఖయిదీ లెన్నుకొన్నా లేక చక్రవర్తులేర్పాటు జేసినా జయులు అధికారులను ప్రభువులక్రింద యెంచుకొందాం. అయిర్లండు, బవేరియా, మైసూరు స్వరాజ్యంగల సామంత రాజ్యాలు. జయిళ్లుకూడా యిటువంటివే అనుకో. సామంతరాజ్యాల పాలనకూ జయిలురాజ్యాల పాలనకూ భేదమున్నది. జైలు చిన్న గ్రామమంత రాజ్యం. దీంట్లో రెండువేలజనం, దీనికి రెండువేల యకరాలభూమిా వున్నవి. అయితే భూము లంత మంచివికావు. అంతా గరువే. కొంత కుందేటికండ నేలకూడా వున్నది. భూములు మంచివైతే దీనికి కావలసినధాన్యంకంటే యెక్కువే పండించవచ్చు. ప్రతివాడూ పనిచేయక తప్పదు. ఖయిదీల తెలివితేటలనుబట్టి ప్రతివాడికీ అధికారులే వృత్తివిభజనము చేసి పని నియమిస్తారు. అనేకవృత్తులు చేస్తారు. వాటిమూలంగా ధనాకర్షణ చేస్తున్నారు. రత్నకంబళ్ళు, చక్కని చెప్పులూ, చిరిచాపలూ మొదలయిన వెనోన్న సున్నితపుపనులు జరుగుతూవున్నవి. ఎవ డియ్యవలసినపని వాడు సాయంత్రానికి లెక్కప్రకారం వొప్పజెప్పతాడు. భూముల వల్లా వచ్చే ఆదాయం యావత్తూ ప్రభుత్వానికే పోతుంది. భూములూ దానివే. వృత్తులకు పెట్టుబడీ అదే పెట్టుతుంది. జయిళ్ళవల్ల చాలా ఆదావస్తుంది. అయ్యేఖర్చుకంటె కూడా మిగులుతుంది. మిగిలినడబ్బు యావత్తూ కొందరే అపహరిస్తారు. ఖైదీలకు కడుపుకొట్టి, అర్ధాన్నంబెట్టి, అధికారులే వందలూ వేలూ

జీతాలు తింటారు. సూపరింటెండెంటుకే యింటిఅద్దె మొదలయినవి కల్పుకొని సంవత్సరానికి పదహారు వేలరూపాయిలు ముట్టుతవి. నెలకు ౧౨౦౦ వంతున వార్డర్ల జీతం అవుతుంది. యింకా వుద్యోగు లనేకులున్నారు. ఇందులో చాలా భాగం కొట్టివేస్తే జనాని కన్నవస్త్రాల కేమీ లోపమే వుండదు. ఈ జయిలు జనంలో రాజూ, బంటూ, ధనికుడూ, దరిద్రుడూ, కులస్థుడూ, కులహీనుడూ మొదలయిన భేదాలన్నీ సమసిపోతవి. అందరూ పని చెయ్యాలె. అందరికీ ఒకటే భోజనం. వొకటే మోస్తరు గుడ్డలు. పక్కలూ వొకతరహావే. అందరికీ గట్టియిండ్లే. రేపనేదిగులు లేదు. పోటీలు లేవు. అదుర్దా లేదు. ఆసుపత్రీ స్కూల్‌కూడా వున్నవి. అవి యింకా వృద్ధి చేసుకోవచ్చు. జయిలుభూములలోగాని, వృత్తులలాభములలో గాని వ్యక్తిసత్వాలు లేవు. అన్నీ జయిలువే. జయిలువంటే జనాని వన్నమాట. తొంబయితొమ్మిదిమంది పస్తు పడుతుంటే, వొకడు పండుగ చేసుకొని, పిండివంటలు తినేపద్ధతులు యిక్కడ లేవు. వ్యక్తిసత్వాలూ, అనవసరతారతమ్యాలూ లేని సర్వసమత్వ ధర్మం జయిలులో ప్రతిపాదింపబడుతున్నది. అయితే జయిలుకు రావడానికి జనులకు భయ మెందుకు? యెవళ్ళు భయపడుతున్నారు? బయట సోమార్లుగా దిని పికార్లు కొట్టే భోగపురుషులు భయపడతారు. బయట పస్తులు పడీ పడీ వారాని కొక్కమాటయినా కడుపునిండా భోజనం లేక, చేసుకొందామంటే పని దొరకక, చేస్తే, కడుపునిండక మలమలమాడే జను లందరికీ జయిలంటే సంతోషమే! జయిళ్ళకు పోవడంవల్ల వచ్చే అపకీర్తి, బంధువియోగం, జయిలువెలుపల సోమారు లనుభవించే భోగమూ కొంతవరకు జయిలంటే జనులను భయపెడతవి. కాని యీ పద్ధతి దేశజనులంతా అవలంబించి, జయిలుజీవితానికి అనుబంధంగా వుండే పారతంత్ర్యం, బంధువియోగం, అల్పభోజనం, అపకీర్తి మొదలయిన లోపాలు తొలగిస్తే, జను లందరూ యీ జీవితమందు వుండే అసహ్యతను పోగొట్టుకొని దీనికి అలవాటు పడతారు. ఈ పద్ధతిలోవుండే అసాధ్య మేమీలేదు. ఆచరణలో పెట్టడానికి

ఆటంకాలు ధనికవర్గమూ, దానిచేత రక్షించబడే నిరంకుశ ప్రభుత్వమూ తప్ప, వేరే లేవు. నా ధర్మం జనులవలంబిస్తే, ప్రతివాళ్లూ యథాశక్తిగా పాటుపడి, అవసరమైనంత తిని, గుండె నిమ్మళంగా రేపనే చింత లేకుండా, విద్యాబుద్ధు లభ్యసిస్తూ, పస్తులు లేని, భోగాలులేని. రోగాలులేని, వ్యాజ్యాలులేని, ద్వేషాలులేని స్వచ్ఛంద జీవితాలు అనుభవించడానికి అవకాశ ముంటుంది. దేవు డొక డుంటే యిప్పుడాయనదగ్గరకు వెళ్ళుతాగదా? యీ మార్గం ఆయనకు పనికివస్తుందేమో కనుక్కుంటా. స్వర్గరాజ్యం దేవుడు వచ్చి భూమిమీద స్థాపిస్తాడని కొందరు చెప్తూవున్నారు గదా? ఆ వొచ్చే దేవుడికి యీపద్ధతంతా వ్రాసిస్తాను. అయినా వొక్క సందేహం. దేవుడువచ్చి ఆమాట చెప్పినా ధనికు లాయనను అంగీకరిస్తారని తోచదు. ఆయన దేవుడు కాడని వాళ్ళే అంటారు. శిలువన కొడతారు. బందిపోటువొం గంటారు. ఖయిదులో వేస్తారు. అప్పుడు బీదవాండ్ల దేవుడూ భాగ్యవంతుల దేవుడూ వేరవుతారు. రెండు సైన్యాలుగా యేర్పడి యుద్ధం చేస్తారు. అది నైతికయుద్ధం. అధర్మం నశిస్తుంది. ధర్మం స్థాపిత మవుతుంది. దయామయుడయిన దేవుడు లోకం పాలిస్తాడు. ఆయనను జనులంతా తండ్రినిప్రేమించినట్టు అనగా, నిన్ను నేను ప్రేమించినట్టు ప్రేమిస్తారు. అంతవరకూ అమ్మనూ నిన్నుమాత్రమే ప్రేమిస్తా. మీాయిద్దరే దేవుళ్ళు.

మళ్ళీ మంపు వచ్చింది. రామదాసు నిశ్చేష్టుడయి వింటూ కూర్చున్నాడు. చెప్పడం ఆగినతర్వాతకూడా, తనకూ మగత వచ్చినట్టే కూర్చున్నాడు. ఈ తడవ మగత వొక అరగంటసే పున్నది. మళ్ళీ తెలివి కొంతతగ్గే వచ్చింది. వెంకటదాసు పేజీ తిప్పినట్టు తిరిగి ప్రారంభించాడు.

రా:- నాన్నా! నీ జీవితం విచిత్రనాటకం.

వెం:- అట్లాగా? నీ అభిప్రాయం నే శిరసావహిస్తాను. నాకు మరణ మాసన్న మవుతున్నది. తెర పడబోతున్నది. రంగాలన్నీ మరుపురు వస్తున్నవి. సూర్యచంద్ర తారకమండలాలు గుప్పికి

మరుగవుతున్నవి. మనమాలకొండ, వూరగొండా, కొండవీటి కొండా, గన్నేర్లవాగూ, పల్నాటిఅడవులూ, నల్లమల వనాంత రాలూ నాకు ప్రియము లయిన సనాతనులూ, తెరలోకి బోతు న్నారు. ఆహా! అమ్మా నీవు తప్ప నా కితర ప్రపంచ మేమీ గోచరం కావడం లేదు. ఈ లోకంయొక్క పొలిమేర గట్టుమీద నుంచున్నాను.

అక్కడా మీ—రి—ద్ద—అంతా శమించినది. ఈ శరీరములోనుండి లోకమంతా వెలిగిన కలకాంతి గల మహాతేజం గుప్పున ఆకాశానికి లేచింది. రామదాసుకు మాత్రం దృష్టిగోచర మయింది.

రా:- నాన్నా! నే పెంచినశరీరం నా యెదాన పారవేసి వెళ్ళిపోయినావా?

జవాబు లేదు. అంతా నిశ్శబ్ద మయింది. రామదాసు సమాధినిష్ఠుడయిన యోగీంద్రుడివలె కూర్చున్నాడు. తర్వాత సూపరింటెండెంటుకు యీ వార్త తెలిసి, ఆసుపత్రికి వచ్చి, నీకు కావలసినప్పుడు తల్లీ కొడుకుల శల్యాలు తీసుకపోవచ్చు నని ఆర్డరు వేసి ఖననం చేయించాడు.

## ౧౦

### అహింస

మరురోజు సూపరింటెండెంటు రామదాసుకు మెడన నల్ల దారము కట్టించి 1 టో బారకాసుకు పొమ్మన్నాడు.

సూ:- నీవు చేతనయినంతమట్టుకు యేదయినా తేలికపని చేస్తూవుండు. తూకువేసే వాడికి సహాయంగా వుంటావా? ప్రస్తుతం వాడికి ఇచ్చే ఒకరూపాయిలో నీ కొకపావులా యిప్పిస్తా.

రా:- ఆపనేమిటో నాకు తెలియదు. తాళ్లు బాగా పేను తాను. ఆ పని చెప్పండి.

సూ:- ఖూనీ చేసినవాండ్లను ఉరిదీయడం.

రా:- రామచంద్రా! ఇంతబతుకూ బతికి ఇంటివెనుక చావనా అయ్యా, నాకు చాతగా దాపని.

సూ:- అది చేతగాకపోతే అడవలో యీగలు చంపడాని కుండు. తాడు పేనడము కఠినమయినపని. చేతులు పోతవి.

రా:- వద్దు వద్దు. తాడుపని బాగా అలవాటు. నాలుగు రోజులు చేయించి చూడండి.

సూ:- ఈగలపని చాలా సులభం. ముసలివాండ్లకు తగిన పని. ఎండలో తిరగనవసరం లేదు. వాకిటిదగ్గిర కూర్చొని వచ్చే పోయే వాటినల్లా చంపవచ్చు.

రా:- నాకు తాడుపనే యిప్పించండి. చేయిదిరగగా మొదటినుంచీ పేనినవాడిని.

సూ:- సరే నీ యిష్టము. ఆ పనికే పో. చేయలేనప్పుడు చెప్పుకో మార్చుతా.

రా:- చిత్తం.

రామదాసు ఒకటో బారకాసుకు పోయినాడు. రెండో వార్డులో ఒక అరుగిచ్చారు. కామానాయుడినీ, పుల్లప్పనూ, బయటపని తీసివేసి ఆ వార్డులోనే వుంచారు. ఆ బారకాసులో ౫ సావిళ్ళున్నవి. ఒక్కొక్కదాంట్లో వొక చిన్న కక్కసు దొడ్డి వెలుపలికి కట్టివున్నది. ఇది చాలా పూర్వోత్తరపుపద్ధతి. మల మూత్రాలకు రెండు అరలుగా వుంటవి. కడుక్కోవడానికి అవ కాశంగా వున్నది. గదిలోవాండ్లు కనుపడరు. దాంట్లో బానలు రెంటికీ పెట్టారు. ప్రతిగదిలోనూ ౧౩ అరుగులు వుంటవి. రెండు గదులకూ మధ్య గోడలో యెత్తుగా కిటికీలో రెండుగదులకూ వెలుతురుకనపడేటందుకు లాంతరు పెడతారు. అయిదుగదులకు గాను రెండులాంతర్లు వున్నందున ఒకటి చీకటి గుయ్యారమే. లాంత రులో చిన్నదీపం పెడతారు. లీలగా కనపడుతుంది. మామూలు తదంగాలు జరిగి అంతా భోజనం చేశారు. రూలుప్రకారము వొక్కొక చావిట్లో ౧౩ గురుని వుంచవలసినా, జనమెక్కువయి

నప్పుడల్లా ౧౨ రింటిదాకా వేస్తారు. ఆరోజు ఎక్కువగా వేసిన ఇద్దరూ నేలమీద పడుకొన్నారు. రామదాసుకు వొాకమూల అరుగువచ్చింది. పాకీకుండలకు దూరంగా కూడావున్నది. కామా నాయుడూ పుల్లప్పా నోటిమంచితనాన రామదాసుక్రుపక్క అరుగులవాండ్లకు తమ అరుగులిచ్చి వాండ్లవి తీసుకొన్నారు. రామదాసుకు పారజూసుకొంటే ఈ జయిలు ప్రపంచములో ఆప్తులు వాండ్లిద్దరే కనపడ్డారు. బయటమాత్రం మెవరున్నారు? బొడ్డూడని పిల్లవాడూ వెంకటయ్యా, రామానాయుడూ, లోకబాంధవులు. రామదాసుకు లోకములో ప్రత్యేకబంధాలు తెగినకొద్దీ లోకబంధుత్వభావం మెక్కువవుతున్నవి. సంగరహితుం డయివున్నాడు. స్వార్థ చింత పోయింది. పరార్థచింత బల మయింది. కేవలం సన్యాసైనాడు. ఆయన విడిచిపెట్టింది బాహ్య వేషాలుగావు. ప్రపంచం విడిచి అడవికి బోలేదు. జనం మధ్యనే విజనస్థలం సమకూర్చుకున్నాడు. అరిషడ్వ ర్గాలు జయించాడు. ఇం కాయనకు శత్రువులేరీ! వాచా లత్వం, వాక్పారుష్యం, హేళనా అంతర్థాన మయినవి. మృదువాక్కులతో అప్రియం గాకుండా హేతువు చెప్ప గలడు. కొంతవరకు జింహ్వాచాపల్య ముండేది. వుప్పుకారంలేని జయిలు భోజనంచేత అదీ కట్టుబడ్డది. శమదమాదు లేర్పడ్డవి. శాంత స్వరూపు డయినాడు. తరంగఘోషలో శయనించిన విష్ణుమూర్తివలె పాటలూ, కేకలూ, బూతులూ చెలరేగుతున్నా నిశ్చలమయిన మనస్సుతో అరుగుమీద పడుకున్నాడు. పుల్లప్పా కామానాయుడు దూరంగా కూర్చొని బీడీ తాగివచ్చి 'అయ్యా! నిదురబట్టిందా?' అని పిలిచారు.

రా:- లేదు. ఊరకనే కండ్లు మూసుకొని పండుకున్నాను. ఏమి టా పిండివంట వాసన?

పు:- ఏమీ లేదు. ఖైదీలు కొందరు భండారములోనుంచి కందిపప్పూ, నూనె తెచ్చుకొని వడలు చేసుకొంటున్నారు.

రా:- బయటికి వాసన కొట్టితే వార్డర్లూరుకుంటారూ ?

పు:- జయిల్లో రాత్రులు ఫారావేసేది ఖైదీవార్డర్లే. కావలంబులలో మోస్తరు కాదు. తొమ్మిదిగంటల తర్వాత వొకరు గడియారం చూడడానికీ, మరొకరు తనిఖీకి వస్తారు. టవరులో యిద్దరు హెడ్ వార్డర్లు మాత్రమున్నా పారాకు రారు. ఖయిదీ వార్డరు చూచినా రెండు వడలిస్తే చూడనట్టే వుంటాడు. తమకు రెండివ్వమని నా చేతికిచ్చారు.

రా:- భండారములో చోరీచేసి తెచ్చారన్నమాటేనా?

పు:- ఆ మాట అంటారని అనుకొంటూనే వున్నాము. ఏదో వాండ్ల తంటాలు వాండ్లు పడతారు. దీక్షశిక్షలు బొంది చప్పిడికూడు తింటూ నాలుక చవిచచ్చి యెంతకాల మని వుంటారు? వాండ్ల పడైనా వాండ్ల కిస్తున్నారా అంటే అదీలేదు. భండారమంతా వుద్యోగస్తులు దోచుకుంటుంటే, వీళ్ళుమాత్ర మెందుకు తినగూడదు ?

రా:- ఈ విషయములో తగువు చెప్పడానికి నాకు తోచ లేదు. అయినా అవి నాకు వద్దు. ఆ కముకుకం పేమిటి ?

పు:- అరే! అదీ యిప్పుడే పెట్టారు. తమకు చెప్పవలసింది కాదు. కొందరు మాదిగెలు వుడతలను వుచ్చులువేసి పట్టుకొని యిప్పుడు కాల్చుకొంటున్నారు. పిండివంట చెయ్యంగా నూనె మిగిలితే దాంట్లోవేసి పేలుస్తున్నారు.

కా:- మీరు మాంసం తినరా ?

పు:- వారు ముట్టుకోరు.

కా:- అయితే గారెలుకూడా వారికి పనికిరావు. మెత్తనిది పిండిలో కలిపారు.

పు:- అదొకటా ? వారు తీసుకోకపోవడమే మేలయింది. లేకపోతే అభాసుపనౌను. ఇవ్వే మనవాండ్లుచేసే అవకతవకపనులు.

కా:- అయితే నాకూవద్దు.

తక్కినవాండ్లు:- అయ్యా మాకూ వద్దు, మాంసంగూడా తినం. పొద్దున రెండూ యెవరికీ తెలియకుండా పారవేస్తాం.

రా:- సరే బాగున్నది.

పు:- మా కేమయినా మంచిమాటలు చెప్పండి. ఇక్కడ మిమ్మును సెటిలోమెంటులో మోస్తరుగా వద్దనేవాండ్లు లేరు.

రా:- మీ కందరికీ తెలియని మంచిమాట లేమున్నవి? సంగతు లందరికీ తెలుసు. వాటిప్రకారం నడుచుకోంగాని.

పు:- చదువుకుంటే విశేష సంగతులు తెలుస్తవి.

రా:- తెలుస్త వన్నమాట నిజమే. చదువు వేరు; సద్గుణం వేరు. ఇప్పుడు మీకు తెలిసినవి ఆచరించండి. చదువుకొనేవిష యమై సోమవారం దొర నడుగుదాం.

పు:- అవును. మమ్మ నిప్పు డేమిచేయమంటారు?

రా:- మీ రెవ్వరూ లోలాయలవలె తిరుగకుండా మీరు చేయవలసినంతపని జేసి బయటికి బోయినా జీవనాధారంగా పనికి వచ్చేది యేదో వొకవృత్తి నేర్చుకోండి. మీ అభిలాషనుబట్టి, యెవ రేమిచేయవలసినదీ రేపు యేర్పరుచుకొందాం. నాకు సల్లదార మిచ్చినా నలుగురితోపాటు దారంపేని చూపిస్తాను.

కా:- రోజూ దేవుడిపేరు తలుచుకోవడం మంచిది.

రా:- అవును. సాయంత్రం, వుదయం మనమంతా గలిసి ప్రార్థన చేతాం. మనం మాట్లాడుకోవడ మయినతర్వాత యీ రోజే ప్రారంభింతాం.

కా:- తరువాత యేమిటి?

రా:- మీ కొక్కసంగతి చెపుతాను కోపపడకుండా వుంటే.

కా:- మా మేలుకోసమేగదా? తమరుచెప్పడం. కోప మెందుకు?

రా:- స్వరాజ్యవుఖయిుదీలు కక్కసుదొడ్లో తొట్టినిండా మాయిూలు ప్రకారం నీళ్లు పోయించి వుంచవలసిం దని దొరతో

చెప్పితే దొర ఆ ప్రకారం పోయిస్తున్నాడు. మీరు కడుక్కోవడంలేదట. అది యెందువల్ల

కా:- ఎందువల్లనంటే, వీండ్లలో కొందరికి యెన్నడూ అలవాటు లేదు. పశువులు మోస్తరే. తక్కినవాండ్లకు పూర్వం అలవాటున్నా జయిలుకు వచ్చిన తరువాత బొత్తిగా తప్పిపోయింది. వీండ్లందరికీ యిక అలవాటు చెయ్యాలె.

పు:- రాత్రిపూట మన సావిట్లో నీళ్ళు లేవుగదా, దానికేమిచేతాం? నీళ్లు లోపలికి తెచ్చుకున్నా అవి బయిటికి పోయే మార్గం లేదు.

రా:- వీలయినంతవరకు చూతాం. ఇంతకంటె మంచి రోజులు వస్తే యెక్కువ సంగతులు ఆలోచించుకొందాం. కేవలం అవసరమున్నవాండ్లు తప్ప రాత్రులు కక్కసుకు పోవద్దు. పొద్దున లెక్క కాంగనే పోదాం; దొడ్లో అందరికీ స్థలం వ్యవధి లేకపోతే దొరతో చెబుదాం. దొడ్డి పెద్దదయినా చేయిస్తాడు లేక పని 24 కైనా ప్రారంభించమని అడుగుదాం.

పు:- అడిగితే వినే నాథు డెవరు? ఎండాకాలంలో ఆరింటికి పని ప్రారంభిస్తారు.

కా:- స్వరాజ్యపు వాండ్లకు తెలియపరుచుదాం. వాండ్లు యిక్కడ ప్రయత్నించి నిశివేరకపోతే బయటికి వెళ్ళిన తర్వాతనయినా పని జేస్తారు. సంగతులు యావత్తూ బయటబెట్టడం అవసరం. అందాకా యెందుకు? స్వదేశీవాండ్లు యిక్కడ కుళ్ళంతా బయటపెడతారనేగదా వాండ్లకు అన్ని సౌకర్యాలు యేర్పరుస్తున్నారు. మనంకూడా అట్లా చేస్తే మన మాటలు మాత్రం యెందుకు వినరు?

ఒక ముసలివాడు:- సరే యిదంతా బాగానే వున్నది. నీవు చెప్పావు. మేము వినుకొంటాం. ఈగలు చంపమంటే నీవు తప్పించుకొని వూరుకొంటివి. నా సంగతేమిటి? రోజూ సాయంత్రానికి వొక పందయినా చూపించాలె. నీవు మాంసం తినవద్దంటివి. రోజుకు నూరింటిని జంపితేనేగాని నా బ్రతుకు వెళ్ళదు.

రా:- ఇది చాలా పెద్దప్రశ్న. హింస పనికిరానందువల్ల మాంసం తినడం తప్పు. మాంసం కోసం చంపడం తప్పు. ఇది పూరికే చంపడమే. వీటివల్ల ఆరోగ్యం చెడుతుందని గామాలె యింత యేర్పాటు చేశారు. అబ్బా! నాకేమీ చెప్పడానికి తోచడంలేదు. మనుష్యులు స్వరక్షణం కోసం చేసేపని యిది. స్వలాభం కోసం యితరులకు హాని చెయ్యవచ్చునా? వ్యసని గాకుండా లోకబాధ నివారణార్థం వేటాడవచ్చునన్నారు. ఈగలు చంపడమూ దానికిందనే తీసుకోవాలె. ఫలాపేక్ష రహితంగా చేయవలెనన్నమాట. ఈగలు చంపవలెననే వాడికి వ్యసన మేమున్నది? జింకలను వేటాడి మాంసం దింటారు. గాని వన్యమృగాల మాంసం పనికిరాదు. ఈగలూ పూరికే చంపేవే. ఈగలు చంపడం క్రూరమృగముల వేటమోస్తరే అందామా? సుబ్బన్న తనపని తాను నెరవేర్చాడు. ఆ పని యెందుకు వొప్పుకోవాలె. ఒప్పుకోకపోతే నీకిచ్చినపని చేయవలసిందని నిర్బంధిస్తారేమో. ఆయనే తన నిర్బంధం తప్పించుకోవడానికి యితరులను బాధించడం న్యాయమా? అంతకంటె వుద్గ్రంథం లేదుగదా? భారతంలో యేమిచెప్పారో ఆలోచింతాం. అహింస అన్నిటికన్న యెక్కువ ధర్మమన్నారు. అహింసా ధర్మాన్ని పూర్ణంగా ఆచరిస్తే యితరుల మనసుకుగాని, దేహానికిగాని నొప్పి గలిగించగూడదనందున అన్ని ధర్మాలూ దీనిలోకే వస్తవన్నారు. ఏ నేరం చేయడానికీ వీలుండదు. మాంసం దింటే శరీరానికి అనేక విధాల లాభమంటూ, నీకు లాభమని యితరులకు హానిజేస్తావా? అని భారత మాక్షేపిస్తుంది. ఈ ధర్మం భీష్ముడు ధర్మరాజుకు జెప్పాడు. మన ధర్మవ్యాధుడు కొత్త పంథా దొక్కాడు. ప్రపంచంలో హింస చేయనివా డెవడో చెప్పమని సవాల్ గొట్టాడు. కూరగాయలు తరిగితే వాట్లో జంతువులు చావవా అన్నాడు. చెట్లు నరికినా, మొక్కలు తరిగినా, లోహం కాచినా బాధచేత గిలగిల కొట్టుకొంటవని ప్రకృతి శాస్త్రవేత్త

యయిన చంద్రవసుగారు ప్రతివాండ్లకూ ప్రత్యక్షంగా చూపించారు.

ఈయన కొత్త సిద్ధాంతంవల్ల అహింసాధర్మ మెగిరిపోయిందని కొందరంటున్నారు. అయితే మనుష్యుడు మనుష్యుణ్ణి హత్యచేస్తే తప్పా? తప్పుగాకపోతే చంపినవాణ్ణి వురిదీయమని చట్టమెందుకు బుట్టింది? పెద్దచేప చిన్న చేపను తిన్నట్టు బలవంతుడు బలహీనుని జంపి వాడి ఆస్తి యెందుకు వేసుకోగూడదు? మనుష్య మాంసం తినే అడవిమనుష్యులను హీనంగా యెందుకు చూడవలె? రాక్షసులను క్రూరులని యెందు కనాలె? తీసినకొద్దీ వస్తున్నది. మాంసం తినడమేకాదు. మనుష్యులను చంపడంకూడా తప్పుకాదని తేలుతుంది. హత్య తప్పని చట్టంచేసి పెట్టుకున్నారు. పైగా చంపినవాణ్ణి వురిదీయమన్నారు. అయితే యింతకూ పర్యవసానమేమి? వసుగారి సిద్ధాంతం పూర్వపు 'అహింసా పరమో ధర్మః' అనే ధర్మాన్ని తోసివేసిందా? లేదు. తోసివేయడానికి బదులు దానిని విస్తరింపజేసింది. ఏసు మానవులందరినీ తనతో పాటువారినిగా ప్రేమించమన్నాడు. బైబిలులో చంపడం దోషమని చెప్పితే మాంసభక్షకులగు తదనుచరులు మానవులను చంపడం మాత్రమే దోషమని అర్థం చేశారు. సర్వభూతములను సమానంగా చూచుకుండేవాడే పండితు డని వుపనిషత్తు చెప్పుతున్నది. మహమ్మదీయులు మాంసభక్షకులయినా హింస చేయక పూర్వం ప్రాయశ్చిత్త పూర్వకమయిన మంత్రం చదువుతారు. బిసిమిల్లా చేయక చంపిన జంతువు మాంసమును వారు తినరు. ధర్మవ్యాధుడు వసుగారి సిద్ధాంతమునకూ కలిపే జవాబు చెప్పాడు. చంపడమంతా హింసే నంటూ సాధ్యమయినంతవరకు హింస మానవలసిం దన్నాడు. జంతువులనుగాని, ధాన్యంగాని, మొక్కలుగాని తినందీ జీవిత మసాధ్యమని గ్రహించి ప్రకృతిశాస్త్రసిద్ధమయిన ధర్మమునే బోధించాడు. హిందూధర్మ శాస్త్రాలప్రకారం వృక్షలతాదులనేకాక లోహములను కాల్చడమూ హింసే. అందువల్లనే లోహకారకవృత్తిని అహింసదృష్ట్యా ప్రశంసించలేదు.

ఇంకొక ధర్మసూక్ష్మం గూడా వున్నట్లున్నది. కపిలడార్వినుల గుణపరిణామ సిద్ధాంత ప్రకారం మనకు కనపడేటంతవరకు మానవుడు చివరిమెట్టు. అణువు మొదలు మానవునివరకు కోట్లకొలది జన్మలలోని అనుభవం పేరి మానవుడయినాడు. అందువల్ల మానవజన్మ యెక్కువ విలువగలది. అందువల్లనే ప్రతి మతంలోనూ మానవజన్మ ఉత్తమమయిన దంటారు. అందువల్లనే శిక్షాస్మృతులు మనుష్యుని జంపినందుకు ఉరిశిక్ష జెప్పి తక్కిన జంతువులను జంపితే తక్కువశిక్ష విధించుతున్నవి. లోహాలను జంపినందుకు దోషం చెప్పినవిగాని శిక్ష చెప్పలేదు. దూడకంటె పడ్డకూ అంతకంటె గేదెకూ ఖరీదు యెక్కువగదా? అటులనే పరిణామ సిద్ధాంతప్రకారం పైమెట్టులో వుండే భూతాలు క్రింది క్రింది మెట్టులో వానికంటె యెక్కువ విలువగలవి. కనుక పై మెట్టులోని వానిని జంపడం యెక్కువ దోషం. అందువల్లనే ధర్మవ్యాధుడు సాధ్యమైనంతవరకు తగ్గిన హింస చేయమన్నాడు. మఱియు భూతము లన్నిటికీ వొకటే విధమైన బాధ లేకపోవచ్చు. పైకి పోయినకొద్దీ పంచేంద్రియా లెక్కువ సున్నితములై బాధ గూడా యెక్కువ వుంటుంది. వసుగారు చెప్పే ప్రకారం గూడా లోహాలకు యెక్కువ వేడిని స్తేగాని బాధపడుతున్నట్టు కనుపడదు. ఉత్తపత్తికున్న స్పర్శజ్ఞానం తక్కినవానికి లేదు. వృక్షంకంటె జంతువులకు స్పర్శజ్ఞాన మెక్కువ. ఓషధుల హింసకంటె జంతువుల హింస బాధనుబట్టి యెక్కువయి తీరవలె. కనుకనే శాఖాహారం మాంసాహారం కంటె అహింసరీత్యా మంచిదయి వుంటుంది. ఇంకొక సంగతికూడా వుంది. మాంసవర్జనం కేవల అహింసా ధర్మంమీద ఆధారపడ్డదిగాదు. మనము తినే ఆహారాన్నిబట్టి మనలో సాత్విక రాజసతామస గుణాలు వృద్ధియౌతవి. మాంసం కంటె తామసగుణాన్ని వృద్ధిచేసే శాకా లనేకమున్నవి. అటువంటి శాకములన్నీ ధర్మశాస్త్రాలు నిషేధిస్తూ సాత్వికగుణాన్ని పెంపుజేసే జంతువుల మాంసములను గూడా చెప్పినవి. ఆ మాంసములు విశేషంగా రుచించునవి గూడా గావు. అట్టి జంతువులూ పక్షులూ

అరుదుగూడాను. కనుక మాంసం రాజస తామస గుణాలను వృద్ధి జేస్తుందనే నిషేధించబడ్డది. కనుక జంతుహింస చేయవద్దని ఖండితంగా చెప్పవచ్చు.

అబ్బీ! విను. నేను యింతసేపటినుంచీ యోచించాను. ఈగలు చంపడం తప్పే. ఇల్లు శుభ్రముగా వుంచితే యీగలే రావు. ఈగలు వాలడంవల్ల అనారోగ్యం వృద్ధి అవుతుందనడం కంటే అనారోగ్యవస్తువులు యిండ్లలో వున్నట్టు యీగలు ముసర డంవల్ల నిశ్చయించి వాటికి కృతజ్ఞత చూపి యిల్లు బాగుచేసుకో వడం మేలు. ఈగలను చంపమనడం చిత్రంగా వున్నది. మీ రెంతమంది వున్నారు? మీ కెట్లా చిక్కుతవి!

ము:- మేము ముగ్గురు ముసళ్ళం వున్నాం. వాకిళ్ళదగ్గిర నిలిచి లోపలవచ్చే వాటిని మాకిచ్చిన తోలువిసనకఱ్ఱలను ప్రయో గించి సంహారిస్తాం. చంపినవాటిని నీళ్ళపాత్రలో వేసివుంచితే ప్రతి రోజు దొరగారు తనిఖీకి వచ్చినప్పుడు అవి దేవి పాతవో కొత్తవో పరీక్షించి దూరంగా పారవేయిస్తారు. వారికి యీగలు చంపించ డం మీద వుండే శ్రద్ధ వంటపదార్థం దొంగిలించకుండా చేయ డంలో గాని సరిఅయిన సామాగ్రి యిప్పించడంలో గాని వుప యోగిస్తే బాగుండు. మేము సోమరులమై కొత్తవి చంపకుండా నిన్న చంపినవే నీళ్ళలోవేసి తనకు లెక్కచూపిస్తామని అనుమా నం. మరిన్ని చంపకపోతే మాకు శిక్షగూడాను.

కా:- వీండ్లు యీగపులులు. వీండ్లు యీగలను లేచి కొట్ట నవసరం లేదు. వుసులుగారే ముసలికండ్లతో వాకమూల గూర్చుంటే దారినబోయే యీగలన్నీ దీపంలోబడే రెక్కలపురు గులవలె వీండ్లకండ్లమీదికి వచ్చి వాలుతవి. వీండ్లలెక్కకు అవే చాలు. ఈ కంపుగొట్టే ముసలివాండ్లను వంటయింట్లోకి రాకుండా చేస్తే ఆరోగ్యం యెక్కువ బాగా వుంటుందని నా అభిప్రాయం.

అంతా నవ్వారు.

## ౧౧

ఉరిశిక్ష

వెంకటస్వామి (కండ్లారుస్వా) దేవరా! ఈగలు చంపడం అనవసరమనీ, పనికిరాదనీ చెప్పారు. మరి నాసంగతేమిటి?

రా:- నీచేత యేమిపని చేయిస్తారు?

వెం:- ఉరిదీయడం!

రా:- ఉరిదీయడమా? చెప్పుచెప్పు సవిస్తరంగా. అక్కడ యేమేమి చేస్తారో! ఈపని నీ వెందు కొప్పుకున్నావు?

వెం:- స్వప్రయోజనం, స్వామిపనీ రెండూ కలిసివచ్చినవి. దుర్మార్గులను వురిదీయడం లోకానికి వుపకారంగదా? నాకూ మా అన్నకూ తడవకు చెరిపావు సొమ్మొ ముడుతుంది. మెడకు మూడరేటున గిటుతుంది. చెరిసఖం పంచుకుంటాం. ఇక్కడికి అయిదుసంవత్సరాలనుంచి వొక్కటాయిన పని జేస్తున్నాం. చెరి యనభైరూపాయిలూ వెనకబడ్డవి. దేవుడు చాలా మేలు జేస్తే యిక్కడ ఇంకా ఐదేండ్లుంటాం. మాది కూనీ కేసు లెండి. గల్లుకు తప్పింది. మాకుగూడా వురిజెప్పినట్టయితే యీ సంపాదనంతా ఎవరికి బోయేదో? మాకు ప్రాప్తముంటే యింకొకరి కెట్లాబోతుంది? మేము వెళ్ళేలోగా యింకా చెరివందా అంటుకొని తీరుతాం. మరి యేం జెప్పావు దీనికి? దుర్మార్గులను అచ్చుబోసి వదలమంటావా దేశంమీద?

రా:- జన్మశిక్ష వేస్తే చాలదా? చంపకపోతేను.

వెం:- మీరు నలుగురూ వాదించుకోండి. అన్నెం పున్నెం యెరుగనివాణ్ణి. ఆయన సవాళ్ళకు నే నెక్కడ ఆగుతా?

కా:- మనిషిరక్తం రుచి చూచిన పులిని యెప్పుడూ నమ్మరాదు. పంజా యెప్పుడు విసురుతుందో.

రా:- ఖయిదులో వుంచుతారుకదా? అదిగాక యే కోపతాపానో వొకమాటు చంపారని యెప్పుడూ అదేపని చేస్తారా?

చేనుదగ్గర, చెట్టుదగ్గిరా తగాదాపుట్టే పెద్దదయి చంపుకుంటారు. ఖూనీచేసి జన్మశిక్ష పడ్డవాండ్లు అందరినీ చంపుతున్నారా? యెక్కడ జూచినా కాంతా కనకంతప్ప ఖూనీలకు మరొక కారణం నాకు కనపడలేదు. చిన్న తగవులకే కాకుండా పెద్దయుద్ధాలకూ యీ రెండే కారణాలు. రామరావణ యుద్ధం, కాంత కోసం, భారతయుద్ధం రెంటికినీ. ద్రౌపదికి పరాభవం జరక్కపోతే ధర్మరాజు కేవలం రాజ్యంకోసం యుద్ధానికి మొగ్గేవాడుగాదు. ఉభయపక్షాలా కోట్లమరణాలకు కారణ మయిన ఐరోపాయుద్ధం పై బేషజా లెన్ని చెప్పినా భూసంపాదన కోసమో, వర్తకం కోసమో జరిగింది. యుద్ధాలు ముగిసిన తర్వాత యిన్ని మరణాలకు కారకులయినవాండ్లను వురిదీశారా? న్యాయంగా విచారిస్తే లక్షలజనాన్ని వుభయపక్షాలా ఖూనీ నేరంకింద వురిదీయవలసి వుంటుంది. నేలకోసం కొట్టుకొని చావడం నాగరిక జాతులకు న్యాయమయితే సామాన్యజనులకు అన్యాయ మెట్లయింది? భూమికోసం ధర్మరాజూ, భీష్ముడూ పోట్లాడి అక్షోహిణీలను జంపితే, యల్లయ్యచౌదరీ, పుల్లయ్యరెడ్డీ భూమికోసం ఎందుకు చంపుకోకూడదు? ధర్మరాజునూ భీష్ముణ్ణీ శిక్షించే నాధు డేడంటారా? పై అధికారి లేకపోయినా వాండ్లు చేసినది తప్పన్నైనా ఒప్పుకుంటే చాలు. భారతకర్త అనృత దోషానికి ధర్మరాజుకు నరకం జూపించాడుగాని, అక్షోహిణీలను నరికినందుకు అందరికీ స్వర్గసుఖ మిప్పించాడు. చచ్చిన వాండ్లకు వీరస్వర్గంగూడా వస్తుందట. యే ధర్మశాస్త్రంలోను యుద్ధంలో చంపినందుకు శిక్షలు చెప్పలేదు. అట్లైతే సామాన్య జనం చంపుకుంటే నేర మెట్లయింది? జాతులదీ సామాన్యజనులదీ నేరమేనని వొప్పుకొన్నా ప్రాణానికి బదులు ప్రాణం దీయవలసిందనే ద్వేషజన్యమయిన చట్టం ధర్మా న్నాధారంజేసుకొని లేదు. దెబ్బకు దెబ్బా డబ్బుకు డబ్బూ ప్రతినేరానికీ శిక్షగా విధిస్తూన్నట్టయితే ప్రాణానికి ప్రాణమనే సిద్ధాంతాన్ని వొప్పుకోవచ్చు. యే నేరానికీ లేనిది హత్యకుమాత్రం ఇటువంటి శిక్ష యెందుకు విధించవలసివచ్చింది?

కా:- మాలో తమ ప్రశ్నకు జవాబు చెప్పగలవాండ్లె వ్వరూ లేరు. తమరే తెలవిప్పిస్తే చేతనయినంత వరకు గ్రహిస్తాం.

రా:- యుద్ధం జెయ్యడం జాతులకూ సామాన్యులకూ తప్పే. మానవునిలో వున్న పశుస్వభావమే చంపుకోడానికి ప్రేరేపిస్తుంది. గుణపరిణామం జరుగుతున్నా, కోతి అడవిమనిషై వాడు రాక్షసుడై తరువాతవాండ్లు రాక్షసప్రాయులయిన జనులయి క్రమంగా గాని మానవుడు తన పశుస్వభావాన్ని పోగొట్టుకొని దివ్యస్వరూపాన్ని పొందడు. మానవు లింకా పూర్తిగా సాధువులు కాలేదు. మానవు లందరూ సాధుత్వాన్ని పొందినప్పుడే జాతులుగాని, ప్రత్యేక వ్యక్తులుగాని కొట్టుకోవడము పశుధర్మంగా యెంచి సరళ మార్గాలలో తగవులు పరిష్కరించుకోరు. ఐరోపాయుద్ధము ముగిసిన తర్వాత యిక మీద జాతులమధ్య యుద్ధాలు జరగకుండా నానాజాతుల సంఘా న్నొకదాని నేర్పరచి దాని ద్వారా వ్యవహారాలు రాజీగా ఫయిసలుజేసుకోవడానికి ప్రయత్నం జరిగింది. ఐరోపాజాతులలో పశుస్వభావం యుద్ధాంతమందు కొంచెము వెనుకంజ వేసినా, యుద్ధబాధలు మరుపుకు వచ్చి యథాప్రకారము శాంతి వ్యాపించి జనులు భోగపరాయణులు కావడముతోటే మళ్ళీ యథాస్థితికి వస్తున్నారు. సరి సమాన జాతులతో వ్యవహారాలు రాజీగా పరిష్కరించుకుంటున్నా బలహీనులను కత్తితోనే అణచిపెడుతున్నారు. కనుక మానవులలో సాధుస్వభావము వృద్ధిఅయ్యే టప్పటికి యింకా చాలాకాలము పట్టవచ్చు. గాంధిమహాత్ముడు సాధుమార్గాన యిండియాకు స్వరాజ్యం సంపాదించే ప్రయత్నం జేస్తున్నాడు.

"అహింసా పరమో ధర్మః" అనే సూత్రాన్ని అనాదిసిద్ధంగా ఆచరిస్తున్న భారతదేశమే యీ ధర్మాన్ని ప్రతిష్ఠించి లోకానికి మార్గం చూపవలసివుంటుంది. ఈ విషయం మీరంతా బాగా గమనించండి. కేవలం స్వాతంత్ర్యము సంపాదించడమే మన ప్రయత్నం గాదు. స్వరాజ్యం నిజంగా స్వర్గరాజ్యమే

గావాలె. మనమార్గం రక్తసిక్తమయితే స్వర్గరాజ్యం రాదు. నెత్తురుకూడు మనకు ఒంటదు.

మన మెంత అహింసాధర్మాన్ని పురస్కరించుకొని పని జేస్తున్నా పశుస్వభావం మధ్యమధ్య పైకి వస్తుంది. స్వచ్ఛమయిన మనమార్గం బొంబాయీ చౌరీచౌరాలలో మయిలబడ్డది. మహాత్ముడు మన మింకా తగినంత గురుశిక్ష పొందలేదనీ, స్వర్గరాజ్యానికింకా అర్హులం గామనీ యెంచి ప్రయాణం ఆపమన్నాడు. మనం మనలో దాగివున్న పశుత్వాన్ని చంపడానికే యిప్పుడు మహాత్ముడు బలిద్మైనాడు. మహాత్ముడిలో గూడా యేమయినా పశుస్వభావం యింకా మిగిలివుంటే జయిల్లో హరిస్తుంది. జయిలుకు బోయినవాండ్లందరూ తమలోవున్న పశుస్వభావాన్ని చంపుకోవడానికి, మంచి అవకాశం భగవంతుడిచ్చాడు. ఖయిదులోకి బోయిన యిరవై అయిదు వేలమందీ సాధువు లయి బయటికి వస్తే వారు మార్గదర్శకులయి అందరినీ సాధువులను చేయవచ్చు. మనమంతా సాధువులు కాంగనే యుద్ధం గోరం. "సంధిమిచ్ఛంతి సాధవః" అనే సరళమార్గాన్నే కార్యం నెరవేర్చుకుంటాం. భారతజాతి నెత్తురుబొట్టు కార్చకుండా స్వాతంత్ర్యాన్ని పొందగలిగితే లోకమంతా అది మహాద్భుతకార్యంగా పరిగణిస్తారు. అహింసాధర్మాన్ని ప్రతిపాదించిన మనఋషులు అప్పుడుగదా ధన్యవాదం జేస్తారు! చంపడం జాతులకూ ప్రత్యేక వ్యక్తులకూ పనికిరాదు. ఉత్తరువు యిచ్చిన జడ్జీదీ తప్పే; ఉరిదీయించిన వుద్యోగులదీ తప్పే. చట్టంచేసిన శాసనసభ్యులకు దోషంలో పెద్ద భాగం పందేరం చెయ్యకతప్పదు. నీదిగూడా తప్పే. జాతులను యుద్ధానికి పురికొల్పిన పశుస్వభావమే శాస్త్రకారులను వురిశిక్ష వేయడానికి పురికొల్పింది. ధర్మశాస్త్రాలలో వురిశిక్ష కేవలం హత్యకేగాక యితర నేరాలకు కూడా విధించియున్నది. తక్కిన నేరాలకు ప్రస్తుతం వురిశిక్ష కొట్టివేసినా యింకా ధర్మశాస్త్రాలకు మకిలె వదలలేదు. అదికూడా తుడిచివేసి శిష్టాస్మృతులను పవిత్రం చేయవలసి వుంటుంది.

కా:- అయితే జనులు హత్య చేయరా?

రా:- హత్య యిప్పుడు మానారా? క్రోధం అధికమైనప్పుడు అన్నిటికీ తెగించే చంపుతాడు. అవతల చంపి యివతలికి వచ్చి తాను చంపానని గర్వపడుతూ ధర్మాధికారులతో దంభోక్తులు పలికేవాండ్లు యెందరు లేరు? అటువంటివాండ్లకు వురి వేయడం నిజముగా శిక్షగాదు. అందువల్లనే శిక్షలేని నేరమేమంటే, హత్యనే చెప్పవలసి వస్తుంది. వాడు పశ్చాత్తప్తుడై బాగుపడడానికి అవకాశముగూడా లేదు. కుక్క కరవంగనే పిచ్చియెత్తి అందరినీ కరుస్తుందని భయపడి చంపినట్లు, వొకడిని చంపంగనే వాడిని వురితీయడం అవివేకాన్ని తెలియజేస్తున్నది. ఖయిదులో ఖూనీనేరస్థుణ్ణి దీర్ఘకాల ముంచితేనే బాగుపడడానికి మార్గం చేయవచ్చు. తాత్కాలిక క్రోధంతో చంపిన వాండ్లను, వురి దీయడం కంటె అన్యాయం లేదు. శిక్ష యెప్పుడూ నేరస్తుని బాగు చెయ్యడానికి వుద్దేశించారు. అందుచేత చంపినవాడు యేవిధముగానూ బాగుపడడానికి అవకాశమియ్యని వురిశిక్ష సర్వవిధాల నింద్యమే. కనుక యీపాపం వొడిగట్టుకోకుండా మీరయినా మానుకుంటే చదువుకున్నవాండ్లు జ్ఞానం మిమ్ములను చూచెయినా నేర్చుకుంటారేమో? సరి గాని వురిదీసేచోట యేమేమి చేస్తారో వివరంగా చెప్పు.

వెం:- యేముంది. మామూలుగా జరిగేదే. ఉరిదీసేయింట్లో రెండు దూలాలకు రెండువుచ్చులు వేలగట్టివుంటవి. మెడకు తగిలించే భాగం సులభంగా వుచ్చుజారి దబ్బున బిగుసుకొనేటందుకు మెత్తగా మైనం పూస్తారు. పూర్వం ప్రతిమాటూ కొత్తతాడు వుపయోగిస్తుండేవాళ్లు. ఇప్పుడు వృథాఖర్చు లేకుండా తెగకుండా వున్నంతకాలం యెన్నిసార్లకయినా వొకతాడే వుపయోగిస్తున్నారు. కాళ్ళకిందుగా మనిషిలోతు గచ్చుగుంటలు రెండుంటవి. గుంటలమీద చెక్కలు మూతవేస్తారు. చెక్కలు రెండూ జోడించే వుంటవి. వాటిరెంటికీ బిగించి వొకప్రక్కగా మర వొకటివుంటుంది.

ఆ మర దిప్పితే రెండుచెక్కలూ వొంగుతవి. గుంట అడుగున కొద్దిగా యిసుకబోసి వుంటుంది. హైకోర్టువారు వురిశిక్ష ఖాయం చేసిన తర్వాత గవర్నరుగారికి అపీలు చేసుకోకపోయినా, చేస్తే తోసివేసినా వురివేసే తేదీ నియమిస్తారు. జిల్లా కోర్టులో వురి శిక్ష వేసినప్పుడే మనిషి నిరాశ చెందుతాడు. అపీలులో వురి ఖాయమయినతర్వాత జీవితాశే వదులుకుంది. ఈ మధ్యకాలంలో కృష్ణా, రామా అనుకొంటూ చదువుకున్నవాండ్లు భజనలు చేసుకుంటారు. రామదాసుచరిత్ర మొదలయిన పుస్తకాలుగూడా చదువుకుంటారు.

రా:- ఉరిశిక్ష బడ్డవాండ్లకు కోరినతిండి పెడతారంటారే!

వెం:- అదంతా లేదు. పూర్వంసంగతి నాకు తెలియదు. నాహయాంలో అందరికీ పెట్టేభోజనమే వాండ్లకూ పెట్టుతున్నారు. భోజనానికీ, స్నానానికీమట్టుకు బయటికి దీస్తారు. అమేషా రాత్రిం బగళ్లు వంతులుప్రకారం ప్రతి ఖయిదీకి వొకొక్క వార్డరు చొప్పున ఘారా యిస్తుంటారు. భోజనానికి బయటికి తీసేటప్పుడు ఛీఫువార్డరు వచ్చి బయటికి దీయించి అన్నం తనిఖీజేసి మల్లలో బెట్టించి, అపాయవస్తువులేమయినా ఆత్మహత్య చేసుకొనేటందుకు గదిలోగాని, దుస్తులలోగాని వున్నవేమో జడిఖీచేయించి లోపలికి పంపిస్తారు. సాధారణముగా వుదయం ౭½ గంటలకు వురిదీస్తారు. జబ్బుగావుంటే వురిదీయగూడదు. యెందుకనో తెలియదు. నిండు ప్రాణాన్ని వురిదీయవలెనని వుద్దేశ్యం గావాలె. రేపు వురిదీస్తారనంగా ఆమనిషి తూకంగల యిసుకబస్తాను వురితాడు ఆగుతుందో ఆగదో చూడడానికి దూలానికి వేలదీస్తారు. ఉరిదీసే సమయాన సూపరిండెంటు, జైలరు, మేజస్ట్రేటు, డాక్టరు, ఛీఫువార్డరు, హాజరులో వుంటారు. వార్డర్లంతా చుట్టూ ఘారా వేస్తుంటారు. రేపు వురిదీస్తారనంగా నేను, మాఅన్నా తాడు సరిజేసి బల్లలన్నీ తుడిచి సిద్ధముగా వుంచుతాము. ఆరోజు వుదయం ౭ గంటలకు వార్డర్లు మనుష్యులను కొట్లల్లోనుంచి వురిమానిదగ్గరకు తీసుకొనిపోతారు.

మేము వెళ్ళి మళ్ళీ తాళ్ళుచూస్తాం. దొరగూడా తనిఖీచేస్తాడు. అంతట ఆయనఉత్తరు వియ్యంగనే వార్డర్లుబోయి ఖయిదీని చేతులు వెనుకకూ కండ్లగంతా గట్టి నడిపించి తీసుకొనివస్తారు. సాధారణంగా ఖయిదీకి యీసుకతూకం వెయ్యడాన్ని పట్టే మొదట తెలుస్తుంది. ఆరాత్రి సాధారణంగా నిద్రపట్టదు. తీసుకపోవడానికి ప్రతినిమిషం వార్డర్లువచ్చి లేవమన్నట్టే వుంటుంది. తీసుకొనివచ్చే టప్పుడు సాధారణంగా నడిచే వస్తాడు. తెల్లవాండ్లంత ధైర్యంగా నడవలేరు. నడవలేక కిందబడతారు. అట్లా పడిపోయేవాండ్లు మనలో నూటికి ఒకరుగూడా వుండరు. నడిపించి తీసుకొనిపోయి బల్లమీద నిలువబెట్టి జాడించకుండా కాళ్ళకు తాడుకట్టుతారు. మా అన్న వుచ్చు సరిజూస్తాడు. నే మెడకు తగిలించి బిగిస్తే ముడి ప్రక్కకు పోయేటట్టుగా పెడతాను.

రా:- ఆ సూత్ర మేమిటి ?

వెం:- అట్లయితే చప్పున బిగిసి ప్రాణం హాయిగాపోతుంది.

కా:- నీ హాయి పాడుగాను—— హా యేమిటోయి ?

వెం:- యెక్కువ శ్రమపడదు. నేను తగిలించంగనే దొర యిషారా యిస్తే జయిలరు కాలితో మర తొక్కుతాడు. చెక్కలు రెండూ వంగుతవి. మనిషి వేలాడుతాడు.

రా:- ఉరి తగిలించేటప్పుడుగాని, మర తిప్పేటప్పుడుగానీ, మనిషి యేమయినా అంటాడా ?

వెం:- యేమీ అనడు. ముడుక్కొని వూరకుంటాడు. బిగుసుకుండేటప్పుడు మాత్రం కిచుక్కుమని చిన్న శబ్దమవుతుంది. మూత్రవిసర్జనం చేసుకుంటాడు. నాలుక, గుడ్లు బైటికి వస్తవి. గుంటలో వేలాడుతుంటాడు. కాళ్ళు నేలకు తగలవు. అయిదు నిమిషాలలో పని పూర్తి అవుతుంది. అంతట తలుపులు తాళాలు వేసి యెక్కడివాళ్ళక్కడ వెళ్లుతాము. తరువాత ఏడుగంటలకు సూపరిండెంటు వచ్చి తాళం దీస్తేనే శవాన్ని దింపి వురి వూడ దీస్తారు. దొర, డాక్టరు పరీక్షజేసి చచ్చినట్టు సర్టిఫికెట్టిస్తారు.

చచ్చినట్లు ధృఢపర్చుకోవడానికి నీలమండల వెనుక నరాలు కోస్తారంటారు గాని ఈ జయిల్లో చేయరు. ఉరిదీసినవాడి చుట్టాలు కోరితే శవాన్ని స్వాధీనపరుస్తారు. లేకపోతే వైద్యవిద్యాలయాలకు విద్యార్థులు కోసి పరీక్షించుకొనేటందుకు పంపిస్తారు.

రా:- దేవుడు పుట్టించి పెంచినజీవాన్ని అయిదు నిమిషాలలో నాశనం జేస్తారా!

వెం:- ప్రాణ మేమి తట్టెడా? పుట్టెడా? నిమిషంలో ఉప్పున వూదినట్టు గాలి ఎగిరిపోతుంది. ఇంతకూ ఆ ఘటానికి అట్లా వ్రాపెట్టివున్నది.

రా:- అంతే నన్నావు. ఒక్కమాటతో తేల్చివేశావే!

వెం:- కాకపోతే మరివొకరి వశమా? శివు డెరికె లేనిదీ చీమయినా కుట్టదు.

రా:- ఆ. అవును. ఆ చీమే కుట్టకపోతే మనిషిమాత్రం ఆయన యెరుక లేనిదీ చస్తాడా? (పెదవులు చప్పరించి) అవునుగాని మనుష్యప్రయత్నమే యెక్కువ. పురుషప్రయత్నం ఆరుపాళ్ళయితే దైవం రెండుపాళ్ళు. వెంకటస్వామీ! నీ కర్మసిద్ధాంతం జెప్పినా వుత్సాహం కొంత అణచావు. గాని లోతుకు దిగి విచారిస్తే నిరుత్సాహపడడానికి కారణం లేదు. ఉరిశిక్ష ఘోరం. నీకు ఉరిదీసేటప్పుడు భయం బుట్టదా?

వెం:- పిచ్చిఅయ్యలా వున్నావు. నా చేతిమీదిగా యెనభయిమందిని ఉరిదీశాను. వొకటీ రెండూ అయ్యేవరకూ కొంచెం పీచుపీచుమన్నదిగాని, తవాత పరిపాటి అయిపోయింది. ఇప్పుడు ఉరిదీయడమంటే నీళ్ళచర్లాటమే.

రా:- అవును. ఉరిశిక్ష వేసే జడ్జీలకు, వురిదీయించే సూపరిండెంట్లకూ, మేజస్ట్రేట్లకూ, డాక్టర్లకూ నీమోస్తరుగానే మొదట కొంచెం కష్టంగావున్నా తరువాత గడుసుపారుతారు. అనగా సున్నితభావాలు నశించి ఘటోద్యోగాలయినా రని అర్థం. ఇంతమందికి పశుత్వ మిప్పిస్తున్న ఈ వురిశిక్ష పోవడం అవసరము.

కా:- తక్కిన సంగతులెట్లా వున్నా, అనేకమంది వొద్దునే బతుకుతారు. యెన్ని కష్టాలు పడుతున్నా ప్రాణముంటే ప్రతివాడి తీపిగదా? అదృష్టముంటే యే జూబిలీకో బయటన్నా పడతారు

పదిగంటలు కావచ్చింది. రెండవఫారాకూడా సరా పోయింది. మాటలసందడిన జనం చుట్టలుగూడా మానుకున్నారు. చాలామంది గారెలు వద్దన్నారు. కొందరు అందరియెదుటా తినలే పోయినా తినేవస్తువు పారవేయగూడ దని దాచిపెట్టుకొన్నారు. పేల్చిన ఉడతను అందరూ పట్టుబట్టి పారవేయమన్నారు. రామదాసు కొంత మనస్సంతోషంతో పడుకున్నాడు అందరూ మెదలకుండానే పండుకున్నారు చిటుక్కున శబ్దం దూటకాలిన కమురుకంపు కొద్దిగా పొగవాసన వస్తూనే ఉన్నవి.

౧౨

## అసహ్యమే లేదు

సోమవారం ఫయిలురోజు. ఒక అరగంటముందే కొట్లు దీశారు. దూరంగా పోయి తెచ్చుకోకుండా బ్లాకు ఆవరణంలో వున్న కొళాయిలోకే నీళ్లు వచ్చినవి. చాలాసేపు తెరిచి వుంచితే ఆలస్యమవుతుందని కక్కసు వెంటనే మూసి జాడుమాలీ బాగు చేస్తున్నాడు. మొగాలు కడుక్కొనేవరకు గంజిహండాలు హాజరుగా వున్నవి. వార్డరు జీవరత్నం అందరినీ వొంటిఫయిలుగా నిలువబెట్టించి గంజి బోయిస్తున్నాడు. రత్నం జయిలు వుద్యోగస్తులలో రాక్షసగణంలో చేరినవాడు. విడిఖయిదీ రాముడు ఫయిలులో వొకఅడుగు ప్రక్కకు తొలిగి నిలుచున్నాడు. వార్డరు బూటుకాలుతో తన్ని చోటాకట్టెతో ముంజేతిమీద గొట్టాడు. కాలు నెత్తురు కారుతున్నది. చెయి కదుము గట్టింది. ఇద్దరు స్వదేశీ ఖయిదీలుగూడా చూశారు. వార్డరు వొకాయనకు బీడీలిచ్చి లోబర్చుకున్నాడు. ఒకరిద్దరు స్వదేశీ ఖయిదీలు దొరతో చెప్పుకోమని రాముణ్ణి ప్రోత్సాహపర్చారు. భోజనాలయిన

తరువాత ఆవరణమూ, గదులూ శుభ్రంగా వూడ్చారు. చాపలూ, గొంగళ్ళూ రెండోజత చట్టలూ, ముందు పఱ్చుకొని అంతా ఫయిలులో నిలువబడ్డారు. స్వదేశీ ఖయిదీలు, తక్కినవాండ్లూ కలిసి నిలువడానికి వీలులేదు. విడిగా నిలుచోవాలె. క్వారంటులో వున్నంతకాలం గొంగడి లేకుండా వుండి కొత్తగా బారకాసులోకి వచ్చిన ఖయిదీ వొకడు ఫయిలులో నించున్నాడు. వార్డరు వెళ్ళి దాక్కో-మన్నాడు. స్వదేశీవాండ్ల ఆసరా చూచుకుని వాడు పోలేదు. మిటకరిస్తూ వార్డరు వూరుకున్నాడు. అలవాటు పడ్డ చోటా కట్టె కదిలిందిగాని చేయి లేవలేదు. దొరా, జయిలరూ, సర్జనూ, ఛీఫువార్డరూ ఫయిలుకు వచ్చారు. వరుసగా చూస్తూ పోతున్నారు. స్వదేశీ ఖయిదీలు పులుసు బాగుండలేదనీ, రొట్టెల కిచ్చే గోధుమ పిండిలో బియ్యపుపిండి కలుస్తున్నదనీ, మరికొందరు అన్నం పడడం లేదు, రొట్టెలిప్పించమనీ అడుగుతున్నారు. చిన్న వుద్యోగస్తుల ప్రాపకం గలవాండ్లు తాము స్వయంగా అడగనట్టు నటించి వాండ్లే అడిగేటట్టు చేసుకున్నారు. తోచిన జవాబులు చెప్పుతూ దొర వెళ్లుతున్నాడు. ఒక వెఱ్ఱిబాగుల ఖయిదీ స్వదేశీ వాండ్లతోపాటు తనకూ రోజూ స్నానం చేయడానికి వుత్తరువు గోరాడు. దొర సాధారణంగా తొణికేవాడు కాడు. హృదయం మంచిది. ఖయిదీ ధూర్తుగా మాట్లాడినా వాడిమీద దీర్ఘకోప ముండదు. అప్పు డేదయినా లేదన్నా తరువాత ఆలోచించుకొని యుక్తమయిన వుత్తరువు లిస్తాడు. కింది వుద్యోగులే ఆయనను కొంతవరకు చెడుతోవని నడుపుతారు. రాముడు సలాం పెట్టంగనే దొర ఆగాడు. వార్డరు తాను గంజి పోయించుకుండేటప్పుడు కాలిమీద తన్ని చేతిమీద కొట్టాడని చెప్పుతూ గాయాలు చూపించాడు. అక్కడికి స్వదేశీవాండ్లు దూరంలో వున్నారు. వాడు చెప్పినదాంట్లో గంజి అనేమాట వొకటే దొరగారికి తెలిసింది. గాయాలుమాత్రం చూచి వార్డరువంక దిరిగాడు. గంజికీ, గాయాలకూ లంకెబెట్టి గంజి బోయించుకోబోతే రాయి తగిలి పడితే గాయమయినది యని హిందూస్తానీలో తర్జుమా చేశాడు. దొర

వోడార్చి తక్షణం ఆసుపత్రిలోకి తీసుకొని పొమ్మని సర్జనుకి వుత్తరువు చేసి యింకొక బ్లాకుకు వెళ్ళిపోయినాడు. స్వదేశీవాండ్ల వార్డరు నడిగితే తన ప్రాణంమీదకి వచ్చినప్పుడు యేదో అబద్ద మాడి తప్పించుకొన్నా నన్నాడు. స్వదేశీవాండ్లు యేమి చేయ వలసినదీ ఆలోచించుకున్నారు. స్వదేశీ ఖయిదీలు తప్ప జేస్ వార్డరు రిపోర్టు చెయ్యకుండా వూరుకున్నాడు గనుక అతనిమీద రిపోర్టు చెయ్యవద్దని చాలామంది అన్నారు. ఒకాయన మః వాండ్లు చేసే నేరాలు రిపోర్టు చెయ్యకుండా కమ్మిపుచ్చుతూ వుద్యోగస్థులమీద మాత్రం యెందుకు రిపోర్టు చెయ్యడమని వూర కున్నాడు. మొత్తంమీద ఖయిదీసి కొట్టినందుకూ దొరకు తప్ప సంజాయిషీ యిచ్చినందుకూ రత్నానికి వుద్యోగం పోకుండా నిల చింది. రాముడుమాత్రం ఆసుపత్రిలో వుండి కాలిమీద దెబ్బకు నాలుగురోజులు గంజిపథ్యం జేసి కొనవూపిరితో వార్డుకు తిరిగి వచ్చి స్వదేశీవాండ్లతో మాట్లాడ్డం మానివేశాడు. వార్డర స్వదేశీవాండ్లు రాముడిని మళ్ళీ రేపెడతారేమోనని రాముడి రెండుబీడీ లిచ్చి రాజీ పర్చుకున్నాడు. అంతటితో రాముడి కేస అంత్యమయింది.

ఫయిలు అయినతర్వాత అంతా చాపలుమడిచి చుట్టలు అరుగుమీద బెట్టుకున్నారు. అన్ని బారకాసులలోను ఫయిలు పూర్తిఅయింది. యెనిమిది గంటలకు పనిగంట కొట్టారు. ఈ లోపుగా రామదాసు రెండోచల్లడమూ, చొక్కా యెవరో కాజే శారు. వెదకడాని కవకాశం లేకుండా వార్డరు ఫయిలు కూరో్చ మని కేకలు వేస్తున్నాడు. రామదాసు వార్డరుతో చెప్పుకుంటే, యెవరికో బీడీలకమ్ముకొని పోయినవని వంక పెట్టావా? అని చోటా కట్టె యెత్తాడు. వుల్లప్ప ఆయన చాలా పెద్దమనిషి అని చెప్ప బోతే కొందరు స్వదేశీవాండ్లే చల్లాడాలు ధోవతులు దొంగిలించి బీడీల కమ్ముకుంటున్నారని ఫిర్యాదు వచ్చింది. దాని కేమి చెప్పుతా వన్నాడు.

జీవరత్నానికి స్వదేశీవాండ్లమీద బాగా కంటుకలిగింది. వాండ్లను సాధించవలెనని పట్టుపట్టాడు. స్వదేశీవాండ్లు మొదటిమోస్తరుకాదు. జన మెక్కువైనకొద్దీ అన్నిరకాలవాండ్లూ వచ్చారు. బీడీలూ, సిగరెట్లూ పూర్తిగా తాగుతున్నారు. అల్లరెక్కువయింది. వార్డరీసంగతులు దొరకు రిపోర్టుచేశాడు సాయంత్రం 7, 8 గంటల మధ్య కాపలా తక్కువ. అంతా చుట్టలు తాగుతుంటారు. డుబ్బ జైలరూ, వార్డరులూ స్వదేశీవాండ్ల బ్లాకుమీదపడి తాళాలుదీసి సోదాలుజేశారు. ఆ రాత్రి యేమీ దొరకలేదు. తక్కిన ఖయిదీల దగ్గర కొంతపొగాకు దొరికిందిగాని ఆ సంగతి దొరకు రిపోర్టు కాలేదు. తక్కినవాండ్లెవరూ తాగరనీ, స్వదేశీవాండ్లు ధనవంతులు కావడంచేత వార్డర్లను లోబరుచుకొని తెప్పించుకుంటారనీ దొరకు తెలిసిన సమాచారం. స్వదేశీవాండ్లదగ్గర పట్టుబడ్డా క్రిందివుద్యోగస్తులు బయటబెట్టరని దొరకనుమానం. ఒకరోజు స్వదేశీవాండ్లంతా స్నానానికి బోయినప్పుడు తానూ, యూరేషియన్ జయిలరూ, వార్డరును తీసుకొనివచ్చి అనుమానపు మనుష్యుల పడకలు సోదాజేశాడు. వొకరిపడకక్రింద పొడుం మాత్రం దొరికింది. అది దొరికినాయన 'తనదిగాదు అరుగుమీద యెవరో పొడుంపెట్టి వుంటారు. చూడక దానిమీద పక్కవేసుకున్నా'నన్నాడు. పెద్ద చేపలు చిక్కకపోవడంచేత దొర అంతగా ఆ విషయం గమనించలేదు. స్వల్పంగా వదిలిపెట్టాడు. ఇంకొకసారి పగలు అంతా వుండగానే జయిలరూ తానూ వచ్చి సోదాచేశారు. ఇది వదిలేటట్టు లేదని దొరకు అనుమానంగా వున్నవాండ్లు ప్రస్తుతం మానివేశారని నచ్చజెప్పితే అంతట సోదాలు మానుకున్నాడు. ఖయిదీలు నూటికి తొంభైతొమ్మిదిమంది పొగాకు వుపయోగిస్తారనీ వార్డర్లు పొగాకువర్తకం చేస్తారనీ స్వదేశీవాండ్లద్వారా తెలిసింది. దానిమీద గేటులో జ్ఞానానందనాయకును జసితీ చేయడానికి నియమించారు. అంతవరకు పొగాకు బాహాటంగా సింహద్వారం గుండానే వచ్చేది. బయటపనిచేసే ఖయిదీలు సాయంత్రము లోపలికి వచ్చేటప్పుడు వొకచేతిలో కూరగాయలూ రెండవదానిలో

బీడీలు తెచ్చుకుంటే గేటుదగ్గిర కూరగాయలిచ్చి లోపలికి అడ్డంకి లేకుండా పోవచ్చు. జ్ఞానానందనాయుడు జడ్తీచేయడం మొదలు పెట్టినతరువాత గేటుగుండా విశేషంగా రావడంలేదు. చాలా భాగం రాత్రులే మూటలుగట్టి వార్డర్లు గోడలమీదుగా అందిస్తున్నారు. వర్తకం యథాప్రకారంగానే జరుగుతున్నది.

రామదాసు గుడ్డలు పోయినతరువాత పుల్లప్ప జాడాలుతీసి తమవార్డులో వున్న వొక ఖయిదీ కిటికీ కమ్ములలో గుండా అవి బయటికి విసిరితే పాకీవాడు దాచి రెండోవార్డులో వున్న యింకొకడి కమ్ముకుంటే వాడు పన్నెండుబీడీ లిచ్చాడనీ, అవీ వుభయులూ పంచుకున్నా రనీ తెలిసివాండ్లముగ్గురిదుస్తులూ పుల్లప్ప దొంగిలించి దాచిపెట్టి వాండ్లు పోయినవని అనుకుంటే 'అవి రామదాసు దుస్తులను వెదకబోయినవి నాలుగూ కలిసి యెవరివివాండ్లకు వస్తే'వని పుల్లప్పన్నాడు. అంతట నలుగురూ తగాదా తీర్చి యెవరివి వాండ్ల కిప్పించారు.

పుల్లప్ప వంటపనికీ, కామానాయుడు డుబ్ జయిలరు దగ్గర సామాగ్రు లందించే పనికీ, రామదాసు తాడు పేనడానికీ వెళ్లారు. పుల్లప్పకూ, కామానాయుడికీ చాలామంచిపనులు దొరికినవి. రాజుకూ, అంబోతుకూ, జయిలులో పంటఖయిదీలకూ అశనలోప ముండదు. సామాగ్రులందించే కామానాయుడినిగూడా యీ రకంలోనే చేర్చవచ్చు. కామానాయుడిదగ్గిర గోధుమపిండి తీసుకొని ఆసుపత్రిపని చేయించే ఖయిదీవార్డరు రోగుల కివ్వవలసినపాలలో నీళ్ళు గలిపి మానెడుపాలూ, పంచదారా మిగిల్చి ఆసుపత్రి అడవలో క్షీరాన్నం చేయించారు. గోధుమపిండి మిగిల్చి తరుచుగా వుప్మా చేయిస్తుంటారు. కామానాయుడు తనభాగంకింద యిచ్చిన క్షీరాన్నంలో మిగిల్చి రామదాసుకోసం మధ్యాహ్నభోజనానికి వచ్చినప్పుడు తెచ్చి యిచ్చాడు. రామదాసు దానిపుట్టుపూర్వం విచారించి తిననన్నాడు. కామానాయుడు తా నాపని చేసినందుకు పశ్చాత్తాపపడి శిక్ష విధించమని రామదాసును కోరితే ప్రథమ

తప్పిదంగా యెంచి ఆపూట వుపవాసం, రెండువందలసార్లు రామ నామ జపం విధించాడు.

ఆ పూట భోజనంలోకి సాధకం వంకాయల పులుసూ, కొంత ముల్లంగిఆకూ, ముడురుగడ్డలూగూడా యిచ్చారు. జయిలు లెఖ్ఖలలో ఆరుమళ్ళవంకాయలు యిచ్చినట్టు ఖర్చు వ్రాసి వున్నది. దర్జాకొద్దీ దేశీయవుద్యోగులందరికీ సువారాలు పంపారు. మిగిలినవాట్లో చాలాభాగం వార్డర్లందుకున్నారు. శేషించిన వాట్లో యేరి ఖయిదీవార్డర్లు తియ్యాన వందుకున్నారు. మిగిలిన పుచ్చువంకాయలు తరిగి పుచ్చుముక్కలు తీసివేస్తే బొత్తుగా పులుసులో వంకాయలు వేసినట్టే కనపడదని ఆపాళంగానే వేశారు. ఇచ్చిన ముల్లంగాకూ ముడిగడ్డలూమాత్రం యెవరూ అంటుకో లేదు. అంతా పులుసులోనే పడ్డది. పుచ్చుముక్కలూ, తెల్లపురు గులూ పులుసుమీద యీదులాడుతున్నవి. యెగ్గులేనివాండ్లుగనుక జనం కనపడ్డ పురుగులేరి రోతలేకుండా తిన్నారు. "క్షుధాతురా ణాం నరుచి ర్నపక్వం" అన్నట్టు పురుగు లుంటేమట్టుకు బాగుండ కేమిజేస్తుంది? పుల్లప్ప స్వయంపులుసు తెచ్చేఆయన నడిగి కాస్త వేయించుకొని వచ్చి రామదాసు కిచ్చి యెట్లాగో ఆ పూట తోశాడు. పుల్లప్ప అడవలోనే భోజనం జేశాడు. అతని పని అందరిలోకి వాటంగా వున్నది. అంతా పనికి పోయినారు.

రామదాసు చెయిదిరగా తాళ్లు పేనినవాడయినా అల వాటు తప్పి చేయి వరుసుకున్నది. అట్లాగే వొరగబెట్టి, సాయం త్రానికి నలుగురితోపాటు టాసిచ్చాడు. రూలు ప్రకారం అలకంగా సగంపని చెయ్యొచ్చు నని మనస్సుకు ధైర్యందోచింది. సాయంత్రం నవ్వుమొగంతో వచ్చి పుల్లప్పతో చెప్పాడు. అంతా భోజనంచేసి ఖయిలు కూర్చున్నారు. స్వదేశీవాండ్లుగూడా కప్పల తక్కెడవలె ఖయిలు కూర్చుంటున్నారు.

యెవరో కొట్టుకుంటున్నట్టు అరుపులు వినపడ్డవి. అడవ కెదురుగా డుబ్ జయిలరు ఆఫీసుముందు గలభా జరుగుతున్నది.

ఖయిదీవార్డర్లూ, హాజరులో వున్న కొందరు వార్డర్లూ పరుగెత్తుతున్నారు. యెవరో వార్డరువచ్చి వొకటోనంబరు స్వదేశీవాండ్లుండే బారకాసు ఆవరణకు గేటుతాళం వేశాడు. 1-వ బ్లాకులో వున్న నళ్ళకుళ్ళాయిలు స్వదేశీవాడిని కొడుతున్నారని, అరిచారు. వెంకటరెడ్డిని కొట్టిమోసుకొనిపోయి వొంటికొంట్లో దోసి దిగంబరిని చేసి మర్దన జేశారు. రెడ్డిచాలా బలవంతుడు. ఛీఫువార్డరుకు కూడా దెబ్బలు తగిలినవి. జయిలులో ఒక వస్తాదు ఖయిదీగా వున్నాడు. వాణ్ణి ఉద్యోగస్తులంతా యిష్టమువచ్చినట్లు అడవకు పోయి తిన నిస్తారు. బలవంతుడయిన యే ఖయిదీనైనా కొట్టించేటప్పుడు అతనినే ఉపయోగిస్తారు. ఇది జయిలరూ ఛీఫువార్డరూ ఆలోచించిచేసిన పని. ఛీఫువార్డరు ఆదంసాహెబు స్వభావంగా క్రూరుడు. కాని జిత్తులమారి. సాధారణంగా యెవరికీ చిక్కేవాడు గాడు. జయిలరు మూలకంగా, ఈ స్వదేశీవాండ్లవ్యవహారంలో యిరుక్కున్నాడుగాని లేకపోతే దూరంగావుండేవాడు. ఇరుక్కున్నందుకు శాస్తి అయింది. కేసుబయటపడకుండా చేయడానికి ఉద్యోగస్తులంతా ప్రయత్నించారు. సాక్షులనందరినీ తిరగదీశారు. ఒంటికొట్లోవున్న స్వదేశీవాండ్లనుకూడా తిరగదియ్యడానికి జయిలరు ప్రయత్నించారు. వాండ్లుసాధ్యంకాలేదు. అయినా వాండ్లు ప్రత్యక్షసాక్షులు కారు. అడవలో పనిజేస్తున్నవాళ్ళందరూ ప్రత్యక్షంగా చూచినవాండ్లే. వాండ్లుసాక్ష్యం జెప్పడానికి సిద్ధంగా వున్నారు. ఉద్యోగస్థులు వొకండ్లనూ పలకనియ్యలేదు. దెబ్బలు తిన్నవాడు చచ్చినా కేసు ఇంతే అయ్యేది. సాక్ష్యం జెప్పించదగినటువంటి వుద్యోగస్థులు కోరినప్రకారము పోనడానికి వొప్పుకోనటువంటి ఖయిదీవార్డర్లను కమానెత్తారు. జయిలు అధికార్లకూ గవర్నమెంటుకూ అపకీర్తివస్తుందని న్యాయమైన కేసును కమిట్మెంట్ చేశారు. ఈ కేసు ఫలితం యేమయినా దీనివల్ల నేర్చుకోవలసిన నీతి వొకటున్నది. జయిలు సూపరిండెంటుకు లోపడని ప్రత్యేక డిపార్టుమెంటు జయిలులో జరిగే నేరాలను కనిపెట్టి సాక్షులను అమర్చే ప్రత్యేకశాఖ లేకపోతే జయిలుద్యోగులుచేసే దుండగాలు

బయటికి రావు. చిన్నఘాతనేరం దగ్గరనుంచి హత్యవరకూ యిది వరకు అనేక నేరాలు కమిష్మా జరిగినట్లే వినికిడి. వెంకటరెడ్డిని వొంటికొట్టులో వేసినతర్వాత బిగుళ్లూదారు. నేరము అడవ కెదురుగా జరిగినట్లే లెక్క. ఎవడయినా అడవలోవాడు సాక్ష్యం చెప్పినా వీలు లేకుండా జేశారు. హాజరులో లేని సూపరింటెంటు తాను వచ్చినప్పుడు బిగులు వొంటికొట్టుదగ్గరనే వేసినట్టు విన బడ్డదని సాక్ష్యం చెప్తాడు. ఆయన మోతుబరి సాక్ష్యంమీద అన్ని సాక్ష్యాలు యెగిరిపోతవి. చీకటిపడ్డది. రామదాసు వగైరా లను బారకాసులోనికి పంపి తాళాలు వేశారు. తెల్లవార్లూ సాయంత్రం జరిగిన తగాదా కబుర్లే వస్తున్నవి. ఖయిదీవార్డర్లు తలా వొక రకంగా కబుర్లు దెచ్చేవాండ్లు. ఆరోజు మన మిత్ర మండలిలో ఇతరసంభాషణ లేమీ ముఖ్యమయినవి జరగలేదు. దైవప్రార్థనమాత్రం చేశారు. తేపావచ్చే కబుర్లు తర్కించుకుంటూ ఆలస్యంగా నిద్రపోయినారు. తెల్లవారి లెక్క అయిన తర్వాత కామానాయుడు కక్కసుకు పోయినాడు. రాత్రి వొంటి గంటకే పుల్లప్పను అడవకు లేపుకొని పోయినారు. ఓవరుసీయరు ఆరోజు రెండు మూత్రపుకుండలు కక్కసుకుండా మోయడానికి వొంతుల ప్రకారం మనుషులనుయేర్పాటుచెయ్యడంలో రామదాసు ముగ్గురిలో ఒకడు కావడం తటస్థించింది. యేర్పాటుకాంగనే వొకడు రెండుకుండలలో మూత్రం వొకదాంట్లో పోసి వొట్టికుండ తననెత్తిని పెట్టుకొని వెళ్ళిపోయినాడు. తేలికయిన కక్కసుకుండ రెండవవా డెత్తుకున్నాడు. నిండుకడవ రామదాసుపాల బడ్డది. నీరు తొణికిసలాడు తున్నది. ఓవర్‌సీయరు యెవడో టక్కరితనం జేసి వొట్టికుండ యెత్తుకొని పోయినా డని తిడుతూ పొర్లిపోయే కుండను రామదాసు నెత్తిని పెట్టించాడు. మెల్లిగా నడుస్తూ కక్కసు భావిదగ్గరకు పోయేవరకూ ఆపాదమస్తకం తడిసింది. గుడ్డలుతడిసి ముద్దయినవి. కడుక్కోడానికి అక్కడ నీళ్ళు లేక పోయినవి. తిరిగీ బారకాసుకు వచ్చేలోగా పుల్లప్పకూ కామా నాయుడికీ జరిగినవృత్తాంతమంతా తెలిసింది. వాండ్లు వార్డరును

బతిమె లాడుకొని కొళ్ళాయిదగ్గిర రామదాసు స్నానసంచేయడానికి వొప్పించి చాకొ్క చల్లాడం తెచ్చి సిద్ధంగా వుంచారు. రామదాసు వచ్చి,

రా:- పుల్లప్పా! ఈ రోజు వంతుపనిచేసి వచ్చా. దూరంగా వుంటే ఆ పని అసహ్యంగా వుండేదిగాని దిగిచే స్తే అన్ని అసహ్యాలు పోయినవి. యెవడివృత్తికి వా డలవాటుపడతాడు. ఇకమీాద కక్కసుకుండ చూడంగనే వుమ్మివేసి తొలగిపోవడం మట్టుకు నాకుండదు. ఈ మధ్య స్వదేశీవాండ్లంతా అధికార్లతో తగాదాపడి కుండలు మేము మోస్తామంటూ ముందుకువచ్చి పెద్దా పిన్నా వరుసగా మోశారుట. ప్రపంచంలో అసహ్యమంటూ లేదని నాకు స్పష్టమయింది.

పు:- (కండ్ల నీండ్లపర్యంత మయి)-స్వదేశీవాండ్లంటే యేదో మాటపట్టింపుమీాద చేశారు. మొయ్యవలసిన జాతులు వేరేవుంటే నిన్నెందుకు మొయ్యమన్నాడు?

రా:- అందరికీ వొంతులుగా?

పు:- ఆ కులపువాండ్లలో వొకరొకరికి వొంతుగాని మన కేమి వంతు? ఓవరుసీయరు టక్కరితనం జేసి యెదట వున్న వాడినెత్తిన బెట్టి పంపాడు.

రా:- అయితే నేమిలే. ఇదీ వొకందుకు బాగానేవున్నది. అంతా రామ మయమె. అసహ్యించుకోవలసిం దేమీా లేదు. ఆ ధర్మం నాకు బాగా సుబోధక మయింది.

పు:- స్నానం చెయ్యండి.

రా:- యెందుకు స్నానం?

పు:- అనారోగ్యం గాదా, కంపుగొట్టుకొంటూను? మాకు చెడుగాలు గొడుతున్నది. మీా వద్దకు రావద్దంటారా యేమి?

రా:- అవును. అడవులలో నివసించే అవధూతలు తమ ఇష్టం వచ్చినట్టుండవచ్చును గాని జనపదంలో వుండే మనబోటి

వాండ్లు ప్రపంచానికి యెబ్బెరికంగా వుండగూడదు. సాధ్యమయి నంతవరకు సరియైన ప్రపంచధర్మాలే అవలంబిస్తూ పోవాలె.

పు:- త్వరగా స్నానం చెయ్యండి. భోజనంవేళ అవుతున్నది.

రా:- అట్లాగే పదండి.

## ౧౩

భాగాలు

కొబ్బరితాడు పేనడంచేత బుడిపి గంటు రాచుకొని చేతులక్కడక్కడ యెఱ్ఱపుంతు పడ్డా రామదాసు సాయంత్రానికి టాసియ్యగలిగాడు. యథా ప్రకారం భోజనం చేసినతరువాత కొట్లు తాళాలు వేశారు. చుట్టలుతాగడం చాలావరకు తగ్గింది. చుట్టరంధి అణచుకోలేని వాండ్లు అరుగులసందున కూర్చుని కక్కుర్తి పడుతున్నారు. కనకుండా కట్టెదుట త్తిస్తే వినకుండా వీరంగ మెట్లాగని చెకుముకిరాతి దెబ్బ లందరికీ వినపడ్డవి. అందరూ శబ్దంబుట్టిన వైపున చూశారు. ఒకరిద్దరు సిగ్గుపడి క్రమంగా వారంరోజులలో మానుకుంటామన్నారు. అన్నపుముద్దలు బీడీలకమ్ముకొని పస్తు పడుకుండే అలవాటు వదిలి కడుపుకు తింటున్నారు. పావుగంటలో అంతా రామదాసుచుట్టూ పోగయినారు. బయట పారావేస్తున్న ఖయిదీవార్డరు. గుంపుపోగైనా రెండుకని మందలిస్తే లోపలవున్న వోవరుసీయరు దేవుణ్ణి ప్రార్థన చేసుకుంటున్నా మని జవాబు చెప్పాడు. ప్రార్థించుదామని వేరే అడక్కుండానే వోవరుసీయరిచ్చిన జవాబునుబట్టి చుట్టూచేరిన ఖయిదీల వుద్దేశ్యం కనిపెట్టి రామదాసు తత్వాలు పాడడం ప్రారంభించాడు. కాసేపుపాడి భక్తినిగురించి చిన్న వుపన్యాసం జెప్పుతూ భక్తి అంటే ప్రేమ అని, జ్ఞానం సర్వోత్కృష్టమయిన ప్రేమకు సాధనమని, జ్ఞానం కుదరినిదీ సార్వజనిక ప్రేమ గలగదనీ, పూవు సౌరభవము; పండు మాధుర్యము ఇచ్చినట్టే ప్రేమ జ్ఞానానికి ఫలమని, ప్రేమగలిగి

నప్పుడే ఫలాపేక్షరహితమైన లోకసేవ సాధ్యమవుతుందని, ప్రతి ఫలం కోరనిది ప్రేమేనని తేలికమాటలతో ప్రేమతత్వం వుపదేశించాడు. జనమంతా వోపికగా కూర్చుని విన్నారు. ఉపన్యాసమయినతరువాత రోజూ రామదాసు చరిత్ర చదివివినిపించే టట్టయితే దీపం ఈ గదిలో పెట్టిస్తానని వోవరుసీయరన్నాడు. అందుకందరూ సంతోషించారు. తత్వాలు, భక్తిసంగతులు విన్నతరువాత యెవరూబూతులు మాట్లాడలేదు. బూతుకీర్తనలు పాడలేదు. ఎవరయినా అలవాటు చొప్పున నోరుజారి వొకముక్క అన్నా పక్కవాండ్లి శ్శోక్కొట్టి మాన్పేవారు. కాసేపు ఆషామాషీగా కాలంగడిపారు. తొమ్మిది గావచ్చింది. గడియారం వచ్చి పోయింది పెద్దవుద్యోగస్తులు రౌండుకు వచ్చే వేళకూడాఅయింది. అందరూ గుంపుగా చేరితే బాగుండదు. తనిఖీకివచ్చే ఉద్యోగస్తుడు చూస్తే కోపపడుతాడు. యెవండ్ల అరుగులమీదికి వాండ్లు పోదా మన్నారు. అంతా తమ అరుగులమీద కూర్చున్నారు. జయిలరు రౌండుకువచ్చి వెళ్ళి పోయినాడు. మళ్ళీ అంతా రామదాసు చుట్టూ పోగయి యేమయినా కథలు చెప్పమన్నారు. పుల్లప్ప కథలకేమి మన జయిళ్ళలో వుండేచిక్కులన్నీ ఆయనకు చెప్పకుంటే ఆయన బయటికి పోయినతరువాత నయినా నివర్తి చెయ్యడానికి ప్రయత్నం చేస్తారన్నాడు.

రా:- నేను మీచిక్కులు నివర్తి చేయలేకపోయినా విందామని నాకూ కుతూహలంగానే వున్నది. యేమయినా చెప్పండి.

పు:- కామనాయుడు భండారములో జరిగే చిత్రాలన్నీ చెపితే బాగుంటుంది.

కా:- అడవ సంగతులు నీవు చెప్పరాదా? వాటికంటె చిత్రా లెక్కడవున్నవి?

రా:- వలపక్షం లేనితీర్పు చెపుతాను. ఇద్దరూ చెప్పండి. తూలుగా పోవద్దు పొద్దుబోయింది.

కా:- డుబ్ జయిలరూ, హెడ్ గుమాస్తా, పెద్దసర్జనూ, వంటసాల వార్డరూ వొకపార్టీ. తోడుదొంగలన్నమాట. ఇరవయి పుట్లరాగులు యివ్వాళ కంట్రాక్టరు తెచ్చి వొప్పజెప్పుతా వనుకోండి. బండ్లు గేటుబయటే నిలుస్తవి. దొర, పెద్దసర్జను తనిఖీ జేస్తారు. చెడగొట్టదలచుకుంటే, పెద్దసర్జను యేదో సమిధ వేస్తాడు. ఆయనను డిప్యూటీ జయిలరు లోకట్టుకుంటే యేదుమ్మయినా మంచిసరుకే. రకం తేడాలోవచ్చే లాభంలో కొంత కంట్రాక్టరుకు పోతుంది. వచ్చిన బండ్లలో పదిబస్తాలు పెద్దసర్జను తిప్పివేస్తాడు. దొర లోపల వేయించమని చెప్పి వెళ్ళిపోతాడు. అంగీకరించిన బస్తాలన్నీ తూకం వేయించి భండారములో చేరినట్లే హెడ్ రైటరు దస్కతు పెట్టాలె. తోసివేసిన బస్తాలుగూడా మంచివిగానే లోపలికి వస్తవి. మంచివే, వెనుకకు పంపివేస్తారు. సరుకుల గదిలో రోజుకు రెండుబస్తాల వంతున మిగిల్చిన రాగులు నిల్వవుంటవి. అవి యిప్పుడు లోపలికి చేర్చినట్లే లెక్కచూచుకొని రెండుమూడు బండ్లు బయటివి బయటే పంపివేస్తారు. దొరవచ్చి తనిఖీ చూచుకున్నా బస్తాలన్నీ చేరినట్లే వురువులు కనపడతవి. ఈ తనిఖీ సాధారణంగా జరగదు. అందువల్ల లోపలవున్న బస్తాలకంటె గూడా యెక్కువే తిరిగిపోతవి. ఆలోటు నాలుగయిదు రోజులలో పూర్తి అవుతుంది. బియ్యం గొన్నప్పుడు బస్తాలు కంట్రాక్టరింటికి తిరిగి పోవు. జయిలు వెలుపల సర్కారు వుద్యోగస్థు లందరికోసం కట్టించిన యిండ్లకు చేరుతవి. భాగాలులేని వుద్యోగస్థులకు వాండ్ల కుటుంబానికి కావలసిన బియ్యం, పప్పు, యితరసామగ్రి పంపడం మామూలు. చింతపండు వగయిరాలు వొకటి రెండు పెండేలు బయట వుంచితే దర్జానుబట్టీ, ఖర్చునుబట్టీ, వుద్యోగులంతా పంచుకుంటారు. వాండ్లకు వచ్చినసామగ్రి మిగిలితే అమ్ముకోవచ్చు. ఇండ్లదగ్గర కందిపప్పు చేసుకోవడం కష్టమని కందులబస్తా లన్నీ లోపలికే వస్తవి. మంచికందులు వచ్చినప్పుడు, ఖయిదీలు పప్పు తయారుచేసిన తరువాత బస్తాలు వుద్యోగస్తుల యిండ్లకు చేరుతవి. ఈమోత ఆదివారం రోజున జరుగుతుంది. ఆరోజున దొర ఆఫీ

సుకు రాడు. కాసేపు ఆసుపత్రి చూచిపోతాడు. ఉద్యోగస్థలారోజున నిర్భయంగా సంచరిస్తారు. వారానికి కావలసిన కిరసనాయిలూ, జయిలులో ఆడే మంచినూనే డబ్బాలతో ఆరోజున ముఖ్యంగా బయటికి జేరుతవి. ఖయిదీలలో కొందరు ముసలివాండ్లుంటారు. వొకఖయిదీ ౧౧-వ మారుజయిలుకు వచ్చాడు. అడపాదడపా బయటికి పోతూ నలభైయేండ్లు జయిలులో గడిపాడు. ఇటువంటివారం డ్లింకా వున్నారు. వాండ్లకు బయట నా అన్నవాండ్లు లేరు. జయిలు వుద్యోగులే వాండ్లకు తల్లిదండ్రులు. విడుదలయినా మళ్ళీ వస్తారు. పోలీసులూ కోర్టులూ వాండ్లకు మహోపకారాలు. ముసలివాండ్లు యేం క్లేమిసేరాలు చెయ్యగలరని దొర పైకివ్రాసి వదిలిపెట్టిస్తానంటే వాండ్లు వొప్పుకో లేదు. అంతట వాండ్లకు యర్రబారాగాలు కట్టి బతకమని వదిలిపెట్టారు. జయిలులో కరుణతోగూడిం దిది వొక్కపనే. పని చేయలేకపోయినా అన్నం కడుపునిండా తింటారు. ఆదివారం పొద్దుకూకులూ, వుద్యోగుల యిండ్లకు జయిల్లోనుంచి బరువులు మొయ్యడమే వాండ్లకు పని. వాండ్ల కారోజు వుద్యోగులు అణా బేడా బహుమతిస్తే దుకాణాలకు పోయి నీళ్లుతాగి వస్తారు. వాండ్లకు కాపలా లేదు. యెటు దిరిగీ పక్షులు గూళ్లు చేరినట్టు సాయంత్రానికి జయిలు జేరుతారు. వెళ్ళిపోతారనేభయ మెవరికీ లేదు. వాండ్లకు జయిలు బిడ్డలని పేరు. యే ఖయిదీకి యేదికావలసివుంటే అది తెచ్చిపెడతారు. జయిలులో యీ రెక్కడయినా తిరగవచ్చు. దొరవున్న కాసేపు మాత్రం విశేషంగా బయట తిరగరు.

జయిలరుకూ ఛీఫువార్డరుకూ భోజనపదార్థాలలో భాగాలు లేవు. జయిలరు ఖయిదీలు తయారుచేసే వస్తువులమ్మి లాభాలు తీస్తాడు. బహిరంగంగా అమ్మేవిగాక చెప్పులూ, బూట్లూ, చాపలూ వూళ్ళో అమ్మక మవుతుంటవి. ఖయిదీలుగూడా వార్డర్ల ద్వారా అమ్ముకొని డబ్బు చేసుకుంటారు. ఈమధ్య కొనుగోలు విక్రయాలలో నాలుగువేలు విడితీపడ్డది. స్వదేశీవాండ్లను బాధించి

ప్రభుత్వంవల్ల మెప్పుపొంది తప్పుకోవలెనని జయిలరు చూశాడు గాని రెండువందల జీతం వచ్చే వుద్యోగానికి రాజీనామా యియ్య వలసివచ్చింది. అంతటితో పొయ్యేటట్టు లేదంటారు.

భీష్మవార్డరుకు భోజనపదార్థాల భాగం లేకపోయినా తనూ పరిగేరుకుంటూనే వుంటాడు. ఖయిదీ వార్డరుపనికి శిఫా సు చేసినందుకు రు. ౫-౦-౦, వోవరుసీయరు పనికి రు. 3-౦-౦ ప్రతి స్త్రీకి ౧ రూపాయీ సాధారణంగా పుచ్చుకుంటాడు. స్థితిమం తులు త్వరగా ఖయిదీవార్డరు పని రావడానికి యెక్కువగా కూడా యిస్తారు. కొందరు ఖయిదీవార్డర్లు యీ జయిల్లో రాజులు. ఖూనీ కేసులలోనూ, అల్లరి కేసులలోనూ వచ్చినవాండ్లు లక్షాధికా రున్నారు. జయిలులో వాండ్లకు, జరగని సౌకర్యమూ మరియాదా వుండవు. వేళ్ళతో పని ఎప్పుడూ ముట్టరు. అధికారులకు అప్పులు ఇస్తూవుండతారు. నజరానా యిస్తారు. ఇక్కడనుంచి దక్షిణానికి కమా ల్పుతీసిన ఖయిదీ వార్డరు యింకా పదిసంవత్సరాలు శిక్ష జరుగ వలసివుంటే సూపరింటెంటుగా వున్న డాక్టరుకు యెనిమిది వేలిచ్చి అనారోగ్యకారణాలనుబట్టి విడుదల పొందాడట. డబ్బు చెయ్య లేనిది లేదు. ఇంతేకాకుండా ప్రతిఖయిదీ తేలికపని యిచ్చినం దుకు బహుమతు లిస్తాడు. ప్రతివాడికి జయిలులోకి రాంగనే కష్టపు పని వేస్తారు. చేయి తడిగలవాడు వెంటనే తేలికపనికి పోతాడు. డబ్బియ్యలేని బీదవాండ్లే కష్టపుపని చేసుకుంటారు డబ్బులేని వాడు డబ్బుకు కొరగాడు. ప్రతి ఖయిదీకి విడుదలయ్యేటప్పుడు సర్కారిభత్యంక్రింద కొంతపయికం సర్కారువారిచ్చి పంపుతారు. భీష్మవార్డరు ప్రతివాండ్లదగ్గరా దాంట్లోనుంచి అణాబేడ వసూలు చేస్తాడు. భాగ్యవంతు లయిన సాక్షులూ, అసెసర్లూ, జూరర్లూ తమకు రావలసిన భత్యాలు కోర్టుగుమాస్తాల కిచ్చినట్టు ఖయిదీలు భీష్మవార్డరు కిచ్చిపోతారు. ఇవ్వకపోతే మళ్ళీ వచ్చినప్పుడు కోటాకట్టెలు విరుగుతవని పాతనేరస్తులకు భయం. కొందరు విడు దలయ్యేవాండ్లు వాగ్దానాలుచేసి యిండ్లకుపోయి పంపుతారు.

వెంకటేశ్వర్లు ముక్కుబళ్ళకంటె జయిలు ముక్కుబళ్ళు యెక్కు
శ్రద్ధతో చెల్లుబడౌతవి. మొత్తంమీద ఫీస్టుచార్జరుకు భోజనఖర
పోను నెలకు రు. ౫౦-౦-౦ ల కంటె పైగానే గిడతవి. ఆద
సాహెబు నలుగురుపెండ్లా లున్నవాడు. జోటి కెప్పుడూ తక్కు
వుండదు. నల్లమందుభాయీ గూడాను.

రా:- ఈ ప్రకారం యెప్పుడూ అవిచ్ఛిన్నంగా జరు
తుండేదేనా ?

కా:- ఆహా జరుగుతుండేదే. వెనుక వొకఅయ్యరు జ
లరుగా వుండగా దొంగతనాలు సాగేవిగావు. నాతోగూడా వొ
రెడ్డిఖయిదీ సరుకులకొట్లో పనిజేస్తాడు. స్వదేశీఆయన పెద్దయ
గారు రెడ్డిచేత యేఖయిదీ యేవుద్యోగస్తుడింటికి యేవస్తువు
మోసుకొనిపోయిందీ నమూనా వేసి తయారుచేయించా
యెంతసరుకు వచ్చేదీ, లెక్కలలో యెంతవచ్చినట్టు జమకట్టుతు
డేదీ, తేదీవారీగా ఆరాదీసి లెక్కలు వ్రాస్తున్నాడు. వరుస
మూడునెలలలెక్కలు తయారయినవి. ఈసంగతి యెట్లా
డుబ్ జయిలరు పసిగట్టి రెడ్డి నాపనిలోనుంచి తీసివేసి వేరొకపని
వేశాడు. ఇదివరకు వ్రాసిన మూడునెలల లెక్కలు చాలవా య
డుబ్బును పెద్దయ్య మొగాన పట్టుకొని అడిగాడుట. పెద్దయ్య కే
పెట్టడానికి వెనుకాడుతున్నాడు. పదిమంది పిల్లలుగలవాడని, పిం
నకు తయారు అయినాడని యెన్నితప్పులు చేసినా మనవాడ
కనికరిస్తున్నట్టు కనుపడుతున్నది. అదిగాక స్వదేశీవాండ్లు కే
పెట్టరుట.

రా:- ఇంకా విశేషా లేమీ ?

కా:- సరుకులకొట్లులో వుండే ప్రతివస్తువులోనూ డుబ్బు
పిక్కుతూ నేవుంటాడు. ఆ కథలన్నీ చెప్పదలచుకుంటే రాత్రి
బగళ్ళు పడుతుంది. అన్నిటికంటే వొకచిత్రమున్నది. యెందుకో
పెద్దయ్య సందేహించాడు గాని వొక్కచిటుకాతో డుబ్బు వద
వాడు. పెద్దయ్య తనగది వాకిట్లోవుండి చూస్తే డుబ్బు ఆఫీసు కన

పడుతుంది. దొర వెళ్ళిపోంగనే డుబ్బు ఆఫీసుకు ఆడవార్డర్లు వస్తుంటారు. పెద్దయ్య డుబ్బుకు పగవాండ్లను దగ్గిరకు దీసి సంగతు లన్నీ రాబట్టాడు. అయ్యగారు వొప్పుకుంటే వార్డర్లూ రెడ్డి కలిసి తలుపు తాళం బెట్టాలనే. ఆయన యిది అసహ్యాపుపని అంటాడు. వార్డర్లు పెద్దయ్యను మెడలు విరుస్తున్నారు. ఆయన సాక్ష్యంలేక పోతే కేసు నిలువదు. డుబ్బుపార్టీవాండ్లు తలుపుదీసి దొరవచ్చిన తరువాత అంతా వట్టిదంటారని వార్డర్ల భయం. పెద్దయ్య ఒక్క ముక్క సాక్ష్యం చెప్పుతానంటే అంతా బందవుతుంది. ఇట్లా అనుకుంటుండంగనే ఆయనను యింకొక బారకాసుకు మార్చారు.

జయిలులోనే యిటువంటిసంగతులు జరుగుతుంటే యింకా యేముంది ?

రా:- చివరకు మనకథ రంకుపురాణాలక్రిందికి దిగింది. ఇక పుల్లప్పకథ విందాం.

కా:- అవును. మార్పులలోనే మధుర మున్నది. పుల్లప్పా యిక నీ కథలు కానియ్యి.

పు:- అతని కథలు పూర్తికానియ్యండి. నావి యింకొక మాటు విందురు గాని. అయినా అంత రసవంతంగా వుండవు.

రా:- కామానాయుడు శృంగారరసంతో అంత్యం జేశాడు. ముంతఖర్జూరం తిన్నతరువాత చింతపండు బాగుండదు.

పు:- నాకథ రేపు సాయంత్రం చెప్పుతా.

రా:- సరే. అట్లాగే కానీయి. పొద్దుబోయింది. కామా నాయుడు కథ పెంచాడు.

## ౧౪

### జైలు విశేషాలు

మరురోజు రామదాసు యథాప్రకారంగా టా సియ్యగలి గాడు. ఈరోజు ముఖ్యంగా గమనించదగింది, ఒక్క విషయం మాత్ర మున్నది. వెనుక వొక్ర్రఖయిదీ వొకడు యీజయిలులో

కొద్దికాల ముండి పోయినాడు. విడుదలయ్యేటప్పుడు వొక వార్డరుకు డబ్బు పంపిస్తానని వాగ్దానం చేసి పోయినాడు. పంపలేదు. తాను మళ్ళీ వచ్చినా యీ జయిలు కెందుకు పంపుతా రనుకున్నాడు. మళ్ళీ దీర్ఘ శిక్ష పడి కర్మంజాలక యీ జయిలుకే కమానెత్తారు. అతనిని వెనకటివార్డరు ఛీఫువార్డరుతో మాట్లాడి తన దగ్గరనే పనికి వేయించుకున్నాడు. మొదటిసారి విడిఖయిదనుభవించడం చేత ప్రౌఢుడు పనుల కలవాటు పడలేదు. పని చేయించడంలో వార్డరు చెప్పేది వురియావాడి కర్థమయ్యేది కాదు. చెయ్యమన్నాడో, వద్దన్నాడో కూడా తెలియకపొయ్యేది. వార్డరు ఛోటాకట్టె యెప్పుడూ వాడివొంటిమీద ఆడుతూనే వుండేది. పైకంకోసం యింటికి వ్రాస్తే జవాబు రాలేదు. పగలల్లా దెబ్బలు. ఒకరితో మాట్లాడేందుకైనా బాస రాదు. జీవితం దుర్భరమైంది. ఈరెండుకారణాలూ చెప్పి దొరను కమానెత్తమని షైబులో రెండు మాట్లడిగాడు. వాడు చెప్పేది యెవ్వరికీ తెలియలేదు. సూపరింటెండెంటు తలవూచి వెళ్ళిపోతూ వచ్చాడు. వీడికి వొకటి రెండు హిందీ ముక్కలు మాత్రం వచ్చును. చచ్చిపోతానని దగ్గరవాండ్లకు చెప్పి చింతమానెక్కి అక్కడినుంచి అందరికీ దణ్ణాలుబెట్టి కిందబడతానని సైగజేశాడు. మొదట వట్టిదే అనుకున్నారు. గట్టిదని తెలిసి ఖయిదీవార్డరూ, వార్డరూ బిగుళ్లూదారు. దొర పరుగెత్తుకుంటూ చెట్టు దగ్గరకు వచ్చేవరకు ప్రౌఢుడు చేతులు వదిలిపెట్టి దొరకు పది గజాలు దూరంలో పడ్డాడు. ఒక చేతి యెముకలు నజ్జు నజ్జు అయినవి. ఒళ్ళంతా హూనమైంది. సూపరింటెండెంటు భయపడి పరుగెత్తాడు. వ్యవహారం విచారణలోకి రాలేదు. జరిగింది నేరమే అయినా బయటికి వస్తే పాలన బాగుండలేదంటారని యావత్తూ కప్పిపుచ్చి వురియాను ఆసుపత్రిలో వుంచి యెముకలు కట్టుకున్న తరువాత యెక్కడికో కమాను పంపారు. ఆ రోజు సాయంత్రం యథాప్రకారం కొట్లు మూశారు. ఆసుపత్రిలో ఒక రోగి ఆ రోజు కాలం జేశాడు. పీనుగ మంచంమీదనే వున్నది. కాలు కిందికి

వేలాడుతున్నది. చిన్న సర్జను ఆస్పత్రికి వచ్చి శవముతో సరసా లాడాడు. ఆ రోజు వుదయం దొర చూడవచ్చినప్పుడు గోధుమ రొట్టె పెట్టించమని అడిగాడుట. నంజు గోధుమరొట్టె తింటే నయమవుతుందని వాడి ఆశ. ఖయిదీకి మాత్రం ప్రాణం తీపిగాదా! చిన్న సర్జను పీనుగను 'హారే నాయనా! నీకు రొట్టె పెట్టించేనటరా' అని బుజ్జగించి అడిగాడు. అది పలుకలేదు వైద్యుడు కోపమువచ్చి బూటుకాలితో వ్రేలాడేకాలు తన్ని, పలుకవేమిరా అని బెదరించాడు. అన్నీ భగవంతుడే విచారిస్తాడని గామాలే శవము దానికి జవాబు చెప్పలేదు. వెళ్ళిపోయినాడు.

ఆసుపత్రిలో బ్రతకడంకంటె చావడమే యెక్కువఅసహ్యాం. రాంగులకు కట్టిన గోనెపట్టలోకి పీనుగనుదోసి వాహకులు హోహూం హుం అని నవ్వుతూ మోసుకొని పోయినారు. దొర దగ్గిరవుంటే మొటలకుండానే మోస్తారు. స్వదేశపు ఉద్యోగస్థులివి గమనించరు. శవాన్ని యెట్లా మోసుకొనిపోతే నేమని సర్జను వొక స్వదేశీ ఆయనకు జవాబు చెప్పాడు.

రోజూ ప్రార్థనచేయడం మామూలు అయింది. రామదాసు మంచి నడతనుగురించి కొంతసేపు చెప్పిన తరువాత పుల్లప్ప దూరంగాపోయి కూర్చున్నాడు. ఉపన్యాసం ముగించి పుల్లప్ప యేమని రామదాసడిగితే కామానాయుడు 'నిన్న నా చేత కథ చెప్పించుకొని ఇవ్వాళ తాను చెప్పబడుతుం' దని యే అరుగుల సందునో తొంగాడన్నాడు.

రా:-అబ్బాయీ? ఆ పప్పాలుడకవు. ఇట్లావచ్చి నీకథ చెప్పు.

పు:- ఈ పూట నాకు సుస్తీగా వుందండి, రేపు చెవుతాను.

రామ:- స్వస్తిగా వుండేమార్గం నే చెపుతా రా.

పు:- (దగ్గరకు వచ్చి) చెప్పండి.

రా:- (మొగము తేరిపారజూచి) ఒకనవ్వా నవ్వు ?

పుల్లప్ప:- నవ్వి, తల పక్కకు తిప్పాడు.

రా:- పోయింది, పో.

ఫుల్లప్ప స్వస్థుడైనాడు. అంతా ఆశ్చర్య పడ్డారు. కః ప్రారంభమైంది

పు:- అసగసంగా వొకసెంట్రలుజైలు. అంతా నవ్వా

రా:- కథానాయకుడు ఫుల్లప్ప కానియ్యి.

పు:- కుసిసీలో పనిచేసే వార్డరుదగ్గరనుంచి ఖయిదీదాక అమ్ముకుండేవాండ్లే. పైవాండ్లు డబ్బులకమ్ముకుంటే ఖైదీలు బీడీ కమ్ముకుంటారు. జయిలుధరల ప్రకారం కానీకి రెండు అన్నాలు అన్నానికి నాలుగు బీడీలు. అన్నమిస్తే రాగిరొట్టె ఇచ్చి రెండ బీడీ లిస్తారు. గోధుమ రొట్టెకు పన్నెండు బీడీలు. అడవలో ప చాలా కష్టం. అహోరాత్రాలు హండాలు పొయిమీదనే వుంటవి రెండువేల జనానికి గంటల ప్రకారము మూడు పూటలా అన్న మమరాలె. అడవవాడు రాక్షసగణములో వాడయితేనేగాని నె లేదు. ఛోటాకట్టె యెప్పుడూ ఆడుతూనే వుంటుంది. కాపలా బాగా చేయకపోతే ఖయిదీలంతా అమ్ముకుంటారు. వార్డరు దగ్గిర కొనేవాండ్లే వుండరు. ప్రతిపూట తూనికలో యేడన్నాలకొక అన్నం, యేడు రొట్టెల కొకరొట్టె పిక్కి మిగులుస్తారు. మూడు పూటలా లెక్కజూస్తే యెంత పెచ్చు వస్తుందో చెప్పవచ్చు. రెండువందల యేబదిమందికి రెండు పూటలకూ సరిపొయ్యే ఆహారం మిగులుతుంది. వీటిలో కొందరు, వార్డర్లు వూరికేనే తింటారు. ఛీఫువార్డరు యింటికి రోజూ మధ్యాహ్నం పన్నెండు పోతవి. పైరివేటుగా రాగిరొట్టెలు ఖర్చయ్యే అన్నాలతోను పేస్తగులో శేషించినదాని మోయిను మొదట బియ్యమియ్యడమే తగ్గిస్తారు. ఇంతమందికి సరిపడే పప్పూ, ఉప్పూ, కారమూ, తక్కిన మసాళావస్తువులూ మిగులుతవి. దొర యెప్పుడయినా తనిఖీ చేస్తూనే వుంటాడుగాని దొరలు గుడ్డిదొరలు. దీనిని పట్టు కోవలెనంటే మనవాండ్రే పట్టాలె. ఇప్పుడున్న మన వుద్యోగ స్థులలో న్యాయస్థుడొకడూ లేడు. స్వరాజ్యంవస్తే పెద్దయ్య

ఖువన్నీ మారిపోతవంటాడు గాని నాకు నమ్మకం లేదు. ఈ మధ్య స్వదేశీవాండ్లను కొందరిని అడవలో చేరిస్తే వాండ్లూ కొందరు తక్కినవాండ్లపాటే అయినారు. సిక్కులు అడవలోకి పొట్టెలు చేసుకోనేటందుకు వచ్చారా అంటే అందరికీ అడలు. వార్డర్లు యేమయినా యెత్తుకొనిపోతుంటే చెవిపట్టుకొని దొరదగ్గఱకు లాక్కొనిపోతా మంటారు. వాండ్లున్నంతసేపు యే దొంగతనమూ జరగదు. అడవలోకి పోయే స్వదేశీవాండ్లు గట్టిపని చేస్తే చాలా వుపయోగ మయ్యేది. వాండ్లేమీ చెయ్యలేకపోయినారు. తగినవాండ్లు పోలేదు.

గంజి గాచడానికి తలకు నాలుగౌన్సుల రాగిపిండి గోధుమపిండి బియ్యమూ యిస్తారు. గంజిమోయికులు సాయంత్రము తీసుకొని వంట రాత్రి పన్నెండుగంటలకు ప్రారంభించి గంజిగాచి ఉదయం ఆరుగంటలయ్యేవరకు హండాలు బారకాసులకు తెస్తారు. గంజి తనిఖీచేసేవాండ్లెవ్వరూ లేరు. మనిషికి బియ్యంగానీ, పిండిగానీ, రెండు అవున్సులుమాత్రమే గంజికి వుపయోగిస్తారు. తక్కినదంతా వుద్యోగస్థుల లెక్కకిందనే జమ.

కా:- ఈ దొంగతనాల కేమి. లంచాలు తక్కిన వుద్యోగస్థులుమట్టుకు తినడంలేదా? ప్రతి డిపార్టుమెంటూ యిలాగే యేడుస్తుంది.

పు:- అయితే వొక భేదంమాత్ర మున్నది. లంచంయిచ్చేవాడు కొంత ప్రతిఫలం పొందుతాడు. డబ్బున్నవా డిస్తాడు. లేనివాడు మానుకుంటాడు. జయిలులో ఖయిదీలు చేసేవస్తువులమ్ముకొని జయిలరు లాభము తింటే సర్కారుసొమ్ము హరించినట్లే. మనకు నష్టం లేదు. ఖయిదీలకు సర్కారువా రిచ్చేపడే తక్కువ. సాధారణంగా నాజూకుగా తినేవాండ్లకుకూడా సరిపోదు. ఉప్పుకారంగూడా స్వల్పంగా ఇస్తారు. ఈ అర్ధాన్నంలో విద్యార్థికులమని పేరు పెట్టుకుండేవాండ్లంతా చౌర్యం జేసి సగానికి సగం హరించడం కేవలం అన్యాయం. వంటయింట్లోకి వచ్చేవరకే

చాలాభాగం హరిం పప్తుంది. వచ్చి వండినతర్వాత నోర
గలదేవుళ్ళకు ముందు మ్రొక్కులు చెల్లాలె ఖయిదీవార్డర్లందరూ
ఉదయం సాయంత్రం రెండేసి అన్నాలు తీసుకొని పోతారు
వార్డర్లలో హాజరు వున్నవాడ్లంతా అడవలోనే భోజనంచేస్తారు
తక్కిన ఖయిదీలలో నెలకు పావలా ఇవ్వగలిగిన ప్రతిఖయిదీ
రెండేసి అన్నాలు తెప్పించుకొంటాడు. వంటవాండ్లూ వడ్డన
వాండ్లూ తిన్నంత దిని బీడీలకమ్ముకుంటారు. రెండుబీడీలు అడ
పకు పట్టుకొని వచ్చిన ప్రతివాడికీ వొక అన్నం చేతికిస్తారు
ఇవన్నీ పోగా తక్కిన అన్నంముద్దలు వొట్టి దరిద్రగొట్టు ఖయిదీ
లకు పంపుతారు. వేలు జీతాలు తినేవాండ్లేగాని యిది విచారించే
వాడెవడూ లేడు. ఖయిదీల దగ్గరకు వచ్చేవరకు పులుసు వట్టి
నీళ్ళుగా వుంటుంది. నీళ్ళలో ముక్కలూ కూరా దేవుకుంటారు.
పయినుంచి కిందిదాకా యెవరు చూడబోయినా దొంగే. వంగి
పనిచేసేవా డెవడూ లేడు. అంతా వట్టిబూటకం. రూలుప్రకారం
ఐ. జీ. సంవత్సరానికి వొక్కమాటూ, సూపరింటెంటు వారాని
కొకమాటూ, జయిలరు ప్రతదినమూ ప్రతిఖయిదీని చూడాలె.
దొరమాత్రం వారాని కొకమాటు ప్రతిఖయిదీని చూశా ననిపి
స్తాడు. అందరినీ వరుసగా నిలుచోబెట్టి చూస్తూ పోతాడు. తనిఖీ
వార్డర్లు దొర చూడడానికి వచ్చినప్పుడు, యేమీ చెప్పకోకూడ
దనీ, దానికి వ్యతిరేకముగా వర్తిస్తే కట్టె విరుగుతుందనీ చెప్పు
తారు. అందువల్ల! యెవడూ నోరెత్తడు. స్వదేశీవాం డ్లున్న
బ్లాకులలోమాత్రం ఖయిదీ లప్పుడప్పుడు ధైర్యంచేసి దొరను యేద
యినా అడుగుతున్నారు. తక్కిన బారకాసులలో కిమినాస్తి. నో
రెత్తగూడదు. ఫయిలుకు పోయేటప్పుడు జయిలరు సూపరింటెంటు
వెంట తిరుగుతాడు. అంతకు మిక్కిలి సాధారణంగా ఎవరినీ చూడ
డు. కార్ఖానాలలోకి అప్పుడప్పుడు పోతుంటాడు. ఇది అంతా
యెందుకు ? మొన్న యినస్పెక్టరు జనరలు వచ్చి యెంతమందిని
చూచాడు? ఆఫీసులో కూర్చొని చుట్టు దిరిగిపోయినాడు. స్వదేశీ
వాండ్లు స్నానానికిపోంగా చూచి వారిబారకాసుకువచ్చి వొకరిద్దరు

నానికి పోనివాండ్లను చూచి పోయినాడు. ఐ. జీ. గారే యంతగా చూస్తే జయిల రెంతగా చూస్తాడు? సర్జను జనరలు రాదు వస్తాడని గడబిడగా చెప్పుకున్నారు. మోటారుమీద ఆసుపత్రికివచ్చి పోయినాడుట. ఆసుపత్రిలో వున్న నోరుగల స్వదేశీ ఖయిదీ పడుకుండేగదికి బయట తాళం వేశారు. యెందుకో ఆయనకు తెలియదు. తీరా విచారిస్తే సర్జను జనరలు వచ్చిపోయినాడని తెలిసింది. ఇదంతా దొర చేయించాడనిగాని ఆయనకు తెలుసునిగాని అనడానికి వీలులేదు. ఇవి బయటికివస్తే దొరకు మాటవస్తుందనీ, అందువల్ల ఆయనకు ఆగ్రహం రావచ్చుననీ భయం. దంతా సంస్కారం కావలెనంటే జాతిలో నీతివర్తన యెంత అభివృద్ధి కావలెనో ఆలోచించుకోండి. స్వదేశీవాండ్లల్లో యీ రోషం తగులనివాం డ్లెందరో నాకు లెక్కబెట్టి చెప్పు. రేపు వాండ్లను జయిలువుద్యోగులనుగా యేర్పాటు చేసినా యింతేపని జరుగుతుందని నా అభిప్రాయం.

రా-: (నిట్టూర్పుతో) ఈక థింతటితో ఆపి, రెండువేల జనానికి భోజనపు ఏర్పాటుకు యెంత పెద్దయేర్పాట్లు చేసివుంటారో నా కాశ్చర్యంగా వున్నది. అవి కొంచెం వర్ణించి చెప్పు.

పు:- పూటకు పదిపదునాలుగు వందల రాగిరొట్టెలు కాలుస్తారు. నాలుగుగజాల పొడుగునా, గజమెత్తునా గోడవెంబడి గాడి పొయ్యి గట్టి పక్కగుండా మానులు నరికి పొయ్యిలో పచ్చివే పడవేస్తారు. ఇల్లంతా పొగకమ్ముకొని మనుష్యులు నిలువడానికి వీలులేకుండా వుంటుంది. ఏరోజు కావలసిన వంటచెరుకు ఆరోజు చెట్లు పడనరికి వెయ్యడమే. ఇంతమందికి వంట యెందుకట్టెలు లేకుండా యెట్లా చేస్తా రని వుద్యోగు లనుకుంటారో తెలియదు. వంటచేసే ఖయిదీలు బాధలు చెప్పుకున్నా వినేవాండ్లు లేరు. ఈ పెద్ద పొయ్యిమీద నాలుగుగజాలు పొడుగూ, గజం వెడల్పూగల యినప పెనం వేస్తారు. ఒక్కొక్క-సారి వంద రొట్టెలు కాలుతుండవచ్చు. నాలుగు వరసలుగా నాలుగు గజాల పొడుగునా వేస్తారు. నానిన పిండి కొల్చి ముద్దలు చేసేవాండ్లూ, రొట్టెలు తట్టేవాండ్లూ

వెనంమీద వేసి నీళ్ళు జల్లేవాండ్లూ, తిరగవేసేవాండ్లూ వి
విరామమం లేకుండా పని జేస్తూనే వుంటారు. ఇంకొకచోట మధ
పొగబోయే చిమ్నీ, మూడు వయిపులా గోడలుబెట్టి వొక్కొక
వయిపున రెండేసి పొయిలూ వుంటవి. ఒక వైపున అన్నం, ఒ
వైపున పులుసూ, ఒకవైపున పప్పూ, ఉడుకుతుంటవి. యాపై
శేర్లు వుడికే గంగాళాలతో వొండుతుంటారు. గంగాళాల చె
లలో బొంగులుదూర్చి యిద్దరు భుజాన బెట్టుకొని వుడికి
హండాలు దింపుతుంటారు. గాడిపొయిలలో పచ్చిమానులు ప
వేస్తుంటే పొగసే అగ్గికి యెండి కొంతసేపటికి గణగణలాడుతు
మండుతుంటవి. వంట అయిన తరువాత లెక్కప్రకారం ర
వార్డుకు పోవలసిన భోజనం అక్కడికి పంపుతుంటారు. అన్న
ముద్దలు గొట్టడంలో చాలా చాకచక్యం వుంటుంది. అదిఓ
గొడితే అన్నం యెక్కువపడుతుంది. తేల్చికొడితే పెద్ద ము
లలో రెండేసి ఔన్సులు మిగులుచుకోవచ్చు. తగాదాల
పెట్టే వాండ్లున్న బారకాసులలోకి తక్కువ ముద్దలు పంపరు
మొత్తంమీద మెత్తనివాండ్లున్న బ్లాకులలో యే పిచ్చముద్ద
లయినా చలామణి అవుతవి. హండాలలో కాస్త గంజెక్కువ
వుండేటట్టు వెసరుపోస్తే ముద్ద సళువవుతుంది. ఎంత పెద్దదొర
నయినా కండ్లుమూసి తూనిక చూపించవచ్చు. ఇదంతా పరీక్షించి
కనుక్కుండేవాడు లేడు. దొరకు ప్రయత్నించినా కనుక్కోవడం
సాధ్యంకాదు. ఎక్కడ నొక్కాలెనో ఆయనకు తెలియదు. నొప్పి
లేని చోట వత్తితే డాక్టరుకేమి తెలుస్తుంది? జయిలు బాగుచేయ
వలె నని ప్రయత్నించడం నిష్ప్రయోజనం. నలుగురు బయటి
వాండ్లూ చూడడానికి వీలులేక పోవడమే కారణం. ఖయిదీలకు
వుద్యోగస్తులను పరీక్షించే అధికార ముంటే వాండ్లు అదుపులో
వుండరనీ బయటివాండ్లకు స్వేచ్ఛగా ఖయిదీలతో మాట్లాడి
సంగతులు తెలుసుకొనే వీలుంటే కారాగృహముయొక్క భయమే
పోతుందనీ యెంచడంమూలంగా జయిళ్ళు పాడవుతున్నవి. ఈ

అభిప్రాయాలకి తోడు, మంచివర్తన గలవాండ్లను యేరి వుద్యోగాలకు నియమించక పోవడం మరియొకలోపం.

రా:- ఖయిదీలకే జ్ఞానం కలిగించి వాండ్లవల్లనే యీ అక్రమాలు అణచాలె.

కా:- వాండ్లను పశువులుగా నుంచినంతకాలం వాండ్లనణచడానికి శస్త్రసాధనం. కాని వాండ్లకు జ్ఞానం వృద్ధిజేస్తే మాటల చేతనే అదుపులో వుంచవచ్చు.

పు:- అధికారం చేతిలో వున్నవాడల్లా దొంగే అవుతాడు.

రా:- పుల్లప్పా! నీవు సర్వం అనర్థమనే సిద్ధాంతం అవలంబిస్తున్నావు. ప్రపంచాన్ని అన్నివిషయాలా ఆదృష్టితో చూడడం తప్పు. నాకుకూడా మనస్సుకు కష్టంగా వుంది. బాగుచేసేభారం భగవంతుడిది. మనకు దిగు లెందుకు? మనధర్మం మనం చేస్తే చాలు. మిగతాది ఆయనే జాగ్రత్తపెట్టుకుంటాడు. పోయి పడుకోండి.

## ౧౫

### మార్పు

రామదాసుకు జయిలుజీవితం కొత్తబాసింది. మొదట యెబ్బెరికంగా వున్నపద్ధతు లన్నీ పాతగిలి సాధారణ మయిపోయినవి. రేపులూ మాపులూ రాటపాకులవలె క్షణంలో తిరిగివస్తున్నవి. మొదట వుత్సాహంగా తాను ఇవ్వవలసిన దానికంటె యెక్కువపని చేస్తూ మొదటిరకం టాసు యిస్తున్నా కొన్నాళ్ళకు విసుగెత్తి నల్లదారపు వాండ్లతోపాటు పని జేస్తున్నాడు. ఎండలుబాగా ముదిరినవి. సంవత్సరాది వెళ్ళిపోయి చైత్రమాసం జోరబడి సగపడ్డది. రామదాసు క్వారంటులోనుంచి ఆసుపత్రికి రావడం, వచ్చినవెంటనే పిల్లల మరణవార్త వినడం, మాలక్ష్మి వెంకటదాసూ పోవడం, వొకదానివెంట వొకటి తగిలినవేలికే తగిలినట్టు సంభవించి యితర జోక్యాలేమీ పెట్టుకోలేదు. వీరదాసూ, రంగదాసూ మొదలయినవాండ్లు నిడదవోలు

జయిల్లోనే మూడో బారకాసులో వున్నా రామదాసు వచ్చిన
సంగతిగాని, అతనికి వచ్చిన విపత్తులనుగురించిగాని వినలేదు
తక్కెళ్ళ జగ్గడు వచ్చి చనిపోయినాడని విన్నారు. గాని అతడ
తమ వెంకటదాసే నని యెరుగరు. ఒకటవ బారకాసుల
పుల్లప్పా, రామదాసు కలుసుకున్న తరువాతకూడా వాళ్ళతో
మాట్లాడడం పడలేదు. మూడవ బారకాసులో వంచెలున్న వ
అక్కడి కెవ్వరినీ పోనియ్యడంగాని, అక్కడి వాండ్లను ఇతర బ్లాక
లకు రానివ్వడంగాని లేదు. నాలుగవ బ్లాకులో వంచెలు ముమ్మ
రమై ప్రతివాండ్లూ ముజ్జిడ్డుగా పడిపోవడంచేత పోయ్యనివాండ్లన
అక్కడనుంచి తీసి యితరచోట్లకు సర్ది నాలుగవ బ్లాకును ప్రత్యేక
ఆసుపత్రిగా చెయ్యడంలో పుల్లప్ప ఛీఫువార్డరుతో ఏదో తంత్రం
జేసి మంగళాపురపువాండ్లను వొకటవ బ్లాకులో వేయించాడుగాని
తమసావిట్లో వుంచడం వీలులేకపోయింది. పగలల్లా వొకరినొకరు
చూచుకొని మాట్లాడడానికి వీలు కలిగింది. రామదాసు సంగతి
క్రమంగా అన్ని బ్లాకులలోను తెలిసింది. ఒకటవబ్లాకులో వున్న
౧౧ సావిళ్ళవాండ్లూ తలా వొకరోజు రామదాసును మార్చి తమ
సావిళ్ళలో పడుకోబెట్టుకుంటూ, లోకసంగతులూ, నీతిమత
బోధలూ వింటున్నారు. తక్కిన బారకాసులవాండ్లుగూడా తమ
సావిళ్ళలోవున్న చదువుకున్న ఖయిదీలను బతిమలాడుకొని స్వదేశీ
వాండ్లదగ్గరనుంచి పుస్తకాలు తీసుకొనిపోయి చదివించుకుం
టున్నారు. ఈ సంగతులు సూపరిండెంటుగారికి తెలియలేదు.
ఎరిగినవాండ్లు నలుగురూ వొకచోటవున్నా కొన్నినెలలు గడిచే
వరకూ జీవితంలో డక్కాముక్కీలు దిన్న రామదాసుకు కూడా
తత్వం మారిపోయింది. అక్కడికీ రోజూ కొంతపని చేస్తూవున్నా
స్వేచ్ఛగా దిరక్కపోవడంచేత అన్నం సరిగా అరగడంలేదు.
మనిషి దుర్బలుడై పట్టుమని పదినిమిషాలు ఫయిలులో గొంతు
కూర్చోలేడు. కాళ్ళు తిమ్మిరిపట్టేవి. ఎప్పుడయినా నీళ్ళకోసం
దూరంగా పోవలసివస్తే రెండుఫర్లాంగులు నడిచేవరకు కాళ్లుతీసేవి.
కదలకుండా కాసేపు నిలువంగనే పిక్కలు నొప్పిపట్టేవి. మజ్జిగ లేక

పోవడం, నువ్వులనూనె పులుసులో వేయడం, తలంటు లేకపోగా వారానికొక్కమారయినా స్నానవసతి లేకబోవడంచేత శరీరం పైత్యదారుణాసబడి వయస్సువిగారినా నెరవని తలంతా పలితరోగికి వలె జనపనారకట్టయింది. అయిదారునెలలు మాడున చమురు పెట్టుకొని యెరుగడు. కండ్లకు బాగా మసక లేర్పడ్డవి. స్వదేశీ వాండ్లు రోజూ స్నానంచేయడం చూస్తే వొంటికి రోమాంచం గలిగింది. ఈ మార్పుల కేమిగాని బలహీనులకూ వృద్ధులకూ రక్షణసాధనమయిన కోశం ప్రవేశించింది. స్వల్పవిషయాలకు గూడా మనశ్శాంతి పోయేది. ప్రతిదానికీ అనవసరమయిన పట్టుదల యేర్పడ్డది. ఇదివరకు యెదటివాండ్ల ఆక్షేపణలకూ, దూషణలకూ పెడమొగం పెట్టేవాడు. ఇప్పుడు తనలో దోషం లేదని తెలిసికూడా తనజీవితాన్ని గురించి స్వల్పవిమర్శన చేసినా సహించలేక పోతున్నాడు. ఇతరులకు యే స్వల్పబాధ గలిగినా మనస్సుకు అనవసరమయిన వుద్రేకం గలిగేది. ఇంద్రియనిగ్రహం గల రామదాసు స్థితే యిలావుంటే తక్కినవాండ్లసంగతి చెప్పవలసిన పనిలేదు. రాయివంటి శరీరముగల పుల్లప్ప బొత్తిగా దసిలిపోయినాడు. ప్రతిదానికీ చిర్రుమనడం అందరికీ స్వభావగుణం అయింది. వీరదాసు మొదలేముక్కోపి. పైగా అరవైయోపడిలో వుండడం, అర్ధభోజనం బొత్తుగా దిగదీసింది. ముల్లంగిఆకుపులుసు పడక రెండుమూడుసారులు ఆసుపత్రిలో వుండివచ్చాడు. మనిషి బొత్తిగా హావిష్యం భవిష్యం లేకుండాపోయినాడు. బయట జీవనాధారం యేమీ లేనివాళ్ళకు, జయిలులో వుండడమే మేలంటారనుకున్న వాళ్ళకు దేహ మనోబలాలు క్షీణించివున్నవి. దేహంయొక్కయూ, ఆత్మయొక్కయూ సర్వశక్తులకూ పుష్టినిచ్చే స్వాతంత్ర్యము లేనప్పుడు అన్నిశక్తులూ క్షీణించేవుంటవి.

నిడదవోలు సెంట్రలుజయిలులో చాలాబ్లాకులలో జనం నిండా లేరు. గడువుతీరిన వాండ్లు వెలుపలికి పోతున్నారు గాని క్రొత్తగా వచ్చేవాండ్లు తక్కువ. సి. టి. ఆక్టు ఖయిదీ లెవ్వరూ రావడం లేదు. అందువల్ల జయిళ్ళలో నాలుగోవంతు సంఖ్యతగ్గింది.

మహాత్ముని అసహాయోద్యమం దేశ మంతటా వ్యాపించినది. మాలపల్లెలు మగ్గాలతో నిండినవి. సాలీలూ, తొగటలూ, మాలలూ మొదలయిన తంతువాయ జాతులన్నీ దేశానికి కావలసిన గుడ్డలన్నీ నేయలేకుండా వున్నారు. సాధారణంగా వాండ్ల కుటుంబాలకు సరిపొయ్యే కూలి గిట్టుతున్నది. సంతానులలో చాలా మంది డబ్బు చేతికి చిక్కించుకొన్నవాండ్లు బాగా పుష్టిబడ్డారు. స్వదేశీ చెప్పులయందు జనానికి అభిమానం కలగడంతోటే మాదిగవాండ్లకుకూడా చేతినిండా పని దొరుకుతున్నది. ఖద్దరు వృద్ధి కావడంతోటే కోట్లమందికి వడకడం, యేకడం, రంగులద్దడం పని సరిపోతున్నది. మునుపు ముతకనూలుమాత్రం వడకడం చేతనయినవాండ్లు సన్నపునూలు తీస్తున్నారు. పత్తి పండే జిల్లాలలో నేతమటీ యెక్కువయింది. చాలాజిల్లాలు నేతజిల్లా లనిపేరు పడ్డవి. వాటిల్లో వుండే పెద్దబస్తీలన్నిటిలోను ఖద్దరుసంతలు పెట్టి అధికంగా వుండే నూలూ, గుడ్డలూ యితరజిల్లాల కెగుమతి చేస్తున్నారు. ప్రతినెలా సంతలసంఖ్య పెరిగిపోతున్నది. మొదట నెల సంతలుగా పెట్టినవి పక్షసంతలూ, వారసంతలుగా మారినవి. మాలమాదిగ పల్లెలలో పూర్వం జగ్గడిసంతానులుగా వుండి చెయిమెల్లా చిక్కించుకొన్నవాళ్లు చాలామంది ఖద్దరు వర్తకం ప్రారంభించి గుడ్డలూ, నూలు కొని నిలువజేసి దూరపుసంతలకు పంపుతున్నారు. పల్నాడు మాంచెస్టరయింది. సీమనూలంటే పల్నాటిసీమ కొండవీటిసీమ యని అర్థం రూఢ మవుతున్నది. ఖద్దరువల్ల కోట్లకొలది జనానికి జీవనం కలగడంతోటే తక్కినకూలీలకు వ్యవసాయపు పనులవల్ల యెడతెగకుండా కూలి దొరికి సుఖజీవనం జరుగుతున్నది. విదేశీగుడ్డ లమ్మేవర్తకులంతా స్వదేశీ గుడ్డలనే అమ్ముతున్నారు. ఇదివరదాకా అహమ్మదాబాదు బొంబయిపట్టణాలలో ముతకనూలు వడికేయంత్రాలన్నీ ఆపని కట్టిపెట్టి సన్నపునూలు మాత్రం వడుకుతూ కొన్నింటిని యితరపనుల కుపయోగిస్తున్నారు. అందుమూలంగా యితర వృత్తులు చాలా అభివృద్ధి అవుతున్నవి.

కూలీలకు పని పుష్కలంగా దొరికి, డబ్బు మిగులుతుండ డంతోటే కూలికూటాలకూ, పరపతిసంఘాలకూ ప్రాముఖ్యత హెచ్చింది. ఊరూరా వొకరి ప్రయత్నం లేకుండానే సంఘా లేర్పడు తున్నవి. జనం బొత్తుగా తాగుడు మానివేశారు. ఏ యింగ్లీషు విద్యాధికులలోనో తప్ప సామాన్యజనంలో మత్తు ద్రవ్యాల వుపయోగం లేనేలేదు. ప్రభుత్వోద్యోగులూ, సారాయి యిజారాదారులూ జనులచేత సారాయి తాగించవలెనని విశ్వ ప్రయత్నాలు చేస్తున్నారు. సారాయి తాగవద్దని బోధిస్తే శిక్షించ డానికి మొగంచెల్లక బోధకులు అల్లరి చేస్తున్నారనీ, జనులకు తాగేటందుకు స్వాతంత్రత వుండాలనీ, దేనికీ నిర్బంధ ముండగూడ దని, ప్రబోధకులమీద వుద్యోగులు తప్పు కేసులు పెట్టి నిర్బంధాల పాలు జేస్తున్నారు. ఒక గడుసు ప్రచారకుడిమీద తాగవద్దని నిర్బంధిస్తున్నట్టు కేసుపెట్టి విచారణ జరపడంలో యీ క్రింది సంభాషణ జరిగింది.

జిల్లామేజస్ట్రీటు:- సారాయిదుకాణాల దగ్గిరకు పోయేవాం డ్లను నీవు నిర్బంధిస్తున్నావా?

ముద్దాయి:- మాపేటలో దుకాణం నడివూళ్లో వున్నది. చుట్టుపట్ల కాపురంవుండే మాకు తాగుబోతులు తొందరజేస్తూంటే ఆపడానికి ప్రయత్నించిన మాట వాస్తవం.

జి-మే:- దూరంగా పెడితే తాగేవాండ్లకుమట్టు కిబ్బంది గాదా?

ము:- తాగేసౌకర్యం, తాగేవాండ్ల వుసులు, మీరు చూస్తుంటే కాపురముండేవాండ్ల సౌకర్యం వుసులూ నేను చూస్తున్నాను.

జి-మే:- అందరి హక్కులూ కాపాడడం ప్రభుత్వం వారి ధర్మ మయివున్నది.

ము:- చుట్టుప్రక్కల అల్లరులు లేకుండా కాపుర ముండ డానికి మాకు వుండే హక్కును ప్రభుత్వంవారు కాపాడవలెగాని

తాగి అల్లరిచేసే హక్కును కాపాడవలసిన బాధ్యత ప్రభుత్వం మీాద లేదు.

జి-మే:- ప్రచారకులు చేసేబోధలవల్ల యెట్టి నేరాలు జరుగుతున్నవో తెలుసునా? కులకట్టుకు వ్యతిరేకంగా తాగినవాడికి అలగాజాతులు నెత్తి గొరిగించి అవమానం జేశారట. ఈ సంగతి మా పార్లమెంటులోగూడా ప్రశ్నించారు. ఈ దేశంలోని మూఢాచారాలకు నాగరక దేశాలు నవ్వవా?

ము:- అవును నవ్వుతవి. తాగవద్దని బోధించే పెద్దలను శిక్షించి ఖయిదులోబెట్టి నెత్తి గొరిగించి అవమానపరచిన ప్రభుత్వపు జాతివారు నవ్వినా నవ్వనియ్యి. తామామోదించి అమలులో బెట్టిస్తున్న చట్టం అలగాజాతులుగూడా నవ్వేటట్టుగా వున్నదని పార్లమెంటు సభికులకు తెలియదుగామాలె. ఇటువంటి నాగరికుల చట్టాలకంటె మూఢుల ఆచారాలే యెక్కువ నీతిదాయకాలని నే స్పష్టంగా చెప్పగలను. రాజకీయ ప్రభువు వేస్తున్న శిక్షకంటె సంఘం అనే ప్రభువు వేసేశిక్ష యెక్కువ ఫలకారీ, న్యాయమయినదీని. ప్రభుత్వం వేసేశిక్ష లంత కఠినంగా సంఘం వేసేశిక్షలుండవని నా అనుభవం.

ముద్దాయిని ప్రశ్న లడగడం దొరగారికి యిబ్బందికరంగా దోచి జామీాను వుత్తర్వు ఖాయం జేశారు. జామీా నివ్వడానికి ముద్దాయి నిరాకరించినందువల్ల స్వాతంత్ర్య రక్షకుడయిన మేజస్ట్రీటుగారు సంవత్సరం కఠినశిక్షా, రాగిపడీ వేసి ముద్దాయి నారాయణరావు పంతులును సెంట్రలు జయిలుకు పంపారు. ఇటువంటి కేసులు అనేకం జరుగుతున్నవి.

## ౧౬

### పొందు

అసహాయోద్యమంయొక్క విచిత్రచరిత్రతో మన కవసరంలేదు. కొన్నాళ్లు ఆటూ, కొన్నాళ్ళు పోటూగా వుద్యమం

అడుగులు వేసింది. మహాత్ముడు కొంతకాలం వుపేక్ష అనే పంచ మోపాయాన్ని అవలంబించాడు. ఈ సంధికాలంలో గూడా చక్రం పనిజేస్తూనే వుండడంచేత యిదికూడా యుద్ధకాలమనే చెప్ప వచ్చును. మూడరేళ్లు కాంగ్రెసు పగ్గాలను బిగబట్టవలెనని ప్రయ త్నించారు గాని మహాజనులు సాగనియ్యలేదు. మహాజనుల పరిమా వధులను గుర్తెఱిగి గమ్యస్థానం చేర్చ నుద్యుక్తు లయినవారినే నాయకులనుగా గ్రహించే స్థితిలో జనులున్నారుగాని స్వామి కార్యం స్వకార్యంగూడా చూచుకుందామని దూరంగా నిలిచి వీల యితే దోట్లుబెట్టి కొన్ని పండ్లు గోసి కొన్ని తమ వూళ్ళోకీ, వీల యితే కొన్ని దేశజనులకూ హక్కులు సంపాయిం తా మనేనాయ కులను గ్రహించరు. అందువల్ల కొందరు వృద్ధులూ, స్వార్థ పరులూ, వెనుకంజ వేసినా చాలామంది వుద్యమంలో నూతనంగా ప్రవేశించారు. దేశమంతా దౌర్జన్యరహిత మయిన మహాయుద్ధా నికి తయారయింది. పునర్యుద్ధం ప్రకటించడానికి దేశం తయార యింది. నాయకులు ఆహవప్రకటన చేయక తప్పదని దేశం ఘోర సంగ్రామంలోకి దిగకపూర్వమే శాంతికి భంగం కలుగకుండా జేసి భారతీయులు జన్మస్వాతంత్ర్యముల నంగీకరించి స్వరాజ్య మియ్య వలసిందని ప్రభుత్వంవారిని కోరారు. ఇండియాలోని ఆంగ్లేయులూ, ఆంగ్లో హైందవులూ యింగ్లండు యికముందు భారతదేశంతో సంబంధం పెట్టుకోదలచుకుంటే వలసదేశములకు స్వరాజ్య మియ్య వలసి వుంటుందని నిశ్చయించుకొన్నారు. మాంచెష్టరు వర్తకులు మరింత ప్రోద్బలం చేశారు. అంతట దేశమునకు కాంగ్రెసు కోరిన ప్రకారము స్వరాజ్యం వచ్చింది. కేంద్రప్రభుత్వం దేశమొత్తానికి సంబంధించిన వ్యవహారా లన్ని చూస్తూ భారత పార్లమెంటుకు జవాబు చెపుతుంటుంది. హిందూస్థానీ పార్లమెంటుయొక్క సలహా ప్రకారం బ్రిటీషు పార్లమెంటు విదేశపు వ్యవహారములు నడుపు తుంటుంది. త్వరలో బ్రిటీషు రాజ్యంలో వుండే అన్ని దేశాల ప్రతి నిధులూ మహా పార్లమెంటు యేర్పాట్లుజేసి హిందూస్థానులకు దగిన ప్రాతినిధ్య మియ్యడానికి యేర్పాటయింది. అన్నివిధములా

హిందుస్థానమునకు బ్రిటీషు రాజ్యములోని అందరు భాగస్తులతో పాటు సమానహక్కు గౌరవములు గలిగినవి.

భారతీయులు దౌర్జన్యరహితమైన సత్యమార్గమున స్వరాజ్యమును సంపాదించి లోకానికి మార్గదర్శకు లయినారు. ఈ విధంగా సంపాదించిన హక్కులను దేశక్షేమమునకు ప్రాచీన గౌరవమునకు తగినట్టుగా వుపయోగించ సంసిద్ధులుగానున్నారు. హిందూస్థానముయొక్క ప్రాచీనవిజ్ఞానమూ, ఆధునిక శాస్త్ర పరిజ్ఞానమూ, వారి బుద్ధికుశలతా, సౌజన్యమూ, అనంతములయిన ఖనిజములూ, సమృద్ధమయిన పాడీ పంటా మొదలయిన వన్నీ భారతీయులకు బ్రిటీషు రాజ్యములోనే గాక ప్రపంచమంతటిలోనూ అగ్రస్థానము తెచ్చినవి. హిందూస్థానమూ, చైనా, జపానురాజ్యములూ మైత్రిగలిగి ప్రపంచమున ప్రాముఖ్యత వహించినవి. ప్రపంచ వ్యవహారనిర్ణయములకూ, విజ్ఞానమునకూ కేంద్రస్థానం పడమటినుండి తూర్పుకు జాగింది.

## ౧౭

### వి మో చ న ం

పార్లమెంటులో హిందుస్థానీస్వరాజ్యచట్టం తీర్పుకాంగనే రాజకీయ ఖయిదీలందరినీ వొదిలిపెట్టారు. కేవల అసహాయోద్యమమునకు సంబంధించినవాండ్లనే గాక రాజకీయసంబంధముగల బందిపోట్లూ, పంజాబుకుట్రలూ, పాటకోద్యమం, మునిసిపాలిటీలు, అడవిచట్టాలూ, మద్యపానం, సెటిల్‌మెంటూ మొదలయినవాటికి సంబంధించిన యావత్తు కేసులలో శిక్షబడ్డవాండ్లదరూ రాజకీయ నేరస్తులుగానే యెంచబడి విడుదల జేయబడ్డారు. రణరంగంలో జయమును బొంది ఇండ్లకు నచ్చే వీరులవలె దేశీయులందరూ విడుదలయిన యావత్తుమంది ఖయిదీలను ఆహ్వానించి స్వాగత మిచ్చారు. విడుదలైన రాజకీయనేరస్తులందరూ స్వరాజ్య పార్లమెంటును ఢిల్లీలో ప్రారంభించే రోజున అది దేశాని కంతకూ

ముక్తిదినం గనుక జయిల్ఖానాలలోని యావత్తుమంది ఖయిదీలనూ విడుదలచేసి దేశీయు లందరికీ ఆనందం కలిగించవలసిందనీ దేశం లోని ప్రస్తుత చిత్రపరిస్థితులవలన గలిగిన దారిద్ర్యమే అనేకము లయిన నేరాలకు కారణ మయిందనీ పంచాయితీలు సశించి, పోలీసు న్యాయశాఖలు ప్రబలి, అన్యాయం పెడమార్గంబట్టి అనేకులను కేవలకల్పితనేరాలకూ, సాంకేతిక నేరాలకూ, అక్రమంగా శిక్షిం చడం చేతనూ, స్వారాజ్యం లభించి నూతనపరిస్థితులు గలగడం తోటే వృత్తులు వృద్ధయి, ప్రతివాండ్లకూ న్యాయంగా జీవించ డానికి అవకాశం గలిగి నేరా లాగిపోవడానికీ, దేశగౌరవము సంపా దించడానికీ అవకాశ మియ్యవలసిందనీ, దేశమంతా ఆందోళన గలిగించారు. దేశం సుముఖమయింది. ఖయిదీ లందరూ స్వారాజ్యం రాంగనే తమ కందరికీ జూబిలీ వస్తుందనీ, అప్పుడు యావత్తు మందినీ విడిచిపెడతారనీ ఉవ్విళ్ళూరు తున్నారు. స్వారాజ్య పార్లమెంటు వారంరోజులకు ప్రారంభిస్తా రనంగా హిందూస్థాన శాసనసభ జరిగింది. స్వారాజ్యం సంపాదించిన మహాత్ము మున్నగువారి దేశసేవను అభినందిస్తూ నొక తీర్మా నమూ, స్వారాజ్య మిచ్చినందుకు ఆంగ్లపార్లమెంటుకు కృతజ్ఞత దెలుపుతూ వొక తీర్మానమూ, పార్లమెంటు స్థాపించేరోజున యావత్తుమంది ఖయిదీలను వదలిపెట్టవలసిందని వొక తీర్మానము మాత్రం చేసి సభ అంతమయింది.

స్వారాజ్య పార్లమెంటు ప్రారంభించేదినం వచ్చింది. ఆ రోజున దేశంలో అస్వతంత్రులు లేరు. కొత్తపార్లమెంటు రాక పూర్వమే రాష్ట్రీయ శాసనసభలు పురుషులతోపాటు స్త్రీలకు రాజ కీయహక్కు లిచ్చినవి. నూతన శాసన సభలకు కొందరు స్త్రీలను సభికులగా యెన్నుకొన్నారు. ప్రారంభదినం పండుగగా భావించి జనులు వుత్సవాలకు ప్రయత్నం చేస్తున్నారు. శాసన సభికులంతా ఖద్దరు దుస్తులు వేసుకొని సభలకు పోయినారు. ప్రతివాండ్లూ యిండ్లకు సున్నం, యెర్రమన్నుపట్టెలు వేసి, అలికి ముగ్గులుబెట్టి తోరణాలు గట్టారు. వందల సంవత్సరాలనుంచి పరరాజుల హస్త

గతమై దేహబలం ఆత్మబలం కోల్పోయి చీడబట్టిన పయిరువలె అణగారి కృశించిన మహాజాతి తిరిగీ స్వచ్ఛందమలయమారుతం తోలంగనే ఆనందంతో వుత్సాహపడుతున్నది. పూర్వరాజకీయ వ్యవహారాలలో పైతరగతుల పురుషులుమాత్రం జోక్యం కలుగ జేసుకుంటుండే వాండ్లు. ఇప్పు డాపరిస్థితులు మారిపోయి స్వారాజ్య సంపాదనంలో స్త్రీలు, పురుషులూ అష్టాదశవర్ణముల వారూ, అన్ని మతములవారూ పాల్గొనివుండడం చేతనూ, ముఖ్యంగా స్త్రీలు సాహసంతో తమపుత్రులనూ, బంధువులనూ, దేశసేవ కర్పించి తాము స్వయముగా శ్రమపడి కారాగృహము లకు పోవడమే గాకుండా స్వారాజ్యసాధనకు ప్రథమకారణ మయిన ఖద్దరు నూలువడికి, వస్త్రములు నేసి స్వారాజ్యసంపాదనకు తోడ్ప డ్డారు. అందుచేత స్వారాజ్య నిర్వాహణంలో పాల్గొనడానికి వారి కెక్కువఅర్హత గలిగించె. పూర్వం మోస్తరు గాకుండా సంఘాభి వృద్ధికిన్ని సంస్కరణలు సుతారంగా చేయవలసివున్నవి. స్త్రీ లాపనికి మిక్కిలి తగియున్నారు.

అన్ని గ్రామాలకంటెను మంగళాపురంలో వుత్సాహ మెక్కువయింది. ఊళ్ళోవుండే అన్నికులాల పెద్దలూ బయలుదేరి విడుదలసమయానికి నిడదవోలు వెళ్ళి పన్నెండుగంటలకి గేటు దగ్గిర కనిపెట్టుకొని కూర్చున్నారు. రామదాసూ, రంగదాసూ, వీరదాసూ, మొదలయిన షుమారు నాలుగువందలమంది సెటిల్ మెంట్లకూ, కార్మికసంఘాలకూ, చెందిన వాండ్లున్నారు. అసహా యోద్యమ ఖయిదీలను, అదివరకే రాజమహేంద్రం కమానెత్తడం చేత వాండ్లెవ్వరూ లేరు. గేటుదగ్గిరనుంచి అంతా పెద్దవుత్సా హంతో బయలుదేరారు. రామదాసయతీంద్రుడు విజయపతాకం చేతబట్టుకొని నడుమ వస్తున్నాడు. ఉభయపార్శ్వాలా వెంక టయ్యా, రామానాయుడు, పారిచారులయి నడుస్తున్నారు. వారి వెనుక మాలక్ష్మి వెంకటదాసుల అస్తికలు రెండు పెట్టెలలో పెట్టుకుని రంగదాసూ, వీరదాసూ మోసుకొని వస్తున్నారు. పుల్లప్పా, రామానాయుడూ జయిలులో రామదాసువల్ల కారణం

పొంది ముఖ్యశిష్యులయినారు. పుల్లప్ప రామదాసుతోపాటు విడుదల పొంది ఆయన కోరిక ప్రకారం రామదాసుకు ముందువైపున నడుస్తూ 'గురురాజుకు జై' అని కేకలు వేస్తున్నాడు. రామదాసు దగ్గర జయిలులో చదువుకొని, నీతిబోధను గ్రహించి, కారణముకు పొందిన ఖయిదీ లెందరో 'మహాత్మాగాంధికి జై, వీరబ్రహ్మంగారికి జై' అని కేకలు వేస్తూ చుట్టూ కమ్ముకొని నడుస్తున్నారు. అందరూ సరాసరి స్టేషనుకు వచ్చి యెవరివైపునకు వారు వెళ్లుతూ రామదాసుకు కులవివక్షత లేకుండా దండప్రణామం జేసి వెళ్ళుతున్నారు. కాకినాడప్యాసింజరులో రామదాసూ వారి మిత్రబృందమూ బెజవాడదాటి సత్తెనపల్లిలో దిగారు. మంగళాపురప్రజలు ఇండ్లదగ్గిర కుక్కకావలికూడా లేకుండా బయలుదేరి స్టేషనుకు వచ్చారు. చుట్టుపట్ల గ్రామాలవాండ్లు కూడా స్టేషనుదగ్గిరకు భజనలతో వచ్చారు. స్టేషనుదగ్గిరనుంచి ఉత్సవం బయలుదేరింది. కొందరు చితారు చేతపట్టుకొని బ్రహ్మంగారి తత్వాలు పాడుతున్నారు. మరి కొందరు భక్తికీర్తనలు పాడుతూ భజనలు చేస్తున్నారు. పదకొండు గంటలకల్లా వూరు జేరి, వొక గంట సేపు ఊరేగి, మునిపల్లెబోయి సందులు గొందులు పర్యటనం జేసి రామదాసు తాలూకు పూర్వం వేలంబడ్డ ఇంటి దగ్గర అంతా ఆగారు. ఇల్లు సున్నంగొట్టి తోరణాలుగట్టి వున్నది. రామదాసును గృహప్రవేశం చెయ్యమంటే నిదానించాడు. వెంకటయ్య జేబులోవున్న దానపత్రం దీసి 'ఇది రంగ డిల్లు. మా పూర్వపు ఆస్తిలో సగం మధ్యఫలసాయంలో ౫౦౦ రూపాయిలు అతనిపేర బెట్టి మిమ్ములను ఆస్తికి గార్డియనుగా యేర్పరచమని శేషించిన సగం సంగమందిరాని కిస్తా' మని చెప్పి దస్తావేజు చేతికిచ్చాడు. అందుకు రామదాసు 'మీ ఔదార్యం మేరమీరిందని నాకు తోచినా, మీ యేర్పాటుయొక్క యుక్తాయుక్తములను విమర్శించడానికి నే నర్హుడను గాను. మీ ఆజ్ఞ శిరసావహించి ప్రవేశిస్తున్నా' నని రంగణ్ణి చేతబట్టి నడిపించుకొని గృహప్రవేశం చేశాడు. సంగదాసుయొక్క సర్వతోముఖజ్ఞానం, అద్భుత

త్యాగం, జోతీ అప్పాదాసుల ప్రేమలీలలూ, మాలక్ష్మియొక్క ప్రేమవాత్సల్యం, వెంటదాసుయొక్క కైంకర్యం, పితృప్రేమ ప్రశంసిస్తూ సేసలుజల్లి తాంబూలాలు పుచ్చుకొని అందరూ వెళ్ళిపోయారు. కోటమ్మగారు వృద్ధాప్యంచేత పక్కె రైలు దగ్గరకు రాలేక క్రపోడుస్తూ వాగుడాకువలె జనసమ్మర్దానికి దూరంగా నడిచివచ్చి వెలుపల నిలుచున్నదనీ, మహాగందరగోళంలో ఆమెను యెవరూ గమనించలేదనీ, యెవరో రామదాసుతో చెప్పారు. అంబావరముతో అవుకై పగెరుత్తు చూడవలె అమ్మా, అమ్మా అని కేకలువేస్తూ దాసు పరుగెత్తి పండి యెండినా బ్రహ్మతేజముచే ప్రకాశించే కోటమ్మగారిని యాభై గజములదూరంలో చూచి తన తల్లిదండ్రుల పేరు, తన పేరూ, జెప్పుకొని సాష్టాంగదండప్రణామం చేశాడు. కోటమ్మగారు శరీరం కృశించినా తగ్గని దూరదృష్టితో కనుల ఆనందబాష్పవర్షమును గురిపిస్తూ మా యోగీంద్రుని ఆహ్వానంచేసే భాగ్యం మాకు లభించింది. ధన్యుల మైనా మన్నది. రామదాసు లేచి కుశలప్రశ్నము లయినతరుత కోటమ్మగారింటికి వెళ్ళారు. చూడవచ్చిన బయటి జనానికంతకు వెంకటయ్య భోజనప్రయత్నం అదివరకే చేయించాడు. అందరూ భోజనాలుచేసి రామదాసును సెలవడి తిరిగి కళాశాలోత్సవానికి వస్తామని వెళ్ళిపోయినారు.

## ౧౮

### కార్యక్రమం

స్వరాజ్యం లభించింది. హిందూస్థానీ పార్లమెంటుకు, రాష్ట్రపార్లమెంటుకు ఎన్నికలు జరిగినవి. స్వరాజ్యసంపాదనప్పటికంటె ఎక్కువశ్రద్ధతో దేశక్షేమాన్నికై పనిచేయడానికి పూనుకొన్నారు. పార్లమెంటుసభికులు కేవల పోతవిగ్రహాలుగారు. తమ ధర్మాలను తాముగు ర్తెరిగి దేశక్షేమానికి తోడ్పడవలెననే ఉద్దేశ్యముతో వచ్చారు. ఓట్లు ఇచ్చేటప్పుడు దేశక్షేమమే ప్రధానంగా

యెంచుకొని చేతు లెత్తుతున్నారు. సభికులు తమ యావత్తు కాలము పార్లమెంటు పనిలో నుపయోగించవలె నన్నా, పార్లమెంటు ధని కుల చేతిలో పడకుండా అన్ని తరగతులవారు ప్రవేశించడానికి అవకాశ మియ్యవలెనన్నా యింగ్లండులో మోస్తరుగా సభికులకు తగినజీతాలు యియ్యందీ వీలు లేదని గ్రహించి మర్యాదగా జీవించడానికి తగినగౌరవవేతన మేర్పరచారు. అందువల్ల సభికులు స్వంత పనులున్నప్పుడూ యిష్టం లేనప్పుడూ సభకు రావడం మానుకోకుండా హాజరయి దీరుతున్నారు. ఆంధ్ర పార్లమెంటుకు స్త్రీ లెన్నుకోబడ్డారు. అనేకులు కూలిసభికులు వచ్చారు. ఏ పార్ల మెంటులోను యింకా పక్షా లేర్పడ లేదు. దేశానికి ముఖ్యంగా అవ సరమైన విషయాలు అందరికీ స్పష్టముగా కనబడుతున్నవే గనుక విశేషచర్చలు జరగడం లేదు. అనేక తీర్మానాలు ఏకాభి ప్రాయంగానే వెళ్ళిపోతున్నవి. ప్రథమసంవత్సరంలో ఆదుర్దాకొద్దీ అమలులో పెట్టడానికి వీలైనవాటికంటె ఎక్కువ తీర్మానాలు చేశారు. పూర్తిగా అమలులోనికి రావడానికి కొంతకాలము పట్టినా అందరియొక్క క్షేమము పార్లమెంటువారు విచారిస్తున్నట్లు స్పష్టపడుతున్నది. మొదటసంవత్సరంలో యితరవిషయములలో చేసినతీర్మానాలు కాక దిగువతరగతులకు ముఖ్యంగా సంబంధిం చిన యీ దిగువశాసనాలు ఆంధ్రపార్లమెంటువారు చేశారు.

## ౧. ప్రథమ తీర్మానం:—

ధర్మవిద్యకు సంబంధించి వున్నది. విధిగా బాలికాబాలకు లందరూ విద్య నేర్చుకోవలసిందే. ప్రతివారు కొంత వృత్తివిద్య కూడా నేర్చుకోవడం అవసరం. ప్రతిపూళ్ళోను, పల్లెలలోను వుండే బాలబాలిక లందరికీ సామాన్యవిద్యా, వృత్తివిద్య నేర్పే వసతిగల బళ్ళేర్పరచడం చట్టంయొక్క గమ్యస్థాన మని వుపోద్ఘా తంలో నిర్ధారణ చేయబడ్డది. నిరుపేదలకు పుస్తకాలు, వ్రాత పనిముట్లు యివ్వడానికి యేర్పాటుచేశారు. ప్రభుత్వమువారు తాము స్వయంగా బళ్ళు పెట్టడమే కాకుండా మతసంఘాలు,

యితరసంఘాలు బళ్లు పెడితే వాటికి తగినంతప్రోత్సాహం యియ్యవలసిందని, మతసంఘాలు పిల్లలకు తల్లిదండ్రుల యిష్టంలేనిదీ పరమతాలను బోధించకూడదనీ నిబంధన ఏర్పడ్డది.

శాసనసభ సంబంధంగా ధర్మకర్తలను కొందరిని నియమించి ధర్మవిద్యానిధని ఒకనిధిని ఏర్పర్చి అందునిమిత్తమై ఒకబడి పేటటగాని వూరికేగాని యిచ్చినధనాన్ని పాలించి వృద్ధిచేయడానికి ఏర్పాటయింది.

## ౨. గ్రంథాలయాలు:—

పల్లెబళ్ళలో ప్రథమవిద్య పూర్తికావడంతోటే పైచదువుకు పోవడానికి శక్తిలేని వాండ్లకు విద్య అంతటితో అంత్యంగాకుంటూ గ్రామములలో పల్లెకూటాలు బెట్టించి వాట్లో గ్రంథాలు పత్రికలూ వుంచడానికి చట్టాలేర్పడ్డవి. ఈ చట్టం ప్రకారం పల్లెకూటాలవిషయమై కొంత శ్రద్ధను గనుపర్చి కొంతఖర్చు భరించడానికి పూనుకొన్న గ్రామాలలో ముందు ఏర్పాటు చేశారు.

## ౩: మద్యపానం:—

మూడవశాసనం: మద్యపానానికి సంబంధించి వున్నది. మద్యపానం హిందూస్థానుల ఆచారాలకు, హిందూమహమ్మదీయుల మతధర్మాలకు వ్యతిరేకం. నూతన పరిస్థితులవల్ల ఏర్పరుపబడ్డ దురాచారం మహాత్ముడేర్పరచిన అసహాయోద్యమం వల్ల నిలిచిపోయింది. మధుపానం నిషేధిస్తూ కఠినశాసన మేర్పరచారు. విదేశాలనుంచి వచ్చే సారాయిలూ, బ్రాందీలు అమితమైన పన్నులు వేసి నిషేధించారు. మధువిక్రయం వల్ల సర్కారుకుకలిగే యావత్తునష్టము సర్కారువారే ఫ్యాక్టరీలు పెట్టించి యితరులు పెట్టించేవాటికి కల్లుసప్లయిచేసి కొన్నిదోహదాలవల్ల వెగటువాసన పోగొట్టి చెరుకుపంచదార వంటి స్వచ్ఛమైన చక్కెర చేయించి పూడ్చుకొంటూ కొంతకాలంలో ఎక్కువ ధనంకూడా సంపాదించగలిగారు.

## ౪. శెటిల్‌మెంట్లు:—

కొన్ని జాతులను నేరపుజాతులని పేరుబెట్టి వాండ్లకిష్టం లేనిదే అందరిని స్వస్థానభ్రష్టులను చేసి శెటిల్‌మెంట్లలో నిర్బంధంగా వుంచడం వారిగౌరవమునకు, నీతికి, అభివృద్ధికి భంగకరం. అవి ఏర్పరచిన స్థానములలో కూలీలకు పోటీ ఎక్కువజేసి ఆర్థిక పరిస్థితులను తారుమారు చేస్తున్నవి. అందువల్ల ప్రస్తుత శెటిల్‌మెంట్లున్న స్థలములలో వ్యవసాయానికి లాయఖుగా వుండే భూములు లేనప్పుడు వాటిని ఫారెస్టుభూములకు మార్చి కొత్త గ్రామములు కట్టించవలసిందని, యితరచోట్ల వాళ్ళకు బంజరు భూములను యిప్పించి జీవనం కల్పించవలసిందని, వారికి చేతి పనులు నేర్పించడానికి ఏర్పాటు చేయవలసిందనీ శాసన మేర్పరచ బడ్డది. కూలీలను బానిసలుగాచూసే దేశాలకు వలసబంపడం మాన్పి మిక్కిలి సారవంతములయిన లక్షలకొలది యకరములు బంజరుగావున్న విశాఖపట్టణం, గంజాం మొదలయిన జిల్లాలకు వలస బోవడానికి యేర్పాటుచేయడం కొరకు శాసనసభ్యులు కొందరుగల వలసకమిటీ యేర్పాటు చేయబడ్డది. ప్రారంభదశలో కమిటీవారు శిఫార్సుచేసిన వారికి వ్యవసాయం నిమిత్తం ద్రవ్య సహాయం చేయడానికికూడా అవకాశ మియ్యబడ్డది.

## ౫. దరఖాస్తు నిబంధనలు:—

ఈ నిబంధనలవల్ల కలపమాకులు పెరిగే పెద్ద వనాంతరాలు తప్ప తక్కినఅడవులన్నీ ఫారెస్టుతరగతినుంచి రివిన్యూతరగతికి మార్చి దిగువజాతులకు దరఖాస్తులకిచ్చి అవసరమైనచోట్ల ప్రత్యేక గ్రామాలేర్పరచి దానికి యితరచోట్ల వుండే పోరంబోకులను అతరాపుదార్లకు ముఖ్యంగా యివ్వవలసిందనే నియమం గద్దుపరచి భూములులేని జాతులకే యివ్వడానికి అనుకూలముగా దరఖాస్తు రూల్సు మార్చబడ్డవి. శెటిల్‌మెంటు రద్దుచట్టముక్రింద యేర్పరచ బడ్డ వలసకమిటీవారే భూముల దరఖాస్తులు ఫయిసలు చేయవలసిందన్నారు. ధనవంతులుగానీ, యిదివరకు భూము లున్నవారుగాని

దిగువ జాతులవాండ్లను లోబరచుకొని వాండ్లపేర భూములు లాలోచీగా దరఖాస్తు పొందగూడదనీ, అట్లా పొందితే బినామీదారు పన్నెండు సంవత్సరములలోగా అనుభవదారుకు కంపెన్ సేషన్ ఇవ్వకుండా వలసకమిటీకి దరఖాస్తుపెట్టి స్వాధీనపర్చుకోవచ్చునని, బినామీదారు స్వాధీనపర్చుకోకున్నా సర్కారుకు యే దరఖాస్తులయినా బినామీగా పొందబడ్డవని రుజువయితే పట్టా రద్దుపరచి యిరవయినాలుగు సంవత్సరములలోగా స్వాధీనపర్చుకొని యితరులకు దరఖాస్తులకు యియ్యవచ్చునని నిబంధన లేర్పడ్డవి.

## ౬. ఇండ్ల చట్టం :—

దిగువజాతుల యిండ్లసమస్య చాలా ముఖ్యమయింది. మాలమాదిగెలూ, యెరుకల యేనాదులూ నివసించేవి యిండ్లు కావు. పట్టికలుగులు. వందలకొలది మనుష్యులు నివసించే మాల మాదిగ పల్లెలు కొన్ని గజాలలో యిమిడివున్నవి. దిగువజాతుల కుటుంబాలకు తగినట్లు యిండ్లస్థలాలు దరఖాస్తుల కియ్యవలసిందనీ, మాలమాదిగ పల్లెలకు సమీపములో పోరంబోకులు లేకపోతే రహితాధీనములను సర్కారువారు విక్రయించుకొని యిండ్లు కట్టించుకోగలవాండ్ల కియ్యవలసిందనీ, ద్రవ్యోపపత్తి బొత్తిగా లేని వాండ్లకు ఇండ్లు కట్టుకోవడానికి వీలయినంతవరకు ధనసహాయము మీయవలసిందనీ, శాసన మేర్పడ్డది. ఇటువంటి యేర్పాట్లే ప్రపంచంలోవున్న నాగరిక దేశాలన్నిటిలోను చేస్తున్నారు

## ౭. నౌకరీచట్టం దిద్దుపాటు :—

పై తరగతులవారు విద్యాధికులయి వుండడం చేతనూ, వున్నతవిద్య నేర్చుకోవడానికి వారి కెక్కువ వసతులు వుండడము వల్లనూ, యింతవరకూ వున్నతోద్యోగాలన్నీ ఆక్రమించుకొని వున్నారు. దిగువ తరగతులకు వారితో పోటీకి నిలువగల స్థితి యింతలో లభించేటట్టు కనుపడదు. అందుచేత ప్రస్తుతం పోలీసు, రివిన్యూ, శివిల్, పోస్టు, ఫారెస్టు, మిలిటరీ మొదలయిన శాఖలలో వున్నతవిద్య అవసరములేని చిన్న వుద్యోగాలన్నీ దిగువ తరగతు

లకు ఆపుదలచేసి వుంచవలసిందని వుద్యోగ నిబంధనలు మార్చ బడ్డవి.

౮. కార్మికసంఘ చట్టము :—

దేశంలో వృత్తు లభివృద్ధి పొందడానికీ, కార్మికులు బాగు పడడానికీ కార్మికసంఘా లవసరము. కూలీలు పశువులవలె పనిచేసే వాండ్లుగా వుండడంకంటె లోకపరిస్థితు లెరిగి తెలివిగలవాండ్లయి వుండడం మేలు. వాండ్లు వొంటరిగా స్వాభివృద్ధికై చేసే ప్రయత్నాలు సాగవు. లోకంలో కూలీలు కూలు లేర్పరుచుకొని పని చేయడం నాగరికలక్షణంగా యెంచుతున్నారు. పూర్వం మన దేశంలో చేతిపనులు చేసేవాండ్లందరూ శ్రేణులుగా యేర్పడి పని చేసేవాండ్లు. వీటివల్ల కూలీలవర్తన, ఆర్థికస్థితి కూడా వృద్ధి అవుతవి. కూలీల సంఘములపేర్లు, సభికుల సంఖ్య మొదలయిన సంగతులు వ్రాసివుంచడం అవసరం. సభికుల జ్ఞానాభివృద్ధి కివియెంతో సహాకారులు. ఈ సంఘాలకు శాసనమూలకమయిన నిలవర యేర్పరచబడ్డది. యీ చట్టంప్రకారము ఈ సంఘముల ధనం సభికుల బాకీలకుగాని, యజమానులూ, కూలీలూ తగాదాలుపడితే అందువల్ల యజమానులకు కలిగే నష్టాలకుగాని, సర్కారుకు అచ్చవలపైన యే విధములయిన రుసుములకుగాని, జవాబుదారీ కాగూడదు. స్వరాజ్య చట్టప్రకారం కూలీలకుకూడా వోటిచ్చే అధికారం రావడంచేత యెటువంటి కూలీలకు వోట్లియ్యవలసిందీ నిర్ధారణ చేయడం కష్టం. ఈ సంఘాలలో సభికులు కాదగినవాండ్లు కొంత యోగ్యతా, తెలివితేటలూ కలవాండ్లయి వుంటారు. కనుక కార్మిక సంఘాలలో మూడేండ్లు వరుసగా సభికులుగా వున్నవాండ్లూ, నెలజీతగాండ్లూ వోట్లిచ్చే అధికారం కలిగివున్నారు.

౯. ఖద్దరు చట్టము :—

చేతితో వడకడం, నేయడం నశించి యంత్రాలు బయలుదేరిన తరువాత పశ్చిమ దేశాలలో ధనిక కార్మిక సమస్యలు

బయలుదేరి ఆర్థిక పరిస్థితులను తారుమారుజేసి యెడ తెగని కల హాలకు కారణమైనవి. పల్లెలు పాడుపడి పట్నా లయినవి. స్త్రీలకు జీవనాలు పోయినవి. పట్టణాలకు అనుబంధంగావుండే అనారోగ్యం, అవినీతి ప్రబలినవి. పూర్వపు హిందూ గ్రామపాలనాపద్ధతి ఈసమ స్యల కన్నిటికీ జవాబుచెప్పి సంఘజీవితం వొడుదొడుకులు లేక సర ళంగా ప్రసరించడానికి కారణ మయింది. ప్రస్తుత మాపద్ధతి కొంత వరకు నశించడంవల్ల పాశ్చాత్య సాంఘిక జీవితానికి సంబంధించిన వికారాలన్నీ యిక్కడకూడా పొడజూపుతున్నవి ఇవి కొంత వరకూ ఖద్దరు వృద్ధిచేయడంవల్ల అణగవచ్చు. సంఘానికి కూడూ గుడ్డా ముఖ్యావసరములు.. ధాన్యం పురుషుడు పండిస్తాడు. స్త్రీ వండుతుంది. కొంతవరకూ వ్యవసాయపు పనులలోనూ సాహాయ్యం చేస్తుంది. స్త్రీలు వడుకుతారు. పురుషులు నేస్తారు. ఈ పద్ధతివల్ల స్త్రీపురుషులు వొకరికి చెయి జాచకుండా స్వతంత్రంగా జీవించ డానికి అవకాశ మున్నది. ఖద్దరు పోవడంతోనే స్త్రీకి పెండ్లి జీవిత మార్గమయింది. పెండ్లి లేకపోతే మర్యాదగా జీవించడమే కష్టము. ఈసత్యాన్నే పూర్వపుమోటు పాట వెల్లడిస్తుంది.

మగ డెందుకే నారీ-మనకు-మగ డెందుకే నారీ
అసల్ మగ డెందుకే నారీ

౧. కదురూ చల్లంగుంటే కదిలిస్త గోల్కొండ మ.
౨. రాటం చల్లంగుంటే రప్పిస్త గోల్కొండ. మ.

రాటంయొక్క మహాత్మ్యం శ్రీనాథకవినిగూడా ఆకర్షించిది.

క. ఆకదురున శుకరవమును
ఆకదురున భృంగరవము-ఆత్మరవంబున్
యేకీకృతముగ యేకు ల
నేకులు విన వడికె ముదిర - యేపలముదిరా?

అని వర్ణించాడు. ఖద్దరుయొక్క వ్యాపకానికి భంగం లేకుండా వేయదగినంత సుంకం విదేశపునూలు మీద, వస్త్రముల మీద విధించబడ్డది. నూలు మామూలుకంటె రోజుకు యెక్కువ

వడికి జీవనానికి చాలినకూలి సంపాదించడానికీ, సన్నపునూలు కూడా వడకడానికీ, రెండువిధాలయిన రాటాలు కనిపెట్టేటందుకు సర్కారువారు కార్ఖానా లేర్పరచి సుత్తారపుపనులు తెలిసిన శోధకులను నియమించి, పరిశీలన చేయిస్తున్నారు.

## ౧౦. ఫ్యాక్టరీ చట్టము :—

గిర్నీ కూలీలచేత రోజుకు యెనిమిదిగంటలకంటె యెక్కువ పని చేయించకూడదని, సదరుకూలీలకు గిర్నీలసమీపములో గాలీ వెలుతురూ బాగావచ్చే బారకాసులు యజమానులు కట్టించి యియ్యవలసిం దనీ, వాండ్లపిల్లల చదువుకు తగిన సౌకర్యాలు చేయవలసిందనీ శాసనం జేశారు. గిర్నీ కూలీలను సరి అయిన కారణం లేనిదీ తీసివేయకూడదనీ, పని చెయ్యడములో గాయాలు మొదలయినవి తగిలితే యజమానులు నష్టం కట్టియియ్యవలసిందని చాలా కాలం పని చేసినవాండ్లు చాలించుకుండేటప్పుడు బహుమతి గానీ, ఫించనుగానీ యియ్యవలసిం దనీ యేర్పరచారు.

## ౧౧. జయిలు కమిటీ :—

జయిలుపాలనము విద్యామంత్రి కియ్యబడ్డది. జయిళ్ళు యిప్పటివలె నరకప్రాయాలు గాక నేరస్థులను బాగుజేసి పౌర సత్వాలు చలాయించడానికి తగిన యోగ్యత గలిగించి జయిళ్ళను వృత్తివిద్యాలయాలుగా మార్చడపు వుద్దేశ్యంతో జయిలుపాలనం శాసనసభయొక్క వుపసంఘానికి యియ్యబడ్డది. ఖయిదీల విషయములో సంచారస్వాతంత్ర్యమునకూ, భోగాలనుభవించుటకూ దప్ప యితర విషయములలో అభివృద్ధి పొందడానికి ప్రతిబంధాలు కలిగించకూడదని, తగినంత సమపాయం కలిగించవలసిందని యీ శాసనము యొక్క తలంపు.

## ౧౨. దేశపాలనము :—

దేశపాలనా విషయమయిన చర్యలు అందరికీ తెలియడం కోసం న్యాయస్థానాలూ, శాసనసభలూ, జిల్లాసంఘాలూ, మునిసి

పాలిటీలూ మొదలయిన సర్కారు కార్యస్థానాలు యావత్తూ తమ కార్యవిధానం దేశభాషలో జరుపవలసిందని చట్టం జేశారు. ఈ చట్టమే లేకపోతే ఆంగ్లభాష బాగా రానివాండ్లకు ప్రవేశ మియ్యడమే తప్పు.

ఇంకా యితర చట్టాలుగూడా దిగువజాతుల అభివృద్ధికై చేయ నుద్దేశించారు. చట్టాలు చేయడంలో వుత్సాహం కనుపర్చడమేగాకుండా అవి జయప్రదంగా అమలులోకి రావడానికి గూడా ప్రతి శాసనసభ్యుడూ ప్రయత్నిస్తున్నాడు. దేశాభిమానులయిన పెద్దలూ, పిల్లలూ, అనేకులు స్వరాజ్యంవలన ప్రయోజనం జనులకు పూర్తిగా కలిగించడానికి ప్రయత్నిస్తున్నారు. మహాజనుల యొక్క క్షేమం తప్ప స్వక్షేమం యెవరూ ప్రధానంగా యెంచుకోవడం లేదు. శాసనసభలు చేస్తున్న అభివృద్ధియొక్క వేగం చూస్తే పదియేండ్లలో పూర్తిచేయవలయు నని వుద్దేశించినపనిలో పదవ వంతు జరిగినా దేశం అతిశీఘ్రకాలంలో బాగుపడుతుం దని తోస్తుంది. దేశక్షేమమే ప్రధానంగా యెంచి రాజకీయజీవితం నడిపేజాతికి ఫలాపేక్ష లేని కర్మయోగమూ, మోక్షమూ సులభ సాధ్యంగదా!

## ౧౯

## పెద్ద బీగం

పంతులు పయికం యావత్తూ వసూలు చేస్తున్నాడు. అహోరాత్రాలు ఆయనకు అదే ఆందోళన. వెంకటయ్యా, రామానాయుడూ చేసినత్యాగానికి ఆయన కండ్లు మిరుమిట్లు గొన్నవి. తన యజమానులు మహాత్యాగం జేస్తే తాను చౌదరయ్యదగ్గిర తిరిగీ స్వాధీనపర్చుకొన్న యీనాం తన అనంతరం వల్ల మోతువారి ధర్మంలో కలిసేటట్టు దస్తావేజు వ్రాశాడు. ఆయనకున్న పొలమంతా అదే. దత్తు మానుకున్నాడు. ఊళ్ళూళ్ళూ తిరిగి బాకీలు వసూలు చేస్తున్నాడు. కాలం సుభిక్షంగా వుండడంచేత బాకీలు, గవ్వలు రాలినట్టు రాలుతున్నవి. పంతులు

మొదటినుంచీ నిరాధారులకు బాకీలు పెట్టేవాడు గాదు. నాలుగు రూపాయలు తీసివేసెయినా దావాలు డిక్రీలు లేకుండా పయికం యావత్తూ వసూలు చేశాడు. విద్యాలయాలూ, కార్ఖానాలూ, వసతి గృహాలూ పూర్తిఅయ్యేవరకు మూడులక్షలు పట్టింది. సగం మందిరానికి అనుకొనివున్న పశువుల కొట్టాలూ, చొప్ప దొడ్లూ, పాటిచేనూ, బీడూ, భవనాలతో నిండిపోయినవి. కొత్త మేడా పురాతినపు భవంతీ విద్యాలయంలో పనిచేసే వుపాధ్యాయులు కాపుర ముండడానికి యేర్పాటయింది. ప్రస్తుతం పాత యింట్లో తమనూ, వుపాధ్యాయులకిందనే లెక్క వేసుకొని రామానాయుడు, వెంకటయ్యా సర్వసంగ పరిత్యాగులయి లోకసంగ్రహాభిలాషమాత్రావశిష్టులయి లోకములో నివసించదలచి కాపుర మున్నారు. భవనాలు పూర్తిగావడంతోటే తమతాలూకు స్థిరచరరూపకమైన యావదాస్తీ ధర్మంక్రింద వర్తింపజేయడానికి ధర్మపత్రం వ్రాసేనిమిత్తం నారాయణరావును పిలిపించారు. నరసింహారావు మునిపల్లెలో కాపురంబెట్టి విజయమందిరములో వుపాధ్యాయుడుగా కుదిరాడు. నారాయణరావు తనపని వదలి కళాశాలలో ప్రధానిగా వుండి కొంతసేపు బోధించడానికీ, పాలనవ్యవహారం నిర్వహించడానికీ అంగీకరించాడు. రామదాసుయొక్క కొట్టమూ, దానికి అనుకొనియున్న పల్లమోతువారి పొలమూ కలిపి వొకపెద్ద వుద్యానవనం చేసి దాంట్లో పర్ణశాలలు వేయించి దానికి తపోవనమని పేరుబెట్టారు. ఇది మాలపల్లెకు, వూరికీమధ్య వున్నది. తపోవనమే రెంటినీ కలిపింది. పుల్లప్పా, కామానాయుడూ జయిలునుంచివచ్చి మంగళాపురంలో రామదాసుదగ్గిరనే శిశ్రూష చేస్తున్నారు. పుల్లప్పా, భార్య వసతిగృహములో వంటపనికి కుదరారు. కామానాయుడిని కిందితరగతులకు పంతులునుగా నియమించారు.

కోటమ్మకు అవసానకాల మయింది. ఆమెకు తండ్రి వ్రాసి యిచ్చిన పొలమంతా మాగాణై మంచి ఆదా వస్తున్నది. పదుంబడిలో ధర్మఖర్చుపోను మిగిలినది పెట్టి ఆస్తి పెంపు జేసింది.

యావదాస్తి యిప్పుడు మదింపుచేస్తే లక్షకు మిగిలింది. కోటమ్మ తనకున్న ఆస్తెంతా తపోవనానికి వ్రాసియిచ్చి దానివల్ల వచ్చే ఆదాయం తపోవనంలో నివసించి తపస్సు చేసుకుండేవాండ్లకు, ప్రస్థానత్రయం, భాష్యాలూ పాఠం చెప్పేవాండ్లకూ, చదువుకుండే వాండ్లకూ జాతివివక్షత లేకుండా పోషణ నిమిత్తం ధర్మంగా జరుగ వలసిందని యేర్పాటు జేసింది. మాలక్ష్మి వెంకటదాసుల ఆస్తి కలు తపోవనంలో భూస్థాపన జేసి తిరుపళ్ళెలు కట్టించారు. కోటమ్మ తపోవనములో తనశరీరం భూస్థాపన చెయ్యమని కోరి అంత్యసమ యములో తపోవనానికివచ్చి పర్ణశాలలో పరమపదించింది. ఆమె కోరినప్రకారమే సమాధి చేయించారు. అప్పాదాసు పాఠశాలలో తయారయిన వందలకొలది దిగువజాతుల పిల్లలు విజయకళాశాలలో చేరుతామని పేర్లిస్తున్నారు. ఇతరవూళ్ళవాండ్లూ, అనేకులు పంచములూ, యెరుకలు. యేనాదులు చదువు కుంటామని వస్తున్నారు.

ఒకదినం రాత్రి యెవరో రామానాయుడిని నిద్రలేపారు. ఆయన నిద్రకండ్ల లేచివచ్చి యెవరని అడిగితే, 'జగన్నాధం మీకీతాళపుచెవి యియ్యమన్నాడు. దీంట్లో పంచమోద్యమానికీ, పాటకోద్యమానికీ హక్కున్న' దంటూ చేతికిచ్చి నిలువకుండా వెళ్ళిపోయినాడు. రామానాయుడూ, వెంకటయ్యా బీగాన్ని పరీక్షిస్తే సంగతి బోధపడలేదు. బీగం విలువగల లోహంతోనయినా చేయలేదు. రెండు మహోద్యమాలకు చేయబడ్డ ఈ ధర్మంయొక్క గూఢస్వభావం వారికి గోచరించలేదు. తెల్లవారి పుల్లప్ప వచ్చి పెద్దమందిరానికి తాళం వేశారేమీ, సున్నం గొట్టడానికి కూలీలు వచ్చి కూర్చున్నారని చెప్పితే, అన్నయు, దమ్ముడూ వెళ్ళి పరీక్ష జేస్తే వల్లమాలినతాళం నాకిటికి వేసున్నది. రాత్రియిచ్చిన తాళపుచెవి దీనిదే అయివుంటుందని పెట్టిచూస్తే సరిపోయింది. తీసి లోపలికి బోతే వేయేసిరూపాయిలు గల వేయిసంచులు నేల మీద వరుసలుదీర్చి పెట్టివున్నవి. చాలాసేపటివరకూ యెవరికీ అంతు బట్టలేదు. నిర్ఘాంతపోయి బొమ్మలవలె నిలువబడ్డారు.

రామానాయుడు జ్ఞాపకం దెచ్చుకొని రాత్రి తాళపుచెవి యిచ్చిన మనిషి జగన్నాథ మిద్యోమన్నాడని చెప్పినట్టున్న దన్నాడు. శ్రీజగన్నాథుడయిన భగవంతుడే నల్లమోతువారి ధర్మానికి మెచ్చి దానికి తోడుగా పంపివుంటాడని వెంకటసుబ్బయ్యన్నాడు. పంతులు యీ ఆలోచనంతా యెందుకని వొకసంచీ వుచ్చులాగి రూపాయిలు కుమ్మరించాడు. దాంట్లో వొకచీటి వున్నది. దీని ఖులస్సు యేావత్తూ యీ కాకితం చెపుతుందని విప్పి చదివితే పంచమోద్యమానికీ, పాటకోద్యమానికీ సనాతుల ధర్మమని లిఖించివున్నది. సరే యిది మనవాడి ధర్మమే. జగన్నాథమంటే వెంకటదాసని పంతు లన్నాడు. తక్కిళ్ళ జగ్గడికి జై వెంకటదాసుకు జై అని కేకలు వినబడ్డవి. అన్యాయార్జితం యిటువంటి మహోత్కృష్ట ధర్మానికి వినియోగించవచ్చునా అని కొంద రన్నారు. అన్యాయపు సొమ్ము తిన్నా గుంట్రింపుతో బయటికి వస్తుందిగాని, యిమడదని మఱికొంద రన్నారు. రామదాసు యెటూ చెప్పడానికి తనకు తోచలేదు. సాధనశుద్ధి తక్కువను కొన్నా, గోపన్నా, తిరుమంగయాళ్వారు పూర్వం జేసిన కైంకర్యాలు పూజనీయంగానే యెంచబడ్డ వన్నాడు. రామదాసు నిషేధించకపోతే రూపాయిలు పనికివస్తవని అందరూ అన్నారు. ప్రతి సంచిలోనూ, వొకటే మొత్తరుగా రెండువుద్యమాలకూ ధర్మమని వ్రాయడం చేతనూ, రాత్రి వచ్చినమనిషి బీగం రెండు వుద్యమాలకూ సంబంధించినదని చెప్పడం చేతను రెంటికీ చెరిసగంగా యివ్వడం న్యాయమన్నారు. దాని కందరూ అంగీకరించి అయిదులక్ష లప్పుడే వెంకటయ్యకు స్వాధీనపర్చి సనాతన ధర్మ మనేపేరుతో విజయకళాశాల కుపయోగించమన్నారు.

కార్మికోద్యమానికి యివ్వబడ్డ అయిదులక్షల ధనం రామానాయుడు బెజవాడలో జరిగిన ఆంధ్రకార్మిక మహాజనసభకు తీసుకొనిపోయి వొప్పజెప్పాడు. ఆసభకు ఫిర్కాకొక్కరి చొప్పున కార్మిక సంఘాలచేత నియమితులయిన ప్రతినిధులు వచ్చారు.

ఆసభలో కొత్తచట్టాలప్రకారం కార్మికులకు గలిగిన సౌకర్యాలు లెక్క-చూచుకొని ప్రభుత్వంవారికి కృతజ్ఞతావందనాలు దెలిపి రైతులూ, గిర్నియజమానులు స్వయంగా తమకు యియ్యదగిన కూలి పంపిణీ యేర్పరచి వెంటనే ఆప్రకారం జరుపవలసిం దని గిర్నిసంఘాలకు, రైతుసంఘాలకూ తెలియపర్చారు. ఆసభలో రామానాయుడు గారిని ఆంధ్రకార్మికమహాసంఘానికి కార్యదర్శిగా యేర్పరచి కార్మికసంఘాలతోను, రైతుసంఘాలతోను వుత్తర ప్రత్యుత్తరాలు జరపడానికీ, సభలో యేర్పరచిన కూలిపంపిణీలు ఆయనకు యుక్తమని తోచిన స్వల్పమార్పులతో రాజీ కుదర్చ డానికి అధికార మిచ్చారు. నాయుడుగారు రైతుసంఘాలూ, గిర్నిసంఘాలూ కలిసిచేసుకొన్న మహాసభకు వెళ్ళి కొంచె మించు మించుగా సంగదాసు వేసిన వుజ్జాయింపు ప్రకారం రాజీకి వొప్పు కొని వచ్చాడు. రామానాయుడు ఆంధ్రకార్మిక సంఘానికి కార్య దర్శి అయినతరువాత తా నదివరకు భూస్వామిగా శాసనసభలోకి వెళ్ళివుండడం చేత తనపదవిని వొదులుకున్నాడు. కార్మిక సంఘాలు తమకు శాసనసభలో వున్న స్థాన మొకటి వెంటనే కాళీ చేయించి ఆయనను ఎన్నుకొన్నారు. నారాయణరావు శాసన సభలో మందిసామ్మతో కట్టించబడ్డ ప్రతి ప్రతిష్ఠాపనలోను దిగువ జాతులకు ప్రవేశముండవలయు నని తీర్మానం బెట్టి రామానా యుడు కూలీలకూ, యజమానులకూ రాజీకుదుర్చుతూ సభకు రానందున తక్షణం ఆతీర్మానం ఫయిసలయ్యే వరకయినా వచ్చి పోవలసిం దని టెలిగ్రామిస్తే వెళ్ళి కార్మికకళాశాల ప్రవేశమహో త్సవానికి మంచిమూహూర్తం అయిదురోజులలో వున్నదని తంతి రావడంచేత తీర్మానం అభిప్రాయభేదం లేకుండా మంత్రులంగీక రించి నందున నారాయణరావును దీసుకొని వెంటనే యింటికి వచ్చాడు.

౨౦

## మోహనరావు

మోహనరావును మనం వదిలిపెట్టి చాలాకాల మయింది. మాంబళంలో కమలమ్మా, శిశువూ చనిపోయినారని తెలిసిన తర్వాత యింటికి వచ్చాడు. అంతకుముందే బలవంతంగా పెండ్లి జేశారు. చెన్నపట్నం నుంచి వచ్చి యెండాకాలం యింటిదగ్గరనే వున్నాడు. స్కూళ్ళు తియ్యంగనే మళ్ళీ కాలేజీలో చేరవలసిందని అన్నా, తల్లీ బలవంత పెట్టారు. పోవడమంటే మనస్కరించలేదు. తలంచుకున్నప్పుడల్లా జమీందారు హాయిగా కాపురం చేస్తున్న కమలమ్మను దిక్కుమాలిన పీనుగులబండ్లలో మోసుకోని పోవడానికి తానే కారకుడ నని మనస్సుకు వచ్చేది. సుఖంగా నడుస్తున్న కాపురం జెరిపి, రామానాయుడికీ, సాహుకూ తన అరువుమాలిన పనివల్ల ద్రోహం చేశానని దుఃఖించాడు. రామానాయుడిని క్షమించమని అడుగుదా మనుకున్నాడు. గాని ఆయన ఔదార్యంతో క్షమించినా అంత పెద్దకోరిక కోరడం తనకు భావ్యం గాదనుకున్నాడు. ఇంతవరకూ చెన్నపట్నం గాని, మంగళాపురం గానీ తొక్కిచూడ లేదు. గుంటూరు, తెనాలి, చెన్నపట్నం పొయ్యే రైళ్ళెక్కడమంటే గుండెల్లో దడబుట్టేది. ఒకండ్లతో మాటా, పలుకూమాని పొద్దుగూకులూ తనగదిలో నిర్వీణ్ణుడయి కూర్చుండేవాడు. తల్లికీ, అన్నకూ మద్రాసులో యెవరితోనో సంబంధ మున్నదని మాత్రం తెలుసు. ఫలానా అని యెవరూ యెరుగరు. ఇతని అవస్థచూచి భయపడి భ్రమతీరేదాకా ఆమనిషిని మదరాసులో రహస్యంగా ఇతనిదగ్గర వుంచడమో, లేక యిక్కడకు తీసుకరావడమో చేస్తే బాగుండు నని అన్నా, తల్లీ యోచించి వొకనాడు రహస్యంగా ప్రస్తావించారు. కదిలించినప్పుడల్లా మోహనరావు యేడవడం తప్ప జవాబుచెప్పేవాడు గాడు. అతనిని బాధిస్తున్నది అపకీర్తిభయం గాదు. కమలమ్మ మీది మోహమూగాదు. అతని మనస్సే అతనిని బాధిస్తు

న్నది. శల్యాలంటబొడుస్తున్నది. అన్నా, తల్లీ అనేకవిధాల చెప్పి చూశారు. కార్యం లేకపోయింది. ఒకనాడు తలుపువేసుకొని గదిలో కూర్చొనివుండగా తల్లి సందులోగుండా చూస్తే యేడుస్తున్నాడు. నెలలు గడిచినకొద్దీ మనిషి క్షీణించడమేగాని దిగులు మాయలేదు. క్రమంగా బయట తిరగడంగూడా మానివేశాడు. అత్తవారికి తెలిస్తే చదువు మానాడేమని అంటారని తల్లి బలవంత పెట్టి కలకత్తాకు చదువుకోపోవడానికి వొప్పించింది. రాజారావు చదువు మానిపించడమే మంచిదంటాడు. తల్లీ, కొడుకూ మల్లగుల్లాలుపడి చివరకు కలకత్తాలో లాపరీక్ష చదవడానికి పంపారు. కలకత్తాకు పోయినకొద్దిరోజులకే కాపురానికి రానిభార్యా; తల్లీ చనిపోయినారు. అంతట చదువుచాలించి యింటికి వచ్చి అన్నా, తనూ వేరుబడి, తనభాగపుపొలాలు కౌళ్ళకిచ్చి ముబాదలాగా మక్తా పుచ్చుకొని, లోకులవల్ల రావలసిన ఫయికం వచ్చినమట్టుకు వసూలు పెట్టుకొని, యావత్తూ బ్యాంకిలో వేసి దేశాటనం బయలుదేరాడు. మనశ్శాంతి మాత్రం కుదరలేదు. రెండుమూడుసార్లు యింటికి వచ్చినప్పుడు పెండ్లి చేసుకోమనీ, లేక తన చిన్న కొడుకును దత్తుచేసుకోమనీ అన్న బలవంత పెడితే ఏదీ తనకక్కరలేదన్నాడు. ఒకమాటు కాశీరామేశ్వరాలు పాదచారిగా పోయినాడు. సరయూనదిలో స్నానం చేశాడు. బృందావనంలో స్నానం చేశాడు. బృందావనంలో చాలా కాలమున్నాడు. హరిద్వారం బోయి గురుకులం జూచి అక్కడనుంచి బయలుదేరి అసహాయోద్యమ ప్రారంభదినాలలో సబర్మతీ ఆశ్రమం చేరాడు. మహాత్ముని సాంగత్యం గలిగిన తరువాత కొంత మనశ్శాంతి గలిగింది. ఇతర విషయాలతో, జోక్యం కలిగించుకోక ఖద్దరు వడకడం నెయ్యడంతో కాలం బుచ్చుతున్నాడు. మహాత్ముడు కారాగృహంలో ప్రవేశించిన తర్వాత కొంతకాలం యంగిండియా పత్రికకు వ్రాస్తూ వచ్చాడు. మనిషికి రుగ్మత యేర్పడ్డది. క్రమంగా క్షయలోకి దిగింది. మనిషి బొత్తిగా క్షీణించాడు. యౌవనంలో చూచినవాండ్లితనిని గుర్తించలేరు. నిజంగా ఆ

మోహనరావే కాదు. నిరంతరం వ్యాకులంవల్ల అకాల వృద్ధాప్యం గూడా వచ్చింది. శరీరంపాలిపోయి సన్నంగా బకుడయినాడు. తుమ్మెద రెక్కలనంటి మీసాలూ, ముఖచంద్రుని ముద్దులాడే ముంగురులూ, పైత్యోదారుణంచేత జిగివిచెడి పలితరోగికి పడ్డట్టు తెల్లబడ్డవి. చెంపలూ, గవదలూ జారినవి. ముఖమంతా ముడతలు బడ్డది. గిచ్చుడుబడని దండలూ, రొమ్మూ, తొడలూ వొందులై అల్లల్లాడు తున్నవి. అంక పొంకాలతో వచ్చిన యౌవనపు పొంగంతా అరిపోయినది. సర్వాంగాలు శిథిలమై ఆ తేజస్సూ, ఆ నిగనిగలూ, ఆ చెలువూ, అ మోహనరూపం యొక్క సొరూ అన్నీ మలిగిపోయినవి. కండ్లూ, పండ్లూ ఆ గుండ్రముఖం మాత్రం సహజసౌందర్యాన్ని విడువ లేదు.

ఒకరోజున మరుపు చొప్పున అద్దం చూచుకున్నాడు. తనలో కలిగిన మార్పు మూర్తీభవించినట్లు కనబడ్డది. కాలం యెంత చౌర్యం చేసిందో కనుక్కొన్నాడు. మొదట కాలమే అతని మోహనరూపాన్ని పక్వం జేసింది. ఆ సౌందర్యాన్ని అదే తీసుకొని పోయింది. రోజా ఒక చిన్న మొగ్గగా మొటకరిస్తుంది. నాలుగు రోజులకు యెర్రని కోరకంగూడ లోనుంచి బయటి కనబడుతుంది. వికసించి వివిధములయిన రంగులూ, తావులూ, కాంతులూ విరజిల్లుతుంది. అక్కడనుంచి పొట్లిపోవడం ప్రారంభిస్తుంది. రెక్కలు యెండి బొగిలి రాలిపోతవి. కాలం వెర్రిదా యేమి ? సర్వం సిద్ధం జేసుకొని బోర్ల దోసి పరిగెత్తుతుం దెందుకు? ప్రేమా ? లేక వోర్వలేనితనమా యీ విపరీతచర్యకు కారణం? పిల్లలు యిసుకగూళ్లు కట్టుకొని ఆడుకొని తొక్కి పరుగెత్తుతారు. కాలం ఒక్కరోజాపువ్వేనాదు; బ్రహ్మాండా లన్నీ యిట్లాగే పాడు జేస్తుంటుంది. కాలుడివని చంపడం మాత్రమే కాదు; సృష్టి జేసి పెంచడమూ అతడె కాలుడు త్రిమూర్తి స్వరూపుడు. అయితే ఇంతగొప్పవాడి కీపిల్ల చేష్టలేమిటి? మళ్ళీ పురాణపురుషు

డని పేరు. పిల్లల మోస్తరుగా యెప్పుడూ ఆడుకుంటూనే వుంటాడు. అవి లీలలు.

మోహనరావు వుయిలు వ్రాసి, లకోటా జేసి, ఫలానా వారికి పంపవలసిందని ఆశ్రమవాసుల కిచ్చాడు. కాలుడు వొక నాడు వుదయం మోహనరూపాన్ని మరి యేమిచేయించుకోవ డానికో చెడగొట్టాడు. ఆశ్రమవాసులు వుత్తరక్రియలు జరిపి, మరణ రిజిష్టరు నకలుతో వుయిలు జతపరిచి, కవరు రామా నాయుడు పేర రిజిష్టరుచేసి పంపారు. కార్మికకళాశాల ప్రారంభో త్సవదినమే అందినది. తెరిచి చదువుకుంటే యీ విధంగా వున్నది.

"ప్రస్తుతం సబర్మతీ ఆశ్రమవాసుడైన మోహనరావు వ్రాసిన వుయిలనే మరణశాసనం. నాకు క్షయరోగంవల్ల మరణం ఆసన్నమయింది. నాకు గుంటూరుజిల్లాలో పెద్యాలు డాఖలా వుండే స్తిరాస్తి, మద్రాసు బ్యాంకిలో వున్న రొఖ్ఖం మొత్తం షుమారు రెండులక్షల కిమ్మత్తుగలది, మంగళాపురంలో నల్లబోతు రామానాయుడుగారు కట్టించిన కార్మిక కళాశాలకు ఖర్చు నిమిత్తం ధర్మంగా యిచ్చివేయబడ్డది. నాయుడుగారే దీనికి ధర్మకర్తగా వుండవలసింది. మనశ్శాంతికై యీ వుయిల్ నామాలోని యేర్పాట్లు చేయబడ్డవి."

## ౨౧

### విజయకళాశాల

విజయకళాశాల ప్రారంభోత్సవదినం వచ్చింది. దేశంలో దిగువజాతులయెడ సానుభూతిగల నాయకులందరికీ ఆహ్వానాలు పంపించారు. దూరపుటూళ్ళనుంచీ, సమీప గ్రామాలనుంచీ జనులు తిరునాళ్ళ ప్రజగా వస్తున్నారు. వచ్చినవారి కందరికీ వసతు లేర్పరచబడ్డవి. ఇంతటి వుత్సవం మంగళాపుర మెన్నడూ చూడ లేదు.

ఊరంతా వైభవంగా అలంకరించారు. మాల మాదిగ పల్లెలు సంగదాసేర్పరచిన నమోనా ప్రకారం వీధులుతీర్చి కట్టి వుండడంచేత మేడలు, భవంతులూ లేకపోయినా, గాలికొంపలు గాకుండా చిన్నవయినా గట్టి యిండ్లూ, చుట్టూ ఆవరణమూ, నీడచెట్లూ, చూడడానికి ముచ్చటగా వున్నవి. వీధులన్నీ మొరక పల్లాలు చదునుజేసి పూడ్చి నీళ్ళు జల్లారు గోడలకు వెల్లవేసి యెఱ్ఱమన్ను పట్టెలు పెట్టారు. కళాశాల ఆవరణమంతా వూరి తోపులలోవున్న తాటాకంతా గొట్టి ఫర్లాంగుమేర పందిళ్ళు వేయబడ్డవి. ఊరంతా పచ్చతోరణాలెంతో ముచ్చటగా గట్టారు. దేవుని పెండ్లి కంటరూ పెద్దలే నని వూరివారందరూ స్వంత కార్యంగా భావించుకొని అతిథులకు మిక్కిలి ఆదరణా, ఉపచారాలు చేస్తున్నారు.

భోజనపు యేర్పాట్లు అద్భుతంగా వున్నవి. వచ్చినవారికి వచ్చినట్టుగా విధీవిరామం లేకుండా వడ్డనలు జరుగుతున్నవి. నవకాయ పిండివంటలూ, నాలుగు కూరలూ అంతస్థుల భేదం లేకుండా అందరికీ వడ్డిస్తున్నారు. తక్రాంతమందు చక్రధర స్మరణలకు తెంపులేదు.

ఊరు వుఱ్ఱులూగుతున్నా తపోవనం నిశ్శబ్దంగా వున్నది. తరు లతా గుల్మములూ. వానిమధ్య చిన్న పర్ణకుటీరములూ దప్ప మానవనిర్మితము లయిన భవనము లందేమీ లేవు. భోజనాలయి పొద్దు తిరిగినవెంటనే తపోవనములో ప్రతిచెట్టు నీడనూ పురాణ శ్రవణము జరుగుతున్నది. కొందరు తత్వాలు బాడుతున్నారు. కొందరు పర్ణశాలలో యోగసమాధి నిమగ్నులయి యున్నారు. మరికొందరు భక్తిపారవశ్యముతో నామసంకీర్తనం జేస్తున్నారు. ఇదిఅంతా పూర్వము నైమిశారణ్యములో జరిగినట్టు వర్ణింపబడే సత్రయాగమునకు సరిపోలుతున్నదని చాలామంది అభిప్రాయ పడారు.

నాలుగవజాము ప్రవేశించింది. కళాశాలలో మహాసభ జరుగుతుందని తప్పెట వేశారు. జనం పందిరినిండా కూర్చుంటు న్నది. సభాపతి యెవరయిందీ ప్రకటించలేదు. ఇదివరకు యెవ రినీ అందునిమిత్తమయి ఆహ్వానించలేదు. కళాశాల ప్రారంభ ముహూర్తము సమీపిస్తున్నదనంగా, పందిరి మధ్యన యేర్పరచి వున్న వేదికమీదికి రామానాయుడు వచ్చి ఈ రోజు జరగబోయే సభకు త్రిగుణాతీతుడునూ, స్థితప్రజ్ఞుడునూ, వేదాంతవేదియూ నయిన రామదాసమహర్షి అధ్యక్షుడుగ నుండవలెననే తీర్మాన ముపపాదించాడు. నారాయణరావు అమోదించాడు. సభలో హర్షధ్వానలు చెలరేగినవి. పక్కనకూర్చున్న నరసింహారావు రామదాసును లెమ్మంటున్నాడు. రామదాసు నేనా, నేనా నావల్ల కాదంటూ లేవకుండా కూర్చున్నాడు. వెంకటయ్య సమీపించి రెక్కబట్టి లేవదీస్తే కొంచెంసేపు పెనిగి విధిలేక వేదిక మీదికి వచ్చి కూర్చున్నాడు. కార్యక్రమం ప్రారంభమయింది. దైవ ప్రార్థన అయిన తర్వాత రామదాసు నిలువబడి ప్రారంభోప న్యాసం మొదలుబెట్టి కర్మయోగమును గూర్చి విపులంగా వుపన్య సించాడు. దాని సారాంశ మిది:

జ్ఞాన కర్మ భక్తి యోగములు ఆత్మోపలబ్ధికి సాధనములు. సత్యాసత్యజ్ఞానము గలిగినతరువాత యోగి నిష్కామకర్ముడై అనన్యభక్తిని పొందగలడు. భక్తియోగముగూడా అనన్యభక్తికి సాధనమే. ప్రేమకు మించినది లేదు.

సన్యాసమనగా కర్మఫలాపేక్షను విడవడడంగాని కర్మలను విడవడము గాదు. జీవించి వున్నంతకాలం యెవరూ కర్మలను విడవలేరు. శరీరపోషణార్థై ప్రతివాడూ పాటుపడవలసినది. యేదో విధముగా సంఘసేవ చేయనిదీ యెవడూ దానిచేత పోషింప బడ డానికి అర్హుడు గాడు. సంఘముతో సంబంధము విడిచిన అవ ధూతకుమాత్ర మీ నియమము వర్తించకపోవచ్చు. కాని ఆత్మో పలబ్ధికి కర్మయోగము ఉత్తమమార్గము. ఉత్తములయిన యిద్దరు

కర్మయోగులనుగూర్చి మీకు విన్నవించగోరుతున్నాను. పేర్లు జెప్పినందుకు వారు నన్ను మన్నింతురు గాక! శ్రీ రామానాయుడుగారియొక్కయు, వెంకటయ్యగారియొక్కయు ఆత్మసమర్పణము అద్వితీయము. "ఉదారచరితానాంతు వసుధైవ కుటుంబక" మ్మని శ్రీమద్రామాయణములో చెప్పారుగాని ఈ కాలంలో దృష్టాంతము వీరియందుమాత్రమే కనబడుతున్నది. వీరి మహాత్యాగమువలన ఆంధ్ర దేశములోని దిగువజాతులు వున్నతస్థితికి రాగలవని నమ్ముతున్నాను. నాకున్నోపన్యాసముతో మీ రీరోజు చేయదలచుకొన్న మహాత్కార్యమునకు అడ్డము రావడమున కిష్టములేక ఇంతటితో విరమిస్తున్నాను. తరువాత నారాయణరావు తీర్మాన ముపపాదించవలసిందని వెంకటయ్యను పిలిచాడు. రామానాయుడు అరుగుపైకి వచ్చి ఈ క్రింది తీర్మానముపపాదించాడు.

విజయకళాశాల అనే గురుకులమునకు మానిచంద్రుడగు రామదాసుగారు కులపతిగానూ, నారాయణరావుగారు ప్రధానిగాను, వెంకటయ్యగారు ధర్మకర్తగాను ఉండవలయు నని సభవారభిప్రాయపడుచున్నారు.

నరసింహారావుగారు తీర్మాన మామోదించారు. సభికులందరూ హర్షధ్వానులతో అంగీకరించారు. రామానాయుడుగారు మరల వేదికమీదికి వచ్చి తన యొక్కయు, వెంకటయ్య యొక్కయు జీవనార్థము వుంచుకున్న ౧౦ యకరములు గాక శేషించిన తమ తాలూకు స్థిరచరరూపకమయిన యావదాస్తిని విజయకళాశాలకు ధర్మముగా వ్రాసి యిచ్చిన దానపత్రమునూ, మోహనరావు పంపిన వుయిలు నామాను సభికులకు చదివి వినిపించి వెంకటయ్యకు వొప్పగించాడు. వెంకటయ్య కుమార్తెలకు పసుపుకుంకుమక్రింద యియ్యబడిన ౨౫ యకరముల మాగాణి భూమినిన్నీ వారు, నల్లమోతువారిఆస్తి పవిత్రమయిన హోమద్రవ్య మనియు, అది అంతయు వారు తలపెట్టినలోకసేవఅనే

మహాయజ్ఞ నిర్వహణార్థమే వుపయోగపడవలయు ననియు, తమ అనంతరము ఆ ఆస్తి అంతయు విజయకళాశాలకు చెందవలయు ననియు, ధర్మపత్రము వ్రాసి వెంకటయ్య చేతి కిచ్చారు.

పంతులు తరువాత వేదికమీదికి వచ్చాడు. ఎందుకు వచ్చేదీ యెవరికీ తెలియదు. గద్గదస్వరముతో ఈ యజ్ఞ వేదికపై అడుగుపెట్టుటకు తన కర్హత లేదనియు, సంగదాసు మరణించే టప్పుడు మనమే గెలుస్తా మని సంధిసమయంలో అన్నాడనియు, అది తిరుపుమరుపుమాటలని అంతా అనుకున్నా మనియు, అది సత్యవాక్కనియు, అది సంపూర్ణముగా యిప్పటికి నెరవేరిన దనియు, తన అనంతరము తన ఆస్తి అంతయు సంఘకళాశాలకే చేరవలసిం దనియు, తాను జీవించియున్నంతకాలము ఉచితముగా కళాశాలలో గుమాస్తాగా పనిచేస్తా ననియు, చెప్పగా అంతా సంతసించి ఈ చివరజరిగినది సంగవిజయమునకు కిరీట మన్నారు. సభ ముగిసింది. మరునాడు యెక్కడివా రక్కడికి పోయినారు.

—...—

సాయముచేసి జీవనము గడుపుకొంటూ, శేషించిన కాలమంతా కార్మిక పంచమోద్యమాలకు వినియోగించుతున్నారు. వెంకటయ్య మట్టమాత్రం మానివేశాడుగాని ముల్లుకర్ర చేతబట్టుకొని గొరుటంగలు వేస్తూ వ్యవసాయమునకై పొలంబోవడం వృద్ధాప్యం వచ్చేవరకూ మానలేదు.

రామానాయుడు మునుపు చేనికి కోతకు బోయినప్పుడు స్వయముగా నేర్చుకొనవలెనని వువ్విళ్ళూరిన విషయములన్నీ స్వానుభవానికి వచ్చినవి. మునుపటివంటి వొంటి మెత్తదనం లేకపోయినా హృదయం యెక్కువ కోమలమై అలంకారము దెచ్చినది.

రామదాసు కళాశాలలో మగ్గము ఒక మూల బెట్టుకొని ప్రతిరోజూ కొంతసేపు నేతనేసి వచ్చిన కూలితో తన జీవనం గడుపుకుంటున్నాడు. యెడతెగక వినబడుతుండే ఆయన మగ్గపు నలక దెబ్బలయొక్క లయ నిరంతరము ఆయన పొందుతుండే నాదానందముతో సమ్మిళిత మవుతున్నది. ఆయన జీవితకాలముయొక్క సాయంసమయమున కాయగుడ్డలు ధరించి, అస్తమయ సూర్యునివలె బ్రహ్మతేజముతో వెలుగొందుతుండేవాడు. ఆయన ప్రతిరోజూ రేపూ మాపూ పూరగొండెక్కి తిరుగుతూ, కొన్ని రాత్రులు కొండమీదనే పండుకొంటూ వుండేవాడు. తరువాత ఆయన కళాశాలకూ, ఊరికీ రావడం మానివేశాడు. యేమయినాడో యెవరికీ తెలియదు. సిద్ధుడయి కొండగుహలలో యెవరికీ కనబడకుండా నిరంతర ధ్యాన పరుడయివుండి, పరబ్రహ్మముతో ఐక్యమయినాడని పెద్దలు చెప్పుకుంటారు.

రామదాస యతీంద్రుడు విజయ కళాశాలలో కులపతిగా నున్నప్పుడు కొందరు సనాతనాగ్రేసరులు హరిజనులు కాలక్రమమున ద్విజాతులుగ జన్మమెత్తక షోడశ సంస్కారములచే పవిత్రీకరింపబడని శరీరములతో ముక్తి నొంద సాధ్యమగునా యని ప్రశ్నింపగా, వారు వేదములు ముఖ్య ప్రమాణముగా నెంచుకొనిన శ్రీ పిళ్ళ లోకాచార్యులు, శ్రీ మణవాళ మహామునులు యున్నగు మహనీయుల శ్రీవచన రత్నములనుండి క్రోడీకరింపబడి విశేషధర్మరూపకమైన ప్రత్యుత్తరము నిందు పొందుపరచి యీ కథను ముగించుచున్నాను.

భక్తుల జన్మనిరూపణము భాగవతాపచారము. భక్తుడే కులమువాడని

విచారించు బ్రాహ్మణుడు అర్చావతారముల (విగ్రహముల) లోహాదికముగ స్మరించువానివలె వెంటనే పతితుడై ఘంటాలక్ష్యమును, నరకమును బొందును. జ్ఞానానుష్ఠానములు లేకున్నను భాగవత సంబంధమే మోక్షము నియ్యగలదు. జ్ఞానానుష్ఠానము లీయపకారమునుండి రక్షింపజాలవు. భగవత్సంబంధమునకు జన్మవృత్తాది నియమములులేవు. భగవత్సంబంధమునకు యోగ్యత గలుగుటకు జన్మాభిమానము పోవలయును. వేదాధ్యయనముద్వారా భగవల్లాభమునకు హేతువగుటనుబట్టి బ్రాహ్మణ్యము ఆదరణీయమగును. కాని ఈ బ్రాహ్మణ్యము నేను ఎక్కువవాడనను అహంకారమునకు హేతువయినచో అది త్యాజ్యము. జన్మవృత్తముల యొక్క ఉత్కృష్టాపకర్షములు భగవల్లాభమునకు హేతువులుగావు. కాని జాత్యాధిక్యత అహంకారమునకు హేతువగుటచే సవర్ణులు భగవంతునకు దూరమగు చున్నారు. కడజాతి వారికి మే మెక్కువను అభిమానముండదు గనుక వారికి ముక్తి సమీపము. సవర్ణులకు అహంకారము ఆజన్మసిద్ధము. కడజాతికి అనహంకారం జన్మసిద్ధము.

పైజాతులు అట్టి అభిమానమును పోగొట్టుకొనగూడదా యందురేని సాధనచేసి పోగొట్టుకొన్నను వారి సామ్యబుద్ధి కృత్రిమమయి ఆజన్మ సిద్ధమయిన విలక్షణాధికారము గలవారి సమబుద్ధితో పోల్చదగినది కాదు. వారెల్లప్పుడును అనహంకారు లగుటచే నిత్యులని పిలువబడుచున్నారు. నిత్యులతోడిసంబంధము సవర్ణులకు పతనహేతువు కాకపోవుటయేగాక స్పర్శవేధియగు బంగారమువలె జన్మాభిమానమను కిట్టత్వమును బోగొట్టి నిజమైన సామ్యబుద్ధిని పొడమజేయును. వారితోడి సాహచర్యము పురుషకారముక్కర లేకనే సమభావమును ప్రసాదింపగలదు. అందుచేతనే ఋషులు ధర్మవ్యాధునివాకిట కాచియుండి సర్వసందేహములను నివర్తింపు కొనినారు. కనుక సవర్ణులగు నో సనాతన సోదరులారా! అన్నివిధములకు నాశన హేతువగు అభిజనాభిమానమును విడచి, అట్టి దురభిమాన మెన్నడును లేకుండుటచే విలక్షణులై నట్టియు, నిత్యులై నట్టియు హరిజన సోదరులతో అనువర్తనము సర్వసోదరభావము నలవరచుకొనుటకు ఎంతయు తోడ్పనని మనవి చేయుచున్నాను. మనము కలిసిమెలిసి యుండినచో ఉభయులకును లాభదాయకమేనని భావించుచున్నాను. (సంపూర్ణము)

# MaNaSu Foundation

## check list

768

| | |
|---|---|
| Book Number | CP-03-B-264 |
| Condition | |
| Front Cover | Yes |
| Back Cover | Yes |
| Blank Pages | CB, 1000[illegible] li., 6, 834, 836, 838, 8[illegible] |
| Missing Pages | |
| Others | |
| Remarks | |